**Andhra University Series: No. 39**

# INDIAN POLITY. A. D. 1600 To 1948

# భారత రాజ్యాంగ చరిత్ర

(సం 1600 – 1948)

## ఆది ఖండము

గ్రంథకర్త

శ్రీమాన్ ఆత్తకూరి గోవిందాచార్యులు

(భారతదేశ ఆర్థికచరిత్ర – గాంధీ జీవితచరిత్ర – ఉత్తర రామాయణము –
ఇత్యాది గ్రంథకర్త,
మదరాసు శాసనసభ్యుడు, ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనేటు సభ్యుడు.)



వాల్తేరు
ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే ప్రచురితము



[ మూల్యము :-
3 ఖండములకు రూ 35/-
ప్రత్యేక ఖండమునకు రూ 15/-

948]

**Andhra University Series: No. 39**

Indian

# INDIAN POLITY. A. D. 1600 To 1948

# భారత రాజ్యాంగ చరిత్ర

(సం 1600 – 1948)

## ఆదిఖండము

గ్రంథకర్త


## శ్రీమాన్ ఆత్తకూరి గోవిందాచార్యులు

(భారతదేశ ఆర్థిక చరిత్ర – గాంధీ జీవితచరిత్ర – ఉత్తర రామాయణము –
ఇత్యాది గ్రంథకర్త,
మదరాసు శాసనసభ్యుడు, ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనేటు సభ్యుడు.)





వా త్తే గు

ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచేఁ బ్రచురితము




[ మూల్యము :-

3 ఖండములకు రూ 35/-

ప్రత్యేక ఖండమునకు రూ 15/-

# అంకితము

## ఏ కాంగ్రెసు మహాజనసభ

పరరాజ్య రాజ్యాంగ విధానమును

స్వరాజ్య రాజ్యాంగ విధానముగ మార్చినదో,

## ఆ కాంగ్రెసు మహాజనసభకు

ఏ నిరంతర దేశసేవా పరాయణుడు

ఏ స్వాతంత్ర్య సమరయోధుడు

ఏ వాగ్విభవ సంపన్నుడు

ఏ విజ్ఞానమయుడు

ఏ ప్రతిభాశాలి

జయపురమునం దధ్యక్షుడో (1948)

ఆ

## పూజ్య

శ్రీ

## భోగరాజు పట్టాభి సీతారామయ్య

గారికి

దాసోహపురస్సరముగా నీ

భారత రాజ్యాంగ చరిత్ర

అంకితము

భారత రాజ్యాంగ చరిత్ర

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్య కృతము

# తిలకరచన

## కట్టమంచి రామలింగారెడ్డి సుకృతము

మన రాజ్యముయొక్క పరిపాలనా విధాన పరిణామచరిత్రలు, నాఁడెఱింగినంత వఱకు, దేశభాషలందు, సమగ్రములును, సత్యవిస్ఫురితంబులును నైనవి యెవ్వియును లేవు. ఆంగ్లమునఁ గొన్నికలవు. అవి మన జనములలో బహుసంఖ్యాకములకు నగోచరములు, నగమ్యములు. ఈ పరిణామము లేయే కాలముల నేయే హేతువులచే నేయే దశలు చెంది యెట్లు నేఁటి స్థితికివచ్చెనో తెలియని వారు రాజకీయరంగమునఁ బ్రవేశింప నసమర్థులు. దేశాభివృద్ధికి హేతుభూత మైన యిట్టిగొప్పవిద్య మనవారిలోఁ బ్రసరింప ననువగునట్లు చక్కని శైలిలో, ఈపరిణామ వృత్తాంతమును సర్వాంగ బంధురముగ రచించి గోవిందాచార్యులు మహోపకార మొనర్చి కృతకృత్యులైరి.

వీరు మన వాఙ్మయమునఁ జిరకాలముగ గొప్పస్థానమును వహించిన యగ్రగణ్యులలో నొక్కరు. వీరినిగుఱించి విశేషముగఁ బ్రశంసించుట యధిక ప్రసంగము సేయుట. వీరి సాహిత్యము నానాముఖములఁ బ్రవహించు పావన గంగానది వంటిది.

వీరు, అద్భుతమైన శైలిని అర్థశాస్త్రమును రచించినది చాల యేండ్ల క్రిందట. అప్పటికి వయస్సునఁ జిన్నవారు కాఁబోలు: శక్తిచేఁగొప్పవారు. అర్థశాస్త్రములోని విషయము, తెలుపుటకుఁ గాఠిన్యసంజనితము. అట్టిదానిని స్వీకరించి, తెలుఁగువారికి మన దేశస్థులట్లు మార్చి సమర్పించి తమ యింద్రజాలికత్వమును బ్రదర్శించిరి. ఆ పరివర్తన మద్భుతావహము.

వీరి గ్రంథములన్నిట మిన్నయైనది గోవిందరామాయణము. ఇది పద్యకావ్యము. దీనిలోని యాశ్వాసాంత పద్యములు నానావిధ నూతన భావద్యోతక

ములై, మన వాఙ్మయమున వినూతనజ్యోతిని గల్పించినవి. అపద్యములు, భావమునందేకాక, రచనయందును ననన్యసామాన్యములు.

ఇప్పుడు మరల గద్యరచనకుఁ బూనుకొనిరి. ఆపూనికఫలమే, మూఁడు సంపుటముల పరిమాణముగల యీభారత రాజ్యాంగచరిత్ర. ఈమహాగ్రంథము వీరి కీర్తిని మఱింతవ్యాప్తికిఁ దెచ్చును. ఇందొకవిశేషము. శ్రీ మహాభారతమునకును, ఈ భారతమునకును ధ్వని ప్రమాణముచే, గ్రంథకర్త సామ్యము కల్పించినట్లు తోఁచెడిని. ఎట్లన — ఇందలి ప్రకరణములకుఁ బేరు పర్వములని. అది "సారం పర్వణి పర్వణి" దీనియందును "ఆదరణీయ సారము" అఖండము. ఇదియు "అష్టాదశపర్వనిర్వహణ సంభృతమై పెంపొందు" యున్నది. మఱి యిదియు 'సంహిత' రాజ్యతంత్ర ప్రపంచమునకుఁ జెందిన సమస్త విషయములును చేర్పఁబడి యుండుటచేత. శ్రీ మహాభారతమును గుఱించిన ప్రశంసలు కొన్ని యీ రాజ్యాంగ భారతమునకును జెల్లునేమో యోజింపుఁడు.

"ఏ యది హృద్యమపూర్వం। బేయది, యెద్దానివినిన నెఱుక సమగ్రం।
బై యుండు"

"నిత్యాభ్యుదయ ప్రదంబు"

"అఖిలార్థ సాధనంబు"

ఇత్యాది విశేషణములు దీనియందును గొంతవఱకు సన్వయించునేమో.

ఇట్టి చరిత్రగ్రంథమును వ్రాయవలయునన్న సామాన్యునకు నలవికాదు. బ్రిటిషువారు, ఈ నేలమీఁదను మన తలమీఁదను, కాలిడినది మొదలు నేఁటివఱకు నడచిన యావద్వృత్తాంతములు తెలిసినవాఁడుగా నుండుట — ఈ దేశముతో కంపెనీ వర్తకము నలుపఁ బ్రారంభించినది మొదలు, ఆంగ్లేయులు, అమలులోనికి దెచ్చినశాసనము లన్నిఁటిని బఠించియుండుట — ఏయే యార్థిక రాజకీయాది పరిస్థితులనుబట్టి యాశాసనములు నిర్మాణమునకు వచ్చినవో, అవి యెట్లు, ఏ కారణములచే మార్పులను జెందినవో గ్రహించుట — మన దేశస్థులు, స్వరాజ్య సిద్ధికై చేసిన ప్రయత్నములను వివరించుట — మన నాయకుల యుద్దేశములు,

పద్ధతులు, ఉపాయములు, కాలానుసార మెట్టెట్టి వికారములను జెందినవో సహేతుకముగ నిరూపించుట — ఇత్యాది సాధన కలాపము వశపర్చుకొనిన వానికిఁ దక్క, వేఱొకనికి నిట్టిగ్రంథము సాధింపఁగాదు.

హృదయము నుఱ్ఱూతలూఁచి మనసును గరగింపఁజాలు శక్తిగల శైలిలో గ్రంథమును వ్రాయవలెనన్న నట్టి చప్పిడివిద్య చాలదు. ఆవిద్య ఉత్సాహపూరితమైన జీవితానుభూతితో సంపదించినప్పుడుగాని శైలికి నట్టి శక్తిమత్త రాదు. ఎవని జీవితము, కార్యతత్పరత్వమున నానావిధ సుఖదుఃఖములకులోనై, తీరని యావేదనచే బర్వదినసముద్రమువలెఁ దరంగితమగునో, వాని విద్య ప్రాణవంతమును, వాని శైలి తీక్ష్ణప్రసరమును అగును. గోవిందాచార్యులలోని యసాధారణ ప్రజ్ఞకు హేతువు, వీరివిద్యయు జీవితమును సమ్మేళనముచెందియుండుట. రాజకీయాందోళనమున బాల్గొని ధైర్యసాహసములను బ్రకటించి, యనేక కష్టనష్టములకుఁ బాల్పడి లోఁతుగామునిఁగి యుద్దండముగా లేచి గట్టెక్కినధీరుఁడు. శాసనసభాస్తాగుఁడై రాజ్యతంత్ర నిర్మాణములను జేయుటలోఁ బాల్గొన్న నీతి విశారదుఁడు. విద్య, అనుభవము, ఆవేశము — ఈ మూఁడును గూడియుండుటచేత నిట్టి గ్రంథమును అనాయాసముగా రచింపఁగలైను. సర్వవిధముల ధన్యుఁడు.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు దీనిని బ్రకటించుటకుఁ గారణములు రెండు:-

1. ఈగ్రంథమునెడఁ దనకుఁగల గౌరవభావము.

2. ఆంధ్రావళిలో మోదముతోసహా రాజ్యతంత్ర పరిణామ జ్ఞానమును తద్ద్వారా, నీతినైపుణిని విస్తరింపఁజేయుట.

రచనచేఁ గర్తధన్యుఁడు: ధర్మ సంకల్పముచేఁ బరిషత్తు ధన్యము: చదివి, జ్ఞానమును దేశాభ్యుదయోత్సాహమును రాజ్యతంత్రకౌశలమును బడయుదురయేని, ఆంధ్రులు ధన్యులగుదురు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు
వాల్టేరు
27 — 11 — 1948

కట్టమంచి రామలింగారెడ్డి

# పీఠిక

## శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు

(జయపుర కాంగ్రెసు — అధ్యక్షులు)

జాతిని పోషించునది చరిత్ర. భూతవర్తమాన భవిష్యత్తు కాలప్రవాహము లోని దశలుకాని - భిన్న - భిన్న యుగములుకావు. నాశికా త్రయంబకం వద్ద పుట్టిన జలధారయే క్రమక్రమముగ శెలపళ్లతోను, ఉపనదులతోను గలిసి రాజమహేంద్రవరం వద్దనున్న అఖండగోదావరి యగుచున్నది. వెనుకటి సంవత్సరముల వర్షములు - ఈసంవత్సరపువృష్టి - రానున్న సంవత్సరముల వాన జలములు గలిసియే గోదావరి, కృష్ణా, కావేరి, వంశధారా, నాగావళి, ఋష్యకుల్యా, మహానది పెన్న, పాలారు నదులగుచున్నవి. అటులనే భూత కాలమందు ఆర్యులరాక పూర్వము ఆదివాసులుగ నున్న జాతులతో ఆరంభమై నేటివరకు ఈ దేశమును - దర్శించి దండయాత్రలుజేసి, జయాపజయముల నొందిన తురేనియనులు, ఆర్యులు, యవనులు, పారశీకులు, తురుష్కులు, మొగలులు, ఇటాలీయనులు, స్పానియార్డ్లు, ఉలాందులు, పరాసులు, ఆంగ్లులు ఒకరి తరువాతనొకరువచ్చి-భారతసభ్యత యను మహాప్రవాహమును పోషించి, పెంపొందించుచు రాగా, మన చరిత్ర వ్యాపకమై భాగవర్ధితమై - ఆదర్శతుల్యమై కడపటికి వేయిసంవత్సరముల బానిసత్వానంతరము, మనకు గలిగిన స్వేచ్ఛా స్వాతంత్ర్యములను ఘోషించు చున్నది. అట్టి చరిత్రను సమగ్రముగ నొక్క గ్రంథమునందు ఇముడ్చుట దుస్సాధ్యము. యుగములు, శకములు, అంతరములు మున్నగు విభజనల ననుసరించి మాత్రమే వ్రాయగలము, చదువగలము. జీర్ణించుకొనగలము. వీనిలో మనకుప్రస్తుతమైనది. ఆంగ్లరాజ్యము యొక్క విజృంభణ-పతనము. ఈపర్వమును కథరూపకముగ, ముచ్చటగ, క్లుప్తముగ, మృదుమధుర శైలిని వ్రాయగల శ్రీ గోవిందాచార్యుల వారికి మనకృతజ్ఞత తెలుపుటకే పీఠిక అంటూ ఈ రెండుముక్కలు వ్రాయుచున్నాను.

నేటి రాచకీయములే రేపటిచరిత్ర. నేటిచరిత్ర - నిన్న మొన్నటి రాచకీయములు. కన్నుమూసి కన్ను తెరచిన యవకాశములో ఒకనాటి రాత్రి 12

గంటలకు హఠాత్తుగ బ్రిటిషుయుగము మన దేశములో అంత్యమగుట- అంత్యమగు ననుట - కని - విని ఎరుగని విషయము. ఇదియొక కలయో విభ్రమమో, మాయయో అనుపించును. కాని కళ్ళార బ్రిటిషువారి రాకపోకలు చూచాము - చేతులార పోరాడాము - మనస్సార ఈరాజ్యముయొక్క అంతును గోరాము. తన ధన మనములతో పొంద నిశ్చయించుకున్న స్వరాజ్యము ఏలరాదు? ఆనాడు బిపిన చంద్రపాల్ - ఈనాడు గాంధి చెప్పిన విషయములు ఎంతస్వల్పములు! ఎంతసులభములు! త్రికాలములయందు చేయు సంధ్యా వందనమునందు మనస్సునందు సంకల్పమును ధృడపఱచుకోండి - ఈ దేశము - ఈభూమ్యాకాశములు - ఈ 12 పవిత్రనదులు - ఈ ఏడు కులపర్వతములు - ఈ సరస్సులు - సాగరములు - ఈతటాకములు - పుష్కరములు - భూగర్భములోని ఈ ఖనిజములు - భూతలమునందలి ఈ ఉద్భిజ్జములు - మనవి - మనవి! పూర్వీకులు కష్టించి - సంపాదించినవని తెలుసుకొనండి. అప్పుడు ఈ ఆస్తియంతయు మీకు తప్పక సంక్రమించును అని వీరుభయులు బోధించారే. ఆ ప్రబోధావబోధములే మనలను మేల్కొలిపినవి. చైతన్యముతో నింపినవి. స్వతంత్రులుగ జేసినవి. ఇట్టి పరివర్తనపు పుట్టు పూర్వోత్తరములు నూతన ఇతిహాసమై ఆచంద్రార్కముగ మనకు ఆనంద దాయకమగును. ఆనాటి భారత భాగవత రామాయణములు మనకెట్టివో - అట్టివే ఆధునిక పరివర్తనచరిత్రలు. ఇట్టి చరిత్రలనువ్రాసి జనసామాన్యమున కందజేయు గ్రంథకర్తచే గావింపబడు సేవ అపారము - అమేయము - అమోఘము అని చెప్పకతప్పదు.

ప్రజాప్రబోధము - దాస్యమునకు విరుగుడు - కేవలము పారతంత్ర్యములోనున్న దేశములకే ఈసూత్రమువర్తించునని అనుకొనరాదు. స్వతంత్రము అనుభవించుచున్న ఇంగ్లాండు - అమెరికా మున్నగు రాజ్యములలోగూడ - ప్రజలుమేల్కొనువఱకే - వారిహక్కులు సురక్షితములుగనుండును. ఎప్పుడు ప్రమాదావస్థ నొందుదురో - అప్పుడే ఆహక్కులను గోల్పోవుదురు. అందుచేతనే అమెరికాదేశములోగూడ "సివిల్ లిబర్టీస్ యూనియన్" అను సంఘములు స్థాపింపబడ్డవి. ఇంక బానిసత్వములోనున్న మన దేశమునకు విమోచనము గలుగవలెనన్న - ప్రజాప్రబోధమే పరమసాధనమనుటలో అతిశయోక్తి ఏమిఉండగలదు? అయితే, ఈప్రబోధము అను మహాసముద్రమును తరించుటకు

ప్రారంభమెక్కడ? సాధనమెట్టిది? అను ప్రశ్నలను మనము గమనించవలసి యున్నది. గాంధీమహాత్ముని రంగమును ప్రవేశించునంతకు - ఏఆంగ్ల విద్యాధికులు ఆంగ్లసామ్రాజ్యమునకు పెట్టనికోటగానుండిరో - ఆకోటనుగూడ వారి చేతనే బద్దలుకొట్టించ వలసియుండుననియు, బద్దలుకొట్టించగలమనియు అపోహలో నుంటిమి. అప్పుడు స్వరాజ్యమన్నది - కేవలము ఆంగ్లవిద్యాధికులకు వినియోగించు సంస్థగా వదలక, సర్వజనావసరమైనట్టిది—సర్వజనోపయోగకరమగున దగుననియు - ప్రజలకు బోధించి వారి మనస్సులలో నచ్చచెప్పవలసివచ్చింది. ఈమహాత్కార్యము గాంధీగారివల్ల జరిగింది. ప్రబోధము సక్రమముగ జరిగింది. 1917 వ సం॥ లో మాంటేగ్యూ గారు కాంగ్రెసుజిల్లా కేగి - "కాంగ్రెసు అంటే ఏమిటి" అని పల్లెటూరివారిని అడుగగా - "హాంకాంగ్రీ ఇక్కడ నేడున్నది - అక్కడ గుడుపులమున్నది. ఆగ్యనమరాజును పాలకులున్నవి అని చెప్పినవారే - 1933 వ సం॥ లో లోథియన్ ప్రభువు తిరిగి అక్కడకే వెళ్లి - అప్పటి జనులను తిరిగి ఆప్రశ్నయే అడుగగా "హోం కాంగ్రెసు అంటే మాకు తెలుసు - మేముసభ్యులము 0—4—0 చందాఇచ్చాము - స్వరాజ్యం కావలెనని సంతకములుచేసినాము. గాంధి మానాయకుడు — ఖద్దరు మాజెండా" అనిచెప్పగా - లోథియను ప్రభువుకు ఆశ్చర్యముకలిగి - "ఇంక ఈదేశములో మనము రాజ్యము చేయజాలము — ప్రజలకు మేల్కొలుపు కలిగింది" అని అనుకున్నారు — ప్రాంతాగు.

క్యాబినెట్ మంత్రివర్గపు పార్టీలో నొకరితో నేను 1946 సం మానసములో ముచ్చటింపగా - వారున్ను ఇటులనే చెప్పి "ఇంక ఇండియాదేశములో రాజ్యము చేయవలెనంటే సైనికశాసనము వలనను సేనాసహాయము తోడను మేము రాజ్యము చేయవలసిందే; కాని సివిల్ శాసనాలవలన రాజ్యము చేయజాలము — మా జనాభాకూడ 4½ కోట్లు మాత్రమే. అందులో 2 కోట్లు కూడా సేనలో పనిచేయ జాలరు. 40 కోట్లుగల భారతీయులపై రాజ్యముజరుపుటకు మాకు తగు బలము లేనూలేదు. అథవా ఉన్నా అక్కడి ప్రజలుసహించరు. ఇక్కడి ప్రజలు అంతకంటే సహింపరు. అందువలన ఈదేశము మేము వదిలి వేయదలచినాము. అయితే మాఅంతటమేము వదిలి వెళ్ళితే స్నేహభావము నిలుస్తుంది. తద్వారా మావర్తకవాణిజ్యాలు ఇంకా కొంతకాలము మీసుహృద్భావముతో జరుపుకోగలము అన్న ఆశకలుగుతుంది." ఇంగ్లీషువారు ఈదేశమువదిలి వెళ్ళడానికి

కారణము మనప్రజలకు గల్గిన ప్రబోధమే. ఇట్టి ప్రబోధము గాంధిగారి వలననే కలుగ చేయబడ్డది. కాబట్టి భారతభూమియొక్క రాజ్యాంగచరిత్ర అంతా గాంధీగారి జీవితచరిత్ర, ఆదర్శచరిత్ర, సిద్ధాంతముల చరిత్ర. ఇవన్నియు ఈగ్రంథమునందు సందర్భానుసారముగ వివరింపబడ్డవి. ఈసంగతులే ఇంచుక వివరముగ యోచింతము.

ఒకప్పుడు స్వరాజ్యం సాధించడం ఏలా అన్నంతవరకు కూడా మన పెద్దల మనస్సు వెళ్ళేదికాదు. 1917 వ సం॥లో స్వరాజ్యం అడగడం నేరంకాదని జడ్జీ - సరోజ చరణమిత్తరుగారు కలకత్తా హైకోర్టులో తీర్పు ఇచ్చేవరకు ఆమాట పలకడమే అపాయకరమని అనుకునేవాళ్లము. మొట్టమొదటిలో వలస ప్రదేశములోని స్వపరిపాలన అనడమే కష్టముగా ఉండేది. అంతకు పూర్వము 1885 మొదలు ఉద్యోగాలు కోరడము - సమానజీతాలు అడగడం - ఇండియాలో సివిలియను పరీక్షలు పెట్టమని అడగడం - రోడ్లు, కాలువలు, వంతెనలు, ఆస్పత్రులు, కళాశాలలు కావాలని దేవుళ్ళాడడము.

ఈలా 1905 వఱకే కాలము గడచింది. అప్పుడు బంగాళా రాజధానిని విభజనచేసి ముస్లింలు ప్రత్యేకసంఘముగ ఏర్పాటుచేసిన తరువాత మనకే వలసరాజ్యము కావలెనని 1908లోను - ఐర్లాండులోవలె హోంరూలు ఇప్పించమని 1917లోను - స్వరాజ్యం కావాలని 1921 నుంచియు, ఆస్వరాజ్యము సాధ్యమైతే బ్రిటిషు సామ్రాజ్యములో భాగముగా సయినా సరే - అవసరమైతే దాని వెలుపల సయినాసరే అని అర్థము చెప్పియు, పిమ్మట 1929 నుండి సంపూర్ణ స్వరాజ్యము కావాలి అనియు, చివరకు 1942 లో బ్రిటిషువారు మన దేశము విడిచి పోవలెననియు, చెప్పుతూ వుండేవాళ్లము. చివరకు 1947 ఆగష్టు 15 వ తేదీన వారు మనదేశమువదలి వెళ్ళినారు గదా! వెళ్ళికూడా ఏడాది గడచిపోయింది. ఇప్పుడు మనము ఒక్కసారి సింహావలోకనంచేసి, ఏసాధనాలను అవలంబించి మనము ఈస్వరాజ్యం సంపాదింప గలిగాము. వాని స్వభావమెట్టిది అని కొంచెంసేపు ముచ్చటిద్దామని ఈవరుస ఆరు ఉపన్యాసాలు ఏర్పాటు చేసుకున్నాము. వెనుకటి ఆందోళన ఈనాటికి చరిత్ర అయింది.

స్వరాజ్యచరిత్ర చదువుకోదగ్గది. జ్ఞాపకం ఉంచుకోదగ్గది. పూర్వచరిత్రను చదువడంవల్ల ఇప్పటి ఆందోళన లెట్లు జరపాలి. ముందు చరిత్రయొక్క రూపురేఖలు ఏలానిర్ణయించాలి అన్నవిషయములు తేల్తాయి.

ఈరోజుకు మనకు స్వేచ్ఛకలిగింది అంటే - ఇంగ్లీషువారి బానిసత్వము వదిలిందన్నమాట. అయితే 150 సం॥లు అవిచ్ఛిన్నంగా రాజ్యంచేసిన ఇంగ్లీషు వారివిద్య - విజ్ఞానములు - ఆచారవిచారములు, వైఖరిశక్తులు - మనలను ఆశ్రయించిఉన్నవి కాని వదలలేదు. పట్టుమని పదినిమిషాలసేపు ఇంగ్లీషుమాటలు కలపకుండా తెలుగుమాట్లాడలేముగదా! కాబట్టి ఈరాజ్యమును స్వరాజ్యముగా మార్చుకోవడానికీన్నీ ఈస్వేచ్ఛను స్వాతంత్ర్యముగా పరిపక్వము చేయడానికీన్నీ మార్గములు ఏవి - సాధనములెట్టివి? ఇందుకేమైనా మనకు మనము గత 30 సంవత్సరములలో అవలంబించిన సాధన పరంపరలో సూచనలు దొరుకుతాయా అన్న సంగతి ఆలోచింతాము.

గాంధిగారు రాజకీయ రంగంలో ప్రవేశించేవరకు కాంగ్రెసు సౌధమును ఆకాశంలో పై అంతస్థులుకట్టి అడుగుకు పెంచుకుంటూ ఎప్పుడో పునాదులు వేదాము అన్న సిద్ధాంతముమీద నడుస్తూండేది. గాంధిగారు 1915 లో వచ్చి, ఈ దేశంయొక్క వైఖరీ - ఈప్రజల వాలకం చూచి, ఇది హిందూదేశమా - లేక ఇంగ్లాండుయొక్క గొడ్లసావిడి - గుర్రపుశాల - మోటారుగుడేశయా అని ప్రశ్నించారు.

ఎక్కడ చూచినా ఇంగ్లీషు చదువులు - పరీక్షలు - పుస్తకాలు - డిగ్రీలు - ఉద్యోగాలు - జీతాలు - పింఛన్లు బిరుదులూను - ఎక్కడచూచినా ఇంగ్లీషుదుస్తులు - శక్తులు - పద్ధతులు - ఆటలు - పాటలు - పనిముట్లు - చిత్రవులు - ఆదర్శములున్ను - ఎక్కడచూచిన ఇంగ్లీషువారి వస్తువుల అంగళ్లు - కత్తులు - కలాలు - బొట్లు - బంతులు - టోపీలు - బూట్లు - యంత్రాలు - మరలు. ఈవిధంగా దేశంలో ఎవరు జీవనంచేసినా, ఇంగ్లీషువారికి రూపాయికి 15 అణాలు ముట్టచెప్పి - తాము రూపాయికి అణాగాళ్లు అయి సంతోషిస్తున్నట్టు గన్పించింది.

దీనికి అంతకు కారణమేమిటి అని ఆలోచించి - వెనుకముందుల సమన్వయం చేసుకున్నారు. మూలకారణం ఆంగ్లేయులు భారతభూమిపై - కేవలం భౌతిక శారీరిక సంబంధమైన విజయమును పొందుటతో సంతోషింపక, మానసిక, ఆర్థిక ఆధ్యాత్మిక విజయమును సంపాదించి తమ సామ్రాజ్యమును నాలుగు స్తంభాలమీద నిలబెట్టుకొనుచూ, స్థిరస్థాపన కలుగజేశారు. ఇది ఎల్లా జరిగిందో తెలుసుకుంటేనేగాని గాంధిగారు ఆలోచించిన విధానమూ తెలియదు. మనము వేయబోయే ప్రణాలికయొక్క సబబూ తెలియదు.

ఆంగ్లేయరాజ్యస్థాపన సోపానక్రమగతంగా జరిగింది. అక్కడో జిల్లా - ఇక్కడో తాలుకా - అక్కడో జమీా - ఈవిధంగా ఏర్పడ్డ రాజ్యంలోని రాజులందరు తిరుగుబాటుచేసి 1857 లో విప్లవము సాగించగా దానిని అణచివేసిరి. కాని ఆరోజు మొదలు విశ్వవిద్యాలయాలద్వారా తమ విద్యాభావలను - హైకోర్టులద్వారా తమన్యాయ నియమములను, శాసనసభల తమపరిపాలనా పద్ధతులను - ప్రజలకు అలవరిచి - వారికి వానియం దభిరుచి కల్పించి - తమ వ్రాత చదువు సంధ్యలను - శాస్త్రములను - పంచాయితీలను మరపించి - ఆంగ్లవిధాన దుర్గమునకు పెట్టనిగోడలుగ మనవాళ్లను తయారుచేయుచు పితూరిలో గెలిచిన పిమ్మట క్రొత్తకోటలబదులు మద్రాసు - కలకత్తా - బొంబాయి విశ్వవిద్యాలయములను, క్రొత్తసిపాయిలకు బదులు - ఇందుఉత్తీర్ణులగు స్నాతకులను, క్రొత్త ఆయుధసామగ్రి బదులు తమగ్రంధావళిని ప్రజలకు అందచేసిరి - దీనితో మననూతన ఆంగ్లవిద్యాపారంగతులు ఉప్పొంగి - తమ్ముని ఉరిదీయుటకుగాని - భార్యను ఖైదులోపెట్టుటకుగాని తమకు నూతనముగా లభించిన అధికారముచే తబ్బిబ్బులై - ఆంగ్లరాజ్యసేవచేయుచు - ఆంగ్లమానసపుత్రులుగ పరిణామించిరి. చదువుతోపాటు - ఉద్యోగము - అధికారము - భాగ్యము - భోగ్యము - ఆచార పరివర్తనము - మతివిభ్రమమూ - మతభ్రష్టుత్వము - దేశాభిమాన విధ్వంసము - రాజభక్తి - పరదేశవస్తు ప్రచారము - పరదేశప్రయాణము - మున్నగునవి దేశములో నాటుకున్నవి. ఇందలిప్రయోజకులను, గడసరులను, సంతలో గిత్తలను ఏరునట్లు ఏరి ఆంగ్లేయులు ఉద్యోగములనిచ్చి - తమవారుగ చేసికొనుచు బిరుదాంకితులను ప్రత్యేకపు గౌరవముతో చూచుచుండిరి. ఇట్లు

దేశమంతయు - భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక దాస్యమున మునిగియుండుట గాంధిమహాత్ముడు చూచి, ఇందుకు మందు ఆయుధముగాదు - మందుగుండు సామానూకాదు. మంత్రబలము - ఆత్మబలము - నీతిబలముల వలననే - దీనిని సాధిక చేయవలెనని ఊహించి ఏతోడ్పాటువల్ల ఆంగ్లులిక్కడ రాజ్యముచేయ గలుగుచున్నారో దానినిరద్దుచేసి, అసహాయయోగము అవలంబించి, పరదేశీయులకు బుద్ధిబలము - నీతిబలము - అర్థబలము - అంగబలములేకుండ చేయవలెనను నిశ్చయముతో తమ నూతనప్రణాళికను సాగించిరి.

కాని గాంధిగారి బహిష్కార సాధనము నేతి - నేతి అను ఉపనిషత్తు వాక్యానుసరణ మైనది కాక ఇదమిత్థమని స్వరూపనిర్ణయ - నిర్మాణములు చేయు పద్ధతి ననుసరించినది. ఆయన తమ కార్యక్రమమును - ఆర్థిక, సాంఘిక, నైతికవిధానములకు వర్తింప చేసియున్నారు. ఏ వస్తువనైన బహిష్కరించుట - కనీసము బహిష్కరింపుము అని బోధించుట సులభము. కాని ఆవస్తుస్థానే మరియొక వస్తువను నిర్మింపవలసి యుండును. విదేశవస్త్రములను బహిష్కరించండి - అంటే కట్టువస్త్రము లుండవలెను గదా! ఖద్దరు ద్వారా విదేశవస్త్రములను బహిష్కారము చేయండని ఆయన బోధించెను. కళాశాలలను బహిష్కరించండి అని చెప్పునపుడు. జాతీయ పాఠశాలల ద్వారా బహిష్కరింపండి అనిన్ని - కోర్టులను బహిష్కరింపండి అన్నప్పుడు పంచాయితీలద్వారా బహిష్కరించవలెనియు, పోలీసువారి సహాయము పొందకండి అన్నపుడు వాలంటీర్ల ద్వారా పనిజరుపుకొనుచుండవలెననియు, విదేశవస్తు బహిష్కారము చేయునపుడు సాధ్యమాయినంతవరకు ఆయా వస్తువుల ఉపయోగమే మానుకొనవలెననియు - ఇండియాలో దొరుకు వస్తువులలో పట్టణములలో కంటె గ్రామ పరిశ్రమలవల్ల చేయబడు వస్తువులను కొనుచుండవలెననియు, అదియు చేతిపనులతో చేయబడిన వానినే ఆదరింప వలెననియు, ఎక్కడికక్కడ విధ్వంసక కార్యక్రమముతో పాటు నిర్మాణ కార్యక్రమమును కొనసాగింప వలెనని గాంధిగారు నొక్కి చెప్పుచుండెడివారు.

ఇప్పుడు స్వరాజ్యము స్థాపింపబడినపిమ్మట కూడ, కేవలము - పారతంత్ర్యమును తొలివేయడమువల్ల - మనము స్వతంత్రులము కాజాలము అనిమాత్రము

అన్నవస్త్ర సంపూర్ణతలతో గూడిన పునాదులపై — సేవనుపూను పట్టణములను గట్టి — సర్వసమంజసముగ నగరములను నిర్మించి — రాజ్యమును ప్రజల చేతులతో — ప్రజల ప్రయోజనములకొఱకు — ప్రజలయొక్క రాజ్యముగా మార్చవలెనని బోధించిరి. ఇయ్యదే స్వరాజ్యము కాగలదు.

## స్వరాజ్య ప్రతిష్ఠాపన

జాతీయ రాజ్యాంగమును ఎదుర్కొనే సమస్య ఏమిటంటే స్వరాజ్య సౌధముయొక్క నిర్మాణము ఎట్లు వుండవలెను అనునది. తలబరువైన నగరములతో నిండి యంత్రపరివృతమై భాగ్యవంతులచే నడుపబడుట జాతీయత యని ఇంతవఱకు భావించబడినది. ఆలాగాక విశాలమైన పునాదిమీద అంతస్తులతో కూడి గ్రామము మొదలు నగరమునేటటువంటి శిఖరమువరకు నిర్మింపబడు శాశ్వతపు సౌధము. ఇందులో సత్యము తెలుసుకొనవలె నన్న ఒక్కసారి తూర్పునుంచి చూపును పడమటకు త్రిప్పవలెను.

ఐరోపాయొక్క ఐశ్వర్యమంతా ప్రాచ్యదేశములనుబట్టి జరిగినదనుట జగద్విదితము. ప్రాచ్యదేశములన్నికూడా పాశ్చాత్యపారిశ్రామికపద్ధతిని ప్రారంభించి పరిపూర్ణముగ తయారైవున్నట్లయితే పాశ్చాత్యవస్తువులను కొనుగోలుచేయు ప్రాచ్యదేశస్థులు అంతా ఐరోపాలోని జీవితప్రమాణము భాగ్యభోగ్యములు మజూరీలు పొందెదరు గాని అందుకు తగ్గ బాధ్యతకూడా వున్నదని తెలుసుకొనవలసిన విషయం కాదా! అన్నిజాతులవారు తాము తెప్పించుకొను దిగుమతులుకంటె ఎగుమతులను ఎక్కువచేయవలెనంటే పుచ్చుకొనేవారు ఎవరు? అందరు తల్లిదండ్రులు కొడుకులకు కట్నమురావలెనంటే కట్నము ఇచ్చువారెవరు వుంటారు? ఇక పెళ్లిళ్లు మొగపిల్లలకే జరుగవలెనా? నూతన ఐరోపాయొక్క భాగ్యభోగ్యసాధనములను అనుకరించడములో ఇండియా మున్నగు ప్రాచ్యదేశస్థులకుకూడా కోరిక గల[illegible]ర్థము చేసుకొనవలసి యున్నది. "ఐర్లెండువృద్ధి అంటే ఇంగ్లండు విధ్వంసము" అనే సామెత వుండెను. పూర్వము ఐర్లండు ఇంగ్లీషుజాతిక్రింద వుండెను. ఈరోజున స్వరాజ్యము వచ్చేవరకు

ఇంగ్లండు, ఇండియా ఇటువంటిస్థితిలోనే వుండివుండెను. ఇండియా దేశములో వ్యవసాయముతోబాటు పరిశ్రమలుకూడ సరిసమానముగ వృద్ధిపొందినప్పుడే ఇంగ్లండు ఎగుమతులు తగ్గిపోయి ఐశ్వర్యము అడుగంటిపోవును. కాబట్టి ఏదో ఒక ప్రమాణము పట్టుకొని ఆప్రమాణముపొందువరకు అన్ని దేశములు అన్ని రీతుల అభివృద్ధిచెందవలెననుకోరిక సమంజసమైనదిగాని ఒకరినికొట్టి ఒకరు వృద్ధి పొందవలెననుట సమంజసముగాదు. ఐతే, దీని అర్థమును పూర్తిగ గ్రహించ వలసియున్నది. ఇంగ్లండు, అమెరికాలలో ఈనాడు వున్న వున్నత జీవితప్రమాణము సర్వే సర్వత్రాగాని, సర్వదాగాని వుండజాలదని గ్రహింపవలయును. ఒకరిని కొట్టి మరొకరు పైకి వస్తూవున్న పోటీపద్ధతి నశించిపోవలయును. ఎవరికి కావలసిన ఆహారము, వస్త్రము, గృహము, విద్య, వైద్యములు వారే సంపాదించు కొనగలరో అప్పుడే "సర్వేజనాః సుఖినోభవంతు" అనే లోక్తి ఆచరణలోనికి రాగలదు.

పాశ్చాత్యసభ్యతయొక్క మహాత్తు, ఏనాడు స్టీము ఇంజను కనిపెట్టారో ఆనాటితో ప్రారంభమైనది. సముద్రములమీద ఓడలను కొట్టి దొంగతనము చేసి జీవించు బ్రిటను దేశము దూదివస్త్రము అంటే ఏమిటో యెరుగని ఆంగ్లేయులు స్పెయిను దేశస్థులకంటె సోమరు లనిపించుకున్న బ్రిటిష్‌వారు ఇంజను అనే మహాయంత్రము వుత్పత్తి కాగానే ఆనమాలుపట్టనంత మార్పును పొందిరి. గృహపరిశ్రమలకు ఇంజనుపవరు జోడించినప్పుడు పరిశ్రమలు మిల్లులుగ మారి పారిశ్రామికులు మిల్లు యజమానులైరి. మిల్లులేమి, ఫ్యాక్టరీలేమి, మహా పిశాచములవలె ఎక్కడలేని ముడిపదార్థమును మ్రింగి ఎన్నరాని తయారీ పదార్థముల నిచ్చుచుండెను. అప్పుడు పట్టణము లన్నీ బజారులై కొనువారి సంఖ్య విక్రయించువారి సంఖ్యకు అనుగుణ్యాంగా పెరుగవలయును. ఇందులకుగాను అంగళ్ళను వెదుకుట మొదలుపెట్టిరి. అంగళ్ళను బట్టియే ప్రజల ఫక్కీలు, వైఖరులు మారుచుండును. రాజులు అవలంబించు పద్ధతులే ప్రజలకు అలవడును. ఇట్లు దేశములను స్వాధీనపరచుకొనుటకు దండయాత్రలు అవసరముగదా! ఇందుకు సైనిక బలము వృద్ధి కావా లన్నమాట. యుద్ధకాలములో సైనిక బలమన్నా, శాంతికాలములో వర్తకబలమన్నా ఒకటే అర్థము. సర్వదా

సామ్రాజ్య బలమని తెలుసుకొనవలసి యున్నది. వర్తకము కొరకు సామ్రాజ్యము, సామ్రాజ్యముకొఱకు వర్తకాభివృద్ధి, ఈకార్యకారణచక్రము విషచక్రమువలె పనిచేస్తూవుండును. ప్రథమములో ఈచక్రము ఐశ్వర్యచక్రముగ కనిపిస్తుంది. ప్రజలకు ఆశ్చర్యకారియైనది. ఇతరదేశములు అంగీకరించుటవలన అనుమాన ముగ పరిణమించింది. ఇంగ్లీషువారు ఎంతమేధావులో, ఎంత బలవంతులో, ఎంతయుక్తిపరులో జర్మనీవారుకూడ అంతే. అందువలన కొద్దికాలములో జర్మనీ వారు ఇంగ్లీషువారిని మించి వుత్పత్తిలో నైతేనేమి, వ్యాపార విస్తరణలో నైతేనేమి, నూతన సేనల పెంపుదలలోనైతేనేమి జయప్రదముగ పోటీచేయుచు తాముకూడ పారిశ్రామిక జాతియై లోకులకు పెట్టుబడిపెట్టి సామ్రాజ్యమును స్థాపించి సైనికబలము చేత ఇంగ్లండుతో పోటీని సాగించుచు వచ్చిరి. ఈ రెండు జాతులవారు కూడ వ్యవసాయిక శక్తికంటె పారిశ్రామిక శక్తియందు అభివృద్ధి చెందుచుండగా ఫ్రాన్సు అనేదేశము శాంతిప్రియురాలై వ్యవసాయ మును పరిశ్రమలను త్రాసు చిప్పలవలె సరిసమానముగ వుంచుకొనుచుండెను. ఇటలీ దేశము ఈరెంటికి వ్యతిరేకముగా వ్యవసాయమునందు ఎక్కువ శ్రద్ధ చూపుతూ పరిశ్రమలయందు వెనుకబడి యుండెను. ఈపద్ధతి మొదటి ఐరోపా మహాసంగ్రామము అనగా 1914-18 వరకు కల్గినది. అమెరికాకూడా అంత వరకు ఋణపడ్డ దేశముగ వుండెనుకాని ఋణదాతగ వుండివుండలేదు. ఐరోపా యొక్క స్వరూపము అచిరకాలములోనే మారిపోయినది. ఐరోపా అనుస మి-- --ణిని అంగీకరించవలెనన్న ప్రాచ్యదేశములకును ముఖ్యముగ ఇండియా కుందాము — --- దేశములకును పోటీ పడుతుంది.

కాభాషను ఏర్పాట

ముత్తముమీద ఏరాజ్యమున కారాజ్యము స్వయం

ఆంగ్ల విద్యాధికులను శద్దా! అంతే, ఒకదేశమునుంచి మరొకదేశము బోర్డులలోను - ప్రతినిధులుగ --కూడదని కాను. కాని ఒకదేశమునుంచి చేదాము. వేయిసంవత్సరములక్రింద దేశమునకు దిగుమతి అయిన సరుకు వెలకు ములయొక్క తెగిపోయిన కొనసలను -రను మనము బియ్యంఇచ్చి కొన్నట్లు, ఆయుర్వేదము - జ్యోతిశ్శాస్త్రము - న ఆడవాళ్లు అమ్మే ఆడవాళ్లను అడిగెదరు. చేసి - వీనిని ఆధునిక కాలానుసరముగ/పుచ్చుకొనుట జాతిజాతికి దేశదేశమునకు

మధ్య ఏర్పాటుకావలయును. దీనివలన దేశములమధ్యకలిగే పరస్పర సంపర్కము వల్ల సర్వజన శుభావహముగ వుండగలదు. పరస్పరవిశ్వాసములకు తావు వుండును. ఈర్ష్యలునశించును. పరస్పర సహకారము ఎక్కువ అయ్యే అవకాశము పెంపొంద గలదు. అప్పుడు స్వాతంత్ర్యమనగా కేవలము తోటివారితో ఎట్టిసంపర్కములేక భూనభోంతరాళమునందు త్రిశంకువలె వ్రేలాడుచుండుట కాదని, పరస్పరసంపర్క సంయోగములు కలిగివుండుటయని అర్థముకాగలదు. ప్రపంచములో నెదుర్కొను అన్ని సమస్యలను ఎవరికివారు తమసాంప్రదాయమునుబట్టి తమబుద్ధిబలమును బట్టి తేల్చుకొనుటకు యత్నింతురు.

ఈ భావముయొక్క గూఢార్థము ఇంచుక ఆలోచించెదము. ఇండియా దేశము స్వయంసంపూర్ణముగ వుండవలెనన్న కేవలము స్వార్థబుద్ధితో వుండ డముకాదు. దీనికి కావలసిన ఇంజనులు, పనిముట్లు, యంత్రసామగ్రి, మోటార్లు, విమానములు, ఓడలను తానే చేసుకొనుచుండవలయును. వారికి వలయు ఆహారము, పండ్లను, కూరలను, వస్త్రములను, మందులను వారే చేసు కొనవలయును. ఇట్లు తన ఐశ్వర్యచక్రముగ మోటారును నడుపు చక్రముతో పాటు నూలును వడకు రాట్నమును కూడా తానే చేసుకొని రెంటిని సరిసమాన ముగ వుంచవలయును. దేశములోని ప్రత్తిసంతను ఉపయోగించి బట్ట చేసు కొంటూ, ఇంకా ఇతరవస్తువులను చేసుకొనుచుండవలయును. ఇండియాయొక్క బుద్ధిబలము ఎట్లు అగాధమో, అమోఘమో, ఇండియాయొక్క మానసికశక్తి ఎట్లు అజేయమైనదో మనకు ఇంకనూ తెలియదు. చిరకాలము వినియోగింపక పోవుటవలన ఇది ఒకవిధంగా మొండిబారినది. జాతీయ రాజ్యాంగ విధానము ఏనాడు అమలులోనికి వచ్చినదో ఆనాడు వర్షపాతమువలన పంటలు పెరిగినట్లు ఇండియాయొక్క బుద్ధిబలము, యుక్తికూడా పెరుగును. దేశము అభివృద్ధి కావలెనంటే సూక్ష్మబుద్ధినిబట్టి హస్తకౌశలముబట్టి కావలెనుగదా. పాశ్చాత్య దేశములవలనే మనదేశమునందలి ప్రజలు సుఖమనుభవించవలెనన్న మొదటి రోజుల్లో మనము నష్టపడవలసియున్నది. దాని ఫలితము చివరకు మనకు సంక్రమించగలదు. దేశము స్వయంసంపూర్ణము కావలెనంటే సాధ్యమై నంతవరకు రాజధానిలోని జిల్లాలు, పట్టణములు, గ్రామములుకూడ స్వయం

సంపూర్ణముగ వుండవలయును. అనగా గ్రామమునకు కావలసిన తిండి, బట్ట, గృహనిర్మాణము, విద్య, వైద్యము గ్రామములోనే ఏర్పాటు కావలయును. ఇంతకూ, సొమ్మువల్ల సాధనములు పుట్టజాలవు. కార్మికులయొక్క కౌశల్యము వలన మన ఇళ్లు అందముగావున్నా, మన బల్లలూ, కుర్చీలు నగిషీలతో వుండినా, మనగోడలు చిత్రములతో అలంకరించబడినా, మన పాత్రలు పూజా ద్రవ్యములతో నిండివున్నా, మనవస్త్రములు సుందరమైన అంచులు గల్గి యున్నా కార్మికునియొక్క నేర్పరితనమే కారణము. అన్నిటియందును ఇండియా యొక్క స్వరూపముతోనిండినప్పుడే దేశము సభ్యతనందిన దేశమని,వ్యక్తతగల్గిన దేశమని చెప్పగలము.

ii

ఇట్టి విప్లవపూర్వకమగు పరిణామము పొందవలెనన్న గ్రామస్థులను పల్లెటూరి గబ్బిలాయలని నిరసించక బాధ్యతవహింపగల్గిన సృజనశక్తిగల, యుక్తాయుక్త విచక్షణచేయ సమర్థులైన పౌరులుగ నెంచవలయును. కావున ఉద్యోగస్తులు వారియెడలచూపు నీచ, నిరసన భావములకు బదులు తమతోటి బాటు సరిసమానమైన హక్కులు పొందగల్గినవారుగ భావింపబడవలయును. ఈనాటి పరిస్థితిజూడ మంత్రులు క్రొత్తవారై ఉద్యోగులు పాతవారైనట్లు, రైలు బండికి క్రొత్తఇంజను తగిలించి పాతడబ్బీలతో నడిపితే ఏప్రకారముగ వుంటుందో ఆప్రకారముగ కనిపించుచున్నది. ఈమాట నేను కొందరు ఉద్యోగస్థులతో చెపితే ఇంజనులే పాతవేమోనని సూచనగ అంటించిరి. అప్పటినుండి ఈ సామెతను వాడటము నాకు ఇష్టముగాలేదు. మన మంత్రులకు తగిన సంస్కారము వున్నదా లేదా అను మాటకూడ యోచించవలసి యున్నది. మన ప్రజలు పాలకులుకూడ క్రొత్తభావములనుపొంది క్రొత్తదృక్కోణము నుండి చూచి క్రొత్తదృక్పథమును అవలంబించవలసి యున్నది. ఇంతవరకు బ్రిటిష్ గవర్నమెంటు ఒక నియమితపద్ధతి ప్రకారము రాజ్యాంగచక్రమును నడిపించినది. ఈచక్రముపోయేగాడి రోడ్డుమీద స్పష్టంగా ఏర్పడియున్నది. చక్రము గాడిలో పడినతరువాత గాడిమార్గమునే అవలంబించవలసి యుండును. ఉద్యోగస్థులు తెలివితక్కువవారు కాని, తెలివిగలవారుగాని వారికిఏర్పాటు చేయబడిన పరి

పాలనా గ్రంథముల ననుసరించి, సూత్రములననుసరించి, న్యాయము ననుసరించి ఉపనయనముల ననుసరించి తు. చ. తప్పకుండా కొలతబద్ధ ప్రకారము పరిపాలనా చక్రము నడుస్తూవుండును. ఏదైనా పరిపాలన మనుష్యునియొక్క నడవడి మానసికస్థితిని కనిపెట్టి, మంచిచెడ్డలను సరిచేయుచు, ముందువెనుకలను చూచుకొనుచు, పిన్నపెద్దలను గమనించి రాజ్యాంగము ఏనాడుజరుగునో ఆనాడే అది స్వరాజ్య మనిపించుకోబడును.

గ్రామములోని పంచాయతీ బోర్డులు నేటి కమ్మరి దుకాణములోని మూసకట్టుగ అన్నిపంచాయతీలు ఒకమూసలో పోసినటువంటి ఇనుప సామాను లాగ తయారు కాకుండా - ఆయాప్రదేశములలోని కట్టుబాట్లు, ధర్మములు కాలపాత్రముల ననుసరించి కార్యము నిర్వహించి నప్పుడే పంచాయతీరాజ్యము జయప్రదము కాగలదు. పంచాయతీరాజ్యము అన్న మానవ స్వభావమును గుర్తించు రాజ్య మని అర్థము. గ్రామములోని ఇక్కట్లు గ్రామస్థుల యొక్క బుద్ధి సూక్ష్మతతో పరిష్కరించుకొనవలసి యున్నది. ఇటీవల హైదరాబాద్ యుద్ధములో ఔరంగాబాద్ వద్ద విమానాశ్రయమును హైదరాబాద్‌వారు చెడగొట్టి వెళ్ళిపోగా మన సేనలు అక్కడకు వెళ్ళినప్పుడు దానిని బాగుచేయుటకు చుట్టుప్రక్కల జనమును ప్రోగుచేసి పనిచేయించిన మీదట వారికి మజూరీ ఇవ్వబోగా "అయ్యా ఈ దేశముమాది, సేనలుమావి, మేము మీరు ఒకటే. మా కార్యమును మీరు చేస్తూవున్నారు. మీరు మాకు డబ్బు ఇవ్వటం మేము పుచ్చుకోవటం నీచము, తప్పు. కాబట్టి మా కార్యముగ ఎంచుకొని మేము చేస్తూవున్నామని తలంచండి" అనే వాక్కులు అక్కడ కూలీలు ఏవిధంగా చెప్పారో ఆవిధంగా గ్రామస్థులలో ప్రతివారును కూడ చెప్పగల్గినప్పుడే పంచాయతీలు జయప్రదము కాగలవు. గ్రామములలో పశువులకు వలయు ఆంబోతులను డబ్బుతో కొన్న ప్రదేశము ఎరుగుదుమా! చిరకాలము నుండియు ఆంబోతును ఎవరో అచ్చుపోయుట గ్రామముమీద వదలి గ్రామస్థులు పోషించుట సాంప్రదాయ సిద్ధమైన విషయంకాదా! ఏనాడు గ్రామస్థులు తమ సొమ్మునంతను ప్రోగుచేసుకొని పరిపాలించుకొనెదరో ఆనాడు గ్రామ పరిపాలన పూర్తి అగును. గ్రామస్థులకు పరిపాలనా బాధ్యత నేర్పిన

గ్రామమునుండి జిల్లా, జిల్లానుండి రాజధాని సభ్యత్వము అఖిల భారతసభ్యత్వములకు వారే ప్రతినిధులుగ తామే తమ కార్యములను నెరవేర్చుచు బహుజనోపయోగముగ పనులను చేయుటకు నీతి నియమములను నేర్చుకొనెదరు. ఈ రోజున ఈదేశముయొక్క ప్రజలపన్నునుంచి జీతముపుచ్చుకొను ఉద్యోగులు కూడ చాలవరకు మారుచున్నారు. ఏనాడు ఈఉద్యోగస్థులందరూ కలసి గ్రామస్థులకు తమధర్మములను విధులను తెలుసుకొని రాజ్యాంగము నిర్వహించ వలెనని నచ్చచెప్పగలరో ఆరోజున రాజ్యము స్వరాజ్యము కాగలదు. ఏరోజున గ్రామస్థులు తమ ఓటుతో మంత్రులు నియామకమైనారని గ్రహించి విత్తనము చెట్టు అయి పూచి కాసిన కాయలలోనుండి పండినపండుయే ప్రధాన మంత్రియని గ్రహించెదరో ఆరోజున స్వరాజ్యమనే భావము సఫలీకృతముకాగలదు. 1870 సంవత్సరములో ప్రజలకు ఇంగ్లండులో ఓటుచేయు అధికారము ప్రసాదించినప్పుడు "లో" అనే ఆయన లేచి మనయజమానులకు మనము చదువుచెప్పి విజ్ఞానవంతులుగ చేయాలని ప్రాంతప్రాంతమునకు వెళ్లి ఓటు అంటే ఏమిటో, అధికారము అంటే ఏమిటో బోధించినట్లు మనదేశమునందు కూడ సర్వే సర్వత్రా ఈ భావములను ప్రచారము చేయవలయును. ఈ భావములు ఈ వరకే చాలవరకు వ్యాపకములైనవి. ప్రతిపల్లెటూరియొక్క ప్రతిశివారు గ్రామమునకు కూడా ఈ సందేశము చేరవలయును. గ్రామస్థులు ఉద్యోగులను నీచముగ చూడకుండా వారుకూడా దేశాభిమానులని గ్రహించి గౌరవము ఇచ్చి వారు చేయు తీర్మానములకు కట్టుబడి వుండవలసియున్నది.

ఇదియే గ్రామపునర్నిర్మాణము అనెదరు. దీనికి ఆదివున్నదిగాని అంతు లేదు. ఇందులో సమస్యలు గణనాతీతములు. గ్రామములో పరపతిసంఘము, భాండారము, బ్యాంకు స్థాపించి గ్రామస్థులు గ్రామపొలిమేర దాటకుండా తమకు కావలసిన వస్తువులన్నింటినీ ఒకపద్దున ఒకపట్టీతో గ్రామమునకు తెప్పించుకొని ఏనాడు పంచిపెట్టుకొనగలరో ఆనాడే గ్రామము స్వయం సంపూర్ణమైనదని చెప్పవచ్చును. ఆనాడు గ్రామస్థులు పని పాటల కొరకు దూరమునయున్న పట్టణములకు పోవుటకు బదులు పరిశ్రమలను తమ గ్రామములలోనికి తెచ్చుకొనగలరు. ఆనాడు న్యాయపరిపాలన కొరకు

క్రీస్తు కిస్తామని ఆయనకు ఆశ కల్పింప యత్నములు జరిగినవి. ఏసుక్రీస్తు - రాజు అగుటకు ప్రయత్నించుచు, ప్రబోధము జరుపుచుండెనని వీరిమనస్సులో గలిగిన యుహాపోహాకు ఫలితము ఇది. కాని ఆయన నిరాకరించెను. బ్రిటిషువారు ఎక్కడ రాజ్యమును స్థాపించినా మలయాలో "సుల్తానేట్"లు అనియు, "బర్మా షాన్ స్టేట్లు" అనియు, "ఇండియా నేటివ్ స్టేట్సు" అనియు కొంత ప్రదేశమును ప్రత్యేకించి, వారిపై తమకు వశమయిన రాజులను నియమించి, ఈ పెద్దగులాముల ద్వారా - ప్రజల నెల్లరను గులాంగిరీలో ముంచివేయుచూ వచ్చిరి. పూర్వము మనదేశములో, ఛప్పన్ రాజ్యము లున్నయన్న కాలములోగూడ ఏరాజును గూర్చి అయినా అసంతుష్టి ప్రబలినయెడల వెంటనే - రాజభవనములో జరుగుకుట్ర వల్ల కాని, ప్రజలలో గలుగు తిరుగుబాటువల్లగాని ఆరాజు పదభ్రష్టు డగుట మన మెరుగుదుము. కాని ఈ దేశములో నిలుపబెట్టబడిన 562 సంస్థానాధీశు లున్న బ్రిటిషువారి సంరక్షణలో నుండుటవల్ల వీరికి ప్రతిగ లోపలనుండిగాని, బయటనుండి గాని తిరుగుబాటు చేయుట దుస్సాధ్యమయ్యెను. ఏచిన్న ఆందోళన పుట్టినా - బ్రిటిషువారి సైన్యము ప్రజలను అణచివేయుటకు సిద్ధముగ నుండెను.

వీరు తమ పరిపాలనను సక్రమముగ జరుపవలె ననే షరతు, ఇట్టి సంరక్షణకు మూలాధారముగ నున్నను రానురాను ప్రజల ఆందోళన ఒక్క దేశీయ రాజులకేకాక తమకు కూడా అపాయకరమని ఎంచి, ఎప్పుడు - ఎక్కడ ఏవిధమున ఎంత ప్రమాణములో అంకురించినను - ఆందోళన అంటే చాలును - అణచి వేయవలసిందే అన్నదే బ్రిటిషువారినీతి. ఇందువలన - దేశీయరాజుల నిరంకుశత్వము — రాను రాను - హెచ్చి, వారిఆస్థానములలో నుండు ఐరోపా ఉద్యోగులు అయితేనేమి - భారతీయులైతేనేమి - అందరను వీరు మంచిమాట చేసుకుంటూ - తమయధికారమును అమోఘముగ సాగించుకొనేవారు. ఇట్లు శాస్త్రవిరుద్ధమగు పన్నులు - పనులు - రాజులు ప్రజలనుండి పొంది - ప్రజలను హింసించుచుండెడివారు. వాస్తవముగ భారతదేశమంతా ఒకటేగనుక, తమందరకు సమానమగు సభ్యతను, ఆచారవిచారములను - విజ్ఞాన పరిజ్ఞానములను - సంస్థలను, శాసనములను కాపాడుకొనుటకు - తమకు స్వాతంత్ర్యము కావలెనని రాజధానులవారు - సంస్థానములవారు ఏకగ్రీవముగ నిశ్చయించుకుని 1921

నుండీ తమపై నమలులోనున్న నిరంకుశ రాజ్యనిర్మూలనముకొఱకు గాఢయత్నములు జరుగగా 1947 వ సం॥ ఆగష్టు 15 వ తేదీకి ఫలించిన ఫలము - ఒకవైపు పండుగాను - ఒకవైపు పచ్చిగాను తయారయ్యెను. తీరా చూసేటప్పటికి - 562 సంస్థానములతో గూడిన వైపు - కటిక పచ్చిగా నుండుటచే - ఈవైపుకూడ పండవెయ్యకపోతే - ఫలం భోగ్యార్హము గాకుండెను. అందువలన స్వరాజ్యస్థాపకుల శ్రద్ధను ఈవైపుకుతిప్పి - మంత్రియగు సర్దారు పటేలుగారు తన యపార శక్తిసామర్థ్యములవల్లను బుద్ధికుశలతవల్లను - 562 సంస్థానములను స్వాధీనము ఎట్లుచేసుకొన్నది లోకవిదితమే. ఈ కార్యము నిజముగ ఎందుకు ఇంతకష్టమయిందంటే - క్యాబినెట్ మిషన్ 1946 వ సం॥ మార్చిలో ఇండియాకు వచ్చి - 12 వ మెయి తారీఖున ఒకదస్తావేజువ్రాసి - దానిని కాంగ్రెసు నాయకుల దృష్టినుండి తప్పించి - దేశీయ రాజులకు మాత్రమేచూపి - రాజీమాట లన్నిటికి ఆధారభూతమగు 16 వ మే (1946) దస్తావేజులో - అంతకు పూర్వము 4 రోజులక్రిందటి నాటి రహస్యమని వెల్లడిచేయక - చివరికి 22 మే (1946) నాటికి కాంగ్రెసువారు రాజీకి సుముఖులుగ నున్నారన్నమాట గుర్తెరిగి- అప్పుడు ఆ రహస్య దస్తావేజును ప్రకటింపగా, అందులోని మహాశ్చర్యకరమైన మాటలన్నీ వెల్లడిఅయినవి. 562 రు రాజులు స్వతంత్రులగుదురట, బ్రిటిషు కిరీటము (రాజుతో) వీరుచేసికొన్న ఒడంబడికల ఫలితముగ, వీరు వదులుకున్న హక్కులు వీరికి తిరిగి సంక్రమించుననియు వీరికి రాజు ఇచ్చిన వాగ్దానములు అంత్యమగుననియు - అందులో వ్రాయబడియుండెను.

కాని ఈసంగతులు వెల్లడిఅయినతరువాతగూడ కాంగ్రెసువారు దీనియందు చూపవలసిన శ్రద్ధను చూపకపోవుటవల్ల 15—8—47వ సంవత్సరమున బ్రిటిషువారు మనదేశమును వదిలారు అనగానే - జాట్లు (ఢోల్పూరు - భరతపూర్) జాటస్థాన్, సిక్కులు (పాటియాలు సభ. ఫరీదుకోట - మెలర్ కోట్లు - యిండ్ కపూర్థలవారు) సిక్కుస్థాన్ - అని - జోధ్పూరు వగైరాలవారు రాజపుత్రస్థాన్ అని ముస్లింలు - ముఖ్యముగ - బహావల్పూర్ - జునగడ్ - హైదరాబాదువారు - ముస్లింస్థాన్ అని - ఎక్కడవారు అక్కడ తాము స్వతంత్రుల మనియో స్వతంత్రగుంపులు కూడెద మనియో - ప్రకటింప - కుట్ర

వివాదనిర్ణయము కొరకు దూరమునవున్న నగరమునకు రానక్కరలేదు. తన గ్రామములోనే న్యాయముపొందగలడు. ఉత్పత్తి వసరులు సరిగాలేవు కాబట్టి ఈ సంవత్సరము లగ్నములు ఆపివేసినాము అని చెప్పాచో స్వయం సంపూర్ణమైన పద్ధతిని అవలంబించగలరు. అట్టిపద్ధతి పునః స్థాపన అయినప్పుడే గ్రామ పునర్నిర్మాణము పరిపూర్ణమైనదని చెప్పవచ్చును. గ్రామమునకు దూరముగ మాలగూడెములనే పేరుతో వుండేశివారు పల్లె మధ్యవున్న భూమి ఇళ్లమయమైననాడు గ్రామపునర్నిర్మాణము పూర్తికాగలదు. ఏనాడు అన్ని విధములైన సౌకర్యము కొరకు దూరమునయున్న గవర్నమెంటుకేసి చూడక తమ గ్రామములోని పరికరములను ఉపయోగించుకొని స్వయం సహాయ సిద్ధాంతము ననుసరించి గ్రామీణులు వివిధసౌకర్యములు కలుగచేసుకొనెదరో ఆనాడు స్వరాజ్య స్థాపనకు వలయు పునాదులు సుస్థిరముగ వేయబడినవని ఎన్నదగును. గ్రామమునకు పట్టణమునకు విరోధములేదని గ్రహించవలయును. గ్రామము పట్టణము త్రాసుపళ్లెములవలె సరిసమానముగ తూగగలవో మనఅభివృద్ధి సమంజసముగ జరుగుచున్నదని మనము తెలుసుకొన గలము.

## సంస్థానములు

ఆంగ్లేయులు ఈదేశమునకు వచ్చి కొన్నిసమస్యలను గల్పించినారు. ఈదేశమును వదిలి వెళ్ళుతూ మరికొన్ని సమస్యలను మనకు వదిలి వెళ్ళినారు. వీనిలో ముఖ్యమయినది దేశీయరాజులకును దేశీయ సంస్థానములకును సంబంధించినవి. ఏదేశమును పరరాజులు జయించినా, ఆదేశములో కొందర ప్రముఖులను చేబట్టి వారి కధికారమిచ్చి వారు బానిసలయినను, తోటి బానిసలపై పెత్తనము వహించినవా రగుటచే - తామే పరిపాలకుల మన్న భావము వారి మనస్సులలో కలుగచేయుట ఆచారమై యున్నది. పూర్వము రోముసామ్రాజ్యము సజీవముగ నున్న... ప్రవర్తి అయిన Tiberius Caesar కాలములో పాలస్తీనురాజుగ హెరడు ఉన్నకాలములో వీరిరాజ్యమును నాలుగు భాగములు చేసి నలుగురు కుమాళ్ళకు ఇవ్వగా - ఒకరు చనిపోయినమీదట ఆవంతు ఏసు

చేయ, యోచింపసాగిరి. కాని ఇవన్నియు గాలిలో దీపములవలె ఒకదాని తరువాత మరియొకటి లొంగిపోయి - ఇండియన్ యూనియనులో చేరసాగెను.

మొట్టమొదట 26 ఓఢ్ర సంస్థానములు ఓఢ్ర దేశములో సర్దారు పటేలుగారు కటక్ వెళ్ళినప్పుడు ఒరిస్సాలో చేరగా - వెంటనే చటీస్‌గఢ సంస్థానములు 14న్ను C. P. లో చేరెను. పిమ్మట భరతపూర్ - అళ్వార్ - ఢోల్పూర్ - కరేలీ అన్న 4 సంస్థానములతో గూడిన మత్స్యరాజ్యమున్ను - పిమ్మట, తక్కిన రాజపుత్రస్థాన రాజ్యములు - రాజపుత్రస్థానమున్ను - నిర్మింపబడ్డవి. వీటితరువాత మాల్వారాజ్యము-గ్వాలియర్ - ఇండోర్ వగైరాలతోను వింధ్యాచల రాజ్యము - రివాయున్ను (ఖగేల్‌ఖండ్) బుందేల్ ఖండంలోని 34 సంస్థానములతోను నిర్మింపబడ్డవి. అనంతరము 16 దక్కను రాజ్యములు దక్షిణమునను, 16 గుజరాతు ఉత్తరరాజ్యములున్ను బొంబాయిరాజధానిలో గలిసిపోయెను. ఇంతలో కథియావారులో 417 రాజ్యములు సౌరాష్ట్ర రాజ్యమయ్యెను. హిమాచల ప్రాంతములోని 34 రాజ్యములు హిమాచల ప్రదేశమయ్యెను. పాటియాలా వగైరా 8 రాజ్యములు పూర్వపంజాబుగుంపు అయ్యెను.

ఇంక హైదరాబాదు, కాశ్మీరు మిగిలియుండ, కాశ్మీరు మొదటిలోనే సరిహద్దు జాతులవారు తముపై దండయాత్ర సాగింపగా కాశ్మీరు ఇండియా యూనియనులో చేరెను. హైదరాబాదుపై చిన్న పోలీసు దండయాత్రగావించి స్వాధీనము చేసుకొనిరి. అక్కడక్కడ చెదిరిపోయియున్న - టెహరీ - గద్వాల్ - రాంపూర్ - బనారసు - భూపాల్ - కూచ్‌బీహార్ - త్రిపుర - మణిపూర్ వగైరా చిన్న చిన్న రాజ్యములలో ఆయా పరిసరముల నున్న ప్రాంతములలో కలిసిపోవు ఏర్పాట్లు జరుగుచున్నవి. ఇట్లు 13—12—47 మొదలు 17—9—48 మధ్య ఇండియా దేశములోని 562 దేశీయరాజ్యములు - ఇండియా యూనియనులో అంతర్గతము లయ్యెను. ఇంక వీని ఆంతరంగిక పరిపాలనను ప్రజానుకూలముగా చేయవలసి యున్నది. తిరువాన్కూరు - కొచ్చిన్ - మైసూరు - హైదరాబాదు - బరోడా - జైపూరు - జోద్పూర్ - బికనీరు మున్నగు రాజ్యములు ప్రత్యేకముగా నుండుటకు అంగీకరింపబడ్డవి. వీనిలో వెంటనే ప్రజారాజ్యస్థాపనా యత్నములు జరుగుచున్నవి. ఈవిధముగ పవిత్రభూమి అయిన భరతవర్షమునందు తిరిగి స్వేచ్ఛా స్వాతంత్ర్యములు స్థాపనయగుట సంస్తవనీయము.

# ఉపసంహారము

ఈప్రకారము మనము ఆసేతుహిమాచల పర్యంతము - దేశమును విముక్తి చేస్తిమే కాని - వెంటనే మనలను అనేక బాధలుచుట్టుకున్నవి. ఆంగ్లేయులు సింహద్వారమునుండి వెడలిరే కాని - దొడ్డిగుమ్మమునుండి ప్రవేశింప యత్నించిరి. చర్చల్ అట్లీగారిమధ్యను పార్లమెంటు సభలోజరుగు వాదోపవాదములు - వివాదములు, పోరాటలు కల్పితములుకాని - సహజములుకావు. భారత దేశమును వదిలివేసినప్పుడు - వీరందరు ఏకమైయే వదిలివేసిరికాని - ఒకరితో ఒకరు కలించి బహుమతి సహాయముచే వదిలివేయలేదు. సామ్రాజ్యమును నిలుపుకొనవలెనను కోరిక - కార్మికవర్గమునకుకూడ లేకపోలేదు - మనకళ్లనీళ్లు తుడుచుటకు - మనలను మభ్యపఱచుటకు - ఒకరితోనొకరు పోరాడుచున్నట్లు కనిపిస్తారు. అసలుద్దేశము అందరిది ఒక్కటే, కాకపోతే పాకిస్థాను విభజన ఎలాజరిగింది. 16 వ మే 46 దస్తావేజులో పాకిస్థానుకు వ్యతిరేకముగ సగభాగము వ్రాసి - రెండవసగములో పాకిస్థాను అనివార్య మగునట్లు A, B, C, గుర్తులక్రింద రాజధానులను వర్గీకరణముచేసి, ఓట్లపద్ధతివలన నైతే నేమి - వర్గీకరణ సాధనమువలన నైతేనేమి - పాకిస్థాన్ అనివార్యముచేసినారు. ఈ సంగతులే 6 డిశంబరు (1946) దస్తావేజులో స్పష్టపఱచి "మీరు ఫెడరల్ కోర్టుకు వెళ్ళితే వెళ్ళవచ్చును. మేము మాత్రము వారితీర్పుకు కట్టుబడము - ముస్లింలీగ్గున్న మాతోబాటే-" అన్నారు. ఆఖరకు పాకిస్థానను అంగీకరించిన పిమ్మట కాష్మీరుపై కొండజాతులవారి పోటు దండయాత్ర - వారివెనుక పాకీస్థాను - దీనివెనుక ముగ్గురు ఆంగ్లసర్దారులు - వారివెనుక ఆంగ్లదేశము ఉన్నదని మనమందరము ఎరుగుదుము. ఏకకాలమందు ఇండియాలో మౌంట్ బాటన్ ప్రభువు ఆ ఆంగ్లస్థానీయుడే - పాకీస్థాను ముగ్గురు ఆంగ్లసర్దారులకు ప్రతిగ పని చేస్తున్నాడు అని మనలను నమ్మించడము - ఎంత ఆశ్చర్యజనకమో యోచింపుడు. కాష్మీరు సమస్యను గెంపెడు ఆశతో U. N. O. వద్ద తీసుకుపోతే - అక్కడ అందరూ మనకు వ్యతిరేకమే. ఇది అందరు ఒప్పుకున్న విషయం.

నిజమేమిటంటారా? బాగుపడేవానిని చూచినా, తెలివిగల వానిని చూచినా, మనమోసంలోపడకుండా తప్పించుకునే వానిని చూచినా అంద రకూ కోపమే - ఇన్నాళ్ళు ఇండియా బానిసత్వంలో ఉండి - చచ్చినట్లు

నోరుమూసుకు పడిఉంటూ - ఈ రోజుకు - తగుదునమ్మా — అని - తాను దాస్యవిముక్తురాలగుటయే కాక - ఇటు లంకను - అటు బ్రహ్మదేశాన్ని - ఆపైని - మలయా - సింగపూరు - సైయాం - కోచించైనా - ఇండోనీసియా - వరకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు స్థాపించాలని సదుంకల్పుకుని పనిచేయ పూనితే ఇంక పాశ్చాత్య రాజ్యములకు తావెక్కడ - బ్రతుకెక్కడ? ఇదే వారికి మనపై కోపం తెప్పించే కారణం. ఇంతలో ఇండియా - ఆసియాఖండ వాస్తవ్యులను 1947 మార్చిలో డిల్లీలో సమావేశపఱచి, 1948 లో నీలగిరిలో ఆర్థికవేత్తల మహా సభ జరిపి - డిశంబరు నెలలో కార్మిక ప్రతినిధుల సభ జరుపనై యున్నది. ఎక్కడా పట్టపగ్గాలు లేకుండా మిడిసిపడుతూన్న మనదేశమంటే దేశాన్ని కొట్టుకు తింటానికి అలవాటుపడ్డ దేశముల కన్నిటికిని కోపము - తాపము సంతాపము తప్ప మరి ఏముండగలదు? కాని "భాగ్యేషు అనుత్సేకినీ" అన్న కాళిదాసుని సుభాషితమును అనుసరించి భారతభూమి తనకు ప్రాప్తమయిన ఐశ్వర్యముతో - వినయ విధేయతలు గలిగి ఆసియాఖండమునకు నాయకత్వ మును వహించుటయే కాక - యావత్ప్రపంచమునకు - సత్యము అహింస అను సిద్ధాంత వ్యాపకము ద్వారామార్గదర్శియై తిరిగి పూర్వపు పేరు ప్రతిష్ఠలు-కీర్తి- భాగ్యభోగములు అనుభవింప వచ్చును. ఇది అంతయు ఇప్పటి రాచకీయములై భవిష్యత్తునందు - వర్తమానచరిత్రగ పరిణమింపగలదు. ఇట్టి చరిత్రలను వ్రాయువా రెందరో మహానుభావులు పుట్టగలరు. పుట్టియే యున్నారు. మన గోవిందాచార్యులుగారు - రాచకీయనాయకులు, గ్రంథకర్త, కవి, చరిత్ర కారుడు అగునని మనము కలగన్నామా? నేటి బాలురు రేపటి నాయకులు, వేత్తలు, మార్గదర్శులు అయ్యెదరు. ఇదియే చరిత్రయొక్క రహస్యము. ఇట్టి రహస్యములతో నిండిన ఈ 1500 పుటలున్న మాతృభాషలో విద్య గఱప బడు నూతన శకములో - బాలురకు తేజోవంతముగను-యువకులకు మనోవికాస వంతముగను - వృద్ధులకు పూర్వ సంభవములను స్మరణకు తేగలుగు నట్లును ఉప కరింప గలవను పూర్ణ విశ్వాసముతో గ్రంథకర్తను తిరిగి ఆంధ్ర లోకమునకు పరిచయము చేయ సాహసింపు చున్నాడను.

2 — 10 — 48
మద్రాసు

భో. పట్టాభి సీతారామయ్య

# అభిప్రాయములు

## ఆచార్య గోగినేని. రంగా

(ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాధ్యక్షులు)

నా మిత్రులు, దేశభక్తులు స్వాతంత్ర్యవీరులు, అనుభవజ్ఞులు, రాజకీయ నాయకులు, ఈనాడు శాసనసభా పెత్తందారులలో నొకరును నగు గోవిందాచార్యులుగారు రచించిన "భారతదేశ రాజ్యాంగచరిత్ర" యందు కొన్ని భాగాలు చదివాను. ఎంతో ఆనందము బొందినాను. ఒక విధంగా గర్వము పొందుచున్నాను; పోతన్నవలె స్వయం కృషిచేతనే పాండితిని పొందిన కాంగ్రెసు భక్తులలో నొకరగు శ్రీగోవిందాచారి ఇంతటి యుద్గ్రంథమునువ్రాసి, ఆంధ్రదేశమందలి వయోజనులకు, విజ్ఞాననిధులకు గూడ యింతటి విజ్ఞాన ప్రదానము చేయగల్గుచున్నారుగదా యని.

1933 లోనే "భారతదేశార్థిక చరిత్ర" అనే గొప్ప గ్రంథమును వ్రాసి ప్రకటించిరి. ఆధునిక రాజకీయార్థిక జీవిత సమస్యల నెదుర్కొనవలసిన మన ప్రజలకు, ప్రచారకులకు, వారి నాయకులకు పండితప్రకర్షణ, సత్యసమాచారము, సూత్రానుభవవిమర్శన, స్వతంత్రాలోచనా ప్రకటన, అనుభవైకమైన సలహా సంపత్తితో కూడిన గ్రంథములు మన తెలుగునందే యెన్నో కావలసియున్నవి. ఈలోటును పండితులు, అనుభవజ్ఞులు, సత్యముసందభిరుచి కల్గినవారు తీర్చుటకు పూనుకొనిననే ఆంధ్రుల విజ్ఞానధన మభివృద్ధి చెందగలదు. అట్టి అత్యవసరసేవ చేయువారిలో మన గోవిందాచార్యులు ముఖ్యులు.

ఐతే పండితోత్తములకు, విశ్వవిద్యాలయవిద్యార్థులకు ప్రత్యేకముగా ఉపయోగించుటకై శ్రీ గోవిందాచార్యులుగారు ఈ రెండు గొప్ప గ్రంథములు వ్రాసినందులకు ఆంధ్రులంతా కృతజ్ఞులు. వారి శైలి సరళముగను, గంభీరముగను, సుందరముగను ఉన్నది. వారి చిన్నచిన్న వాక్యాలు యెంతసొంపుగా

నున్నవి! వారి యుత్సాహోద్రేక పూరితములైన వర్ణన లెంత సౌందర్య రేఖల వెదజల్లుచున్నవి! మహర్షులపై, మహాత్ములపై వారికుండు అభిమానము నెంత చతురతగా చరిత్రయందు పొందు పరచిరి !

వెనుకటి రోజులలో చరిత్రలంటే తేదీలు, రాజులు, రాజప్రతినిధుల పేరులు, పెండ్లి పేరంటములు, అశ్వమేధయాగములు, యుద్ధరంగములందలి భీభత్స జీవితపు వర్ణనలతో సరి. ఈనాటి అభివృద్ధి కారకమగు ధోరణిలో శ్రీ గోవిందాచారి తేదీలను మరువక, క్రమానుగత భారతజాతి జీవిత పరిణామమును చూపెట్టుచునే వివిధ రంగములందు తాను పొందుచున్న అభివృద్ధి, అనుభవాలు, ఆశయాలను జాగ్రత్తగా, పొదుపుగా లిఖించుచూ భారతీయులు తమ సర్వతో ముఖాభివృద్ధికొఱకెటుల ఆర్థిక రాజకీయ జీవిత వ్యవహారముల సాగించుచున్నారో తమ దివ్యలేఖిని ద్వారా లిఖించిరి. ఈగ్రంథమును వ్రాసినందుకు వారు, ప్రకటించు చున్నందులకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు, పొందు చున్నందులకు ఆంధ్రులు అభినందనీయులు.

భారతీయ రైతాంగ విద్యాలయం నిడుబ్రోలు

రంగ

31 - 10 - 48

# మనవి

ఆరంభము — సెప్టెంబరు 1937 వ సంవత్సర మీ పుస్తకరచన కారంభము. 1935 వ సంవత్సర రాజ్యాంగశాసన మమలులోనికి వచ్చు వఱకుగల విషయరచనము 1939 వ సంవత్సరము నందే ముగిసినది.

ధనములేమి, ప్రపంచ సంగ్రామము, సం 1940 ర సత్యాగ్రహ సమరము—నా కారాగృహ నివాసము — తదనంతర శరీర అనారోగ్యము - యివన్నియు ముద్రణమున కడ్డుతగిలినవి. 1946 వ సంవత్సరమున ముద్రించుటకు సర్వ ప్రయత్నములను జేసితిని. ఇంతలో శ్రీ ఆంధ్ర విశ్వవిద్యాలయమువారీ గ్రంథమును ముద్రింప సంకల్పించిరి. ఇట్లు ముద్రణమున విధికృతముగ లభించిన, విరామము (1939 నుండి 1948 వఱకు) మంచిగ పరిణమించినది.

విషయము — సం 1600 మొదలు 1947 ఆగష్టు 15 వ తేదీవఱకుగల ఆంగ్లేయయుగ భారతరాజ్యాంగ చరిత్రమంతయు సంపూర్ణముగ వ్రాయుట కవకాశ ముదయించినది. ఆంగ్లేయు లీగడ్డపై కాలుపెట్టినది మొదలు, మరలిపోవు వఱకును, వ్రాయ గలిగితిని.

లక్ష్య లక్షణములు — 1. భారతీయ రాజ్యాంగశాసన పరివర్తనము. 2. పరిపాలనా విధాన పరిణామము. 3. స్వరాజ్యోద్యమ విజృంభణ విధానము వర్తమానస్థితు (Indian Constitutional History, Indian Administration and Indian politics) లిందు వివరింప బడినవి. ఈమూడును పరస్పరాధారములు — ఈమూడింటి సమన్వయ చరిత్రయే, సంపూర్ణ భారతరాజ్యాంగ చరిత్ర. దీనిని సంక్షిప్తముగను సమగ్రముగను - పొందుపరచుటయే లక్ష్యము. రాజ్యాంగ పరిషత్తుచే లిఖింప బడిన, స్వరాజ్య రాజ్యాంగముగూడ అనుబంధముగ నున్నది.

మొదట 1935 వ సంవత్సర రాజ్యాంగముతో మాత్రమే ముగింప

సమకట్టిన యీ గ్రంథము, స్వాతంత్ర్యోదయము వఱకు, తనుపరి పెంపొందినను విషయమునందు పునరావృత్తిదోషము గలుగలేదు. 1935 వ సంవత్సర రాజ్యాంగ శాసనమే సవరింపబడి స్వరాజ్య రాజ్యాంగ శాసనమైనది. ఈ రాజ్యాంగ శాసనమే స్వరాజ్య రాజ్యాంగమునుగూడ ప్రతిబింబించు చున్నది. 1935 వ సంవత్సర రాజ్యాంగ శాసనమును గుఱించిన విపుల విమర్శనము నంతయు నట్లేయుంచుట కిదియేకారణము. పాఠకులకు - చరిత్రకారులకు - రాజ్యాంగతత్వవేత్తలకు నెన్నియో రీతుల తోడ్పడగల యీ విమర్శనము - ఆంగ్లేయరాజనీతికి దర్పణముగనున్న - యీ విమర్శనము తగ్గించెడి యవసరము గోచరింపలేదు.

రాజ్యాంగతత్వమునకు సంబంధించిన ఆంగ్లేయ సాంకేతికశబ్దములకు శక్తి వంచనలేకుండగ సంస్కృత సమన్వితమగు తెలుగుమాటలు సమకూర్పబడినవి. మామూలు చదువరులకు - విశ్వవిద్యాలయ విద్యార్థులకు - చరిత్రకారకులకు - ఎల్లర కీ గ్రంథ ముపయోగము కావలెననెడి సంకల్పమే పుస్తకరచన యందలి లక్ష్యము.

చదువనేర్చినవారికెల్ల సుబోధకముగ నుండవలయుననియు, వీలగునంత వరకు ఆంధ్రభాషా సాంప్రదాయముల జనదాటరాదనియు, విషయ కాఠిన్య మునకు భాషాకాఠిన్యము తోడ్పడరాదనియు పుస్తక రచనయందాదినుండి అంత్యము వఱకునుచేసిన కృషి. వ్యాకరణ మచ్చటచ్చట సడలించితిని. అందులకు క్షంతవ్యుడను.

ఏగ్రంథమైనను, తద్గ్రంథకర్త జీవితమున కొక్కింతమైన దర్పణముగ నుండుట తప్పనిసరి. గత ముప్పది సంవత్సరముల నుండియు, దేశసేవయే జీవితపరమావధియై, తనసర్వస్వ మర్పించిన వ్యక్తికి, ఆంగ్లేయ పరిపాలనమును గుఱించియు, రాజ్యాంగపరివర్తనమును గుఱించియు కొన్నినిర్ణీతాభిప్రాయము లేర్పడకమానవు. గాంధీమహాత్ముని, అనుచరునిగను, దేశీయ మహాజన సభా సభ్యునిగను, దేశసేవకు గడంగుటచే, ఆనాయకుని భావములును, ఆసంస్థయొక్క

ఆదర్శములును - గ్రంథకర్త నావహించియున్న మాట సత్యము. అయినను ఆ నిర్ణీతభావములకే స్థానమొసంగక, యీగ్రంథమాంద్యంతము - నిష్పాక్షిక చరిత్రకారుని దృక్పథముననే వ్రాయుటకు యత్నింపబడినది.

ఈ లక్ష్యలక్షణములయం దెంతవఱకీ గ్రంథకర్త కృతకృత్యుడాయె నను విషయమును పాఠకులే నిర్ణయింపనర్హులు.

సమర్పణము

పరిశోధనలతో గూడిన యుద్గ్రంథ రచనయందుగల కష్టములు గ్రంథకర్తలకే విశదము. ఆకష్టము వివరింప నలవిగానిది. విశ్వవిద్యాలయ పోషణముననే యిట్టి కృషి జరుగవలయును. ఎప్పటికప్పుడు నూతన గ్రంథముల సేకరించుటకును, తదేక దృష్టితో నిర్వికల్పముగ గ్రంథమును ముగించుటకును - ఎంతయో, సాధన సంపత్తి, సావకాశము లత్యవసరములు. అయినను, మిత్రుల తోడ్పాటునను - భగవదనుగ్రహముునను పుస్తకరచనము పూర్తిజేసితిని. ముద్రణమున కన్నను తుదకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు పూనిరి. ఇందులకు సిండికేటు వారి కెంతయు కృతజ్ఞుడను. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ రామలింగారెడ్డిగారు విజ్ఞానులు. విజ్ఞానాభిమానులు. రసజ్ఞులు. సుహృదయులు. శాస్త్రవిషయముల నాంధ్రమునందు వ్రాయుటలో మొట్టమొదటివారు. తదితరులకు మార్గదర్శకులు. వీరి యాదరణ - ఆశీర్వాదములతో, నీ గ్రంథమును, మహాతెలంగాణమున కర్పించుచున్నాను. ఈ పుస్తకమందలి సర్వహక్కులను, నిరపేక్షతో, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారికి హృదయ పూర్వకముగ సమర్పించుచున్నాను.

కృతజ్ఞత

నాకోరికను మన్నించి తొలిపలుకు వ్రాసిన శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారికిని, ఎన్నియో పను లున్నను, తీరికజేసికొని వాత్సల్యముతో, ఉపోద్ఘాతమును వ్రాసిన శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారికిని, మైత్రితో అభిప్రాయముల నొసంగిన శ్రీయుతులు ఆచార్య రంగా గారికిని మామిడిపూడి వెంకటరంగయ్యగారికిని నేనెంతయు కృతజ్ఞుడను.

ఇతరమిత్రులు — శ్రీయుతులు, తుమ్మలపల్లి వీరభద్రరావు సత్యనారాయణ మూర్తి సోదరులు - డాక్టరు బెండపూడి పేరరాజుగారు - ఈదర వెంకయ్యపంతులుగారు - కసమతవ సూర్యప్రకాశరావు జమీందారుగారు - శానం నాగభూషణంగారు - ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాదరావుగారు - కలగర కృష్ణారావుగారు - వీరమాచునేని వెంకటనారాయణగారు - అక్షరక్రమ విషయసూచిక వ్రాసిపెట్టిన శ్రీ బి. సింగరాచార్యులుగారు మొదలగు మిత్రులిట మరువరానివారు - నా కృతజ్ఞతార్హులు.

సలక్షణముగ నీగ్రంథము నచ్చువేసిన సరస్వతీ ముద్రాక్షర శాలాధికారులగు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగా రభివందనీయులు.

ఇట్లు

ఆత్మకూరి గోవిందాచార్యులు

గ్రంథకర్త

28 – 11 – 1948

# భారత రాజ్యాంగ చరిత్ర - ఆదిఖండము

## విషయసూచిక

### 1. వ పర్వము


| | | పుట |
|---|---|---|
| ఆంగ్లేయ సర్వాధికారము | ... | 1 |
| 1 మహావిచిత్రము ... | ... | 1 |
| 2 హిందూదేశమునకు ద్రోవకూడవీరికి తెలియదు | | 2 |
| 3 హిందూదేశము జయింపబడినదా? | ... | 4 |
| 4 ఆంగ్లేయపరిపాలనము-హిందూదేశప్రయోజనము | | 6 |
| 5 రాజ్యాంగపరివర్తనము ... | ... | 11 |
| 6 కుంపెణీనిర్మాణము ... | ... | 11 |
| 1 1వ అధికారపత్రము... | ... | 13 |
| 2 జాయింటుస్టాకు కంపెనీసూచనలు | ... | 15 |
| 3 1635. వర్తకపుపోటీ ... | ... | 16 |
| 4 1654. లాభము ... | ... | 16 |
| 5 పార్లమెంటు నిర్ణయము | ... | 16 |
| 6 గుత్తవ్యాపారము ... | ... | 16 |
| 7 ఫ్యాక్టరీల నిర్మాణము - భూసంపాదనము | ... | 17 |
| 1 సూరతు ఫ్యాక్టరీ ... | ... | 17 |
| 2 మచిలీపట్టణము ... | ... | 19 |
| 3 మదరాసు ... | ... | 20 |
| 4 కలకత్తా ... | ... | 20 |
| 5 బొంబాయి ... | ... | 21 |
| 8 కంపెనీ అధికారవిస్తీర్ణత | ... | 22 |
| 1 అధికారపత్రము ... | ... | 22 |

2 వ అధికారపత్రము .... .... 23
3 వ అధికారపత్రము ... ... 23
4 వ అధికారపత్రము ... ... 24
5 వ అధికారపత్రము ... ... 24
6 కంపెనీకి రాజ్యాధికారము సంక్రమించినది ... 24
7 పార్లమెంటు విచారణ ... 26
8 పార్లమెంటు తీర్మానము ... 26
9 పార్లమెంటు తీర్మానము పౌరులసమానహక్కులు 27
10 పార్లమెంటు రుణముచేయుట ... 27
11 రెండుకంపెనీలకు రాజీ ... 28
12 గొడాల్ఫిన్ తీర్పు ... ... 29
13 సీమపార్లమెంటువారి బాధ్యత ... 30
9 ఫ్యాక్టరీలు - కంపెనీ పరిపాలనము ... 31
1 బొంబాయి సూరతు మదరాసు ... 31
2 బొంబాయి రాష్ట్రము - అధికార పరివ్యాప్తి - సైనిక శాసన పరివర్తనము ... ... 36
3 సివిలు క్రిమినలు శాసనములు ... 38
4 సివిలు తగవులు ... ... 41
5 క్రిమినలు తగవులు ... ... 42
6 కోర్టు ఎత్తివేయబడుట ... 43
7 నావికా న్యాయస్థానము ... 44
8 బిల్లుగారి నూతననిర్వచనము ... 45
9 కౌన్సిలు న్యాయపరిపాలనము ... 47
10 న్యాయ విచారణ మరల ప్రారంభము ... 47
11 కోర్టులమధ్యగల వ్యత్యాసము ... 48
12 ఉత్తరువులు మేయరుకోర్టులు ... 49
13 మేయరుకోర్టు అధికారములు ... 50
14 మదరాసు శాసనాధికారము - అధికార పరివ్యాప్తి 53

15 కలకత్తా శాసనాధికారము - అధికార పరివ్యాప్తి ... 58
16 న్యాయశాఖ - దరన్యాయసులు ... 61
10 స్వదేశరాజులు కంపెనీ పరివర్తనము ... 62
1 కర్నాటక యుద్ధము ... 63
2 ప్లాసీయుద్ధము ... ... 64
3 కంపెనీ జమీందారగుట ... 65
4 క్లైవుజాగీరు ... ... 65
5 మీర్కాశీము పదభ్రష్టుడగుట ... 67
6 బక్సారుయుద్ధము ... ... 69
7 దివానీ ఒడంబడిక 1765 ... 70
8 దివాన్‌గిరీ పరిపాలన ... 72
9 ద్వంద్వ పరిపాలనా నిర్వహణము ... 73
11 కంపెనీ రాజ్యాంగము - పరిపాలనము ... 77
1 దివానుగిరీ పరిపాలన మార్పులు లేక వారను హేస్టింగ్సు బెంగాలు పరిపాలనము ... ... 77
2 ఢిల్లీ పాదుషా హేస్టింగ్సు — కప్పము నిరాకరించుట 83
12 రిగ్యులేటింగు శాసనము ... 85
1 భయోత్పాతము ... ... 85
2 పార్లమెంటరీ కమిటీ నివేదికల నిర్ణయము 88
3 రిగ్యులేటింగు శాసన మమలులోనికి వచ్చుట 90
4 పరిపాలనా విధానమందలి మార్పులు ... 90
5 గవర్నరు జనరలు - వంగము ... 92
6 సుప్రీముకోర్టు ... ... 93
13 వారను హేస్టింగ్సు - గవర్నరు జనరలు పరిపాలనము 96
1 నందకుమారుని ఉరిశిక్ష ... 97
2 మదరాసు రాష్ట్ర పరిస్థితులు ... 101
3 బొంబాయిప్రభుత్వము ... 105
4 వంగపరిపాలనము ... 109

5 ఇంపీగారిని విచారించుట ... 112
6 హేస్టింగ్సుపై నేరారోపణము ... 118
14 పిట్టుశాసనము పార్లమెంటు అధికారపరివర్తనము 122
1 1779 - 1780 సంవత్సరముల శాసనములు ... 122
2 విచారణసంఘము 1781 వ సంవత్సరపు శాసనము 123
3 రహస్య విచారణ సంఘఫలితములు ... 124
4 క్రొత్తబిల్లులు - ఫాక్సుగారిబిల్లు ... 125
5 పిట్టుగారిబిల్లు ... 128
6 కమీషనరులబోర్డు; నిర్మాణము; అధికారము 128
7 హిందూదేశ రాజ్యాంగము నందలి మార్పులు 129
8 రాష్ట్ర ప్రభుత్వములు ... 130
9 ఉద్యోగములు - కంపెనీవారి నియామకము... 130
10 న్యాయపరిపాలనము. ... 132
11 పిట్టుశాసన సవరణశాసనము. ... 134
12 పిట్టుశాసనము. రెండవసవరణ శాసనము. ... 134
13 సైన్యము; రాజ్యాంగసమస్య ... 135
14 1793 సం॥ అధికారపత్రము ... 136
15 ఇండియాకౌన్సిలు అనంతరపరిపాలనము 1786 - 1793 137
1 కారనువాలీసుయొక్క ముఖ్యాదర్శము ... 138
2 మొగలాయి చక్రవర్తి దుస్థితి ... 139
చక్రవర్తి కొసగవలసినకప్పము లెగగొట్టుట ... 140
3 సూరతును దిగమ్రింగుట ... 141
4 కర్నాటకరాజస్థితి; తంజావూరు ... 142
5 నైజాము ... ... 145
6 టిప్పుసుల్తాను మైసూరురాజ్యము ... 146
7 మద్రాసుప్రభుత్వమును బర్తరపుచేయుట గవర్నరు జనరలు విపరీతాధికార ప్రయోగము ... 148
8 ఫ్రెంచివారిపై దండయాత్రలు ... 149

9 కంపెనీసైన్యము; చక్రవర్తి సైన్యము ... 150

16 కారనువాలీసు రాజ్యాంగ సంస్కరణములు ... 150

1 వర్తకశాఖ ... ... 151

2 రివిన్యూశాఖ; న్యాయశాఖ ... 151

3 కలెక్టరుల జీతబత్తెములు అధికారములు ... 152

4 న్యాయశాఖ ... ... 152

5 పోలీసుశాఖ; న్యాయశాఖ ... 153

6 పెరమనెంటు సెటిలుమెంటు ... 155

7 కారనువాలీసు సంస్కరణముల గుణాగుణములు 156

17 కంపెనీవారి సామ్రాజ్యస్థాపనము ... 158

1 షోరు - గవర్నరు జనరలు 1793-98 ... 159

2 లార్డు మారింగుటను, లేక వెల్సలీ 1798-1805 161

3 వెల్సలీ సంకల్పసిద్ధి ... ... 163

4 తంజావూరు - 1779... ... 163

5 కర్నాటకము - 1801... ... 163

6 అయోధ్య - 1801 ... ... 164

7 సూరతు - 1799 ... ... 164

8 మైసూరు శ్రీరంగపట్టణము 1799 ... 164

9 నైజాము - 1800 ... ... 165

10 మహారాష్ట్రులు 1802-1803 ... 165

11 ఒరిస్సా 1803 ... ... 166

12 ఆగ్రా - బ్రోచి - డిల్లీ — 1803 ... 166

13 హోల్కారుతో యుద్ధము - 1805 ... 166

14 భరతపురం రాజా — 1805 ... 166

15 డిల్లీ సుల్తాను వెల్సలీ ప్రవర్తనము ... 166

16 కారానువాలీసు రెండవ పరిపాలనము ... 167

17 బార్లో గవర్నరుజనరలు 1805-1807 ... 168

18 హోల్కారు సింధియాల ఒడంబడికలు 1805-1806 168

# సాంకేతిక శబ్ద ప్రయోగ నిర్వచనము:-

## (Some Expressions Explained)

కొన్ని సాంకేతిక శబ్దప్రయోగముల నిర్వచనము గ్రహింపవలసి యున్నది.

గవర్నరుజనరలు — గవర్నర్లు (1935) రాజ్యాంగ శాసనము ననుసరించి నాలుగువిధములగు విధములను నిర్వహింప గలిగియున్నారు.

(1) He is required to act "in his discretion"

అనగా గవర్నరులుగాని గవర్నరు జనరలుగాని మంత్రివర్గము వారి సలహా తీసికొననవసరము లేకుండ లేక బాధ్యతలేకుండ "స్వేచ్ఛతో" నిర్వర్తింప గలిగిన యధికారము లేక విధి.

"In his discretion" స్వేచ్ఛతో లేక స్వయంనిర్ణయము.

(His authority or Jurisdiction is exclusive (ie) outside the ministerial sphere. He may or may not receive advice from anybody and can act according to his sole wish.)

(2) He is required to act "in his discretion after consultation" అనగా గవర్నరులు లేక గవర్నరుజనరలు నిర్ణీతమగు నొకరితోగాని లేక కొందరితోగాని ఆలోచించిన పిమ్మట స్వేచ్ఛతో లేక స్వయంనిర్ణయ ప్రకారం నిర్వర్తింపవలసిన విధి లేక అధికారము అనగా మంత్రివర్గముతో ఆలోచన చేసితీర వలయునను విధి కలదుగాని వారి సలహా ననుసరించియే వర్తించ వలయునను నిబంధనలేదు. ఆలోచనానంతరము స్వేచ్ఛతో కార్య నిర్వహణ మొనరింప గల్గును. (He is required to act in his discretion after consultation with a specified person or a body of per-

## కేంద్రప్రభుత్వము; సమాఖ్యప్రభుత్వము

సంయుక్త రాష్ట్రప్రభుత్వము, హిందూదేశ ప్రభుత్వము, ఫెడర ప్రభుత్వము ఈ ప్రయోగములన్నియు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము సూచించుచు యీపుస్తకమునం దుపయోగింపబడినవి. (Central Govt.)

| | |
|---|---|
| Prime Minister | ప్రధానమంత్రి. |
| The Honourable the Prime Minister ... | మాననీయామాత్యపుంగవుడు. |
| Finance Minister ... | కోశామాత్యుడు. |
| Development Minister | అభివృద్ధిమంత్రి. |
| Education Minister ... | విద్యామంత్రి. |
| Food Minister ... | ఆహారమంత్రి. |
| P. W. D. Minister ... | నిర్మాణమంత్రి. |
| Agriculture Minister ... | వ్యవసాయమంత్రి. |
| Excise Minister ... | మత్తుపదార్థమంత్రి. |
| Public Health Minister | ఆరోగ్యమంత్రి. |
| Secretary ... | సచివుడు. |
| Parliamentary Secretary | సంసత్ సచివుడు. |
| Chief Secretary ... | ప్రధానసచివుడు. |
| Additional Secretary ... | అపరసచివుడు. |
| Joint Secretary ... | సంయుక్త సచివుడు. |
| Deputy Secretary ... | ప్రతి సచివుడు. |
| Under-Secretary ... | ఉపసచివుడు. |
| Assistant Secretary ... | సహాయక సచివుడు. |
| Secretariat ... | సచివాలయము. |
| Legal Secretary ... | న్యాయసచివ. |
| Assembly Secretary ... | శాసనసభా సచివ. |
| House ... | సభ. |

| | |
|---|---|
| Leader of the House | సభా నేత, సభాగ్రహి. |
| The House is aware | సభావిదితము. |
| Assembly | సభ. |
| Legislative Assembly | శాసనసభ. |
| Constituent Assembly | సంవిధాన సభ, రాజ్యాంగ పరిషత్తు. |
| Council | పరిషత్తు. |
| Legislative Council | శాసనపరిషత్తు. |
| Parliament | పార్లమెంటు. |
| Municipal Committee | నగరసమితి. |
| Board | గణము. |
| Chamber of Commerce | వాణిజ్యమండలి. |
| Corporation (ancient word) | నిగమము. |
| Province | ప్రాంతము, రాష్ట్రము. |
| H. E. the Governor | మాననీయ రాష్ట్రపతి. |
| Speaker | శాసనసభా ప్రధాని లేక నియామకుడు. |
| The Honourable | మాననీయ. |
| Mr. Speaker | నియామక మహోదయ. |
| Sir | శ్రీమాన్. |
| Deputy Speaker | ఉపనియామక. |
| President | అధ్యక్షుడు. |
| President of the Council | పరిషత్ ప్రధాని. |
| Deputy President | ప్రతిప్రధాని. |
| Chairman | సభాపతి. |
| Panel of Chairmen | సభాపతుల పట్టిక. |
| Opposition | ప్రతిపక్షు. |
| Leader of the Opposition | ప్రతిపక్ష నేత. |
| Leader of the House | సభాగ్రహి. |
| House | సభ. |

| | |
|---|---|
| Party ... | పక్షము. |
| Independent party ... | స్వతంత్ర పక్షము. |
| Party in power ... | అధికార పక్షము. |
| Member ... | సదస్యుడు. |
| Honourable member ... | మాననీయ సదస్యుడు. |
| List of business ... | కార్యసూచిక. |
| Agenda ... | కథావళి - కార్యావళి. |
| Programme ... | కార్యక్రమము. |
| Members of the Government ... | ప్రభుత్వసభ్యులు. |
| Memorandum ... | స్మారపత్రము. |
| Assembly Secretariat | శాసనసభా సచివాలయము. |
| Questions and answers | ప్రశ్నోత్తరములు. |
| Supplementary question | ప్రత్యుత్తరక ప్రశ్న. |
| Complimentary ... | సంపూరక. |
| Assembly Building ... | శాసనసభా భవనము. |
| Assembly Chamber ... | శాసనసభా సదనం. |
| Lobby ... | సభాకక్ష. |
| Right Lobby ... | దక్షిణకక్ష. |
| Left lobby ... | వామకక్ష. |
| Governor's Box ... | రాష్ట్రపతి ప్రకోష్టము. |
| Assembly Office ... | శాసనసభా కార్యాలయం. |
| Superintendent ... | నిరీక్షకుడు. |
| Assistant Superintendent | ఉపనిరీక్షకుడు. |
| Clerk ... | లిపిక, గుమస్తా. |
| Head Clerk ... | ముఖ్యలిపిక, పెద్దగుమస్తా. |
| Translator ... | అనువాదకుడు. |
| Head Translator ... | ముఖ్యానువాదకుడు. |

| | |
|---|---|
| Shorthand ... | ఆశులిపి. |
| Stenographer ... | ఆశులిపికుడు. |
| Typist ... | ముద్రలేఖకుడు. |
| Typing ... | ముద్రలేఖన. |
| Typed ... | ముద్రలిఖిత. |
| Typed Copy ... | ముద్రలిఖితప్రతి. |
| Copy ... | ప్రతిలిపి. |
| Type ... | ముద్ర. |
| Typewriter ... | ముద్రలిఖి. |
| Memorandum when used as | |
| 1. A reminder ... | స్మారపత్ర. |
| 2. Informal Communication ... | ఉపపత్ర. |
| 3. Instrument drawn up in a brief and compendious form ... | సంక్షేపలేఖ. |
| Memorandum explanatory to the budget ... | ఆయవ్యయ పత్రికావ్యాఖ్య. |
| Administration ... | ప్రశాసనము, పరిపాలనావిధానము. |
| General administration | సామాన్య ప్రశాసనము. |
| Civil administration ... | జానపద ప్రశాసనము. |
| Administration of Justic | న్యాయ ప్రశాసనము. |
| Government ... | ప్రభుత్వము. |
| Central Government ... | కేంద్రప్రభుత్వము. |
| Local Government ... | స్థానీయ పరిపాలనము. |
| Local Self-Government | స్థానిక స్వపరిపాలనము. |
| State ... | రాజ్యము - రాష్ట్రము. |
| Official ... | ఉద్యోగి. |
| Department | విభాగము - శాఖ. |

| | |
|---|---|
| Excise Department ... | మత్తుపదార్థ శాఖ. |
| Police Department ... | పోలీసుశాఖ. |
| Scientific Department | విజ్ఞానశాఖ. |
| Education Department | విద్యాశాఖ. |
| Veterinary Department | పశుచికిత్సశాఖ. |
| Co-operation Department | సహకారశాఖ. |
| Industry Department | పరిశ్రమశాఖ. |
| Aviation Department | విమానశాఖ. |
| Medical Department ... | వైద్యశాఖ. |
| Public Health Department | ఆరోగ్యశాఖ. |
| Agriculture Department | వ్యవసాయ శాఖ. |
| Jails and Convict Settlements ... | కారాగృహములు, నేరస్థుల వసతి. |
| Recommend ... | సిఫారసు. |
| Lay on the table ... | సభా సమర్పణము. |
| Register ... | రిజిష్టరు. |
| Register *vb.* ... | రిజిష్టరీచేయించుట. |
| Security ... | ప్రతిభూతి. |
| Motor vehicle ... | మోటారుకారు. |
| Select Committee ... | ప్రవరసమితి. |
| Statement ... | వివరణ. |
| Proclamation ... | ఘోషణ. |
| Law ... | విధి, శాసనము. |
| Criminal law ... | నేరశాసనము. |
| Legal ... | న్యాయ. |
| Lawful ... | సశాస్త్రీయము. |
| Legislator ... | విధాయకుడు, శాసకుడు, శాసనసభ్యుడు |
| Ordinance ... | ప్రత్యాదేశము. |

| | |
|---|---|
| Act ... | శాసనము, క్రియాకారము. |
| Validation ... | విధికరణము. |
| Election ... | ఎన్నిక. |
| Electoral constituency | నియోజకవర్గము. |
| Elected members ... | ఎన్నిక సభ్యులు. |
| Nominated ... | నియమిత. |
| Nominee ... | నియమితుడు. |
| Oath of allegiance ... | దీక్షా ప్రమాణము (భక్తి - శపథము) |
| Loyalty ... | భక్తి. |
| Allegiance ... | అనుషంగమము, తత్పరత. |
| Expenditure ... | వ్యయము. |
| Non-recurring expenditure | అనావర్తి వ్యయము. |
| Provisional expenditure | అస్థాయీ వ్యయము. |
| Charged expenditure ... | విధాయక వ్యయము. |
| Voted or votable expenditure ... | ఆమోదిత, ఆమోదక వ్యయము. |
| Non-votable expenditure | అనామోదక వ్యయము. |
| Divisible expenditure | విభాజ్య వ్యయం. |
| Non-divisible expenditure | అవిభాజ్య వ్యయము. |
| Contingencies expenditure | సాదరఖర్చు. |
| Famine expenditure ... | కాటక వ్యయము. |
| Capital expenditure ... | పెట్టుబడి. |
| (Normal) new expenditure | (సాధారణ) నవీనవ్యయం. |
| Debt charges ... | ఋణవ్యయం. |
| Account ... | జమా - ఖర్చు. |
| Appropriation account | అంకణా, నియోజితవ్యయం. |
| Audited account ... | అంకేక్షిత లేఖ. |
| Detailed account ... | సవిస్తార లేఖ. |

| | |
|---|---|
| Budget Departments .... | ఆయవ్యయశాఖ |
| Land Revenue ... | భూమిశిస్తు. |
| Excise ... | ఆబ్కారీ. |
| Stamp and Other Taxes and Duties ... | స్టాంపు, యితరకరములు (స్టాంపులు, పన్నులు, సుంకాలు.) |
| Forest Department ... | అటవీశాఖ. |
| Registration ... | రిజిస్ట్రేషను, నమోదు. |
| Irrigation ... | పల్లపుసాగు. |
| Capital outlay on industrial development ... | పరిశ్రమాభివృద్ధికి పెట్టుబడి. |
| Famine Relief ... | క్షామ నివారణ. |
| Pension ... | సేవానంతర భృతి. |
| Stationery and printing | వ్రాతపరికరములు, ముద్రణ. |
| Land survey ... | భూమి కొలతలు. |
| Memorandum explanatory of the budget ... | ఆయవ్యయ వ్యాఖ్యానసంక్షిప్త పత్రిక. |
| General discussion ... | సాధారణ విమర్శన. |
| Abstract Budget ... | సంక్షిప్త ఆయవ్యయం. |
| Heads of Revenue ... | ఆదాయశీర్షికలు. |
| Subsidy ... | అర్ధ సహాయం. |
| Prize ... | పారితోషికము. |
| Donation ... | దానం. |
| Contribution ... | విరాళం. |
| Unit ... | అంగము. |
| Unspent balance ... | అవ్యయ శేషము. |
| Extraordinary charges | అసాధారణ నియమిత వ్యయము. |
| Extraordinary expenditure | అసాధారణ వ్యయము. |
| Capital expenditure ... | పెట్టుబడి ఖర్చు. |
| Recovery ... | కూడదీసికొనుట. |

Receive ... అందుకొను.
Debenture ... ఋణపత్రము.
Guarantee ... హామీ - ప్రత్యభూతి.
Principal ... మూలధనము.
Bank ... బ్యాంకు - కోశాగారము.
Co-operative bank ... సహకారబ్యాంకు.
Public accounts ... లోకలేఖ.
Public finance ... ప్రభుత్వార్థము.
Public service ... ప్రభుత్వసేవ.
Public debts ... ప్రభుత్వ ఋణము.
Budget ... ఆదాయవ్యయ పత్రిక.
Supplementary Budget అనుపూర్వకాదాయవ్యయ పత్రిక.
Abstract budget ... సంక్షిప్త ఆయవ్యయ పత్రిక.
Budget estmates ... ఆయవ్యయ గణనము.
Table of contents ... విషయసూచిక.
Establishment charges సిబ్బందీఖర్చు.
Allowance ... బత్తెము.
Miscellaneous ... చిల్లర.
Local bodies ... స్థానికసంస్థలు.
Debt Services ... ఋణవ్యయము.
Pension ... ఉపకార వేతనం.
Extraordinary item ... అసాధారణ విషయము.
Resolution ... తీర్మానము.
Motion ... ప్రతిపాదన, ఉపపాదన.
Move ... ప్రతిపాదించు.

| | |
|---|---|
| Cut motion ... | సంక్షేప ప్రతిపాదన. |
| Form ... | ఫారము - [illegible]. |
| Reduce ... | తగ్గించు. |
| Omit ... | లుప్తము. |
| Estimate ... | మదింపు. |
| Amendment ... | సవరణ. |
| Lay on the table ... | సమర్పించుట. |
| Report ... | తెలియజేయుట. |
| The question before the House is ... | ప్రస్తావనప్రశ్న. |
| Presentation ... | సమర్పణము. |
| To propose ... | ఉపపాదించు. |
| Proposal ... | ఉపపాదనము. |
| Introduction ... | ప్రవేశము. |
| To resolve ... | నిర్ణయించు. |
| Law ... | న్యాయవిధి. |
| Bill ... | బిల్లు. |
| To pass ... | ఆమోదించు. |
| Speech ... | సంభాషణ. |
| Opinion ... | అభిప్రాయము. |
| Vote ... | సమ్మతి - ఓటు. |
| Clause (part of a sentence) | అంశము. |
| Paragraph ... | ఖండము. |
| Short title ... | సంక్షిప్తనామము. |
| Long title ... | సంపూర్ణనామము. |
| Dispute ... | వివాద. |
| Debate ... | చర్చ. |

| | | |
|---|---|---|
| Discussion | ... | తర్కము. |
| Controversy | ... | వాదప్రతివాదము. |
| Teller | ... | గణకుడు. |
| Ayes | ... | స్వపక్షులు. |
| Noes | ... | ప్రతిపక్షులు. |
| Order | ... | సావధానము. |
| Constituency | ... | నియోజనక్షేత్రము. |
| Nomination | ... | నియామకము. |
| Criminal Law Ordinance | | దండవిధి, అత్యాదేశము. |
| Regulation | ... | నియమము. |
| Guillotine | ... | ముఖబంధము. |

# అభిప్రాయములు

(31 వ పేజీ తరువాయి)

**శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు ఎమ్. ఎ,**

ఆంధ్ర విశ్వవిద్యాలయ రాజ్యాంగ శాస్త్రాధ్యాపకులు (రిటైర్డ్)

మూడు ఖండములతో కూడిన ఈ భారత రాజ్యాంగ చరిత్ర ఆంధ్ర భాషలో ఆధునిక యుగమున వ్రాయబడిన గ్రంథములలో అగ్రస్థానము వహించదగియున్నది. గ్రంథకర్త యగు శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచారి గారు ఏ గ్రంథము వ్రాసినను దానిని సర్వాంగ సుందరముగ రచింపగల ప్రతిభా శాలి. తలపెట్టిన విషయమును సమగ్రముగను సంపూర్ణముగను విమర్శింపక వదలిపెట్టువారు కారు. ఈ లక్షణములు వీరి భారత రాజ్యాంగ చరిత్రయందు స్పష్టముగ కనుపించుచున్నవి. ఇంత విపులముగ నీవిషయమును గురించి రచించినవా రింకొక్కరు లేరు. ఈ గ్రంథములోని విశేషములలో ఇదియొకటి.

దీనిని వ్రాయుటలో వారు వందలకొద్ది గ్రంథములను పరిశీలించిరి. సరియైన ఆధారమును చూపక వారెట్టి అభిప్రాయమును వ్యక్తపరచువారు కారు. ప్రతి అంశమును గురించి ఇతరులు తెలిపిన అభిప్రాయములను క్రోడీకరించుట యందును, అభిప్రాయభేదములున్నప్పుడు వానిలో ఏది గ్రహించతగ్గదో నిరూపించుటయందును వారుచూపిన కౌశలము అద్భుతముగనున్నది. విషయ పరిశోధనమందు వారికిగల శ్రద్ధ ఆసక్తి ఎంతో ప్రశంసింపతగియున్నవి.

రాజ్యాంగ చరిత్రను వివరించుటలో వారిదృష్టి కడు విశాలమైనది. రాజ్యాంగ చరిత్రయందు వివరింపవలసినవిషయము పరిపాలనావిధానము మాత్రమే అయినను ఆయాకాలపు పరిస్థితులన్నియు తెలిసినగాని రాజ్యాంగమందు కలిగిన మార్పులకు గల కారణములు స్పష్టము కాజాలవు. ఈ సూత్రమును వారు ఆధారముచేసికొని బ్రిటిష్‌వారు వర్తకమునకై మనదేశమునకు వచ్చిన తర్వాత క్రమక్రమముగ వారు రాజ్యమును సంపాదించి విస్తరించుకొన్న విషయము. దీనిమూలమున ఇంగ్లండులోని అధికారులలోను అనధికారులలోను కలిగిన అభి

ప్రాయములు — వీనినన్నిటిని గ్రంథమునందు వివరించిరి. రాజ్యాంగమందు కలుగు మార్పులకు బాహ్యాపరిస్థితులలోని మార్పులు ప్రధాన హేతువులన్న విషయము దీని మూలమున వీరు స్పష్టపరచిరి. ఈ పరస్పర సమన్వయ మీ గ్రంథమున కొక అలంకారముగ నున్నది.

రాజ్యాంగము ఎల్లప్పుడు ఒకేతీరున నుండదు. మనుష్యుని శరీరము వలెనే దానికికూడ శైశవము బాల్యము యౌవనము వార్ధక్యము అను అవస్థ లుండును. బ్రిటిష్‌వారు మనదేశమును పాలించుటకు ఏర్పరచిన రాజ్యాంగ విధానమందు ఈ అవస్థలన్నియు కనుపించుచున్నవి. ఒక్కొక అవస్థలో దీనికి ఒక్కొకలక్షణము ప్రధానముగ నుండెను. ఈ వృద్ధి క్షయముల నన్నిటిని గ్రంథకర్త సంపూర్ణముగ వివరించిరి.

నిరంకుశత్వమునందు దృఢ విశ్వాసము గలవారుకూడ ప్రజాభిప్రాయ మును పూర్తిగ తిరస్కరించుట సాధ్యముకాని పని. ప్రజాభిప్రాయము తమకు విరుద్ధముగ నున్నప్పుడు వారు సాధారణముగ రెండుమార్గముల ననుసరింతురు. తమ విధానము నిరంకుశత్వముకాదని సమర్థించుకొనుట ఒకమార్గము. క్రమ క్రమముగ నిరంకుశత్వమును ప్రజాభిప్రాయానుసారముగ మార్చుకొనుట రెండవ మార్గము. బ్రిటిషువారు ఈరెండు మార్గములను అనుసరించిరి. ధర్మకర్తృత్వ మనుపేరట తమ నిరంకుశత్వమును సమర్థించుకొనిరి. 1892 నుండి క్రమక్రమముగ ప్రజాస్వామ్య విధానము ననుసరించి తమ నిరంకుశత్వమును మార్చుకొనిరి. ఈ రెండు మార్గములను గ్రంథకర్తగారు బహువిపులముగ వ్యాఖ్యానించి యున్నారు.

ఇవిగాక ఈ అమూల్య గ్రంథమందు ఎన్నో ప్రశంసనీయములగు సుగు ణము లున్నవి. ఇది సామాన్యగ్రంథము కాదు. బ్రిటిష్ పరిపాలనమునకు సంబంధించిన విశ్వకోశమనుపేరు దీనికి తగియున్నది. ఆంధ్రులలో ఇంతటి మహాగ్రంథమును వ్రాయగలవా రుండుట జాతికంతకు శోభను కలిగించుచున్నది. మహాసముద్రమువంటి ఈ గ్రంథమును మథించి, ఇందులోని అపూర్వాంశములను గ్రహించి ఆంధ్రలోకమంతయు అనుభవింతురుగాక.

మద్రాసు
4 - 12 - 48

మామిడిపూడి వెంకట రంగయ్య

## శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు, ఎడ్వకేటు

సిండికేటు సభ్యులు, ఆంధ్ర విశ్వ విద్యాలయము

శ్రీ గోవిందాచార్యులుగారి భారత రాజ్యాంగ చరిత్ర అమూల్యగ్రంధము. బ్రిటీషువారు యిండియాతో వర్తకము ప్రారంభింప నుద్దేశించినది లగాయతు అనగా 1600 సం॥రం లగాయతు యిండియాలో బ్రిటీషు సామ్రాజ్యము అంత రించిన ఒకసంవత్సరం 15 రోజులవరకు అనగా 31-8-48 వరకు పరివర్తన ములు యావత్తు యిందులో తబిశీలుగా విశదీకరింపబడినవి. అన్ని దృక్పథములు యిందు సమీకరింపబడినవి. యీ 348 సంవత్సరముల చరిత్రకు సంబంధించిన గ్రంధముల పట్టి చూచిన యెడల యీ గ్రంధముయొక్క ఔన్నత్యము, ప్రాముఖ్యత, గ్రంధకర్త చేసిన కృషి మనలను విస్మయము చెందించును. చరిత్ర పరిశోధనా విద్యార్థులకు వేరే గ్రంథాలయము అక్కరలేదు. యీ గ్రంధమే ఒక గని వంటిది. ఇతర దేశీయ భాషలలో యిట్టి గ్రంధ మున్నట్లు కన్పించదు. (Constituent Assembly) రాజ్యాంగ పరిషత్తు కమిటీ వారు తయారుచేసిన రాజ్యాంగ విధానము కూడా యిందులో చేర్చబడినది. ఇట్టి ఉద్గ్రంధము వ్రాసిన శ్రీ గోవిందాచార్యులుగారు అభినందనీయులు.

కాకినాడ
డిశంబరు '48

లక్కరాజు సుబ్బారావు

---

వందేమాతరం

# 1. వ పర్వము.

# ఆంగ్లేయ సర్వాధికారము.

(British Sovereignity)

1. మహావిచిత్రము

శ్రీ భారతీయ ఆధునిక రాజ్యాంగపరిణామ మొక మహా విచిత్రచరిత్ర. అనంతకాలచక్రపరిభ్రమణము నందలి వింతలలో గొప్పవింత. "ప్రపంచ చరిత్రలో హిందూ దేశమునందాంగ్లేయులు సామ్రాజ్యమును నెలకొల్పుటకంటె మేటియగు ఆశ్చర్య కథ వేరొకటేదియునులేదు.[1] ప్రపంచ భూభాగములో హిందూదేశము నాల్గవవంతు. ప్రపంచ జనసంఖ్యలో భారతీయజనసంఖ్య అయిదవవంతు. ప్రపంచభూభాగమున సీమదేశ విస్తీర్ణము 1/13 వంతు. సీమదేశ జనసంఖ్య 1/9 వంతు. సీమదేశమునకును భారత భూమికిని మధ్య ఆరువేలమైళ్లదూరము. బ్రిటిషుదీవులు ప్రపంచ భూగోళమునందొక మూలనున్న హిందూఖండమువంటి మహావిస్తీర్ణమైన భూభాగమును సంపాదించుట మానవజాతిచరిత్రయందలి మహాదాశ్చర్య విషయములలో నొకటి. ఎందు విజ్ఞానశాస్త్రమును (Science) కళయును (art) మానవజాతియందు మొట్టమొదటగ పుట్టినవని చెప్పదగునో, ఆకాలమునందు హిందూదేశము పొందుట కెంతసావకాశముగలదో, అంతటి మహదైశ్వర్యమును, నాగరికతయును పొందియుండెనో అట్టి, భారతవర్షము (తూర్పుభాగములు) నాడు అమితమయిన అనాగరిక స్థితియందున్న బ్రిటిషుదీవులలో నివసించుప్రజల పరిపాలనకు తలయొగ్గవలసివచ్చుట సహజముగ గమనింపదగియున్నది" ఇవి 1858 సంవత్సరమునందుగల బ్రిటిషుప్రధానామాత్యుని వాక్యములు.[2]

---

1. The Indian Mutiny 1857 Page 1; By Colnel G. B. Malleson C. S. I.
2. See Viscount Palmerstones speech. House of Commons 12 Feb. 1858.

2\. హిందూదేశమునకు త్రోవగూడ వీరికి తెలియదు.

మొట్టమొదట హిందూదేశముతో వర్తకముసాగించిన పాశ్చాత్యదేశముకూడ సీమదేశముగాదు. క్రీ. శ. 1453 సంవత్సరమున టర్కీ సుల్తాను ఆజ్ఞలవల్ల హిందూదేశమునకును పాశ్చాత్య భూభాగములకును నడుమగల ప్రయాణమార్గము బందుచేయబడినది. హిందూదేశముతో వర్తకమును సాగించికొనుటకై వేరొకమార్గమన్వేషింప వలసివచ్చినది. ఈ పనియందు వాస్కోడిగామా కృతార్థుడయ్యెను. ఇతడు పోర్చుగీసువాడు. సీమవాడుగాడు. పోర్చుగలు నుండి ఆఫ్రికాఖండమునుజుట్టి మొట్టమొదట హిందూదేశమందలి రేవుపట్టణమును చేరగలిగిన వాడితడే. 1498 వ సంవత్సరమున, కాలికట్టు రేవును చేరగలిగెను. అంతటినుంచి ప్రథమమున పోర్చుగీసువారును, పిమ్మట డచ్చివారును హిందూదేశమునకువచ్చి వర్తకమును సాగింపగలిగిరి. ఇంతవరకును, సీమవారికి హిందూదేశమునకుగల సముద్రమార్గముకూడ తెలియదు. హిందూదేశముతో వర్తకవ్యాపారమును సాగించుట లాభసాటిబేరమని యూరపుఖండమునంతకును నాడె తెలియగలిగెను. పోర్చుగీసువారియొక్కయు, డచ్చివారలయొక్కయు వర్తకలాభములను చూచి కన్నుగుట్టువరకు, సీమవారికి హిందూదేశముతో వర్తకముచేయు తలంపుకూడ లేదు.

నాడు, ఇంగ్లండు దేశము నౌకాయుద్ధమున స్పెయిను నోడించినది. తన నౌకాబలమునుజూచి గర్వించుచున్నది. మరియు "తూర్పుదేశములతో వర్తకము చేయుట నాడు సీమకు తప్పనిసరియైనపని. సీమదేశమునందానాడు వ్యవసాయము (Primitive) అనాగరిక పరిస్థితులయందున్నది. తినుబండారముల సరఫరా చాలతక్కువ. కొలదిగమాత్రమే లభ్యమగుచున్న తినుబండారములలో తూర్పు దేశముల సువాసన ద్రవ్యములనుగలిపి, నోటికి రుచియగునట్లొనరించుకొనుట సీమవారికి నాటిగతి.[1] కర్తవ్యమేమి? నాడుయింగ్లండు దేశమున బ్రిష్టలు రేవుపట్టణము ప్రాముఖ్యస్థానము వహింపసాగినది. ఈ పట్టణమునందు గలనావికులు, పూర్వపు సముద్రపు దొంగలసంతతివారు. (Descendents of the old sea robbers) అందువల్ల వారు నిపుణులగు నావికులు, (Pirates and Adventurers)

1. See constitutional History of India, A. B. Keith P. 1.

సాహసగాండ్రు. 1527 సంవత్సరమున బ్రిష్టలుపట్టణమున నొకవర్తకుడు మేయునగ పనిచేసినవర్తకుడగు రాబర్టు థారనుగారు యేడవ హెనరీయగునట్టి సీమరాజునకు వచ్చి మొత్తరదిశగుండ హిందూ దేశమునకు ప్రయాణమార్గమును సముకూర్ప వలెనని నివేదించియుండెను. ఒక అర్థశతాబ్దమువరకు సీమనావికులు వచ్చిమో త్తర దిశయందలి మార్గముగుండ హిందూదేశమున చొరబడ విశ్వప్రయత్నము గావించిరి. వీరిప్రయత్నము లన్నియు నిష్ఫలమయ్యెను. 1578వ సంవత్సరమున హిందూదేశమునుండి లిస్బనునకు తిరిగివచ్చుచున్న పోర్చుగీసు వారినావ నొక దానిని, సర్ ఫ్రాన్సిస్ డ్రేకుయను నాతడువశపరచుకొని యానావను కొల్లగొట్టెను. ఈదోపిడియందు హిందూదేశమునకుపోగల రహస్యమగు సముద్రమార్గమును స్పష్టపరచుచున్న చిత్రపటము లాంగ్లేయునకు లభించినవి. ఈదారి దోపిడివల్ల లభించిన చిత్రపటము ననుసరించియే, ప్రాగ్దేశ సముద్రమార్గము సీమవారెరుంగ గలిగిరి. 1594 సంవత్సరమునందు సర్ జాన్‌లాంకెష్టరు (Sir John Lancastor) గుడ్‌హోపుగుదమును చుట్టితిరిగి జావాద్వీపమును జేరగలిగినాడు.1 బ్రిష్టలు పట్టణముభారతీయ రాజ్యాంగపరిణామ చరిత్రయందు జ్ఞప్తియుంచుకొనతగిన, విషయములలో ముఖ్యమైనది. ఇదియే సీమకును, భారతికిని, మొట్టమొదటగ సంబంధముగలిపినది. (పిమ్మటగూడ యీపట్టణముననే శ్రీరాజా రామమోహన రాయులు కీర్తిశేషులైరి. )

1599 సంవత్సరము సెప్టెంబరు 22 తేదీని ఫౌండర్సుహాలునందు మేయరు గారి యధ్యక్షతను, లండనువర్తకులు సమావేశమై హిందూదేశముతో వర్తకముచేయు సంఘమునొకదానిని స్థాపింప తీర్మానించుకొనిరి. ఈసంఘమునకు 1600 సంవత్సరము డిశంబరు 12 వ తేదీని ఎలిజబెత్తురాణీగారు ఆజ్ఞాపత్రము నొసంగిరి. ఇదియే యీస్టుఇండియాకంపెనీ యని పిలువబడసాగినది.2 ఈకంపెనీయందు మర్యాదస్థులెవరును చేర్చుకొనబడరనియు, వారితోపాటి సాహసికులనుమాత్రము చేర్చుకొనుచుండరనియు, పెద్దమనుష్యులు చేర్చుకొనబడుచో

1. See Rise of the Christian power in India page 24.

2. Governors and company of Merchants of London Trading into the East Indies.

తమసాటివారు పెట్టుబడి పెట్టనియ్యము, కంపెనీ వారు తీర్మానించుకొనిరి.1 ఈవిధముగ లండను నగరమునందలి వర్తకులు తూర్పుదీవులతో (East Indies.) వర్తకముచేయు స్థాపించుకొనిన సంఘము హిందూదేశమున సామ్రాజ్యము స్థాపించునని యూహింపతగిన సూచనయుకూడ నేమియులేదు.2 దీనిననుసరించి యీకంపెనీ దుండగీడులకంపెనీ యనియు అనుభ్యాదస్థులకంపెనీయనియు తెలియుచున్నది. ఈకంపెనీకి ఆజ్ఞాపత్రమొసగుటకు రాణి 15 నెలలకాలము నిదానించినది.

**3. హిందూదేశము జయింపబడినదా ?**

అయినను కంపెనీ రాజ్యస్థాపన మెట్లుచేయగలిగినది ? ఆంగ్లేయులు భారతీయులనుజయించి స్వాధీనముచేసికొనిరని కొందరనుకొనెదరు. కొందరాంగ్లేయరాజకీయకోవిదులు మొన్న మొన్నటిదాక యిట్లే ప్రకటింపసాగిరి. "భారతదేశము సీమవారి సునిసితఖడ్గధారలచే జయింపబడినది. సునిసితఖడ్గధారలచే అదిమిపట్టి యుంచబడుచున్నది" యని హిందూదేశరాజ్యాంగ కార్యదర్శిగ పనిచేసియున్న లార్డు బర్కెనుహెడ్గా రొకప్పుడు నుడివిరి.3 "హిందూదేశమంతయు గాని, లేక అందలి విశేషభాగముగాని, సీమదేశముచేత ఎన్నడునుజయింపబడలేదు. ఇది జ్ఞప్తియం దుండవలయును. సీమదేశస్థులు, హిందూదేశమున నెన్నడును దండయాత్రలు వెడలి (Role of conquerors) యుండలేదు."4 ఆసియా ఖండవాసుల నడవడికయందుగల లోటుననుసరించి హిందూదేశమును జయించితిమని చెప్పవలయును గాని, మనయొక్క నైసర్గిక విశేషశక్తి సామర్థ్యముల ననుసరించిగాదని మనమువెంటనే యంగీకరింపవలయును. మనము వర్తకమును సంరక్షించుకొనవలయుననిమాత్రమే తలంచుచున్నప్పుడు, లేక అవమానమునకు ప్రతీకారము చేయుచున్నప్పుడును మాత్రమే ఒకరాజ్యమువెంట మరియొకరాజ్యము, పరుగుపరుగున మనయొద్దకు వచ్చినది. బహువిచిత్రముగ,

1. Minutes 3rd October 1690. See Bruces Annals of the honourable East India company vol. I, p. 128.
2. See A. B. keith p. 1.
3. Lord Birkenhead's speech.
4. Political History of India, Sir John Malcolm.

గారడీచేయబడినటుల రాజ్యములు (సీమ) మనకొరకు ఖాళీచేయబడినవి."[1] నిశ్చయముగ గారడీయే జరిగినది. ఈస్టిండియాకంపెనీ, తాను హిందూదేశమును ఖడ్గబలముచేత జయింపలేదనియు, హిందూదేశ ప్రజల యవివేకము వల్లనే స్వాధీనము నందుంచుకొన గలిగినదనియు, గుర్తెరుంగుచునే యుండినది.[2] ఈస్టిండియాకంపెనీ డైరెక్టరులు అప్పుడప్పుడుజారీచేసిన ఉత్తరువులను గమనించుచో నీసత్యము తేటతెల్లమగుచున్నది. భారతదేశమున, రాజులొండొరులతో పోరాడుకొనసాగిరి. ఈపోరాటములకుగూడ, రాజ్యకాంక్షకలిగియు వర్తకరూపమున ప్రవర్తించుచున్న మూడవపక్షమే (విదేశీయులు) కారణము. ఈపోరాటములలో ఆంగ్లేయులొకపక్షముజేరి, రెండవపక్షము నోడింపసాగిరి. గెలిచిన పక్షమునుగూడ మరొకసారి సమయముజూచి మోసగించుచు రాజ్యవ్యాప్తిని గావించుకొనిరి. మహారాష్ట్రులలోచేరి పీష్వాను, తక్కుంగలనాయకులగు సింధియా, హోల్కారు మొదలగు నాయకులకును, కలహములను పెంచిరి.

సింధియా నొకమారును, హోల్కారు నొకమారును ఒకరిసహాయమున వారియొకరి నోడించిరి. హిందూదేశ, ఆంగ్లేయరాజ్య చరిత్రమంతయు నిట్టి విపరీత విషయములతో నిండియున్నది.

“మోసగొండితనముతో కళంకపూరితమై యున్నటువంటి, దుష్టభూయిష్టమై అధమాధమ మానవప్రకృతిని ప్రదర్శించుచున్నటువంటి, భగ్నవాగ్దానపరంపరలతో నిండియున్నటువంటి యీస్టిండియాకంపెనీయొక్క చరిత్రనంతయు నిచ్చట తిరచవలసిన పనియు లేదు. హిందూదేశస్థు లొండొరుల కొనరించుకొన్న మోసమును విశ్వాసద్రోహముల నిట తర్కించి పేర్కొనవలసిన యావసరమును లేదు.’[3] ఇవి చరిత్రాత్మక విషయములు. భారతదేశము సీమవారి సునిసితఖడ్గధారలచే జయింపబడలేదను నిశ్చయముంటచాలును.

1. Asiatic journal May 1821. quoted-Rise of christian power in India page 31.
2. B. D. Basu p. 9 colanization of India by Europeons.
3. Dr. Pattabhi Seetaramayya, "The History of the Congress" p. 6.

"ఆంగ్లేయులు భారతీయుల యందు అంతఃకలహములను కల్పించుటయందే ఆంగ్లేయుల విజయము ఇమిడియున్నది. భారతీయులవల్లనే ఆంగ్లేయరాజ్యస్థాపనము గావించుకొనుట వారు చెప్పు "విజయము" న "కథము" "1. భారతభూమి నీయు వారి శౌర్యమున వారిఖడ్గధారలకు గురియై యున్నదను జయింపబడియుండలేదు." కుటిలరాజనీతి చేతనే జయింపబడినది.

4. ఆంగ్లేయ పరిపాలనము. హిందూదేశ ప్రయోజనము.

ఈవిధముగ స్థాపింపబడిన ఆంగ్లేయరాజ్యాధికారము హిందూదేశమునకు ప్రయోజనకారియైనదా? హిందూదేశము బ్రిటిషుపరిపాలనయందుండుట ఒక మహాభాగ్యమనియే కొందరిమతము. ఏనాడు హిందూదేశము ఆంగ్లేయరాజ్యపరిపాలనకు లోబడినదో, ఆనాటినుండి యీదేశము దరిద్రదేవత కునికిపట్టయి, కరువుకాటకముల పాలవాలయై, వీర్యము శౌర్యము మొదలగు పురుషలక్షణములకు దూరమై ఆర్థిక, మానసిక, నైతిక, వైజ్ఞానిక, శారీరక పటుత్వములను నానాటికి గోల్పోవుచున్నదని మరికొందరి మతము. హిందూదేశమునకు బ్రిటిషుదీవులతో సంబంధముగలుగుట, ముడిపడుట, భారతీయులకు అదృష్టముతో గూడిన భగవత్ప్రేరణమని కొందరివిశ్వాసము. ఆరువేల మైళ్ళదూరమునయున్న అత్యల్పమగు దీవులతో, అందుగల వర్తకజాతితో (Nation of shop-keepers) భారతదేశమువంటి విజ్ఞానప్రదమైన సనాతన దేశము, రత్నగర్భమగు మహాభూభాగము ముడిబడుట యొక విపరీత కార్యము. అసహజము. అదృష్టవశమగు భగవత్ప్రేరితముమాత్రము కాజాలదు. "శాపవశమగు భగవత్ప్రేరితమైన కావచ్చును."2 అని మరికొందరి దృఢ విశ్వాసము. భారతభూమి ఆంగ్లేయులచేత పరిపాలింపబడుటవల్లనే, ఆధునిక పాశ్చాత్యవిజ్ఞానము భారతభూమికి లభింపగలిగినదని కొందరిమతము. "హిందూదేశమునందు స్థాపింపబడిన ఆంగ్లేయాధికారమువల్ల, యీదేశము నందింతకు ముందెన్నడును లేని కని విని యెఱుంగని అఖిలభారత సంఘీభావప్రదమగు రాజకీయసంస్థ పరిణామమొందినది. హిందూదేశమునంతటను ఏక కేంద్ర

1. See Indian Administration V. G. kale p. 3.
2. "Indian slavery is a curse of God for the sins it (India) committed to-wards the Untouchables. By Mahtma Gandhi"

ప్రభుత్వము స్థాపింపబడుటవల్ల, భారతీయ చిత్తవృత్తులలో సంపూర్ణమగు మార్పు జరించినది. 1885 వ సంవత్సరములో ప్రారంభింపబడిన, కాంగ్రెసుసంస్థతో విజృంభించిన మహాజాతీయోద్యమము భారతదేశమందలి బ్రిటిషు ప్రభుత్వ ప్రసాదితమైన మహోత్కృష్ట విషయము." కీర్తిశేషులైన దివానుబహదూరు సర్ మోచర్ల రామచంద్రరావు పంతులుగారివలె పైరీతిగ "జాతీయతత్వము" ఆంగ్లేయ రాజ్యాధికారమువల్లనే లభించినదని తలంచువారు మరికొందరు గలరు.1 "ఆంగ్లేయ సంబంధమువల్ల యుత్కృష్టస్థితి జనించినప్పటికిని, ఆంగ్లేయులు సత్సంకల్పులైనప్పటికిని, మహోపకారము చేసియున్నప్పటికిని, లేక చేయ ప్రయత్నించి యున్నప్పటికిని, వెరసి దీసినచో మా దేశమునకు వెరసిఫలితము వ్యతిరేకముగనే యుండును. ఇంగ్లండుతో సంబంధముకలిగి యున్నందుల కెప్పుడైనను వగపవలసియుండును గాని, సంతోషింపవలసిన పనియుండదు. ఇది తీవ్రమగు భాషకావచ్చును. అయినప్పటికి యిదియే సత్యము. ఏజాతియొక్క జాతీయతత్వమును, స్వయంసంరక్షణకు గలశక్తియును, పౌరుషమును వినాశమొనరింపబడినవో, ఆజాతి కందులకు మరేమియు ప్రతిఫలము కాజాలదు."2

"ప్రాపంచకచరిత్రను పరీక్షించుచో, పరప్రభుత్వములకు లోనుగాకుండగనే, పాశ్చాత్య రాజ్యాధికారమునకు లోబడకుండగనే, పాశ్చాత్య విజ్ఞానము నలవరచుకొని, పేరుప్రతిష్ఠలుగన్న దేశములనేకములు గలవు. ఇందులకు జపానుదేశమే యుదాహరణము. నూతనవిజ్ఞానయుగమున భారతభూమి

1. See Development of Indian polity. By Sir M. Ramachandrarao P. 149 of 1917.

2. Despite the Glories of pay Britanica, despite the Noble-intentions of Great Britain, despite all the good that she might have done or tried to do us the balance will be against her, and India will have to regret rather than rejoice that she has ever had any thing to do with England. This may be strong Language; but this is the truth. Nothing can ever make amends to a nation, for the distruction, of its National spirit; and of the capacity to defend itself and the soil from which it springs. "(See the Presidential address of Raja Rampal sing at the 2nd congress.)"

స్వాతంత్ర్యమును గలిగియున్నచో, ప్రపంచమునకంతకును నాయకమణియై విరాజిల్లుచుండెడిది. అస్వాతంత్ర్యమునం గలుగుటవల్లనే, నేటికిని ఆధునిక ప్రపంచవిజ్ఞానమునం దారతీయజాతి వెనుకబడియున్నది." అని కొందరి ప్రతివాదము. హిందూదేశ జాతీయైక్యతకు ఆంగ్లేయులపరిపాలనయే కారణమైనదనియు కేంద్రీకరణ ప్రభుత్వమునకు, ఆంగ్లేయ ప్రభుత్వాధికారమే మూలమనియు కొందరివాదము. అయినను కొంతవరకు కీడులోగల మేలుని యంగీకరింపక తప్పదు. "బ్రిటిషువారలకును భారతదేశమునకును గలిగిన సంపర్కమువలన, భారతభూమికే యైన మేలుకలిగినచో సహదోషముల భారతభూమి కొక్క మేలు గలిగినది. మూడునంతలు భారతభూమి ఏకచ్ఛత్రపరిపాలనకు లోబడినది. ఇట్లు బ్రిటిషురాజకీయవేత్తలచే, వివిధరాష్ట్రసమ్మేళన మనుసరించుటకు పరిపాలనా సౌకర్యములను జూచుకొనుటకే కారణమైనను, ఫలితముమాత్రము భారతదేశమున కనుకూలమైనది. భారతదేశజాతీయత కీ సమ్మేళన మనుకూలముగనున్నది."1. ఈఫలితముకూడ 1947 వ ఆగష్టు 15 వ తేదీపిమ్మట, స్వాతంత్ర్యశాసనము ననుసరించి సడలించినది. భారతావని రెండుముక్కలుగ చీల్చబడినది. సంస్థానములకు స్వాతంత్ర్యమొసంగబడినది. భారతదేశమంతయు కప్పలతక్కెడవలె చేసియే సీమవారువెళ్లిరి. అందుచే, సీమపరిపాలనాఫలితమునర్థశూన్యమనుటనిశ్చితాంశము. కంపెనీ ప్రభుత్వకాలముననే మిగిలిన స్వదేశసంస్థానములు గూడ నమసిపోయి, కంపెనీ చావుటాకింకకు వచ్చియున్నచో నేటిభారత రాజ్యాంగమున కెంతయో సుఖకరముగనుండెడిదని కొందరి ఆధునికులకు అభిమతము. కాలవశమున హిందూదేశ మాసేతుహిమాచలపర్యంతము స్వదేశసంస్థానములనునవి మిగలకుండగ, కంపెనీపరిపాలనము నందు చేర్చబడియే యుండిన, ఆపరివర్తనము నేడు, 1947 సంవత్సరమునందు సుఖకరముగనే యుండెడిదనుట నిర్వివాదాంశము. కాని 17 వ శతాబ్ద ప్రారంభమునుండియు భారతదేశమందలి వివిధరాజ్యముల పరిపాలనము, నేటిస్వదేశ సంస్థానముల పరిపాలనమువలెలేదు. సుభిక్షమై, లక్ష్మీప్రదముగ నుండెడిది. ఆకాలమునుండియు నేటివరకును కొన్ని స్వదేశసంస్థానములింకను, మిగిలియుండుటవల్లనే భారతీయ సర్వతోముఖవిజ్ఞానమచ్చటచ్చట యింకను స్వదేశరాజులచే సంరక్షింపబడి యున్నదను విషయమిట

1. భారతదేశము ఆర్థికచరిత్ర. పే 2140. ఆ. గోవిందాచార్యులుగారు.

మరువరాదు.[1]

ఈవిధముగ, కేంద్రీకరణప్రభుత్వమనే అణుమాత్ర ప్రతిఫలమునకై హిందూ దేశము భరియించిన మూల్యమెంత ? యే యే విధముల భరించినది ? 19 వ శతాబ్దప్రారంభమున అయిరోపాఖండమునందలి పరిస్థితులు, ఇంగ్లండు ఇండియా దేశముల చరిత్రపరిణామమునకు చాలవరకు కారణములయ్యెను....

నెపోలియను బొనాపార్టుపేరు ఆంగ్లేయులకు సింహస్వప్నమైనది. ఈతను ఇంగ్లీషువారి వర్తకమును నాశనమొనరింప దీక్షబూనినాడు. ఈదీక్షతో ఐరోపా దేశపు ఓడరేవులలో బ్రిటిషుసరుకు దిగుమతి కాకుండ నిరోధింపకలిగినది. ఈ ఆర్థిక దుస్థితికి ఆంగ్లేయజాతి తహతహలాడిపోయినది. ఇంగ్లండు అమెరికా దేశమును గోల్పోయినది. ఇంగ్లండు స్వాధీనమునందుగల యితరవలస దేశములు, ఇంగ్లండు నకు కాలాంతరమునుండి భాగ్యవంతముచేయుగలిగిన స్థితియందులేవు. ఇందు వల్లనే తన దృక్పథమును ఇండియావంకకు మరల్చినది. అమెరికా దేశమును కోల్పోయినంతులకు ప్రత్యామ్నాయముగ హిందూ దేశమునందు రాజ్యస్థాపనకు బూనినది. ...... సీమవారిజేబులలోనున్న నొకచిల్లిగవ్వయైననూ వ్యయ పరుపకుండ హిందూ దేశమున స్థాపింపబడుచున్న రాజ్యమే నెపోలియను బొనా పార్టువల్ల ఇంగ్లండునకు సంభవించిన దుర్భరపరిస్థితులనుండి ఆత్మసంరక్షణగావించు కొనుటకు ఇంగ్లండునకు మార్గమైనది.[2]

" యంత్రయుగప్రారంభమున, భారతదేశమువల్ల ఇంగ్లండునకు కలిగిన లాభము నూహించుటకుగాను, 19 వ శతాబ్దమునందు సీమదేశము ప్రపంచమున పారిశ్రామికాధిపత్యము వహింపగలుగుటకు, భారత దేశమునుండి తర్లింపబడిన ధనమే మూలధనమైనదని చెప్పినచాలును."[3]

---

1 స్వదేశరాజ్యముల సుభిక్షస్థితిని దెలిసికొనుటకును, ఆనాటికంపెనీ పరిపాలనమందలి దుర్భిక్షస్థితిని గమనించుటకును వలనుపడు, ఆంగ్లేయ చరిత్రకారుల యభిప్రాయములను దెలిసికొనుటకును, భారతదేశము-ఆర్థిక చరిత్ర, పే 2130 నుంచి 2148 వరకును జదువ వలయును, అ. గోవిందాచార్యులు గారు.

2 P 3. Colanisation of india by Europeans. B. D. Basu.

3 See the History of the Congress. Dr. Pattabhi P 6.

హిందూదేశమునం దుద్యోగస్థులుగ నుండిన సివిలు ఉద్యోగులు. కొందరు సీమదేశమున ఎస్టేట్లను కొని తులలేని ఐశ్వర్యమునం గొల్లాడిరి, వీరినే సీమలో, ఇండియనునవాబులని పిలిచెడివారు. తమ యెస్టేట్లయందుగల పలుకుబడిని వినియోగించియే, పార్లమెంటుసభలో సభ్యులుగా జొచ్చిరి. సీమ రాజ్యాంగమునం దున్నతస్థానము వహింపగలిగిరి. (Pocket Boroughs). 18, 19 వ శతాబ్దములయందు అయిరోపాఖండములో జరిగిన యుద్ధములలో ఇంగ్లండు, భారతీయధనసహాయమువల్లనే జయింపగలిగిననుట నిశ్చయము. ఇన్నియేల ? నేటికిని, రూథర్ఫర్డుగారు చెప్పినట్లుగ (1930 లో) హిందూదేశమునం దుత్పత్తి యగుచున్న వస్తుసంపదయందు రూపాయకొక్కంటికి, అరుఅణాలు, హిందూదేశము సీమదేశమునకు కోల్పోవుచున్నది. భారతదేశమున్నతో, దరిద్ర స్థితికి తేబడినది.1 కేంద్రీకరణ ప్రభుత్వమువల్ల సంఘమున కాధారభూతులైన రైతులు, వర్తకులు, చేతిపనివారు, గృహపారిశ్రామికులు ప్రయోజనమేమియును పొందలేదు. ప్రయోజనమును పొందుటకుమారుగ నశింపచేయబడిరి. భారతదేశ ధనము సీమదేశముచే కొల్లగొట్టబడినదనుటకు సంశయములేదు. ఇది చరిత్ర ప్రసిద్ధాంశము.2 హిందూదేశమును జయించుటకును, హిందూదేశమునం దొనరించిన ఘోరకృత్యములకును మనఆదర్శము ధనమే. గతించిన అరువది సంవత్సరములలోను పదివేల లక్షలపౌనులను (అనగా నూటపదిహేనువేలలక్షల రూపాయిలను) హిందూదేశమునుండి యూర్పు వేయబడినట్లు మదింపు వేయబడు చున్నది. ఇందలి ప్రతిపిల్లింగును రక్తమునుండిలాగి తీయబడినది. ఇది రక్తము తుడిచివేయబడి హంతకులజేబులలో వేసికొనబడినది. అయిననేమి ? "ఈసొమ్ము ఎంత తుడిచివేసినను కడిగివేసినను గూడ, అందుపైగల ఘోరమైన రక్తపుమచ్చ మాసిపోజాలదు" అని హిందూదేశమును జయించిన సర్ ఛార్లెసు నేపియరుగారు తమగ్రంథమున వ్రాసినవ్రాత సత్యము.3

---

1 భారతదేశము—ఆర్థికచరిత్ర చే......చూడుము. ఆ. గోవిందాచార్యులు.

2 See Dutt's Early British Rule and the Victorianage.

3 See "Lights and shadows of Military life" P. 323. Edited by Charle Napir, the Conqueror of Sindh.

5. రాజ్యాంగ పరివర్తనము.

ఇంగ్లీసువారి రాజ్యాధికారమువల్ల భారతదేశమునందు, ఆధునిక రాజ్యాంగపరివర్తనమైన గలిగినదా? వర్తకము నకై వచ్చి తలవనితలంపుగ, రాజ్యస్థాపనకు బూనిరిగదా! రాజ్యములవెంట రాజ్యములను స్థాపింపసాగుటచే సందర్భమునుబట్టి రాజ్యాంగ విధానమును మార్చుకొనుచు వచ్చిరేకాని, నశాస్త్రీయముగ నొకరాజ్యాంగ విధానమును స్థాపించియుండరు. ఆధునికరాజ్యాంగ సూత్రములకు భారత రాజ్యాంగమునందు స్థానము లభింపనేలేదు.

6. భాగములు.

బ్రిటిషు ఇండియారాజ్యాంగ పరివర్తనమును (Growth and evolution) అయిదు భాగములుగ విభజింప వచ్చును. క్రీ॥ శ॥ 1600 మొదలు 1765 వరకు నొకభాగము. 1765 మొదలు 1774 వరకు రెండవభాగము. 1774 మొదలు 1858 వరకు మూడవభాగము. 1858 మొదలు 1938 వఱకు, నాల్గవభాగము. 1938 మొదలు 1945 వఱకు, నయిదవభాగము. 1945 మొదలు 1947 ఆగష్టువఱకు ఆరవభాగము.

1 వ భాగము.
1600 - 1765

మొదటిభాగమున యీస్టిండియాకంపెనీ స్వదేశరాజుల యొద్దనుంచి ఫర్మానాలనుపొంది వర్తకముచేసికొనినకాలము. వర్తకమునకై ఫ్యాక్టరీలను నెలకొల్పుకొనినకాలము.

2 వ భాగము
1765 - 1774

రెండవభాగమున కుంపెణీవారు ఢిల్లీపాదుషాకడనుండి, బెంగాలు, బీహారు, ఒరిస్సాలకు దివానుగిరీ సంపాదించిన కాలము. ఈ రాష్ట్రములలో పన్నులను వసూలుచేయు నధికారమును బడసిరి. 1765 మొదలు కుంపెణీవారు 1774 వరకు, తమంతట తామే హిందూదేశపరిస్థితులను తెలిసికొని, తమ యుద్యోగస్థులతో పరిపాలనమును తామే నడుపసాగిరి. అనగా నింతవరకును, పార్లమెంటు సభ కుంపెణీపరిపాలనలో నెట్టిజోక్యమును గలిగించుకొనలేదు.

3 వ భాగము
1774 - 1858

1774 వ సంవత్సరమునందే తొలిదొల్త పార్లమెంటు ప్రత్యక్షముగ హిందూదేశ వ్యవహారములలో జోక్యముకలిగించుకొని రిగ్యులేటింగు, శాసనము Reguiating Act.

గావించినది. 1784 వ సంవత్సరమునందు పిట్టుయొక్క హిందూదేశ రాజ్యాంగ శాసనము గావింపబడిన నాటినుండియు, పార్లమెంటుసభ హిందూదేశ రాజ్యాంగ విషయములలో ప్రత్యక్షముగ నధికారము చెలాయి పసాగినకాలము జోక్యము గలిగించుకొనుచు వచ్చినది.

1858 - 1938

1857 సంవత్సరమున భారత దేశప్రథమస్వాతంత్ర్య సంగ్రామముజరిగినది. ఇదియే సిపాయీల తిరుగుబాటనబడినది. ఈతిరుగుబాటునకు ఫలితముగ కుంపెనీ పరిపాలనము మారిపోయినది. సీమప్రభుత్వమే హిందూదేశమును పరిపాలింప మొదలు పెట్టినది. ఈనాలుగు భాగములయందలి చారిత్రక రాజ్యాంగ పరిణామముల నొకింత గమనించుచో ఆంగ్లేయసర్వాధికార మేవిధముగ భారతజాతిపై స్థాపింపబడినదియు తెలగలదు ఈ ధర్మకర్తృత్వ మెట్లు నిర్వహింపబడినదియు రుజువు కాగలదు.

1938 - 1945

ఇదియే ప్రపంచ ఘోర సంగ్రామకాలము. భారతావని యందలి, ఆంగ్లేయ ప్రభుత్వాంత్యస్థితిసమయము. ఆంగ్లేయ సర్వాధికార విలయతాండవ మహాఘోర సందర్శన తరుణము. ఆంగ్లేయరాజ్యాంగపరిణామ పంచమావస్థ.

1945 - 47

ఆంగ్లేయరాజ్య మస్తమించినకాలము. స్వరాజ్య ప్రారంభ సమయము.

## 6. కుంపిణీ నిర్మాణము.

భారత దేశమునువశపరచుకొని, భారత దేశముపై సర్వాధికారమువహించుటకై, కుంపెనీవారెన్నియో యుద్ధములనుగల్పించిరి. వాటియందుపాల్గొనుచువచ్చిరి. ఎన్నెన్నియో యొడంబడికలను గావించుకొనిరి. అవసరమగు

చరిత్ర. రాజ్యాంగ పరిణామ సంబంధము.

రాజనీతి నవలంబింపసాగిరి. వివిధములగు కార్యవిధానముల నాచరింపబూనిరి. ఈ చరిత్రప్రమాణవిషయములును, భారతరాజ్యాంగపరిణామమును బరస్పరాధారములు. ఏ చారిత్రక విషయకాలమునం దెట్టిరాజ్యాంగపరిణామము సంభవించినదో గమనించుటకుగాను సందర్భానుసారముగ రాజ్యాంగపరివర్తనముతోపాటు కొన్ని చారిత్రక విషయములనుగూడ స్థాలీపులాకన్యాయముగ గుర్తించుట యవసరము.

1

1 వ అధికారపత్రము. 1600 ; కంపెనీయధికారము.

“స్వీయజాతీయ గౌరవముకొఱకు, దేశీయసంపత్తికొఱకు, నౌకాప్రయాణాభివృద్ధికొఱకు, సామ్రాజ్యప్రయోజనమునకై సక్రమమగు రాకపోకల నభివృద్ధి పరచుటకును” ఎలిజబత్ రాణి కుంపిణీవారికి ప్రథమ అధికారపత్ర మొసగినది. ఈఅధికారపత్రముననుసరించి యీస్టిండియాకంపెనీకి మూడుఅధికారములు సంక్రమించినవి. (1). తననియమావళిని తాను నిర్ణయించుకొను హక్కు గలిగినది. (2) కొన్ని ప్రత్యేకపుహక్కులు లభించినవి. (3) శాసనములుగావించుకొనుట కధికారము సంక్రమించినది.

(1). కేపు గుడుహోపు మొదలు మాగెలెనుభూసంధిమధ్యగల ప్రదేశములలో వర్తకము జేసికొనుటకు యీస్టిండియాకంపెనీకి సంపూర్ణాధికార మొసగబడినది. (2) ఆంగ్లేయరాజ్యమునందుగల శాసనములకు వైరుద్ధ్యములేకుండనుండు శాసనములనుగావించుకొనుటకుగూడ నధికార మొసగబడినది. తీర్మానములనుగావించుకొనుటకును, ఆర్డినెన్సులను జారీజేయుటకును గూడ నధికారము లభ్యమైనది. (3) ఈఅధికారపత్రము 15 సంవత్సరములవరకు నమలునందుండగలదు. కంపెనీ లాభసాటిగ వ్యవహరింపనిచో, రెండుసంవత్సరముల కాలపరిమితిగల ఎరుకనోటీసునిచ్చి కంపెనీ యెత్తివేయుటకు కంపెనీకే యధికారము గలదు. కంపెనీ లాభసాటిగ వ్యవహరింపబడినట్లయిన మరి 15 సంవత్సరముల వఱకు కంపెనీకి అధికారపత్రము పొడిగింపబడునట్లు నిర్ణయింపబడెను. (4) కంపెనీవారి యధికారపత్రమునందు వివరింపబడిన ప్రదేశములలో కంపెనీకి

చెందని వర్తకులుగాని, కంపెనీయనుమతిని బడయనివారుగాని, ఏవిధమగు వ్యాపారమును జరుపరాదు. అట్లు జరుపువారిని శిక్షించుటకు కంపెనీవారి కధికారముగలదు. అట్టివర్తకులఓడలను, ఓడలలోని సరకులనుగూడ కంపెనీ వారు స్వాధీనముచేసికొనవచ్చును. అట్టివారిపై జరిమానాలను విధింపవచ్చును. వారికి కారాగృహశిక్షగూడ విధించుటకు కంపెనీకధికారమొసగబడినది. వీరికి స్వంతముద్రయున్నది. చిరస్థిరాస్తులను గలిగియుండుటకధికారముగలదు. ఈకంపెనీ తనంతతాను ప్రత్యేకముగ వ్యవహరించుకొనవచ్చును. (5) కంపెనీ యందు బాకీపడినసభ్యుల సభ్యత్వమును తొలగించివేయుటకును, నూతన సభ్యులను జేర్చుకొనుటకునుగూడ కంపెనీకి అధికారముగలదు. (6) ఈవర్తక సంఘమునకు ముఖ్యాధికారిగ నొకగవర్నరును, వివిధకార్యక్రమనిర్వహణమునకు గాను 24 ప్రత్యేకకమిటీలను యెన్నుకొని వ్యవహారము సాగించుచుండుటకు నిర్ణయింపబడెను.1 ఈకమిటీలు ప్రత్యేకపు కమిటీలుగావు. "గవర్నరు సహాయార్థమే యెన్నుకొనబడుప్రత్యేకవ్యక్తులు" వారికిగానుప్రత్యేకింపబడిన నౌకా వర్తకమును ఆయుధసహాయమున 'భాగ్యవంతమైనబంగారు' దేశములతో తామే వర్తకముకొనసాగించుకొనుటకై కంపెనీవారు రాణీగారియనుజ్ఞనుబడసిరి. ఈ యధికారపత్రమందలి వారియొక్కవిమర్శము గమనార్హము. నేటిజాయింటు స్టాకుకంపెనీలవలె యీకంపెనీలోసభ్యత్వపు రుసుముగాని, షేరుధనముగాని, కంపెనీమూలధననిర్ణయముగాని సూచింపబడియుండలేదు. ఎంతయోకొంత ధనమొసగినవారందరు సభ్యులుగజేరుచుండెడివారు. అయినను సభ్యులందరకును సమానహక్కులుండెడివి. సభ్యులు తమంతతామే తమషేరుధనము నాధారముగగాని, హిందూదేశమునందు స్వంతవ్యాపారమును సాగించుకొనిరి. ఇతరులను మెంబర్లుగా జేర్చుకొనవలెనను నిర్బంధమేమియునులేదు. ఈకంపెనీ సంకుచితమగు నిబంధనలతో గూడియే స్వలాభమునకై పాటుపడు కంపెనీయైనది. (Close regulated company) ఈసభ్యులబాధ్యత, నిర్ణీతము,

1. (The term "General Court" used in the Charter now means "the ordinary annual meeting of the share holders of the Company, which the Charter required to be held on the first of July or with in six days after that date, The board of Committees corresponds now to "Board of Directors". Committees meant, persons to whom something is committed or entrusted". Mill History Bk. IV. ch. I)

కంపెనీకిసంబంధించిన పరిపాలనపై కంపెనీకి సంపూర్ణాధికారముగలదు. తన సిబ్బందిని మార్చుచుండుటకును, అవసరమగు శిక్షణనునిర్ణయించుచుండుటకును, శిక్షాస్మృతినినిర్ణయించుటకునుగూడ కంపెనీకి యధికారముగలదు. 1

1609 వ సంవత్సరమునందీ కంపెనీకి స్థిరత్వమేర్పడినది. 1 వ జేమ్సు యిందులకై ఫర్మానికతో పనిజేసినాడు. 1612 సంవత్సరమునుండియు నొకవిధ మగు జాయింటుస్టాకు కంపెనీగామారినది. నేటిజాయింటుస్టాకు కంపెనీలకును దీనికిని చాల వ్యత్యాసముగలదు. 1611 వ సంవత్సరము నుండియు కంపెనీకోశమునకు కంపెనీసభ్యులందరును కొంత ధన మొసగుచుండెడివారు. ఈధనమునుండియే ఉమ్మడి (జాయింటుస్టాకు) వర్తకయానములు కొనసాగింపబడు చుండెడివి. (Trade Voyages) ఈవర్తకయానపులెక్కల నప్పటికప్పుడే సరిజూచుకొనుచు లాభములను బంచుకొనుచుండెడివారు. ఉమ్మడివ్యాపారము మాత్రమేగాక వ్యక్తిగతవ్యాపారముగూడ నప్పుడప్పుడు సాగింపబడుచుండెడిది. 2

2 1609. 1 వ జేమ్సు జాయింటు స్టాకుకంపెనీ సూచనలు

కంపెనీకి శాశ్వతాళీయముగ సూరతు, మదరాసులలో జానెడు స్థానము లభించుటవల్లనే పిమ్మట వ్రేళ్లుపాదుకొనగలిగినది. లేనిచో డల పురిటిలోనే సంధికొట్టిపోయెడిది. మరియు, కంపెనీవ్యవహారములు చాలకాల మొకవ్యక్తి చేతనే నిర్వహింపబడినవి. ఇందువల్ల వ్యవహారదక్షత లభించి కంపెనీనిల్చుట కాస్పదమైనది. సర్ థామస్‌స్మిత్ గారే తొలినుండి 1621 వ సంవత్సరమువరకును కంపెనీకి గవర్నరుగ నెన్నుకొనబడుచువచ్చిరి. ఈవిధముగనే సర్ మారిస్ ఎబ్బాటు 1624 మొదలు 1637 వరకును, విలియముకాకేనీగారు 1643 మొదలు 1658 వరకును గవర్నరులుగపనిజేసియుండిరి. (Sir Thomas Smythe, Sir Mornis Shbot and William cockagne).

1635 సంవత్సరమున 1-వ ఛార్లెసు, సర్ విలియము, కోర్టీనుగారి ముతాకు తూర్పుదీవులలో వర్తకము గావించుకొనుటకై యొసంగిన లైసెన్సు

1 (For full particulars regarding the charter, see Mukharjee (I. P. P.—1-20.); Hunter 1ch. 6 and Ilbert P. P. 3-13.)

2 (See Hunter ii. 177-9 foot note 2, gives summary survey of the Company's Voyages and joint stocks from 1600 to 1660.)

3 1635 లో తటస్థించిన వర్తకపు పోటీ.

వల్ల యీస్టిండియా కంపెనీ కష్టపరంపరల పాలైనది. నాడు జరుగులుదేరిన తిరుగుబాటు కాలమున కంపెనీ నుండి బలవంతముగ రూ 5000 లు బుణరూపమున ఆంగ్లేయపార్లమెంటు తీసికొనినది. ఇంతతో కంపెనీ ఎత్తివేయబడుటయే సమంజసమని కంపెనీ డైరక్టరులే తలంచియుండిరి.

కాని యింతలో డచ్చివారితో గావింపబడిన సంధివల్ల కంపెనీకి 1654 లో రూ 85000 లు లభించినవి. ఇదేవిధముగ పోర్చుగీసువారితో గావించుకొనిన

1654 లో గలిగిన లాభము.

సంధివల్ల తూర్పుదీవులకు (East Indies) బ్రిటిషు నౌకలు బోవుటకు సావకాశము లభించినది. ఇంతకు ముందే కోర్టెనుగారి ముఠా లేక 'అసదా' వర్తకులతో (Corten's Association or Assada Merchants as they had come to be called then) రాజీ కుదిరినది.

పార్లమెంటుసభ 1650 సంవత్సరమున తూర్పుదీవులతో వర్తక మొక్క

5 1650 పార్లమెంటు నిర్ణయము.

కంపెనీమాత్రమే కొనసాగించవలెననియు, నా యధికారము అసాదా వర్తకులతో గావించుకొనిన రాజీప్రకారము కుంపెణీ చెలాయించవలెననియు తీర్మానించినది.

కుంపెణీయందు భాగస్వాములుగ లేని యితర వర్తకులుగూడ తూర్పుదీవులతో వర్తకముగావింప కుతూహలపడసాగిరి. కొంతమందికి ప్రత్యేకముగ

6 Policy of Monopoly గుత్తవ్యాపారము. 1657. సిద్ధాంతము; అధికారపత్రము.

లైసెన్సులు మొదట యొసగబడినను, తుట్టతుదకు కుంపెణీయే వ్యాపారమునంతయు గుత్తగొనుట సమంజసమని ఆంగ్లేయ ప్రభుత్వము నిర్ణయించినది. స్వాతంత్ర వ్యాపార సిద్ధాంతమునకంటె (Open trade) గుత్త వ్యాపారపద్ధతియే యుక్తమని ఆంగ్లేయ ప్రభుత్వము గ్రహించినది. (System of Monopoly), 1

1. (See Cambridge Modern History IV ch. 25. P. 730. for the detailed circumstances under which the British Govt. has settled the policy of Monopoly.)

ఈ సిద్ధాంతము నాధారముగ జేసికొనియే క్రాంవెల్‌గారు 1657 వ సంవత్సరము అక్టోబరు 19 వ తేదీని నూతనమొక అధికారపత్రము నొసగిరి. ఈ అధికారపత్రము ననుసరించి కుంపెణీ శాశ్వత కాల మూలధనమును గూడ జేర్చుకొనుటకు నిర్ణయించుకొని అందులకు కొన్ని నియమముల గావించినది.

నియమావళి మార్పు.

క్రొత్తగ కంపెనీయందు జేరువారు పౌ 5 ల ప్రవేశరుసుము జెల్లించవలయును. వాటా 1-కి కనీసము పౌ 100 లు. పౌ 500 లు వాటాలుగలవారు కంపెనీ డైరక్టర్ల ఎన్నికలలో ఓటును గలిగియుందురు. పౌ 1000 లు వాటాలు గలవారు కమిటీ సభ్యునిగ నెన్నుకొనబడుట కర్హతగలిగియుందురు. 24 గురు కమిటీలలోను అనగా సభ్యులలోను ప్రతి సంవత్సరము 8 గురు తొలగి నూతన ఎన్నికలు జరుగుచుండును. రెండు సంవత్సరములకంటె యెక్కువగ సెవను గాని డిప్యూటీ గవర్నరుగ లేక గవర్నరుగనుండుట కర్హులుకారు." ఈ నియమ సంస్కరణముతో కుంపెణీ తిరిగి పునరుద్ధవించినది. "పూర్వకాలపు వర్తకసంఘపు సూచనలు పోయి, ఆధునిక కాలపు జాయింటుస్టాకుకంపెనీగా మారెడు సూచనలు పొడగట్టినవి." 1

## 7. ఫ్యాక్టరీల నిర్మాణము, భూసంపాదనము.

సూరతు ఫ్యాక్టరీ 1605.

కంపెనీ మొట్టమొదట వర్తకమునకై వలయు భూమిని స్థానిక పాలకులనుండి అద్దెకు తీసికొన ప్రారంభించినది. ఇంగ్లండు చక్రవర్తిగారికడనుండి మొగలాయి చక్రవర్తుల కడకు రాయబారులు గూడ పంపబడుచు వచ్చిరి. ఈ రాయబారివర్గములో జాన్ మిల్డన్‌హాల్ మొట్టమొదటివాడు. (John Mildon Hall). ఈయన ఇంగ్లండునుండి 1599 లో [illegible] బయలు జేరి యున్నారు. భూప్రయాణము చేయుచు 1603 వ సంవత్సరమునకు ఆగ్రాకు జేరెను. ఈయన ఆ అక్బరుచక్రవర్తిగారి యొద్దనుండి, టర్కీ సుల్తాను ఆంగ్లేయులకొసంగిన సదుపాయములవంటి వర్తక సదుపాయము

1 See Hunter

2

లను గలిగించిన ఫర్మానాను సంపాదింపగలిగెనని చెప్పబడుచున్నది. 1 కాని యీయన తరువాత వచ్చిన రాయబారులెవరుగాని యీ మిల్ డెనుహాలుగారు సంపాదించిన ఫర్మానాను గురించి, చెప్పరు. 1607–11 మధ్య ఆగ్రాలో హాకిన్సుగారును, కానింగుగారు 1613న కెర్రిడ్జిగారు 1613–14, ఎడ్వర్డ్సు గారు 1615 లోను రాయబారులుగ వచ్చిరి. వీరికి రాయబారు లనుపదము నుపయోగించుట తగనిపని. వీరు నలుగురును మొగలాయీదర్బారులలో "విదూషకులు" గ ప్రవర్తించి వారికిని, వారి జాతికినిగూడ నపఖ్యాతి కారకులైరి. 2

ఈ కాలములో మొగలాయీసామ్రాజ్య కేంద్రప్రభుత్వము దృఢతరముగ నున్నప్పటికిని సముద్రప్రాంతములు బలవంతముగ నెన్నడును లేవని చెప్పవచ్చును. విదేశీయులే మొగలాయీ ప్రభుత్వముచే నౌకాబలమునం దుద్యోగులుగ నియోగింపబడుచుండెడివారు. ఆనాడు పోర్చుగీసువారి నెదుర్కొనుటకు గూడ నౌకాబలమవసరమైనది. తపతీముఖద్వారమున కంపెనీవారి నౌకలు పోర్చుగీసువారిని 1612 సంవత్సరము నవంబరు, డిశంబరు మాసములలో నోడించినవి. కంపెనీవారి యీ జయమునుగాంచి సూరతుగవర్నరుగారు సూరతులోను, కాంబేజలసంధిలో, మరి నాలుగు స్థానములలోను (Gulf of Cambay) ఫ్యాక్టరీలను గట్టుకొనుటకు కంపెనీవారి కనుజ్ఞ నొసగియుండిరి. ఈ యనుజ్ఞను గుజరాతు గవర్నరుగా రంగీకరించియుండిరి. పోర్చుగీసువారు తమ పరాజయమును కూడతీసికొన 1615 వ సంవత్సరమునం దరేబియా సముద్రమునందు బలమునంతయు వినియోగించిరి. కాని విఫలులైరి. 1612 వ సంవత్సరమునందు కంపెనుగూడ విఫలమనోరథులైరి. 3

1615 సంవత్సరమున సర్ థామస్ రో (Sir Thomas Roe) ఆరవ రాయబారి అజ్మీరులో జహంగీరు చక్రవర్తి దర్బారునకు వచ్చియుండెను.

1 See Vincen smith, Akbar the Great Mogul P. P. 292–5 for the distinction between parwana, Nishan, Lirman, Sanad and treaty and see Huuter ii P. 57 text and footnote.

2 See Indian administration B. K. Thakore P. 4

3 For a graphic account of Best's and Downten's actions in their Naval fight for Supramacy the Captains of Company and Portuguese respectively, see, principal Rawbinson "British Beginnings" Ch. 4.

ఈయన వినయము, నమ్రత, తెలివితేటలు చల్లగా జహాంగీరు చక్రవర్తిగారి వల్ల కంపెనీవారి వర్తక ప్రతిబంధకములను దొలగించివేసికొనుట కనువుపడినవి.

ఈయన కంపెనీకొసంగిన సలహాయే కంపెనీ(రేళ్ళు) వ్రాతుకొనిపోవుట కాధారమైనది "రేవుపట్టణము లయందే వర్తకము చేయుడు. అదియు ప్రశాంతముగ గావించుడు. వాదోపవాదములువలదు. సైన్యములు వలదు. యుద్ధములు వలదు." అని యీయనయొసగిన హితోపదేశము కంపెనీకిదీర్ఘాయు వొసగినది.1 మరియు 1615-వ సంవత్సరమునకు తదుపరి అరేబియాసముద్రము నందలి పోర్చుగీసువారివర్తకము క్రమక్రమముగ అంతరించనారంభించినది. పోర్చుగీసువారియీవెనుకగతిగూడ ఇంగ్లీషువారికితోడ్పడినది. మరియు మక్కామదీనాలకుపోవుసముద్రమార్గముగూడ ఆంగ్లేయకంపెనీచే సంరక్షింపచేయుటయు యవసరమని మహమ్మదీయచక్రవర్తిచేగూడ తలంపబడినది. ఇందువల్లసూరతు రేవుపట్టణము ప్రపంచవ్యాపారమునకు ముఖ్యస్థానమైనది. కంపెనీవారి ఫ్యాక్టరీ లాభదాయకమైనది. ఆంగ్లేయులకును పోర్చుగీసులకును 1635 లో జరిగిన మాడ్రిడుసంధియనంతరము 1612 లో గట్టబడిన సూరతుఫ్యాక్టరీమరింత ప్రధాన స్థానము నాక్రమింపసాగినది. పశ్చిమహిందూస్థానమునందీవిధముగ కుంపెనీ కాలువెట్టినది.

2 మచిలీపట్టణము ; 1610

ఈవిధముగనే తూర్పుసముద్రతీరమునందుగూడ రెండు మార్లు విఫలీకృతులై చివరకు మచిలీపట్టణములో 1611 లో ఫ్యాక్టరీని గట్టగలిగిరి. అనాడు మచిలీబందరు గోల్కొండ రాజ్యమునకు ముఖ్యరేవు పట్టణము. గోల్కొండనవాబు స్వర్ణపట్టా లేక ఫర్మానాను కుంపెనీ కొసగియున్నాడు. "సురక్షితముగను, ప్రశాంతముగను" వర్తకముచేసికొనవలెనని నవాబుగారి యాజ్ఞ (1632). కాని మొగలాయి నవాబులు వర్తకమునకై కోటలను నిర్మించుకొనుటకవకాశ మొసంగలేదు.

అందువల్ల ఫ్రాన్సిస్‌డేగారు (Francis day) దక్షిణదిశగ బోయిరి. అనాటి చంద్రగిరిరాజగు శ్రీరంగరాయ నాశ్రయించిరి. ఈయన శ్రీకృష్ణ

1. See Hunter ii 242. Rawbinson ch. 5.

దేవరాయుల రాజ్యమేలినవారిలో కట్టకడపటివాడు. కోటనుగట్టుకొనుటకు గూడ నధికారమునను సముద్రప్రాంతమునందొకింత స్థలమునసగియున్నాడు. వర్తకులను — వర్తకమును తన రాజ్యమును సంపన్నమొనరించునని యెంచుచు, ఖరీదునకు పెర్షియానుండి పాండిగుర్రములను తెచ్చి కంపెనీతనకు లభింపజేయుననియు, వంగదేశమునుండి ప్రతిపటునుడేగలను, చిలుకలను మొకలగు జంతువులను ఆయన నాకర్షించ్చా కొని తెప్పించుకొనుటకనువుగ నుండునని యును, కోట కట్టుదిట్టముగనున్నచో ఆయనకు శత్రుభయముండదనియును దలంచి కుంపెనీవారి కానముద్రతీరప్రాంతమును శ్రీరంగరాయలొసంగి యున్నాడు. 1

3
చెన్నప్పపట్టణము
1639
లేక మదరాసు

ఈస్థలములో దేగారు కట్టుదిట్టముగ సెంటుజార్జికోటనుగట్టించిరి. ఇది తూర్పుసముద్రతీరప్రాంతమున 1642 నుంచియు ప్రాముఖ్యమగు ఫ్యాక్టరీయయి నది. 1653 సంవత్సరమునుండియు నిది ప్రత్యేకరాజధానిగ జేయబడినది. 1658 వ సంవత్సరమునుండియు కోరమాండలు తీరమునందునను, వంగదేశమునందునను కంపెనీకిగల ఫ్యాక్టరీలు మదరాసు ఫ్యాక్టరీయధికారమునందుంచబడినవి. ఈవిధ ముగ శ్రీరంగరాయలు, లేక, చెన్నప్పయనునాతనిచే నొసంగబడినప్రదేశము చెన్నప్పపట్టణమని పిలువబడుచువచ్చినది. ఆంధ్రరాజ్యభాగమై, ఆంధ్రావనీశు నిచేదానమొసంగబడి ఆంధ్రరాజు పేరుమీదుగ వ్యవహరింపబడుచున్న నీపట్టణ మునకే కాలకర్మవశమున మదరాసుఅను పేరొల్లో దాపరించినది. ఈవిధముగ దక్షిణ హిందూదేశమున కంపెనీకాలుజారినది.

4
హుగ్లీ — కలకత్తాలు;
1633-60-
1690-

ఈవిధముగనే 1633 వ సంవత్సరమున మహానదీదక్షిణ ముఖద్వారమున ప్రవేశించి ఓఢ్రదేశమునందు వర్తకము జేసికొనుటకును, ఫ్యాక్టరీలను గట్టుకొనుటకును, ఓడలను నిర్మించుకొనుటకును యనుజ్ఞనుబడయగలిగిరి. ఈవిధము గనే వంగదేశపాలకుసికడ హుగ్లీయందు కోటనునిర్మించు

1 See Foster English Factories 1637-41 P. 184.

కొనుటకుగూడ 1640 సంవత్సరమునందనుజ్ఞనుపొందిరి. కాని యీప్రాంతములలో కుంపెణీవారి వర్తకమంతగ వ్యాపించకున్నది. షూజాయనరాజు కాలమున వర్తకము బాగున్నను నితడు ఔరంగజేబుచే నోడింపబడి తరిమివేయబడిన పిమ్మట కుంపెణీఫ్యాక్టరీలు కొంతకాలము బాగుగపనిచేయలేదు. (1660) షయిస్థఖాను కంపెనీ అధికారములను బునరుద్ధరించినను వర్తకాభివృద్ధికి సావకాశము లభించియుండలేదు. 1680 లో ఢిల్లీపాదుషానుండియే కంపెనీఫర్మానాను సంపాదించినది. అయినను వర్తకాభివృద్ధికి సావకాశము లభించలేదు, షాయిస్త ఖానుతో సఖ్యములభించలేదు. అందువల్ల ఆయుధబలమున సదుపాయములను సంపాదింప కుంపెణీ తలంచినది. 1686 లో హుగ్లీలోగల సైన్యమభివృద్ధిచేయబడినది. అయిననేమి మొగలాయి ప్రభుత్వమే ఫ్యాక్టరీని ముట్టడించివేసినది. ఆలస్యముచేయకుండ రహస్యముగ 'జాయచార్నకు' గారు (Joacharnock) ఫ్యాక్టరీనివదలి ప్రాణములకొరకై పారిపోయిరి. కలకత్తాను జేరిరి. ఇచ్చట 1690 ఆగష్టు యిరువదవ తేదీనుండియు ఫ్యాక్టరీనిసాగించిరి. ఇందులకు చార్నక్ గారే కారకులు. ఈవిధముగ కలకత్తాయందు స్థాననేర్పడినది. ఆకాలమునందీప్రదేశము బర్ద్వాను రాజాగారి యధీనమునందుండెడిది. నవాబుగారిప్రత్యక్షాధికారమునందుండెడిదికాదు. 1

5
బొంబాయి.
1669

రెండవఛార్లెసురాజునకు వివాహోత్సవముగ బొంబాయి, పోర్చుగీసురాజుగారిచే నొసగబడినది. ఈప్రదేశమును స్వాధీనము గావించుకొనుట విశేష వ్యాజ్యప్రయత్నములకు కారణమయ్యెను. అందువల్ల 1669 లో కంపెనీవారికిది సాలు 1 కి పౌ 10 ల కద్దెకొసంగబడినది. 1665 లో ఛార్లెసుగారు దీనిని స్వాధీనపరచుకొనియుండిరి. ఈ ప్రదేశమును ఆంగ్లేయులకు స్వాధీనముచేసిన మరునాడే పోర్చుగీసువారు హిందూదేశమునుండి వెడలి పోవలసియుండునని పోర్చుగీసు వైస్రాయిగారు వారిరాజునకానాడు వ్రాసియున్నారు. అదేవిధముగ బొంబాయి ఆంగ్లేయులవశమయిన నాటనుండియు ఆంగ్లేయు లభివృద్ధికివచ్చిరి. 2

1 Orme B. K. VI. Vol. II P. 16.

2 See Gazetteer of Bombay City and Island ii P. P. 45-99.

# 8. కంపెనీ అధికార విస్తీర్ణత.

"భూమిని సంపాదించుటకంటె యీ నావికుల గుంపునకు వర్తకమే ముఖ్యము. (Trade than territory) రాజ్యమును జయించుటకంటె వ్యాపారమే ప్రధానము. (Commerce than conquest), కాని విస్తార దూరమున గల విదేశములతో వ్యాపారము సాగించుటకు నిర్ణీతస్థానములును, ఓడలనిండ మందుగుండుసామానును లేసియెడల వీలులేదు. అందువల్ల అధికారపత్రములను పొందిన కంపెనీ లోకమార్గము నన్వేషించినవి. తమదేశపు పౌరులొనరించిన కృత్యములకు తమ చక్రవర్తికి బాధ్యతలేకుండగ వర్తకవ్యాపారము నభివృద్ధి గావించుకొనుటకై నాడుగల పరిస్థితుల ననుసరించి నూతన పంథ ద్రొక్కినవి. ఈ అధికారపత్రము చక్రవర్తిగారికిగల కొన్ని సర్వాధికారములను నిర్ణీతములగు కొన్నికార్యములకై యితరులకు సంక్రమింపజేయుచున్నది. ఈ యధికార పత్రము అపరోక్షముగ యుద్ధములను గావించుకొనుటకై యితరులకు అనుమతి నొసగెననిగూడ నిర్వచింపవచ్చును. (A license for private war). నాటి నుండియు నీ పద్ధతి ఆశ్చర్యకరమైన, విస్తారమైన, విచిత్రచరిత్ర కల్పకమైనది. ఇది నేటివరకును అంతమొందలేదు". 1

1 వ అధికారపత్రము 1661

ఈ అధికార పత్రముల పద్ధతియే యీస్టిండియా కంపెనీకి చాల అనువయినది. రెండవ ఛార్లెసురాజు తిరిగి కంపెనీ వారి కధికార పత్రముల నొసంగియుండెను. 1661 వ సంవత్సరమునందు కంపెనీవారి కొసంగిన యీ యధికార పత్రమునను సరించియే విశేషాధికారములు లభింపజేయబడినవి. 2

వర్తక సౌకర్యమునకై ఫ్యాక్టరీలను నిర్మించుకొనుటకును-వాటి వ్యవహార నిర్వాహణమునకై పలయు సిబ్బందిని సమకూర్చుకొనుటకును — వాటి పరిపాలన సక్రమముగ నిర్వహింపబడుటకై గవర్నరులను నియమించుటకును నధికార

1 (See "British Dominion in India" P. 18. By Sir Alfred Lyall Published in 1905).

2 (See Hunter ii. 179. foot note 2. gives a summary survey of the company's voyages and joint stocks from 1600 to 1660).

మొసంగబడినది. ఈ గవర్నరులకు సివిలు క్రిమినలు అధికారములుగూడ నొసంగబడినవి. ఈ ఫ్యాక్టరీల సంరక్షణమునకై సీమనుండి సేనలను పంపుట కంగీకరింపబడెను. యూరపుఖండవాసులతోగాక, అనగా ఆసియాఖండవాసుల తోను, యితర ద్వీపములతోను, అవసరమగుచో యుద్ధములు చేయుటకును, సంధిచేసికొనుచుండుటకును, గూడ నధికారమొసంగబడినది. ఇట్టి యుద్ధములకు వలయు కోటలను నిర్మించుటకుగూడ నధికారమొసగబడినది. ఇంగ్లండునుండి రవానాచేయుబడు మందుగుండుసామానుపై సుంకములు రద్దుచేయుబడినవి. (సివిలు క్రిమినలు కేసులు విచారించుటకు లభించిన యధికారము 1678 వ సంవత్సరమువరకు వినియోగింపబడలేదు.)

2 వ 1669. అధికార పత్రము. నూతనముగ బొంబాయి యందొక సైనికదళము నేర్పాటు గావించుకొనుటకు 1669 లో అధికారపత్ర మొసంగబడినది. హిందూదేశమునందుగల ఆంగ్లేయోద్యోగులతో మొట్టమొదట ఆంగ్లేయసైనికదళ మీ యధికార పత్రము ననుసరించియే యేర్పరుపబడినది.

2 వ చార్లెసుగారి మూడవయధికార పత్రము ననుసరించి కుంపెణీకి విశేషాధికారములు సంక్రమింపజేయుబడినవి. బొంబాయి, మదరాసులలో తిరుగుబాటులు జనించినవి.

వీటిని అణచుటకై విశేషాధికారమును కంపెనీవారు పొందవలసివచ్చినది. అందువల్ల 1683 వ సంవత్సరమునందు మరియొక యధికార పత్ర మొసంగబడినది.

3 వ 1683. అధికార పత్రము ఈయధికార పత్రముననుసరించి హిందూదేశమున కుంపెనీవారియధీన ప్రదేశములలో మిలిటరీకోర్టును బెట్టుటకు గూడ నధికారము సంక్రమింపజేయుబడినది. ఈ యధికార పత్రము ననుసరించి కుంపెనీకి రాజ్యాధికారమునకు వలసిన సర్వాధికారములు సంక్రమించినవని జెప్పవచ్చును. చక్రవర్తికిగల ప్రత్యేకాధికారములు మాత్రమే మినహాయింపబడినవనదగును. 1

1 Subject to the reservation of "Sovereign right, power and dominion of the Crown, when we shall be pleased to interpose our Royal authority there on."

4 వ అధికారపత్రము 1677

1677 వ సంవత్సరమునందు కుంపిణీ మరియొక అధికార పత్రమును పొందినది. ఈపత్రమునుసరించి హిందూ దేశములో చెలామణిచేయుటకు బొంబాయిలో నాణెములను ముద్రించుటకు గూడ కంపెనీవారి కధికారము లభ్యమైనది. కుంపెణీ వారి రాజ్యభాగములయందు న్యాయవిచారణ మొనరించి తీర్పులను జెప్పుటకై న్యాయస్థానములను నెలకొల్పుటకుగూడ నధికార మొసంగబడినది.

5 వ 1686 సం॥ అధికారపత్రము సంపూర్ణాధికార సంక్రమణము

1686వ సంవత్సరమునందొసంగబడిన యధికారపత్రమువల్ల నౌకాదళము నేర్పరచుకొనుటకుగూడ కంపెనీ కధికారము లభించినది.

ప్రతి యిరువది సంవత్సరముల కొక్కసారి కంపెనీ వ్యవహారములు పరీక్షింపబడుటకు నిర్ణయింపబడినది.1 పరీక్షానంతరము మరల మరియొక అధికారపత్రమును, మరి యిరువది సంవత్సరముల కొసగబడుటకు నిర్ణయింపబడినది. నాణెములను ముద్రించుటకుగల యధికారమును, మిలిటరీకోర్టును స్థాపించుటకుగల యధికారమును తిరిగి బలపరుపబడినవి. మదరాసు, బొంబాయి, కలకత్తాలలో పురపాలకసంఘముల నేర్పాటుచేయుటకును, న్యాయనిర్ణయమునకై మేయరుకోర్టుల నెలకొల్పుటకును గూడ అధికారము లభ్యమైనది.

కంపెనీకి రాజ్యాధికారము సంక్రమించినది.

ఈ విధముగ, కంపెనీహిందూదేశమున సముపార్జించుకొనిన స్థలములలో సివిలు, మిలిటరీ, అధికారములను చెలాయించుటకుగల రాజ్యాధికారమును సీమదేశపు చక్రవర్తి నుండి కంపెనీకి సంక్రమించినవి.

17 వ శతాబ్దాంత్యకాలమున కీవిధముగ రాజ్యాధికారము విస్తరించినది. ప్రత్యేకవర్తకవ్యాపార దృక్పథమున దోషమేర్పడినది.

“ శాశ్వతముగనుండుటకు వలసినంతటి కట్టుదిట్టములగు పునాదులపై ఆధారపడిన ఇంగ్లీషురాజ్యమును హిందూదేశములో నెలకొల్పుటకు వలయునట్టి,

9 A. B. Keith,

సివిలు, మిలిటరీ యధికారసమన్వితమగు రాజ్యాంగమును, అందుకువలయు నత్యధికమగు రాబడివచ్చునట్టి యేర్పాటునుగావింప" డైరక్టరులు 1697 వ సంవత్సరమునందు తీర్మానించుకొనిరి. (They intended to establish such a policy of civil and military power and create and secure such a large revenue as may be the foundation of a large well-grounded sure English dominion in India for all time to come.) ఈతీర్మానమునను సరించి పరీక్షించుచో, 1687వసంవత్సరము నందే హిందూదేశమున ఇంగ్లీషురాజ్యస్థాపన మొనరింపవలెనని కుంపెణీ నిర్ణయించుకొని సూచించినట్లు తేలుచున్నది. 1689 వ సంవత్సరమున డైరక్టరులు గావించిన తీర్మానముగూడ నీసారాంశమునే రుజువుచేయుచున్నది. వర్తకముతోపాటు పన్నులమూలమగు రాబడిగూడ నింత ముఖ్యమనియు, రాజ్యవిస్తీర్ణతమీద నాధారపడిన, వాణిజ్యపద్ధతి కంపెనీవారి యాశయమనియు, హిందూదేశమందలి కంపెనీయుద్యోగులకు సూచించియుండిరి. "మనవర్తకమెంత ముఖ్యమో, మనరెవిన్యూగూడ నంతముఖ్యము" అని కంపెనీవారి నిర్ణయము. "The increase of our revenue is the subject of our care as much as our trade.)[1]

## నూతనకంపెనీ; పార్లమెంటుజోక్యము.

రెండవ పోటీ కంపెనీ; పార్లమెంటు తీర్మానములు.

ఇంతలో 1688 వ సంవత్సరమున ఇంగ్లాండునందు విప్లవము వచ్చినది. ఆరేంజిదేశపు విల్లియము రాజ్యమునకు వచ్చెను. ఇప్పుడే, హిందూదేశముతో వర్తకముచేయ మరియొకకంపెనీ స్థాపింపబడినది. ఈస్టిండియాకంపెనీకి పార్లమెంటులో ప్రతికూలురు కొందరుగలరు. ఈస్టిండియాకంపెనీ పార్లమెంటువారి యధికారమును బొందలేదనియు, రాణీ యధికారమును పొందినంత మాత్రమున శాస్త్రీయముకాదనియు వాదింపసాగిరి.

1. See the Macaulay's minute quoted by him as having been written by the then Governor of the Company Josia Child quoted by A. Rangaswami Ayyangar. The Indian constitution P. 7. Second edition).

అయిననేమి? ప్రీవీకౌన్సిలు యీస్టిండియాకంపెనీకి అనుకూలముగ తీర్పుజెప్పినది. చక్రవర్తియొక్క సర్వాధికారము చెల్లదగినదనబడెను.

7 1690 లో పార్లమెంటు విచారణ.

1690 వ సంవత్సరము జనవరియందు పార్లమెంటుసభోప సంఘ మిరుపక్షముల వాదమును వినినది. ఈ విచారణ ఫలితముగ నూతనజాయింటుస్టాకుకంపెనీ ఏర్పరుపబడ వలయునని నిర్ణయింపబడినది. నూతనజాయింటుస్టాకు కంపెనీఏర్పడువరకును వర్తకముమాత్రము యీస్టిండియా కంపెనీయే కొనసాగింపవలెనని నిశ్చయించినది.

8 1692 పార్లమెంటు తీర్మానము

ఇట్లే 1692 లో గూడ యీస్టిండియాకంపెనీకి వర్తకాధికారము ప్రత్యేకముగ నుండుట సమంజసముకాదనియు, పాతకంపెనీనిరద్దుచేసి క్రొత్తకంపెనీకి రాజుగారియభీష్టానుసారము నూతనాధికారముతో అధికారపత్రమొసంగవలెననియు పార్లమెంటుసభ తీర్మానించినది.

1693.

మరుసటిసంవత్సరముగూడ పార్లమెంటుసభ యిట్లే తీర్మానించినది. కంపెనీని రద్దుచేయునోటీసు నొసంగవలెనని తీర్మానింపబడినది. కానియీతీర్మానములు విఫలములైనవి. ఈస్టిండియాకంపెనీ రద్దుజేయబడుటకుమారుగ, మరి 21 సంవత్సరముల కధికారపత్రమొసంగబడినది. ఈయధికారపత్రమునందు కంపెనీయొక్క మూలధనము 744000 పౌనులకు హెచ్చింపవలెనని మాత్రమునిర్ణయింపబడినది. ఈనిర్ణయమువల్ల కంపెనీయందంతవరకు వాటాదారులుగ లేనివారు కంపెనీలో వాటాదారులగుటకు సావకాశము మాత్రమేర్పరుపబడినది. (ఇందులకుకంపెనీయధికారియగు సర్. జోసియా బిల్డుగారొసగిన లంచములే కారణములని తేలుచున్నది. 1695 పార్లమెంటు సభోపసంఘమువారి యెదుటకు తేబడినకంపెనీ లెక్కలపుస్తకమునననుసరించి సం॥ 1688 – 1692 మధ్య 23467 పౌనులును, 1693 లో 80, 468 పౌనులును లంచములక్రింద రహస్యముగ ఖర్చుపెట్టబడినవని లెక్కలు తేల్చబడినవి.)

9 1694 పార్లమెంటు తీర్మానము; పౌరుల సమాన హక్కులు.

ఈపరిస్థితులపై కామన్సుసభవారాగ్రహ పూరితులై యుండిరి. 1683 వ సంవత్సరమునం దొసగబడిన యధికారపత్రమునను సరించి లభించిన నావికా, న్యాయస్థానముల యధికారప్రకారము (Admirality Courts) యీస్టిండియాకంపెనీ తమప్రత్యర్థులలదైన 'వెడ్‌బ్రిడ్జి' యను వర్తకనౌకను, థేమ్సునదియందు పట్టుకొనినది. ఇది అశాస్త్రీయమైనదనియు, అనధికారపూరితమనియు, బ్రిటిషుపౌరుల కందరకును హిందూదేశముతో వర్తకమును గావించుకొనుటకు సమానాధికారముండ వలయుననియు పార్లమెంటుసభ 1694 లో తీర్మానించినది.

ఈవ్యాపారస్వాతంత్ర్యమునునిరోధించుటకు పార్లమెంటునకేయధికారము గలదనిగూడ తీర్మానమునందునిర్వచింపబడినది. ఈతీర్మానమునను సరించి రాజుగారితరవర్తకులపై తన యధికారపత్రమునందు గల (Against inerlopers) నిషేధములను తొలగించివేసెను. ఇంతతో కంపెనీవర్తకమునందు విషమపరిస్థితు లుద్భవించినవి. మరియు, సీమదేశమునందానాడు స్వదేశీయుద్యమము ప్రబలినది. హిందూదేశమునుండి సీమకు దిగుమతి చేయబడుచున్న కాలికోలు, మజిలినులు, మొదలగువాటిపై నిషేధప్రచారము ప్రబలమైయుండెను.

10 1698-పార్లమెంటు ఋణము చేయుట.

ఇట్టితరుణముననే ఫ్రాన్సుతో యుద్ధముమూసినది. పార్లమెంటు ఋణముచేయవలసివచ్చినది. 20 లక్షలపౌనుల ఋణముచేయుటకు తీర్మానించినది. సాలుసరి 100 కి 8 పౌనులువడ్డీ. పార్లమెంటు నూతనకంపెనీని స్థాపించి తూర్పుదీవులవర్తకవ్యాపారసమస్యను నిర్ణయింపనిశ్చయించినది. పార్లమెంటువారికి ఋణ మెవరొసగుదురో వారారుణమునకు తగినంత వాటాను నూతనకంపెనీలో పొందుటకుహక్కు గలిగి యుందురని తీర్మానించబడినది. (Each subscriber to the loan to have the right of Contributing a share in the company's stock proportional to his subscription) ఈతీర్మానమునను సరించి 1698 వ సంవత్సరమునం దీతరుణమున నూతనకంపెనీవారు కొందరుకలసి పార్లమెంటునకు 1,662,000 పౌనుల అప్పునిచ్చినది. పార్లమెంటువారు క్రొత్తకంపెనీకి హిందూదేశముతో వర్తకముజేసికొను నధికార

మొనంగిరి. ప్రాతకంపెనీకూడ 315000 పౌనులను పార్లమెంటున కవ్వూపెట్టి తన వాణిజ్యాధికారమునుకూడ ఖాయపరచుకొనినది. ఈ పరిస్థితులవల్ల 1700 సంవత్సరమునకు హిందూదేశముతో నాలుగుతరగతులనీమువర్తకులు వ్యాపారము చేయసాగిరి. (1) క్రొత్తకంపెనీ. (2) ప్రాతకంపెనీ. (3) క్రొత్తకంపెనీలో చేరి తమ స్వంతమూలధనముపై (22000ల పౌ) వ్యాపారముచేయు వర్తకులు. (4) 1694 వ సంవత్సరమున పార్లమెంటుగావించిన తీర్మానానుసారము స్వేచ్ఛా వ్యాపారసిద్ధాంతముననుసరించి వర్తకమునకై ఓడలను పంపించినవారు.

అయినను 1698 నుండియు క్రొత్త—ప్రాతకంపెనీలుమాత్రమే వ్యాపారము సాగించవలెననియు, యితరులు వారివర్తక నౌకాయాత్రలను పూర్తిచేసికొని వచ్చిపోరాదనియు శాసింపబడినది. ప్రాత—క్రొత్తకంపెనీల మధ్య పోటీ మితి మీరినది.

హిందూదేశమునందు పాతకంపెనీవలెనే, కలకత్తా, మదరాసు, బొంబాయి రాజధానులనేర్పరచుకొనవలెనని క్రొత్తకంపెనీకూడ ప్రయత్నింపసాగినది. ఇంగ్లండునకు క్రొత్త ప్రాతకంపెనీలు రెండునుగలిసి దిగుమతిచేయుచున్న హిందూదేశవస్త్రములతో సీమబజారులన్నియు నిండిపోసాగినవి. ఆంగ్లేయుల స్వదేశీయుద్యమముకూడ ప్రబలియుండుటచే కంపెనీదిగుమతిగుడ్డలవిడుదల కష్టతమము గాజొచ్చినది. (హిందూదేశపు సిల్కుబట్టలపై నిషేధపుసుంకములను విధించిన దీకాలమునందే. 1700 సంవత్సరమున భారతీయవస్త్రములు ధరించుట కూడ నేర మొనరింపబడినది. వివరములకు భారత దేశ ఆర్థికచరిత్ర పే. 792—794 చూడుడు.)

11వ 1702 రెండుకంపెనీలకు రాజీ; రాజీషరతులు

ఇక కర్తవ్యమేమి ? రెండుకంపెనీలును నేకమై వర్తకము గావించుకొనినగాని కంపెనీలు నిలబడుటకే ఆస్కారము కనిపించలేదు. అందువల్ల రెండుకంపెనీలును కలియుట విధాయకమైనది. లాభసాటి బేరమునకు తప్పనిసరియైనది. ఈ కలియిక జరుగక హిందూదేశమునందలి పోటీ వీటిరెంటిమధ్యను మితిమీరియున్నచో నాడే కుంపెణీరాజ్యము స్తమించియే యుండెడిదేమో ? ఇదిగుర్తించియే ఈరెండుకంపెనీలును రాజీపడినవి.

ఈరెండుకంపెనీలకును 'ఏనీ' రాణి సంధికుదిర్చినది. (Queen Anne) ఈరాజీననుసరించి రెండుకంపెనీలును ఇంగ్లీషుకంపెనీయని వ్యవహరించుకొనుటకు నాటినుండియు నిర్ణయింపబడెను. ప్రాతకంపెనీ మరియేడుసంవత్సరములవరకు ప్రత్యేకముగ వ్యాపారము కొనసాగించుకొనవచ్చును. 7 సంవత్సరముల పిమ్మట తమ యధికారపత్రములు రెండును కలిసిన, నూతన ఇంగ్లీషుకంపెనీకి వర్తకాధికారము సంక్రమించుననియును తీర్మానింపబడెను. కాని 1702 వ సంవత్సరపు యీరాజీ మనస్పర్థలనంతరింప జేయులేకపోయినది. క్రొత్తకంపెనీనుండి పార్లమెంటు మరియొకసారి మరి 12 లక్షలపౌనులను అప్పుపుచ్చుకొనినది. హిందూదేశ వాణిజ్యాధికారసర్వస్వమును క్రొత్తకంపెనీకి దఖలుపఱుపబడినది. ఈరెండు కంపెనీలవ్యవహారములను పరిష్కారముజేయుటకు 1708 లో గొడాల్ఫిన్ అనునతడు మధ్యవర్తిగ నియమింపబడినాడు.

12 వ గొడాల్ఫిన్ తీర్పు

1709 లో నీతగవు పరిష్కారమైనది. (Godolphin's award). గొడాల్ఫిన్ తనరాజీతీర్పునుచెప్పినాడు. ఈ తీర్పుననుసరించి ప్రాతకంపెనీ తనయధికారపత్రములను రాణీగారికినమర్పించినది. ప్రాతకంపెనీయొక్క స్వరూపనామము లింతటినుంచియు వ్యక్తిత్వమునుగోల్పోయినవి. ప్రాతకంపెనీఅధికారపత్రములే నూతనయింగ్లీషుకంపెనీయునికి కాధారభూతములైనవి. కాని, 1702 వ సంవత్సరమున రెండు కంపెనీలునుగలిసి ఏకముగనేర్పరుపబడిన ఇంగ్లీషుకంపెనీ అయినవాటనుండియు కంపెనీయొక్క రాజ్యాంగపరిణామముమారినది. నాటినుంచియు పార్లమెంటు శాసనములననుసరించియే ఇంగ్లీషుకంపెనీకి అధికారముసంక్రమింపసాగినది. పార్లమెంటు కంపెనీవ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటకు తనకుగల నధికారమును ధృవపరచుకొనినది. "కంపెనీయొక్కవర్తకపుహక్కులు పదిలముగ నుంచవలయునా, లేదా యనువిచారణాధికారము పార్లమెంటుశాసనములకు లభించినది." 1

1 See Ilbert, The Govt. of India Page 26. Published 1907.

13 సీమపార్లమెంటు వారిబాధ్యత

ఇందువల్ల 1688 వ సంవత్సరమునుండియు కుంపెణీపరిపాలనమునకును, రాజ్యాంగమునకును పార్లమెంటుసభవారి శాసనములే మూలాధారమైనవి. పార్లమెంటుసభయే కంపెనీపాలనమునకు బాధ్యతగలదనవచ్చును.

క్రొత్తయింగ్లీషుకుంపెణీ బ్రిటిషుగవర్నమెంటునకు మరల అప్పుయిచ్చి 1780 వరకు వాణిజ్యాధికారమునుపొందగలిగినది. 1726 వ సంవత్సరము నంకలి అధికారపత్రములలో పురపాలకసంఘముల నిర్మాణమునుగురించిన యధికారము మార్పుచేయబడినది.

1748 సంవత్సరమున ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని మధ్య సంభవించిన యుద్ధకాలమున భారతీయసిపాయీలదళమును నెలకొలిపి క్రమశిక్షణనొసగుటకు వలయునధికారమును కుంపెణీవారుపొందిరి.

1754 వ సంవత్సరమున (బ్రిటిషుమ్యూటినీచట్టము) ఆంగ్లేయవిప్లవశాసనము ననుసరించిన విప్లవశాసనమును గావించుటకు కంపెనీవారికధికారము కలిగినది. కంపెనీవారికిని, వీరిశత్రువర్గమునకును జరిగెడియుద్ధములలో సంగ్రహింపబడుసామగ్రులను (Booty) కంపెనీవారు తీసుకొనునట్లును, బ్రిటిషుసేనలు సంగ్రహించుసామగ్రిని ఆంగ్లేయరాజు తనయిష్టానుసారము పంచిపెట్టుటకును 1758 లో అధికారపత్ర మొసంగబడినది. ఈయధికారపత్రము ననుసరించియే నూతనరాజ్యములను వశపరచుకొనుటకును, రాజులతో సంధిగావించుకొనుటకును మొదలగు రాజ్యవ్యాప్తికృత్యములను గురించిన యధికారము కుంపెణీకి సంక్రమింపజేయబడినది. ఐరోపాఖండరాజ్యముల నాక్రమించువిషయములలో మాత్రము రాజాజ్ఞబడయునట్లుగ నిర్ణయింపబడినది. ఈవిధముగ 1765 వ సంవత్సరమువరకు అనగా దివానుగిరివచ్చువరకును కంపెనీవర్తకవ్యాపారవ్యాప్తికిని రాజ్యాక్రమణపరిపాలనలకును సీమప్రభుత్వపుఅధికారపత్రములే ఆధారములైనవి. బ్రిటిషుగవర్నమెంటునకు కొంతధన మొసంగుట, వారిని వివిధరీతుల నాశ్రయించుచుండుట, నూతనాధికార పత్రములబడయుచుండుట కనువగు సాధనములయినవి. అంతవరకు బ్రిటిషుప్రభుత్వము కుంపెణీకి నూతనాధికారపత్రములను సులాయాసముగ నొసంగుచుండెడిదికాదు.

# 9 ఫ్యాక్టరీలు; కంపెనీ పరిపాలనము.

## (The Goverence of the settlements and territories by the Company).

1
బొంబాయి, సూరతు, మదరాసు

ఈయధికారపత్రములననుసరించిన పరిపాలనాధికారమును కంపెనీవారెట్లునిర్వహించిరి? ఈస్టిండియాకంపెనీ కట్టిన ఫ్యాక్టరీలన్నియు కోటలే. ఈ కోటలయందడుగుభాగమున సరకునిలువజేసికొనుటకు గోదాములుండెడివి. పైగదులు సమాలోచనకును కార్యనిర్వహణమునకును వినియోగింపబడుచుండెడివి. కంపెనీ ప్రారంభస్థితియందు పరిపాలించుటకువలయు నంగనిర్మాణమును నిర్మించుకొనవలసినయగత్యములేకపోయినది. కంపెనీకి వర్తకస్థానములు మాత్రమేగలవు. రాజ్యాధికారముగల భూభాగములులేవు. క్రమక్రమముగమాత్రమే రాజ్యాధికారముగూడలభించుటవల్ల క్రమగతముగనే మదరాసు, బొంబాయి, కలకత్తాలయందు రాజ్యాధికారనిర్వహణమునకు వలయునంగనిర్మాణము సమకూర్చబడినది. ఈరాజ్యాధికారము వివిధరీతుల సంక్రమించుటవల్లగూడ పరిపాలనావిధానసంస్థ బహురీతులుగ రూపభేదము నొందవలసివచ్చినది.

ఫ్యాక్టరీలవర్తకమొకసంఘముచే (లేకకౌన్సిలు) నిర్వహింపబడుచుండెడిది. ఈసంఘమునకు ముఖ్యాధికారిపేరు గవర్నరు. ఈయనయే ప్రెసిడెంటనిగూడ పిలువబడుచుండెడివాడు. ఈ కంపెనీవ్యవహారుల కార్యనిర్వహణనీతి తరచు మారుచుండెడిది. ఈకంపెనీవ్యవహారములకు సూరతు, బంతాము (Bantam)లు మొట్టమొదట ముఖ్యస్థానములు. ఇతరఫ్యాక్టరీలు సూరతు, బంతాముల కార్యనిర్వహణాధికారములకు లోబడియుండెడివి.

1657 వ సంవత్సరమునందీవిధానముమార్చివేయబడి సూరతుమాత్రమే ముఖ్యస్థానముగ నొనరింపబడినది. మదరాసు, హుగ్లీ, బంతాముఫ్యాక్టరీలన్నియుగూడ సూరతుఫ్యాక్టరీయధీనమునం దుంచబడినవి. కాని సూరతు ఫ్యాక్టరీ రాజ్యాధికారమును సంపాదించలేకపోయినది. (Territorial Power.)

రాజకీయాధికారమునుగూడ సంపాదింప కంపెనీచే నిశ్చయింపబడినపిమ్మట బొంబాయిపై సూరతున కధికారముతొలగించి వేయబడినది. 1686 వ సంవత్సరమున జోసుబల్లుగారు సూరతునంఘమునకు ప్రెసిడెంటుగానుండిరి. ఈయనయే బొంబాయికిగూడగవర్నరు. ఈయనకంపెనీవ్యవహారములపట్ల హిందూదేశమునందు సర్వాధికారిగ నొనరింపబడినాడు. ఈయనయేకంపెనీ సైన్యములకు సర్వసైన్యాధిపతిగను, కంపెనీవర్తకమునకు డైరక్టరుజనరలుగను నియమింపబడినాడు. బొంబాయి ఈయనకుముఖ్యస్థానముగ నియమింపబడినది. 1687 మే మాసమునుండియు సూరతు పశ్చిమరాజధానికి ముఖ్యస్థానముగ తీసివేయబడినది. మదరాసు, వంగరాష్ట్రములయందలి వ్యవహారనిర్వహణమునకై బిల్లుగా రీప్రదేశములలో సంచారము చేయుచుండవచ్చును. బటేవియాయందలి డచ్చికంపెనీవారి కార్యనిర్వహణాధికారితో సమానహోదాకలిగించుటకే బిల్లుగారికిట్టి యున్నతాధికార మొసగబడినది. కాని బిల్లుగారివల్లవ్యవహారములుసక్రమముగ నిర్వహింపబడలేదు. వంగదేశవ్యవహారములు నిష్ప్రయోజనములైపోయినవి. కంపెనీయొక్క రాజనీతి మార్చుకొనుటవిధియైనది. ఇంతలో బిల్లుగారుదివంగతులైరి. పిమ్మట 1693 లో బిల్లుగారిస్థానములో సర్ జోన్ గోల్డ్సుబరోగారు (Sir John Golds borough.) సర్వసైన్యాధిపతిగను, డైరక్టరుజనరలుగను నియమింపబడిరి. కాని, ఈయనకు మదరాసు ప్రధానస్థానమొనరింపబడినది. బొంబాయిముఖ్యస్థానముగనుంచుకొని బొంబాయిగవర్నరుగను, గోల్డ్సు బరోగారిక్రింద కెప్టెనంటు—జనరలుగా పనిజేయుటకై సర్ జోన్ గయరుగారు నియమింపబడిరి. (Sir John Gayer) గోల్డుబరోగారు విగతజీవులయిన వెంటనే ముఖ్యస్థానములు తిరిగి తారుమారైనవి. 1694 లో బొంబాయిముఖ్యస్థానమైనది. గయరుగారు సర్వసైన్యాధిపతి అయినాడు. మదరాసునకు హిగ్గిన్సన్‌గారు ప్రెసిడెంటుగా నున్నాడు. (Mr, Higginson) ఈయన గయరుస్థానమున కెప్టెనంటుజనరలుగా నియమింపబడినాడు. కాని యీహోదాయే 1798 వ సంవత్సరము నందంతమొందినది. థామసుపిట్టుగారు మదరాసుగవర్నరుగ నియమింపబడిననాటనుండియు లెప్టెనెంటుజనరలుహోదా తీసివేయబడినది. ఈవిధముగనే 1715 వ సంవత్సరమునందు జనరలుహోదాగూడ బొంబాయి మదరాసుగవర్నరులకు తీసివేయబడినది. ఆయేడే బొంబాయి

యందు గవర్నరుపదవియు, ప్రెసిడెంటుపదవియు, సృష్టింపబడినవి. 1700 సంవత్సరములోనే కలకత్తాయొక్క స్వాతంత్ర్యముగుర్తింపబడినది. ఫోర్టువిల్లియమునకు ప్రత్యేకముగ గవర్నరు, ప్రెసిడెంటు నియమింపబడినాడు. వంగదేశ వ్యవహారములపట్ల పైయధికారుల అధికారముతొలగించివేయబడినది. ఈవిధముగ మూడు రాజధానులును స్వాతంత్ర్యముగలిగి వ్యవహరింపసాగినవి. కంపెనీకి మాత్రమే యీమూడురాజధానులవ్యవహారముల నొకమార్గముగనడపుట కధికారముగలదు. గాని చాలదూర దేశమునందుండుటచే కంపెనీ యీమూడు రాజధానులవ్యవహారములను సమన్వయము నొనరించుచు కార్యనిర్వాహణ మొనరింపజాలకపోయెననుట నిశ్చయము.

ఈపరిపాలనా సంఘముల ప్రెసిడెంటులకు నిరంకుశాధికారముండెడిది గాదు. సంఘసభ్యులందరునుగలిసి సంఘీభావముతోగూడిన, లేక, ఏకీభావముతో గూడిన పరిపాలనావిధానమును నడుపుచుండవలెనని కంపెనీ ప్రోత్సహించుచుండెడిది. కాని ప్రెసిడెంటుకు నిరంకుశాధికారము చెలాయించుటకువలయు ప్రత్యేకాధికారముండెడిది. తనతోటికార్యనిర్వాహకసభ్యుల యభిమతమును త్రోసిరాజనుటకువలయు ప్రత్యేకాధికారము శాసనరూపముగనుండెడిది. ఆచరణయందీ ప్రత్యేకాధికారముతరచు వినియోగింపబడుటయు గూడకలదు. ఈ కార్యనిర్వాహకవర్గ సభ్యులసంఖ్య (Councillors.) నిర్ణీతముగనుండెడిదికాదు. ఆయారాజధానులననుసరించి, ఆయాకాలపరిస్థితులననుసరించి సంఖ్యనిర్ణయింపబడుచుండెడిది. మఱియు, చిన్నచిన్న యుద్యోగులుగ నియమింపబడినవారే, అనగా, లెక్కలనువ్రాయువారు, సరకును రవాణాచేయువారు, పట్టుబడివట్టువారు, మొదలగువారే మూడు లేక అయిదుసంవత్సరముల కాలము నౌకరీచేసిన పిమ్మట కార్యనిర్వాహకవర్గ సభ్యులుగ నియమింపబడుచుండెడివారు. 1674లో మదరాసుగవర్నరుగ నున్న ఆయన, మొట్టమొదట లెక్కలనువ్రాయువానిగను, పట్టుబడిదారునిగను(Ware housekeeper - Customer, Book - Keeper) సుంకములు వసూలుచేయువానిగను పనిజేసి, పిమ్మట కార్యనిర్వాహకవర్గ సభ్యునిగను, తుదకుగవర్నరుగను పనిజేసియుండెను. బొంబాయిగవర్నరునకు తాబేదారు లయిదారుగురుండేవారు. ఈతాబేదారులే కార్యనిర్వాహకవర్గసభ్యులుగ

పనిచేయుచుండెడివారు. అందువల్ల యీకార్యనిర్వాహకవర్గము సక్రమముగ పనిచేయుటకు సావకాశముండెడిదికాదు. ఇదియే క్లైయివు వాదము. కార్యనిర్వాహకవర్గసభ్యులసమ్మతితో నిమిత్తములేకుండగనే కార్యనిర్వాహణ మొనరించుట కధికారము కావలెనని క్లైవుపట్టుబట్టుట కిదియే హేతువనబడుచున్నది.1 అయినను క్లైవు మదరాసునుండి కలకత్తాకుపంపబడినపుడు మరియిరువుర కార్యనిర్వాహకవర్గసభ్యులతోగూడ కలిపిపంపుట, నిరంకుశతత్వముపట్ల కంపెనీకిగల వ్యతిరేకాభిప్రాయమేకారణమని కొందరి అభిప్రాయము. కలకత్తాయందు నిర్వహింపబడవలసియున్న రాజకీయ (Expedition) దండయాత్ర చివరకు క్లైవు సహచారులలో నొకడునలదని ప్రతిఘటించుటవల్లనే యాగిపోయినదనియు, నీపరివర్తనమునకు నిరంకుశాధికారముపై కంపెనీకిగల వ్యతిరేకాభిప్రాయమే కారణమనియుగూడ నొక్కిచెప్పబడుచున్నది. కాని చివరకు క్లైవునకొక్కనికి మదరాసు అధికారవర్గము సంపూర్ణాధికార మొసంగుట యీవాదమును మొదలంట నూడబెరికి వేసినది.

ప్రెసిడెంటునకు నిరంకుశాధికారము లేకపోవుట మొత్తముమీాద కంపెనీ ప్రయోజనమునకరిష్టమైనది. 1762 లో నీసత్యముప్రస్ఫుటమైనది. వనెసిటార్టు (Vansittart). అంతర్వ్యాపారశుల్కములను గురించి మీార్కాశీముతో గావించుకొనిన యొడంబడికయందిది రుజువైనది. ఈఒడంబడిక ననుసరించి నవాబుగారియుద్యోగులే తగవులను పరిష్కరించుటకధికారము కలిగియుండిరి. ఈవిధముగ తమయధికారమునుండి తగవులను పరిష్కరించున్యాయాధికారము తొలగించుటయే కారణమై యితరవిధముగప్రయోజనకారియైన ఒడంబడికను కార్యనిర్వాహకవర్గము త్రోసివేసినది. ఈత్రోసివేయుటయే మీార్ఖాశీముతోటివైరుధ్య హేతువయినది. ఇతనిస్థానమున మీార్ఖాశీమును రాజ్యాధికారము నందుంచుట తటస్థించినది."2 మీార్జాఫరును రాజ్యాధికారమునుండి యూడబెరికి మీార్ఖాశీమును సింహాసనమెక్కించుటకు పై కారణమే హేతువనుట చరిత్రప్రసిద్ధసత్యమునకు సంపూర్ణవ్యతిరేకమైనను ప్రెసిడెంటునకు నాడు నిరంకుశాధికారము

1 (See. P. 29. Keith Constitutional History of India).
2 (See mr. Keith. P. 30. Constitutional History.)

లేకపోవుటవల్ల వంగదేశము బహుస్వల్పకాలములోనే కొల్లగొట్టబడుటకు కొంతప్రతిబంధకమైనదని యంగీకరింపవచ్చును.

ఫ్యాక్టరీలపరిపాలనము జాగరూకతతో జరుగుచుండెడిదని కంపెనీకి ఫ్యాక్టరీ అధికారులమధ్యను జరిగినయుత్తరప్రత్యుత్తరములననుసరించి తెలిసికొనగలము. కాని, సీమయందలికంపెనీ, రాష్ట్రములయందలి యధికారులపెత్తనముపై ఉత్తరప్రత్యుత్తరముల మూలముగనే పరీక్షాధికారము నిర్వహించుచుండెడిది. అందువల్ల సక్రమముగ జరుగలేదనుటయే సత్యము. కంపెనీయొక్క తాబేదారులనెవరినైనను ఉద్యోగమునుండి తీసివేయుటకును, లేక, శిక్షించుటకునుగూడ కంపెనీకి సర్వాధికారముగలదు. ఇదేవిధముగ కంపెనీయొక్క అధికారపత్రము లేకుండగ హిందూదేశమునందు వర్తకముచేయు నాంగ్లేయులనైనను హిందూదేశమునుండి వెనుకకు మరలించుటకు కంపెనీకి హక్కుగలదు. ఉద్యోగమునుండి తీసివేసినవారినిగూడ హిందూదేశమునందు వర్తకముచేయకుండ నిరోధించుటకు గూడకంపెనీకి పరిపూర్ణాధికారమున్నది. అయిననేమి? ఇవి లిఖితాధికారములే. ఆచరణయందు కంపెనీకి తనయధికారము నెన్నడును వినియోగించుకొనగలిగిన సమర్థతలేకపోయినది. కంపెనీయొక్కసూచనలు సక్రమముగనిర్వహింపబడిన వని చెప్పుటకు సావకాశములేదు. 1

## బొంబాయిరాష్ట్రము.

### శాసనాధికారము; అధికారపరివ్యాప్తి.

### (Legislaton and Jurisdiction)

ఈకాలమునందలి న్యాయపరిపాలనాపరివర్తనమున బొంబాయిప్రాముఖ్యస్థానము వహింపగలదు. ఈపరివర్తనమే యావద్భారతదేశమున కనుక్రమశః వర్తింపజేయబడినది. బొంబాయి ప్రథమమునుండియు రాజుగారియనంతరాధికారమునకు తొలినుండియు వశముగుటయే న్యాయపరిపాలనా పరివర్తన మప్పటనుండి ప్రారంభమగుటకు హేతువు.

---

1 (Keith Page. 30. Constitutional History of India).

2
మార్షలులా ;లేక
సైనికశాసన
పరివర్తనము—

ప్రారంభమున బొంబాయిని మహారాష్ట్రులయొక్కయు, ఔరంగజేబుయొక్కయు దండయాత్రలనుండి సైనిక సహాయమున సంరక్షించుకొనుటయే ప్రభుత్వవిధియైనది. పోర్చుగీసు, డచ్చివారిస్పర్థనుండి కాపాడుకొనుటయే ముఖ్యకర్తవ్యమైనది. అందువల్లనే బొంబాయిప్రప్రథమమునందు సైనికశాసనములచేత పరిపాలింపబడవలసివచ్చినది. (Martial law regulations) ఈయుద్ధపరిస్థితులలో 1662–1667 వ సంవత్సరములలో సైనికశాసనములు ప్రయోగింపబడినవి. సైనికశాసనములుగాని యితరశాసనములన్నియు నాడు పోర్చుగీసుప్రభుత్వమునందములులోనున్నవియే ఆచరణయందుంచబడినవి. "బొంబాయి 1534 లో గుజరాతుసుల్తానుల చేతులనుండి పోర్చుగీసువారివశమైనను, పోర్చుగీసువారిపరిపాలననుండి 1665 లో ఇంగ్లీషుపరిపాలనకు లోబడినను నాటిగవర్నరుగారగు కుక్కుగారికి వెంటనే "ఇంగ్లీషులా"ను ప్రవేశబెట్టుటకష్టమైనపని. కుక్కుగారు 1665 డిశంబరు 23 వ తేదీని తెలిపినటుల "సివిలులా" పరిపాలనము సంతృప్తికరముగనున్నది. ఈద్వీపమాక్రమణజేయుటకుపూర్వము న్యాయువిచారణకు సంబంధించిన తగవులు, తానాజడ్జీగారివిచారణకు పంపబడుచుండెడివి. లేక, యింతకంటెను పైయధికారిన్యాయస్థానమున్న, బాసీనునకు, పంపుటాచారముగనుండెడిది.

ఈకారణమున తగవులస్వభావమును కుక్కుగారే నిర్ణయించుచుండెడివారు. ఈనిర్ణయమునకు సక్రమమగు విచారణయుండెడిదికాదు. కడుమోటుగను, బుద్ధికితోచినట్లుగను నుండెడిది. అందువల్లకుక్కుగారి తగవులనిర్ణయములో లంచములు బుచ్చుకొనుచుండెడివాడని సక్రమముగనే నేరారోపణముజేయబడినది.1 ఈయనపిమ్మట ఈపదవియందుపనిజేసిన లూకానుగారుకూడ కుక్కుగారి న్యాయువిచారణపద్ధతిని మార్చలేదు. కాని, ఆయనయే కేసులను విచారించుచు శిక్షించుచుండెడివాడు. వేరే, శాంతిస్థాపన న్యాయస్థానముల మూలమున విచారణచేయించుచు, శిక్షింపజేయుచుండెడివాడు. ఈయన పిమ్మటవచ్చిన 'గ్రే' కూడ స్వంతముగనే కేసులనువిచారించుచుండెడివాడు. కాని సివిలు 'లా' లో కృతార్థుడైన జడ్జీని నియమించుటసమంజసమను నభిప్రాయ

1 (See Keith P. 30. Constitutional History of India)

మును వెలిబుచ్చుచుండెడివారు. సైనికశాసనన్యాయస్థానములు (Courts-Martial) ఆంగ్లేయనేరస్థులను, నేరస్థులగుసైనికులను మాత్రమే విచారించుటగాక, భార్యాహత్యమొదలగు విపరీతనేరములనుగావించిన స్వదేశస్థులుగూడ విచారింపబడుచుండెడివారు. 1661 వ సంవత్సరమునకుపిమ్మట న్యాయశాస్త్రప్రకారము బొంబాయిలో పోర్చుగీసు 'లా' గాని, పోర్చుగీసుకోర్టులుగాని, లేవని 1845 వ సంవత్సరమున న్యాయస్థానమున నిర్ణయింపబడినది. (Judicially Held.) బొంబాయిపోర్చుగీసువారి నుండి ఆంగ్లేయచక్రవర్తికి సంక్రమించుటవల్ల, ఆంగ్లేయచక్రవర్తియధికారమునకు వ్యతిరేకముగాని శాసనములు కొంతకాలమములులోనున్నవి.1

1688 సంవత్సరపు అధికారపత్రమునుసరించి చక్రవర్తిగారియధికారము నుండి బొంబాయి కంపెనీవారికి సంక్రమింపజేసినపుడు పరిస్థితులన్నియు తారుమారైనవి. ఈఅధికారపత్రమునుసరించి కంపెనీకి శాసనాధికారము, న్యాయవిచారణాధికారముగూడ నొసంగబడినది. కంపెనీశాసనములు, సహేతుకములుగను, ఆంగ్లేయశాసనములకు వ్యతిరేకముగ లేకుండగను అనుసరించియుగూడ నుండవలయునను విధిగలదు. మరియు, ఈన్యాయవిచారణకొరకై యేర్పరుపబడుకోర్టులును, వాటినియమములును, విచారణావిధానమును సీమయొక్క న్యాయశాస్త్రమునుసరించి యుండవలయునని నిర్ణయింపబడెను.2

కంపెనీయొక్క ఈయుత్తరువులుసెప్టెంబరు 1668 లో సూరత్‌ప్రెసిడెంటగు సర్ జార్జి ఆక్సెడన్ గారికి చేరినవి. (Sir George Oxenden.) 1669 లో యీయన బొంబాయికిపోయి, అచట డిప్యూటీగవర్నరునేర్పరచి, ఆయనకు కార్యనిర్వాహకవర్గమును నిర్ణయించెను. ఈసంఘమే సివిలు, క్రిమినలు కేసులను విచారింపసాగినది. సైనికశాసనములననుసరించి ఉరిశిక్ష విధించుటకధికారము గలదని వీరుతలంచియున్నను, యుద్ధములు జరుగుచుండని కాలములో సైనికశాసనములననుసరించి ఉరిశిక్ష విధించుటకువీలులేదని 1628 లో 1 వ ఛార్లెసుగారి కాలమునందలి పిటీషనుఆఫ్‌రైటు (Petition of Right) అధికారము నను

1 See Calvin's Case and Campbell. V. Hall. quoted by Keith. P. 32.
2 Constitutional History of British Empire Keith P. P. 127-31.

సరించియే సూచింపబడియున్నను, 1685 లో రెండవజేమ్సుగారు మార్షలులా కోర్టుల కధికారముగలదని నిశ్చయింపసాగెను. ఆక్సెనుగారీ స్థితిని నిరోధించ జాలకపోయిరి. కాని ఉరిశిక్షను విధించుటకుగల యధికారపరివ్యాప్తిని మాత్రము తగ్గించగలిగెను. 1729 లో కొన్ని నూతననియమములు గావింపబడినవి. ఈనియమములు 1747 లో మదరాసుప్రభుత్వము వారిచే వారి సైనికులపట్ల వర్తింపచేయబడినవి. 1748 లో కంపెనీవారే సైనికనేరములన్నియు, నియమములననుసరించి, ఆచారములననుసరించి, యుద్ధనియమములననుసరించి, విచారింపబడవలయుననియు, ఆజ్ఞాపించెను.1

1754 సంవత్సరములో మాత్ర మీ హిందూదేశమునందలి సైనికశాసనము (Martial) పార్లమెంటువారిశాసనము ననుసరించి ఇంగ్లండునందలి సైనిక శాసనమువలె మార్పుగావింపబడినది. ఈశాసనముననుసరించి చక్రవర్తిగారి సర్వాధికారము నుపయోగించి కంపెనీకి శాంతికాలమునగూడ మిలిటరీకోర్టుల మూలమున సైనికులు—సైనికోద్యోగులు గావించిన నేరములను విచారించుట కధికారమొసగవచ్చునని స్థిరమైనది.

ఆక్సెనుగారు 1669 లో మృతులైనపిమ్మట కంపెనీవారు బొంబాయి ప్రభుత్వనిర్వహణమునకై గావించిన శాసనములు హిందూదేశమునకు చేరినవి. కంపెనీవారు శాసనముల గావించుటకిదియే ప్రథమము. ఈశాసనములలో మతవిషయమైన సహనమువహింపవలెనని మొదటినియమముగలదు. ఒండొరులమతములను దూషించినవారు శిక్షార్హులుగ నొనరింపబడిరి.2

3
సివిలుక్రిమినలు శాసనములు.

రెండవసెక్షనుననుసరించి న్యాయపరిపాలనా విధానము నిర్ణయింపబడినది. ఎవరిహక్కులనైనను తీసివేయుటకును, ఎవరికైనను ఉరిశిక్షవిధించుటకును న్యాయసమ్మతమైన సిబంధనానుగుణ్యమైన 12 మందిజూరీతో విచారణ సలుపవలెను. ఆనాటికిగల వ్యక్తులహక్కులన్నియు గుర్తింపబడినవి. నిర్ణీతమైన విచారణము, శిక్షవిధించుటయు లేకుండగ ఎవరినిగాని జైలునకు పంపుటకు వీలులేదు.

1 Wilson History of Madras Army I. 48.

2 See First Century of British Justice in India P. P. 18-28. By Foweett.

మూడవ సెక్షను ననుసరించి క్రిమినలు నేరములన్నియు విచారింపబడుటకు న్యాయస్థాన మేర్పరుపబడినది. ఈన్యాయస్థానమునకు జడ్జీని కౌన్సిలుయుతుడైన గవర్నరుగారు నియమించుచుందురు. ఈకేసులలో రెండుపక్షములవారును ఆంగ్లేయులే అయినచో 12 మంది, ఆ జ్యూరీలును ఆంగ్లేయులుగనేయుండవలయును. (Jury - మధ్యవర్తులు) ఏపక్షము వారైన ఆంగ్లేయేతరులైనచో, 6 గురు మధ్యవర్తులు ఆంగ్లేయేతరులై యుండవలయును. ఈకోర్టుతీర్పులపై కౌన్సిలుయుతుడగు గవర్నరుగారికి అపీలు చేసికొనుచుండవచ్చును. ఈకౌన్సిలుయుతుడైన గవర్నరుకోర్టే ఉన్నతన్యాయస్థానము. (Supreme Court) శాంతిస్థాపనకొరకును మేజిస్ట్రీటులను పోలీసుఉద్యోగస్థులను నియమించుటకు గూడ అధికార మొసగబడినది. (Justices of the Peace and Constables) ఈశాసనమునందలి నాల్గవసెక్షనుననుసరించి భూములయొక్కయు, ఇండ్లయొక్కయు, దానదమనవిక్రయాదివ్యవహారములన్నియు రిజష్టరు చేయబడుటకు సావకాశము గలిగింపబడినది.

అయిదవసెక్షను ననుసరించి ముఖ్యనేరములకు విధించవలసిన శిక్షలు నిర్ణయింపబడినవి. చాలవిషయములలో అపరాధశిక్షలు ఆంగ్లేయశాసనములకంటె తగ్గింపబడినవి. ముఖ్యముగ దొంగతనము తక్కువ నేరముక్రింద కంపెనీచే పరిగణింపబడినది.

ఆరవసెక్షననుసరించి సైనికసుశిక్షణము, తిరుగుబాటులను గురించిన నేరముల శిక్షలు నారోపింపబడినవి. తిరుగుబాటు, రాజద్రోహము, విప్లవనేరములకు, ఉరిశిక్షనిర్ణయింపబడినది. ఇతరనేరములకు తక్కువ శిక్షలు నిర్ణయింపబడినవి. కార్యరంగమునందున్న సైనికుడు ప్రమత్తుడైనను, అతనికిజరిమానా లేక ఖయిదుశిక్షయు మాత్రమే విధింపబడును. ఈనేరములు సైనికశాసనము ననుసరించిన కోర్టుల మూలముగ విచారింపబడవు. కౌన్సిలుయుతుడయిన గవర్నరుగారు విచారించుచుందురు. లేక కోర్టుమధ్యవర్తులపరముగా (Jury) విచారింపబడుదురు. ఈవిధముగ శిక్షాస్మృతి (అపరాధశిక్షణము) సూక్ష్మముగనుండుట పలువుర వ్యతిరేకాభిప్రాయమునకు గురియైనది. అందువలన, అవసర

సైనికులు యుద్ధనియమములకు సంబంధించిన శిక్షాస్మృతినికూడ ప్రయోగించవచ్చునని కౌన్సిలుయుతుడగు ప్రెసిడెంటుగారు తిరిగి యుత్తరువుల నొసంగిరి.

ఇందువల్ల రెండు శిక్షాస్మృతులును (Two Codes) నొకదానివెంట నొకటి ప్రయోగింపబడుచుండెడివి. కాని ఆచరణయందు సైనికశాసన నియమములే అమలునందుండెడివనుట నిశ్చయము. "ఈకంపెనీ నియమములన్నియు మరి 50 సంవత్సరములలోపుగనే రూపాంతరముపొందినవి."[1]

సమస్తవిధములైన, నేరములును న్యాయస్థానములలోనే విచారింపబడవలెనను సత్యము ధృవపరుపబడుటచే (Aungier) అంగీరు బొంబాయికరుదెంచినాడు. యంగు (Young) గారి తగాయిదా యిరుకక్షులవారిని యింగ్లండునకు పంపివేయుట మూలముగనే పరిష్కరింపబడవలసివచ్చెను. హిందూదేశమునందు జరిగినదనబడు కూనీనేరమునకై, సీమలో విచారించుటకు వీలులేకపోవుటయే, యిందులకు కారణము.[2]

అంగీరుగారు అంతవరకును ఆచరణయందున్న పోర్చుగీసుసాంప్రదాయానుగత్యమగు 'లాను' పూర్తిగరద్దుజేయజాలకపోయినను, బొంబాయి, మహీంములయందు బెంచికోర్టులను నెలకొల్పగలిగెను. ఈకోర్టులకు 200 జరఫినులువిలువగలకేసుల (Xeraphins- A Portuguese Coin Worth About Ish. 6P.) ను విచారించుట కధికారమొసగబడినది. ఈకోర్టులలో స్వదేశస్థులుగూడ సభ్యులుగ నియమింపబడెడివారు. ఆంగ్లేయసుంకముల ఉద్యోగి యీకోర్టులకు ముఖ్యాధికారిగ నుండెడివాడు. (Customs Officer English) ఈకోర్టుతీర్పులపై కౌన్సిలుయుతుడగు డిప్యూటీగవర్నరుగారికి అపీలుచేసికొనుటకు సావకాశము గలిగింపబడినది. ఈ అపీలు కోర్టువారమున కొకపర్యాయము సమావేశమగుచుండెడిది. పెద్దకేసులకు, కంపెనీవారిప్రయోజనమునకు సంబంధించిన కేసులకు, బొంబాయిప్రభుత్వమునకు సంబంధించిన కేసులకు సంబంధించిన అప్పీళ్ళుమాత్రమే విచారించుచుండెడిది.

1 See Keith P. 35. Constiutional History of India.

2 See English Factories in India 1668-9- P. 253 By Foster.

ఈకోర్టు ముఖ్యాగు కేసులలో మధ్యవర్తులను నియమించుచుండెను. (Juries) కంపెనీ 'లా' ను వర్తింపజేయుచుండెను. సివిలుకోర్టులలో మాత్రము పోర్చుగీసు "లా" యింకను ప్రయోగింపబడుచుండెను. ఆంగ్లేయులే, యీ ఉన్నత న్యాయస్థానముచేత మాత్రమే విచారింపబడిరివారు. కంపెనీయు, కంపెనీ యుద్యోగస్థులునుకూడ ఉన్నతన్యాయస్థానముచేతనే విచారింపబడుచుండెడి వారు. అయినను యీడిప్యూటీగవర్నరును, కౌన్సిలుసభ్యులునుకూడ, కంపెనీ యుద్యోగస్థులే యగుటచే వీరితీర్పులు కంపెనీప్రయోజనమున కేవిధముగను, ఎన్నడును వ్యతిరేకముగనుండెడివి కావు. సూరతునందుగల కౌన్సిలు యుండుకు ప్రెసిడెంటుగారికి డిప్యూటీగవర్నరు కోర్టుతీర్పులపై అఫీలుచేయునాచారము క్రమక్రమముగ నిరుత్సాహపరుపబడినది. ఈన్యాయవిధానము 1 వ ఆగష్టు 1672 వ సంవత్సరమువరకును అమలునందున్నది. ఈమేటినుండి ఆంగ్లేయుల 'లా' ఆచరణయందుంచబడినది. కంపెనీయాజ్ఞలననుసరించి న్యాయశాఖ ఏర్పరుపబడినది. (Court of Judicature)

4 న్యాయస్థాన స్థాపనము. 1672. సివిలు తగవులు.

సీమదేశములోవలెనే బొంబాయిరాజధాని నాలుగువందలతాలూకాలక్రింద విభజింపబడినది. (Four hundred Counties) శాంతిస్థాపన న్యాయమూర్తులు నియోగింపబడిరి. (Justices of the Peace) పోర్చుగీసునకు మారు ఇంగ్లీషుభాష ఉపయోగింపబడసాగినది. కోర్టులలో నేరారోపణము చేయుటకుముందుగ నేరమును గురించినవిచారణ సలుపుచుండవలయును. ఈవిచారణనాధారముగగొనియే కేసులుపెట్టవలయును. (Priliminary Enquiry) ఈకేసులనువిచారించు జడ్జీలకు, మేజస్ట్రేటులు తోడ్పడుచుండెడివారు. (Justices) ఈజడ్జియే 1678లో ప్రధానన్యాయమూర్తియని నిర్ణయింపబడినాడు.

1672 మొదలు యీకోర్టు 20 జెరఫిన్సుకిమ్మితునకు లోబడిన సివిలు తగాయిదాలలో తీర్పుచెప్పుచుండెడివి. ఇట్టి సివిలు తగాయిదాలపై అఫీలుండెడిదికాదు. ఇంతకుపై విలువగలిగినసివిలు తగాయిదాలలో కోర్టుమధ్య

వర్తులనుగూడ నియమించుచుండెడిది. వీరిమధ్యవర్తిత్వమునకు రుసుముచెల్లింపబడుచుండెడిది. న్యాయవాదులు వాదించుటకుసావకాశములు కల్పింపబడినవి. ఆంగ్లేయశిక్షాస్మృతియే కొంచెమించుమించుగ నాచరణ కందుంచబడినది. ఆంగ్లేయన్యాయశాసనములు, న్యాయనిర్ణయవిధానము (Substantive law and Statute law and English procedure including arrest and imprisonment) అమలునందుంచబడినవి. న్యాయస్థానపుతీర్పులపై కౌన్సిలుయుతుడగుగవర్నరుగారికి అపీలుచేయునాచారమును నిరుత్సాహమొనరింపబడినది. 1677 సంవత్సరమునాటికే అపీలుపద్ధతి ఆచరణనుండి తొలగిపోయినది. ఈకోర్టే స్థిరాస్థులనుగురించినపత్రములు రిజష్టరీచేయుటగూడ ప్రారంభించినది. 1854 సంవత్సరపుశాసనము నూహించి వస్తువిక్రయపత్రములనుగూడ రిజష్టరీచేయసాగిరి.

5 క్రిమినలు తగవులు. క్రిమినలునేరములు ప్రతిమాసమున వరుసగకొన్ని నిర్ణీతమగు రోజులలో విచారింపబడుచుండెడివి. పెద్దపెద్ద నేరములకు మధ్యవర్తులుగూడ విచారింపబడుచుండెడివారు. అవినీతికరమైన స్వల్పనేరములకును, మతవిషయమైన స్వల్పనేరములకును మాత్రమే మధ్యవర్తుల బిలుచు నాచారములేదు. శిక్షలుమాత్ర మతిఘోరముగ నుండెడివి. దొంగతనమునకు గూడ 1674–5 సంవత్సరములలోవలె మరణదండన విధింపబడుచువచ్చినది. కాని, 1677 లో యింతటి స్వల్పనేరమునకు మరణదండనంతటి ఘోరశిక్షవిధించుట న్యాయవిరుద్ధమని కంపెనీ తనయనంగీకారమును తెలియపరచినది. మరణదండన విధింపబడిన కేసులు కౌన్సిలుయుతుడగు గవర్నరుగారు యోచించి సూరతునందున్న కౌన్సిలుయుతుడగు ప్రెసిడెంటుగారి యోజనకై పంపుచుండవలయును. యోచనానంతరము అప్పుడప్పుడు మరణదండన దొలగించివేయుటయుగలదు. కంపెనీవారి శాసనములలోగల లోటుపాట్లను సవరించుటకై ఆంగ్లేయప్రభుత్వపు సాధారణశాసనములును, ప్రత్యేకశాసనములునుగూడ వినియోగింపబడుచుండెడివి. (Common law and Statue law)

అధికారపత్రముననుసరించి యిట్లు ఆంగ్లేయశాసనములను సివిలు, క్రిమినలు కేసులరెంటియందునుగూడ వినియోగించుట యక్రమముగాదు. సక్రమమే.

యక్షిణీయంత్రతంత్రములను జేయు, స్త్రీ, పురుషులకు, మరణ దండనవిధింపబడుచుండెడిది. (Witch-craft) బిల్లుగారీ మరణదండనల కొకింతయసమ్మతిని చూపించుచుండెడివారు.1 ఈకోర్టువారే త్రాగుబోతుకొంపలపై (Punch-Houses) యధికారము చెలాయించుచుండెడివారు. ఈత్రాగుడుదుకాణములు కౌన్సిలువారిచే లైసెన్సుచేయబడవలసియున్నవి. రహదారిబాటలను వేయుట, మరమ్మతుచేయించుట, ధరలను నిర్ణయించుచుండుటయుగూడ నీకోర్టువారొనరించుచుండెడివారు. ఈయధికారము 1727 వ సంవత్సరమువరకునుగూడ చెలాయింపబడినది. ధరలనునిర్ణయించుటకుగల యధికారము ఆంగ్లేయవర్తకుల లాభముకొరకై వినియోగింపబడినది. ప్రజలలో భయోత్పాతముగలిగించుచు తమరాజ్యస్థాపనమును సుస్థిరమొనరించుకొనుటకే స్వల్పనేరములకుగూడ మరణ దండన విధింపబడుచుండెడిది.

ఈకోర్టుతీర్పుపై 1677 సంవత్సరమున ప్రీవీకౌన్సిలునకు అపీలుచేయబడినది. బొంబాయికోర్టుతీర్పునే ప్రీవీకౌన్సిలు ఖాయపరచినది. ఈరీతిగ నీకోర్టు అధికారమును, కంపెనీశాసనములును సశాస్త్రీయమని గుర్తింపబడినవి. కొన్ని ముఖ్యమగుకేసులు కౌన్సిలుయుతుడగు గవర్నరుగారు జ్యూరీసహాయముతో విచారించుచుండెడివారు.

6 కోర్టునకు స్వాతంత్ర్యము లేకపోవుట; అంతఃకలహములు; 1683 – 85 కోర్టుఎత్తివేయబడుట.

1674 వ సంవత్సరమున డిప్యూటీగవర్నరగు షాక్స్టను (Shaxton) పై తిరుగుబాటునేరము మోపబడి గవర్నరుచే విచారింపబడినది. నేరస్థుడని నిర్ణయింపబడినది. కాని, యీతఁడు, గవర్నరుగారికేసులో స్వప్రయోజనముగలవాడని చెప్పుటచే కంపెనీతుదినిర్ణయమునకీకేసు విచారణకుపంపబడినది. ఈయనననుసరించిన సైనికులు సైనికశాసనములక్రింద విచారింపబడిరి. కంపెనీశాసనములు వర్తింపజేయబడలేదు. న్యాయస్థానపుజడ్జీకి న్యాయనిర్ణయమునందు స్వాతంత్ర్యములేకపోవుటయే, యీన్యాయస్థాననాశనమునకు కారణమైనది. జడ్జీని,

1 (Keith. P. 37. C. H. of India)

కౌన్సిలు నియమించవలసివచ్చుచుండుటచే కౌన్సిలు సూచనలను జడ్జీ ఆచరించుట విధికృత్యముకాసాగినది. న్యాయాధిపతియైనను స్వాతంత్ర్యముతో వర్తింపసాగిన, అతడుద్యోగమునకు తర్పణమొసంగ వలసినదేకాని వేరు గత్యంతరము లేదు. 1677 లో నైకాలీసు (Nicolls) ను ఉద్యోగమునుండి భర్తరఫుజేయుటబట్టియే యీన్యాయస్థానము కౌన్సిలుయొక్క నీడగామాత్రమే పనిజేసియున్నదనుట నిశ్చయము.

ఇందులకుతోడుగ, 1683 వ డిసెంబరు మొదలు 1684 వ సంవత్సరము లోపుగ నిర్వహింపబడిన కేవింగ్సు తిరుగుబాటుఫలితముగ (KeigWins) యీకోర్టుయొక్క సివిలు, క్రిమినలు విచారణమంతయు స్తంభించిపోయినది. కంపెనీ శాసనములుకూడ నిరుపయోగములైనవి.

7 నావికా న్యాయస్థానము

ఈ అంతఃకలహముతో నావికాన్యాయస్థాన మేర్పాటుచేయ బడినది. 2 వ ఛార్లెసుగారు 1683 ఆగష్టు 3 వ తేదీని కంపెనీకొసగిన అధికారపత్రముననుసరించి యీనావికా న్యాయస్థానమేర్పాటుచేయబడినది. (Admirality Court For Maritime Causes). ఈకోర్టునకు నౌకాయాత్రయందు దోపిడిచేయబడిన నేరములను విచారించుటకధికారము గలిగియుండుటయేగాక బొంబాయియందును, బొంబాయిపరిసరప్రాంతముల యందునను జరిగిన నేరములనుగూడ విచారించుట కధికారమొసగబడినది. ఈకోర్టునకు సివిలు 'లా' లోకూడ ప్రవీణుడైన జడ్జీ యధికారిగనుండెను. ఈయనకు కంపెనీవారిచే నియోగింపబడిన మరి యిరువురు సహాయకులుగ పనిచేయుచుండిరి. విచారణకు, న్యాయమూర్తుల చిత్తశుద్ధియే ప్రమాణముగాని వేరుశాసనము లేమియును ప్రమాణములుగావు. (Equity and Good Conscience) వర్తకుల ఆచారవ్యవహారములు, శాసనములు, విచారణయందు గమనింపబడుచుండును. న్యాయమూర్తులనిర్ణయము ననుసరించియే విచారణావిధాన మేర్పాటుచేయబడుచుండును. (Procedure) డాక్టరు ఎస్. టి. జాన్‌గారీన్యాయస్థానమునకు జడ్జీగా నియమింపబడినారు. ఈయనపట్టు దలతో గవర్నరునుండి ప్రధానన్యాయమూర్తి యధికారములనుకూడ సంపాదింపగలిగినాడు. (Chief Jutice of the Judicature) నావికాన్యాయ

స్థానము, సివిలుతగాయిదాల నన్నింటినివిచారించుట కధికారమును గలిగియుండకపోవుటచే (స్థిరచరాస్తులకు సంబంధించినతగాయిదాలు) ప్రధానన్యాయస్థానము కొంతవరకు పనిచేయకుండు టవసరమగుచుండెడిది. అందువల్ల యీ ప్రధానన్యాయమూర్తి యధికారముగూడ జానుగారికి మొట్టమొదటగ నొసంగినను సూరతునందలి బిల్లుగారి కీయనపని నచ్చలేదు. ప్రధానన్యాయమూర్తిగ నీయన కొసగబడిన యధికారములు 1685 మార్చి 27 వ తేదీని తిరిగితీసివేయబడినవి. తరువాత రెండుసంవత్సరముల కీయన నావికాన్యాయస్థానమునుండిగూడ తొలగించివేయబడినాడు.

8
బిల్లుగారినూతన
నిర్వచనము

ఇట్లొనరించుటకుముందుగనే సూరతుగవర్నరుగారు, సర్ జోషియా బిల్లుగారు, కంపెనీయొక్క యధికారములను గురించి 1686 వ అధికారపత్రమునకు నూతననిర్వచన మొసగినారు, ఈయధికారపత్రము ననుసరించికంపెనీకి హిందూదేశములో సర్వాధికారముగల రాజ్యాధిపత్యము సంక్రమించినదని యీయననిర్వచనము.1 సర్వస్వతంత్రాధికారము కంపెనీకిగలదనియు నీయధికారముననుసరించి శాసనాధికారముగలదనియు, శాసనాధికారపరివ్యాప్తిని నిర్ణయించుటకుగూడ కంపెనీకే యధికారముగలదనియు నితరరాష్ట్రములకీయన లేఖలనువ్రాసియున్నాడు. బొంబాయికివర్తింపవలసిన 'లా' ఇంగ్లీషుశాసన పుస్తకములలోలేదనియు, కంపెనీయు, చక్రవర్తియుగావించిన శాసనములే వర్తింపగలవనియు సూరతుకౌన్సిలుగావించిన నియమము లనుసరణీయము లనియు, బిల్లుగారునిర్ణయించిరి. ఈశాసనములు కంపెనీగాని, చక్రవర్తిగాని, రద్దుపరచువరకును అమలునందుండును. 1683, 1686 సంవత్సరములయధికార పత్రములననుసరించి బొంబాయిప్రజలు, సైనికశాసనముననుసరించియే పరిపాలింపబడవలయుననియు, హిందూదేశమునకువలయు సివిలు 'లా' ప్రత్యేకముగ తయారుచేయించవలయుననియు బిల్లుగారివాదము. ఆంగ్లేయశాసనములు ఆనాడు హిందూదేశమునకు వర్తింపవనిబిల్లుగారు గావించినవాదముమాత్రము సక్రమమైనదే. కంపెనీవారి యాజ్ఞలు (Letters of the Company).

---

1 (Hunter History of India ii, 304)

హిందూదేశమందలి కంపెనీయుద్యోగస్థులందరిపైనను శాసనములక్రిందవర్తించు ననియుగూడ బిల్లుగారు నిర్ణయించిరి. 1

ఈనిర్ణయముప్రకారము బొంబాయిడిప్యూటీగవర్నరు హెలెనీ (St. Helene) గారు, 1684 వ సంవత్సరపు తిరుగుబాటుదారులగువారు సైనిక శాసనమునసనుసరించి విచారింపబడవలెనని నియోగింపబడిరి. "ఈవిధముగ కంపెనీ ఆపాదించుకొనిన యధికారము సశాస్త్రీయము కాదు. సివిలువ్యవహారములలో సైనిక శాసనములననుసరించి విచారింపకంపెనీ కధికారమొసగుటకు చక్రవర్తిగారికిగూడ నావకాశములేదు. కంపెనీకి శాసనాధికారమొసగబడి యున్నను, ఆయధికారము ఆజ్ఞలరూపముగ (By Mere letters) గాక సక్రమముగ చెలాయించవలసియున్నది. అందువల్ల సైనికశాసనమునసరించి పరిపాలింపనాజ్ఞనొసగుటకు కంపెనీకే యధికారము సంక్రమింపజాలదు. ఈయుదంతమంతయు చక్రవర్తిగారికిగల సర్వాధికారము దుర్వినియోగముచేయబడినదనియు, 1683 వ సంవత్సరపు విప్లవమునకు దారితీసినదనియు సూచించుచున్నది." 2

కంపెనీ, నావికా, న్యాయస్థానమునకు సివిలుతగాదావిచారణపై యధికారమొసగియుండలేదు. ఈన్యాయాధికారి డాక్టరుజానుగారు చక్రవర్తిగారివల్లను, కంపెనీవల్లనుగూడ నియమింపబడుటచే కంపెనీవారికోపానలజ్వాలలకు గురియగుటయం దాశ్చర్యములేదు. కంపెనీవారిప్రధానన్యాయమూర్తి అధికారమును తిరిగిలాగివేసికొనుటయందువింతలేదు. ఈయన సర్వస్వాతంత్ర్యముగ న్యాయవిచారణయందు వ్యవహరించుటయేగాక తనయధికారపరివ్యాప్తిని (Jurisdiction) విస్తరింపజేయవలెననిగూడ జూచుటయే కంపెనీకోపమునకు గురికావలసివచ్చెను. 3

---

1 To Surat July 14th 1686; To Madras April 8th 1687; the Madras Charter as to the Martial law-December 30 th 1687; Power was given to thePresideut and Council to make temporary by laws)

2 See Mr. Keith P. 30-40 Constitutional History of India.

3 See, Fawlett First Century of British Justice in India P. 142. Keith's. Constitutional History of India. P. 40; Keith's Constitwtional History of First British Empire. P. 350).

డాక్టరుజానుగారు 1687 వ సంవత్సరమున బర్తరఫుచేసినపిమ్మట 1688–1690 వరకు వేబొరన్ గారు (Sir J. Wyborne) ను, పిమ్మట వాక్సుగారును (Vaux) నావికాన్యాయస్థానపుజడ్జీగావంజేసిరి. వాక్సుగారు, కౌన్సిలుసభ్యులుగ నుండి జడ్జీగాపనిచేయుచుండెడివారు. వీరు "ఔరంగజేబునుక్షమింపగోరవెడలిరి."1

9 కోర్టులు అంత మొందుట కౌన్సిలు న్యాయపాలన.

ఇంతతో రెండుకోర్టులనుగూడ అంతరించిపోయినవి. యుద్ధానంతరపరిస్థితులనుండి బొంబాయిని సంరక్షించి సరియగుపరిపాలనమును నెలకొల్పగల మొనగాడులేక పోయినాడు. బిడ్డుగారుదివంగతులైరి.

"ఏకోర్టుగాని మొన్ని యో సంవత్సరములవరకు మరల స్థాపింపబడలేదు. న్యాయపరిపాలనము కౌన్సిలును, గవర్నరును తమయిష్టమువచ్చినటుల కొనసాగింపసాగిరి. రెండవఛార్లెసుగారి అధికారపత్రమునననుసరించి యీవిధముగ కొనసాగింపబడినది."2 ఈకౌన్సిలు నేరమునంగీకరించినయెడలనే శిక్షింపగలదు. డిప్యూటీగవర్నరుగారును, కౌన్సిలును సివిలు, క్రిమినలు కేసులువిచారించుచుండెడివారు. గవర్నరును, కౌన్సిలును శిక్షనువిధించుచుండెడివారు. 1712 వరకు నీవిధముగ డిప్యూటీగవర్నరుచేత న్యాయవిచారణము జరిగించు నలవాటుగలదు.

10 1716 లో న్యాయవిచారణ మరలప్రారంభ మగుట.

1716 లో మరలన్యాయవిచారణవిధానము ప్రారంభింపబడినది. ఈనూతనవిధానమునను సరించి న్యాయస్థానము స్థాపించబడినది. (Judicature). ఇందుముఖ్యముగ కంపెనీవారి నౌకర్లే అధికారమునందుంచబడిరి. కాని, హిందువుల, మహమ్మదీయుల, పోర్చుగీసు, క్రైస్తవుల, పార్శీలప్రతినిధులుగ, నలుగురుభారతీయులుగూడ నిందు నియమింపబడుచుండెడివారు. ఆంగ్లేయులమధ్య తగవులను ముగ్గురుఆంగ్లేయ న్యాయమూర్తులుమాత్రమే విచారించుచుండెడివారు. జ్యూరీపద్ధతి పునరుద్ధరింపబడలేదు. అవసరమయినచోట ఆంగ్లేయ 'లా' ప్రయోగింపబడుటయే గాక, అంతర్జాతీయ 'లా' గూడ ప్రయోగింపబడుచువచ్చినది.

1 (Keith. P. 41)

2 (Keith. Constitutional History of India. P. 41).

"అనాగరికపద్ధతిని, అప్పటికప్పుడు నేరములనంగీకరింపజేయుట తరచుగ నుండెడిది. విచారణలో నిమ్మత్తముచేయుండగనే కోర్టువారి కెదురుతిరిగినవారిని, మౌనముచేసినవారిని శిక్షించుటయు తరచుజరుగుచుండెడిది. సివిలు, క్రిమినలు విషయములరెంటియందునగూడ నీకోర్టునకు సంపూర్ణ అధికారపరివ్యాప్తి గలిగియుండెడిది. హత్యకేసులును, చెరమారలుపట్టిన కేసులకును ఉరిశిక్ష విధింపవచ్చును. ఇట్టికేసులను మాత్రము గవర్నరునకును, కౌన్సిలునకును పంపబడుచుండెడివి. గవర్నరునకును, కౌన్సిలునకును అప్పీళ్ళుచేసికొనవచ్చును. కాని, యీయధికారము తరచు వినియోగించుకొనబడలేదు.

11 కోర్టుల మధ్య గల వ్యత్యాసము

ఈ 1718–1728 లో పనిచేసినకోర్టునకును, 1672–90 లలో పనిచేసినకోర్టునకును మూలసూత్రములయందే వ్యత్యాసముగలదు. మొదటికోర్టు గవర్నరు, కౌన్సిలు ఉత్తరువుల ననుసరించి నెలకొల్పబడినది. గవర్నరు ఉత్తరువులను కంపెనీవారామోదించియుండిరి. రెండవసారికోర్టు కంపెనీవారి ఉత్తరువులననుసరించియే నెలకొల్పబడినది. మొదటికోర్టు సశాస్త్రీయముగ నెలకొల్పబడినదేనా యనుసంశయమునకు స్థానముగలదు. ఉరిశిక్షను గవర్నరును, కౌన్సిలును మాత్రమే విధించుచుండుటవల్ల యీఅనుమానమునకు సావకాశమేర్పడుచున్నది. మొదటికోర్టులో జ్యూరీలుండెడివారు. ఆకోర్టుజడ్జీలు కంపెనీ యుద్యోగస్తులుగనే యుండనవసరముండెడిదికాదు. ఇతరులుకూడ (1675–83 మధ్య నికొలిస్ (గేలవాల) నియమింపబడుచుండెడివారు. రెండవసారి స్థాపింపబడినకోర్టులో కంపెనీయుద్యోగస్తులుమాత్రమే జడ్జీలుగనుండెడివారు. (Bench) కంపెనీయొక్క కౌన్సిలర్లుమాత్రమే ముఖ్యముగజడ్జీలుగనుండెడివారు. ఈరెండవసారి స్థాపింపబడినకోర్టు మొదటికోర్టునకంటె ప్రయోజనకారియని, కేతువంటి రాజ్యాంగచరిత్రకారుల యభిప్రాయము. 1690–1718 మధ్యగలసీతి నియమములులేని న్యాయపరిపాలనావిధానముకంటె రెండవసారి స్థాపింపబడిన న్యాయస్థానవిధానము ప్రయోగకారిగనుండి 1726 వ సంవత్సరపు అధికారపత్రము ననుసరించి మదరాసులో 1687 వ సంవత్సరమునందే స్థాపింపబడిన మేయరుకోర్టు వంటి కోర్టును 1728 లో స్థాపించుటకుదారితీసినది. 1688 లోనే మేయరుకోర్టును

బొంబాయిలోగూడ స్థాపించవలెనని సూచింపబడినది. కాని, బిల్లుగారందుల కంగీకరించలేదు. తదుపరి బోనుగారుకూడ (Boone) ప్రతిఘటించిరి. అయినను 1718 వ న్యాయస్థానవిధానమునం దీచిహ్నాలుమాత్రమేకలవు. ఈన్యాయ స్థానస్థాపనకు చక్రవర్తిగారియధికారపత్రము సంపాదింపబడినది. (Royal Charter) చక్రవర్తిగారి యధికారపత్రము లుండినపుడే యీన్యాయస్థాన నిర్ణయముల ఆంగ్లేయన్యాయస్థానములు పాటించగలవు. ఈయధికారపత్రము ననుసరించియే కౌన్సిలునకును, గవర్నరునకును శాసనాధికార మొసగబడినది. వెనుకబిల్లుగారు సూరతుకౌన్సిలునకాపాదించుకొన్న సర్వాధికారము గుర్తింపబడలేదు. బొంబాయికౌన్సిలే స్వల్పవిషయములకు సంబంధించిన నియమములను గావించుకొనినది. ఈనిబంధనలు (Regulations) ఆంగ్లేయనిబంధనల ననుసరించియేయున్నవి. కాని సంపూర్ణమైన శాసనాధికారము చెలాయింపబడిన నిదర్శనములుమాత్రముగోచరింపవు.

12
1726
ఉత్తరువులు
Letters Patent
మేయరుకోర్టు:

1726 సెప్టెంబరు 24 వ తేదీని జారీచేయబడిన ప్రత్యేకాజ్ఞ (Letters Patent) ల ననుసరించి మునిసిపలు కార్పొరేషను స్థాపింపబడినది. ప్రతిసాలున యీకార్పొరేషనుకు మేయరు ఎన్నుకొనబడుచుండును. ఎల్డరుమను, మేయరునుగలిసి మూడవమేయరును ఎన్నుకొనుచుండును. ఈమేయరు ఆంగ్లేయుడే అయియుండవలయును. "ఎల్డరుమను జీవితపర్యంతము నుద్యోగమునందుందురు. మధ్యమధ్యవచ్చుఖాళీలను, మేయరును, ఎల్డరుమనుకలిసి ఎన్నుకొనుచుందురు. ఇట్లెన్నుకొనబడువారు సుప్రసిద్ధులగు పౌరులుగనుండవలయును. ఈఎల్డరుమను, గవర్నరు కౌన్సిలువారిచేత తీసివేయబడవచ్చును. తీసివేయునపుడు తగుకారణములు నిరూపింపబడవలయును. ఇట్లుతీసివేయబడినపుడు ఎల్డరుమను కౌన్సిలుయుతుడగు చక్రవర్తిగారికి అప్పీలు చేసికొనుచుండవచ్చును. (ఎల్డరుమెన్ అనగా పెద్దవాడు. ప్రముఖుడు) ఎల్డరుమను 9 గు రుందురు. ఇందు మేయరును — మరి 7 గు రును

గూడ ఆంగ్లేయులుగ నుందురు. అనగా 1 డు మాత్రమే ఆంగ్లేయేతరుడు ఎన్ను కొనబడుచుండవలయును.

13 మేయరుకోర్టు; అధికారములు

మేయరును, ఎల్డరుమనుగలిగి కోర్టుక్రింద పరిగణింపబడినది. (A court of Record) మేయరును, మరి యిద్దరు ఎల్డరుమెన్ కలిసి సివిలుదావాలను విచారించుట కధికారము కలవారైరి. మదరాసులోగాని, మదరాసుఫ్యాక్టరీఅధీనమందున్న ఫ్యాక్టరీలలోగాని సంభవించు తగాయిదాలను వీరువిచారించుట కధికారముగలదు. ఇంగ్లీషు'లా'ననుసరించి వీరివిచారణ విధాన ముండవలయును. ఈకోర్టుతీర్పుల నమలుజరుపుచుండుటకు ఏయేటికాయేడొక షరీఫును, గవర్నరును-కౌన్సిలునుకలిసి నియమించుచుండెడివారు. జ్యూరీ లుండెడివారుకారు. మొట్టమొదటగ యీకోర్టుతీర్పులపై గవర్నరు, కౌన్సిలునకు అప్పీలుచేసికొనవచ్చును. తగాయిదా 1000 పెగోడాలకు మించినదైనచో కౌన్సిలుయుతుడగు చక్రవర్తిగారికి కడపటిఅప్పీలు చేసికొనవచ్చును. (పెగోడా అనగా సుమారు మూడురూపాయలవిలువగల బంగారునాణెము)

(క్రిమినలు కేసులను) నేరములను గవర్నరుగారును, ఆయనకౌన్సిలరులలో హెచ్చుకాలము కౌన్సిలరులుగాపనిచేయుచుండిన మరినలుగురు కౌన్సిలరులును గలిసి విచారించుట కధికారమొసగబడినది. వీరికి, సీమయందలిశాంతిస్థాపన న్యాయమూర్తులకుగల (Justices of the Peace) యధికారములొసంగబడినవి. వీరు సాలునకు నాలుగుపర్యాయములు నేరములను విచారణచేయుచుండెడివారు. (Quarter Sessions Four Times a Year),

ఆంగ్లేయశాసనముల ననుసరించుచు వాటికి వ్యతిరిక్తముగాని శాసనములను, నియమములను కార్పొరేషనుల పరిపాలనముకొరకు గావించుటకు గవర్నరు కౌన్సిలునకును శాసనాధికారమొసగబడినది. ఈశాసనముల నుల్లంఘించువారికి, శిక్షాస్మృతినిగూడ శాసించుటకు గవర్నరుకౌన్సిలున కధికారముకలదు. ఇట్లధికార మొసగుటకు కంపెనీడైరక్టరుల కోర్టుగూడ ఆమోదించినది.

ఈమేయరులకోర్టునకు విల్లుమూలముగ దఖలుబడుఆస్తిహక్కులను గురించి విచారించునపుడు రుజువుభారమును తీసివేయుటకుగూడ నధికార మును గలిగియుండెను. ఈకోర్టునకే విల్లులేని ఆస్తులనుగురించి యోజించుటకు గూడ ప్రత్యేకాధికార మొసగబడినది. 1727 నవంబరు 17 వ తేదిని జారీ చేయబడిన ప్రత్యేకాజ్ఞలవల్ల ఈకోర్టువిధించు జరిమానాలన్నియు కంపెనీవారికి చెందవలయునని నిర్ణయింపబడినది. ఈసిద్ధాంతమే నేటివరకు నాచరణ యందున్నది.

1726–1727 వ సంవత్సరముల యధికారపత్రముల ననుసరించిన అధికార ములయందు 1753 జనవరి 8 వ తేదీని యొసంగబడిన అధికారపత్రమునను సరించి యీకోర్టు నిర్మాణాధికారములో మార్పులుసంభవించినవి. ఎల్డరుమెన్‌స్థాన ములలో మధ్యమధ్యవచ్చుఖాళీలను కార్పొరేషనుభర్తీచేసికొనుటకు మారుగ; కౌన్సిలుతోకూడిన గవర్నరు భర్తీచేయుట కధికార మొసగబడినది. మేయరు కోర్టునకు పెగోడాలవిలువలకుపైబడినసివిలుదావాలలో విచారణాధికారముగలదు. ఈకోర్టు తనతీర్పుల నమలుజరుపజాలనపుడు, అప్పీలుపై గవర్నరు–కౌన్సిలును అమలుజరుపుచుండురు. వాజ్మూలమును క్రైస్తవులు ప్రమాణముజేసి యొసగ వలయును. హిందువులు ఆత్మసాక్షికరముగు రీతినొసగవలయును. కంపెనీ వారిచే తేబడుదావాలు లేక కంపెనీపై తేబడుదావాల విచారణకు ప్రత్యేకనియ మములేర్పరుపబడినవి. కంపెనీవారి యామోదమునకు లోబడి న్యాయవాదుల వాదమునకు వలయునియమముల నేర్పరచుటకు కోర్టున కధికారముగలదు. (Rules of Practice) 5 పెగోడాలవిలువవరకుగల దావాలనువిచారించుటకు గవర్నరు–కౌన్సిలుచేతనియమింపబడిన కమీషనరుల పట్టికనుండి ముగ్గురుకమీ షనరులతోగూడిన కోర్టుపర్పరుపబడెడిది. (A Court of Requests) గవర్న రునకుగల కౌన్సిలుసభ్యులందరును శాంతిస్థాపనన్యాయమూర్తులుగ నొనరింప బడిరి. (Juitices of Peace) మరియు, కంపెనీవారికోర్టుల తీర్పులను తమ న్యాయశాస్త్ర సలహాదారులచే పరీక్షింపచేయుచుండెడివారు. ఆంగ్లేయ శాసనముల ననుసరించి విచారించుచుండవలయునని తరుచు యీకోర్టు

మందలింపబడుచుండెడిది.

ఈవిధముగ బొంబాయికోర్టు హైందవుల సివిలుహక్కులవిషయమున గూడ ఆంగ్లేయశాసనములను వర్తింపజేయజూచుచుండుట అక్రమపద్ధతియని మొదటినుండియు వివిధరీతులగుర్తింప బడుచునేవచ్చినది. హైందవధర్మ విధులను వర్తింపజేయవలెనని పైపై ప్రయత్నము లొనరింపబడినను సక్రమముగ నెన్నడును నిర్వహింపబడలేదు. 1673-4లో కంపెనీవారిసూచన ననుసరించి అంగీరు (Aungeer) పంచాయితీల అధికారము లేక, కులపెద్దలయధికారమును గుర్తించి యున్నాడు. కాని రెండుపక్షముల వారును ఏకీభవించి కోరునపుడే పంచాయితీలు కులసంబంధముగు పరస్పరతగాయిదాలతీర్పు చెప్పుచుండెడివి. లేనియెడల కోర్టు తీర్పు చెప్పుచుండెడిది. గాయముల పోటజరుగు నేరములను పంచాయితీలే మేజస్ట్రీటులకు దెలుపవలయున శ్లేర్పరుప బడినది. (Justices of the Peace) తల్లిదండ్రులుచనిపోయినవారి (Orphans) ఆస్తులను పంచాయితీలే జాగరూకతతో కాపాడవలయును.

1718 వ సంవత్సరపు న్యాయస్థానవిధానము ననుసరించి కులపెద్దలు ప్రాథమిక న్యాయస్థానములక్రింద (Inferior Court) గుర్తింపబడిరి. కుల సంబంధవ్యవహారముల నిర్ణయముపట్ల వారికధికార మొసగబడినది. ఈతీర్పుల పైన ప్రధానన్యాయ స్థానమునందపీలు చేసికొనవచ్చును. పోర్చుగీసు పరిపాలనకాలమునందీ పద్ధతియుండెడిది. ఆపద్ధతియే అనుసరింపబడినది. ఈ కులపెద్దలే సైనికులనుసమకూర్చుచుండెడివారు. పన్నులను వసూలుచేయు చుండెడి వారు. పంచాయితీలకు మారుగ నీకులపెద్దలకే తల్లిదండ్రులు బ్రతికి లేని పిల్లల ఆస్తులసంరక్షణాధికారము నంక్రమింపజేయబడినది. కోర్టు వీరిని తరచీవిషయములలో సంప్రదించుచుండెడిది. మహమ్మదీయుల కుల వ్యవహారము విషయములలో బాగులాలు, ఖాజీలు కులపెద్దలవలె వ్యవహరించుచుండెడివారు. ఈవిధముగ కోర్టు బలమును చేకూర్చుకొనినది. పంచాయితీల శిక్షలనుగూడ నొకప్పుడుత్రోసి రాజనుచుండెడిది.

మేయరుకోర్టుగూడ నిట్టియధికారమును చెలాయింపసాగినది. కాని 1730 లో కౌన్సిలుతో విరోధమునంభవించినది. మేయరుకోర్టునకు మత,

సాంఘికవిషయములలో తగవులను దీర్చుటకధికారము లేదని కౌన్సిలు నిర్ణయించినది. మేయరు తన న్యాయాధికార స్వాతంత్ర్యమును కాపాడుకొనజూచెను. ఈస్వాతంత్ర్యకాంక్ష కౌన్సిలునకు నచ్చలేదు. కౌన్సిలునకు కార్యదర్శిగ మేయరు పనిచేయుచుండెడివాడు. మేయరీపదవినుండి కౌన్సిలుచే తొలగించివేయబడినాడు. ఈరూపముగ మేయరు శిక్షింపబడినాడు. కాని, కంపెనీవారు కౌన్సిలుచర్యనుహర్షించలేదు. కోర్టునకు న్యాయవిచారణ ... స్వాతంత్ర్యము గలదని రూఢిచేసిరి. అయినను, యీ అంతః కలహములకు ఫలితముగ్గలిగినది. 1753 సంవత్సరము సందీవిషయములలో ప్రత్యేకాజ్ఞ లొసగబడినవి. జాతీయులమధ్య సంభవించు తగాయిదాలలో రెండుపక్షము లేకమై తగవు దీర్చకోరినపుడే మేయరుకోర్టుజోక్యము కలిగించుకొనవలెనని యాజ్ఞాపింపబడినది. కాని, ఆచరణయందు బొంబాయిలో, ... పాటింపబడలేదు.[1] యీవిధముగ బొంబాయిలో న్యాయాధికారము ... ... లేదు. సక్రమముగ లేదు. తగవు ... ర్తకముచేయువారిని విచా... సులో ... నుగూడ వీరే ... రించు

మదరాసు; శాసనాధికార ... మదరాసావాలు ... రపరివ్యాప్తి.

... రించి ... న

(Legislation and Ju... ...ion)

బొంబాయిలోవలెకాక ... సులో హిందూదేశస్థులపై

14 అధికారము స్వదేశరాజ్యమునుండి సంక్రమింపవలసి వచ్చినది. ఆంగ్లేయులపై కంపెనీవారి యధికారపత్రముల మూలముగ సంక్రమింపవలసివచ్చినది. 1661 సంవత్సరపు అధికారపత్రమునను సరించియే న్యాయవిచారణకధికారము సంక్రమించియున్నను, 1666 వ సంవత్సరమువరకు ఆంగ్లేయులపై న్యాయాధికారము చెలాయింపసాగలేదు. 1665 లో కంపెనీవారీవిషయమై మదరాసుగవర్నరునకు వ్రాసిరి. జ్యూరీపద్ధతిని కోర్టు స్థాపింపబడినది. 1678 లో బొంబాయిపద్ధతిని మదరాసుకోర్టు సంస్కరింపబడినది. ఆంగ్లేయశాసనముల ననుసరించి జ్యూరీతోకలిసి సివిలు — క్రిమినలు కేసుల నీకోర్టు విచారించుచుండెడిది.

---

1 (See Morely Digest; Inter, P. C. IXIX; ii 343)

1686 లో నావికాన్యాయస్థానమేర్పరుపబడి యీకోర్టు రద్దుచేయబడినది. బొంబాయిలోకంటె మదరాసులో నావికాన్యాయస్థానమెుకింత బాగుగ పని చేసినదని చెప్పవచ్చును. ఇందులకు 1687 లో న్యాయవాదియగు బిగ్సుగారు జడ్జీగా నియమింపబడుటయే కారణమనబడుచున్నది. ఈయనకంపెనీకి విశ్వాసపాత్రుడగుట నీయనకోర్టునిజయమున కొకకారణముగ నెంచబడుచున్నది. ఈనావికాన్యాయస్థానమే ప్రధానన్యాయస్థానముగ గూడ పనిచేసియున్నది. (Supreme Court)

1688 సంవత్సరములో నొసగబడిన అధికారపత్రము ననుసరించి కార్పొరేషను నెలకొల్పబడినది. కార్పొరేషను నెలకొల్పబడిన పిమ్మట అప్పీళ్ళ విచారణాధికారము...ర్లున కొసంగబడినది. గవర్నరు-కౌన్సిలునకు అప్పీళ్ళను రిం...పోయిన వారి తీసివేయబడినది.

కాపాడవలయును.

... రేషను విపరీతపరిస్థితులలో నెలకొల్పబడినది. 1686 వ సంవత్సరమునందు ...త్సరవు ...సులో ఇంటిపన్ను విధింపబడినది. ఈయింటిపన్ను చెల్లింపప్రజలు నిరాక...ములక్రి...సహాయనిరాకరణోద్యమమును సాగించిరి. "ఈఅనహాయత్వమునుండి ప్ర...య...యురల్పవలెనను కోరికయే కార్పొరేషను స్థాపింపబడుటకుగల కారణము."1 కార్పొరేషనునకు ఆంగ్లేయుడే మేయరుగనుండవలెను. పన్నెండుగురు ఎల్డరుమెన్లుందురు. ఇందు 3 గ్గురు ఆంగ్లేయులుగనుండి తీరవలయును. ఇతరు లేజాతివారైననుసరే. 1 ఫ్రెంచివాడు, 2 రు పోర్చుగీసు వారు, ముగ్గురు హిందువులు, ముగ్గురు జ్యూలు లేక అమెరికావర్తకులు మొట్టమొదటగ కంపెనీచే నియమింపబడియుండిరి. ఇందులకు తోడుగ నుండు 120 మందిలో 60 మంది కులపెద్ద లుందురు. ఈ సంస్థ మునిసిపలుసంస్థలను నెలకొల్పజాలకపోయినది. పన్నులను హెచ్చింపజాలక పోయినది. కాని న్యాయస్థానముక్రింద మాత్రమే పనిచేయగలిగినది. మేయరును, యితర ఎల్డరుమెన్‌గలిసి సివిలుదావాలవిచారణకై న్యాయస్థానముగ పని చేయుచుండెడివారు. మేయరును, ముగ్గురు మొదటి ఎల్డరుమెన్ కలిసి శాంతి

1 (Keith. Constitutional History of India. P. 46).

స్థాపనజడ్జీల క్రింద నేరములను విచారించుచుండెడివారు. వీరితీర్పులపై నావికా న్యాయస్థానమునకు అప్పీళ్ళను విచారించుట కధికారముండెడిది. అయితే యీ అప్పీళ్ళవిలువ 3 పెగోడాలకంటె హెచ్చుగనుండవలయును. లేక ఉరిశిక్ష విధింప బడినపుడు లేక అవయవమునుగొట్టించివేయు శిక్ష విధింపబడినపుడుగాని నావికా న్యాయస్థానమునకు అప్పీలుచేసికొనవచ్చును. (Admirality Court) ఉరి శిక్ష వేయుటకీ కోర్టున కధికారములేదని వాదింపబడినది. కాని, 1712 వ సంవ త్సరమునందీయధికారముకలదని కౌన్సిలు అంగీకరించినది.[1] 1688 మొదలు 1689—1692 మొదలు 1704 వరకునునావికా న్యాయస్థానము పనిచేయుచుండెడిది. ఈకాలమందు అప్పీళ్ళు యీన్యాయస్థానమునందు విచారింపబడుచుండెడివి. ఈ న్యాయస్థానము లేనికాలమున అప్పీళ్లు గవర్నరును—తాత్కాలికముగ నియమింప బడిన నలుగురున్యాయమూర్తులును విచారించుచుండెడివారు. 1704 నకు పిమ్మట నావికాన్యాయస్థానపు టధికారములు గవర్నరు—కౌన్సిలే యుపయోగించు చుండెడివారు. వీరే కంపెనీవారియాజ్ఞ లేకుండగ వర్తకముచేయువారిని విచా రించుచుండెడివారు.[2] మేయరుకోర్టుతీర్పులపై అప్పీళ్ళనుగూడ వీరే విచారించు చుండెడివారు. నూరుపెగోడాలవిలువకు పైబడినదావాలు 1698 మొదలు, కంపెనీవారల, నాటిగవర్నరగు పిట్టుగారికొసగిన సూచనల ననుసరించి, గవర్నరు—కౌన్సిలుచేత విచారింపబడుచుండెడివి.

ఈకోర్టులయధికారమునకు స్వదేశీయులుగూడ లోబడియేయుండెడివారు. "హిందూదేశస్థులు తరుచు ఉరితీయబడుచుండెడివారు. ఆంగ్లేయులు ఇంగ్లీషు 'లా'ను ఆధారముగ తీసికొని శిక్షనుతప్పించుకొనుచుండెడివారు. 18 వ శతాబ్దము నందీస్థితియే బొంబాయి, కలకత్తాలయందుగూడ ప్రబలియుండెడిది. కల కత్తాయందు భారతీయులు ఉరిశిక్షలకు గురియగుటయేకాక నదినిదాటించి పంపి వేయబడుచుండెడివారు. స్వదేశరాజులు తమయధికారమును బలవంతముగ నిర్వహించుకొన జాలకపోవుటయే భారతీయులపై ఆంగ్లేయు లిట్టిశిక్షణాధికార

---

1 (Loue vestiges of old Madras ii, 174-175).

2 (Inter lopers were being tried as pirates by admirality courts; see wheeler, Madras i. 320; Anderson, The English in western India. p. 257).

మును నిర్వహించగలుగుటకు కారణము. ఆంగ్లేయుల ప్రాపకముకొరకు స్వదేశ రాజు లెట్టిపనికైనను సమ్మతించుచుండెడివారు.

మొట్టమొదట భారతీయులతగవులు గ్రామాధికారియే తీర్చుచుండెడివాడు. ఈయన గ్రామకచేరీ చావడియందుగాని, సత్రమునందుగాని, కూర్చుండి తగవులను దీర్చుచుండెడివాడు. 1654 సంవత్సర ప్రాంతమునందీపద్ధతి మార్పు గావింపబడినది. ఇరువురాంగ్లేయులుగూడ పంచాయితీదార్ల క్రింద నియామింపబడుచుండెడివారు. తరువరి స్ట్రేన్సుహాము మాష్టరుగారి సంస్కరణవిధానము ననుసరించి, ముగ్గురుఆంగ్లేయులు పంచాయితీదారులుగ నియమింపబడుచుండెడివారు. ఇందు యిరువురు హాజరయి తగాయిదాలు తీర్చుచుండవచ్చును. వీరికి సివిలు, క్రిమినలుఅధికారములు రెండునునొసగబడినవి. 50 పెగోడాలకులోబడిన ఋణవిషయములను, చిల్లరనేరములను, విచారించుటకువీరి కధికారముండెడిది. రెండుపక్షము లంగీకరించుచో, దావావిలువతో నిమిత్తములేకుండగనే విచారింపవచ్చును. జ్యూరితోగూడి గవర్నరు కౌన్సిలు అప్పీళ్ళను విచారించవచ్చును.

1688–9 లో మేజస్ట్రీటులకుమారుగ ఎల్డరుమెన్‌లే పనిచేయుచుండెడివారు. ఒకప్పుడు ప్రత్యేకాధికారులుగూడ నియమింపబడుచుండెడివారు. వీరు కొరడాతోకొట్టుట (Whipping), జరిమానాలనువిధించుట (Fines), ఖయిదుచేయుట (Imprisonment), బండనువేయుట (Pillory) మొదలగుశిక్షలను విధించుచుండెడివారు. 1727 లో సత్రవుకోర్టులనురద్దుచేయుటకై గవర్నరు–కౌన్సిలు ప్రయత్నించినది. కాని, కంపెనీవారిందుల కంగీకరించలేదు. 1753 వ సంవత్సరపు అధికారపత్రముననుసరించి షరీపుకోర్టులనుపెట్టు ఆవశ్యకత గుర్తింపబడినది. 1775 లో మాత్రమేమదరాసునందలి సత్రవుకోర్టుల అధికారముకొంత తొలగింపబడినను, 1783 లో మదరాసుఎడ్వకేటుజనరలు భారతీయులనేరములను విచారించుటకై, కోర్టులను నిర్మించుటకు కంపెనీవారి కధికారములేదని వాదించియున్నను, 1800 సంవత్సరము వరకును సత్రముకోర్టు నేరములను విచారించుచుండెడిది. 1800 సంవత్సరమున సత్రముకోర్టులు రద్దుచేయబడినవి.

1726 వ సంవత్సరపు అధికారపత్రమునను సరించి మేయరుకోర్టు నిర్మింప బడినపిమ్మట యితర మేజస్ట్రీటుకోర్టులు రద్దుచేయబడినవి. మేయరుకోర్టు సర్వస్వ తంత్రముగ వ్యవహరింపబూని భారతీయులయెడ నిర్దాక్షిణ్యముగ ప్రవర్తించు చుండెడిది. ఒకప్పుడు గవర్నరు కోర్టుతో నంగీకరించుచుండెడిది. వేరొక ప్పుడు వ్యతిరేకాభిప్రాయమును జూపుచుండెడివాడు. 1736 లో నిరువురవర్త కులను ఖయిదులోబెట్టి మేయరుకోర్టు అన్యాయముగ దీక్షవహించినప్పుడు కంపెనీ మేయరుకోర్టును ఖండించినది. గవర్నరావర్తకులను హామీమీద విడుదల చేసినాడు. భారతీయులు పెగోడాప్రమాణము చేయవలసియున్నది. (అనగా దేవాలయములో నేరమునుగురించి ప్రమాణముచేయుట) ఈకోర్టువారే న్యాయ శాస్త్రమునను సరించి భారతీయులవ్యవహారములను పరిష్కరించుటయును సమస్య వచ్చినది. కంపెనీ ఆంగ్లేయన్యాయశాస్త్రము ననుసరించియే కేసులు విచారింప బడవలెనని నిర్ణయించినది. భారతీయుల ఆచారములు గుర్తింపబడవలెనను సూచనమాత్రము గలదు ఇందువల్ల మదరాసుపౌరులుకంపెనీకి అప్పీలుచేసి కొనియుండిరి. కంపెనీ తన 1731 ఫిబ్రవరి 12 వ తేదీ ప్రత్యుత్తరమునందు భారతీయులతగాయిదాలు వారిలోవారే తీర్చుకొనుచుండవలయుననియు, లేక, వారు తమంతతాము నియమించుకొను పంచాయితీదారులమూలకముగ తగవు లను నివారణచేసికొనవచ్చుననియు, లేక, వారియిష్టమువచ్చిన మరేవిధముగ నైనను పరిష్కారముగావించుకొనవచ్చుననియు దెలిపిరి. కాని, కోర్టుమూలక ముగ తగవుపరిష్కారము చేసికొనదలచినపుడుమాత్రము ఇంగ్లీషు 'లా' వర్తింపజేయుకతప్పదని స్పష్టముగజెప్పిరి. ఈసూత్రమే ఆంగ్లేయులకును, భారతీయులకును, మధ్యసంభవించు తగవులకుగూడ వర్తించునని దెలుపబడినది. ఈసూత్రమునను సరించి 1753 వ అధికారపత్రమునను సరించి భారతీయులమధ్య సంభవించుతగవులలో రెండుపక్షములవారును ఏకీభవించి కోరినపుడే కోర్టుకలుగ జేసికొనగలదని నిశ్చయింపబడినది. కాని, ఆచరణయందీసూత్ర మెంత మాత్రమును అమలులోనికిరాలేదు. సత్రపుకోర్టు, లేక, పంచాయితీకోర్టు కధికార మతిస్వల్పముగనున్నది. మేయరుకోర్టు తప్పనిసరిచేయబడినది. 1770 లో భారతీయ ఆచారవ్యవహారముల ననుసరించు ప్రత్యేకన్యాయస్థానము నేర్పరచు టనుగురించి యొకింత యోచింపబడినది. 1795 లో పైరీతిగ వ్యవహరించుటకు

గాను కచేరీకోర్టు (Court of Cutchery) ఏర్పరుపబడినది. కాని, 1798 లోనే యీకోర్టు రద్దుచేయ బడినది. రికార్డులకోర్టు తిరిగిస్థాపింపబడినది. ఈకోర్టు భారతీయాచార వ్యవహారసాంప్రదాయము ననుసరించి కేసులనువిచారించుట కొంతవరకు ప్రారంభించినది.

## కలకత్తా

### శాసనాధికారము; అధికార పరివ్యాప్తి.

వంగదేశమున ప్రారంభదశయందు కంపెనీ ప్రభుత్వ
15 అంగనిర్మాణము, బొంబాయి, మదరాసు రాష్ట్ర
ములయం దున్నంతమాత్రము గూడ లేదు. న్యాయ పరిపాలన, కార్యనిర్వహణము రెండును గూడ కొరవడియే యున్నవి. గవర్నరు కౌన్సిలును ఏర్పరచుటకు తగినంతగ, వంగము, కంపెనీకి లాభసాటి బేరము కాలేదు. 1661 వ సంవత్సరపు అధికారపత్రము గవర్నరు కౌన్సిలునకే న్యాయవిచారణాధికార మొసగబడుటచే న్యాయవిచారణకు వీలుగలుగలేదు. నావికాన్యాయస్థాన మిచ్చుట పనియేచేయలేదు. 1686, 1688, 1693 వ సంవత్సరములయందు నిరూపించబడిన అధికారముననుసరించి ఏకోర్టుగాని, ఎన్నడును పని చేసియుండలేదు. 1698 వ సంవత్సరమునుండియు నేరస్థులు మదరాసు కోర్టునకు విచారణకై పంపబడవలయునని నిర్ణయింపబడినది. 1699 సంవత్సరాంతమునందే వంగదేశము గూడ నొకరాష్ట్రముక్రింద గుర్తింపబడినది. గవర్నరు–కౌన్సిలు ఏర్పరుపబడినది. నాటినుండియు యీ గవర్నరు–కౌన్సిలు న్యాయవిచారణాధికారమును గలిగియుండిరి. 1704 లో మాత్రమే న్యాయవిచారణకై ముగ్గురుసభ్యులతో గూడిన నొక కమిటీ నియమింపబడినది. వీరికి స్వల్పనేరములను విచారించుట కధికారముండెడిది. కాని, యీకమిటీ నేరములను సక్రమముగ నెన్నండును విచారించియుండలేదు.1

కంపెనీవారు సుతానతి (Sutanati) గోవిందపూరు (Govindapur)

1. (See Keith P 40 Constitutional History of India).

కలకత్తా గ్రామములను కొనుటమూలముగ భారతీయులపై కంపెనీ వారికి యధికారము సంక్రమించినది.1

ఆనాడు వంగదేశమునందుగల ప్రభుత్వాధికారమునందు జమీందారులకు నేరస్థులను శిక్షించుటకుగూడ అధికారముండెడిది. కొరడాతో కొట్టుట, జరిమానాలను విధించుట, ఖయిదుచేయుట, మొదలగు శిక్షలను జమీందారులే విధించుచుండెడివారు. గ్రామములను కొనుటవల్ల లభించిన యీ సివిలు, క్రిమినలు అధికారమును కంపెనీ పరిపూర్ణముగ చెలాయింపసాగినది. గవర్నరు కౌన్సిలులోని యొకసభ్యుడు పైవిధమగు జమీందారీ కోర్టును పెట్టుచుండెడివాడు. సివిలు, క్రిమినలు కేసులను విచారించుచుండెడివాడు. కలకత్తా "బ్లాకుహోలు" దురంతమని చరిత్రయందు పేర్కొనబడిన సమయమునందు కలకత్తా కలెక్టరుగా 1752–1756 లో పనిచేసియుండిన, హాలువెలుగా కీ జమీందార్ల కోర్టును గురించి వ్రాసిన వ్రాత గమనీయము. "కంపెనీవారి జమీందారికోర్టులో న్యాయవిచారణ కొకనీతిలేదు. (Procedure). ఆస్తికి సంబంధించి, తగాయిదాలలో ప్రెసిడెంటు కౌన్సిలునకును అప్పీలును చేసికొనవచ్చును. ఉరిశిక్షలలో ప్రెసిడెంటుగూడ అంగీకరింపవలసియున్నది. ఈ ఉరిశిక్ష నమలు జరుపుటయు నతిఘోరముగ నుండెడిది. చచ్చిపోవువరకును కొరడాతో గొట్టి చంపబడుచుండెడివారు. (Infliction of the lash until deah).2 మామూలుగ ఏ జమీందారైనను ఉరిశిక్షను విధించుచో వ్యాఘ్లియుం దుండు ఫౌజుదారునకును (Faujdar), మూర్షిదాబాదునందుండు నైజాము ప్రభువునకును అంగీకారముకొరకై పంపబడవలసియున్నది. కంపెనీకిగూడ జమీందారుహోదాయే లభించుటచే ఉరిశిక్షలను తనంతటాను అమలు జరుపుటకు నాటి న్యాయశాస్త్రముప్రకారము వీలులేదు. అయినను కంపెనీవారు ఉరిశిక్షలను మహమ్మదీయచక్రవర్తిగారి యంగీకారము లేకుండగనే విధింపసాగిరి. కాని, మహమ్మదీయులకుమాత్రము ఉరిశిక్ష విధింపరాదని మహమ్మదీయ చక్రవర్తి ఆజ్ఞాపించియుండెను. ఈయాజ్ఞననుసరించి మహమ్మదీయ నేరస్థులకు ఉరిశిక్ష విధింపబడెడిదికాదు. మహమ్మదీయచక్రవర్తి తన సర్వాధికారమును

1. Wilson. Early Annals of the English in Bengal I. 163).
2. (Wilson I, 229).

చెలాయింప జూచునేమోయను భయమే యిందులకు కారణము. ఈకోర్టే ఆంగ్లేయులమధ్యను—ఆంగ్లో యిండియనుల మధ్యను గలుగుచువచ్చిన తగాయిదాలనుగూడ దీర్చుచుండెడిది. 1755-7 సంవత్సరములమధ్య మేయరుకోర్టు, కచేరీకోర్టుయొక్క యీ అధికారమును ప్రశ్నించినది. ఇందులకు ఫలితముగ 1758 లో రెండుకోర్టులను ప్రత్యేకముగ నేర్పరుపబడినవి. కచేరీకోర్టునకు నేరముల విచారణాధికార మొసంగబడినది. ఈవిచారణకు ముగ్గురు న్యాయమూర్తు లుండెడివారు. కౌన్సిలరులే ఒకరితరవాత మరియొకరు న్యాయమూర్తులుగ పనిచేయుచుండెడివారు. ఒక్కొక్కరు ఒక్కొక్కమాసము పనిచేయుచుండెడివారు. ఈకోర్టు ఆంగ్లేయులను గవర్నరు—కౌన్సిలు హోదాతో విచారించుచుండెడిది. అధికారపత్రమును పురస్కరించుకొని యిట్లు విచారించెడిది. భారతీయులను విచారించునపుడు జమీందారీకోర్టుగ పరిగణింపబడుచుండెడిది. కాని, రాను రాను కనిష్టసంఖ్య కోర్టునకు ముగ్గురున్యాయమూర్తు లుండవలయుననెడి విషయమునుగూడ గుర్తింపలేదు. 1772వ ప్రాంతమునఒక్క కౌన్సిలరు మాత్రమే కోర్టునుపెట్టుచుండెడివాడు [1] ఆంగ్లేయులకు సంబంధించిన పెద్దపెద్ద నేరములు జ్యూరీలసహాయమున 1753—1772 సంవత్సరముల అధికారపత్రముల ననుసరించి క్వార్టరు సెషన్సుకోర్టు (Court of quarter sessions) వల్ల విచారింపబడుచుండెడివి.

రెండవకోర్టు సివిలుదావాలను విచారించుచుండెడిది. ఈదావాల విలువ రు 20 ల పైబడియుండవలయును. కౌన్సిలరులకంటె తక్కువహోదాలోనుండు కంపెనీవారి యుద్యోగస్థులే యీకోర్టులో జడ్జీలుగ పనిచేయుచుండెడివారు. వీరితీర్పులపై దావాకిమ్మతు రు 100 లకు పైగానుండుచో గవర్నరు—కౌన్సిలునకు అప్పీలు చేసికొనవచ్చును. ఈకోర్టు సక్రమముగ పనిచేసియుండలేదు.

ఈ రెండుకోర్టులునుగాక కలెక్టరుకచేరీ మరియొకటియుండెడిది. ఈకచేరీ రూపముగ కంపెనీ, రైతులనుహింసించి పన్నులను వసూలుచేయుచుండెడిది. [2] పన్నులను చెల్లింపజాలనివారిని కొరడాలతో కంపెనీ కొట్టించుచుండెడిది.

1 (See Considerations on Indian affairs by Mr. Bolts i. 80).
2 (See Bolt's Indian Affairs P. 80).

నేరమును మోపువారును, విచారించి శిక్షించువారునుకూడ స్వప్రయోజనముతో గూడిన, కలెక్టరేయగుటచే రైతులను బెట్టినహింసలకు పరిమితిలేదు.

16
న్యాయశాఖ దురన్యాయములు.

ఈవిధముగ 1726—1753 అధికారపత్రముల ననుసరించి వంగదేశమునందుగూడ బొంబాయి, మదరాసులలోవలె క్వార్టరుసెషన్సుకోర్టు (Court of quarter sessions) మేయరుకోర్టు (Mayor's Court) 1753 నుండి, పంచాయితీకోర్టు, (Court of requests) మేయరుకోర్టు తీర్పులపై అప్పీళ్ళకు గవర్నరు—కౌన్సిలుకోర్టును, నెలకొల్పబడినవి. భారతీయులకు జమీందారీ కోర్టులే ఎక్కుడుగ పనిచేసినవి. మేయరుకోర్టు న్యాయనిర్ణయమునందు స్వాతంత్ర్యముతోనుండ ప్రయత్నించినది గాని, కంపెనీవారి చిత్తవృత్తిని ఎప్పటికప్పుడు అణగద్రొక్కుచువచ్చిరి.

ఈవిధముగ న్యాయపరిపాలన అన్యాయపరిపాలనముగ పరిణమించినదని నిస్సంశయముగ చెప్పవచ్చును. న్యాయపరిపాలన మనుగున సామ్రాజ్య విస్తీర్ణమునకై ప్రయత్నింపబడినదనుటయు నిర్వివాదాంశము. శిక్షాస్మృతి భారతీయులను ఏదోవిధముగనణగద్రొక్కి బ్రిటీషువారుటాకు జోహుకుముగ నొసరించుటకే వినియోగింపబడినదనుటయు పైన్యాయశాఖా పరివర్తనము ననుసరించి చెప్పవచ్చును. వర్తకాభివృద్ధికొరకుగూడ శిక్షాస్మృతి వినియోగించుకొనబడినది. ఈన్యాయశాఖాపద్ధతిక్రింద భారతీయులు జడ్జీలుగ నియమింపబడలేదు. 1726—1753 సంవత్సరముల అధికారపత్రముల ననుసరించి భారతీయులు జ్యూరీలక్రింద పనిచేయవచ్చును. కాని యీభారతీయులు క్రైస్తవమతస్వీకారముచేసు గావించినవారైనచో మాత్రమే జ్యూరీలక్రిందనైన నియమింపబడవచ్చును. ఈనిషేధము 1826 సంవత్సరములోమాత్రమే తొలగింపబడినది. బొంబాయి న్యాయస్థానములోమాత్రము 1718—1728 వరకు కొందఱు భారతీయులు జడ్జీలుక్రింద నియమింపబడిరి. మదరాసుకార్పరేషనులో ఎల్డరుమెన్‌లలో భారతీయులను నియమించవచ్చునను నుద్దేశమున్నది. ఈయుద్దేశమెన్నడును నెరవేరలేదు. ఈవిధముగనే భారతీయులవాదాలలో భారతీయసాంప్రదాయానుగుణ్యమగు న్యాయశాస్త్రముగూడ వర్తింపజేయబడలేదు. ఒక్కవంగదేశమున

జమీందారీకోర్టులు పనిచేసియుండుటవల్ల ఆంగ్లేయశాసనముల ననుసరించి గావింప బడిన అన్యాయముల కిచ్చట స్థానములేకపోయినదని కొందఱి మతము.1

## 10 స్వదేశరాజులు -కంపెనీప్రవర్తనము.

రాజ్య సంపాదనము. 1700 to 1773

వీరాక్రమించుకొనిన రాజ్యభాగములయందు ఈవిధముగ తమపరిపాలనమును సుస్థిరమొనరించుకొనుచు నూతన రాజ్యభాగసంపాదనమునకై వివిధప్రయత్నములు గావింప సాగిరి. 1700 సం॥ మొదలు 1773 సంవత్సరమువఱకు భారతదేశమునందు సంభవించిన రాజకీయపరివర్తనమునంతను నిచ్చటఁజేర్కొన వలసినపనిలేదు. కాని, యీకాలమునందు జరిగిన రాజకీయపరివర్తనమువల్లనే కంపెనీవారు భారతదేశమునందు వివిధరాష్ట్రములపై రాజ్యాధికారమును వహింప గలిగిరి. కంపెనీ ముఖ్యసముద్రప్రాంతముల నాక్రమించుకొనినది. ఓడరేవులలో ఫ్యాక్టరీలను నిర్మించుకొనినది. సివిలు, క్రిమినలు అధికారములను చెలాయింపగలిగెనది. ఈయధికారమును సుస్థిర మొనరించుకొనుటకును, ఆంగ్లేయవర్తకులకు సేమలో అధికలాభములను పంచిపెట్టుటకును, హిందూదేశమందలి తనయుద్యోగస్థులకు విశేషధనము లాభించుటకును, నూతనరాజ్యాక్రమణతృష్ణలో, హాహాకారములుసల్పుచు, కంపెనీ, ఎదురుతెన్నులు చూచుచున్నది. ఔరంగజేబునాటి రాజ్యపాలకుడు. అర్ధశతాబ్దమాయన, దుండగములతోకూడిన, పరిపాలకుడగుటచే హిందువు లాయనపట్ల అసంతృప్తులైయుండిరి. మహారాష్ట్రులు బలవంతులైన ప్రతిపక్షులుగా నిలబడిరి. ఈఔరంగజేబు మరణమే భారతీయసామ్రాజ్య విచ్ఛిన్నమునకు ప్రాతిపదికమైనది. భారత

1. (Legally, however, the right to judge notices in the Zamindari courts, instead of the charter courts, was doubtful, as warren Hastings pointed out and the Mayors court in 1773 was asked to exercise a jurisdiction over Zamindar on a visit. for the injustice of punishment by the english law-of nations for acts, leagal of by Hindu or Mahammdan law. See "The Administration E. i. Code P. 324. by Verelst in Kogi and the successful pitition of 1765 against the excation of Roohocharn,. uitra for porgery (325) See also "Warren Hastings in Beugal P. P. 157 158. by Monckton Jones).

దేశమునందలి రాజ్యపరిపాలన, అశక్తివంతమైయుండుటయే విదేశవర్తకుల ధన కాంక్షకును రాజ్యతృష్ణకునుగూడ మూలమయినది. అనాడు విచ్ఛిన్నమైన సామ్రాజ్య భాగములయందలి రాజులాఁడొరులతో కలహించుచుండుటయూ, విదేశీయుల అండజేకుటయు, సహాయ్యము నపేక్షించుటయూ, భస్మాసురవ్రతముగ పరిణమించినది. అట్లల్లకల్లోలమైన భారత రాజకీయవాతావరణమున, సమయముచూచి ఆంగ్లేయవర్తకులు, ఆంగ్లేయసామ్రాజ్యమునకు భారత దేశమున, అచంచలమగు పునాదులను వేసికొనిరి.

కర్ణాటక యుద్ధము

దూప్లెక్సు (Dupleix) కాలమునకుముందే (1742) బ్రిటిషుసామ్రాజ్యస్థాపనకై కంపెనీవారికాలోచనలు గల వనుట నిశ్చయము. హిందూ దేశమందలి కంపెనీ యుద్యోగస్తుల మాంద్యతయే, అంతకుపూర్వమే, విస్తార ప్రయత్నములు జరుగకపోవుటకు హేతువు. 1744 మొదలు 176[illegible] వరకు యూరపునందు ముమ్మారు ఘోరసంగ్రామములు జరిగినవి. [illegible] ఆంగ్లేయులను-ఫ్రెంచివారును-ప్రతికక్షులైరి. (Spanish Succession war 1744-8 Spanish succession war and the eleven years' war 1756-63 ఈకక్ష హిందూ దేశమునకుగూడ వ్యాపించినది. వీరిమధ్య దక్షిణహిందూ దేశమున కర్నాటక యుద్ధములు రెండుజరిగినవి. ఈయుద్ధములవలన దూప్లే ఒక గొప్పవిషయమును గ్రహింపగలిగినాడు. క్రమశిక్షణలేకుండ హిందూ రాజులచే పోషింపబడుచున్న సేనలకు క్రమశిక్షణ యొసంగినయెడల, వాటి సాహాయ్యమున సామ్రాజ్యస్థాపనకువీలగునని దూప్లే యూహింపగలిగెను. మొదటికర్నాటక యుద్ధమునందు దూప్లే జయముగాంచి మదరాసును పట్టు కొనెను. నైజామును తనమిత్రునిగా జేసికొని కల్నలు బుస్సీని అతనికండగనుంచి ఉత్తరసర్కారులను స్వాధీనముగావించుకొనెను. (?) 1750—54 సంవత్సరములలో నైజాము రాజ్యమునకును ఆర్కాటు రాజ్యమునకును, ఇద్దరిద్దరు హక్కుదారులేర్పడగ—ఇంగ్లీషువారొకరిని-ఫ్రెంచివారొకరిని- సహాయమొసంగి యుద్ధ సన్నాహములనుగావించిరి. పై వారియాజ్ఞలేని, అనధికారపూరితమైన, యుద్ధముగ నిది భావింపబడినది. ఈసమయమునందే ఇంగ్లీషువారు తంజావూరు

రాజుపరిపాలనలలో జోక్యమునుగలిగించుకొనిరి. ఈవిధముగ జోక్యముకలిగించు కొనవచ్చునను హక్కునొకదాని నేర్పరచుకొనిరి.1 ఆర్కాటుయుద్ధమున ఇంగ్లీషువారు జయమునుగాంచిరి. 1763 సంవత్సరపు, యూరపుదేశమునందు జరిగినసంధితో హిందూదేశమునందలి ఫ్రెంచివారి ఔద్ధత్య మంతరింపసాగినది.

2 ప్లాసీ యుద్ధము

ఇది యిట్లుండ 1757 సంవత్సరమున ప్లాసీయుద్ధము జరిగినది. అంతవరకును చలించుచున్న ఆంగ్లేయుల స్థితి నాటితో సుస్థిరమయినది. సురాజద్దౌలా యుద్ధభూమి నుండి పారిపోయి పట్టుబడి చంపబడినతరవాత క్లైవు; తనయజమానియైన సురాజదౌలాకు ద్రోహముచేసి, తనకు తోడ్పడిన మీర్జాఫరును, యుద్ధాత్పూర్వమంగీకరింపబడిన షరతుల ననుసరించి బంగాళానవాబుగా నొనరించెను. సురాజద్దౌలాను రాజ్యభ్రష్టునిగా చేయుటకై జరిగిన 1756-57 సంవత్సరపు తిరుగుబాటునకు, వేరొకఅర్థముగూడ, సూచింపబడుచున్నది. వర్తకులును, ధనాఢ్యులునుగలసి మహమ్మదీయ ప్రభుత్వమును కూలద్రోయ, చేయబడిన ప్రయత్నమనబడుచున్నది. హిందువులును ఆంగ్లేయులను గలిసి కావించిన కృత్యమిది. కాని దీనిఫలితముగ ఆంగ్లేయులే వర్తకాభివృద్ధినిపొందిరి. ఆంగ్లేయులకే రాజ్యాధికారము సంభవించినది. "మీర్జాఫర్-అనగా సైన్యమునందలి మహమ్మదీయసైన్యాధిపతులు, ధనాఢ్యులగు వర్తకులు- ఆంగ్లేయులును-యీముువ్వురును దీనికికారకులు." అని రాబర్టుగారు తమపుస్తకమునందు వ్రాసిరి.2 హిందువులగు వర్తకులీకుట్రయందు పాల్గొనిరనియు-లాభమును పొందిరనియు చెప్పుటకు రాబర్ట్సుగారి వ్రాతకంటె ఇతరనిదర్శనములేవియు గోచరించవు. కాని హిందూదేశచరిత్రకారులు కొందరీవిషయము నంగీకరించుచున్నారు.3 ఈవిధముగ సురాజద్దౌలాను పదభ్రష్టుని చేసి, మీర్జాఫరును సింహాసనాధీశునిగా నొనరించినందులకుగాను మీర్జాఫరునుండి క్లైవు 2,340,000 పౌనులనగదును కానుకగాదీసికొనియుండెను. క్లైవు, పాలకవర్గములోని ఇతర సభ్యులు పౌ 50 మొదలు పౌ 80 వేలువరకు తీసికొనియుండిరి.

1 (History of India smith P473.)
2 (Roberts p 130)
3 (See cambridge history of india vol 11. p 15 1)

ఈవిధముగ లంచగొండితనమునకు క్లైవుమాత్రమే అలవడియుండలేదు. డూప్లేక్సు, బుస్సీల, అడుగులలోనూ క్లైవు నడచియున్నాడు. సామాన్యముగా నాకాలమునందు జరుగు ఏపనిచేసియుండిరో ఆపనినే క్లైవుగూడ జేసియుండెను. "ఈవిషయమున వ్యక్తులనుగురించి నిర్ణయించుటకంటె ఆనాటి కాలమునుగురించి నిర్ణయింపవలసి యున్నది. అయినప్పటికిని ఈవిధముగ కానుకల నంగీకరించుట పెద్దయుదాహరణము. క్లైవుగనుక 1765 సంవత్సరమువరకును దూరదృష్టిని వినియోగించి చూడగలిగియున్నచో నీయవినీతిపనిని జేసియుండెడివాడుగాడు."

3
కంపెనీ
జమీందారగుట

ఈమొత్తములను నగదుగ లంచములుగ దీసికొని యుండుటయేకాక, మీర్జాఫరునుంచి, సాలుసరి పా 30 వేలు పౌను లాదాయమువచ్చు జాగీరును గూడ గైకొనిరి. ఈజాగీరే ఇరువదినాలుగు పరగణాలు. ఈజాగీరు గైకొనబడిననాటినుండియు కంపెనీకి జమీందారీహోదా లభించినది.

4
క్లైవు
జాగీరు

ఈకాలమున అనగా 1759 లో ఢిల్లీయువరాజగు (Prince) షా ఆలెము (లేక ఆలీఘుర్ (Ali Gauhar) ఢిల్లీలో నాడు ప్రారంభమైన తిరుగుబాటునుంచి పారిపోయి వచ్చి, అయోధ్యనుల్తానగు నవాబువజీరు నాశ్రయించి యున్నాడు. ఈషా ఆలెము తనతండ్రి బీహారు బెంగాలురాష్ట్రములు తన కొసంగబడినట్లుగ ప్రకటించుకొని,[1] ఈరెండు రాష్ట్రములను ఆక్రమించుకొన అయోధ్యనవాబుతోచేరి కుట్రబన్నసాగెను. 1759 సంవత్సర ప్రారంభమందు సైన్యముతో పాట్నాపై దండెత్తెను. బీహారుజమీందారులు చాలమందియీయాయన ననుసరించిరి. పాట్నాడిప్యూటీగవర్నరగు రాజారామ్ నారాయన్ మొట్ట మొదటగ షా ఆలీమునకు లొంగినట్లుగనటించి, చివరకు షాఆలమ్‌ను తిరస్కరించి ఆంగ్లేయుసహాయము లభించువరకు పోరాడుచునేయుండెను. క్లైవీ తరుణమును జారవిడువలేదు. పాట్నాకు సైనికులతోబోయి, తిరుగుబాటుదారులను

1 (see. p. 85 a history of India vol III by Srinivasacharya and Ramaswamy Ayyangar)

ఓడించి, దండించి, పాట్నాను వదలపరచెను. ఈవిధముగ తనరాజ్యభాగమగు పాట్నాను వదిలపరచినందుకుగాను మీర్జాఫర్ యొద్దనుంచి, క్లైవు జాగీరును కానుకగా దీసికొనియుండెను. మీర్జాఫర్‌ను సింహాసనమునందుంచినందులకుగాను వారు కంపెనీకి 24 పరగణాలను కానుకగనిచ్చినప్పుడు, ఈజాగీరుపై క్విట్రెంటును కంపెనీ ప్రతిసాలున మీర్జాఫరున కిచ్చుటకునిర్ణయము. ఈవిధముగ జాగీరుపై కంపెనీ తనకొసంగవలసిన క్విట్రెంటునుగూడ క్లైవునకు దఖలుపరచెను. అనగా నాటినుండియు కంపెనీవారు మీర్జాఫరునకుమారుగ తమజాగీరుపై క్విట్రెంటును అంతటినుంచి క్లైవునకొసంగవలసివచ్చినది. ఈవిధముగ క్లైవు జాగీరుదారయినాడు. ఢిల్లీపాదుషా, బీహారుపైదండెత్తిన షా ఆలెమును తరిమివేసినందులకు క్లైవునకు బిరుదమొసంగినాడు. వంగమునకు మీర్జాఫరే నవాబని మీర్జాఫరునకు సనదుగూడ బంపినాడు. "కంపెనీవారీవిధముగ మీర్జాఫరునకు సహాయమొనరించుటకుమారుగ షా ఆలెమునకు సహాయమొనరించియుండుటధర్మయుతముగ నుండెడిది. ఈయన నెదిరించుట పైకికనపరచని తిరుగుబాటు.[1] దీనితదనంతరమే క్లైవు డచ్చివారితోఢీకొని వారిని అణగద్రొక్కుటకు ప్రయత్నింపసాగెను. ఈయత్నములలో మీర్జాఫర్, కంపెనీకి వ్యతిరేకముగ డచ్చివారితో కుట్రపన్నెను. 1759 నవంబరులో క్లైవు డచ్చివారిని పరాజితులుగనొనరించి ముదరాలను గైకొనెను. కాని డచ్చివారిని వెనుకవేసికొని కుట్రవన్నిన మీర్జాఫర్ గతియేమి? కొడుకు పిడుగుబడి చనిపోయెను. తాను కంపెనీవారితో 1760 సెప్టెంబరు 27 తేదీనిగావించుకొనిన ఒడంబడిక ననుసరించి సొమ్మును చెల్లింపజాలకుండెను. ఇతని అల్లుడైన మీర్కాశీముతో నాటిగవర్నరైన వాన్సిటర్టు (Vansitturt) రహస్యముగ నొడంబడికచేసికొనెను. బలవంతముగ మీర్జాఫరును సింహాసనమునుండి పీకిపారవైచి మీర్ ఖాశీమును ఆసింహాసనముపై నెక్కించెను. మీర్కాశీముతో గావించుకొనిన రహస్యపుటొడంబడిక ననుసరించి మీర్కాశీము కంపెనీకి కంపెనీపరిపాలకవర్గమునకు పౌ 200,000 లను సమర్పించెను. సం 1760 లో బర్ద్వాను, మిడ్నపూరు, చిట్టిగాంగుల భూమిశిస్తును కంపెనీకొసంగుట కంగీకరించెను. మీర్జాఫరు

1 (Mill Bk. IV Ch VI. Refer to Roverts also regarding the raid of Alighuhar India p 146. and p 159 for a different version)

ఇవ్వవలసిన బకాయీలను తీర్చివేయుటకుగూడ నియ్యకొనెను. దక్షిణదేశమున కంపెనీ నిర్వహించినయుద్ధములకుగాను 5 లక్షలరూపాయిల విరాళమునొసంగుట కంగీకరించెను. ఇంతతో సరిపోలేదు. అంతర్వ్యాపారవర్తకముపై కంపెనీ సరకుమీదను, కంపెనీయుందలి యుద్యోగస్థుల ప్రత్యేకపు సరకుమీదనుగూడ సుంకములను తొలగించివేయుటకు ఫర్మానానొసంగియుండెను.1 మీర్జాఫరును తొలగించి మీర్కాశీమును గద్దెక్కించుటయందు కంపెనీచేసినపనియేమి? మీర్కాశీమునకు జాఫర్‌తో పాటు సమానరాజ్యాధికార మొసంగబడినది. కాశీము, జాఫరుకంటెసమర్థుడు. మీర్కాశీముతో వీరు గావించుకొనిన ఒడంబడికయు విస్పష్టముగాలేదు. పేచీలకు సావకాశము తొలగించివేయలేదు. ఇంతకంటెను ఘోరమైనదేమన, ఈనాటకమంతయు ప్రదర్శించినవారిలో ముఖ్యపాత్రధారులగు వారికి కానుకలు సమర్పింపబడినవి. ఇందు హాల్‌వెలు గారొకరు. ఈమునపాటగా ముందుగానే నిర్ణయింపబడినది ఈవిధముగ నవాబునుమార్చి మరియొక నవాబునెక్కించుట ఇంగ్లీషువారు హిందూదేశములో అంతవరకును రాజకీయముగ గావింపని అపభ్రంశపుపని.2 తనకురాజ్యమును కట్టిపెట్టినందులకై కంపెనీవారికింతటి కృతజ్ఞతను మీర్కాశీము చూపించినాడు.

5
మీర్కాశీము
పదభ్రష్టుడగుట

అయిననేమి? ఇతనికిచిట్టచివరకు మీర్జాఫర్‌గతి తప్పలేదు. ప్లాసీయుద్ధము జూన్ 1757 లో ముగిసెను. నాటినుండియు వంగదేశమంతయు కంపెనీవారి దయాధర్మములకే గురియైనదనవచ్చును. పరిపాలనయొందుంచబడిన నవాబులు కంపెనీవారిచేతియందలి కీలుబొమ్మలగుచుండుటయే యుద్ధములకు కారణము. ఈసావకాశమువల్లనే "వంగదేశమును కొల్లగొట్టుటయే కంపెనీ యుద్యోగస్తుల యాశయమైనది.3 మీర్కాశీము సింహాసనాసీనుడైన మరునాటినుండియు తన్నెప్పుడు తిరిగికంపెనీ పదభ్రష్టునిగజేయునోయని యాతురపాటు చెందుచునే యుండెను. షా ఆలెము తండ్రియనంతరము ఢిల్లీపాదుషాయై

1 (See Early British Rule Dutt. p 19-20)
2 (See Dodwell Dupleix and Clive p 206)
3 (Kale Indian administartion p. 13)

బీహారులోనుండెను. ఆంగ్లేయులతో రహస్యపుటొడంబడికల గావింపుకొన ప్రయత్నించుచుండెను. ఈసంధిప్రయత్నముల ఫలితముగ వంగదేశమునకు సుబేదారుతనము కంపెనీవారు లాగుకొనెదరేమో యని మీర్కాశీముభయము. నాటిగవర్నరగు వాన్సిటర్టు (Vansitturt) యొక్క ప్రయత్నముగూడ సిదియే. కాని ఆయనపరిపాలకవర్గ మాయనతో నేకీభవించలేదు. మీర్కాశీమును తక్తునుండిదింపివేయుకృషి తాత్కాలికముగ విరమింపబడినది. రామనారాయణకు ఆంగ్లేయసంరక్షణ పోయినది. నవాబుయొక్క క్రోధమునకుగురియై చంపివేయబడినాడు. ఇంక మీర్కాశీము స్వతంత్రముగ వ్యవహరింపదలచినాడు. "కంపెనీయధికారము 1756 సంవత్సరమునాటిస్థితికి దిగజారవలసినదే. లేదా యుద్ధము జేయవలసినదే. ఇది హాల్వెలు (Holwell) వెన్సిటార్టులు గావించిన కర్మఫలితము.2

1762 లో నవాబునకును కంపెనీవారికినీమధ్య అంతర్వ్యాపారశుల్కములలో వైషమ్యములు జనించినవి. ఉచితవర్తకస్వాతంత్ర్యమును కంపెనీ ప్రతిష్ఠింపసాగినది. మీర్కాశీము ప్రభుత్వకోశమునకు ధనలోపమువల్ల బాధపడసాగెను. తనప్రజలు బాధపడుచు నష్టపడుచున్నారని మొరపెట్ట మొదలుపెట్టెను. కంపెనీతో రాజీ గావించుటకై యత్నించెను గాని "దురాశాపాతకులై స్వప్రయోజనమునుమాత్రమే గమనించుచున్న కౌన్సిలర్లు వాన్సిటర్టు హేస్టింగ్సుల మాటలనుగూడ లెక్కపెట్టుటలేదు." వాన్సిటర్టును నవాబును గావించుకొనిన ఒడంబడిక త్రోసివేయబడినది. మీర్కాశీమంతటితో అంతర్వ్యాపారశుల్కములనే రద్దుపరచెను. ఇట్లు రద్దుపరచుటవల్ల ఆంగ్లేయులకుండెడి ప్రత్యేకవర్తక సౌకర్యములు పోయినవి. ఇట్లు సుంకములనురద్దుచేయుట ఒడంబడికకు వ్యతిరేకమని కంపెనీ తలంచినది. ఈవిషయమై ప్రసంగించుటకు ఆంగ్లేయులుపంపిన రాయబారవర్గమును మీర్కాశీ మాహ్వానించియుండలేదు. ఈవిధముగ "కంపెనీవారి అన్యాయపుకోరికలను, అనగా వర్తకములో వ్యక్తిగతవ్యాపారస్తులకు స్వాతంత్ర్యముండవలయును. తమకేసులలో తామే న్యాయాధిపతులుగ నుండవలెననుటయు మీర్కాశీమును బలవంతముగ తిరుగుబాటుదారునిగ నొన

2 Quoted by C. S. S. and M. S. R. A History of India p. 703).

రించినవి. యుద్ధమునకుడీకొను నట్లొనరించినవి."1 పాట్నా ఫ్యాక్టరీ ప్రధానియైన ఎల్లిసు 1763 జూన్‌లో పాట్నాను ఆక్రమించివేసెను. కాని తిరిగిఆరోజుననే నవాబు తిరిగి పాట్నాను వశపరచుకొనెను. ఈపోరాటమునకు ఫలితముగ ఆంగ్లేయులుకొందరు చెరసాలయందు బంధింపబడిరి. మీరాక్కాశీము యుద్ధ సన్నాహముల చేయుటనారంభించెను. అయోధ్యనవాబగు వజీరుతోనొడంబడిక గావించుకొనెను. పాట్నాయుదంతము తెలిసినవెంటనే కలకత్తాయందలి కంపెనీ ప్రభుత్వము మీరాక్కాశీముమీద యుద్ధముప్రకటించెను. తిరిగి మీర్జాఫరు రాజనికంపెనీచే ప్రకటింపబడినది. మీరాక్కాశీము ప్రధానపట్టణములగు మూర్షిదాబాదు, మోంగీరులను యుద్ధములలో మీరాక్కాశీమునోడించి స్వాధీనముజేసికొనిరి. పాట్నాయందలి ఆంగ్లేయబంధితులు వధించివేయబడిరి. పాట్నానుండి మీరాక్కాశీము అయోధ్యకుపరాజితుడై పారిపోయినాడు.2

6 బక్సారు యుద్ధము

అయోధ్యనవాబగు సుజాజిద్దౌలాయు—అతనినాశ్రయించి యున్న ఢిల్లీసుల్తాను షా ఆలెమును మీరాక్కాశీమును ముగ్గురునుకలిసిరి. బెంగాలు, బీహారు రాష్ట్రములీతరుణమునందే స్వాధీన మొనర్చుకొనుటకు తగుననితలంచిరి. పాట్నాపై యుద్ధమునకుబోయిరి. 1764 లో ఏప్రియలులో బీహారులో ప్రవేశించిరి. హాజీపూరు యుద్ధముజరిగినది. 1764 అక్టోబరులో బక్సారునందుజరిగిన యుద్ధములో కంపెనీవిజయముగాంచినది. కంపెనీ అలహాబాదు, చునారులనుగూడ వశపరచుకొనినది. ఇంతతో ఢిల్లీసుల్తాను కంపెనీపక్షమున జేరెను. మీరాక్కాశీము పలాయితుడయ్యెను. వజీరగు సుజాజిద్దౌలాగూడా పరాజ్ముఖుడై పారిపోయి చిట్టచివరకు ఆంగ్లేయులనాశ్రయించెను. ఈబక్సారు యుద్ధవిజయము ఆంగ్లేయ రాజ్యస్థాపనాపరిణామమునందు ప్లాసీయుద్ధముకంటె ప్రాముఖ్యమైనదని కొందరిమతము. ఈబక్సారు యుద్ధానంతరము తిరిగి రాజుగానొనరింపబడిన మీర్జాఫరు చనిపోయినాడు. అతని కుమారుడైన నిజాము

1 (Keith C. H. P. p 53)

2 (For more details see chap. II of Keene- Hindustan under free lances (1770—1820); B. Banerje- Begam- Sanrei and chap 75 of w. sleeman's Rambles and Recollections by V. A. smith).

ద్దౌలా నవాబుగా నొనరింపబడెను. కంపెనీవారి చెప్పుచేతలకు లోబడి యుండు వద్ధతినే నిజాముద్దౌలాను నామకా నవాబుగా సింహాసనముపై కూర్చుండబెట్టిరి. కంపెనీవారిచే నియమింపబడిన మహమ్మదు రిజాఖాను నవాబుగారి స్థానే పరిపాలకుడుగ నుండెను.

7 దివానీ ఒడంబడిక 1765

ఈవిధముగ తమచేతియందుగల కీలుబొమ్మగ వంగదేశపు నవాబును ఆడించుచు కంపెనీవారు క్లైవు హయాములో 1765 ఆగష్టులో షా ఆలెముతోను షుజాఉద్దౌలాతోను ఒడంబడిక గావించుకొనిరి. ఈఒడంబడిక ననుసరించి షుజాఉద్దౌలాకు అలహాబాదు - కర్రాజిల్లాలు మినహా మిగత అయోధ్యరాజ్యము తిరిగి ఇచ్చివేయబడినది. ఈరెండుజిల్లాలను ఢిల్లీసుల్తాను షా ఆలెముల కొనగబడినవి. ఈవిధముగ తనరాజ్యమును తన కొసంగినందులకు అయోధ్యావజీరు షుజాఉద్దౌలా సాలుసరి రు 50 లక్షలు కంపెనీవారికి చెల్లించుచుండుటకు నిర్ణయము. కంపెనీవారితోటి ఇతర యుద్ధములలోకలసి పోరాడుటకుగూడ నిశ్చయింపబడినది. షా ఆలెమునకు అలహాబాదు కర్రాజిల్లాల నొసంగుటయెగాక వంగదేశకోశమునుండి సాలుసరి రు 26 లక్షల నొసంగుటకును కంపెనీ యంగీకరించినది. ఇందులకు మారుగ షా ఆలెము కంపెనీవారికి దివాన్‌గిరీ యొసంగెను. అనగా వంగ కళింగ బీహారు రాష్ట్రములలో పన్నులను వసూలుచేయు నధికారము కంపెనీవారి కొసంగబడినది. ఈదివానుగిరీవల్ల నీమూడు రాష్ట్రముల ఆర్థిక పరిపాలనయు కంపెనీకి సుల్తాను నుండి సంక్రమించినది. బెంగాలు నవాబు నామమాత్రాధికారముగూడ నింతతో నిర్జీవమై పోయినది.1

కంపెనీవారు శత్రువర్గ రాజ్యమునంతయు తామే స్వాధీనముచేసికొని

1. For a fuller estimate of the merits and demorits of the settle-ment. see Elphinstone; Rise of the Britsh power in the East, chap. X. On the grant of the Dewani; with the supplementary note of the Editor colebrook Dodwell P. 247. Mills History of British India 1858 Vol. III P. P. 285-7 and Forest life of Lord Clive Vol. II. P. 289.

యుండెడివారు. లేక షా ఆలెము సుల్తాను సూచించినటుల బెనారెసు, గాజీపూరులను తామునికొని అయోధ్యరాజ్యమునంతయు షా ఆలెమున కొసంగి యుండెడివారు. ఈవిధముగనే బెనారెసు బల్వంతసింగు సితాబురా మొదలగు కంపెనీవారి ఇతరసలహాదారులును మిత్రులును మరికొన్ని సూచనలు గావించి యుండకమానరు. కాని కంపెనీ విస్తారరాజ్యమునకై పెనగులాడలేదు సర్వాధికారమునకును ప్రయత్నించలేదు. నమ్రతతో ప్రవర్తించినది. "నమ్మదగిన స్నేహితులను, స్థిరమగు సరిహద్దులను, నిస్సంశయమగు అధికారపత్రమును, ప్రశాంతమును అభివృద్ధికరమును నగు వర్తకలాభమును, కంపెనీ యాశించినది. ఇదియే కంపెనీకి-షాఆలెమునకును-వజీరు నవాబునకును (సుజాఉద్దౌలా) కాశీరాజునకును మధ్యజరిగిన ఒడంబడికల కర్థము" అని కొందరిమతము. 1

"ఢిల్లీవరకును దండయాత్ర సాగించుట నిష్ప్రయోజనమైనపని. ఆంగ్లేయులు కాలుదువ్వి యుద్ధమునకు పోరాదు. వంగదేశ సంరక్షణమునకును నవాబు వజీరు తమసామంతరాజుగా నున్నందున అతని సంరక్షణకును మాత్రమే యుద్ధము చేయవలయుననియును క్లయివు తన నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చి యుండెను. వేరువిధముగ పవర్తించుటవల్ల మహారాష్ట్రులు రజపుత్రులు-మహామ్మదీయులు అందరును ఏకమై ఆంగ్లేయులపై విరగబడియుండెడివారని క్లయివు విశ్వాసము" 2

ఈవిధముగ దివానుగిరి సంపాదింపబడినది. నాటినుండియు ఆంగ్లేయరాజ్యాధికారమునకు పునాదులు వేయబడినవి. అదివిస్తరింపసాగినది "హిందూదేశమునందు ఆంగ్లేయరాజ్యాధికార మెనాడుప్రారంభమైనదని నిర్ణయింపవలసి వచ్చును. 1761 జనవరి 16 వ తేదీని పాండుచ్చేరి చేతులు మారిననాడన దగును. లేదా 1763 ఫిబ్రవరి 10 వ తేది ప్యారిసు ఒడంబడిక సంతకము చేసినవాడన దగును. లేక బక్సారుయుద్ధమున విజయముపడసిన 1764 అక్టోబరు 23 తేదీనా డనుట యుచితము. లేదా దివానుగిరీ నొసంగిన ఫర్మానానొసంగిన

1. Indian Administration P. 26. By B. K. THAKORE.
2. See Forests Bengal and Madras papers Vol III. 1757—85. Select committee of Fort william proceedings of 16th January 1767.

1765 ఆగష్టు 12 తేదీ నాటి డసాట సమంజసము. కాని మహాదవపాసిప్టు యుద్ధమునాటి డసాట యుక్తముగాదు. అది యుద్ధముక్రిందనే పరిగణించుటకు వీలులేదు. 1

“ఈదివానుగిరీ కంపెనీవారిని భారతరాజ్యాంగమునందలి ప్రాముఖ్య స్థానమునందుంచినది. ఇతరదేశముల వర్తకులకంటె అనగా ఫ్రెంచివారు-డచ్చి వారును ఏవిధముగను ప్రశ్నించుటకు వీలులేని అధికారము కంపెనీకిలభించినది.2 గ్రుడ్డియు కుంటియునగు ఢిల్లీసుల్తాను షాఆలెము, కంపెనీవారి దయకు పాత్రుడు కావలసివచ్చినాడు. సుల్తాను గౌరవభృతిగైకొనువాని స్థితికివచ్చినాడు. వంగ దేశపు నవాబు కీలుబొమ్మయినాడు. దివానుగిరీ కంపెనీవారికి 1758 సంవత్సరమునందే ఢిల్లీసుల్తాను ఒసంగదలచినాడు. ఈవిషయమై క్లయివు 1759 లో పిట్టుగారికి వ్రాసినలేఖయందుదహరించినాడు. కాని వర్తకులకింతటి రాజ్యార్హత చాల హెచ్చువిషయమని పిట్టు అభిప్రాయపడినాడు. ఈక్లయివు సూచనను పిట్టుగారంగీకరించలేదు. క్లయివు, ఏజెంటుమాత్రము కాక కాలక్రమమున దివానుగిరీ సంపాదించితీరుట యవసరమనియు సంపాదింపబడుననియుగూడ పిట్టుగారితో చెప్పియున్నాడు.

8 దివానుగిరీ; పరిపాలన.

ఈవిధముగ తంత్రమున సంపాదింపబడిన దివానుగిరీ యధికారమును చేబూని నిర్వహింపవలెనని క్లైవు తలంచియుండలేదు. క్లయివుయొక్క యభిమతము వేరు. దివానుగిరీ కార్యనిర్వాహణమంతయు నవాబుగారిచే నియోగింపబడిన నలుగురు డిప్యూటీ నవాబులే కొనసాగింప మొదలిడిరి. 1767 జనవరి 16వ తేదీని క్లయివొసంగిన తుదిసూచన వీరివిషయమున గమనీయము. “నవాబు నామమాత్రుడు. కంపెనీ నీడవలెనున్నాడు. ఇతరజాతులీయనయెడల సగౌరవముగ వర్తించునట్లు చూచుట రాజనీతి. ఈయనద్వారా యితర దేశీయుల యధికారస్థాపన ప్రయత్నములను నిరోధింపుచుండవలయును. ఈయన

1. Indian administratton by B. K. THAKORE p. 27.
2. DodWell. The Development of Sovereignity in India Cambridge History of india Vol. V. Chap. XXXII.

మూలముగనే సరియగు తగవులు దీర్పించుచుండవలయును. రాబడియంతయు కంపెనీకి చెందుచున్నది. కంపెనీతో కలసి యీయన పనిచేయుచు, ఈయన క్రింది యుద్యోగస్తుల ద్వారా ఇతర పనులను జరిగించుట సమంజసము. (Territorial Jurisdiction) ఈముసుగును తీసివేసినచో ఇతర దేశీయులు కంపెనీవ్యవహారములను గురించి బ్రిటీషు ప్రభుత్వమునకు తెలిపెదరు. అప్పుడు బ్రిటిషు ప్రభుత్వము కంపెనీ వ్యవహారములను పరీక్షించుట తప్పనిసరియగును. ఇట్టిపరీక్షవల్ల కంపెనీకి నష్టము గలుగవచ్చును" అని క్లయివుయొక్క విశ్వాసము. ఈవిశ్వాసము ననుసరించే దివానుగిరీ పరిపాలనము, కంపెనీవారి కీలుబొమ్మలగు; నవాబుచేత, అతనిక్రింది యుద్యోగస్తుల చేతనే నిర్వహింపబడునట్లుగ క్లైవొనరించి యుండెను. 1758 మే 17 వ తేదీని జారీచేయుబడిన ప్రత్యేకోత్తరువుల (Letters patent) ననుసరించి విదేశీయులనుండి సంపాదింపబడిన భూభాగముల విషయమై గావింపబడు యుద్ధముల విషయమున రాజుగారి యనుమతిని పొందవలసియున్నది. ఈవిషయము క్లైవు మరచి పోలేదు. క్లయివు రాజనీతినే 1766 మే 17 వ తేదీని కంపెనీ యంగీకరించినది. కంపెనీ రివిన్యూవసూళ్లను పరీక్షించుచు మాత్రమే యుండవలయుననియు, నీ వసూళ్ల మొత్తము నవాబు కోశమునుండి కంపెనీ కోశమునకు రప్పించుచుండవలయుననియు కంపెనీ నిర్ణయించినది. ఈద్వంద్వ పరిపాలనము వక్రగతియని గ్రహించుటకు కొంతకాలము పట్టినది. ఈలోపుగ కంపెనీ నౌకర్లు రివిన్యూపరిపాలనా విధానమును తెలిసికొనగలిగిరి. ఈపరిస్థితులలో వంగదేశము పడినబాధ కంతులేదు.

9
ద్వంద్వ
పరిపాలనా
నిర్వహణము.

తన యుడుగు జాడల ననుసరించుచు వంగదేశము నంతయు కంపెనీ నౌకర్లు కొల్లగొట్టు చుండుటయందలి ప్రమాదమును క్లైవు గ్రహించియే యుండెను. కంపెనీ నౌకర్లెవరును కానుకలను గూడ గ్రహింపరాదని క్రొత్త కంట్రాక్టులను వ్రాయవలసినదిగా క్లయివు నిర్ణయించెను.

కంపెనీ నౌకర్లు స్వల్పజీతగాండ్రు. ఉప్పుపంటలో వీరికి గుత్తవ్యాపారమును గలిగించి లంచములు సమస్యను పరిష్కరించవలెనని క్లయివు తలంచెను.

10

ఈప్రయత్నము కంపెనీ వ్యక్తిగతవర్తకమును మానివేయ వలసినదని యొసంగిన యుత్తరువుల నుల్లంఘించుటయే యయినది. 1768 లో వ్యక్తిగతవర్తకము రద్దుచేయబడినది. (Private trade) అయినను దోపిడి పద్ధతిమాత్రము తగ్గలేదు. క్లయివునకు వేరుమార్గము తోచలేదు. కంపెనీ వారి ఈరాష్ట్రపరిపాలనావిధానముమాత్ర మంతగ 1756 నకు పూర్వము కంటె మారియుండలేదు. గవర్నరు కౌన్సిలునుండి యొక (సెలక్టుకమిటీ) ప్రత్యేక సంఘమేర్పరుపబడినది. 1770 లో నిర్ణయింపబడినటుల గవర్నరును మరి 9గురు సభ్యులును గలసి కలకత్తా కౌన్సిలుగా నియమింప బడినది. (On Hastings appointment fourteen men named 10th April 1771) వీరందరును కలకత్తాయందే వసింపవలయును. నవాబు దర్బారునందు రెసిడెంటు కౌన్సిల రయినయెడలమాత్రము ఆయన కలకత్తాలోనే యుండనవసరములేదు. ఈ గవర్నరు కౌన్సిలు వర్గమునుండియే ప్రత్యేక సంఘమేర్పరుప బడినది. (Select Committee) గవర్నరును సర్వసైన్యాధిపతియు మరి ముగ్గురు ప్రధాన సభ్యులును (Senior members) గలిసి ప్రత్యేక సంఘముగ పనిచేసిరి. స్వదేశ రాజులతో యుద్ధముచేయుట సంధిచేసికొనుట, ఒడంబడికలను గావించుకొనుట మొదలగు పనులే యీప్రత్యేక సంఘపు విధులు. అయితే ఒడంబడికలను మాత్రము గవర్నరు కౌన్సిలు అంతయు నామోదించవలసి యున్నది. ఈవిషయములలో నుత్తర ప్రత్యుత్తరములను మాత్రము గవర్నరే చేయు చుండవలెను. (Correspondence) కాని ప్రత్యేకసంఘము వారి యెదుట నుంచుచుండవలయును. కంపెనీకి నకళ్ళను బంపుచుండవలయును 1769లో సివిలు అధికారము స్థిరపరుపబడినది. కౌన్సిలు తన యధికారము నేసివిలుఉద్యోగికైనను మధ్యమధ్య నిచ్చుచుండవచ్చును. (Delegate) ఈయన సర్వసైన్యాధిపతి యాజ్ఞలకు బద్ధుడై ప్రవర్తించుచుండవలయును. కౌన్సిలులోని యధికసంఖ్యాకులు గలసి యే యుద్యోగినైనను ఉద్యోగమునుండి బర్తరఫ్ చేయుచుండవచ్చును. సైన్యాధికారులకు లోబడి యుండవలెననుట క్లయివు ఏర్పరచినపద్ధతి. సిబ్బందీ యొక్క భృతులను కంపెనీ యుత్తరువులననుసరించి క్లయివు తగ్గించివేసినపుడు సిబ్బందీ తిరుగుబాటు గావించినది, ఈతిరుగుబాటును క్లైవు ధైర్యస్థైర్యము

లతో సణాకి వేసినాడు. మరల సిబ్బందీ తిరుగబడి యున్నచో ఈస్టిండియా మ్యూటినీ ఆక్టు ననుసరించి తిరుగుబాటుదారులు ఉరిశిక్షకు పాత్రులయ్యెడివారు.

ఈ విధముగా కౌన్సిలు సర్వాధికారము గలిగియుండియు తనసిబ్బందీ యొక్క ధనతృష్ణను నివారింపజాలక పోయినది. ఏల? కౌన్సిలు సభ్యులే సిబ్బందీ కంటెహెచ్చు ధనతృష్ణతో సర్వవిధములా భాగ్యమును గుట్టవేసికొనదలచి నపుడు సిబ్బందీమానుట యెట్లు? క్లైవుతరువాత వచ్చినగవర్నరులు దృఢ సంకల్పులుగారు. 1769 లో వివిధజిల్లాలయొక్క వివిధ రూపకములను చరిత్రలను గమనించుటకై సూపరువైజర్లు నియమింపబడిరి. రైతులకు గల భూమి, వీరి యితరపరిస్థితులు, వీరు కలెక్టరులకు లేక జమీందారులకు చెల్లించుచున్న పన్నులు, చేతిపనులను, గురించి తెలిసికొని తెలుపుట వీరిపని. తగవులలో పంచాయితీల నెలకొల్పుకొనవలెనని హెచ్చరించుటయు వీరిపని. కాని "ఇందేపనియు సక్రమముగ జరుగలేదు. ఈవిచారణలును కంపెనీ లాభముననే వినియోగించినవి. ఈసూపరువైజర్లు గూడ ప్రత్యేక వర్తకమును సాగించుకొనుచు భాగ్యవంతులగుటకే తమ యుద్యోగమననుసరించిన యధికారమును వినియోగించుకొనిరి. సుగుణవంతులగు నుద్యోగులే లభించలేదు." 1. ఇందులకు తోడుగ 1770 లో పాట్నా - మూర్షిదాబాదులపై పరీక్షా సంఘములను పెత్తనములు చలాయించు కౌన్సిల్లు నియోగింపబడినవి. (Controlling councils) వీటికి జతగా 1771 లో కలకత్తాలో రాబడి పరీక్షా సంఘమును (Revenue controlling committee) లెక్కల పరీక్షా సంఘమును (Controlling committee of Accounts) నియమింపబడినవి. ఈసంఘము లన్నియు నిష్ప్రయోజనములైనవి.

ఇందులకు తోడుగ 1770 లో వంగదేశమున క్షామదేవత విహరించినది. 150 లక్షల జనము (అయిదవవంతు జనము) వంగదేశమునందు నశించి పోయిరి. కంపెనీ యుద్యోగస్తులన్నానో ధనరాసులను జేర్చుకొనిరి. "ఈ విధ

1. Keith constitutional History of India p. 58.

ముగ జనము నశించిపోయినను నూటికి 10 వంతుల అధికలాభమును, బ్రతికి యున్నవారివద్దనుండియే కంపెనీ సంపాదించినది."1 ఈ కాటక పరిస్థితులు వరుసగ మరి యిరువది సంవత్సరముల వరకును వీడలేదు. కారనువాలీసుగారు పర్మనెంటు సెటిలుమెంటు చేయువరకును నట్లే యున్నదనవచ్చును. "కంపెనీ యొక్క అంతర్బహిర్వ్యాపారముల యందెల్ల అరాజకము ప్రబలిపోయినది. వంగదేశమును తన కట్టెదుటనే కొల్లగొట్టబడు చుండుటయందలి ప్రమాదమును క్లయివు సంపూర్ణముగ గ్రహించగలిగి యుండును.....కంపెనీవ్యక్తిగత వర్తకమును 1768 లో రద్దుచేసినది. కాని క్లయివావుత్తరవులను సరిగా పాటించలేదు. ఈసమస్య పరిష్కారముకాలేదు. హిందూదేశము మహాభాగ్యవంతమైనదను ప్రతీతివలన క్లయివు ఊహించిన కష్టములన్నియు దాపరించినవి. రాజకుటుంబము మొదలు తమ కుటుంబములయందలి కడగొట్టు పిల్లల కొరకు తమనాశ్రయించిన వారికి హిందూదేశము నందుద్యోగములనిప్పించుటకై సిఫారసు చేయుచుండుటయే పనియైనది. నూతనోద్యోగులు మహాభాగ్యమును సంపాదించుకొనుటకే పూనెడివారు. నూతన భాగ్యములతో సీమకు మరలి పార్లమెంటునందలి సభ్యత్వమును కొని వేసెడివారు. అందువల్ల అచ్చటగల గొప్పవారలకును వీరికిని ప్రతిఘటనములు సంభవించుచుండెడివి.

కౌన్సిలు, అధికారమును గలిగియున్న దైనను కంపెనీయుద్యోగుల ధనపిపాస శోషణతృష్ణను నాపుచేయజాలక పోయినది. ఈకౌన్సిలుమెంబరులే అత్యధిక ధన ముపార్జన మొనరించి సాధ్యమైనంత త్వరలో వారికి ప్రేమలేని దేశమును వీడి ఇంటికి మరలిపోజూచెడివారు. మరియు పార్లమెంటే హిందూదేశమును కొల్లగొట్టిన ధనమునందు కొంతభాగము నపేక్షించుచుండుటవల్ల పార్లమెంటు జోక్యము గలిగించుకొనుటవల్ల పరిస్థితులు చక్కబడలేదు. 1766 సంవత్సరమున కంపెనీ ప్రొప్రయిటర్లు నూటికి లాభమును ఆరువంతులనుండి 10 వంతులవరకు హెచ్చింపవలెననిరి. 1767 లో 12½% వరకును లాభమును హెచ్చింపవలెననిరి. పార్లమెంటన్ననో 1766–7 లో పార్లమెంటరీ కమిటీ అనగా పార్లమెంటు గావించినవిచారణపు విధముగ సాలు 1 కి పౌ 400,000లను

1. Keith.

వరుసగ రెండు సంవత్సరములు 1767 వ ఫిబ్రవరి 1 వ తారీఖునుండియు కప్పము నొసంగవలెనని నిర్ణయింపబడినది. దీనికి ప్రత్యామ్నాయముగ కంపెనీ తన రాజ్యాధికారమును అందలి రాబడులను అనుభవించినది. తలవనిపులవని యగు కంపెనీవారి వాటాల వ్యవహారములలో గూడ పార్లమెంటు జోక్యముగలిగించుకొనినది. 1769లో మరి అయిదు సంవత్సరములవరకు నీయాచారము సాగింపబడినది. ఈవిధముగ కంపెనీ ఆర్థికస్థితి దుస్థితి అయినది. కంపెనీ నౌకర్ల భాగ్యములలో వాటాలు లభించకపోవుటయేగాక కంపెనీకి 6000,000 పౌనుల ఋణము తేలినది. పోషించవలసిన 30,000 మంది సైనికులుండిరి. సాలుసరి హిందూదేశమునందలి నవాబునకును ఢిల్లీ పాదుషాకును ఇతర ముఖ్యులగు పదభ్రష్టులైన సామంతరాజులకును పౌ 1000,000 లు మనోవర్తు లివ్వవలసివచ్చినది. కంపెనీ 1772 ఆగష్టులో పార్లమెంటువారిని 10 లక్షల పౌనుల అప్పు అడిగినది. ఈవిధముగు ఆర్థికపరిస్థితులచే యీ యుద్ధము దురదృష్టమగు వంగరాష్ట్రము నుండి రాబట్టవలెనను ప్రయత్నములవల్ల నిరంకుశ చక్రవర్తుల పరిపాలన క్రిందనే నంతతాభివృద్ధి నుందున్న సౌభాగ్య దేశము ఆంగ్లేయుల పరిపాలనక్రింద నాశనావస్థకు తేబడినదని 1769 మే 24 తేదీని దర్బారునందు బెంగాలు రెసిడెంటు ప్రకటించియుండెను.1

# 11 కంపెనీ రాజ్యాంగము - పరిపాలనము.

1
దివానుగిరీ–పరిపాలన మార్పులు లేక వారను హేస్టింగ్సు బెంగాలు పరిపాలనము.

సం 1769 మున, వాన్సిటార్టును మరియిద్దరనుగలిపి కంపెనీవారు భారతదేశమందలి వారిపరిపాలనయందలి యరాజక పరిస్థితులను సంస్కరించుటకై పంపినది. వీరి నౌక సముద్రమునందే దెచ్చుటనో లయమైనది. పిమ్మట నీసంస్కరణ విధానమును 1772 లో 6 గురు సూపరవైజర్లకు కంపెనీ నిరూపించదలచినది. పార్లమెంటంగీకరించి యుండలేదు. సం 1771 ఆగష్టు 29 తేదీని కంపెనీవారు వ్రాసిన లేఖయందలి యుత్తరువుననుసరించి కౌన్సిలును, ప్రెసిడెంటును, దివానుగిరీ

1. See Constitutional History of India A. B. Keith p. 53 to 57.

తీసికొని వ్యవహారము నిర్వహించవలెననియే కంపెనీనిశ్చయించినది.

1772 లో సీవని నిర్వహించుటకై వారన్ హేష్టింగ్సు నియమింపబడి నాడు. వారన్ హేస్టింగ్సు దివానుగిరీని తీసికొనుట సముంజసమని చెప్పిన చెప్ప వచ్చును. కాని దీనికొనిన సాధనవిధానము మాత్ర మతిఘోరము.1 అంతవరకును దివానుగనున్న నందకుమారుని కృత్రిమముగ పదభ్రష్టుని జేసెను. ఇతర విషయములలో రిగ్యులేటింగు శాసనము గావింపబడుటకు పూర్వము రెండుసంవత్సరములును క్లయివుగావించిన పని గమనార్హము ప్రశంస నీయమనిగూడ ఆంగ్లేయచరిత్రకారులు వ్రాసిరి.2 కంపెనీకి అధిక ఆదా యము సంపాదించి హెచ్చులాభములను పంచిపెట్టుట హేష్టింగ్సుయొక్క అధమ ఆదర్శము. సీమయందలి పలుకుబడిగల వారితాలూకు కుటుంబముల వారు హిందూదేశమునందలి సివిలుసర్వీసులో 1781 లో 252 మందిగలరు. ఇంత హెచ్చుసంఖ్య అనవసరము. అయినను వీరిమనస్సులకు నొప్పిగలుగకుండ ప్రవర్తించవలసియుండుట రెండవపని. జిల్లాసూపరవైజర్లు-మూర్షిదాబాదు పాట్నాలలోగల, రివిన్యూబోర్డులు-కలకత్తాయందలి కౌన్సిలును గవర్నరును-ఒక దానిపైన నొకటి కట్టుదిట్టమైన పునాదులతో నిరంకుశముగ ప్రభుత్వము నెలకొల్పుకొనియున్నవి.

దివానుగిరీ హేస్టింగ్సుగారు తీసికొనినవెంటనే డిప్యూటీ దివానుగిరీ తీసి వేయబడినది. సం॥ 1765 లో నామకావాస్తే నవాబుకు గౌరవభృతిగా నిర్ణయింప బడిన 53 లక్షల మొత్తమును 1769 లో 32 లక్షలకు తగ్గించివేయబడినది. ఈ మొత్తముగూడ 16 లక్షలకు తిరిగి హేస్టింగ్సు తగ్గించివేసినాడు. మూర్షిదా బాదునుండి, కోశము కలకత్తాకు మార్చివేయబడినది. కలకత్తా దేశముయొక్క ముఖ్యస్థానముగ గావింపబడినది. మీర్జాఫర్ యొక్క విధవభార్యయే యువకు డగు నవాబునకు సంరక్షకురాలుగ నియమింపబడినది (మున్నీబేగము). ఇది వారన్ హేస్టింగ్సునకు సంతోషకరమైన పనియే.

హేస్టింగ్సుగావించిన పనులలో భూమిశిస్తు విధానము గమనింపదగి

1. Keith p. 59.
2. Monckton-Jones. Warren Hastings in Bengal 1772-4 (1818)

యున్నది. 1772 లో హేస్టింగ్సును, ఆయన కౌన్సిలరులగు మరి నలుగురును గలిసి సర్క్యూటుగా నేర్పడిరి. (Circuit) 5 సంవత్సరములవరకు భూమిశిస్తు రాబడి, విధానమును నిర్ణయింప నిశ్చయించుకొనిరి. ఈసమయమునందే కలెక్టరు ఉద్యోగములు సృష్టింపబడినవి. ఇదివరలో సూపరువైజరుల ఉద్యోగవిధానము సంస్కరింపబడిన కలెక్టరులుగమార్చబడిరి. ప్రతిజిల్లాయందునను కలెక్టరునకు సహకారిగనొక దివాను నియమింపబడినాడు. కౌన్సిలుఅంతయు రివిన్యూ బోర్డుగా మారిపోయినది. ఇంతలో 1771 లో ముర్షిదాబాదు-పాట్నాలలో స్థాపింపబడిన రివిన్యూబోర్డులు రద్దయినవి. ఈకౌన్సిలే దివానులయొక్క లెక్కలను తణికీచేయుచుండెడిది. ఒకభారతీయోద్యోగి రాష్ట్రీయ దివానులపై తణికీ పెత్తనము గలిగియుండెడివాడు. కలకత్తాయందలి కోశాగారపరిపాలనముకూడ సంస్కరింపబడినది. లెక్కల తణికీకై అందరిపైనను నొక తణికీదారు ఉద్యోగము సృష్టింపబడినది (Accountant general). ఈవిధముగా భూమిశిస్తురాబడిని వదిలపరచుటకై సరియగు అంగనిర్మాణ మేర్పరుపబడినను భూమిశిస్తువసూలుచేయుట కతిఘోరమగుపద్ధతి యవలంబింపబడినది. భూమిశిస్తువసూళ్లు-వేలము వేయబడెడివి. ఈవేలముపాటపాడినవారు వంశపరంపరగనుండినరాజులకంటె నతిఘోరముగ ప్రజల హింసించు చుండెడివారు. ఈభూమిశిస్తు వేలముపాట పాడినవారె జమీందారులైరి. అప్పటినుండియే భూకామందు-రైలు అను పరస్పర సంబంధ మేర్పడసాగినది. జిల్లాలయందలి కలెక్టరులు రైతులపై బడసాగిన అధికపన్నుభారమును గుర్తించుచునేయుండిరి. కాని కలకత్తాయందలి కలకత్తారివిన్యూబోర్డుమాత్రము వారిమాటలను వినియుండలేదు. కంపెనీ 1773 ఏప్రియలులో కలెక్టరులను తొలగించివేసినది. కలెక్టరులే దేశమునందలి వర్తకమునంతయు గుత్తగొనుచున్నటుల కంపెనీవారు దలంచిరి. కంపెనీ కెప్పుడుగాని రైతులనుంచి జమీందారులెంత భూమిశిస్తు వసూలుచేయుచున్నదియు, అందుకంపెనీకి, జమీందారులెంత చెల్లించుచున్నదియు తెలియనే తెలియదు.

"భూమిశిస్తు విధాన విజ్ఞానము తెలియకపోవుటవల్లనే కంపెనీ భూమిశిస్తును వేలము వేయుటయు, అందుమూలముగ భూమిశిస్తును, జమీందారులతో

శాశ్వతనిర్ణయమును గావించుకొనుటయు జరిగినది. పన్నులను వసూలుచేయు వారు లేక జమీందారులకే లాభముగలిగినది. రైతులకును ప్రభుత్వమునకును గూడ అరిష్టదాయకమైనది.1

1773 నవంబరు 23 తేదీని కలకత్తాకౌన్సిలు, ప్రెసిడెంటును భూమిశిస్తు విషయమై యొక కార్యవిధానమును నిరూపించిరి. ఇది తాత్కాలికముగ పని చేసినది. కలెక్టరులకుమారుగ ఒకభారతీయ దివాను నియమింపబడినాడు. 1772 లో నియమింపబడిన రివిన్యూబోర్డు సభ్యులు వీరివసూళ్ళను పరిష్కరించు చుండెడివారు. కౌన్సిలు సభ్యులెవరును స్వంతవర్తకమును గావించుకొనరాదని నిషేధింపబడినది. వీరికి నె 1 కి రు 3000 లు జీతము నిర్ణయింపబడినది. ఈ విధానముక్రింద చాలమంది రైతులుభూములను వదలివేసిరి. దివానులు దివానుపదవులను వదలివేసిరి. ఇంతకును రైతులనుండి వసూలుచేయబడజాల నంత పన్నుభారము వేయబడుటయే కారణము. పన్నులను ఇవ్వజాలకభూము లనే వదలుస్థితిగతులు వచ్చినవి.

రెగ్యులేటింగు శాసనమాచరణకు వచ్చునంతవరకును బెంగాలునకు, హేస్టింగ్సు బడాబడా నవాబని చెప్పవచ్చును. ఆయన అధికారమును ధిక్కరింపగలిగినవారులేరు. ఆయనపనిని కాదనగలిగినవాడు లేడు. ఈవిధముగ రెండుసంవత్సరములు భూమిశిస్తుమూలకముగ వంగదేశమున రక్తమాంసములు పిండివేయబడినవి. ఏవిధముగ సంపాదించినను ఆనాడు కంపెనీకి కావలసినదిడబ్బే. అందువల్ల హేస్టింగ్సు కృత్యమునెవరు కాదనగలరు?

"న్యాయపరిపాలన గతియు నీవిధముగనేయున్నది." న్యాయస్థానములు (కోర్టులు) అధికారము చెలాయించుటకు మూలసాధనములైనవి గాని న్యాయ నిర్ణయమునకు స్థానములుగా లేవు. ప్రజాసంరక్షణకు నిరుపయోగములు. ప్రజల నణచివేయుటకు తగినసాధనోపాయములైనవి. కంపెనీయొక్కనౌకర్లు భారతీయులనుండి తమకేమైన సొమ్మురావలసియున్నపుడు ఈభారతీయులు బ్రిటిషు బావుటాక్రింద కాపురమున్నవారు కాకపోయినచో వారు కంపెనీవారి ఫ్యాక్టరీల

1. See Keith p. 61.

పరిసరములయందుండినమొతల వారిని బలవంతముగపట్టి ఖయిదీలక్రింద కారాగృహములో వేసెడివారు. స్వదేశప్రభుత్వపు ఏయుద్యోగియొక్కగాని అంగీకారమును పొందెడివారుకారు. కంపెనీనౌకర్లు కోరినట్లుగ నిశ్చయము నంగీకరించు నంతవరకును వీరు ఖయిదులలో నుండవలసినదే.[1]

మరియు మీర్కాశీమును సింహాసనము నెక్కించుటకై జరిగినవిప్లవము వల్ల మరింత న్యాయపరిపాలన మపభ్రంశమైపోయినది. ఆంగ్లేయులు రాష్ట్రము నందలి లోపలిభాగములలోనికి చొచ్చుకొనిపోయి వర్తకము చేయనారంభించిరి. ఇందుతోపాటు న్యాయపరిపాలనముగూడ మంటగలిపిరి. 1769 లో సూపరువైజర్ల నియామకమైన నాటనుండియు సంస్కరణ మాశింపబడినది. ఈయాశయు నిరాశయే.

1772 ఆగష్టు 15 వ తేదీని తిరిగి న్యాయపరిపాలన సంస్కరణమైనది. ప్రతిజిల్లాయందునను ఒక దివానీకోర్టు ఏర్పడినది. దీనిపేరు దివానీ అదాలత్. ఈకోర్టులో సివిలు కేసులు విచారింపబడును. ఈకోర్టు వారమునకు రెండుపర్యాయములు సమావేశమగుచు తీర్పులనుచెప్పుచుండెడిది. దీనితీర్పులపైన దివానీ, సాదరు అదాలటు అను కలకత్తాయందలిముఖ్యకోర్టునకు అపీలు చేసికొనుచుండవచ్చును. ఈకోర్టునకు ఇరువురు కౌన్సిలర్లును గవర్నరునుకలిసి న్యాయమూర్తులుగ వ్యవహరించుచుండెడివారు. తాలూకాదార్లయొక్కయు జమీందారులయొక్కయు వారసత్వపుహక్కులను నిర్ణయించు అధికారము మాత్రము కౌన్సిలువకును గవర్నరునకుమాత్రమే యుండెడివి.[2] క్రిమినలు కేసుల విచారణకుగూడ ఇట్టికోర్టులే స్థాపింపబడినవి. ప్రతిజిల్లాకోర్టునకును కలెక్టరు అధ్యక్షుడుగ నుండెడివాడు. ఇరువురు మౌల్వీలును, ముఫ్తీయును, కాజీయును న్యాయశాస్త్ర నిర్వచనమును చేయుచుండెడివారు. ఈకోర్టులే "ఫౌజుదారీ అదాలటులని పిలువబడినవి (Provincial Faujdari Adalats) వీటిపైన నిజామటు, సాదరు అదాలటు అనుకోర్టుండెడిది. ఈకోర్టునకు డార్గో అడాలటు అనునాయన అధ్యక్షుడుగానుండెడివాడు. ఈయన నవాబుగారి

1. Keith p. 63.
2. See Warren Hastings in Bengal PP. 327-328.

ప్రతినిధియగు నాజీముచే నియమింపబడుచుండెడివాడు. ఈయనకు ప్రధానఖాజీయును ప్రధానముఫ్తియును ముగ్గురు మౌల్వీలును సహకారులుగ నుండెడివారు. 1774 లో ఈకోర్టునకే హేస్టింగ్సుగారు ఉరిశిక్షను వేసి ఖాయపరచుటకుగూడ నధికారమును లభింపజేసిరి. 10 వరకు వరగణాల పెద్ద కాపులే కేసులనువిచారించి తీర్పులను జెప్పుచుండెడివారు. ఈతీర్పులుపైన అపీలు లేదు. ఈ విధముగనే రు 500 వరకు జిల్లాకోర్టులు తీర్పుచెప్పవచ్చును. ఆతీర్పులపై అపీలులేదు. ఉరిశిక్షలను వేయుటకును రు 100 కంటె అదనపువన్ను వేయుటకును పౌజుదారీకోర్టులకు అధికారములేదు. సాదరుకోర్టులకు ఉరిశిక్షలకై సాక్షి వాఙ్మూలములను పంపుచుండవలయును. సాదరుకోర్టులు ఆస్తులు ప్రభుత్వపువశమును గావించుటకు గూడ అధికారముకగలిగియున్నవి. "దోపిడిగాండ్రు వారివారి గ్రామములలోనే ఉరితీయబడుచుండెడివారు. వీరికుటుంబములు ప్రభుత్వమునకు బానిసకుటుంబములుగ నొనరింపబడెడివి. (State Slaves) వీరున్న గ్రామములపై నగూడ జరిమానాలు విధింపబడుచుండెడివి. ఈవిధముగ దోపిడిగాండ్రను పట్టుకొను పోలీసువారు బహూకరింపబడుచుండెడివారు. ఉరిశిక్షలను వేయించుటలో హేస్టింగ్సు కొరానుయొక్క అధికారమును మీరవిూరినాడు.1 మరియు కలెక్టరులే ఆయాజిల్లాల పరిపాలనకు వలయునియమములను కంపెనీవారి యనుమతిని గావించుచుండెడివారు. ఈవిధముగ దివానుగిరీయొక్క అధికారమును వలుమూలలకు వలుతెరంగులకంపెనీవారు విస్తరింపచేసిరి.

1773 లో కలెక్టరుపదవులు తీసివేసినపిమ్మట వీరిస్థానమున దివానులు నియమింపబడిరి. ఈదివానుల కేసులసాక్షి వాఙ్మూలములను రాష్ట్రీయకౌన్సిలునకు తెలుపుచుండెడివారు. ఈకౌన్సిలుతీర్పులపై రు 1000 లకు పైకిమ్మతుగల ఆస్తులపై సాదరు అదాలతు కోర్టునకు అపీలుచేసికొనుటకు వీలుండెడిది. పెద్ద కాపులు దివానులు జమీందారులు మొదలగు ముఖ్యఉద్యోగస్తులపైన నేరారోపణము రాష్ట్రీయకౌన్సళ్ళయందే చేయవలయును. ఈకౌన్సిలు తీర్పులపైన కలకత్తాయందలి రివిన్యూకౌన్సిలునకు అపీలుచేసికొనవచ్చును. పౌజుదారీ అదాలతుకోర్టు న్యాయమూర్తులపైన, అపీలు గవర్నరునకు గావించుకొనవలయును.

1. Keith P.65.

గవర్నరు ఈ కేసులను నిజామతు అడాలటునకు విచారణకై పంపుచుండెడివాడు. ఈవిధముగ హేస్టింగ్సు కలెక్టరులచేతులలో భూమిశిస్తువసూలుచేయు అధికారమును న్యాయనిర్ణయాధికారమును రెండుకలిసియుండరాదని నిర్ణయించి కలెక్టరుపదవులనే రద్దుచేసినాడు.

హిందూమహమ్మదీయ న్యాయశాస్త్రములను తయారుచేయించ హేస్టింగ్సు తలపెట్టినాడుగాని నెరవేరలేదు.

వర్తకమునకు సంబంధించి గుర్తింపనర్హమగు మార్పులేమియును హేస్టింగ్సు గావింపలేదు. సం. 1775 లో రహదారీచీటిలేకుండ కంపెనీవర్తకులు వర్తకమును కొనసాగించుకొనుచుండుటను రద్దుజేసినాడు. అందలివస్తువులపైన అంతర్వ్యాపారశుల్కము 100 కి, 2/½ వంతున విధింపచేసినాడు.

2
ఢిల్లీ పాదుషా హేస్టింగ్సు- కప్పము నిరాకరించుట.

ఇక నవాబుగారిపట్ల హేస్టింగ్సు ఎట్లుప్రవర్తించినదియు గుర్తింపవలసియున్నది. నవాబుగారి రాజ్యాధికారమును మూలమట్టముగ నాశనముచేయుటయే హేస్టింగ్సుగారి సంకల్పము. ఇంతియేకాదు. ఢిల్లీపాదుషాయొక్క అధికారమునుగూడ హేస్టింగ్సు గుర్తించియెరుగడు. పానిపట్టు యుద్ధము 1761 లో ముగిసినపిమ్మట 1771 లో ఢిల్లీపాదుషా మహారాష్ట్రులసంరక్షణము నంగీకరించె ననునెపమున హేస్టింగ్సు వంగదేశమునుండి ఆయనకొసంగబడుచున్న రు 26 లక్షలకప్పమును ఇచ్చుట మానివేసినాడు. ఢిల్లీపాదుషాకుచెందిన కోర్, అల్లాబాదులను అయోధ్య నవాబునకు రు 50 లక్షల కమ్మివేసినాడు. ఈవిధముగ హేస్టింగ్సు ఢిల్లీపాదుషాకు కంపెనీవారొసంగిన వాగ్దానములన్నియు భంగమొనరించినాడు. న్యాయశాస్త్రప్రకారముగాని, నైతికముగగాని, హేస్టింగ్సుగావించినపని సమర్థనీయము గాదు. 1 హేస్టింగ్సు అంతతోగూడ సంతృప్తుడుకాలేదు. 1773 లో షుజాజిద్దౌలాతో కాశీయందు, షుజాజిద్దౌలా అంతనుండియు కంపెనీవారి యధీనుడుగ నుండునట్లుగ నొడంబడిక గావించుకొన ప్రయత్నించుచుండెను. 1777 లో

1. Keith p. 67.

బీరారువిషయమునగూడ నట్టియొడంబడికకై ప్రయత్నించెను. అనగా ఢిల్లీ పాదుషాక్రింద సామంతరాజ్యములుగనున్న ఈ దేశములను కంపెనీవారి సామంత రాజ్యములుగ గావించుటకై యత్నించినాడు. కాని యాపని సాఫల్యము కాలేదు. ఆనాడు ఆంగ్లేయప్రభుత్వము సర్వాధికారమును వహించుటకు సంసిద్ధముగ లేకపోవుటయే కారణము.

1763 లో జరిగిన పారిసునగరపు సంధిలో ఆంగ్లేయప్రభుత్వము సర్వాధికారముగలదానిగ నిర్ణయించుకొనలేదు. దక్కను సుబేదారుగ సలబతుజంగు అంగీకరింపబడినాడు. కర్నాటక నవాబుగ మహమ్మదాలీ గుర్తింపబడినాడు.1

1769 వరకు ఆంగ్లేయప్రభుత్వము ప్రత్యక్షముగ గలుగజేసికొనలేదు. అప్పుడే ఆంగ్లేయచక్రవర్తి ఢిల్లీపాదుషాకు కానుకలను పంపెను. ఈకానుకలను ఆంగ్లేయచక్రవర్తి సింహాసనాసీనుడైనపుడు ఢిల్లీచక్రవర్తిపంపిన కానుకలకు మారుగబంపెను. ఈవిధముగ ఆంగ్లేయరాజు స్వయముగ సైన్యనాయకునిచేత కానుకలను పంపుటను, కంపెనీయధికారులును హిందూదేశమందలి కంపెనీనౌకర్లునుగూడ సహించజాలకపోయిరి. ఈవిషయమై ఆంగ్లేయచక్రవర్తి ముందుగ కంపెనీకి తెల్పియుండలేదు. అందువల్ల చక్రవర్తిపంపినసైనికరాయబారి స్వదేశసంస్థానములతో గలుగజేసికొనరాదని భారతదేశమందలి కంపెనీనౌకర్లు ప్రతిఘటింపసాగిరి. మదరాసుకౌన్సిలునకును—లిండ్సే గారికిని మధ్యను-హార్లాండు మధ్యను పరస్పరస్పర్థలు జనించినవి. ఈహార్లాండుగారు హైదరాలీతో, అమలునందున్న 1769 సంవత్సరపు ఒడంబడికనురద్దుచేసి మహారాష్ట్రులతో ఒడంబడికగావించుకొనుటకుగూడప్రయత్నించియుండెను. ఈయనుభవమువల్లనే ఆనాడు ఆంగ్లేయప్రభుత్వమునర్వాధికారము వహించవలెనని తలంచియున్నను వహింపజంకినది. 2

హేస్టింగ్సు నిరంకుశాధికారము అయోధ్యవ్యవహారములలో మరింత విస్పష్టమయినది. రోహిలకండునందలి రోహిలాలను నశింపజేయుటకై అయోధ్య నవాబునకు కంపెనీవారిసేనలతో హేస్టింగ్సు సహాయము చేసినాడు.

1. Gleig Warren Hastings I, 508 II, 136.
2. Keith p. 68.

"హేస్టింగ్సు కృత్యములీ పట్ల క్షమార్హములుగావు. ఈవిధముగ దుష్కృత్యములకు మరొకపర్యాయము మెప్పును బ్రిటిషుసేనలు వినియోగింపబడలేదు. దుష్పరిపాలకులకొరకై సత్పరిపాలకులను నశింపుచేయలేదు."1

ఈ ఘోరకృత్యముల కన్నింటికిని కంపెనీకి విశేషముగ ధనము సంపాదింపవలెననెడి హేస్టింగ్సుయొక్క సంకల్పమే కారణము. అయోధ్యబీగములను హింసించుటలో గూడ నిదియే తాత్పర్యము.

## 12 రిగ్యులేటింగు శాసనము.

### (Regulating Act)

1 భయోత్పాతము. 1757 సంవత్సరపు విప్లవముజరిగిన నాటినుండి యుగూడ మీర్జాఫర్ రాజ్యాధిపత్యమును వహించిన నాటినుండియు వంగదేశపు ప్రభుత్వమునకంటె కుంపెణీవారి ఆంగ్లేయ హైందవ మహమ్మదీయ ఏజంట్లుమాత్రమే, ప్రభుత్వము పైప్రభుత్వముగ వ్యవహరింప సాగిరి. "నవాబుగారుగాని, ఆయనఏజెంట్లు గాని ఆయన ఉద్యోగస్తులుగాని ఎవరును ఆంగ్లేయులెట్టి దురన్యాయములకును దుష్కృత్యములకును బాల్పడియున్నను వారిపై ఎట్టిచర్యనుగాని దీసికొన సాహసింప జాలకపోయెడివారు. కంపెనీ గుమాస్తాలు, నవాబును నవాబుపెద్దయుద్యోగులనుగూడ తలతన్నుచు న్యాయస్థానములన్నియు దురన్యాయస్థానములుగ మార్చివేసిరి. ఎవరినైతే కంపెనీవారు అణగద్రొక్కుచు నుండెడివారో అట్టివారికే న్యాయస్థానములలోగూడ క్రూరమగు దండనకు బాల్పడ జేయుచుండెడివారు. ఈధూర్తుల చెప్పుచేతలకు బుద్ధిపూర్వకముగ వారంగీకరించకపోవుటయే నేరమయ్యెడిది.- ఆంగ్లేయులయొక్కయు వారిఏజంట్లయొక్కయు నేరములకు శిక్షయే యుండెడిదిగాదు. దురదృష్టవంతులగు స్వదేశీయులు వారిపాదములకడబడి తలలొగ్గియుండెడివారు.2

1. Thompson and Garrat, British Rule in India. pp. 128-31.
2. See Mill. ch. 7.

"ఇంతకుపూర్వ మెప్పుడును స్వదేశస్థులీవిధముగ భయపూరితులుగ నొనరింపబడి యుండలేదు. (Tyranny) ఈ క్రూరచర్య బహునిపుణతతోను, దృఢసంకల్పముతోను, శోధనాపూర్వకముగను, నొనరింపబడు చుండెడిది. కంపెనీయొక్క ప్రతినిధియయిన తనయజమానియొక్క అధికారముల నన్నియు గలిగియున్నట్లుగనే భావించి వర్తించుచుండెడివాడు. ఒకప్పుడు జనసంకీర్ణమై యుండి యభివృద్ధికరములుగానుండిన జిల్లాలన్నియు తుట్టతుదకు నిర్జనప్రదేశములుగ మారిపోయినవి. ఆంగ్లేయవర్తకులు దృష్టికి గోచరించునంతతోనే గ్రామస్థులందరు గ్రామములనువీడి పారిపోవుచుండెడివారు. దుకాణములు మూసివేయబడెడివి. భయభ్రాంతులై యున్నవారితో రస్తాలన్నియు నిండియుండెడివి. ఈపరిస్థితులు మానవహృదయము గలవారలకు దుర్భరదృశ్యములైనవి. పార్లమెంటుసభ్యుల యాలోచనకు పాత్రములైనవి." "సర్వాధికారమును-లాయును వర్తకమునుండి వేరుచేయబడకపోయినచో హిందూదేశమును-సీమదేశమునుగూడ రెండును క్రుంగిపోవుట నిశ్చయము. మరల తలయెత్తజాలవు"2 అని పార్లమెంటుసభ్యుడగు కల్నల్ బర్గోయనుగారు దలంచిరి. (Said Colonal Burgoyne) కంపెనీనౌకర్ల జీతబత్తెములను వృద్ధిజేసినంతమాత్రమున ఈదోపిడివిధానము నశించదని పార్లమెంటు విశ్వసించినది. సద్గుణవంతులగు సిబ్బందియున్నచో నీఘోరములు తగ్గగలవు. కాని, అట్టిఉత్తమకుల సంభవులగు వారును శమవిధులను సక్రమముగ నిర్వహించువారును సదాదర్శములు గలవారునైనగు సిబ్బందీ లభించుటలేదు. వర్తకసంఘమునకిట్టి సిబ్బందీని సంపాదింపగలశక్తియు నుండజాలదు. ఒకే సంఘము వర్తకమును చేయుచుండుటయు రాజ్యమును పరిపాలించుచుండుటయును ఆసంఘమునకు స్వతస్సిద్ధమగు నవలక్షణము. అప్రాశస్త్యము. అన్యాయములకును అసంగతములకును సావకాశముగలిగి యుండుటనిశ్చయము. అను అభిప్రాయముగూడ పార్లమెంటు వారిని సక్రమచర్యకు ప్రోత్సహించుటకు కారణము.3 అయితే పార్లమెంటుసభ్యుల సదభిప్రాయము

1. See secky ch. 12. See also Adam Smith IV. cha. 7.
2. See Roberts p. 168.
3. B.K. Thakore p.29.

లాచరణమునకు చాలా కాలము వరకు రాలేదు.1 ఈస్టిండియా కంపెనీ వర్తకమును చేయుటకు మాత్రమే కృషిచేయుట లేదని విస్పష్టమైనది. అటువంటిసంస్థను రాజ్యాంగమునకు లోబరచకుండనుండుట అయుక్తమని తలంచబడినది. క్లైవు, హేస్టింగ్సులు గూడ చక్రవర్తిగారి యాధీనము క్రిందనే కంపెనీ పరిపాలన జరుగుట సమంజసమని తలంచియేయుండిరి. కాని ఒక్కమాటుగ కంపెనీకిగల సర్వాధికారమును రద్దుచేసి బ్రిటిషుప్రభుత్వము సర్వాధికారము వహించుట సమంజసముగాదని తలంచినది. మరియు ఆకాలమున పార్లమెంటు, ఆస్తులయందుగల హక్కులను బహుభద్రముగ కాపాడవలయుననెడి విజ్ఞానము గలిగియుండెడిది. మరియు చక్రవర్తిగారే సర్వాధికారమును వహింపవలసివచ్చుచో "దివాని" అధికారమును నిర్వహింపవలసి వచ్చెడిది. చక్రవర్తిగారు మొగలాయి చక్రవర్తిగారి తాబేదారుగ దివానుగిరీకి యంగీకరించుట గౌరవనష్టమును తలంపే యిందులకు కారణము. అందువల్ల మొగలాయిచక్రవర్తికిగల సర్వాధికారము నప్పుడే త్రోసివేసినయెడల హిందూదేశము నందునను ఇతర ఆంగ్లేయరాజ్యముల యందుననుగూడ అశాంతి ప్రబలెడిది. ఇందువల్ల పార్లమెంటు చేయగలిగిన పని యొక్కటియే మిగిలినది. ఈపనిని నాటి న్యాయశాస్త్రవేదులు గూడ హర్షించిరి.2 (1757 డిశంబరు 24) భారతీయ రాజులచేత దానముచేయబడిన ఆస్తిపై సర్వహక్కులును పరిగృహీతకే చెందియున్నవి. కాని అందుగల ఆంగ్లేయపౌరుల మీదను అచ్చటఏర్పరుపబడిన ఫ్యాక్టరీనివాసములు ఆంగ్లేయమై యుండుటవల్లను వీటిపై సర్వాధికారము సీమదేశపురాజుగారికే చెందియున్నది.

ఈ విధముగానే యుద్ధములో జయించి సంపాదించిన రాజ్యభాగముల ఆస్తిహక్కును సర్వాధికారమును గూడ సీమరాజుగారికే చెందియున్నది. కంపెనీవారిచే 1772 సంవత్సరమున పార్లమెంటులో ప్రవేశపెట్టబడిన బిల్లుపై ప్రసంగించుచు యుద్ధములలో జయించిన భూభాగముపై రాజునకు

1. By an act of 1767 and by the Act of 1769 April the increase of dividends than at one per cent perannum, or any increse beyond, 12½% was prohibited. The E, Co had also been paying customs duties upon their exports and imports annually amounting to not less than 1½ Millos.

2. See Keith p. 69.

హక్కు లేదని గవర్నరు జోన్‌స్టన్‌గారు ప్రసంగించిరి. క్లైవు కంపెనీ పరిపాలనమును గురించియు వాటాదారులను గురించియు డైరెక్టరులను గురించియు అతి వ్యతిరేకముగ ప్రసంగించి యుండెను. ఈ బిల్లు నిరాకరింపబడెను. బిల్లునకు మారుగ 1772 హిందూదేశమందలి కంపెనీవారి వ్యవహారములను గురించి విచారించుటకై ప్రత్యేక సంఘము నియమింపబడినది. ఇందులకు బర్గోయిను కారకుడు. నూటికి 12½ వంతు లాభమును పంచి పెట్టియు అగస్టులో కంపెనీ గవర్నమెంటును ఋణమడిగినది. ఇంతలో రహస్యపు విచారణసంఘము నియమింపబడవలసి వచ్చినది. ఈ రెండు సంఘములును తాము దెలిసికొనిన విషయములను తరుచు దెలుపుచుండెడివారు. "హిందూదేశమందలి అన్యాయము భూమ్యాకాశముల నిండిపోయినది." అని చాతము (Chatham) 1773 లో వ్రాసియుండెను. (India teems with iniquities so rank as to smell to earth and heaven) షేల్‌బారనుగారు కంపెనీపరిపాలననంతయు అన్నివిధముల వక్రగతినుండే యున్నదని ఖండించిరి. వీరి యభిప్రాయము ఫలితముగ 1772 డిశంబరులో పార్లమెంటునూపర్వైజర్లను, కంపెనీ ఇండియాకు పంపవలదని నిషేధించినది.

కంపెనీ తిరిగి 1773 మార్చిలో ఋణమునకై పార్లమెంటునకు దరఖాస్తును పెట్టినది. బర్గోయినుగారు మరల కంపెనీ పరిపాలనమును ఖండింపసాగిరి. వీరికృషి ఫలితముగ "కంపెనీ యుద్ధముల మూలమునను - లేక ఒడంబడికల మూలమునను సంపాదించిన ఆస్తులపై సర్వహక్కులను స్వతస్సిద్ధముగ ప్రభుత్వమునకు చెందు"నని పార్లమెంటు తీర్మానించినది. ఈ తీర్మానమునకు బర్గోవంటివారు వ్యతిరేకులు గూడ గలరు.

పార్లమెంటునియమించిన కమిటీల నివేదికలలోని ముఖ్యనిర్ణయము లేమి?

2 పార్లమెంటరీ కమిటీనివేదికల నిర్ణయము.

1. నష్టపరిహారముల క్రిందను యుద్ధక్రియల క్రిందను స్వదేశ రాజులనుండి, అపరిమితముగు ధనము తీసికొనబడినది.

2. కంపెనీనౌకర్లు బహుమానముల క్రింద విశేషధనమును నేకరించిరి. (A great part of these gifts going to minor servants for procuring minor promotions have never been traced) 1

1. Secky. chap. 12.

3. విప్లవములును యుద్ధములును తరచు సంభవించినవి. వీటికిఫలిత ముగ దేశ మరాజకమైనది. ఆదాయమునకంటె సైనికవ్యయమును ఇతర వ్యయములును అత్యధికమై పోయినవి.

4. ప్రజలనుబెట్టిన హింసయు వారిధనములను దోచినదోపిడియు మహా సంక్షోభ కారణములయినవి.

5. కంపెనీయుద్యోగస్థులలో శిక్షణయెంతమాత్రమునులేదు. పరస్పరమువైషమ్యములతో స్పర్థలకుగడంగుచుండెడివారు. వీరిలో ప్రజాహితసేవ యను తత్వమేలేదు. స్వలాభముకొఱకే ప్రవర్తించుచుండెడివారు. వీరి పరస్పరపోరాటములు కంపెనీయొక్క రాజ్యాధికారమునే క్రుంగదీయునట్లుగ నుండెడివి.

6. మూడురాష్ట్రములును తలకొకదారిగ ప్రవర్తించినవి. వీటిమధ్య ఏక ఆదర్శముగాని నీతిగాని పరస్పరసహకారముగాని యుండెడిదిగాదు.

7. ఈవిధముగ కంపెనీపరిపాలనము హిందూదేశమున నరాజకముగ నుండుటయేకాక ఇంగ్లండునందుగూడ కంపెనీవాటాలు తరచు చేతులుమారు చుండెడివి. ఈమారకము సత్యముగ వాటాలఅమ్మకము ననుసరించి జరుగు చుండెడిదికాదు. కంపెనీమీటింగులలో డైరక్టరుల ఎన్నికలకొఱకై ఓట్ల తబ్బిబ్బులకుగాను వాటాదారులపేరులు తారుమారుగుచుండెడివి.

8. డైరక్టర్ల బోర్డుగూడ నొకనిర్ణయమగు రాజనీతిని నడుపగలిగినదిగ నుండెడిదిగాదు. సక్రమమగు పలుకుబడిని వినియోగింప నశక్తతతో గూడి యుండెడిది. (The reports of parliamentary committees appointed after 1769 made the calculation that between 1757 to 66 the company's servants received as presents from Bengal a sum of £ 2,169, 665. This was apart from such acquisitions as Clive's Jagir valued at £ 600,000 the gains made from private trade by the company's servants by abusing privileges granted to the company and £3¾ Millions paid as compensation for losses incurred to the officers of the company.)

3 రెగ్యులేటింగు శాసనములు లోనికివచ్చుట

ఈపరిస్థితులఫలితముగనే రెండుశాసనములు గావింపబడినవి. మొదటిశాసనమునసుసరించి కంపెనీకి 100 కి 4 వంతున పౌ 1,400,000 ల రుణమును పార్లమెంటు మంజూరుచేసినది. ఈఋణము తీర్మానముగునవరకును కంపెనీచెల్లించవలసిన సాలుసరికప్పము రద్దుచేయబడినది. కంపెనీపంచుకొనవలసిన లాభములకు హద్దుకల్పింపబడినది. కంపెనీవారి లాభనష్టముల లెక్కలను ప్రతియారుమాసములకొకమారు బ్రిటీషుప్రభుత్వ కోశామాత్యునకు పంపవలసినట్లుగ నిర్ణయింపబడినది. 1773 సం॥ అక్టోబరు 1 వ తేదీని రిగ్యులేటింగు శాసనము సీమదేశమునందమలులోనికి వచ్చినది. 1774 అక్టోబరు 20 తేదీ మొదలు భారతదేశమునందములునందుంచబడినది. అనగా నీశాసనమునసుసరించి నియమింపబడిన ముగ్గురుకౌన్సిలర్లును ఈక్రిందటినాడే కలకత్తా చేరగలిగిరి. రిగ్యులేటింగు శాసనము ననుసరించి ఇంగ్లండులో కంపెనీయొక్క అంగసౌష్టవము సవరింపబడినది.

4 పరిపాలనా విధానమందలి మార్పులు.

ప్రతిసాలున 24 డైరక్టర్లు ఎన్నుకొనబడుపద్ధతి రద్దుచేయబడినది. ఈశాసనము ననుసరించి పౌ 500 లకు మారుగ పౌ 1000 ల వాటాలను గలిగియున్న వాటాదారులకు మాత్రమే వాటాదారుల మీటింగులో ఓటింగు హక్కుండునని నిర్ణయము. డైరక్టరులు నాలుగుసంవత్సరములు మాత్రమే డైరక్టరులుగ పనిచేయవచ్చును. ప్రతిసాలునముప్పదిమందిలో 6 గురు డైరక్టరులు తమపదవులనుండి తొలగుదురు. వారిస్థానములకు తిరిగి ఎన్నిక ఏర్పరుపబడినవి. "ఇందువల్ల 1246 మంది వాటాదారులు ఓటుహక్కులేకుండగబోయిరేకాని ప్రొప్రయిటరుల కోర్టునకు, సక్రమముగ వారెన్నుకొనబడుటకుకాని, (Court of Proprietors) హిందూదేశమునుండి ధనరాసులతో తిరిగి సీమకుబోయిన కంపెనీనౌకరులు అధికారమును కొనుచుండుటను నిరోధించుటకు వీలుపడలేదు. పౌ 3000 ల వాటాదారునకు రెండువోట్లును పౌ 10,000 ల వాటాదారునకు నాలుగుఓట్లును ఒసంగుటయే యిందులకు కారణము.

డైరక్టర్లు హిందూదేశమునుండి, తమకు తెలుపబడిన ముఖ్య విషయముల గురించిన నకిళ్ళను మంత్రివర్గమునకుగూడ పంపుచుండవలయును. ఈనకళ్ళ ననుసరించి, తమయిష్టము ననుసరించి మంత్రివర్గము జోక్యము గలిగించుకొన వచ్చును. ఈవిధముగ బ్రిటిషుప్రభుత్వము కంపెనీవారి రాజనీతిని నడుపుటకు మొదలుపెట్ట నారంభించెను.

హిందూదేశమునందున్న మూడు రాష్ట్రములు రాష్ట్రస్వాతంత్ర్యము ననుభవించుచుండెడివి. ఈ రెగ్యులేటింగుశాసన మీపరిస్థితులను మార్చివేసినది. వంగరాష్ట్రమున కితరరాష్ట్రములపై నధికారమొసంగబడినది. మదరాసు బొంబాయి రాష్ట్రములకు స్వాతంత్ర్యముగ యుద్ధములను జేయుటకు, ఒడంబడికలను గావించుకొనుటకు అధికారము తీసివేయబడినది. ఇందులకుగాను కలకత్తాప్రభుత్వపునాజ్ఞలనుగాని కంపెనీవారియుత్తరువులనుగాని గైకొనవలసియున్నది. అత్యవసరసమయములలో యుద్ధములపట్ల వ్యవహరించుటకు మాత్రము మదరాసు బొంబాయిల కొకింతయధికారముంచబడినది. బొంబాయి మదరాసులప్రభుత్వములు తమవ్యవహారములను కలకత్తాకు నియమప్రకారము నివేదించుచుండవలయును. కలకత్తాప్రభుత్వపుటాజ్ఞలను డైరక్టరులయాజ్ఞల వలెనే శిరసావహించి నిర్వర్తించుచుండవలయును. కలకత్తాప్రభుత్వమున కనవసరమని తోచినపుడు బొంబాయి మదరాసుప్రభుత్వములప్రసిడెంటును కౌన్సిలును గూడ నుద్యోగమునుండి తాత్కాలికముగ భర్తరపుచేయుట కధికారము గలిగింపబడినది.

ఈ విధముగ హిందూదేశమునందు కంపెనీవారి రాజ్యాధికారము కలకత్తాప్రభుత్వమునందు కేంద్రీకరింపబడినది. కలకత్తాప్రభుత్వమునకు వంగ, బీహారు, ఒరిస్సాలపై పరిపాలనాధికార మొసంగబడినది. ఈ కేంద్రీకరణము వల్లనే మూడురాష్ట్రములమధ్యను రహదారీబాటల నేర్పరుపవలసిన యగత్యము గమనింపబడినది. ఈనూతన శాసనాధికారము మొదటి మహారాష్ట్ర యుద్ధకాలమున సంభవించినది. బొంబాయిరాష్ట్రము ఇతరులసలహాలనంగీకరించ నిరాకరింపుచున్న సమయము నది. బొంబాయిప్రభుత్వమునకును, కలకత్తాయందలి హేస్టింగ్సుప్రభుత్వమునకును, హేస్టింగ్సునకును, అతనికౌన్సిలరులకును

మధ్య పరస్పర వైరుధ్యములేర్పడినవి. ఈవిరోధములవల్ల ఈశాసనప్రాముఖ్య మంతగ పరిగణింపబడలేదు. ఇంతవరకును గవర్నరుకౌన్సిలుచేత నిర్వహింపబడుచున్న పరిపాలనావిధానము సక్రమముగలేదని గుర్తింపబడసాగినది. కంపెనీవ్యవహారములు పెచ్చుపెరిగినవి. వ్యవహారక్లిష్టతయు స్ఫురింపచినది.

5
గవర్నరు జనరలు
వంగము

వంగ దేశమునకు గవర్నరు జనరలును నలుగురు కౌన్సిలర్లును గలిసి ప్రభుత్వముగనుందురు. ఈప్రభుత్వమునకే హిందూదేశమంతటిపైనను సర్వాధికారమొసంగబడినది. ప్రతివిషయమును అధికసంఖ్యాకులఓటునుబట్టి నిర్ణయింపబడవలయును. గవర్నరుజనరలునకుగూడ నొకఓటుగలదు. సమానసంఖ్య వచ్చినపుడు మాత్రమే గవర్నరుజనరలుగారు మరియొకఓటు నుపయోగించుట కధికారమొసంగబడినది. (Casting vote) ఈపరిస్థితి నలుగురుకౌన్సిలరులలోను నొకరులేనపుడు మాత్రమే సంభవింపగలదు. కాని నలుగురు కౌన్సిలర్లును గవర్నరుజనరలుగారును అయిదుగురుకలిసి వ్యవహారమునిర్ణయింపదలచినపుడు మాత్రము గవర్నరు జనరలుగారుతమతుదినిర్ణయాధికారపు ఓటును వినియోగింపనవసరముండదు. వీరియుద్యోగకాలపరిమితి అయిదుసంవత్సరములు. ఈ అయిదుసంవత్సరముల కాలములోపున వీరియందెవరినిగాని, తీసివేయుటకు, కంపెనీడైరక్టరుల కధికారములేదు. కంపెనీడైరక్టరులుకోరినచో చక్రవర్తిగారు మాత్రమే వీరియందెవరినైనను తీసివేయగలిగియుండిరి. ఈరెగ్యులేటింగుశాసనమును అనుసరించి మొట్టమొదటగ హేష్టింగ్సుగారే గవర్నరుజనరలుగ నియమింపబడిరి. వీరితోపాటు అప్పుడు హిందూదేశమునందుననే కల బార్వెలు అనునాయన కౌన్సిలరుగా నియమింపబడినారు. మిగిలినముగ్గురు క్రొత్తవారు. వీరు ఇంగ్లండునుండిపంపబడిరి. బహుస్వల్పయుద్యోగమునుండి హేష్టింగ్సు, బార్వెలుగారలు ఉత్తమస్థానము నధిష్టించిరి. గవర్నరుజనరలుపదవి ఏకారణముచేతనైనను ఖాళీయగుచో కౌన్సిలరులలో నెక్కువకాలము పనిచేసినవారు గవర్నరు జనరలుగ పనిచేయువలసియున్నది. కౌన్సిలరుల స్థానములు ఖాళీయగుచో రాజుగారి సమ్మతితో కంపెనీడైరక్టరులే ఖాళీస్థలములను భర్తీచేయుట కధికారము గలిగియుండిరి. ఈవిధముగ మొదటి 5 సం॥లు ముగిసినవెనుక కంపెనీవారే యీయుద్యోగముల నన్నింటిని తమ యిష్టము

వచ్చినవారి కొనంగవచ్చును. ఇప్పటినుండియు గవర్నరుల యొక్కయు గవర్నరు జనరలుయొక్కయు నుద్యోగకాలపరిమితి 5 సం॥ ములుగ రివాజుగా యుండ వచ్చెను. గవర్నరుజనరలుగారికి సాలుసరి పౌ 25,000ల జీతము. గవర్నరుజనరలు కౌన్సిలుసభ్యునకు పౌ 10,000 ల జీతము. (సర్వసైన్యాధిపతిగగూడ పనిచేసిన క్లవరింగు పౌ6000/ల జీతము నదనముగ గ్రహించియుండెడివాడు. చక్రవర్తిగారిచే నియమింపబడిన యుద్యోగస్థులుగాని లేక కంపెనీవారిచే నియమింపబడిన యుద్యోగస్థులుగాని ఎవరియొద్దనుండియు బహుమతులను తీసికొనరాదు. గవర్నరుజనరలును ఆయన కౌన్సిలర్లును, సుప్రీముకోర్టు న్యాయమూర్తులును వ్యక్తిగతమైన వర్తకమును చేయరాదు. (Private trade) కంపెనీడైరక్టర్లెవరుగాని నూటికి 12 కంటె హెచ్చువడ్డీ అప్పులనీయరాదు. ఎవరైనను, యీనిబంధనముల నుల్లంఘించినచో సీమకు తిరిగిపంపివేయబడి కానుకలగా తీసికొనబడిన మొత్తమునకు రెట్టింపు వానినుండి వసూలుచేయబడునట్లు నిర్ణయింపబడెను. ఉద్యోగమునుండి తీసివేయబడిన నౌకరు నాల్గింట మూడువంతులమంది డైరక్టరులును ప్రొప్రయిటరులును అంగీకరించినపుడే తిరిగి యుద్యోగమును పొందగలడు. రహస్యపు కమిటీవారు, వారి 1773 మే 6 వ తేదీనివేదికలో 1753 సంవత్సరపు అధికారపత్రమునను సరించి స్థాపించిన న్యాయస్థానవిధానము సక్రమముగ పనిచేయుట లేదని వ్రాసిరి. కౌన్సిలుతోగూడి గవర్నరు, న్యాయమూర్తులనుగూడ నుద్యోగమునుండి తీసివేయుటకధికారమును గలిగియుండుటచే మేయరుకోర్టును, ఇతర కోర్టులనుగూడ న్యాయనిర్ణయమును గావింపజాలకపోయెననియు కంపెనీనౌకరులు నేరముల జేసినను శిక్షింపబడుటలేదనియు వ్రాసిరి. ఇంగ్లీషులాను ప్రయోగించుట కూడ నసమంజసముగ బడినది. ఈకమిటీవారి నిర్ణయమునను సరించియే 1753 సం॥పు అధికారపత్రమునను సరించి కలకత్తాలో స్థాపింపబడిన కోర్టును ఎత్తివేసి సం॥ 1774 మార్చి 26 తేదీ అధికార పత్రమునను సరించి కలకత్తాలో సుప్రీముకోర్టు స్థాపింపబడినది.

6 సుప్రీముకోర్టు

ఈకోర్టు చక్రవర్తిగారి యుత్తరువుల ననుసరించి స్థాపింపబడినది. ఈకోర్టునకు ఒక ప్రధాన న్యాయమూర్తియు (Chief Justice) మరి ముగ్గురు న్యాయమూర్తులును చక్రవర్తిగారిచే నియమింపబడిరి. వీరు బారిష్టరులైయుండి అయిదు సంవ

త్సరములు అనుభవము గలవారై యున్నారు. వీరికి సివిలు, క్రిమినలు, నావికా, క్రైస్తవ మతసంబంధపు వ్యవహారము లన్నిటియందును గూడ నున్నతమాధికార మొసంగబడినది. ఈ కోర్టునకు ఆంగ్లేయపౌరు లందరిపైన నధికార మొసంగ బడినది. కంపెనీనౌకర్లందరిపైనను కంపెనీకిగల రాజ్యభాగమందలి ఆంగ్లేయ నౌకర్లందరిపైనను గూడ నధికార మొసగబడినది.

గవర్నరు జనరలును ఆయన నౌకర్లను గూడ రాజద్రోహ నేరమునకై విచారించుటకీ కోర్టునకే యధికార మొసంగ బడినది. స్వదేశస్థులకును ఆంగ్లేయపౌరులకును మధ్య సంభవించు కంట్రాక్టు తగవులనుగూడ నీకోర్టు విచారింపవచ్చును. అయితే అట్టి కంట్రాక్టులలో స్వదేశీయు డీకోర్టు అధికారమునకు ఒడంబడికను వ్రాసినపుడే ఈకోర్టు ఆతగవులను విచారింపగలదు. ఈకోర్టువారే వారిక్రింద పనిచేయు జడ్జీలనుగూడ నియమించుట కధికారము గలిగియుండిరి. కాని వారిజీత బత్తెములను కౌన్సిలుతో గూడిన గవర్నరు జనరలుగారు అంగీకరించవలసియున్నది. కోర్టుఫీజునుగూడ ఈకోర్టే గవర్నరు జనరలు కౌన్సిలు అంగీకారముతో నిర్ణయింపగలదు.

1726 సం॥ము నుండియు రాష్ట్ర కేంద్రస్థానములలోగల మేయరు కోర్టుల తీర్పులపై గవర్నరు కౌన్సిలునకే అపీళ్లు చేయబడుచున్నవి. మరియు కౌన్సిలు యొక్కుడైన ప్రసిడెంటుగారికే క్రిమినలు నేరములను విచారించుటకు గూడ నధి కారముగలదు. ఈరెండుకోర్టుల నుండియు గూడ కట్టకడపటి అపీలు ఇంగ్లండులో గల ప్రీవికౌన్సిలులో దాఖలుచేయబడు చుండెడివి. వంగదేశమునందు సివిలు కేసుల విచారణకై దివానీకోర్టులును — క్రిమినలు కేసుల విచారణకై ఫౌజుదారీ కోర్టులును (Faujudari) ప్రతి జిల్లాయందునను నెలకొల్ప బడినవి. కలకత్తా యందు ఈజిల్లాకోర్టులపై నధికారముగల సాదరుదివానీ అదాలత్ కోర్టులును (Superior Sadar Divani Adalat) సాదరు నిజామతు అదాలత్ కోర్టును స్థాపింపబడినవి. (Superior Sadar Nizamat Adalat) —

ఈ జిల్లా సాదరుకోర్టులను హేస్టింగ్సుగారు స్థాపించిరి. సివిలుజిల్లా కోర్టులలో కలెక్టరుగా రధ్యక్షుడుగా నుండెడివారు. ఈయనకు దివాను లేక

జిల్లా స్వదేశీ రివెన్యూ ఉద్యోగి సహకారిగ నుండెడివాడు. ఇద్దరు మౌల్వీలు కూడ హాజరయ్యెడివారు. సివిలు తగాయిదాలలో ఈ కోర్టులపై అపీల్లు ప్రెసిడెంటు, ఇరువురు కౌన్సిలర్లును గలిసి విచారించెడివారు. వీరికి ఇతర ఉద్యోగస్థులు కూడ సహకారులుగ నుండెడివారు. (The Diwan of the Khalsa lands, the Head Kanungoes and other Kacheri officers) క్రిమినలు నేరములలో అపీల్లను దరోగా అదాలతు అధ్యక్షుని క్రింద విచారింపబడు చుండెడివి. ఈయనకు ముఖ్యఖాజీయు, ముఖ్యముఫ్తీయును సహకారులుగ నుండెడివారు. ముఫ్తీ న్యాయశాస్త్ర నిర్ణయము చేయుచుండెడివారు. ఖాజీలును, మౌల్వీలునుగూడ న్యాయశాస్త్రము నెరింగినవారే. వీరు ముఫ్తీ వత్వా నంగీకరించని ఎడల ఆపత్వాపై అపీలు చేయబడుచుండెడిది.1

ఈ కోర్టులకును సుప్రీము కోర్టునకును గల సంబంధమేమి? ఇది రిగ్యులేటింగు అక్టునందు విశదీకరింబడి యుండలేదు.

మరియు కంపెనీవారి రాజ్యపరిపాలనము సక్రమముగ జరుగుటకై ఆర్డినెన్సులను ఇతర నియమములను నిబంధనలనుకూడ గావించుటకై కౌన్సిలు యుతుండైన గవర్నరు జనరలుగారి కధికార మొసంగబడినది.

ఈవిధముగ వ్రాయబడిన వాటినన్నింటిని సుప్రీముకోర్టుకూడ ఆమోదించవలసియున్నది. సుప్రీముకోర్టు ఆమోదించినపుడే అవి వెంటనే ఆచరణకు వచ్చునట్లు నిర్ణయము. అయినను రెండు సంవత్సరముల కాలపరిమితిలో వాటిని రద్దుచేయుటకు కౌన్సిలు యుతుడగు చక్రవర్తి గారికి అధికార మొసంగబడినది.

ఈసుప్రీముకోర్టు ఏ న్యాయశాస్త్రము ననుసరించి న్యాయనిర్ణయము గావింపవలయును? కౌన్సిలుయుతుడగు గవర్నరు జనరలుగారి యధికారములకును సుప్రీముకోర్టుయొక్క అధికారములకును గల హద్దులేవి? ఇతర సివిలు క్రిమినలు కోర్టులకును సుప్రీము కోర్టునకును గల సంబంధమేమి? ఈవిషయములను గురించి రిగ్యులేటింగు శాసనమందు విశదీకరింపబడలేదు.

1. Huber p. p. 425—8.

ఈశాసనము జనాలు లోనభూయిష్ఠముగ నున్నను కొంతనుండి పార్లమెంటు సభ్యులు కంపెనీవారి యాస్తిపైనను అధికారముల పైనను పార్లమెంటు దాడివెడలినట్లుగా భావించిరి.

"ఈశాసనము జాతీయ హక్కులపైనను జాతీయ విశ్వాసము పైనను జాతీయన్యాయము పైనను దాడి వెడలుచున్నది." అని బ్రూకుగారు పార్లమెంటులో నుడివిరి. (An in pingement of national right, National faith and National Justice.)1

## 13 వారనుహేస్టింగ్సు - గవర్నరుజనరలు పరిపాలనము.

వారను హేస్టింగ్సు మొట్టమొదట నుండియు తనకౌన్సిలు సభ్యులతో పోరాటములకు డీకొని యుండెను. ఈయనకు కౌన్సిలు తీర్మానములను రద్దు చేయుటకు వలయు నధికారములేదు. సభ్యులఓట్లు సమాన మయినపుడు మాత్రమే తుదినిర్ణయమునకై అధికవుఓటును వినియోగించగలిగిన యధికార ముండెను. రాష్ట్రములయందలి గవర్నరులకుకూడ నిట్టి యధికారమే గలదు. ఈ యాచారము ననుసరించియే గవర్నరు జనరలుగారి యధికారములు గూడ నిర్ణయింపబడినవి. కాని "ఇతర అధినివేశ రాజ్యములలో సలహా నొసగు నధికారము మాత్రమే కౌన్సిలు సభ్యుల కొసంగబడి యుండెను. అవసరమైతే సభ్యులను తొలగించుటకు గూడ గవర్నరున కధికార మొసంగ బడినది. వీరి నియామకములను, సిఫారసుచేయు నధికారము కూడ గవర్నరులకే యుండెడిది.' 2 హేస్టింగ్సుగారి కౌన్సిలు సభ్యులగు క్లవరింగు, మాన్సను, ఫ్రాన్సిసులు ముగ్గురును హిందూదేశము వచ్చెడినాటికి కంపెనీ ప్రభుత్వ మవినీతిపాలై యున్నది. కంపెనీసిబ్బందీ యంతయు, ప్రజలను దోచుకొని తినెడి పరిస్థితులలో నున్నది. మరియు ఫ్రాన్సిను హేస్టింగ్సుగారిని కూలద్రోసి తాను గవర్నరు జనరలు పద

1. See Leky in Ch. 12. For learned and Discriminating defence of the Act refer to Tirminger Ch. 13.

2. See Keith constitutional History of First British Empire p. p. 191.

విని సంపాదించవలెనను దురూహ గలిగి యున్నవాడని కొందరు ఆంగ్లేయ చరిత్రకారులవాదము.1 ఫ్రాన్సిసు భారతదేశ శ్రేయోభిలాషియనియు, భారత దేశాభివృద్ధికై పాటుపడిన వాడనియు, అవినీతిని సహింపలేక పోయిన వాడనియు భారతీయ చరిత్రకారుల యభిప్రాయము.2 తన కౌన్సిలరు లందరిలోను బార్వెలుగారొక్కడే హేస్టింగ్సు యొక్క అంతరంగికుడు. ఈయన ఏశాసనములతోటి గాని, తనవిధులతోటి గాని, సంబంధము లేనివాడు. తన యిష్టము వచ్చినట్లు ప్రవర్తించి అపారధనమును సంపాదింప గలిగినవాడు. మాన్సను 1776 సెప్టెంబరు 25 వ తేదీని చనిపోవువరకును తన కౌన్సిలులో హేస్టింగ్సున కేమియు పలుకుబడిలేదు. కౌన్సిలు హేస్టింగ్సునకు వ్యతిరేకాభిప్రాయమును గలిగియుండెడిది. ఈ వ్యతిరేకాభిప్రాయమునకు ఫ్రాన్సిసు ముఖ్యకారకుడు.

1
నందకుమారునికి
ఉరిశిక్ష.

వంగదేశమున దివానుగిరీ సంపాదింపబడిన పిమ్మట నవాబునకు మారుగ కంపెనీ వారి కీలుబొమ్మలే రాజ్యపాలనమును చేయుదొడగిరి. ఈ విధముగ మూర్షిదాబాదునందు మహమ్మదు రజాఖానును, పాట్నాయందు రాజా సితాబురాయియు ప్రభుత్వమును నిర్వహించుచుండిరి. భారతీయ ప్రతినిధులచే రాజ్యనిర్వహణము జరుగుట తుదముట్టింపవలెనను దురుద్దేశముతో వీరిరువురను హేస్టింగ్సు అరెస్టు చేయించి కలకత్తాకు విచారణకై గొంపోయెను. వీరిరువురును ఒక సంవత్సరము విచారణ జరిగినపిమ్మట విడుదలగాబడిరి. ఇందులకు వారనుహేస్టింగ్సు కొన్ని లక్షల రూపాయిలను తీసికొని యుండెనని నందకుమారు వాదము. ఈ రజాఖానును అరెస్టుచేసి విచారణ చేయుటలో నందకుమారుని హేస్టింగ్సు వినియోగించుకొని యుండెను. ఈతనికి రజాఖాను స్థానమున మంత్రిపదవిని హేస్టింగ్సు ఆశపెట్టియుండెను. చిట్టచివరకీయాశ నిరాశయైనది. పనిగడిచినపిమ్మట నందకుమారుడు విసర్జింపబడినాడు. ఒకపన్నాగమువల్ల హేస్టిం

1. See Keith P. 76.
2. See B. D. Basu R. C. P. in India.
3. See Warren Hasting's letter to the Court of directors quoted by B. D. Basu P. 199 R. C. P.

గ్సునకు మూడుపనులు నెరవేరినవి. రజాఖానునకు వంగదేశపు నవాబు పదవి లభించియుండలేదు. నందకుమారుడు ఆశాభంగము నొందినాడు. వంగదేశము నందలి ద్వంద్వ ప్రభుత్వ విధానము రూపుమాపివేయబడి, వంగదేశమున కంపెనీ ప్రభుత్వము ప్రత్యక్షముగ స్థాపింప బడినది. ఈ కుట్ర నందకుమారుడు సహింప జాలక ఫ్రాన్సిసు గారికి లిఖిత పూర్వకముగ తెలియపరచెను. ఈ లేఖయందు గవర్నరుజనరలు లంచగొండివాడని వ్రాయుటయేకాక అందుల కుదాహరణముగ మీర్జాఫర్ భార్యయగు మనీబేగము వ్రాసిన లంచపు టుత్తరమును గూడ అందులో జతపరచి యుండెను.[1] ఈ లేఖలోనే 10 లక్షలు హేస్టింగ్సునకును, రెండులక్షలుతనకును లంచ మొసగెదరని రజాఖాను చెప్పినటుల నందకుమారుడు వ్రాసియుండెను. ఈ లేఖ నాధారముగగొని ఫ్రాన్సిసుగారు గవర్నరుజనరలొనరించిన యీఅకృత్యమునకై హేస్టింగ్సు పరిపాలనమును నిరోధింపసాగెను. ఈ నేరమును హేస్టింగ్సు కాదని రుజువుపరచుకొన దలపెట్టియుండలేదు. నందకుమారునిపై తన యధికారమును ప్రయోగించి, నందకుమారుడు 1770 లో ఫోర్జరీ చేసెనను నేరమును బనాయించి 1774 లో స్థాపింపబడిన సుప్రీముకోర్టువారిచే విచారణ చేయించెను. ఈకోర్టునకు హేస్టింగ్సునకు సహాధ్యాయుడగు సర్, ఎలిజా ఇంపీగారు ప్రధాన న్యాయమూర్తి. ఈ జడ్జీచేత నందకుమారు విచారింపబడి ఉరిశిక్ష వేయబడి 1775 ఆగష్టు 5 వ తేదీని ఉరితీయబడినాడు.

"ఈవిషయమున హేస్టింగ్సు ప్రవర్తనమును కప్పిపుచ్చుటకై చేయు ప్రయత్నములు జాత్యభిమానములతో కూడికొన్నవి. నందకుమారుడు సెషన్సు కోర్టునకు విచారింపబడుటకై పంపబడిన తరువాత 12 రోజులకే (మే 18 వ తేదీని) తన విరోధి మరణమును గురించి హేస్టింగ్సు ముందుగనే చెప్పియుండెను. ఇట్లు చెప్పునరికి కేసు విచారింపబడి యుండలేదు. జూను నెలయందు మాత్రమే విచారింపబడినది. ఇట్లు విచారింపబడిన కోర్టునకు నందకుమారుని విచారించుటకు క్రిమినలు అధికారము లేనేలేదు. తమ కధికారము లేదని జడ్జీ లీ కేసును విచారింప నిరాకరించి యుండినయెడల తమ విధిని నిర్వ

1. See For an account of Mani Begam, Bragenthranatha Benerji's paper on "The Mother of the Company" published in Bengal past and present for 1926.

ర్తించి యుండెడివారు. ఆంగ్లేయ జ్యూరీలగు 12 గురును కూడ, సాక్ష్యము ననుసరించి నేరమును నిరూపించరని తలంచి, సాక్షులను భయపెట్టి జడ్జీలే శిక్షించుటకు తగినరీతిని సాక్ష్యముచెప్పునట్లొనరింపసాగిరి. 1728 వ సంవత్సరపు ఫోర్జరీ నేరముల ఆంగ్లేయ శాసనము హిందూదేశమునందమలులోగూడలేదు. 1661 సంవత్సరపు అధికార పత్రమునందుగల తాత్కాలికాధికారములు గాక, 1726 సంవత్సరపు అధికార పత్రముల ననుసరించియే ఇంగ్లీషు 'లా' హిందూదేశమున ప్రవేశపెట్ట బడినది. 1753 సంవత్సరపు అధికార పత్రమును, 1773 సంవత్సరపు శాసనమును ఇంగ్లీషు 'లా' తిరిగి ప్రవేశపెట్ట బడినట్లుగా యింపేగారు తలంచి నట్లుగ తలంపబడుటకు సావకాశములేదు. ఏది ఎట్లున్నను ఇంగ్లీషు 'లా' నందకుమారు కేసునకు వర్తింపజేయుట న్యాయాధికారమును దుర్వినియోగ పరచుటయే యనుట నిశ్చయము.1 నందకుమారునకు పిమ్మట మరి ఎవరును యీ 'లా' ననుసరించి ఉరితీయబడలేదు. 1802 లో ప్రధాన న్యాయమూర్తి యీ శాసనము ననుసరించి ఉరిశిక్షలేదని యంగీకరించి యుండెను.2 నందకుమారునికి విధింపబడిన ఉరిశిక్షను గవర్నరుజనరలు కోర్టయినను రద్దుచేసియుండవలసినది. కాని, హేస్టింగ్సు యొక్క ప్రయివేటు సెక్రటరీగా రట్లు జరుగకుండ ప్రతిఘటించి యుండిరి. గవర్నరు జనరలు, కౌన్సిలు సభ్యులు నిర్వీర్యులైరి.

"ఇందులకు ఆంగ్లేయ గవర్నరుజనరలు కారకుడైనను, కాకపోయినను ఇంతటి ఘోర నేరము నెన్నడును ఆంగ్లేయకోర్టు గావించి యుండలేదు"3

ఇంతతో హేస్టింగ్సు తాను సర్వాధికారినని భారతీయులు భయభ్రాంతులగునట్లు ప్రదర్శింప గలిగినాడు. ఈయన కౌన్సిలు సభ్యులీ విషయమై గావించిన నేరారోపణములు ప్రజలదృష్టినుండి మరుగుపడి పోవునట్లుగ తన కౌన్సిలు సభలనే హేస్టింగ్సు సమావేశ పరుప నిరాకరించెను. గవర్నరు జనరలుతో నిమిత్తము లేకుండగ కౌన్సిలరులు అధికారము చెలాయింప నశక్తులనైరి. ఈవిధముగ రెండు సంవత్సరములు జరిగినవి.

---

1. See. Keith P. 77.
2. See. Thompson and garratt, British rule in India P. P. 137-9.
3. See. Keith P. 77.

గవర్నరు జనరలు కౌన్సిలుసభ్యుడగు మాన్సను చనిపోయెను. హేస్టింగ్సు తన అత్యధిక ఓటుతో కౌన్సిలు నిర్ణయములందు అధిక సంఖ్యాకముగు ఓట్లను సంపాదింపగలిగిన వాడయినాడు. కాని 1777 జూనులో క్లావరింగు హేస్టింగ్సును తిరస్కరించి యెదుర్కొన గలిగెను. 1777 లో హేస్టింగ్సు ఇంగ్లండులోనున్న తన ఏజంటుద్వారా గవర్నరు జనరలు పదవికి రాజీనామా నొసగియు, డైరక్టరులామోదించిన పిమ్మట, మరి రెండుమాసములకు హేస్టింగ్సు తాను రాజీనామా నొసగలేదనెను. 1775 లోనే సీమ ప్రభుత్వము హేస్టింగ్సును వెనుకకు మరలించుటకై ప్రయత్నించినది. సీమ ప్రధానియగు నార్టుగారీయన ప్రవర్తనముతో నేకీభవించి యుండలేదు. హేస్టింగ్సు కార్యనిర్వాహకవర్గ సభ్యులు, అధిక సంఖ్యాకులు వ్యతిరేకముగ నుండిరి. ఈ కారణములచే మొట్టమొదట రాజీనామానిచ్చియు, మాన్సనుగారు మరి రెండుమాసములలో చనిపోవుటవల్ల తిరిగి రాజీనామా నొసగలేదనుటకు కారణము. ఈపరిస్థితులలో హేస్టింగ్సు గవర్నరు జనరలు పదవి రద్దయినదని క్లవరింగుగా రాస్థానము నాక్రమింప ప్రయత్నించిరి. ఈ విషయము సుప్రీముకోర్టునకు విచారణకు పంపబడినది. సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తియగు, (నందకుమారునికి ఉరిశిక్ష వేసిన) ఇంపీగారే యీతగవును గూడ విచారించి హేస్టింగ్సున కనుకూలముగ తీర్పును జెప్పియుండిరి. ఈ విధముగ హేస్టింగ్సు, న్యాయమూర్తియగు ఇంపీకి చాల కృతజ్ఞుడై యుండవలసిన వాడాయెను. ఆగస్టు 30 వ తేదీని క్లవరింగుగూడ చనిపోయెను. ఇంతతో హేస్టింగ్సునకు తన కార్యనిర్వాహక వర్గమునం దధిక సంఖ్య లభించినది. నూతనముగ కౌన్సిలరుగ నియమింపబడిన, వీలరు, హేస్టింగ్సున కనుకూలముగ వర్తించుచుండుటయే హేస్టింగ్సున కధికసంఖ్య లభించుటకు హేతువు. క్లావరింగు స్థానమున ప్రధాన సైన్యాధ్యక్షుడుగ నియమింపబడిన కూటుగారు (Sir Egre Coote) గూడ హేస్టింగ్సుయొక్క అనుచరుడాయెను. వీలరుగారి దంతయు రొక్కపుబేరమే. ఈయన కరువు బేరములేదు. చయిటుసింగు, అయోధ్య బీగములయెడ హేస్టింగ్సు ప్రదర్శించిన అవమానకరమును, ద్రోహకరమును నగు వర్తనమునందు వీలరుగారికి కూడ వాటాగలదు. 1780 నవంబరులో ఫ్రాన్సిసుగారుగూడ హేస్టింగ్సు యొక్క దుర్భర ఘోరకృత్యముల బాధను సహింపలేక, హేస్టింగ్సు నాటకము

నుండి అంతర్ధానము కావలసి వచ్చినది. ఇందులకు హేస్టింగ్సే కారకుడు. 1779 లో బార్వెలుగారు సీమకు వెళ్ళిరి. 1781 సెప్టెంబరు నందునను, 1782 నవంబరు నందునను మెకెఫెరసన్, స్టాబిల్సు గార లిరువురును కౌన్సిలరులుగ నియమింపబడిరి. వీరిరువురకును గూడ హేస్టింగ్సుతో వివాదము సంభవించినది. వీరి ప్రతిఘటనము వక్రమ్మైనది. "హేస్టింగ్సు దురహంకారి యనియు, ఓర్పు లేనివాడనియు, స్వార్థపరుడనియు విస్పష్టమైనది."1 ఈవిధముగ గవర్నరు జనరలును, ఆయనకార్యనిర్వాహకవర్గమును పరస్పరకలహములతో నుండుటవల్ల ఇతరరాష్ట్రములపై గవర్నరుజనరలు తనయధికారమును చెలాయింపజాలకపోయి నాడు. ఈకాలమునందే మదరాసు రాష్ట్రమునందు గమనింపదగిన పరిస్థితు లుదయించినవి.

**2 మదరాసు రాష్ట్ర పరిస్థితులు.** మదరాసు రాష్ట్రప్రభుత్వములు కర్నాటక నవాబుతో మైత్రితో వర్తించుచుండెడివి. ఈనవాబుయొక్క అధికారమును ఫ్రాన్సుదేశముగూడ 1763 సంవత్సరపు ఒడంబడికననుసరించి గుర్తించినది. 1765 లో క్లైవు ఢిల్లీ సుల్తానునుండి ఉత్తరసర్కారులను తీసికొనుటకును, దక్కను నవాబు అధికారమునకు లోబడకుండనుండుటకును ఫర్మానాలను తీసికొనినపుడు కర్నాటక నవాబును మరచియుండలేదు. ఫ్రెంచివారిని వెడలగొట్టినపిమ్మట ఉత్తరసర్కారులు నైజామునకు సంక్రమించినవి. నైజామునకు సంబంధములేకుండ చక్రవర్తినుండి ఫర్మానాను పొంది కంపెనీవారు లాగికొనిరి. ఇందువల్ల నైజాముతో పోరాటము సంభవించినది. 1766 లో నైజాముతో కాలాండు Cailland గారొడంబడికను గావించుకొనిరి. ఈయొడంబడిక ననుసరించి ఉత్తర సర్కారులను కంపెనీవారనుభవించుటకును, అందులకు మారుగ సాలుసరి 9 లక్షలను నైజామున కొసగుటకును, లేక, అవసరమైన సైనిక సహాయమును నైజాము కోరునపుడు చేయుటకును నిర్ణయించుకొనబడినది. నైజాముకూడ కంపెనీకి సహకారిగ నుండుట కంగీకరించెను. ఈయొడంబడిక హైదరాలీకి వ్యతిరేకముగ గావించుకొనిన పరస్పర సహాయవిధాన మనదగును. హైదరాలీ మైసూరు

1. See. Keith P. 78.

రాజ్యాధికారము నాక్రమించుకొని యుండెను. హైదరుతో బొంబాయికంపెనీ ప్రభుత్వము ఒడంబడిక గావించుకొనుటకై నిర్ణయించుకొని యుండెను. కాని, హైదరాలీతో కంపెనీ యుద్ధము చేసినది. 1767 లో నైజాము, ఒడంబడిక ననుసరించి కంపెనీకి సహాయ మొనరించలేదు. కాని, మరునాటియేడే కంపెనీతో మరియొక యొడంబడికను గావించుకొనవలసిన వాడాయెను. ఈఒడంబడిక ననుసరించి కంపెనీవారి సైనికసహాయము తగ్గించుట కంగీకరింపబడినది. ఈయుద్ధమున హైదరాలీ విజయము గాంచెను. దానిఫలితముగ హైదరాలీతో కంపెనీ ఒడంబడికను గావించుకొన వలసివచ్చినది. ఈపరిస్థితులు కంపెనీవారి కోరికపై ఫ్రెంచివారి నెదుర్కొనుటకై సీమప్రభుత్వముచే నొక సైనికదళమును విండ్సేగారి ఆధిపత్యమున పంపుటయును, ఈయనకు హిందూదేశప్రభువులతో నొడంబడికలను గావించుకొనుట కధికార మొసంగ బడుటయును మరింత విషమ స్థితిని దాల్చినవి. అంతకు ముందువలెనే, యీయనయు, మదరాసు రాష్ట్రి ప్రభుత్వపు కౌన్సిలువారును, హైదరాలీకిని కలతలు పెట్టుటకు ప్రయత్నించి విఫలుడాయెను. మహారాష్ట్రులు 1770 – 1 లో హైదరాలీతో గావించిన యుద్ధమున మహారాష్ట్రులకు తోడ్పడవలెనని 'విండ్సే' గారి సంకల్పము. కాని, విండ్సే, పాల్ బెన్‌ఫీల్డు (Paul Bunfield) గారినాయకత్వమున తంజావూరును జయించుటకు 1773 లో నవాబునకు తోడ్పడియుండెను. ఇందులకు డబ్బు వలుకుబడియే కారణము. ఈరాజనీతికిని కంపెనీ యంగీకరించి యుండలేదు. లార్డుపిగట్టుగారు మదరాసు గవర్నరుగ పంపబడిరి. ఈయన, పై రాజనీతిని మార్పుచేయ ప్రయత్నించెను. కాని, కౌన్సిలుసభ్యులందరును బెనుఫీల్డుగారి నాయకత్వమున గవర్నరుపై తిరుగబడిరి. పిగెట్టుగారు ముఖ్యమగు కౌన్సిలరు లను బర్తరఫు చేయసాహసించెను. దీనివలన తిరుగుబాటు సంభవించినది. 1776 ఆగష్టులో పిగెటుగారు అరెస్టుచేయబడి, సైనిక నిబంధనలకు లోబడబడి నిర్బంధింపబడిరి. ఆమరుసటి సంవత్సరమే నిర్బంధమున చనిపోయిరి. దోషులగు, కౌన్సిలరులుగూడ సీమకు పిలువనంపబడి, నేరారోపణచేయబడి విచారింపబడిరి. షా 1000 ల జరిమానాతో మాత్రమే కౌన్సిలరులు తీవ్రశిక్షను తప్పించుకొన గలిగిరి. బెనుఫీల్డుగారు మాత్రము 1781 లో తిరిగి హిందూదేశమునకు రాగలిగిరి.

ఇందుల కీయన సీమయందొసంగిన లంచములే కారణము.1 ఈవిధముగ, మదరాసు ప్రభుత్వముపై దెబ్బ పలుకుబడి నృత్యము చేయసాగినది. నవాబు పరిపాలనము సంస్కరించుటకుమారుగ నవాబునుండి లంచములను తీసికొని, నవాబునకు మదరాసుకౌన్సిలు మద్దతుచేయసాగినది. ఇందులకు, బెన్ఫీల్డుగారే ముఖ్యకారకులు. నవాబు కంపెనికొసగవలసిన అప్పులనుకూడ తీర్చివేయ నారంభించెను. ఈవిధముగ నవాబు రాష్ట్రప్రభుత్వపు కౌన్సిలరులను, పార్లమెంటుసభ్యులను, కంపెనీడైరెక్టరులనుగూడ లంచములనొసగి తనకు మద్దతుదారులుగ నొనరించుకొనెను. ఇందువల్ల కంపెనీవారుగాని, సీమప్రభుత్వముగాని, లంచగొండితనముతో తలవంపులుగనున్న ఆంగ్లేయరాజకీయ ప్రజాహిత జీవితమును తుదముట్టింప ప్రయత్నించియుండలేదు.2

ఈదుష్టపరిపాలనకు 1779 లో గవర్నరుగావచ్చిన రంబోల్డుగారు మరింత దోడ్పడియుండిరి. (Rumbold). నైజామునకు రు 9 లక్షల నొసగుపద్ధతిని, సర్కారులను కంపెనీ తీసికొనియున్నది. గుంటూరు నైజాముయొక్క సోదరుని కొసగబడినది. ఇందులకుమారుగ నతడు రు 7 లక్షలునే నైజామున కొసగుచుండెను. నైజాముసోదరునుండియే గుంటూరునుకూడ తీసికొనుటచే, నైజామునకు కోపమువచ్చినది. ఇందులకుతోడుగ ఉత్తరసర్కారులకు కట్టవలసినకప్పము నడుపుటకు అధికారముగూడ నైజామునకు లేదని రంబోల్డుగారు నుడివిరి. ఈ పరిస్థితులలో హేస్టింగ్సుగారు జోక్యమును కలిగించుకొనిరి. హాలెండుగారిని నైజాము రాజ్యమున తన రెసిడెంటుగా నియమించెను. మదరాసు ప్రతినిధిని మదరాసు ప్రభుత్వ ముద్యోగమునుండి తీసివేసినది. ఈతడు బెంగాలు ప్రభుత్వమునకు విధేయత జూపుటయే యిందులకు కారణము.3

రంబోల్డుగారు కప్పము కట్టని రాకరించుటతప్పని హేస్టింగ్సుగారు తలంచిరి. గుంటూరును తిరిగి బలవంతముగ నైజామున కిప్పించివేసెను. కాని, 1769 లో నైజామునకును, కంపెనీకిని జరిగిన యొడంబడిక పునరుద్ధరింపబడదని హైదరు

1. See Keith P. 79.
2. Keith p. 79.
3. See. Dasgupta. A. P. The central Authority in British India p.p. 81.

విశ్వసించి 1780 లో యుద్ధముప్రారంభించువరకును గుంటూరు తిరిగియిచ్చివేయబడలేదు. ఈపరిస్థితు లుదయించుటకుముందే రంబోల్డు సీమకు వెడలిపోయెను. ఈయన స్థానమున వైటుహిల్లు (White Hill) నియమింపబడెను. ఆనాడు మద్రాసు సైన్యాధిపతి. వీరిరువురునుగలిసి హేస్టింగ్సుగారి కనుకూలముగ వ్యవహరించియుండలేదు. హేస్టింగ్సు ఆరువందల ఆంగ్లేయ సైనికులతోను, రు 15 లక్షలతోను, కూటీని పంపియుండెను. గుంటూరునొసగ తిరస్కరించినందులకై వైటుహిల్లును ఉద్యోగమునుండి తీసివేసెను. ఇంతవరకును హేస్టింగ్సు తనకంటె తక్కువ వారితోనే వ్యవహరించుట కలవాటుపడియుండెను.

1780 సంవత్సరాంతమున లార్డుమెకార్టనేగారు గవర్నరుగా నియమింపబడిరి. ఈయన హేస్టింగ్సుతో చేతులుజోడింప నిరాకరింపసాగెను. తనయభిప్రాయముల ననుసరించియే వ్యవహరించెను. హేస్టింగ్సు డచ్చివారితో ఒడంబడికచేసికొనవలెనని తలంచెను. కాని, యిందులకు మెకార్టనేగారు అంగీకరించియుండలేదు. కంపెనీనుండి, డచ్చివారికోటలను ముట్టడించవలెనను ఆజ్ఞలు వచ్చినవి. ఆనాడు హాలెండు, యుద్ధమునందున్నది. ఈకారణములచే స్వాభిప్రాయముననుసరించి ఉత్తరసర్కారులను నైజామునకు హేస్టింగ్సు అభీష్టితము ననుసరించి తిరిగి యిచ్చివేయలేదు. కూటీ మెకార్టనీతో సంప్రదించకుండగనే యుద్ధమునకు దిగెను. మెకార్టనీ యీపరిస్థితుల సహించుకొనజాలక పోయినాడు. నవాబురాజ్యమందలి రివిన్యూరాబడిని 5 సంవత్సరములు కంపెనీ రాబట్టుటకును, అందు ఆరుదవవంతు నవాబున కిచ్చుచుండుటకును, నవాబుతో మెకార్టనీ ఒడంబడిక గావించెను. ఇందువల్ల కంపెనీకి విశేషరాబడి వచ్చినది. కాని, యీ యేర్పాటు హేస్టింగ్సునకు నయించలేదు. ఈఒడంబడికను రద్దుచేసి, మెకార్టనీని బర్తరఫుజేయుటకుగాను కూటీకధికారమొసగి 1783 లో మరొకసారి కూటీని మదరాసునకు బంపియుండెను. కాని, యీయనచిత్తవృత్తిని కౌన్సిలరులు మరలించిరి. లేనియెడల మదరాసుప్రభుత్వము హేస్టింగ్సుతో డీకొనుటకు సర్వసిద్ధముగ నుండినది. మెకార్టనీ హైదరాలీతో మరియొక యొడంబడిక గావించియుండెను. ఈఒడంబడికననుసరించి పరస్పరము యుద్ధములను మానుకొనుటకును, యుద్ధమునందు పట్టుకొనబడిన ఖయిదీలను విడిచివేయుటకును

నిర్ణయింపబడినది. ఈయొడంబడికయు హేస్టింగ్సునకు సమ్మతముగాలేదు. ఈయొడంబడికను గావించిన మెకార్టనీని యుద్యోగమునుండి భర్తరఫుచేయవలెనని మరల ప్రయత్నించియుండెను. కాని, సాగలేదు. అయినను "మెకార్టనీకంటెను విశేషముగ లంచగొండితనమున కలవాటుపడిన కంపెనీ 1785 లో నీయొడంబడికను రద్దుచేసినది. దీనిఫలితముగ మెకార్టనీ గవర్నరుపదవికి రాజీనామా యొసగి వెడలిపోవలసివచ్చినది.

మెకార్టనీ మరియొక రాజ్యాంగసమస్యను లేవతీసెను. కూటీకి (Coote) పిమ్మట, ఆయనస్థానమున కంపెనీవారి సేనలను, ప్రభుత్వసేనలనుకలిపి సేనానాయకత్వము వహింప పంపబడిన స్టూఆర్టు (Stuart) పిగటునకు వ్యతిరేకముగ కుట్రమునబన్నెను. మెకార్టినీ యీయనను అరెస్టుచేసి సీమకు పంపివేసి యీయన స్థానమున లెఫ్టినెంటు జనరలుహాలాండుతో నొక కంపెనీనౌకరును నియమించెను. మెకార్టినీగావించిన యీచర్యను సర్ జోన్ బర్గోయిన్‌గారు ధిక్కరించిరి. ఈయన మెకార్టినీగారిచే అరెస్టుగావింపబడినాడు. సీమప్రభుత్వము సైన్యాధికారమొసగుచుండినను, అంతకునుంచియు కంఫెనీనౌకరులు సైన్యమునందుద్యోగులుగ నియమింపబడినపుడు వారు కంపెనీవారిచే నుద్యోగమునుండి తీసివేయబడువరకును మాత్రమే వారియధికారములను గలిగియుందురని నిర్ణయింపబడి యీసమస్య పరిష్కరింపబడినది. ఈవ్యవహారమున కేంద్రప్రభుత్వము జోక్యముకలిగించుకొనజాలకపోయినది.1

3 బొంబాయి ప్రభుత్వము.

హేస్టింగ్సుగారు బొంబాయిప్రభుత్వముపై అప్రతిహతమగు నధికారమును చెలాయించిరి. బొంబాయిప్రభుత్వము సలసతీ — బేసినులను (Salsette and Bassein) ఆక్రమించుకొనవలెనని చిరకాలమునుండి వాటిపై కన్నువేసి యుండెను. పీష్వాపదవికై సంభవింపజేసిన పోరాటముల తరుణమును జారవిడువక 1774 సంవత్సరాంతమున సలసతీ ముట్టడింపబడినది. బాలుడగు, పీష్వా మేనమామయగు రఘునాథరావుతో నొడంబడిక గావించుకొనబడినది.

1. Dasgupta p. p. 250.

ఇందులకు హేస్టింగ్సు మద్దతుగలదా. కాని, వంగదేశప్రభుత్వము, అనగా హేస్టింగ్సుకౌన్సిలు, హేస్టింగ్సుచర్యను ఖండించి బొంబాయిప్రభుత్వచర్యను అభిశంసన మొనరించినది. ఈచర్య రెగ్యులేటింగు శాసనమునకు వ్యతిరేకముగ నుండుటయును, అన్యాయము అగుటయును సింధులకు కారణములు. నూతన యొడంబడికను గావించుటకై ఆప్టను పంపబడినాడు. 1776 వ మార్చి 1 వ తేదీని పురంధరులో నూతనయొడంబడిక గావించుకొనబడినది కాని, యీ యొడంబడికను కంపెనీ త్రోసిరాజనినది. మహారాష్ట్రు లీయొడంబడిక షరతులను పాటింపలేదని అక్రమ నేరారోపణ చేయబడినది. దీనిఫలితముగ ప్రథమ మహారాష్ట్ర యుద్ధముసంభవించినది. బొంబాయిప్రభుత్వము అక్రమముగను, అవివేకముగను, యుద్ధము ప్రకటించినది. కంపెనీ ప్రభుత్వము పరాజయము గాంచినది. 1779 లో సైన్యాధిపతి వడగాములో (Wadgon) మహారాష్ట్రులతో నొకసంధి జేసికొనెను. ఈసంధిని బొంబాయి గవర్నరును, గవర్నరు జనరలునుగూడ నిరాకరించిరి. 1780 లో హేస్టింగ్సుయొక్క ప్రయత్నములవల్ల బేసిను ముట్టడింపబడినది. గోడార్డు కారకుడు. (Goddard) పోపహాము గ్వాలియరును ముట్టడించెను. సింధియాను మధ్యవర్తిగా పనిజేయు నట్లుగ నేర్పరచెను. ఆనాడీయన పీష్వాలప్రభుత్వమునుండి విడిపోవ ప్రయత్నించుచున్నాడు. 1782 మే 17 వ తేదీనిసాలభాయిలో ఒడంబడికపత్రము సంతకములు చేయబడినవి. "ఈయొడంబడికయే భారతదేశమునందలి ఆంగ్లేయ ప్రభుత్వమునకు హేస్టింగ్సుగావింపగలిగిన యుపకారము. ఈయొడంబడిక ననుసరించి మహారాష్ట్రులతో ఆంగ్లేయప్రభుత్వము 25 సంవత్సరములు ప్రశాంతముగ కాలక్షేపముజేసినది. కంపెనీ ప్రభుత్వమే భారతరాజకీయముల యందు ప్రాముఖ్యస్థాన మంతటినుంచియు వహింపగలిగినది.[1] ఈయొడంబడిక ననుసరించి 1776 నుండియు జయింపబడినరాజ్యభాగము లన్నియు తిరిగి యిచ్చివేయవలసివచ్చినది. సైకువారుతో మైత్రి దృఢతర మొనరింపబడినది సైకు వారునకు ఆయనరాజ్యభాగములన్నియు నొసగివేయుటయే కర్తవ్యమైనది. హైదరాలీ తానుజయించిన రాజ్యభాగములను కంపెనీకిని, కర్నాటకనవాబు నకును యిచ్చివేయ నిర్ణయము. పీష్వాయొక్కయు, కంపెనీయొక్కయు మిత్ర

1. See Keith p. 82.

మండలి (Allies) యంతయు ఒండొరులమైత్రితో మెలంగుట కొడంబడిక గావింపబడినది. హైదరు చనిపోవుటకుముందు 1782 డిశంబరు 7 వ తేదీని కంపెనీయొక్క ప్రాముఖ్యస్థానమును హైదరు గుర్తించియుండెను.

అయినను, హైదరునకుసంబంధించిన సంధిషరతునకు ప్రాముఖ్యస్థానము లభించియుండలేదు. టిప్పుజయించుటయే యిందులకుకారణము. మొట్టమొదట పీష్వాలమంత్రియగు నానాఫడ్నవీసీ యొడంబడికకు సమ్మతించియుండకపోయినను, హైదరు చనిపోవుటతోడనే యంగీకరించియుండెను. ఈకాలమునాటి నుండియు సింధియా పీష్వాలపలుకుబడికి లోనుగాక, స్వేచ్ఛావృత్తిగ వ్యవహరింపసాగినాడు. 1794 లో చనిపోవువరకును సింధియా ఉత్తరహిందూస్థాన రాజకీయనాస్య కథలో ముఖ్యపాత్రను ధరించియున్నాడు.

ఈయొడంబడికలో హేస్టింగ్సు కంపెనీప్రయోజనమును గుర్తించినాడని చెప్పదగును. ఇతరవిషయములలో అవివేకముగను, దుర్మార్గముగనుగూడ వర్తించినాడని చెప్పవచ్చును. ఒడంబడికలకు విలువయేమియులేదని హేస్టింగ్సు విస్పష్టముగ ప్రకటించియుండెను. కంపెనీవారితో మైత్రిగావించుకొని, ఒడంబడికలనొనరించుకొనిన వారికిగూడ, ఆ ఒడంబడికల ననుసరించి, ఎట్టిసంరక్షణములేదని హేస్టింగ్సు రుజువుపరచెను. ఇందులకు చైటుసింగుపట్ల హేస్టింగ్సు ప్రయోగించినచర్యయే యుదహరణము 1 చైటుసింగుపై భరింపరాని భారము మోపబడినది. ఆయనరాజ్యము కంపెనీవారిప్రతినిధిచే పరిపాలింపబడినది. (Resident) ఈయన జీతముమాత్రమేకాక సాలుసరి, రూ 40,000 లు తీసికొనెడివాడు. పరిపాలనమంతయు నపభ్రంశమొనరింపబడినది. చైటుసింగు నశించిపోయినాడు. ఇదియంతయు 1775 లో చైటుసింగుతో గావించుకొనిన ఒడంబడికకు వ్యతిరేకము. 1775 ఒడంబడికననుసరించి కొంతకప్పము నిర్ణయింపబడినది. ప్రభుత్వమునకు పన్నులను విధించుటయందుగల నైసర్గికాధికారము ననుసరించి, అవసరము ననుసరించి, చైటుసింగుపై అధికభారము విధింపబడుట న్యాయమేయని హేస్టింగ్సు మతస్థులవాదము. ఈయధికారము నంగీకరించినను, దీనిననుసరించియే కప్పము నిర్ణయింపబడియుండుటచే నూతనభారమును విధించుట

1. See Thompson and Garrat, British rule in India. p. p. 159-62

అధర్మమే. ఇదినిశ్చయము.1 ఈవిధముగనే 1775 లో గావించుకొనబడిన ఒడంబడికకు వ్యతిరేకముగ అయోధ్య రాజ్యముపై విధింపబడిన కరముగూడ దురన్యాయము. అయోధ్యమంత్రులను ఖయిదుచేసి బలవంతముగ తనకోర్కెను నెరవేర్చుకొనుట పరిమితిలేని దురన్యాయము. దీనికంతకు హేస్టింగ్సు చెప్పగలుగు సమాధానమేమి? మహారాష్ట్రియుద్ధమునకు ధనము కావలసివచ్చినదనుటయే హేస్టింగ్సు సమాధానము. మహారాష్ట్రియుద్ధమునకు వలయు ధనమును సేకరించుటతోగూడ హేస్టింగ్సు సంతృప్తుడు కాలేదు. చైతుసింగునుండి పౌ 20,000 లను, అయోధ్యనవాబునుండి పౌ 10,000 లను వ్యక్తిగతముగ తీసికొనియుండెను. ఇది 1773 వ సంవత్సరపు శాసనమునకు వ్యతిరేకము. క్లైవువలెనే హేస్టింగ్సుగూడ డబ్బువిషయమున నీచాతినీచముగ ప్రవర్తించినాడు. ఈవిధముగనే రాంపూరు నవాబు ఫజుల్లాఖానుతోగూడ ఒడంబడికను భగ్నముచేసి హేస్టింగ్సు సిగ్గుమాలిన పని జేసినాడు.2 ఈచర్యను కంపెనీ విమర్శించినది.

1784 వ మార్చిలో అయోధ్యయందలి ప్రభుత్వప్రతినిధిని తీసివేసి (Residency) ఒకవిధమగు ఏజన్సీని అయోధ్యయందు హేస్టింగ్సు నెలకొల్పియుండెను. రెసిడెంటువలెనే ఏజంటుగూడ అయోధ్యవ్యవహారములలో తరచు జోక్యము కలిగించుకొనెడివాడు. ఈఏజన్సీకి వెనుకటికంటె మరి పౌ 48,000లు సాలునకి అదనపుఖర్చు అయినది. ఇందువల్ల నవాబు ప్రభుత్వకోశమంతయు శోషించివేయబడినది. ప్రజలు క్షోభించుచుండిరి.

ఫ్రాన్సిసు కౌన్సిలుసభ్యుడుగ తొలగిపోయిన నాటనుండియు హేస్టింగ్సు ప్రవర్తనము మరింతవిచిత్రముగ మారినది. ఢిల్లీపాదుషాయొక్క అధికారమును దృఢముగ స్థాపింపవలయునని హేస్టింగ్సు సంకల్పము. ఈయభిప్రాయమును ఫ్రాన్సిసుగారే మొట్టమొదట మొలకెత్తించిరి. 1782 లో హేస్టింగ్సు సుహృద్భావ ముద్భవింపజేయ నొకఏజంటును పంపియుండెను. కప్పమును గురించిగాని, అల్హాబాదునుగురించిగాని పునర్విమర్శనకు సావకాశ మొసగవలదని మాత్రము ఏజంటునకు తెలిపియుండెను. 1784 లో సుల్తానుయొక్క జ్యేష్ఠ

1. Keith p. 83.
2. See Keith. p. 83.

పుత్రునితో లక్నోలో మైత్రినిజేసెను. సిక్కులకుభయపడి ఢిల్లీసుల్తానుయొక్క కేంద్రాధికారమును బలవత్తర మొనరించుటయే హేస్టింగ్సుయొక్క రాజనీతి. హేస్టింగ్సు, కౌన్సిలు ఆయనతో నేకీభవించియుండలేదు. 1768లో కంపెనీ యిట్టి రాజనీతి నంగీకరించియుండలేదు. హేస్టింగ్సు తనసంకల్పప్రకారము నాటి ఢిల్లీయందలి కేంద్రప్రభుత్వమును బలవత్తర మొనరించియున్నచో నాటితో హిందూస్థాన రాజన్యులందరు తిరిగి నేకీభవించుటకు సావకాశమేర్పడెడిది. ఈసంఘీభావము కంపెనీనాశనమునకు మూలముగూడ నయ్యెడిది.

## వారనుహేస్టింగ్సు పరిపాలనా విధానము.

(Administration)

4 వంగపరిపాలనము.

వంగదేశ పరిపాలనమునందుగూడ హేస్టింగ్సును, సుప్రీము కోర్టు ప్రధానన్యాయమూర్తియగు ఇంపీగారును మొట్ట మొదటనుండియు నేకీభవించియే పనిచేయసాగిరి. ఇంపీగారి తోడ్పాటుతో సర్వవ్యవహారములను చక్కజేసికొనవచ్చునని హేస్టింగ్సు విశ్వసించెను. నందకుమారు తనపై మోపబడిన నేరములనకలును హేస్టింగ్సు ఇంపీగారికి ముందుగనిచ్చినటుల ఇంపీగారే ఆయనపై పార్లమెంటునేరారోపణ మొనరించుకాలమున తెలిపియుండెను. దీనిననుసరించి హేస్టింగ్సు — ఇంపీ వీరిరువురునుకలిసి ప్రతిపనిజేసియుండిరనుట నిర్వివాదాంశము. కాని, హేస్టింగ్సు గారికౌన్సిలు హేస్టింగ్సునకు వ్యతిరేకముగనుండెను. క్లైవును, డైరక్టరులును నిర్ణయించిననీతినే కౌన్సిలుఅనుసరింప నిశ్చయించుకొనియుండెను. ద్వంద్వపరిపాలనము కొనసాగించుటయే కౌన్సిలుయభీష్టము. ఇందువల్ల సుప్రీముకోర్టునకును, వంగప్రభుత్వమునకును పరస్పరస్పర్థకలిగినది. లేనియెడల హేస్టింగ్సు - ఇంపీ నిరువురేకమై నవాబుయొక్క నామమాత్రపు టధికారముపైగూడ నాడే దాడి వెడలజూచిరి. ఆంగ్లేయాధికారమే సర్వాధికారముగ నొనరింపదలకొనెను. నిర్ణీతమై — సంకుచితముగనున్న సుప్రీముకోర్టు అధికారపరివ్యాప్తి వంగ, అంగ, కళింగముల మూడురాష్ట్రములపైనను వ్యాపింపజేసెడివారు. సాదరుదివానీ కోర్టు తుదికోర్టుగనుండెడిది. (అనగా కౌన్సిలుకోర్టు.) ఈకౌన్సిలరులను, సుప్రీముకోర్టు జడ్జీలనుకలిపి సాదరు అదాలతుకోర్టుపై నధికారులుగ నొనరింప

బూనినాడు. ఇవన్నియు హేస్టింగ్సు తనకౌన్సిలుప్రతిఘటనమువల్ల కొన సాగించుకొనజాలక పోయినాడు.

1773 వ సంవత్సర శాసనమూలముగ కంపెనీవారిసిబ్బందీపై నిర్దుష్టమగు నధికారమును సుప్రీముకోర్టునకు దఖలుపరుప ప్రయత్నింపబడినది. కాని, సుప్రీము కోర్టుయొక్క అధికారపరిమితి సుబోధకముగాలేదు. ప్రభుత్వకార్యనిర్వాహక వర్గములచర్యపై కోర్టులకుగల అధికారమునుగురించి ఇంగ్లీషు 'లా' లో విస్పష్ట ముగ నిరూపింపబడి యుండలేదు. 1774 వ సంవత్సరమునం దీవిషయము నేటికంటెను మరుగుపడియున్నది. కంపెనీవారిసిబ్బందీ తమరివిన్యూవసూళ్ళలో గూడ కోర్టుజోక్యము కలిగించుకొనునేమోయని భయపడుట కవకాశముగలదు. 1774 వ సంవత్సర శాసనమునందుకోర్టులు ప్రమాణముగ దీసికొనవలసిన 'లా' నిర్ణయింప బడియుండలేదు. ఇందువల్ల ఇంగ్లీషు 'లా' యే ప్రమాణముగ దీసి కొనబడినది. ఆంగ్లేయపౌరులమీదను, లేక, సీమప్రభువుగారి పాలితులమీదను, కంపెనీవారి సిబ్బందీమీదను, లేక, ఆంగ్లేయపౌరుల సిబ్బందీమీదను కోర్టున కధికార మొసగబడినది. అయితే, ఆంగ్లేయపౌరుడనగా ఆనాడెవరికి వర్తించును? ఆకాలమున ఆరాష్ట్రములయందలి భారతీయులు — ఆంగ్లేయపౌరులు గారని నిశ్చయముగ జెప్పవచ్చును. కాని, కలకత్తావాసులు మాత్రము ఆంగ్లేయ పౌరులు. ఇరువదినాలుగు పరగణాలవాసులును, బర్ద్వాను, చిటగాంగు, మిడ్నపూరువాసులుగూడ ఆంగ్లేయపౌరులేయని వాదింపదగును. పార్లమెంటు గావించిన శాసనమునం దీపౌరులందరు ఆంగ్లేయపౌరులని తలంపబడియుండెనా? ఆంగ్లేయపౌరులకుమాత్రమే వర్తించునట్లు పార్లమెంటు శాసించియుండలేదా? కంపెనీవారి సిబ్బందీ యనగానెవరు? కంపెనీవారికి రివిన్యూవసూలుచేయు భార తీయ భూకామందునకుగూడ నీనిర్వచనమువర్తించునా? కలకత్తా సుప్రీముకోర్టు వీరందరిపైన తనకధికారముగలదని నిరూపించుకొనెను. కలెక్టరులచే శిక్షింప బడిన భారతీయులపైనగూడ తనకధికారముగలదని సుప్రీముకోర్టు వ్యవహరింప సాగినది. కలెక్టరులచే శిక్షింపబడినవారికి తన సర్వస్వతంత్రాధికారమును వినియోగించి విడుదల చేయుచుండెడిది.1

1. See Amer Khan in this matter of (1870) 6 Beng L. R. 392. 443 and other references quoted by Keith p. 86.

ఈసుప్రీముకోర్టునకును కంపెనీవారిచే స్థాపింపబడిన రాష్ట్రీయకోర్టులకును గల సంబంధమేమి? ఈవిషయములలో సుప్రీముకోర్టునకును, వంగదేశప్రభుత్వ కౌన్సిలునకును స్పర్ధవచ్చినది. క్రిమినలు న్యాయనిర్ణయమునం దీసుప్రీముకోర్టున కెట్టి యధికారముగాని లేదని కౌన్సిలు ప్రతిఘటింప నిశ్చయించుకొనినది. ఈనిర్ణయముతో హేస్టింగ్సుగూడ నంగీకరించుటచే నవాబుయొక్క యధికారమును గుర్తింపవలసినవాడాయెను. 1775 లో మహమ్మదురజాఖానునకు క్రిమినలుకోర్టులపై పెత్తనదారీయొసగబడినది. ఈయనయే తనకుమారుగ నియమింపబడినాడు. సాదరునిజామతు, అదాలతు, కోర్టులు కలకత్తానుండి మూర్షిదాబాదునకువత్తివేయబడినవి. ఈకోర్టు సుప్రీముకోర్టుతోకలిసి వ్యవహరింపసాగినది.

సుప్రీముకోర్టునకును కౌన్సిలునకును మధ్యమూడుకేసులలో వైషమ్యము సంభవించినది. కాశీరాజుయొక్క వ్యక్తిగతమైన అప్పులపై అధికారము గలదని కోర్టు నిర్ణయించినది. జమీందారుని అరెస్టుజేయుటకై పంపబడిన వారిని జమీందారే బంధించివేసెను. ఇందువల్ల సుప్రీముకోర్టునకు విన్నవించుకొనవలెనను విషయముగూడ గుర్తింపబడలేదు. హేస్టింగ్సుయొక్క తుందుడుకు చర్యకు కంపెనీ తనయనంగీకారమును చూపించియుండలేదు. ఇదేవిధముగ కంపెనీయొక్క భారతీయసిబ్బందిని శిక్షించుటయందుగూడ కోర్టుయొక్క అధికారము తిరస్కరింపబడినది. అసమ్మతి ప్రబలినది. తనకోర్టునకే యధికారము గలదని ఇంపీగారునిశ్చయించిరి. అన్నింటికంటెను గుర్తింపదగినది పాట్నాకేసుగా యిదా. సాదరుబీగమునకు ఆమె మేనల్లునిపైనను, పాట్నాకౌన్సిలు ఉద్యోగస్థులమీదను నష్టపరిహారములను సుప్రీముకోర్టు డిక్రీయిచ్చినది. ప్రతివాది కంపెనీయొక్క రివిన్యూవసూలుదారుడను నెపమున సుప్రీముకోర్టు తీర్పుచెప్పుటకు బూనినది. ఈవిధముగ కంపెనీవారి న్యాయశాఖోద్యోగులమీదగూడ సుప్రీముకోర్టు చర్యగైకొనసాగినది. నిజము పరీక్షింపవలసివచ్చినచో హిందూ మహమ్మదీయ న్యాయశాస్త్రవేత్తలతోగలిసిన కౌన్సిలుయొక్క న్యాయనిర్ణయము దురన్యాయభరితమైనది.1 అయితే యీక్రొత్తసుప్రీముకోర్టు ప్రజలకు సంరక్షణయొసగగలుగుటయు బూటకమే. కలకత్తాయందుగల గవర్నరు,

1. Keith p. 87.

కౌన్సిలును, 648 గురు ఆంగ్లేయపౌరులును సీమప్రభుత్వమునకు కీపరిస్థితులు నివేదించుకొనిరి. హేస్టింగ్సు వెంటనే సాదరుదివానీ, అదాలతులకు అధ్యక్షుడుగా, ఇంపీగారు, పనిచేయునట్లుగ నేర్పరచెను. ఇట్లొనరించుటకు కంపెనీవారి యనుమతిని స్వీకరించలేదు. హేస్టింగ్సు, న్యాయశాఖపై ఇంపీగారికధ్యక్ష్య మొనగెను.

ఇంపీగారిని నియమించుటకు ముందుగనే రాష్ట్రీయకౌన్సిళ్ళను (Provincial Councils) సంస్కరించుటకై హేస్టింగ్సు ప్రయత్నించి యుండెను. 1780 ఏప్రియల్ 11 వ తేదీని రివిన్యూవ్యవహారములును, న్యాయశాఖవ్యవహారములును వేరుచేయబడినవి. వ్యక్తులమధ్యగలుగు దావాలను దివానీఅదాలతు కోర్టులు నిర్ణయించుచుండుటకును, యీకోర్టులకు సివిలుసర్వీసు ఉద్యోగులు ప్రధానన్యాయమూర్తులుగ నుండుటకును నిర్ణయింపబడినది. ఈ కోర్టులతీర్పులపై సాదరుదివానీ అదాలతునకు, అప్పీలుచేసికొనుట కధికారము గల్పింపబడినది. ఈసాదరుదివానీ అదాలతుకోర్టునకు గవర్నరు జనరలును, కౌన్సిలును, ప్రధానన్యాయమూర్తులు. రిగ్యులేటింగుశాసనము గావింపబడిన నాటనుండియు నీసాదరుదివానీ అదాలతు న్యాయనిర్ణయము గావించియే యుండలేదనుట నిశ్చయము.1

కాని, 1780 ఏప్రియలు 11 వ తేదీనాడు గావింపబడిన నియమముల ననుసరించి కోశాగారవ్యవహారకుని సిఫారసుపై కొన్నితగాయిదాలలో (Keeper of the treasury Records) తీర్పులుచెప్పబడినవి. ఈతీర్పుల విధాన మసహ్యాకరమైనది.

5 ఇంపీగారిని విచారించుట

ఇంపీగారు అనుబంధన్యాయ శాఖసంతయు పరీక్షించుచుండెడివారు. న్యాయ విచారణనియమములను వ్రాసిరి. 18 కోర్టులు పెట్టబడినవి. ఇందు నాలుగుకోర్టులకు కలెక్టరులు జడ్జీలుగనుండిరి. ఇంపీగారికి కంపెనీకూడ హెచ్చుజీతము నొసగనిర్ణయించినది. ఈవిధముగ ఇంపీగారు కంపెనీనుండిగూడ జీతమును పుచ్చుకొనుటవల్ల సుప్రీముకోర్టు అధికారమును కంపెనీయధికారమునకు

1 .See. Stephen - Nuncomar and Impey ii. 189.

లోనుజేసినట్లుగ పార్లమెంటు తలంచినది. 1782 మే, లో పార్లమెంటు ఇంపీని సీమకు మరలించి, అతనిని నేరస్థునిగా విచారించవలయునని తీర్మానించినది. కాని, 1787 వరకును నేరారోపణము గావింపబడి విచారణ జరిగియుండలేదు. నందకుమారునికి ఉరిశిక్ష వేయుటయే ఇంపీగారి మొదటి నేరముగ పరిగణింపబడినది. కాని, ఇంపీగారు న్యాయవాది యగుటచే న్యాయవిచారణనుండి తప్పించుకొనగలిగెను. కాని, కారనువాలీసునలహాపై యీయనను తిరిగి హిందూ దేశమునకు బంపరాదని మాత్రము నిర్ణయింపబడినది.

ఈవిధముగ జరుగులోపుగ హేస్టింగ్సు గావించుకొనిన విన్నపమును, తదితరులు వంగ దేశమునుండి పంపినపిటీషనును విచారింపబడినవి. ఈవిచారణకొక సంఘము నియమింపబడినది. ఈసంఘము న్యాయశాఖాపరిపాలనమును గురించి విచారించినది. 1773 లో నిరూపింపబడిన న్యాయశాఖాపరిపాలనమునందు 1781 శాసనము ననుసరించి విచారణసంఘనిర్ణయములకు ఫలితముగ కొన్ని మార్పులు గావింపబడినవి. ఈశాసనమునందలి శీర్షికనుబట్టియే హేస్టింగ్సు ప్రభుత్వవాదము నెగ్గినదనవచ్చును. గవర్నరు జనరలును, కౌన్సిలును, సంఘముగగాని, వేరువేరుగగాని, ఉద్యోగరీత్యా చేయు పనులకు వ్యక్తిగతముగ బాధ్యులు గాజాలరనియు, సుప్రీముకోర్టునకు వీనిపై యధికారము లేదనియు నిరూపింపబడినది. వీరియుత్తరువులు తాబేదారుల చర్యకుగూడ నధికారమును గలిగించుననియు, వీరి యుత్తరువుల ననుసరించి తాబేదారు లొనరించు చర్యపైగూడ నీసుప్రీముకోర్టున కధికారము లేదనియు నిరూపింపబడినది గాని, ఆంగ్లేయతాబేదారుల కీనియమము వర్తింపజేయబడలేదు. కాని, ఆంగ్లేయ తాబేదారులు సీమలో బాధ్యతవహించవలసియుండును. ఈనియమము వల్లనే అధినివేశ రాజ్యములలోని పద్ధతికిని, హిందూ దేశమందలి పద్ధతికిని తారతమ్యమేర్పరుపబడినది. ఈకాలమున గవర్నరులు, ఉద్యోగరీత్యా గావించుచర్యలకు వారు పరిపాలించు దేశములలోనే విచారింపబడగూడదనే యభిప్రాయము ప్రబలియున్నది.1

1. See. Keith. p. 88.

ఇంతకంటెను మరియొక ప్రాముఖ్యముగు మార్పుగావింపబడినది. రివిన్యూ వసూళ్ళలో జరిగిన విషయములను గురించిగాని, రివిన్యూకు సంబంధించిన విషయములలోగాని, సుప్రీముకోర్టునకెట్టి యధికారమునులేదని నిర్ణయింపబడినది. సుప్రీముకోర్టుయొక్క అధికారముగూడ చాలవరకు కుంచించివేయబడినది. నియమోల్లంఘన నేరములకును, క్రిమినలు నేరములకును మాత్రమే సుప్రీము కోర్టున కధికారమొసంగబడినది.

భూకామందులైనందువల్లను, లేక రివిన్యూవసూలుదార్లుగ నున్నంత మాత్రమునను, సుప్రీముకోర్టునకు వారిపై యధికారమొసంగబడలేదు. ఆంగ్లేయ పౌరులు, లేక, కంపెనీసిబ్బందికి సంబంధించిన భూమి, వస్తువులు, కంట్రాక్టులు, వీటిలోగల వారసత్వపుహక్కులపై సుప్రీముకోర్టున కధికారముతొలగింపబడినది. జాతీయసిబ్బందియొక్క వివరములను లిఖితపూర్వకముగ నుంచవలయును. ఈవిధముగ రిజష్టరీచేయబడనివారెవరును కంపెనీనౌకరీలో నుండరాదు. హిందూ మహమ్మదీయ మతాచారముల ననుసరించి గావింపబడుచర్యలు క్రిమినలునేరములుగ పరిగణింపబడరాదనియు1 హిందూమహమ్మదీయ ధర్మశాస్త్రముల ననుసరించిన తంత్రులు లేక కుటుంబయజమానులహక్కులు గౌరవింపబడవలయుననియు శాసింపబడినది.

భారతీయుల దావాలలో అనుసరింపదగిన నియమములు వ్రాయుటకు సుప్రీముకోర్టున కధికారమొసగబడినది. ఈనియమావళిని సీమ రాజుగారంగీకరించవలసియున్నది. భారత దేశమునందంతవరకునుగల 'లా' కు వ్రాతమూలకముగనైనను నీవిధముగ గౌరవముచూపించుటలో 1772 వ సంవత్సరమునందువ్రాయబడిన నియమము లనుసరింపబడినవి.

రాష్ట్రీయకౌన్సిళ్ళు దేశమునందుగల న్యాయశాఖోద్యోగులపైనను, లేక వారిడిక్రీలను అమలుజరుపువారిపైనను చర్యదీసికొనుటకు సుప్రీముకోర్టున కధి

1. This Provision was repealed in the Govt. of India Act 1935. S. 301 only. together with the like Rules (37. Geo. iii C. 142 S. 12) for Madras and Bombay quoted by Keith. P. 89.

కారము లేదని ప్రోవిన్షియల్ కోర్టులు నిర్ణయించియుండెను. ఈనిర్ణయము నూతన శాసనమునం దామోదింపబడినది. (పాట్నా కేసులో నష్టపరిహారములొసగ వలయునని గావింపబడిన తీర్పుననుసరించి నష్టపరిహారములొసగనందున ఖయిదులో పెట్టబడిన ముద్దాయిలను గవర్నరుజనరలుగారు విడుదలచేయ వలయుననియు, గవర్నరుజనరలునకును, కౌన్సిలునకును ముద్దాయిలు హామీ నొసగవలెననియు నిర్ణయింపబడి విడుదలగావింపబడిరి.)

గవర్నరుజనరలును, కౌన్సిలును సాదరుఅదాలతుకోర్టుగ వ్యవహరించుట కంగీకరింపబడినది. ఈకోర్టు పనిచేయుచుండవలెనని శాసింపబడినది. ఈకోర్టు తీర్పులపై రూ 5000 ల కిమ్మతునకు మించిన దావాలలో ప్రీవీకౌన్సిలునకు అప్పీలు చేసికొనుటకు సావకాశ మొసగబడినది. ఈసాదరు అదాలతుకోర్టునకే రివిన్యూ వసూళ్ళకు సంబంధించిన నేరములను విచారించుట కధికార మొసగబడెను. కాని ఉరిశిక్షయు, యావజ్జీవద్వీపాంతరవాసశిక్షయు విధింపరాదని నిషేధింపబడెను. ఈ కేసులలో జూరీలు విచారణకుపిలువబడరను విషయము గమనీయము.

ఈశాసనముననుసరించి న్యాయశాఖనంతయు సుప్రీముకోర్టుయొక్క అధికారమునకు లోబరచవలెనని హేస్టింగ్సుగావించిన ప్రయత్నములన్నియు విఫలములయినవి. నేటినుండియు కంపెనీప్రభుత్వమంతరించువరకును — రెండువిధములగు న్యాయశాఖలునుగూడ పనిజేసినవి. (కంపెనీచే స్థాపింపబడిన న్యాయశాఖ-సీమప్రభుత్వమువారి సుప్రీముకోర్టు.) 1782 లో కంపెనీవారొసంగిన సూచనల ననుసరించి గవర్నరుజనరలును, కౌన్సిలును సాదరుదివానీఅదాలతు కోర్టుగ వ్యవహరింపసాగిరి.

పార్లమెంటుశాసనముతో నిమిత్తములేకుండగనే నేరములను విచారించు న్యాయశాఖలో మార్పులుగావింపవలెనని హేస్టింగ్సు ప్రయత్నించియుండెను. 1781 లో దివానీఅదాలతు కోర్టులయొక్క జడ్జీలే మేజస్ట్రేటులుగగూడ పని చేయ వలయునని, లేక, శిక్షించుటకధికారముగల జమీందారులుగ వర్తింపవలయు ననియు హేస్టింగ్సు నిరూపించియుండెను. నేరస్థులనువిచారించి ఫౌజుదారీకోర్టు

లకు విచారణకై పంపుటకుగూడ దివానీఅదాలతు కోర్టులజడ్జీల కధికార మొసగబడినది. సివిలు క్రిమినలుశాఖలు రెండును ఆంగ్లేయుల హస్తగత మొనరించుటకేనిర్ణయమే దారిదీసియుండుటచే సివిషయము ప్రాముఖ్యముగ గమనింపవలసియున్నది.

1781 వ సంవత్సరశాసనమునందు శాసనాధికారమునుగురించిగూడ నిర్ణయింపబడియుండెను. రిగ్యులేటింగుశాసనము సుప్రీముకోర్టువారి యధికారమునకు లోబడిన శాసనాధికారమునుమాత్రమే యొసగియుండెను. ఈయధికారముగూడ రాష్ట్రములయందలి ప్రజలందరకునువర్తించునట్లుగ ప్రయోగించుటకధికార మొసగబడలేదు. నవాబునకుమాత్రమే ప్రజలందరిపైనను అధికారముగలదనుట నిశ్చయము. అయినను కంపెనీ దివానుగిరీవల్ల నీయధికారము తనకు సంక్రమించినదని తలంచినది. నవాబుయొక్క క్రిమినలునేరముల విచారణాధికారమును కంపెనీ చెలాయించినది. ఈనిర్ణయమును పురస్కరించుకొనియే 1772 లో హేస్టింగ్సు న్యాయశాఖాపరిపాలనమును గురించి నియమావళిని నిరూపించియుండెను. 1780 లో మరికొన్ని నూతననియమములు ప్రకటింపబడి 1781 లో ఇంపీ తోడ్పాటుతో క్రోడీకరింపబడినవి. ఈనియమములు 1773 వ శాసననిబంధనల ననుసరించి లేవు. అయినను 1781 వ శాసనమునం దామోదింపబడినవి. గవర్నరుజనరలుగారు రాష్ట్రీయకోర్టులకును, (Provincial courts and Councils) కౌన్సిళ్ళకును కార్యనిర్వాహణమునకు సంబంధించిన నియమములనువ్రాయు నధికారమును గలిగియుండిరి. ఈనియమముల నకళ్ళను కంపెనీ డైరక్టరులకును, రాజ్యాంగకార్యదర్శికిని పంపవలయును. కౌన్సిలుయుతుడగు రాజుగారికీ నియమములను మార్చుటకు, లేక, సవరించుటకు నధికార మొసగబడినది. రాజుగారు తమకుగల యీయధికారమును రెండుసంవత్సరములలోపుగ వినియోగించినయెడలతప్ప, యితరవిధముగ నీనియమములాచరణయందుండుట కెట్టిప్రతిరోధముగానిలేదు. ఈశాసననిబంధనల ననుసరించి గవర్నరుజనరలును, కౌన్సిలును తమ యధికారముపైననే యాధారపడగలరు. సుప్రీముకోర్టుపై నాధారపడవలసిన పనిలేదు.

హేస్టింగ్సును, ఆయనసహచరులగు కౌన్సిలరులును, రివిన్యూవిధానమును

గురించి పరస్పరము డీకొనిరి. 1772 లో నిర్మింపబడిన రివిన్యూబోర్డుహారోదాలో వీరు పరస్పరకలహాములకు పాల్పైరి. హేస్టింగ్సును, శార్న్వాలును భూమికి హక్కుదారుడు రాజనితెలచిరి. ఫ్రాన్సిస్సు, భూమికి జమీందారులేహక్కుదారు లని వాదించెను. వీరియందెవరికిని రైతు జ్ఞప్తికి రాలేదు. 1781 ఫిబ్రవరి 20 వ తేదీని హేస్టింగ్సు రివిన్యూపరిపాలనమును కేంద్రీకరించవలయునని నూతనవిధానమును తలపెట్టెను. రాష్ట్రీయకౌన్సిళ్లు ఎత్తివేయబడినవి. రివిన్యూవసూలునకై నలుగురు కంపెనీ యుద్యోగస్థులతోను, ఒక భారతీయ దివానుతోను గూడిన సంఘములు నెలకొల్పబడినవి. జిల్లాలలో కలెక్టరులు తిరిగినియమింపబడిరి. కాని, వీరికి రివిన్యూవసూలుపై నధికార మొసగబడలేదు. మరియు కరణములు, లేక, కనునుగానులకు వారి (Kanungos) మామూలు అధికారము తిరిగి 1781 లో నొసగబడినది. 1782 లో మైనరుజమీందారులను జమీందారిణీలను, అసమర్థులను, సంరక్షించుట కనునెపమున నొకకార్యాలయము నెలకొల్పబడినది. 1783 లో రైతులపంటలపరిస్థితులన్నియు నివేదించవలసినదిగ కలెక్టరుల కాజ్ఞయొసగబడినది. హేస్టింగ్సు 1786 లో ఇండియాను వీడిపోయినపిమ్మట రివిన్యూకమిటీ రివిన్యూబోర్డుగ నెలకొల్పబడినది. దీనికి కౌన్సిలునభ్యుడధిపతి. రివిన్యూనిర్ణయములనుగావించుటకు తిరిగి కలెక్టరుల కధికార మొసంగబడినది. 1787 లో వంగరాష్ట్రమంతయు అంతవరకునుగల 23 జిల్లాలకుమారుగ 35 జిల్లాలుగ విభజింపబడినది. ఛీఫ్‌సిరస్తాదారుపదవి సృష్టింపబడినది. భూములకు సంబంధించిన రికార్డులన్నియు వీరియధీన మొనరింపబడెను. ప్రభుత్వమునకు ప్రత్యక్షజ్ఞానము లభించునట్లుగ నొనరించుకొనవలెననియే యీమార్పునందుగలభావము. ఇంతవరకును యీరికార్డులు కరణముల యాధీనమునందుండెడివి.

హేస్టింగ్సు సివిలు మిలిటరీ యుద్యోగములను పంచిపెట్టుటయందుగూడ యుక్తాయుక్త విచక్షణ లేకయే సంచరించెననుట నిశ్చయము. కంపెనీడైరక్టరుల సదభిప్రాయమును మారగొనవలెనను సంకల్పమే హేస్టింగ్సు దుర్వర్తనమునకు కారణము. 1776 లో సివిలు సిబ్బందికి సాలుసరి పౌ 251,533 ల వ్యయమయ్యెడిది. ఈవ్యయము హేస్టింగ్సుయొక్క యుద్యోగముల వితరణమువల్ల ఎనిమిది సంవత్సరములలో పౌ 927,945 ల వరకు పెరిగినది. గవర్నరుజనరలు

పదవియు, కౌన్సిలరుపదవులను మాత్రమేకాక పౌ 25,000 ల జీతముగల పదవియొకటియు, పౌ 15,000 ల జీతముగల పదవొకటియు, పౌ 10,000 ల జీతములుగల అయిదుపదవులును. పౌ 9,000 ల జీతముగల అయిదుపదవులును నుండెడివి. "జీతములన్నియు సీయుద్యోగములయందు నియమింపబడిన యువకుల అర్హతలకంటె చాల హెచ్చుగనున్నవి."[1] దురవస్థపాలై, దుర్భిక్షముతో నల్లలాడుచున్న రైతులనోళ్ళు బిగియగట్టియే యింతటిజీతములు విరివిగ పంచిపెట్టి హేస్టింగ్సు తన ఘోరకృత్యములకు డైరక్టరుల మద్దతును సంపాదింపజూచి యుండెను. ఈ హెచ్చుజీతముల దుర్భరస్థితి కారనువాలీసు పరిపాలనమున కొంత తగ్గినది.

6
హేస్టింగ్సుపై
నేరారోపణము

హిందూదేశమునందు వారను హేస్టింగ్సు గావించిన దుర్నయములు పార్లమెంటునకుగూడ నలజడి కలిగింపగలిగెను. 1782 మే 30 వ తేదీని హేస్టింగ్సువర్తనమును పార్లమెంటు నిరసించినది. సీమజాతీయనీతికిని గౌరవమునకును భంగకరముగ హేస్టింగ్సు వర్తించెనని పార్లమెంటు తలంచినది. హేస్టింగ్సును వెంటనే సీమకు మరలింప నిశ్చయించినది. కాని, పార్లమెంటువారి యభిమతము నెరవేరలేదు. కంపెనీప్రొప్రయిటర్లు డైరక్టర్లచే నీతీర్మానమును అమలునందుండకుండ జేసిరి. ఇంతవరకు హేస్టింగ్సు తన యుద్యోగమునకు ప్రాపకము మూలముగ ప్రొప్రయిటర్లయందు హేస్టింగ్సు నెలకొల్పుకొనిన పలుకుబడియే కారణము. కాని, హేస్టింగ్సుపై సీమలో కోపోద్రేకములు హెచ్చుపెరుగుచున్నవి. పిట్టుగారి యిండియా శాసనముయొక్క వార్త హేస్టింగ్సు చెవినిబడినవెంటనే, తనరాజీనామా, విధియని హేస్టింగ్సు నిశ్చయించుకొనియుండెను. 1785 ఫిబ్రవరి 1 వ తేదీని కలకత్తానుండి సీమకుబయలుదేరెను. "హేస్టింగ్సుపేరు జెప్పినంత మాత్రమున బర్కు, ఫాక్సు డండాసు, షెరీడాను మండిపడుచుండిరి. వీరందరును పార్లమెంటునందలి సుప్రసిద్ధ వక్తలు. విచ్ఛిన్నమైన ప్రాన్సిసు మేధచే నేర్పరుపబడిన మహానాటకరంగమున వీరందరును పాత్రలైరి."[2]

1. Keith p. 92.
2. See, Weits- man. p. 171.

1786 లో హేస్టింగ్సుపై నేరారోపణము ప్రారంభింపబడినది. 7 సంవత్సరము లీవిచారణ జరిగినది. ఈనేరారోపణమున 22 నేరములు పేర్కొనబడినవి. అందు (1) రోహిల్లాలతో గావించినయుద్ధము — నందకుమారుని కేసు విచారణ శిక్ష — వంగ దేశపు నవాబుపట్ల జూపబడినప్రవర్తనము, — చైతుసింగును శోషించుట — అయోధ్యబీగముల వ్యవహారములు, ప్రాముఖ్యమైన నేరములు. కామన్సుసభ బర్కుయొక్క ఆధిపత్యమున 19 గురు మేనేజర్లతోగూడిన యొకసంఘమును నియమించినది. ఈసంఘము లార్డులసభలో, హేస్టింగ్సు కేసును నడిపినది. ఈసంఘమునకు కేసునునడుపుటయందు ఫ్రాన్సిసు తోడ్పడియుండెను. హేస్టింగ్సు యొక్క ప్రతివాదమును సమర్థులగు న్యాయవాదులు నడిపిరి. 1791 వచ్చునప్పటికి చాలనేరములు రుజువుకాలేదని త్రోసివేయబడినవి. చైటుసింగు, అయోధ్య బీగములు, దగాకంట్రాక్టలు, బహుమానములకు సంబంధించిన నేరములు మాత్రముమిగిలినవి. 1783 లో ఇంపీ విచారింపబడి, నేరస్థుడుకాదని విడిచివేయబడుటతో నందకుమారు హత్యకు హేస్టింగ్సు కారణమను నేరముగూడవిడబడినది. చిట్టచివరకు అన్ని నేరములును రుజువుకాలేదని హేస్టింగ్సున కనుకూలముగ లార్డులచే తీర్పుచెప్పబడినది. చైటుసింగునుగురించిన నేరమును, బీగములను గురించిన నేరమునుబట్టి దను చాలమంది లార్డులు నేరస్థుడని చెప్పిరి. కాని, అధిక సంఖ్యాకులట్లు నిర్ణయించియుండలేదు. ఈనేరారోపణ విచారణము 7 పార్లమెంటు సభలలోజరిగినది. 143 సార్లు కోర్టు విచారణ సలిపినది. "నిజముగ హేస్టింగ్సు కొన్నివిషయములలో నేరస్తుడే యైనప్పటికినీ, అతనికి సంవత్సరములకొలది జరిగిన విచారణావల్ల గలిగిన మనోవేదనయే నిజమగు శిక్షయంటె హెచ్చుశిక్షయైనదని చెప్పవచ్చును.1

ఈకేసులో న్యాయనిర్ణయము చేయునపుడు లార్డులసభలో 29 గురు ప్రభువులుమాత్రమే 1795 ఏప్రియలు 23 వ తేదీని ఓటుచేసియుండిరి. చైటు సింగు, బీగముల విషయమున ఆరుగురుప్రభువులు నేరస్థుడని ఓటునిచ్చిరి. ఇతరులుకూడ చాలమంది నేరస్థుడనియే విశ్వసించియు, దీర్ఘమగువిచారణయే తగినంత శిక్షయనిఎంచిరి. నిజముగ నీవిషయమునందు న్యాయనిర్ణయ మొన

1. See. P.E. Roberts in the Journal of Indian History vol. iii. p. 131.

రించుట దుర్ఘటమైన విషయము. ఇది సహజమే. చాలకాలము పరిపాలించియే తన దేశయధికారమునకును — రాజ్యవిస్తీర్ణమునకును — దోహదమొనరించినవాల నొకనిని, ఆదేశమే శిక్షింపవలెననుట కష్టమైన విషయమే.'' అని కీతుగారు వ్రాసినవ్రాతయందెంతయూ సత్యముగలదు.[1] "మన ప్రభుత్వపు సరిహద్దులను వారనుహేస్టింగ్సు పెంచగలిగెనా? లేదు. తగ్గించెనని చెప్పుటకుకూడ రెండు దృఢమగు నుదాహరణములుగలవు.''[2]

వారనుహేస్టింగ్సు ఒకఅంగుళమైనను నేలను కంపెనీవారికి సంపాదించి పెట్టనిమాట వాస్తవమే. కాని, మోసమువల్లను, ఫోర్జరీవల్లను, క్లైవుచే పునాదులు వేయబడిన ఆంగ్లేయసామ్రాజ్యకట్టడములను హేస్టింగ్సు సంరక్షించి సుస్థిరమొనరింపగలిగినాడు. హేస్టింగ్సు సమబలప్రాధాన్యుడు గాడు. వరదువలె జిత్తులమారి వాడు. ఇదియే ఇతని రాజనీతి. ఇతని రాజనీతివల్లనే దేశీయప్రభుత్వముల మూలములు కదలించివేయబడినవి. స్వదేశ రాజుల దౌర్బల్యమునందుననే కంపెనీబలము మిమిడియుండెను. ... వారనుహేస్టింగ్సు పరిపాలించిన 13 సంవత్సరముల భారత రాజకీయ చరిత్రకుగల సుప్రసిద్ధత మరి యేకాలపు కంపెనీ రాజ్యాంగ చరిత్రకును లభించియుండలేదు...'[3] మొట్టమొదటగ కంపెనీగుమాస్తాగా వారనుహేస్టింగ్సు 1749 లో హిందూదేశమునకు వచ్చియుండెను. 15 సంవత్సరములు పనిజేసి 1764 డిశంబరులో సీమకు వెళ్ళిపోయెను. 1768 లో మదరాసుప్రభుత్వమున రెండవకౌన్సిలరుగ నియమింపబడి, తిరిగి హిందూదేశమునకువచ్చెను. నాలుగుసంవత్సరములకు పిమ్మట వంగదేశపు గవర్నరుగ నియమింపబడియుండెను. ఈవిధముగ నా బాల్యము, వారనుహేస్టింగ్సు హిందూదేశద్రవ్యముతో రక్తమాంసకండరముల నభివృద్ధి గావించుకొనిన వారిలో ప్రాముఖ్యుడు. "వారనుహేస్టింగ్సు మానసమునందొకింతయైన మానవచిత్తవృత్తియొక్కటైన నున్నదని తలంప వీలులేదు. ఎవరినైనను అపరిమితవిషాదభయభ్రాంతులుగ నొనరింపగను, ఏవిషయమునైనను వారనుహేస్టింగ్సు

1. See. Keith. p. 84.
2. See, Burks Speeches. Bhous Library Series Voi. i. p. 131.
3. B. D. Basu. p. 198.

మామూలుగనే వినెడివారు.”1

“ఐశ్వర్యమునుగూడబెట్టుకొనుట మాత్రమే నిత్యవిధిగాగల, కలెక్టరులతోను, జడ్జీలతోను దేశమునంతను నింపివేసినది వారనుహేస్టింగ్సే. ఈ, సర్వభక్షకులను దేశముమీదకువిడిచినది తడవుగ, ప్రజలను, కారణములనుజూపియో, చూపకయో కొల్లగొట్టసాగిరి”......ఎవరు హెచ్చు మొత్తములను లంచముగ వేలముపాడగలరో వారిపక్షముననే జడ్జీలు తీర్పులు చెప్పుచుండెడివారు. దొంగతనమునకు ప్రతిహతము జరుగకుండగ దొంగలుకూడ, విడువకుండ రివిన్యూ చెల్లించు చుండెడివారు.”

ఈయన, వంకరటింకర రాజనీతి, సిగ్గుమాలినవిశ్వాసద్రోహము రాజులను, గొప్పవారినిమాత్రమే కూలద్రోసినది. జమీందారులనుకూలద్రోయుట, బీగములను శోషింపజేయుట, రోహిలాలను నామరూపములేకుండజేయుట, యివియన్నియుమరచిపోవచ్చును. కాని, గోరకుపురమునందు గావింపబడిన ఘోరకృత్యము (ఆంగ్లేయగౌరవమునకు భంగకరముగ) ఎల్లప్పుడును సంస్మరింపబడుచునేయుండును. “మొగలాయిప్రభుత్వమునందే ఎస్టేటుప్రప్రముఖులును తన ఆదాయమునందు సగముభూమి శిస్తుక్రింద ప్రభుత్వమునకిచ్చియుండలేదు. చిన్న చిన్న భూకామందు లసలే తక్కువగ భూమిశిస్తునిచ్చుచుండెడివారు. చిన్న భూస్వాములకు భూమిశిస్తుకూడ లేకుండనుండెడిది. లేక, కొంత ఆదాయము గౌరవభృతిగ విడువబడుచుండెడిది. కంపెనీపరిపాలనమునందు భూస్వామి నూటికిపదివంతుల ఆదాయమునుమాత్రమే తాను తీసికొనగలుగుచున్నాడు.”... జయింపబడిన దేశములకుతుకులపై జయించినపదేశముగాని యింతటిసునిసితముగు కత్తిరబోనును పెట్టియుండలేదని జ్ఞప్తియందుంచుకొనునంతటి దుర్భరముగా ప్రజలు పరిపాలింపబడిరి.” 2

---

1. See, Howitt. Fifth parliamentary report Appendix. No. 21.
2. See. Colebrook's letter to his father 28 th july 1788. quoted by B. D. Basu. P. 202.

See for a very fair account of Warren-Hastings administration, Chapters VII–XIII. of Empire in Asia-How we came by it. A book of confessions by W. M. Torners. M. P. Published by the pavini office Allahabad.

"హేస్టింగ్సు ద్వంద్వ ప్రభుత్వమును నశింపుజేయగలిగినాడు. ఆంగ్లేయాధిపత్యమును సుస్థిరమొనరించినాడు. భయంకరమైన ఆరాజకమునుండి క్రొత్తదైన మొక మాటయయిన, అక్రమమైన పరిపాలనకైనను నిర్మింపగలిగినాడు. ...... హేస్టింగ్సు చేతులయందే సీమ దేశమేమియును గోల్పోయియుండలేదు. ఆసియావాసులయొక్కయు, అంగ్లేయులయొక్కయు తీవ్రశతృత్వము నెదుర్కొనుచు ప్రాక్ దిశయందలి మనయధికారమును విస్తరింపజేయగలిగినది హేస్టింగ్సే" అని ఆంగ్లేయచరిత్రకారులును, హేస్టింగ్సు సమకాలికులునునగు మెకాలేగారువ్రాసిన పై వ్రాతయే హేస్టింగ్సుపరిపాలనము హిందూదేశమునకెంత కంటకముగ నున్నదియు రుజువుచేయగలదు. 1 ఈవిషాదభూయిష్టమైన హేస్టింగ్సుపరిపాలనావిధాన సంస్కరణములే కారనువాలీసు పరిపాలనకాధారములుగ గ్రహింపబడినవి. "కాని చిట్టచివరకు హేస్టింగ్సుయొక్క ప్రతిశక్తియగు ఫ్రాన్సిసు సంస్కరణవిధానమే భూమిశిస్తు నిర్ణయము, వంగదేశపరిపాలనము, మొదలగు వాటిలో నిలిచినది."

# 14 పిట్టుశాసనము; పార్లమెంటు అధికార పరివర్తనము.

1 — 1779–1780 సంవత్సరముల శాసనములు.

హిందూదేశ వ్యవహారములలో పార్లమెంటు తనదృష్టి నంతయు లీనమొనరింపదగిన పరిస్థితులుదయించినవి. పార్లమెంటునకుగల ప్రయోజనము వృద్ధిగావించుకొనగలిగిన తరుణమాసన్నమైనది. ఇందులకు వారను హేస్టింగ్సుయొక్క పరిపాలనా పరివర్తనమే కారణము. అయినను హేస్టింగ్సు దుష్టప్రవర్తనమునకు ప్రతిరోధముగలుగలేదు. ఇందులకు నాడు అమెరికా

1. See Historical Essays (oxford Edition) 1913. p. p. 594—5.

2. See. weitzman p. 196 See. Mill and Wilsons History of British India 1858. Vol. V. P. 126. and P. E Roberts. The Journal of Indian History Vol. iii, P. 131 to know other side of the picture and some more details regarding Warren Hastings.

దేశమునందుగల జాతీయసంక్షోభ మొకకారణమని కొందరివాదము. ఈ అమెరికా దేశమందలి జాతీయసంక్షోభమువల్లనే కలుగజేసికొనుటగా విలులేకి 1779 – 1780 సంవత్సరములలో పార్లమెంటు శాసనములను గావించినది. ఈశాసనములవల్ల కంపెనీ వారియొక్క అధికారములును, హక్కులును, మరిరెండు సంవత్సరములవరకు సంరక్షింపబడినవి. గవర్నరు జనరలును, ఆయనకౌన్సిలును గూడ యథావిధిగ తమమామూలు అధికారములను చెలాయించుటకధికారము తిరిగి యొసగబడినది. తైరమరగునుండి ఆంగ్లేయప్రభుత్వమాడవలసిన నాటక మంతయు, పరిపూర్ణముగ ముగియకపోవుటయే హేస్టింగ్సునకు మరిరెండు సంవత్సరముల అధికారాయుర్దాయ మొసగబడుటకు కారణమనిగూడ పార్లమెంటువారి 1779 – 80 శాసనముల కర్థముజెప్పుట సమంజసముకాకపోదు.

2
విచారణ సంఘము;
1781 వ సంవత్సరపు
శాసనము.

1780 వ సంవత్సరమున కంపెనీకి యొసగవలసిన పౌ 4,200,000 లను తిరిగియిచ్చివేసి కంపెనీనిరద్దు చేయుకొనవలెనని లార్డునార్తుగారు పార్లమెంటులో తీర్మానముపపాదించియుండెను. 1781 లో హిందూదేశమునందలి న్యాయపరిపాలనా శాఖనుగురించి విచారింప (సెలక్టుకమిటీ) ప్రత్యేకసంఘమును, కర్ణాటయుద్ధములనుగురించి విచారించుటకై రహస్యపు సంఘమును నియమింపబడినవి. వారను హేస్టింగ్సు పరిపాలనా ఫలితముగ నియమింపబడిన యీప్రత్యేకసంఘము 12 నివేదికలను, రహస్యపు విచారణ సంఘము 6 నివేదికలను పార్లమెంటునకు సమర్పించినది. న్యాయశాఖవిచారణ సంఘ విచారణ ఫలితముగనే 1784 వ సంవత్సరపుశాసనము గావింపబడినది. ఈశాసనమునసనుసరించి వంగదేశపరిపాలనయందలి న్యాయశాఖ సంస్కరింపబడినది. ఈశాసనము కంపెనీవారి యధికారమునుగుర్తించుచునే గావింపబడినది. దీనినసుసరించి మరియొక శాసనముగావింపబడినది. ఈశాసనమునసనుసరించి 1791 సంవత్సరము మార్చి 1 వ తేదీకి పిమ్మట మూడుసంవత్సరముల కాలపరిమితితోగల నోటీసునిచ్చువరకు కంపెనీపరిపాలన రద్దుగావింపబడదని యభయ మొసగబడినది. ఈవిధముగ నభయ మొసగుచు పార్లమెంటు కంపెనీపై తన యధికారమును మరికొంతస్థాపించుకొనినది. నాటినుండియు కంపెనీవారు సైనిక,

రాజకీయ, రివిన్యూవిషయములలోనొసగు నుత్తరువుల కన్నింటికి నకళ్ళను రాజ్యాంగకార్యదర్శికి దాఖలుచేసికొనవలెనని, నిర్ణయింపబడినది. కంపెనీతో నూతనముగ ఆర్థికయొడంబడిక గావించుకొనబడినది. ఆంగ్లేయప్రభుత్వమునకు 1781 మార్చి 1 వ తేదీవరకుగల అన్ని వ్యవహారవిషయములను సరిజూచుకొనిన మొత్తముగ పౌ 400,000 ల నొసగుటకు నిర్ణయింపబడినది. 100 కి 8 వంతులవరకు, లాభములను పంచిపెట్టవచ్చునని నిర్ణయింపబడినది. ఈవిధముగ లాభములను పంచిపెట్టినపిమ్మట మిగులులాభములలో నాల్గింట మూడువంతులు ప్రభుత్వమున కిచ్చివేయుటకుగూడ నిర్ణయము.

3 రహస్యవిచారణ సంఘుఫలితము.

కంపెనీ వ్యవహారములనుగురించి (అనగా కర్ణాటక యుద్ధములు) రహస్యముగా విచారించినకమిటీకి డండాసు (Dundas) గారధ్యక్షుడు. (ఏప్రియల్ 1782.) ఈయనయే పార్లమెంటులో తీర్మానము లుపపాదింపసాగినాడు. మదరాసు గవర్నరులుగా పనిజేసియుండిన రమ్‌బొల్డు — వైటుహిల్లుగార్ల దుష్టప్రవర్తనముపై శిక్షలను నిరూపించుచు బిల్లులను ప్రవేశబెట్టియుండెను. (Rumbold and White-hill). కాని, మరుసటిసంవత్సరము పార్లమెంటునందువలయు సంఖ్యలభించకపోవుటచే, నుపసంహరించి వేయబడినవి. ఆంగ్లేయ జాతీయగౌరవమునకు భంగకరముగ వర్తించియుండుటచేతను, కంపెనీవారి కమితమగువ్యయమునకు కారకుడగుటవల్లను, భారతదేశమున కపారకష్టమునొనగూర్చుటవల్లను, వారను హేస్టింగ్సు, హారన్‌బేల సిరువురను సీమకు వెంటనే రప్పించి వేయవలయునని మే 30 వ తేదీని డైరక్టర్లనుకోరుచు పార్లమెంటు తీర్మానించినది. కాని, ప్రొప్రయిటర్లు పార్లమెంటుతీర్మానమును డైరక్టర్లనామోదింపనీయలేదు. "కంపెనీచే తమయభిప్రాయమును నిర్వర్తింపజేయుటకు తగినయధికారమును ప్రభుత్వము గలిగియుండలేదు. ఈవిషయములను దెల్పుచు పంపెడిలేఖను పంపకుండజేయుటకుమాత్రమే నాడుప్రభుత్వమున కధికారమున్న"[1] దని దీనివల్ల విశదమైనది. కంపెనీ, యూ, తనసిబ్బందీ హిందూదేశమునందుచేయుచున్న దురాగతములను ప్రతిఘటింపజాలకున్నది. కంపెనీని,

1. Keith, p. 94.

ఆంగ్లేయప్రభుత్వ మన్ననో, తన యిష్టమునను సరించి నడుపుటకుతగిన యధికార మును గలిగియుండలేదు. మదరాసు రాష్ట్రము, కలకత్తాయధికారమును ధిక్కరించివేయుచున్నది. కేంద్రప్రభుత్వముగనున్న వంగరాష్ట్ర ప్రభుత్వము, దానికనుబంధములుగనున్న ప్రభుత్వములపై తనయధికారమును చెలాయింప జాలకున్నది.

4 క్రొత్త బిల్లులు.

మదరాసు, బొంబాయిరాష్ట్రములలోగూడ శోచనీయ పరిస్థితు లుద్భవించినవి. ఇందులకు అనవసరయుద్ధములే కారణము. వంగముమాట వేరుగచెప్ప నవసరమే లేదుగదా! ఈపరిస్థితులలో కంపెనీ 1783 వ సంవత్సరమున పార్లమెంటువారిని ఆర్థికసహాయము గోరవలసివచ్చినది. ఈతరుణమును గైకొని, డండాసుగారు ఏప్రియలులో మరియొకబిల్లు నుపపాదించియుండెను. ఈబిల్లుననుసరించి కంపెనీ వారియొక్క సిబ్బందిలో నెవరినైనను నుద్యోగమునుండిదీసివేసి సీమకుమరలి రప్పించుటకై, చక్రవర్తిగారికి సంపూర్ణాధికారము సంక్రమింపజేసెను. తన కౌన్సిలుచర్యలకు వ్యతిరేకముగగూడ వర్తించుటకై గవర్నరు జనరలుగారికి సర్వాధికార మొసగబడినది. అధీనరాష్ట్రములను నడుపుటకై పూర్తియధి కారము గవర్నరు జనరలున కొసగబడినది. నాలుగుసంవత్సరముల కొక పర్యాయము నిర్ణయింపబడుచువచ్చిన భూమిశిస్తు నిచ్చుకొనలేకపోయినందున హేస్టింగ్సుచే పదభ్రష్టులుగ నొనరింపబడిన జమీందారులకు తిరిగి జమీలనిచ్చి వేయుటకును బిల్లునందధికారము ప్రసాదింపబడినది. కాని, ఈబిల్లుపార్ల మెంటులో నుపసంహరించి వేయబడినది.

ఫాక్సుగారి బిల్లు.

నవంబరు 18 వ తేదీని ఫాక్సుగారు మరిరెండుబిల్లుల నుపపాదించిరి. డండాసుగారి బిల్లునందు పరిపాలనయందు సంభవించిన దోషములను తొలగించుటకును, హేస్టింగ్సు పరిపాలన క్రిందజరిగిన దురన్యాయములవంటి దురన్యాయములు జరుగకుండజేయు టకుమాత్రమే సాధనము లరయబడినవి. ఫాక్సుగారిబిల్లులు రాజ్యాంగ విధా నము నంతయును సంస్కరించుటకై యుద్దేశింపబడినవి.

ఈబిల్లులో 7 గురు కమీషనరు లుండునొక బోర్డు సృష్టింపబడినది. ఈశాసనరూపముగనే వీరిపేర్లు పేర్కొనబడవలసియుండెను. వీరి యుద్యోగ కాలపరిమితి నాలుగేండ్లు. ఈబోర్డులో సంభవించుఖాళీలను రాజుగారే పూర్తి చేయునట్లు నియమింపబడెను. కామన్సుల సభయును, లార్డులసభయునుగూడ తీర్మానించినపుడే యీబోర్డు రాజుగారిచే తీసివేయబడగలదు. హిందూదేశము నందలి రాజ్యభాగములపైన, రాబడులపైనను (Revenues) గూడ నీబోర్డున కధికారము గలిగింపబడినది. కంపెనీసిబ్బందీని నియమించుటకును, దీసివేయు టకునుగూడ నీబోర్డునకే యధికారమీయబడినది. ఈబోర్డు లండనునగరమున నుండుటకును, యీబోర్డు తీర్మానములను పార్లమెంటుపరీక్షించుట కధికారము గలిగియుండుటకును ఏర్పాటుపబడినది. కంపెనీయొక్క వర్తక వ్యాపారమును 9 గురు సహాయడైరక్టరులు (మొదట 8 గురు) నిర్వహించుచుండుటకును, వీరిని కంపెనీవాటాదారులు ఎన్నుకొనుచుండుటకును, నేర్పాటుపబడినది. వీరి ఉద్యోగకాలపరిమితి 5 సంవత్సరములు. వీరియందు సంభవించుఖాళీలను డైరక్టరులసంఘము భర్తీచేయుట కధికారముగలిగియుండెను.

ఈబిల్లుపై బర్కుగారు గమనార్హమగు నుపన్యాస మొనగియుండిరి. కంపెనీపరిపాలనయందలి దురాగతముల నెన్నిటినో వివరించియుండెను ఈబిల్లులో కమీషనరులపైన తగినంత యధికారము పార్లమెంటునకు గలిగింప బడలేదు. కాని, యీబిల్లుననుసరించి కంపెనీయు, దానిప్రభుత్వముల్లును, దాని డైరక్టర్లునుగూడ రద్దుకాబడిరి. అయినను కామన్సుసభలో బిల్లునకు 208 మంది యనుకూలురు. 108 మంది వ్యతిరేకులు. కాని, లార్డులసభలో నీబిల్లు ఓడి పోయినది. 76 గురు మాత్రమే అనుకూలురు. 95 గురు వ్యతిరేకులు. మూడవజార్జి రాజీ ఆమోదింపబడినది. బిల్లునకు వ్యతిరేకుడు ఈబిల్లునకు అనుకూలముగ వోటుచేసిన వారందరును తనకుశత్రువులని ప్రకటించినాడు. డిశంబరు 18 వ తేదీని మంత్రివర్గమును రద్దుచేసినాడు. పార్లమెంటునకు తిరిగి ఎన్నికలు జరిగినవి. ఫాక్సుగారీవిధముగ పార్లమెంటును రద్దుచేయుట సమంజసము గాదని ప్రతిఘటించియుండెను. ఇందువల్ల పిట్టుగారు రాజుగారిసహాయసానుభూతులతో పార్లమెంటునం దధిక సంఖ్యను సంపాదించియుండెను. పిట్టుగారు

మంత్రివర్గము నేర్పరచిరి. ఈపరిస్థితులనుగూర్చి ఫాక్సుగారిట్లు వ్రాసి యుండిరి. "నేను ప్రధానమంత్రిత్వముతో గూడిన యధికారమును జాగ్రత్తపరచుకొనుటయే యాలోచించి ఇతరవిషయముల నేమియు తలంచి యుండకున్నచో అది సులభమైన పనియే. ఉన్న పరిస్థితుల నున్నట్లుగ నుంచుటయే యిందులకు మార్గము. లేదా గమనార్హముగాని, సామాన్యమగు, మార్పునుగలిగింప ప్రయత్నించినచాలును. కాని, నేనీబిల్లును ధైర్యముగ ప్రవేశపెట్టుటవలన సంభవింపనున్న రాజకీయప్రమాదమును గమనింపకపోయి యుండలేదు. అయినను, నేను విజయముపొందినను, ఓడిపోయినను, నేను జేసిన ప్రయత్నమునకే నాకెల్లప్పుడును సంతోషముగనుండును. ఏలనన, నే నేపని జేయుట నావిధియో దానినే చేయబూనితిని. అంతకంటె విశేషమేమియు నుచేయలేను. కోట్లకొలదిగ జనసంఖ్యగల భారతీయుల సౌఖ్యము ప్రమాదస్థితి యందుండుటచేత నాయొక్కయు, నామంత్రులయొక్కయు, అధికారమును ఒడ్డితిని."1 ఫాక్సుగారి మంత్రివర్గము కూలద్రోయబడుటకు వేరు కారణములుగూడ గోచరించుచున్నవి. ఫాక్సుగారును, లార్డు నార్తుగారును, ఏకమై నాటిమంత్రివర్గము నేర్పరచిరి. ఈకలియకను నాటిఆంగ్లేయజాతి సహించినట్లుగలేదు. మరియు, నాకాలము రాజుగారిమాటను జవదాటుటపాపమను మతవిశ్వాసముగల కాలము.

ఫాక్సుగారిబిల్లు శాసనమైయుండినచో వారన్ హేస్టింగ్సుగారు ఉద్యోగమునుండితొలగించి వేయబడెడివారు. ఇందును గురించి మిల్లుగారు తమచరిత్రయందు వ్రాసిన విషయములు గమనార్హములు. "ఆధునికకాలములో ఫాక్సుగారి యీరెండుబిల్లులును జాతియందు జెలరేగగొట్టినంత యుద్రేకము, మరియే ఆంగ్లేయప్రభుత్వ చర్యయునుగూడ రేచ్చగొట్టియుండలేదు. ఇంతకంటెను విశేష ప్రాముఖ్యముగల విషయములలోగూడ నేనంతటియుద్రేకమును, వ్యతిరేకపక్షము వారిప్రతిఘటనల నైపుణ్యమువల్లను, పరిశ్రమవల్లను సావకాశముతక్కువగ నుండియున్నను - భయోద్రేకమును పరివ్యాప్తమైనవి. ఇందులకు ఫాక్సుగారి అవగుణములు కారణము. ఈయనాకాలమున, అపరిమిత అవిశ్వాసమునకు

1. Quoted in Leky. ch. 15. See also Hunter. p. p 244-254 for the whole episode.

గురియైయున్నాడు. నార్తుగారితో నకీభవించి మంత్రివర్గముతో ర్చ్యచురటచే రాజ నీతినిత్యజించిన జూదగాడని ప్రజలచేయోచింపబడినాడు. ఈబిల్లువల్ల నొసగబడు అధిక అధికారము దుర్వినియోగపరుపబడునని గూడ భయముగలిగినది.1

5
పిట్టుగారి బిల్లు

అందువల్లపిట్టుగారే హిందూదేశ పరిస్థితులపై నొకబిల్లు నుపపాదించిరి. పిట్టుగారిబిల్లు 1784 ఆగష్టులో శాసనమైనది. ఈబిల్లుననుసరించి ప్రప్రయిటర్ల సంఘమును, డైరక్టరులసంఘమును ఫాక్సుగారిబిల్లులోవలె రద్దుచేయబడలేదు. రాజ్యభాగములపైయధికారము కంపెనీవారిదా లేక ఆంగ్లేయప్రభుత్వమునదా యను విషయము నిర్ణయింపబడలేదు. ఛార్లెసు, జేమ్సు, ఫాక్సుగారుకూడ నీవిషయమై కృతనిశ్చయ మొనరించియుండలేదు. కట్టుదిట్టముగ పార్లమెంటువారి యధికారమును సుస్థిరమొనరింపదలంచి ఫాక్సుగారిబిల్లు నడలింపబడి, తెరమరగు నుండియే నాటకమాడుస్థితినంతయు పిట్టుగారిబిల్లు తొలగింపజాలకపోయినది.

6
కమీషనరులబోర్డు; నిర్మాణము; అధికారము.

పిట్టుగారిశాసనము ననుసరించి, యొకకమీషనరులబోర్డు స్థాపింపబడినది. (Board of Control). కోశాధ్యక్షుడును (Chanceller of the exchequer), ఒక రాజ్యాంగ కార్యదర్శియును, నలుగురు ప్రీవీకౌన్సిలు సభ్యులునుగలిసి కమీషనరుల బోర్డుగ పనిచేయ నిరూపింపబడినది. వీరు చక్రవర్తిగారిచే నియమింపబడుదురు. ఈబోర్డు సమావేశములకు 3 గ్గురు నిర్ణీతసంఖ్యగ నిర్ణయింపబడినది. ఈబోర్డు అధ్యక్షునకు అదనపు ఓటుగూడ నొసగబడినది. ఈసంఘమునకు తూర్పు ఇండియా దీవులలో ఆంగ్లేయులు సంపాదించిన రాజ్యభాగములయందలి సివిలు, మిలిటరీ పరిపాలనకు సంబంధించిన సమస్తవిషయములలోను పెత్తన మొసగబడినది. కంపెనీవారి రికార్డులన్నిటిపైనను యీబోర్డున కధికారముగలదు.

1. See. Mill History of India IV p. p. 384-385.
2. See. Pitts speech. See Huber ii. p. p. 1—9 for an interesting summary of the first draft of the Bill and the directors remarks thereon

హిందూదేశమునందుండి కంపెనీకివచ్చు ప్రభుత్వలేఖలన్నియు (Correspondence or despatches) కంపెనీ యీ బోర్డువారికి దాఖలుచేసికొని తీరవలయును. సీమనుండి కంపెనీప్రభుత్వము హిందూదేశ ప్రభుత్వమునకు పంపు ప్రతిలేఖయుగూడ నీబోర్డువారి యంగీకారమునుపొందిన పిమ్మటనే కంపెనీకి పంపుచుండవలయును. అట్టిలేఖలయం దీబోర్డువారేట్టిమార్పులనైనను గావింపవచ్చును. డైరక్టర్ల ఏకీభావముతోగూడ సంబంధములేకుండగనే యీబోర్డువారి యుత్తరువులను పంపవలెనని కంపెనీప్రభుత్వము నాజ్ఞాపించుటకుగూడ నీబోర్డున కధికారముగలదు. కంపెనీయొక్క డైరక్టర్లసంఘము, ముగ్గురు డైరక్టర్లతోగూడిన యొకయుపసంఘము నేర్పరుపవలసియున్నది. ఈయుపసంఘము, కమీషనరులబోర్డు వారొసంగు రహస్యపుటాజ్ఞలను హిందూదేశ ప్రభుత్వమునకు రహస్యముగా నితరడైరక్టరులకు దెలుపకయే పంపుచుండవలయును. మామూలుగ నీరహస్యపు సంఘమున డైరక్టరుల సంఘపు చైర్మను, డిప్యూటీ చైర్మనుయు సభ్యులుగనుండెడివారు. ఈబోర్డువారిచే యంగీకరింపబడిన డైరక్టరుల ఏతీర్మానమునుగాని కంపెనీ ప్రొప్రయిటర్ల సంఘము తారుమారు చేయజాలదు. (Court of Proprietors). ఈవిధముగ ప్రొప్రయిటర్ల సంఘమునకుగల యధికారమంతయు నూడబెరికివేయబడినది. 1782 లో కామన్సుసభవారిని ధిక్కరించినందుల కిది క్రమమగుశిక్షయని కీతుగారియభిప్రాయము. కంపెనీ వారివర్తక వ్యాపారముపై కమీషనరులబోర్డు జోక్యముకలిగించుకొనకుండ, కంపెనీవర్తకము సంరక్షింపబడినది. వర్తకవిషయములలో కమీషనరుల బోర్డుచర్యలపై, కౌన్సిలుయుతుడగు రాజుగారికి అప్పీలుగావించుకొనుటకై కంపెనీకి సావకాశ మొసంగబడినది.

7
హిందూదేశ
రాజ్యాంగము
నందలి మార్పులు.

ఈపిట్టుగారి శాసనమునను సరించి భారతరాజ్యాంగ విధానముగూడ సంస్కరింపబడినది. గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహక సంఘమునందు ముగ్గురు కౌన్సిలరు లుందురు. ఇందొకరు సర్వసైన్యాధిపతిగ నొనరింపబడెను. ఈసర్వసైన్యాధ్యక్షుడు ఎప్పుడును తాత్కాలికముగ సంభవించు ఖాళీకిగూడ గవర్నరు జనరలుగ నియమింపబడ నిషేధింపబడినది.

8 రాష్ట్ర ప్రభుత్వములు.

గవర్నరు జనరలునకు కలకత్తా ముఖ్యస్థానము. ఇతర రెండు రాష్ట్రములను, యీగవర్నరు జనరలు అధికారము నందుంచబడినవి. గవర్నరు, ముగ్గురు కౌన్సిలరులతో గూడిన కార్యనిర్వాహకవర్గ మేర్పరుపబడినది. ఇందొకరు స్థానికసైన్యాధిపతి. సర్వసైన్యాధిపతియెదుట స్థానికసైన్యాధిపతికి ప్రథమ స్థానములేదు. రెండవస్థానమే యొసగబడినది. గవర్నరు జనరలునకుగల అధికపు ఓటువలెనే, గవర్నరులకుగూడ అదనపు ఓటొసంగబడినది.

9 ఉద్యోగములు—కంపెనీవారి నియామకము.

ఈయుద్యోగస్థుల నియమించుటకు కంపెనీడైరక్టరులకే యధికారమున్నది. కాని, హిందూదేశమునందు పని చేయుచుండిన కంపెనీయొక్క సిబ్బందికి చెందినవారే కౌన్సిలరులుగ డైరక్టరులచేత నియమింపబడుచుండెడివారు. (From covinanted servants). ఏఉద్యోగస్థునైనను హిందూదేశమునుండి సీమకు తిరిగి రప్పించివేయుటకు ఈడైరక్టరులకును, రాజుగారికిని అధికారమొసంగబడినది. పెద్దయుద్యోగస్థుల రాజీనామాలు లిఖిత పూర్వకముగ నుండవలయును. 1777 లో హేస్టింగ్సురాజీనామాకు సంబంధించ గలిగిన సందిగ్ధ పరిస్థితులననుసరించి పైనియమ మేర్పరుపబడినది. గవర్నరు జనరలు, లేక, గవర్నరుస్థానములు తాత్కాలికముగ ఖాళీయగుచో భర్తీ చేయబడువరకును (సీనియరు) కౌన్సిలరు లందరికంటె విశేషకాలముకౌన్సిలరుగ పనిజేసిన కౌన్సిలరే యాపదవియందు తాత్కాలికముగ పనిచేయుచుండుటకు శాసింపబడినది.

కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారికి స్వదేశరాజులతో సంబంధించిన వ్యవహారములపట్లను, యుద్ధములుచేయుట, మానుట, సంధిజేసికొనుటకు మొదలగు విషయములలోను అధికారముండుటయేకాక, కంపెనీడైరక్టరులు నిరూపించుచుండు యితరవిషయములలోగూడ రాష్ట్రప్రభుత్వములపై అధికార మొసగబడినది. రాష్ట్రములన్నియు గవర్నరుజనరలుగారి యధికారమునకు లోబడియే యుండవలయును. డైరక్టరులు వేరువిధమగు నుత్తరువులను పంపి

నప్పుడుమాత్రము గవర్నరుజనరలుగారి ఆజ్ఞలకుమారుగ డైరక్టర్ల ఆజ్ఞలనే రాష్ట్రప్రభుత్వములు శిరసావహింపవలయును. ఈవిధముగ డైరక్టరులు పంపు ఆజ్ఞలు గవర్నరుజనరలునకుగూడ తెలియకపోవచ్చును. ఆపరిస్థితులయందట్టి ఆజ్ఞలను కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలునకు పంపవలసియున్నది. డైరక్టరు యుత్తరువుల ననుసరించి కౌన్సిలు యుతుడగు గవర్నరుజనరలు అవసరమగు సూచనలను రాష్ట్రప్రభుత్వములకు పంపుచుండవలయును. ఆ ఆజ్ఞలను రాష్ట్రప్రభుత్వము లాచరించుచుండ వలయును. ఈవిధముగ రాష్ట్రప్రభుత్వములు కౌన్సిలుయుతుడగు గవర్నరు జనరలుగారి హయామునకు పూర్తిగలోబరచి వేయబడినవి.

ఈవిధముగనే గవర్నరుజనరలుగారును, ఆయన కౌన్సిలును డైరక్టర్ల యధికారమునకు లోబరుపబడిరి. "హిందూదేశమునందు రాజ్యవిస్తీర్ణమునకై ప్రయత్నించుటయు, యుద్ధములలో జయించుటకై పతకములను వేయుచుండుటయు, ఆంగ్లేయజాతీయాభిమతమునకును, గౌరవమునకును, రాజనీతికినిగూడ వ్యతిరేక" మని పార్లమెంటు తనరాజనీతిని నిర్వచించినది. దీనిననుసరించి డైరక్టరులయొక్క, లేక, రహస్యపుసంఘముయొక్క (డైరక్టర్ల ఉపసంఘము) ఆజ్ఞలులేనిదే హిందూదేశమున గవర్నరుజనరలుగారుగాని, ఆయన కౌన్సిలుగాని స్వదేశరాజులతో యుద్ధములకు డీకొనుటయు — సంధిగావించుకొనుటయు — లేక, యొట్టిహామీలనుగాని యొసగుటయు చేయరాదని నిషేధింపబడినది. అంతకుపూర్వమే ఎవరైనను హిందూదేశమునందలి ఆంగ్లేయజాతిపై యుద్ధసన్నాహులై యున్నయడలమాత్రము వారిపట్ల నీనిషేధమువర్తింప జేయలేదు. లేదా, అంతకుపూర్వమే యుద్ధమునందు సహాయమొనరించుటకై ఎవరికైనను హామీలిచ్చియున్నను, అట్టి హామీలపట్లగూడ నీనిషేధము వర్తింపజేయబడలేదు. ఈవిధముగనే గవర్నరుజనరలుగారును — ఆయన కౌన్సిలును అంగీకరించినగాని, గవర్నరులు ఎవరితోను యుద్ధములను, సంధిని గావించుకొనుట కధికారములేదు. అత్యవసరసమయములందేవిధమగు ఒడంబడికలనైన గావించుకొనియున్నచో, అట్టి యొడంబడికలు కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారి యంగీకారమును బడయవలయును. ఏ రాష్ట్రప్రభుత్వములైనను అవిధేయ

తగ ప్రవర్తించినయెడల అట్టిరాష్ట్రప్రభుత్వమును తాత్కాలికముగ పనినుండి భర్తరఫుచేయుటకు గవర్నరుజనరలుగారి కధికార మొసంగబడినది. రాష్ట్రప్రభుత్వములు తమ ప్రభుత్వవ్యవహారములకు సంబంధించిన రికార్డుల నకళ్ళను గవర్నరుజనరలుగారికి పంపుట విధిచేయబడినది. ఇందువల్ల కేంద్రప్రభుత్వమున కొసగిన యధికారము బలపరుపబడినది.

10 న్యాయ పరిపాలనము.

ఆంగ్లేయచక్రవర్తిగారి పౌరులు కంపెనీయొక్క సిబ్బందీలో నున్నను — లేకపోయిననుగూడ హిందూదేశమునందొనరింపబడిన నేరములకై, హిందూదేశమునందునను— సీమయందునుగల కోర్టుల యధికారమునకు లోబడియుందురని సిద్ధాంతీకరింపబడినది.

కంపెనీవారి యుద్యోగస్థులుగాని — ప్రభుత్వముచే నియమింపబడిన యుద్యోగస్థులుగాని ఎవరినుండియైనను బహుమతులుదీసికొనుట, బలవంతముగ లాగికొనిన ధనార్జనక్రింద పరిగణింపబడినది. (Extortion). డైరక్టరుల ఆజ్ఞలనుల్లంఘించుట రాజద్రోహముగ పరిగణింపబడినది. ఏయుద్యోగమునైనను మానుకొనుటకు— లేక, ఉద్యోగమును సంపాదించుటకు బేరములను సాగించుటయు విద్రోహనేరముగ పరిగణింపబడినది. న్యాయస్థానమున శిక్షింపబడిన కంపెనీనౌకర్లెవరిపైనను శిక్షతగ్గించుటగాని, రద్దుచేసి విడుదలజేయుటకుగాని, లేక, న్యాయస్థానశిక్షచే నౌకరీనుండి తొలగించి వేయబడినవారికి తిరిగి కంపెనీ ఆనౌకరీ నొసగుటకుగాని వీలులేదు. కంపెనీయందలి పెద్దయుద్యోగస్థులు సీమకు మరలిపోయిన వెంటనే ప్రమాణముచేసి వారు సంపాదనమునుగురించి సత్యము ప్రకటింపవలసియున్నది. ప్రొప్రయిటర్లకోర్టులో నాల్గింట మూడువంతుల మందిచే ఆమోదింపబడినప్పుడే అయిదుసంవత్సరములకు పిమ్మటతిరిగి పెద్దయుద్యోగస్థులకు హిందూదేశమునం దుద్యోగములభించుట కవకాశము గలిగింపబడినది. విద్రోహనేరము జేసిరను నేరముమోపబడినవారు సీమలో విచారింపబడుటకు శాసింపబడినది. ఇందులకు ప్రత్యేకన్యాయస్థానము తాత్కాలికముగ సృష్టింపబడుట కేర్పాటు. ముగ్గురు న్యాయమూర్తులు — నలుగురు లార్డులు (Peers)— ఆరుగురు కామన్సు సభ్యులుగలిసి ప్రత్యేకన్యాయస్థానముగ

నేర్పరుపబడి, లంచగొండితనపు కేసులను విద్రోహపు కేసులను విచారించుటకై పూనుటకు శాసింపబడినది. ఈశాసన నియమము తిరిగి 1786 లో సవరింపబడినది. కాని, ఆచరణయందెన్నడును నుంచబడలేదు. ఈనియమము శాసనమున కలంకారవస్తువుమాత్రమే అయినది. సివిలుసిబ్బందీ — సైనిక సిబ్బందీలలో అనవసరమగు సిబ్బందీని తగ్గించుటకు డైరక్టరుల కధికార ముంచబడినది కౌన్సిలరు లకు తక్కువపదవియందలి సిబ్బందీయు, సర్వసైన్యాధిపతికంటె తక్కువపదవి యందలి సైనికసిబ్బందీయు వారివారి యుద్యోగకాల పరిమితులనుబట్టియే నియ మింపబడుటకు నిర్ణయింపబడినది. డైరక్టరుల ఆజ్ఞతోమాత్ర మీప్రత్యేక నియ మోల్లంఘనకు సావకాశము గలిగింపబడినది. 15 సంవత్సరముల వయస్సునకు లోబడినవారిని లేక, 22 సంవత్సరములకుపైబడినవారిని హిందూదేశమునకు సైనికులుగ బంపరాదని నిషేధింపబడినది. సైన్యమునందొకఏడు పనిచేసి యుండినచో మాత్రము 25 సంవత్సరములు దాటిననుగూడ సైనికునిగ వంపవచ్చును.

గవర్నరుజనరలునకును, గవర్నరులకును ప్రత్యేకాధికార మొసగబడినది. అధికారమునందున్నవారితో రహస్యముగ నుత్తరప్రత్యుత్తరములను జరుపు వారిని అరెస్టుచేయుట కధికార మొసగబడినది. కాని, యీయధికార మెప్పు డును వినియోగింపబడలేదు.

"పిట్టుగారిశాసనము ననుసరించి డైరక్టరులయధికారము తీసివేయబడినట్లు గోచరించుచున్నను, డైరక్టరులసంఘమే పిమ్మటగూడ పరిపాలించినదనుట నిశ్చయము" 1 కమీషనరులబోర్డు నూతనరాజనీతి యుద్భవించెడి సంస్థగాలేదు. అది పరిశీలనసంస్థమాత్రమే యయినది. క్రమక్రమముగ బోర్డు సక్రమముగ పని చేయలేదు. మొట్టమొదట పిట్టుగారును, డండాసుగారును మీటింగులకు హాజ రగుచుండెడివారు. పిమ్మట డండాసుగారొక్కరే పనిజేసియుండిరి.

1793 వ సంవత్సరములో యీకమీషనరులబోర్డు (ప్రెసిడెంటు) అధ్యక్షు నకు జీతముగూడ నేర్పరుపబడినది. మిగిలిన యిరువురుసభ్యులకుగూడ జీతము

1. Keith. P. 98.

లేర్పరుపబడినవి. కమీషనరుల ముగ్గురకును సాలు 1 కి పౌ 5000 ల జీతము నిర్ణయింపబడినది. వీరిఫీసుఖర్చులక్రింద సాలు 1కి పౌ 11,000 లు మంజూరు చేయబడెను. కమీషనరులిరువురును ప్రీవీకౌన్సిలు సభ్యులుగానుండనవసరము లేదనిగూడ సవరింపబడినది. మొత్తముమీద బోర్డు పరిపాలన మధ్యక్షుడొక్కడే నిర్వహించుచుండెడివాడు. ఈఅధ్యక్షుడే ఆచారరీత్యా హిందూదేశరాజ్యాంగ కార్యదర్శియయినాడు. హిందూదేశవ్యవహారములు, యితర అధినివేశరాజ్యముల వ్యవహారములవలెనే ఆంగ్లేయమంత్రివర్గమువారి సమాలోచనకు బోవుచుండెడివి. ఈబోర్డే, రానురాను ఇండియాకౌన్సిలుక్రింద మారినది.

11
పిట్టుశాసన
సవరణశాసనము.
1791.

ఆచరణయందు పిట్టుగారి శాసనముసవరింపబడుట యత్యవసరమైనది. కారన్‌వాలీసుగారు గవర్నరుజనరలుగా నియమింపబడినారు. ఈయన, ఆయన కౌన్సిలుతీర్మానములను రద్దుచేసి తనయిష్టమువచ్చినట్లు వర్తించుట కధికారమొసగినగాని గవర్నరుజనరలుపదవి స్వీకరింపనిచ్చగింపలేదు. ఇట్టి నిరంకుశాధికారమొసగుటకు బ్రూకుప్రభృతులంగీకరించియుండలేదు. గవర్నరుజనరలుగాను–సర్వసైన్యాధిపతిగనుగూడ నొక్కరే యుండుటగూడ తటస్థించుటచే నిరంకుశాధికారమొసగదగదని బ్రూకుగారివాదము. అయినప్పటికి 1791 లో గవర్నరుజనరలుగారికిట్టి నిరంకుశాధికారమొసగుచు పిట్టుశాసనము సవరింపబడినది. ఈసవరణశాసనము ననుసరించి గవర్నరుజనరలును నియమించుటకు ఆంగ్లేయరాజునకుగల యధికారముగూడ తొలగించివేయబడినది. కాని, ఏయుద్యోగినైనను, రాజుగారు సీమకుమరలించివేయుట కధికారమును గల్గియే యుండిరి.

12
పిట్టుశాసనము.
రెండవ సవరణ
శాసనము.

రెండవ సవరణశాసనమునను సరించి సీమకు మరలిపోయిన ఉద్యోగస్థులు తమఆస్తులను గూర్చి చేయవలసిన ప్రమాణము రద్దుచేయబడినది. లంచగొండితనమును శిక్షించుటకై మొదటిశాసనమునందు నిరూపింపబడినకోర్టుగూడ అంగనిర్మాణమునందు సవరింపబడినది. ఈ శాసనమునందే హిందూదేశమునందలి కోర్టులయధికారవిస్తీర్ణత నిర్వచింపబడినది.

కలకత్తాయందలి సుప్రీముకోర్టునకు అధికారపూర్వకముగ కొనసాగింపబడు వర్తకమునకు సంబంధించిన క్రిమినలునేరములవిచారణ జరుపుట కధికార మొసగబడినది. (With in the limits of the Chartered trade). మదరాసు నందుగల మేయరుకోర్టునకును, గవర్నరు–కౌన్సిలునకును–సివిలు, క్రిమినలు అధికారము లొసగబడినవి. కోరమాండలు సముద్రతీరమునందలి కంపెనీ వారి రాజ్యభాగములయందు నివసించు ఆంగ్లేయపౌరులందరిపైనను యీకోర్టుల కధికార మొసగబడినది. కర్నాటక దేశమున, ఉత్తరసర్కారులందున, దక్కను సుబేదారు రాజ్యభాగములయందునను, ఆర్కాటునవాబు రాజ్యమునందునను, తంజావూరు రాజ్యమునందుననుగల ఆంగ్లేయపౌరులమీదగూడ సివిలు, క్రిమినలు కేసుల విచారణాధికార మొసగబడినది.

13 సైన్యము ; రాజ్యాంగసమస్య.

1781 వ సంవత్సరమునకు పూర్వము హిందూదేశమునకు పంపబడిన సైన్యమునకంతకు నగుఖర్చు ఆంగ్లేయప్రభుత్వమే భరించుచుండెడిది. కాని యీయేడీపద్ధతి మార్చబడినది. కంపెనీకోరికపై అంతటినుంచియు హిందూదేశమునకు పంపబడే ప్రతి 1000 మందిగల సైనికదళము 1కి సాలుసరి రెండులక్షల రూపాయిలు ప్రభుత్వమునకొసగునటుల శాసింపబడినది. కంపెనీకి తనంతటతాను ఆంగ్లేయసైనికదళముల నేర్పరచుకొనుట కధికార మొసగబడినది. శిక్షణకు లోబడని వారిని దండించుటకుగూడ కంపెనీకధికార మొసంగబడినది. 1785-6 సంవత్సరములలో సైనికబలగమెంతయుండవలెనను విషయచర్చ వచ్చినది. 1787 సంవత్సరమున ఆంగ్లేయప్రభుత్వము నాలుగుసైనికదళములను పంపుటకుగూడ నిర్ణయించినది. (Four Regiments). ఈదళములలో 75 మంది దళనాయకులను కంపెనీవారే నియమించవచ్చుననిగూడ కంపెనీకి సౌకర్యముగలిగింపబడినది. అయినను కంపెనీ కీయేర్పాటు నయించలేదు. అయిష్టమును ప్రకటించినది. అందువల్ల ఆంగ్లేయప్రభుత్వము మరియొక శాసనమునుగావించినది. ఈశాసనమునునరించి సైన్యమును హిందూదేశమునకు పంపుటకు బోర్డునకధికారమొసగబడినది. కాని యిందులకగుఖర్చులను కంపెనీఎంతవరకు భరింపవలసియున్నదియు నిశ్చయింపబడినది. డైరక్టరులఅనుమతిలేనిదే, బోర్డువారే

యుద్యోగిజీతమునుగాని, గౌరవభృతినిగాని వృద్ధిజేయుట కధికారములేదని నిరూపింపబడినది. డైరక్టరులసంఘము సాలుసరి జమాఖర్చులపట్టికను బోర్డువారికి దాఖలుజేసికొనుచుండుట విధిగా నొనరింపబడినది.

ఈశాసనము విపరీతవాదోపవాదములకు గుఱియైనది. సైనికదళములపై సంపూర్ణాధికారమంతయు ప్రభుత్వమునకుండవలయునని పిట్టుగారి దృఢాభిప్రాయము. కంపెనీసైన్యములను, ప్రభుత్వసైన్యములను నేకీభవింపజేసెడి పతకముండవలయునని కార్నవాలీసు మొదలగువారి యభిమతము. 1787లో నీవిషయమై మరల చర్చింపబడినది.

14
1793 సం॥
అధికారపత్రము

ఇంతలో కంపెనీవారి యధికారపత్రపుకాలపరిమితి సమీపించినది. ఆనాడు పిట్టుగారు సంపూర్ణాధికారమునందుండిరి. డండాసుగారు భారతీయవ్యవహార విజ్ఞాని. ఫ్రాంసు దేశముతో యుద్ధము ఆంగ్లేయుల దృక్పథమునంతయు కేంద్రీకరింపజేసినది. కంపెనీఆర్థికస్థితి సుస్థితిగానున్నది. పార్లమెంటులో వాదోపవాదములకు సావకాశములేదు. 1793 వ సంవత్సరమున కంపెనీవారికి తిరిగి సునాయాసముగ పార్లమెంటు అధికారపత్రమును శాసనముగావించినది. ఈఅధికారపత్రమునననుసరించి బోర్డుసభ్యులజీతములన్నియు హిందూదేశాదాయమునుండియే యిచ్చునటుల నిర్ణయింపబడినది. కంపెనీవారికి మరి 20 సంవత్సరములవరకు వర్తకాధికార మొసగబడినది. కంపెనీకి తనలాభములను 100 కి 10 వరకు పంచిపెట్టుటకు స్వాతంత్ర్య మొసగబడినది. కొన్నిషరతులకులోబడి ప్రభుత్వమునకు పౌ 500,000 లు కంపెనీయిచ్చుకొనునట్లుగ విధింపబడినది. కాని ఆచరణయందుంచబడలేదు. కంపెనీయొక్క ఆదాయమునంతయుగూడ అవసరమనిదోచినయడల సైనికసంరక్షణకొరకు వినియోగించుటకు రాజుగారి కధికార మొసగబడినది. హిందూదేశమునందుపయోగింపబడుచుండిన సైన్యమునకగు సరియగు ఖర్చంతయు కంపెనీయే భరించునట్లుగ శాసింపబడినది. కాని 1792 వరకుగల లావాదేవీ లన్నియు ప్రభుత్వము రద్దుజేసివేయుటమూలముగ కంపెనీ ప్రభుత్వమున కొసగవలసిన ఋణమంతయు నివారణమైనది.

హిందూదేశ రాజ్యాంగమునందుగూడ మార్పుజనించినది. డైరక్టరుల సంఘము ప్రత్యేకించి సర్వసైన్యాధిపతిని నియమించినది. ఈయన గవర్నరు జనరలు కౌన్సిలులో సభ్యుడు. గవర్నరుజనరలుగారికి యితర రాష్ట్రముల సివిలు, మిలిటరీపరిపాలనమంతయు లోబడియుండునని విస్పష్టముగ నిర్వచింపబడినది. కౌన్సిలునిర్ణయములను జనదాటివర్తించుటకు గవర్నరుజనరలుగారికిగల యధికారము మరల నొక్కిచెప్పబడినది. కాని, న్యాయవిచారణవిషయములలోను, పన్నులను విధించుటలోను, శాసనములనుగావించుటలోను, నిరంకుశాధికారము వర్తించదని నిర్ణయింపబడెను. గవర్నరుజనరలుగారితరరాష్ట్రములకుబోవునప్పుడు, వైసుప్రెసిడెంటును ఆయనస్థానమునందు పనిచేయునట్లుగ నియమించుచుండవలయును. హిందూదేశమునుండి ఏపెద్దయుద్యోగియైనను అనుమతిలేనిదే సీమకుబోయినచో, అట్టియుద్యోగి తనపదవికి రాజీనామానిచ్చినట్లుగనే యెంచబడునని నిర్ణయింపబడినది. గవర్నరు—గవర్నరుజనరలు సర్వసైన్యాధిపతులను నియమించునపుడు రాజుగారియనుమతినిపొందుట కంపెనీయొక్క విధి.

కలకత్తాయందలి సుప్రీముకోర్టునకు నావికాన్యాయవిచారణపైగల యధికారము సముద్రములమీదకుగూడ విస్తరింపజేయబడినది. గవర్నరుజనరలును-ఆయనకౌన్సిలును, రాష్ట్రములందు మేజస్ట్రీటులను, జడ్జీలను (Justices of the Peace) నియమించుచుండుట కధికారమొసగబడినది. ఇట్టివారు ఆహ్వానింపబడినపుడే వచ్చిపాల్గొనుట కధికారమును గలిగియుండిరి. మద్య విక్రయమునకై లైసెన్సు లుండవలెననిగూడ నిరూపింపబడినది.

(After Board of Control - Administration)

# 15 ఇండియాకౌన్సిలు అనంతర పరిపాలనము.

## 1786-1793.

(Cornwallis and external relations)

1784 వ సంవత్సరశాసనమును, 1793 వ సంవత్సరశాసనమునుగూడ భారతదేశమందలి రాజ్యభాగములకును, చక్రవర్తిగారి సర్వాధికారమునకును

గలసంబంధము విస్పష్టపరుపలేదు. 1783 లో గావింపబడిన వెర్సలీసు సంధియు (13 వ నిబంధన) సందిగ్ధముగనే యుంచబడినది. వంగదేశమునందలి ఫ్రాన్సు వారి ఫేక్టరీలు వారికొనగుటకును, వారివర్తకమునచ్చుటను, కోరమాండలుతీరము నందును, మలబారునందునను, సంరక్షించుకొనుటకును ఒడంబడిక గావింప బడినది. ఫ్రాంసు వారిహక్కులకు సంబంధించిన పేచీలు సంభవించినవి. 1786 వ జూలై 19 వ తేదీని రహస్యపు విచారణసంఘము (Committee of Secracy) దివానుగికీయబడిన, సామాన్యముగనుండు పెత్తనవార్తనముగ నిర్వచించి సంతృప్తి గాంచినది. (General controlling power as diwan). కాని, హిందూ దేశమునకు సర్వాధికారముతో పంపబడిన గవర్నరు జనరలగు కార్న్‌వాలీసుగా రీనిర్వచనమునకు 1786 వ నవంబరు 16 వ తేదీని, తమయసమ్మతిని వెల్లడించిరి. దీనివెనువెంటనే 1787 వ ఫిబ్రవరి 6 వ తేదీని బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములపై సీమవారికి సర్వాధికారము లభించినదని పారిసునగరమున వడెను గారు నుడివిరి. వీరినిర్వచనమునకు పారిసుఒడంబడిక యందలి రెండవనిబంధన మును, వెర్సలీసు ఒడంబడికను ఆధారముగ గైకొనిరి. ఈనిర్వచనమును ఫ్రెంచివా రంగీకరించలేదు. ఈనిర్వచనమునకు కారణమేమి?

"కారనువాలీసు హిందూదేశ వ్యవహారములపట్ల అనుభవజ్ఞుడుకాడు. వారన్ హేస్టింగ్సువలెనైనను హిందూదేశ సాంప్రదాయములయందు గౌరవము గలవాడుకాడు"1

1 కారనువాలీసు యొక్క ముఖ్యాదర్శము.

తన కార్యనిర్వాహకవర్గమునకుగూడ లోబడనవసరములేని నిరంకుశాధికారముతో కార్న్‌వాలీసు హిందూదేశమునకు గవర్నరు జనరలుగా వచ్చుటయందునను, యీయననే, కోరనయధికారమును ప్రసాదించి గవర్నరు జనరలుగా బ్రిటిషుప్రభుత్వము పంపుటయందునను గూడ నొకముఖ్యోద్దేశ్యమున్నది. ఆకాలమున జరిగిన అమెరికాస్వాతంత్ర్య సంగ్రామమున కారనువాలీసు, అమెరికాయందు గవర్నరు జనరలుగానున్నాడు. అమెరికాదేశమును ఆంగ్లేయులవశమునుండి

1. Keith. 102.

జారవిడిచినాడు. అమెరికాను జారవిడిచినందులకై కారన్‌వాలీసుపై ఆంగ్లేయుల కందరకు అసహ్యముగనున్నది. అవిశ్వాసకారకుడైనాడు. ఈకాలమునందు, పిట్టుగారే ఆంగ్లేయప్రభుత్వ ప్రధాని. అమెరికాదేశమును గోల్పోవుటలోగల అప్రదిష్ట యీయాయనకుగూడ సంభవించినది. గోల్పోయిన అమెరికాకు మారుగ హిందూదేశమున ఆంగ్లేయసామ్రాజ్యమును స్థాపింపవలెనని వీరిరువుర కును సంకల్పముద్భవించినది. ఈసంకల్పమును దీర్చుకొనుటకే కారనువాలీసు తనపదవినంతయు వినియోగించినాడు. హిందూసామ్రాజ్యమును ఆంగ్లేయులకు నిర్మించియిచ్చి అమెరికాను గోల్పోయిన అప్రదిష్టనుమాపివేసికొనుటయే కారను వాలీసుయొక్క నిశ్చితాభిప్రాయము.1 ఇంపులకుతోడుగ కారన్‌వాలీసు గుణవంతుడుగాడు. త్రాగుబోతు.2 1786 సెప్టెంబరులో కారన్‌వాలీసు హిందూదేశమునకు వచ్చినదిమొదలు ఆయనదృక్పథము రాజ్యస్థాపనవంకకే మరలినది. ఈదృక్పథమును ఆంగ్లేయప్రభుత్వ మామోదించుచు, నిరంతర ప్రోత్సాహ మొసగుచు వచ్చినది. ఈరాజ్యనిర్మాణ తృష్ణయే పాటినందు, పడెను, బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రములయొక్క సర్వాధికారమును ప్రకటించుటకుగల హేతువు.

2
మొగలాయిచక్రవర్తి దుస్థితి.

ఆంగ్లేయరాజ్యతృష్ణకు నాటిభారతదేశ పరిస్థితులుగూడ సానుకూలముగ నున్నవి. ఢిల్లీచక్రవర్తి నామమాత్రావ శేషముగ నున్నాడు. సామంతరాజులందరు సాంప్ర దాయసిద్ధముగమాత్రమే గౌరవించుచున్నారు. అధి కారమును మాత్రము ధిక్కరించివేయుచున్నారు. ఈధిక్కరణమును ఆంగ్లేయ ప్రభుత్వము రెచ్చగొట్టసాగినది. అయినను సామంతరాజులు కప్పముకట్టుచునే యున్నారు. మశీదులయందాయనపేరు స్మరింపబడుచునేయున్నది. కాని, ఎవరికివారు రాజ్యములను స్థాపించుకొనుటకై యత్నములను గావింపసాగిరి. 1724 లో అజఫ్‌జాయను వజీరు హైదరాబాదులో రాజ్యమునుస్థాపించినాడు.

1. See. the rise of the Christian power in India. B. D. Basu, p. 266-267.

2. Lecky in his History of England Cabinet Edition Vol vii p.p. 197.

టిప్పుసుల్తాను స్వాతంత్ర్య రాజ్యమును స్థాపించినాడు. 1784 లో సింధియా మహారాజు చక్రవర్తియగు షాఆలెముయొక్క ప్రధానమంత్రిగ నియమింపబడినాడు. (Wakil i Mutlak). మొగలాయి చక్రవర్తియొక్క సైన్యమునకంతకును నధినేతగా నియమింపబడినాడు. ఢిల్లీ - ఆగ్రా రాష్ట్రములపై చక్రవర్తి స్థానమున పనిజేయుటకై నియోగింపబడినాడు. హిందూసామ్రాజ్యమును స్థాపించుటకే పీష్వా ఈవిధముగ చక్రవర్తికడ ప్రధానిగ నంగీకరించుటకుగల కారణమని కొందరిమతము.1 1788 వ సంవత్సరమున గులాముఖాడీరాను, రోహిలాచక్రవర్తిని పట్టుకొని గ్రుడ్డివానిగ జేసివేసినాడు. సింధియా యీయనను తుంటరుల పాలనుండి సంరక్షించినాడు. ఈవిధముగ ఢిల్లీచక్రవర్తియొక్క అదృష్టము దినదినము క్షీణించుచున్నది. ఈదుస్థితిలో ఢిల్లీచక్రవర్తియొక్క సంరక్షకుడుగానున్న సింధియాచక్రవర్తిగారి పక్షమున 1792 లో దివానుగిరీ యొసంగినందులకై నిర్ణయింపబడిన కప్పమును చెల్లించవలయునని కారన్‌వాలీసును కోరియుండెను.

చక్రవర్తి కొసగవలసిన కప్పము తెగగొట్టుట.

నాటివరకునుగల న్యాయమును - ధర్మము ననుసరించియు సిద్ధాంతము ననుసరించియు ఆంగ్లేయులు- మొగలాయి చక్రవర్తియొక్క పౌరులు, అధీనులు. ఆంగ్లేయులు హేస్టింగ్సు నిర్ణయించినప్రకారము కప్పముకట్టితీరవలయును. వారన్ హేస్టింగ్సుకాలమువరకుగూడ నీకప్పమును గట్టుచు వచ్చిరి. వారన్ హేస్టింగ్సు సింధియాతో సంధిచేసికొని, వృద్ధుడగు ఢిల్లీచక్రవర్తిని మహారాష్ట్రరాజునకు కైవశమొనరించి, చక్రవర్తికొసగవలసిన కప్పమునెగరగొట్టివేసినాడు. కప్పమునిచ్చివేయుట ఆంగ్లేయులవిధి. అయిననేమి? కారన్‌వాలీసు కప్పము నెగగొట్టుటయే న్యాయమని తలంచినాడు. కప్పము నెగరగొట్టుటయేగాక బెంగాలు, బీహారు, ఒరిస్సాలపై చక్రవర్తికెట్టి యధికారమునులేదనిగూడ వ్రాసినాడు. చక్రవర్తిపట్ల, రాజభక్తినిచూపవలసిన యవసరముగాని, విధేయతగ నుండవలసినపనిగాని లేదనినాడు. నశింపసాగిన మొగలాయి సామ్రాజ్యమునకు గోరీ కట్టజూచుటయే కారన్‌వాలీసు యుద్దేశ్యము. కాని,

1. Keith p. 102.

సంరక్షణముగాదు. అట్లు సంరక్షించుట రాజనీతిజ్ఞుని ధర్మముగాదని యీయన విశ్వాసము.1

3 సూరతును దిగమ్రింగుట.

ఈవిధముగనే 1790 లో సూరతునవాబు చనిపోయినపుడు, చక్రవర్తినుండి సూరతును దఖలుపరచుకొనుటకు సనదు వ్రాయించి తీసికొనవలెనని కంపెనీసూచించినను కారన్ వాలీసావిధముగ నొనరింపలేదు. సనదుగైకొనుట చక్రవర్తియొక్క అధికారమును గుర్తించుటయని కారన్ వాలీసు తలంచి సనదు గైకొన నిరాకరించినాడు. 1759 వ సంవత్సరము మొదలు నవాబుపక్షమున, నవాబుకొరకుమాత్రమే యీసూరతుకోటను కంపెనీవారి యధీనముసంచుకొనిరి. ఇంతతో దౌర్జన్యశక్తిని నిరూపించి, సర్వహక్కులతోను కారన్ వాలీసు దఖలుపరచుకొనినాడు.

ఈవిధముగనే వంగమునకు నశీరు, ఉల్, ముల్క్ (Nasir-Ul-Mulk) యొక్కవారసత్వమును ఢిల్లీచక్రవర్తియొక్క యనుమతితో నిమిత్తములేకుండగనే యంగీకరించినాడు.

హిందూదేశమునందు కంపెనీగూడ నొకపెద్ద స్వదేశసంస్థానముగ నైనదని కారన్ వాలీసు తలంపు, సామంతరాజుగ ఢిల్లీచక్రవర్తికి లోబడియున్నదనిగూడ కారన్ వాలీసు అంగీకరింప నిరాకరించినాడు.

అయోధ్యనవాబుపట్ల కారన్ వాలీసు ప్రదర్శించిన ప్రవర్తనమెంతమాత్రము గౌరవప్రదముగలేదు. ఈయన కట్టవలసినకప్పము 74 లక్షలనుండి 50 లక్షలవరకు తగ్గించెదనని యొకవంక జెప్పుచు, మరియొకవంక ఆంగ్లేయసైనిక దళములను రెండింటిని నవాబు పోషింపవలెనని బలవంతముజేసినాడు. వేరొకవంక నవాబుపోషించెడి సైన్యమును తగ్గించివేయుమనినాడు. వారన్ హేస్టింగ్సుతో గావించుకొనిన యొడంబడికప్రకారము ఆంగ్లేయసైన్యదళమును తీసివేయుమని అయోధ్యనవాబు కారన్ వాలీసును కోరియున్నాడు. అయిననేమి?

1. Cornwallis. i, 295.

"అయోధ్యనవాబు అశ్రద్ధకుడు, దుర్బారాకుడును, మూర్తీభవించియున్న వాడుగ, నవాబుయొక్క గుణములను కారన్‌వాలీసు వర్ణించియున్నాడు. ఆకాలమున, అయోధ్యరాజ్యమునకెట్టి భయోత్పాతము లేకపోయినను, కారన్‌వాలీసు ఫట్టీఘరు (Futty Ghur) నందుంచిన ఆంగ్లేయ సైనికదళముల కగుఖర్చు అయోధ్యనవాబు కంపెనీకొసగవలసిన కప్పముకంటె హెచ్చుగనున్నది. కారన్‌వాలీసు, నవాబు ఆంగ్లేయసైన్యములను పోషించితీరవలయుననుతన నిశ్చితాభిప్రాయమునుండి మారలేదు. సైన్యదళములను తీసివేయలేదు. 1

4 కర్నాటక రాజ్యస్థితి; తంజావూరు.

తంజావూరును ఆంగ్లేయాధిపత్యమునకు దెచ్చుకొనిన యుదంతము మిగుల ఆశ్చర్యకరము. కోరమాండలు సముద్రతీరమునందు ఆంగ్లేయులతో మైత్రి గావించుకొనిన రాజులలో తంజావూరు రాజు ప్రధమరాజు. 1742 లో జరిగిన అంతర్విప్లవమువల్ల రాజు పదభ్రష్టుడయినాడు. ప్రతాపసింగు రాజ్యమునకు వచ్చియున్నాడు. నాటికి ఆంగ్లేయులకీ రాజ్యవిషయమునందు స్వప్రయోజనము లేదు. నూతనరాజ్యాధికారము ఆంగ్లేయులచే అంగీకరింపబడినది. ఈరాజుతో, ఏడుసంవత్సరములుమైత్రితో, ఆంగ్లేయు ఉత్తరప్రత్యుత్తరములు నడిపిరి. కాని ఇంతలో పదభ్రష్టుడైన షాహూజీ ఆంగ్లేయులతో డ్పాటు సర్ధించెను. ఈ తోడ్పాటునకై 'దేవకోట' కోటను ఆంగ్లేయులకిచ్చుటకును, విప్లవమునకగు ఖర్చులను తానుభరించుటకును అంగీకరించియుండెను. ఈయొడంబడికననుసరించి ప్రతాపసింగును పదభ్రష్టుని చేయుటకై ఆంగ్లేయసైన్యము పంపబడినది. ఫ్రెంచివారితో, ఆంగ్లేయులపోరాడుటకు, ప్రతాపసింగు, తోడ్పాటును గూడ అంతకుముందే పొందియుండిరి. ప్రతాపసింగును పదభ్రష్టుని జేయుటకై ఏకారణమునుగూడ నాటిమదరాసు ప్రభుత్వము జూపజాలదు. అయినను ఆంగ్లేయ ప్రయత్నము విఫలమైనది. రెండవపర్యాయము షాహూజీని పదభ్రష్టునిజేయుటకు మారుగ దేవకోటను ముట్టడింపనిశ్చయించుకొనిరి. ముట్టడించి స్వాధీనమొనరించుకొనిరి. ఈవిధముగ కోటను వశమొనరించుకొనిన వెంటనే తిరిగి ప్రతాపసింగుతోనే సంధిజేసికొనిరి. దేవకోటయు, దానిపరిసరప్రాంతములను

1. See. Mill. vol. v. p. 222.

ఆంగ్లేయ రాజ్యభాగములుగ గావించుకొని, ప్రతాపసింగునకు కొంతమనో వర్తినొసంగబూనిరి. ఇదియే, ఆంగ్లేయులయుద్ధమువల్ల రాజ్యమును సంపాదించుటకు మొదటిసారి. హిందూస్థానమునుజయించుటకై గావింపబడినప్రయత్నములలో నిదియే ప్రథమము"1

"కర్నాటకయుద్ధములో మంకోజీనాయకత్వమున, తంజావూరుసేనలు ఫ్రెంచివారికి వ్యతిరేకముగ ఆంగ్లేయులపక్షమున పోరాడినవి. ఈవిధముగ ఆంగ్లేయులకు తోడ్పడుటలో తంజావూరురాజులు త్యాగమునొనరించియున్నప్పటికిని, మహాభాగ్యవంతమైన దేశముగ సుప్రసిద్ధినిగాంచిన, తంజావూరు రాజ్యముపై పగదీర్చుకొన యత్నించిన నవాబుమహమ్మదాలీకిని తంజావూరురాజునకును 1762లో ఆంగ్లేయులు మధ్యవర్తి తనమునువహించి సామంతరాజుగా నొనరించిరి. తంజావూరు రాజు మహమ్మదాలీకి సాలుసరి 4 లక్షలుకప్పముగట్ట నట్లేర్పరచి, అందులకు ఆంగ్లేయులు హామీనొసంగిరి. తిరిగి 1771లో ప్రతాపసింగుకుమారుడైన తులసాజీపైకి, నవాబు మదరాసుప్రభుత్వసహాయముతో యుద్ధమునకుబోయినాడు. తులసాజీ సంధిగావించుకొనవలసినవాడైనాడు. ఈసంధివల్ల తంజావూరురాజ్యముపై అత్యధికఆర్థికభారము మోపబడినది. ఈరెండవసంధిలో దురాశాపాతకుడగు మహమ్మదాలీయొక్కయు, ఆయనఆంగ్లేయపెట్టుబడిదారులయొక్కయు తృష్ణదీరినది. ఈపెట్టుబడిదారులగు ఆంగ్లేయులే, మదరాసు ప్రభుత్వరాజనీతిని నడిపిరి. 1762 వ సంవత్సరమునందాంగ్లేయులొసగినహామీ, గాలికెగరగొట్టబడినది. 1773 లో తిరిగి ఆంగ్లేయులసహాయముతో నవాబు, తంజావూరును భ్రష్టమొనరింపసాగినాడు. రాజు ఖయిదీగా బంధింపబడెను. తంజావూరు ముట్టడింపబడి స్వాధీనపరచుకొనబడినది. ఈవిధముగ తన స్వంత బాధ్యతపై మదరాసు ప్రభుత్వము విశ్వాసద్రోహ మొనరించినది. ఇందులకు నవాబుయొక్క పెట్టుబడిదారులగు ఆంగ్లేయులు బాధ్యులు." 2

"ఇట్టివిశ్వాస ద్రోహములతోనే తంజావూరురాజులు తిరిగి ఒడంబడికలను

---

1. See, Torrens in his Empire in Asia p. p. 20-21. Panivi office reprint.

2. Writes Mr. Ranade and quoted by B. D. Basu. The rise of Christian power P. 352.

గావించుకొనిరి. ఎంతటిదురదృష్టము." 1 1787 లో మొట్టమొదట యొడంబడికగావింపబడినది. ఈఒడంబడికయే రెండవయొడంబడికకు, 1793 లో కారణమైనది. 1784 వ సంవత్సరశాసనము ననుసరించి పార్లమెంటీపరిస్థితులలో జోక్యముకలిగించు కొనదలంచినది. కాని, ఇండియాసంఘము తగునంత శ్రద్ధ వహించలేదు. 1787 సం|| ఒడంబడికననుసరించి 9 లక్షల పెగోడాలు రాజు కంపెనీవారికొసగుటకును, 7 లక్షల పెగోడాలు యుద్ధములక్రింద వారిరుణదాతల కొసంగుటకును నిర్ణయింపబడినవి. కంపెనీకి సంపూర్ణసైనికాధికారమొసగబడినది. యుద్ధసమయములలో పన్నులువసూలుచేయు నధికారము గూడ కంపెనీకొసగబడినది. ఈఒడంబడికలో 16 షరతులుగలవు. దురదృష్టవంతమగు నీతంజావూరురాజ్య మీషరతులను నెరవేర్పగలిగినంత భాగ్యవంతము కాకపోయినది. అంతతో సం|| 1787 పు ఒడంబడికరద్దయినది. ఈయొడంబడికనుగావించుకొనినరాజు అమరసింగు. తనరాజ్యసంరక్షణమునకై భరించజాలని కప్పమును యీస్టిండియాకంపెనీకి అర్పించజాలకపోయినాడు.

అమరసింగు తులజాజీయొక్క సవతితమ్ముడు. తులజాజీ అపుత్రకుడు. మరణకాలమున సరబోజీఅను నతనిని దత్తతజేసికొనెను. సవతిసోదరునికి మారుగ, అమరసింగు తంజావూరురాజయినాడు. సరబోజీదత్తత హిందూశాస్త్రానుసారముగలేదని నాడుతలంపబడుటయే యిందులకు కారణము. కాని, సరబోజీ మదరాసునకు గొంపోబడినాడు. అతనిచే గవర్నరుజనరలునకు అపీలు చేయింపబడెను. అపీలునందు సరబోజీయే సరియయినవారసుడని కారన్‌వాలీసు నిర్ణయించినాడు. "1798 లో తంజావూరు సింహాసనమునకు సరియగువారసుడు అమరసింగుకాడనియు దత్తుడగు సరబోజీయే వారసుడనియు తమకు సదుపాయకరముగ నుండుక్రొత్తవిషయము కనిపెట్టబడినది. ఈయిరువురు రాజులలో నెవరు సరియగు హక్కుదారు లనువిషయము కాలగర్భమునందే యిమిడియుండును. 2 ఈనూతన పరిశోధనమునకు సరబోజీకి సంరక్షకునిగ నున్నక్రైస్తవమిషనరీయగు సర్విజ కారకుడు. అమరసింగుని పదభ్రష్టునిచేసి సరబోజీని సింహాస

1. Basu P. 352.
2 See Mill Vol. vi. P. 216.

నాసీమునిగ జేయుటకును నీతను నిర్దించియేమియుగడు.1 ఇదియుకూడ అమర సింగును డించివేయుటకు తగినంతకారణముకాదు. అమరసింగు సరబోజీవల్ల క్రూరముగ వర్తించినాడని కొంపరిపుతము" 2 అంతమాత్రమున రాజ్యభ్రష్టుడు చేయబడెననుట సహేతుకముగలేదు.

అమరసింగును పదభ్రష్టునిచేసి సరబోజీని రాజ్యాభిషిక్తుని చేయుటలో కంపెనీప్రభుత్వమునకు స్వప్రయోజనముగలదు. క్రొత్తరాజుతో నొడంబడిక గావింపబడినది. పిత్రార్జిత రాజ్యమంతయు నీయొడంబడిక ప్రకారము ఆంగ్లేయ ప్రభుత్వమునకు ధారపోయబడినది. సరబోజీ గౌరవభృతిని పొందువాడైనాడు. ఈయనకు తంజావూరుకోటమాత్ర మొసంగబడినది. ఈవిధముగ కర్నాటకనవాబునకు పట్టినగతియే ఈమహారాష్ట్రవంశీకునికిగూడ దాపరించినది.

అమరసింగు నొక నేరస్థునిగాగూడ గమనించలేదు. నేరారోపణము లేదు. అతని సమాధానముగైకొనలేదు. ఈకృత్యముపట్ల తగినంతవిచారణ మవసరమని యొకకమిషను నియమింపబడవలెనని సీమలోనియధికారులు నిర్ణయించిరి. కాని, వెల్లస్లీ యాకమిషను నిరూపకమును ప్రతిఘటించినాడు.3 ఈవిధముగ అమరసింగును అన్యాయముగా రాజ్యభ్రష్టునిగాచేసి అనాథుడగు నెవరినో రాజ్యార్హుడనుట దురన్యాయమని గవర్నరుజనరలును, కంపెనీయును సర్. డేవిడుబెయిర్డుచే నిందింపబడియుండెను. 4

**నైజాము :** 5

నైజాముపట్ల కారనువాలీసుగారు జూపిన ప్రవర్తనము గూడ గౌరవప్రదముగలేదు. ఈయన ఇంగ్లండునుండి బయలుదేరునపుడే గుంటూరుసీమను నైజామునుండి తీసికొనవలెనని కంపెనీయాజ్ఞాపించినది. ఈపనిని సూటిగజేయుటకుమారుగ జిత్తుల

1. Basu. P. 353.
2. Harace hayman wilson. See Basu. rise of christian power. P, 353.
3. Wellesly's despatches 1-41.
4 Sir David Baird. (See The life of general, the Right Honourable Sir David Baird Vol. 1. p. p. 119 to know more details about the cruelties committed on the Raja Amir Singh and refer to B. D. Basu for a few quotations from the above book. See Basu. p. 354-357).

మారి నక్కవలెగాళించెను.1 గుంటూరుసీమను ధారపోయవలెనని జెల్పుట. లోనే నైజాము టిప్పుసుల్తానుతో నేకీభవించునేమో యని ఈయన భయము. నైజాము దుస్థితికిరాబడిన పిమ్మట హఠాత్తుగా కెన్వే (Kennaway) అను ఆంగ్లే యోద్యోగిని నైజాముదర్బారునకు పంపి గుంటూరుసీమ వశపరచుకొన బడునని చెప్పబడినది. "గుంటూరుసీమకావలెనను కోరిక కెన్వే నైజాముదర్బారునకు పోవువరకును నైజామునకు తెలియదు. మదరాసుగవర్నమెంటు ఏవో ప్రత్యేక కారణముల సాకున సైన్యమును సర్కారుల సమీపమునందుంచిరి. ఏయితరరాజ్యములవారుగాని అడ్డుతగులనేరనివిధముగ గుంటూరు సీమను అవసరమైన సైన్యబలముతోను, లేకపోయిన బెదరింపులతోను వశపరచుకొనుటకు తగిన సంసిద్ధతతో నున్నది.2 సైనికబలప్రదర్శనముతో నిమిత్తములేకుండగనే నైజాము గుంటూరు సీమను కారనువాలీసునకు తాకీదు ననుసరించి సమర్పించెను.

6 టిప్పుసుల్తాను మైసూరురాజ్యము.

టిప్పుసుల్తానుపట్లగూడ కారనువాలీసుగారినాటి రాజ్యనీతి ఈవిధముగనే వర్తింపజేయబడినది. "పార్లమెంటు గావించిన శాసననిబంధనలను (రాజ్యాక్రమణయుద్ధములను జేయరాదు) జవదాటరాదను తలంపు ఆశాసనతత్త్వమునే యుల్లంఘన మొనరింపజేసినది. 1768 వ సంవత్సరపు ఒడంబడికపిమ్మట హైదరాలీఖానునకును, ఆంగ్లేయ ప్రభుత్వమునకునుమధ్య రెండు ఒడంబడికలు జరిగినవి. 1784 లో ఆంగ్లేయప్రభుత్వము హైదరాలీ కొడుకగు టిప్పుసుల్తానుతో తిరిగి యొడంబడిక గావించుకొనినది. ఈఒడంబడిక ననుసరించి టిప్పుసుల్తానుయొక్క రాజ్యార్హతను, హక్కును ఆంగ్లేయప్రభుత్వ మామోదించినది. ఇట్లొనరించియు టిప్పుసుల్తానునకు వ్యతిరేకులగువారితో, టిప్పుపైకి దండెత్తనున్నవారితో ఒడంబడికను గావించుకొనుట టిప్పుసుల్తానునం దాందోళనము కలిగింపబడెనుట నిశ్చయము.

ఈయొడంబడికలో టిప్పుయొక్క రాజ్యభాగముల నాక్రమించుటకై వెంటనే యీయొడంబడికయందలి నియమముల నుపయోగించరాదనబడినది.

1. Basu. P. 268.
2. See Mill Vol. v. P. 222.

దీనిననుసరించియే కొంతకాలమున కాపని జరుగవచ్చునని తేలినది. ఇందువల్ల టిప్పుయొక్క ఆంకోళనము తగ్గుటకు సావకాశములేదు.

మరియు నైజామునకు, ఆంగ్లేయప్రభుత్వము సైనికసహాయము గావించుట కొడంబడికను గావించుకొనినది. ఈయొడంబడికలో నీ సహాయసైన్యము (Subsidiary force) కొందగు రాజులపైకి యుద్ధమునకుపోవునపు డుపయోగింప రాదను నిషేధముగలదు. అట్లుపయోగింపరాదని పేర్కొనబడిన రాజులలో టిప్పు పేరు పేర్కొనబడలేదు. (మహారాష్ట్రరాజులు అయోధ్య- ఆర్కాటు నవాబులు- తంజావూరు- తిరువాన్కూరు- రాజులుమాత్రమే పేర్కొనబడిరి.)1 "మిత వాదియు శాంతివాదియునని పొగడబడే యొక రాజకీయవేత్త, పరోక్షముగ నీరీతిని, పై గుణముల నాచరణయందుంచుటకై గావింపబడినశాసనమునే విస్పష్ట మగు యుద్ధకారణమగు నొడంబడికను గావించుకొని యుల్లంఘించుట గమ నార్హమైన విషయము.2

దక్షిణహిందూదేశమందలి ఇతరప్రభుత్వములు టిప్పుసుల్తానును కూల ద్రోయుటకై తోడ్పడనుండుటయే ఈవిధముగా కారనువాలీసు గావించుటకు కారణము. ఇతర రాజులతో గావించుకొనిన ఒడంబడికలను గౌరవించకపోవు టయే టిప్పుపై యితరరాజుల క్రోధమునకు హేతువు. మంగుళూరు (1784) ఒడంబడికకు కారణమైన టిప్పుసుల్తాను విజయముగూడ ఆంగ్లేయుల మనస్సులలో కలకవేయుచునే యున్నది. ఇందులకు కారనువాలీసు తనప్రతిభను ప్రకటన మొనరింపవలెనను నిశ్చయముతోడైనది. టిప్పు అప్రభంశపాలకుడనియు ప్రజలను హింసించెడివాడనియు వ్రాయబడిన వ్రాతలు సత్యములుకావు. ఆనాడు ఆంగ్లేయ ప్రభుత్వమునందున్న రాజ్యభాగములకంటె టిప్పుసుల్తానురాజ్యమే సస్య శ్యామలమై మనోహరముగ నుండెడిది.3 కాని టిప్పు తనఆంగ్లేయ శత్రువుల పట్ల క్రూరముగ వర్తించెనని మాత్రమంగీకరింపకతప్పదు. ఈవిధముగు పగలను లోపల నణచివైచికొని తిరువాన్కూరురాజాపైకి టిప్పు దండయాత్రను వెడల

1. See Malcolm's sketch of a political History of India p. p. 68-69 2nd Ed.

2. Historical sketches iii. 38. Colonel Wilks.

3. See. p. 27 India Reform Tracts; No IX Allahabad Reprint.

నున్నాడను నెపమున టిప్పుపై యుద్ధము ప్రకటింపబడినది. తిరువాన్కూరురాజు కంపెనీవారి మిత్రవర్గములోనివాడనియే కంపెనీ డీకొనుటకుసాకు. "కారనువాలీసు హిందూదేశమునకు వచ్చిననాటనుండియు టిప్పుపై దాడివెడలవలెనని సర్వప్రయత్నములును జేయుచునేయుండెను.1 స్వదేశరాజులతో జోక్యముకలిగించుకొనరాదను పార్లమెంటుశాసనము గాలికెగురకొట్టబడినది. నైజాము మహారాష్ట్ర రాజులతోగూడి టిప్పురాజ్యమును పంచుకొనుటకై నిర్ణయింపబడినది.

7 మదరాసు ప్రభుత్వమును బర్తరఫు చేయుట గవర్నరు జనరలు విపరీతాధికార ప్రయోగము.

మదరాసు ప్రభుత్వ మీయుద్ధమునకు వ్యతిరేకము. కారనువాలీసు మదరాసుప్రభుత్వమున నెన్నడుగాని యీ యుద్ధమునుగురించి సంప్రదించియుండలేదు. మదరాసు గవర్నరుగారగు హోలెండు "టిప్పుకంపెనీతో విరోధపడ వలెనని తలంచుటలేదనియు, తగవులను పరిష్కరించు కొనుటకై సంసిద్ధముగ నున్నాడనియు కారనువాలీసునకు తనకడపటిజాబునందు వ్రాసియున్నాడు. కాని యుద్ధమునకు సంసిద్ధముగనున్న కారనువాలీసున కామాటలు చెవికెక్కలేదు. మదరాసు గవర్నరగు హోలెండు గారిని ఉద్యోగమునుండి తప్పించివేసెను. ఆయనస్థానే మెడోసుగారు నియమింప బడిరి. పార్లమెంటుశాసనము నతిక్రమించుచు నిర్విఘ్నముగ నొడంబడికను భగ్న మొనరించుటకై పార్లమెంటుయొక్క ఆ శాసనమువల్లనే తనకు లభించిన విపరీతాధికారమును మదరాసుగవర్నరుమీద కారనువాలీసు ప్రయోగించినాడు. ఈరీతిగ అసంసిద్ధముగనున్న టిప్పుపై యుద్ధము ప్రకటించి అతనిని ఓడించి అతని రాజ్యమునం దరభాగము తీసికొనబడినది.2 మూడుకోట్ల ముప్పదివేలు నష్టపరిహారముక్రింద నొసగుటకు నిర్ణయింపబడినది. ఈషరతుల నెరవేర్చువరకు టిప్పు తనకొమారుల నిరువురను ఖయిదీలుగా నాంగ్లేయుల వశమందుంచుటకు కూడ నంగీకరింప జేయబడినాడు. 1792 ఫిబ్రవరి 23 తేదీని టిప్పుసుల్తానుతో ఆంగ్లేయ ప్రభుత్వమును, వారిమంత్రిమండలియు గావించుకొనిన ఒడంబడిక "ఈకాలమున హిందూదేశమునగల ఆంగ్లేయులు టిప్పుసుల్తానుపట్ల భయక్రోధపూరితులుగ

---

1. B. D. Basu, p 271.
2. See Mill Vol. v. p. 243 to know the inner workings of the Cornwallis to rage this war and to put down Tippu.

తయారైరి. అనాగరికులగు అడవిజాతులవారు వారిశత్రువులపట్ల ప్రవర్తించెడి వర్తనముతో నాటి ఆంగ్లేయులస్థితి పోల్చవచ్చును. (Savages) ఒకనాగరిక జాతి తన అతినీచమగు పరమశత్రువులపట్ల జూపు ప్రవర్తనముతో నెంతమాత్రమును పోల్ప వీలులేదు" అని మిల్లుగారు తమ చరిత్రయందు వ్రాసిరి.1

"యుద్ధమునజయించి రాజ్యము సంపాదింపబడినదని కారనువాలీసు ఒక్కడే గర్వింపగలడు. టిప్పూతో యుద్ధమునకు పూర్వ మొక అంగుళముమేర నేలయైనను యుద్ధమున జయించి సంపాదింపబడినదని ఆంగ్లేయులు చెప్పజాలరు. క్లయివునాటినుండియు రాజ్యతంత్రమువల్లను, దగావల్లను, అన్యాయముగ ఆక్రమించుకొనుటవల్లను మాత్రమె కంపెనీవారు రాజ్యభాగములను సంపాదింపగలిగిరి. యుద్ధమున జయించి రాజ్యభాగమును జయించినవారిలో కారనువాలీసే మొదటి ఆంగ్లేయుడు. సీమయందలి ఆంగ్లేయప్రభుత్వముగూడ కారనువాలీసునకుతోడ్పడినది. — వేలకొలది పౌనులు (500,000 సగటు) యుద్ధసహాయార్థము ఋణము నొసంగినది. ఆ సీమమంత్రివర్గము టిప్పూపై కారనువాలీసుగావించిన అన్యాయ యుద్ధ రాజనీతికి తాము తోడ్పడగలిగినంతవర కన్నిరీతుల తోడ్పడియుండిరి. ఈవిషయము లన్నియు గమనించుచో కోల్పోయిన అమెరికాకుమారుగ హిందూస్థానమున సామ్రాజ్యమును నెలకొల్పవలెనని వారు కృతనిశ్చయులై యుండిరనుటలో సందేహముండదు.2

8 ఫ్రెంచివారిపై దండయాత్రలు.

ఇంతియేకాదు హిందూదేశమునందు ఫ్రెంచివారికిగల రాజ్యభాగములన్నింటి మీదనుగూడ కారనువాలీసు దండయాత్రలను గావించినాడు. ప్రజాస్వామికవాదులగు ఫ్రెంచివారిని హిందూదేశమునుండి తరిమివేసిన గౌరవమును సంపాదించవలెనని కారనువాలీసు కుతూహలము. ఇది నెరవేరినది. కొంచె మించుమించుగ ఫ్రెంచివారి రాజ్యభాగమంతయు నాక్రమణ గావింపబడి, ఆంగ్లేయ బావుటాక్రిందకు తీసికొనబడినది. ఇది 1793 లో కారనువాలీసు హిందూదేశమునుండి వెడలిపోవు సమయమున గావింపబడినది.

---

1. See Mills History Vol. v. p 278-284; 243-245.
2. B. D. Basu. p. 275 Rise of Christian Power.

9 కంపెనీసైన్యము; చక్రవర్తిసైన్యము.

70,000 మంది సైనికులతో కారనువాలీసు తన యుద్ధనీతిని నడిపినాడు. "వీరందరు చాలనీచులు (Inferior Quality) ఇందులోనున్న 6000 మంది ఆంగ్లేయులు కంపెనీవారి సైనికులు. వీరందరు లండను నగరవీథుల యందలి తిరుగుబోతులు. జైళ్ళయందు పుట్టిపెరిగినవారు. ... ... వీరి యుద్యోగస్థులన్ననో చెడిపోయిన యువకులు, ధనకాంక్షాపరులు.

ఆంగ్లేయప్రభుత్వసేనయందు 5500 మంది ఆంగ్లేయు లుండిరి. వీరు కొంచెము శ్రేష్ఠులు. ఈ రెండురకముల సైనికదళములను కలిపివేయవలెనని కారనువాలీసు తలంచినాడు. కాని యిందులకు సావకాశము లభించలేదు.1

## 16. కారనువాలీసు రాజ్యాంగసంస్కరణములు.

ఇంక, కారనువాలీసుయొక్క రాజ్యాంగసంస్కరణములను గురించియు, పరిపాలనా విధానమును గురించియు యోజింపవలసియున్నది. 1781 వ సంవత్సరమునందు పార్లమెంటుచే నియమింపబడిన ప్రత్యేకోపసంఘము భారతజాతీయ జనసంఖ్యయొక్క ప్రయోజన సౌఖ్యములనుగూర్చి, హిందూదేశపరిపాలనము నందు లభించునట్లుగా చూడవలయు ననినది. 1786 వ సంవత్సరము ఏప్రియల్ 12 వ తేదీని కంపెనీవారు రివిన్యూను గురించియు, పరిపాలనావిధానమును గురించియు, కొన్ని నిబంధనలను, నీతులను నిర్ణయించిరి. జోనుషోరు, జేమ్సు గ్రాంటు, జొనాతనుడంకనులను కార్యనిర్వాహకసభ్యులుగ కారనువాలీసుగారు ఎన్నుకొనిరి. వర్తకవిషయములలో చార్లెసుగ్రాంటుగారు సలహాదారుడు. న్యాయశాఖకు సర్ విల్లియము జోన్సుగారు సలహాదారుడు. ఈయన హిందూ మహమ్మదీయ న్యాయశాస్త్రములయందు విజ్ఞానము గలవాడు.

1. Corn. i, 251, 341; ii 316, 572, See Roberts India under wellesly P. P. 261.

1
వర్తకశాఖ

కంపెనీయొక్క వర్తకశాఖ త్వరితగతిని సంస్కరింపబడవలసియున్నదని కారనువాలీసు విశ్వసించి మొట్టమొదటగ వర్తకశాఖను సంస్కరింపబూనినాడు. వర్తకపుపేరున భారతీయు లన్నివిధముల శోషింపబడుట కనుల గట్టినట్లున్నది. 1774 మొదలు 11 గురు సభ్యులతోగూడిన బోర్డు వర్తకవ్యాపారమును నడుపుచున్నది. ఈబోర్డుపై కౌన్సిలు కొంతపెత్తనము వహించుచు వచ్చినది. ఈబోర్డు హిందూదేశపు సరకులను సేకరింపుచుండెడిది. ఈసరఫరాకు కంపెనీసిబ్బందీతో కంట్రాక్టులు జరుగుచుండెడివి. 1786 లో యీబోర్డుసభ్యుల సంఖ్య అయిదుగురుగ సంస్కరింపబడినది. ఈసభ్యులును, కంట్రాక్టరులునుగూడ అతిఘోరముగ వర్తించుచుండినట్లుగ గ్రహింపబడినది. ఇందులకు కొందరు శిక్షింపబడిరి. అంతటినుంచియు, నీబోర్డు స్థానికముగనుండు వర్తకపు ఏజెంట్ల మూలముగ పనిచేయసాగినది. చేతిపనివాండ్రబాధలను నివృత్తిచేయుటకై కొన్నినియమములేర్పరుపబడినవి. ఈవర్తకశాఖాపద్ధతి వర్తకవిధానమంతరించువరకు ముఖ్యవిషయములలో మార్పుచెంది యుండలేదు.

2
రివిన్యూశాఖ;
న్యాయశాఖ.

కంపెనీ పరిపాలనమునందు, రివిన్యూశాఖయు, న్యాయశాఖయు నొక్కటిగనేయున్నవి. 1781 లోనే యీశాఖలు రెండును వేరుచేయబడినవి. కాని, డైరక్టరు లీరెండు శాఖలను తిరిగి కలిపివేయమనిరి. ఆ విధముగ తక్కువ వ్యయమునకు ప్రోత్సాహమియవలయుననిరి.

1787 లో అంతవరకును దివానుగిరీక్రింద 35 జిల్లాలున్నవి. అవి, 23 జిల్లాలుగ కలిపివేయబడినవి. ఈజిల్లాల కలెక్టరులే తిరిగి జడ్జీలుగ నియమింపబడిరి. అనగా, దివానీఅడాలటు కోర్టులజడ్జీలుగగూడ నియమింపబడిరి. ఈకోర్టుల ముఖ్యతీర్పులపైన, సదరు దివానీఅడాలటులకు అప్పీలు గావించుకొనవచ్చును. చిన్నచిన్న కేసులలో అనగా, 200 లకు లోబడినవాటిలో హిందూదేశరిజిస్ట్రారులు తీర్పు చెప్పుచుండెడివారు. (Indian Registrar) రివిన్యూకేసు లీకోర్టుల యిలాకానుండి తీసివేయబడినవి. కలక్టరులచర్యలపై రివిన్యూబోర్డునకు మాత్రమే

అప్పీలు చేసికొనవచ్చును. రెవిన్యూబోర్డు నిర్ణయములపై కౌన్సిలుకు తుదకు గవర్నరుజనరలుగారికిమాత్రమే అప్పీలుచేసికొనుటకు సావకాశముగలదు. ఈ కలెక్టరులకు మేజిస్ట్రేటు అధికారముగూడ నొసంగి, వీరికి నేరస్థులను శిక్షించు నధికారము హెచ్చింపబడినది. పెద్దపెద్ద నేరములను జేసినవారల విచారణకై ఫౌజుదారీ అడాలటుకోర్టునకు పంపబడుచుండెడివారు.

3 కలెక్టరుల జీత బత్తెములు; అధికారములు.

కలెక్టరులకు నెల 1 కి రు 1500 లు జీతమేర్పరుపబడినది. వీరు వసూలుచేయు రివిన్యూ ఆదాయములో 100 కి రు 1 వంతున కమీషనుగూడ నొసగబడుచుండెడిని. వీరికి సహాయకారులుగ ఆంగ్లేయులే నియమింపబడిరి. వీరికి గూడ పెద్దజీతములే యొసగబడినవి. వీరు వ్యక్తిగత వర్తకమును చేయరాదని, నిషేధింపబడిరి. 1789 జూన్ 8 వ తేదీనాడు గావింపబడిన నియమములలో కలెక్టరులవిధులు నిర్ణయింపబడినవి. 1790 లో రెవిన్యూకోర్టులకును, మాల్ అదాలతు కోర్టులకును వీరధ్యక్షతవహించుచుండు నటుల నిరూపింపబడినది. వీరి నిర్ణయములపై గవర్నరుకౌన్సిలునకే అప్పీలు గలదు. రెవిన్యూబోర్డున కీపని తగ్గించివేయబడినది. ఈవిధముగ కలెక్టరుల చేతులలో విపరీతమగు నధికారముంచబడినది. 1793 లో కలెక్టరుల యధికారమును గురించి నూతన నియమావళి యేర్పరుపబడినది.

4 న్యాయశాఖ.

నేరములను విచారించు న్యాయమొసగవలసిన క్రిమినలు న్యాయశాఖలో దురన్యాయములు జరుగుచున్నటుల కారనువాలీసు కనుగొనెను. నేరముల విచారణకై ప్రయోగింపబడుచున్న న్యాయశాస్త్రముగూడ సమంజసముగ లేదని కారనువాలీసు తలంచెను. నిజామత్ అడాలటు, మహమ్మదు రెజాఖానుగారి యాధిపత్యమున నడుపబడుచుండెడిది. 1790 లో నీయుద్యోగమునుండి రిజాఖానుగారు తొలగించివేయబడిరి. అంతవరకు నీకోర్టు మూర్షిదాబాదునం దుండెడిది. కలకత్తాకు మార్చివేయబడినది. గవర్నరుజనరలు కౌన్సిలుచేత ఆధిపత్యము వహింపబడినది. ఇరువురు ముఫ్టీలును, ప్రధాన

ఖాజీయును సలహాదారులుగ నుండెడివారు. అంతవరకును రాష్ట్రన్యాయస్థానములు హిందూ దేశస్థుల యాధిపత్యముక్రిందనే నిర్వహింపబడుచుండెడివి. ఇవి రద్దు చేయబడినవి. వీటిస్థానమున నాలుగుసంచారపు (సర్క్యూటు) కోర్టులు నెలకొల్పబడినవి. వీటికి కంపెనీయొక్క సివిలుసర్వీసుయుద్యోగస్థులే న్యాయమూర్తులుగ నియమింపబడిరి. (Covenanted Servants) వీరికిగూడ ముఫ్టీలును, ఖాజీలును సలహాదారులుగ నుండెడివారు. ఈ కోర్టులు, పాలువరి జిల్లాలకెంబడి తిరుగుచు న్యాయములు సంచారముచేయుచుండెడివి. ఈకోర్టుల తీర్పులననుసరించి శిక్షింపబడినవారి శిక్షల నములుజరుపుటధికారము కలెక్టరుల కొసగబడినది. విచారణకొరకు తేబడిన నేరస్థులను, శిక్షింపబడినఖయిదీలను జాగ్రత్తగ పదిలపరచుటకు వలయు నధికారమును కలెక్టరులకొసగబడినది.

5
పోలీసుశాఖ;
న్యాయశాఖ.

1791 లో కలకత్తాలో శాంతిభద్రతలను కాపాడుటకొరకై పోలీసుసూపరింటెండెంటు పదవులు సృష్టింపబడినవి. నేరస్థులను అరెస్టుచేయుటకు గూడ వీరికధికారమొసగబడినది. ఈమరుసటి సంవత్సరమే జిల్లాలయందు జమీందారులకు గల పోలీసుఅధికారములన్నియు తీసివేయబడినవి. ప్రతిజిల్లాయు విభజింపబడి అందొక్కొక్క భాగమునకొక్కడు నియమింపబడినాడు. ఈవిధానమువల్ల 1793 లో పోలీసుశాఖయు, రివిన్యూశాఖయు, న్యాయశాఖయు, వర్తకశాఖయు తిరిగి మార్పుచేయబడెను. ఒక నిర్ణీతమైన విధానముండవలయుననియు, వ్యక్తిపరముగ నేశాఖయు నుండరాదనియు కారనువాలీసు తలంపు. ఇందులకు కంపెనీపైరక్టరు లామోదించిరి.

ఈ 1793 సంవత్సరపు మార్పుల ననుసరించి న్యాయశాఖ, రివిన్యూపరిపాలనశాఖనుండి వేరుచేయబడినది. రివిన్యూవసూళ్ళబాధ్యత కలెక్టరులపై నుండుటచే ఆ బాధ్యత సక్రమముగ నిర్వహింపబడనపుడు, ఆ అక్రమచర్యకై, తమను తాము శిక్షించుకొనజాలరనియు, నేరమునుమోపువారును, న్యాయాన్యాయ విచారణచేయువారును నొక్కరుగనేయుండరాదనియు, ననెడి హేతువాదమే యీసంస్కరణమునకుకారణము. అందువల్ల 1790 లో స్థాపింపబడిన మాల్,

అదాలటు దివానీకోర్టులు తీసివేయబడినవి. దివానీవ్యాజ్యములు జిల్లాకోర్టులకు పంపబడుచుండెడివి. ఈవిధముగ మూడు నగరకోర్టులును, 23 జిల్లాకోర్టులును నిర్మింపబడినవి. ఈ కోర్టులన్నింటియందునను ఆంగ్లేయులే జిల్లాజడ్జీలుగ నియమింపబడిరి.

ఈకోర్టులపై రాష్ట్రకోర్టులకు అపీలు చేసికొనుటకు సావకాశ ముండెడిది. కలకత్తా-పాట్నా-ఢక్కా-మూర్షిదాబాదులలో ఈరాష్ట్రకోర్టులు స్థాపింపబడినవి. ఈకోర్టులపైన సాదరుకోర్టుండెడివి. గవర్నరుజనరలును ఆయనకౌన్సిలును మాత్రమే సాదరుదివానీ అడాలటుకోర్టుగ వ్యవహరించెడివారు. రు 1000 ల కిమ్మతునకు పైబడిన దావాలలో మాత్రమే ఈకోర్టునకపీలుచేసికొనుటకుగల సావకాశము. సాదరుఅడాలటుకోర్టుతీర్పులపై వ్యాజ్యకారణము రూ 5000లకు పైబడినదగుచో ప్రీవీకౌన్సిలున కపీలుచేసికొనుటకు సావకాశము కల్పింపబడినది. జడ్జీలమీద మోపు నేరములను విచారించుటకే సాదరుఅడాలటుకోర్టునకే అధికారముంచుకొనబడినది. రు 50 ల వరకు స్వదేశీయకమీషనరులు విచారించువారు. కోర్టురిజిష్ట్రారులు (Registrars) రు 200 కిమ్మతు వ్యాజ్యములను విచారించుచుండెడివారు. వీరి తీర్పులను తిరిగి విచారించుటకును లేక తీర్పులపై విచారణ గావించుటకును నగరకోర్టునకు లేక జిల్లాకోర్టుల కధికారముండెడిది.

ఈకోర్టుల కధికారపరివ్యాప్తిగూడ నిర్ణయింపబడినది. ఈకోర్టుల ఇలాకాలో ఆస్తిగలవాడైనను, ప్రతివాది కోర్టుయిలాకాలో కాపురమున్నవాడైనను, వాడు హిందూదేశస్థుడైనను, యూరోపియనుదేశస్థుడైనను బ్రిటిషు పౌరుడు మాత్రము కానియెడల, అట్టివారిపై యీకోర్టుల కధికార మొసంగబడినది. ఆంగ్లేయపౌరులగువారీకోర్టులతీర్పులను అంగీకరించునట్లుగ నిర్బంధింపబడెడివారు. 1781 సంవత్సరపు లైసెన్సు శాసనమునను సరించి ఈవిధముగ నిర్బంధింపబడెడివారు.

నగరకోర్టులకును జిల్లాజడ్జీలకును క్రిమినలు అధికారముగూడ నొసంగబడినది. వీరు మేజస్ట్రీటులుగ నియమింపబడిరి. క్రిమినలునేరములను విచారించు

టనై జిల్లాకోర్టులు సాలునకు రెండుపర్యాయములు సమావేశమగుచుండెడిని. కొన్ని జిల్లాలలో ప్రతిమాసమునుగూడ క్రిమినలునేరములు విచారింపబడుచుండె డివి. మరణదండనలుమాత్రము గవర్నరుజనరలు-కౌన్సిలును అంగీకరించవలసిన నియమముండెడిది. యావజ్జీవశిక్షగూడ పై విధముగనే సాదరునిజామతు అదాలతు అంగీకరింపవలసియున్నది. క్షమించుటకుగల యధికారము గవర్నరుజన రలు కౌన్సిలునకుమాత్రమే యున్నది. ఈనిజామతు అదాలతుకోర్టే నియమము లను వ్రాయుటకును అధికారమును గలిగియున్నది. క్రిందికోర్టు లనుసరించవలసిన శాసన నియమములన్నియును సీకోర్టువ్రాయుచుండెడిది. మహమ్మదీయన్యాయ శాసనములే "లా" గా యీకోర్టులయందు పాటింపబడుచుండెనివి. ఈన్యాయ స్థానములయందు ఉద్యోగములన్నియు కలెక్టరులకే యొసంగబడినవి. కంపెనీ యుద్యోగులకే యొసంగబడినవి.

6
పెర్మనెంటు
సెటిల్మెంటు

శాశ్వతభూమిశిస్తు నిర్ణయమువల్ల కలెక్టరులఅధికార ప్రాబల్యముకొంతతగ్గినది. భూమిశిస్తును శాశ్వతముగ నిర్ణయించివేసి జమీందారులను సీమయందలి భూఖామందుల వలె (Land lords) పరిగణింపజేయవలెనని డైరక్టరులు నిర్ణయించిరి. భూమిహక్కు ప్రభుత్వమునకు చెందినదగుటచే భూమి శిస్తును నిర్ణయించుటకు ప్రభుత్వమున కధికారముగలదని నిర్ణయింపబడినది. కాని గ్రాంటును, షోరునుగూడ శాశ్వతనిర్ణయమున కనుకూలురుగారు. కారనువాలీసు మాత్రము శాశ్వతనిర్ణయమునకే సంకల్పించెను. 1790 లో డైరక్టరుల యంగీకారమునకులోబడి భూమిశిస్తు నిర్ణయింపబడినది. 1792 లో ఇండియాసంఘ మీనిర్ణయము నామోదించినది. (Board of Control). ఇందువల్ల ప్రభుత్వ మునకును రైతులకును మధ్య మధ్యతరగతి జమీందారు లేర్పడబడిరి. రైతు నకు ప్రత్యక్షముగ ప్రభుత్వముతో సంబంధముతొలగినది. కోశాగారము - పో స్టుమాస్టరుజనరలు- ఎక్కౌంటెంటుజనరలు—ఆఫీసులు సంస్కరింపబడినవి. తపాలా విధాన మభివృద్ధిచేయబడినది.

7
కారనువాలీసు సంస్కరణముల గుణాగుణములు

"వంగదేశపు రైతులు నేడు (దత్తుకాలము) యభివృద్ధియందున్నారు. స్వయంశక్తిపై నాధారపడియున్నారు. ధనాఢ్యుల చేతులనుండి తప్పించుకొన గలిగియున్నారు. హిందూదేశమందలి యితరప్రాంతములలో రైతులకంటె కరవులను ఎదుర్కొనగలిగిన స్థితియందున్నారు. దీని కంతకును 50,000,000 మంది ప్రజల కధికసౌఖ్య మొసగించినందులకు లార్డు కారనువాలీసుయొక్క విశాలరాజనీతియు సుహృదయమును ప్రజోపయోగము నకై వినియోగించిన వివేకమును కారణములు." రమేశచంద్రదత్తుగారు కారను వాలీసు భూమిశిస్తు శాశ్వతనిర్ణయమును గురించి మెచ్చుకొనియుండిరి.1

"కారనువాలీసుగారు నిర్ణయించిన-రివన్యూ-పోలీసు-సివిలు-క్రిమినలు న్యాయవిధానములకు సంబంధించిన నియమావళియును-నిబంధనలును అన్నింటి యందునను ఒకనిర్ణీతపద్ధతి యేర్పడుటకు సావకాశ ముదయించినది. నేడుగల సివిలుసర్వీసును కారనువాలీసుగారే యేర్పరచిరి. కారనువాలీసుగారి పరిపాలనా విధానమునందలి సంస్కరణములలో నొక్కలోటుగాన్పించుచున్నది. హూణ్య దేశపరిపాలనాయంత్రమునుండి భారతీయులందరు తొలగించివేయబడిరి." ఇదియు దత్తుగారి యభిప్రాయమే.2

"భారతీయులయందుగల అమిత అవిశ్వాసమువల్ల కారనువాలీసు అన్ని పెద్దయుద్యోగములను ఆంగ్లేయులకే యొసంగెను. భారతదేశమునందలి ఆంగ్లేయ రాజ్యభాగమునం దేపెద్దయుద్యోగమునకుగాని భారతీయుడు నియమింపబడుటకే వీలులేనట్లుగ అతిత్వరితగతిని భారతీయులు తరిమి వేయబడిరి. పార్లమెంటుగూడ కారనువాలీసుయొక్క యీరాజనీతిని ఆమోదించి ప్రోద్బలపరచినది. సివిలు సర్వీసు-ఉద్యోగులకే-ఈపెద్దయుద్యోగములన్నిటియందునను నియమింపబడవలె నని నిశ్చయించినది. ... ... ఇందులకు అప్రశస్తమైన భారతీయులతో కారనువాలీసునకు సంబంధముగలుగుట యొక కారణమైయుండవచ్చును...... అయినను కారనువాలీసు కాసన్న రాజుగారి కోరికలనుగూడ అసందర్భముగ

1. See England and India. P. 12 by. R. C. Dutt.
2. See R. C. Dutt. P. ii.

నుద్యోగములని స్వహస్తగతము నెదుర్కొనగలిగెను. హేస్టింగ్సుకాలమున నుద్యోగములు పంపక మతి యసనీతికరముగనుండెడిది. యార్కి ఆర్చిబిషప్‌గారి పుత్రునకు సంపాదించుటకై ఆయనకొడుకునకు - ఇరువదియొక్క సంవత్సరములు వయస్సుమాత్రమేగలవానికి బెనారసు టంకశాల యధికారమును, కంపెనీసైన్యరక్షకుల అధ్యక్షుడగు సుళీవానుగారి పుత్రునకై ఆయనకొడుకునకు నల్లమందుకంట్రాక్టును వారనుహేస్టింగ్సుగారొసంగియుండిరి. ఈకంట్రాక్టు నీయన పౌ 40,000 లకు విక్రయించుకొనెను. ఈరీతిగ నుద్యోగముల నొసంగకపోవుటయందే వారను హేస్టింగ్సునకును కారనువాలీసు పరిపాలనమునకునుగల తారతమ్యము." అని కీతుగారు వ్రాసిరి.1

"హిందూదేశచరిత్రకారులు సివిలుపరిపాలనయందు కారనువాలీసును పొగడియుండిరి. ఈపొగడ్తలకితడనర్హుడు. హిందూదేశమును పరిపాలించుటలో హిందూదేశము హిందూదేశస్థులకొరకుగాక ఆంగ్లేయులకొరకు మాత్రమే పరిపాలింపబడవలెనని కారనువాలీసుయొక్క ముఖ్యోద్దేశ్యము. ఈ సంకల్పసిద్ధికై భారతీయ అవినీతిపరులనుటకు వలయు కృత్యముల నన్నింటిని యీతడవలంబించినాడు. ఆంగ్లేయుల సర్వాధిపత్యము భారతీయులపై నెలకొల్పుటయందీతడుత్తీర్ణుడైనాడు. క్లైవుగాని వారనుహేస్టింగ్సుగాని చేయలేనిరీతిగ కారనువాలీసు సివిలు-మిలిటరీ-యున్నతోద్యోగములనుండియేకాక బాధ్యతయు విశ్వాసమును జూపించవలసిన సమస్తస్థలములగు నున్నతోద్యోగములనుండియుగూడ, భారతదేశపు గడ్డపై బుట్టినవారిని భారతదేశపరిపాలనమునుండి శాశ్వతముగ తొలగించివైచినాడు." 2

"కారనువాలీసు గావించె ననబడే సివిలు ఉద్యోగములసంస్కరణముల బాధనుండి నేటివరకునుగూడ భారతదేశము పీడింపబడుచునేయున్నది. కారనువాలీసు నాడు గావించిన ద్రోహమును సవరింప నేటివరకు ఏఆంగ్లేయోద్యోగియు లేక రాజకీయవేత్తయు సమర్థుడు కాజాలకున్నాడు. –

1. See. Keith. p. 110.
2. See B. D. Basu. p. 276 - 277.

కారనువాలీసు, పరిపాలనాకాలమున తన క్రైస్తవమతశేశస్తు లున్నతోద్యోగములయందున్నవా రవినీతిపరులుగను అసమర్థులుగను నున్నారని గ్రహింపగలిగినాడు. వారిని నీతివంతులుగ జేయుటకే వారిజీతములను హెచ్చించెను. భారతీయులను బహిష్కరించి అన్నియున్నతోద్యోగములను ఆంగ్లేయులకే యొసంగబూనుకొనెను.'' 1

"కారనువాలీసు న్యాయపరిపాలనా శాఖయందుగూడ సంస్కరణములను దెచ్చిపెట్టెను. ఈయన ప్రవేశపెట్టిన సంస్కరణవిధానము దేశమునకెంతమాత్రమును నుపయోగకారి కాలేదు. అంతవరకునులేని తగవులమారితనము ప్రజలలో ప్రవేశించినది. కారనువాలీసు ప్రవేశపెట్టిన న్యాయవిచారణావిధానమును న్యాయనిర్ణయమును భారతదేశనైసర్గికతత్త్వమునకును, అభిమతమునకును విరుద్ధము. విదేశీయము. అప్పుడుగల గ్రామపంచాయితీల నావకాశమును తీసికొనియున్నచో భారతీయులకును శాశ్వతమగు నుపకారమును జేసినవాడై యుండెడివాడు. కాని ప్రతివిషయము నాంగ్లేయమొనరింప, విదేశీయమొనరింప కారనువాలీసు కృతనిశ్చయుడైనాడు. ఇంగ్లండులో నిరుపయోగమై విఫలమైన ప్రతివిషయమునకు హిందూదేశమొక సుఖతరమగు శేషభూమిగ నొనరింప సంకల్పించినాడు.'' 2

ఈవిధముగ పిట్టుగారి శాసనమాచరణయందుంచబడినది. కారనువాలీసు గావించిన సంస్కరణములకు శాసనాధికారములేదు. నియమావళినిగావించుటకై శాసనమునందుగల యధికారము ననుసరించియే కారనువాలీసీసంస్కరణవిధానములను నిర్ణయించి యమలునందుంచినాడు.

## 17 కంపెనీవారి సామ్రాజ్య స్థాపనము.

1784 వ సంవత్సరమున, రాజ్యస్థాపన మొనరించుట ఆంగ్లేయప్రభుత్వవాంఛితముగాదనియు, ఆంగ్లేయప్రభుత్వమునకు గౌరవప్రదముకాదనియు, అం

1. See Indian reform Tracts, Nos. IV and IX Allahabad Reprints. See also kaye. Administration of the East India Company.
2. See B. D. Basu See. Mill V. 355-336.

గ్లేయప్రభుత్వ రాజనీతిగాదనియు, పార్లమెంటు గావించిన ప్రకటనము కారనువాలీసే పాటింపలేదు. కారనువాలీసునకు పిమ్మట అట్టి ప్రకటన మొకటిగలదను మాటగూడ మరువ బడినది. "కంపెనీవారికి బలగము హెచ్చుగనున్నది. ఇతరులకంటె రాజ్యవ్యాప్తికి సావకాశములధనముగగలరు. ఆంగ్లేయప్రభుత్వము రాజ్యస్థాపనవలదను సంకల్పమును, రాజనీతిని విడినది."1

I
షోరు
గవర్నరుజనరలు—
1793 - 98

కారనువాలీసునకు పిమ్మట షోరుగారు గవర్నరుజనరలుగా నియమింపబడినారు. 1793 అక్టోబరు 28 వ తేదీన యీయన యీపదవిని స్వీకరించినాడు. ఈయననియామకమును బర్కుగారు ప్రతిఘటించిరి. నందకుమారుని న్యాయవిచారణమునగున సుక్షీదీయించిన సాధకుడీతడనియు, వారనుహేస్టింగ్సుపై గావింపబడిన విచారణలో తీర్పుచెప్పబడకపూర్వమే యీయనను గవర్నరుజనరలుగా నియమించుట తగనిపనియనిబర్కుగారు 1792 అక్టోబరు 14 వ తేదీని కంపెనీఅధికారులకు లేఖనువ్రాసియుండెను.2 ఈయన కంపెనీయొక్క దాబేదారుగ పనిచేసియుండియు, గవర్నరుజనరలుగ వారనుహేస్టింగ్సు కృపవలన నియమింపబడినాడు.

అయోధ్య నవాబుతో నీయన నూతనమొడంబడికను 1797 లో గావించినాడు. ఈయొడంబడిక ననుసరించి నవాబుచెల్లించవలసిన కప్పమును 56 లక్షల నుండి 76 లక్షలకు హెచ్చించెను. ఇంతేకాదు. నవాబుయొక్క సేనలు తగ్గించివేయనిర్ణయింపబడినది. అలహాబాదుకోట ఆంగ్లేయులవశ మొనరింపబడినది. అందు ఆంగ్లేయ సైన్యముంచుటకు తీర్మానింపబడినది. ఆంగ్లేయసైనికులు 10,000 ల నుంచెను. నవాబుసంరక్షణ కంపెనీప్రభుత్వవశ మొనరించుకొనబడినది. కంపెనీవారియనుమతిలేందే యేయితర రాజులతోగాని నవాబెట్టిసంపర్కమును గలిగించుకొనరాదని, నవాబుస్వాతంత్ర్యము నిరోధింపబడి బంధింపబడినది. "నవాబురాజ్యమునుండి కంపెనీసిబ్బందితప్పయితర ఆంగ్లేయులందరు తరిమివేయ

1. Keith. P. iii.
2. See. P. P. 226-223. P. 230. Vol. I. Life of Lord Teignmouth. See. B. D. Basu. P. 285. for that letter.

బడవలెననిగూడ నొకషరతుగలదు. నవాబును నిరోధించిలాగికొనిన షరతుల దురన్యాయము పైకి తెలియకుండుటకును, సీమయందలి ఆంగ్లేయుల కీవిషయము దెలిసి వారను హేస్టింగ్సు దురంతములు పార్లమెంటువారి దృష్టినాకర్షించినటుల, నాకర్షింపకుండ నుండుటకును, యితరయాంగ్లేయులు నవాబు రాజ్యమునుండి తరిమి వేయబడిరి."1

"అయోధ్యయందు సుపరిపాలన జరుగుటకు వలయుమార్గము లరయక పోవుటయే షోరుగారి ఒడంబడికయందలి పెద్దలోటు. అయోధ్య రాజ్యప్రజలు హెచ్చుపాటపాడినవారికి అమ్మి వేయబడునట్లుగ నున్నది. అయోధ్యసింహాసనము ఆంగ్లేయగవర్నరుగారి హస్తమందలి చరాస్తిగా మార్పివేయబడినది. (Transferable property) అయోధ్యప్రజలు అరదండములు వేయబడి, పర సంరక్షణము నందున్న రాజుయొక్క దయాధర్మములకు లోను చేయబడిరి." 2 ఈ షోరుగారి హయామునందే 1795 లో డచ్చివారి రాజ్యభాగములు లాగుకొనబడినవి. ఆశియాఖండమందలి రాజ్యభాగములన్నియుగూడ డచ్చివారినుండి లాగికొనబడినవి. సిలోను, మాలాకా, బండా, అంబోయనములు తీసికొనబడినవి. (Ceylon, Malacca, Banda, and Amboyna). ఈషోరుగారి కాలమునందే ఫ్రెంచివారి రాజ్యభాగములగు మారుతీద్వీపమును (mauritius), స్పెయినువారి మానిలారాజ్యభాగము (manila) లను, చాలవరకు హిందూదేశవ్యయముతో బ్రిటిషుసామ్రాజ్యభాగములుగ నొనరింపబడినవి.

అయినను, షోరుగారుమాత్రము స్వదేశరాజులతో యుద్ధములకుడికొని యుండలేదు. 1795 లో మహారాష్ట్రసామంత రాజులందరు పీష్వానాయకత్వమున నైజామును కార్దాయంనోడింప సమావేశమయిరి. కాని షోరుగారు జోక్యము కలిగించుకొనలేదు. అయోధ్యనవాబుతో గావించినయొడంబడిక తప్ప యితర స్వదేశరాజులతో షోరుగారు జోక్యముగలిగించుకొనక పోవుటకు నాడు కంపెనీ దివాలాకోరు స్థితియందుండుటయే కారణమని చెప్పదగును.

1. P. P. Allahabad Reprint 26-29,
2. See. Calcutta Review for January 1845. Artical by Sir Henery Lawrence, quoted by B. D. Basu. P. 301,

ఏకారణముననైననేమి? షోరుగారికాలమున దేశము రక్త సిక్తముకాలేదు. ఈరాల్ ఆఫ్ మారింగుటను (లేకపిమ్మట మార్క్వెసు ఆఫ్ వెల్సలీయని పిలువబడిన) గారి గవర్నరు జనరలు పదవికాలమున దేశమునందంతటను రక్తము కాలువలై, ఏళ్ళయి, మహానదులై ప్రవహించినది. వెల్సలీ

2 లార్డు మారింగుటను; లేక వెల్సలీ. 1793–1805

ఆధిపత్యమువహించిన నాటనుండియు, ఆంగ్లేయప్రభుత్వదృక్పథమంతయు, రాజ్యస్థాపన, విస్తీర్ణతలకై కేంద్రీకరింపబడినది. "వెల్సలీగారు, ఐర్లండుదేశీయుడనియు, యీయన అవినీతివంతుడనియు (loose morals), ఫ్రెంచిదేశపు స్త్రీని యీయన ఉంపుడుకత్తెక్రింద నుంచుకొనెననియు, పిమ్మట ఆమెను భార్యగా స్వీకరించియున్నను, ఆమె యీయనను లెక్కపెట్టియుండలేదనియు, (ఆమె యీయనతో హిందూదేశమునకు రాలేదనియు, సీమకు తిరిగివెళ్ళిన పిమ్మట యీయనతో విడిమాకులుపుచ్చుకొని యుండెననియు (న్యాయశాస్త్రప్రకారము కాకపోయినను) జ్ఞప్తియందుంచుకొనినచో హిందూదేశమునందీయన కాలమునందు జరిగినచరిత్రాంశములయందలి రాజనీతి సుగోచరముకాగలదు."

ఫ్రెంచివారియందుగల విద్వేషమే, యీయన హిందూదేశప్రవర్తనము నందంతటను ప్రస్ఫుటమైనది. హిందూదేశమందలి వివిధరాజ్యముల స్వాతంత్ర్యమును నేలగూలద్రోయుటయందీతనితలలో ఫ్రెంచివాడేగలడు.

హిందూదేశమునకు రాకపూర్వమే హిందూదేశవిషయము లీయనకు కొంతవరకు దెలియును. ఈయన 1793 లో ఇండియాబోర్డులో సభ్యుడుగా నియమింపబడినాడు. ఆనాడు సామ్రాజ్యనిర్మాణతృష్ణతో పీడింపబడిన పిట్టుగారే ఆంగ్లేయప్రధానామాత్యుడు. ఈయన తిరిగి కారనువాలీసునే షోరుగారిపిమ్మట హిందూదేశమునకు గవర్నరుజనరలుగ పంప సంకల్పించినాడు. కారనువాలీసు రాజ్యస్థాపనకు రహదారిల నిర్మించినవాడగుటయే యిందులకుకారణము. కాని ఆకాలముననే ఆంగ్లేయప్రభుత్వ కుతంత్రములవల్ల లేవతీయబడినపరిస్థితిలో ఐర్లండు

1. See "The private and secret letters' to His Excelency to Sir, Alfred Clarke-Commander-in-Chief in India from Fort. St. George 14 th May1799 to aquient with his Franeophoaia. Quoted by B. D. Basu. P. 303.

విప్లవానంతరము ఐర్లండును (1798లో) సీమతో ముడిపెట్టుటకై కారనువాలీసును, పిట్టు ఐర్లండునకు వైస్రాయిగా పంపవలసివచ్చినది. అందువల్ల మదరాసు గవర్నరుపదవికై నిరూపింపబడిన వెల్సలీని గవర్నరుజనరలుగా నియమింపవలసివచ్చినది. "హాలువుడ్డులో, పిట్టుతో గలిసి ఒకవారమురోజులు హిందూదేశమునందు సంపాదింపబడిన రాజ్యభాగముల అవసరములనుగురించియు, సంపాదింపబడు రాజ్యములను గురించియు ప్రస్తావించిన పిమ్మటనే, మారింగుటనుగారు హిందూదేశపు గవర్నరుజనరలుగ నియమింపబడుటకు తుదినిర్ణయము గావింపబడినది."1 ఈసంభాషణలలోనే హిందూదేశమున, అమెరికాకుమారుగ సామ్రాజ్యనిర్మాణావశ్యకత చర్చింపబడినదని కొందరి యూహ. ఐర్లండు విప్లవమునకు పిట్టుగారే కారకులగుటయు, వెల్సలీ గావించిన దురంతముల నన్నింటిని, పిమ్మట సమర్థించుటవల్లను హిందూదేశమునందు ఆంగ్లేయసామ్రాజ్యనిర్మాణ మొనరింప పిట్టు, మారింగుటను లిరువురును కుట్రగావించిరని చెప్పుటకు వెరువ బనిలేదు.2

1784 వ సంవత్సరము గావింపబడిన పిట్టుగారిపార్లమెంటు శాసనమున, రాజ్యవ్యాప్తికై ప్రయత్నింపరాదని పైకిచెప్పుట, రాజ్యవ్యాప్తికై కంపెనీ ప్రయత్నించుటలేదని భారతీయులను మోసపుచ్చుటకై గావింపబడిన పన్నాగమనుట సత్యము.

మారింగుటనుగారు హిందూదేశమునకు 1797 నవంబరు 7 తేదీని బయలుదేరుటకు ముందుగనే యీయనసోదరు లిరువురు, ఆర్థరు, హెనిరీలు, హిందూదేశమునకువచ్చియుండిరి. ఈముగ్గురుసోదరులును జేరి పిట్టుగారి సంకల్పప్రకారము హిందూదేశమున కారనువాలీసు స్థాపించినపునాదులపై సామ్రాజ్యసౌధమును నిర్మించిరి. "నేను రాజ్యములవెంట రాజ్యములును, విజయములవెంట విజయములను, రాబడులవెంట రాబడులను కుప్పలు వేసెదను. నాపై యధికారుల ఆశాతృష్ణలుకూడ "చాలిదలుపు" మని కేకలు వేయువరకును, నేనే యింతపనిని జేసితినను విఖ్యాతిని—భాగ్యమును—అధికారమును ప్రోగుజేసెదను......"

1. Revd. Hutton wrote, quoted by Mr. B. D. Basu, P. 305
2. See. Lord Rosebery's Monograph on Pitt and Wellesly.

6
అయోధ్య
1801

అయోధ్యరాజ్యమున కంపెనీకిగల రాజ్యభాగముల సంరక్షణ విధానము నిర్వహింపవలయునని నవాబు నిర్బంధింపబడినాడు. ఈసాకున నవాబు రోహిలాయుద్ధమున సంపాదించిన రాజ్యభాగమును 1801 లో లాగివేసెను. "ఈపని ఆంగ్లేయులప్రయోజనముకొరకే గావింపబడిన" దను విషయము నిస్సంశయము. ఈరాజ్యభాగము నిస్సంశయముగ లాభదాయకము. ఇంతతో నవాబొసంగవలసిన కప్పము రద్దుచేయబడినది.1 ఆనాడే యయోధ్యరాజ్యము భారతదేశసుందరోద్యానవనము. దీనినిజూచి వెల్లస్లీకి కండ్లుకుట్టినవి. ఆశాపాశమును విడల్చుకొన జాలకపోయినాడు.

7
సూరతు.
1799

ఈవిధముగ వారసులను నిర్ణయించుటలోనైనను ఢిల్లీ సుల్తానుతో సంప్రదించలేదు. ఈరీతిగనే సూరతునవాబు 1799 లో చనిపోయినవెంటనే సూరతు స్వాధీనమొనరించుకొనబడినది. ఢిల్లీపాదుషా కీవిషయమున హక్కులేదని నిర్ణయింపబడినది.

8
మైసూరు
శ్రీరంగపట్టణము.
1799

1799 మే మాసమునందు కంపెనీవారికి శ్రీరంగపట్టణమునందులభించిన విజయము ననుసరించి టిప్పుసుల్తాను రాజ్యభాగము చాలవరకు తీసికొనబడినది. ఈవిజయానంతరమునుండియు కంపెనీయే హిందూదేశమున సర్వాధికారియని వెల్లస్లీ నిరూపించినాడు. కాని, యీమైసూరు రాజ్యము తిరిగి హైదరుచేత, తరిమివేయబడిన హిందూరాజుల కొప్పగింపబడినది. ఈమైసూరు కంపెనీవారికి సామంతరాజులుగానుండు పద్ధతినే, యొసంగబడినది. కంపెనీవారిసైన్యమును సంరక్షించుటకును, యీసైనికపోషణకు వలయుఖర్చును కంపెనీయిష్టమువచ్చినప్పుడు హెచ్చించుటకును, కంపెనీకి అవసరమనితోచినపుడు రాజ్యపరిపాలనమంతయు తీసికొనుటకుగూడ కంపెనీకి మైసూరురాజ్యముపై, అధికార ముంచుకొనియే హిందూరాజునకు రాజ్యమొసంగబడినది.

1. See. keith. P. 112.

9 నైజాము. 1800

ఇట్లే 1800 సంవత్సరమున నైజాముగారు, కంపెనీవారికి లోబడినాడు. కంపెనీసహాయసైన్యమును పోషింపనంగీకరించినాడు. పరరాజులతో వ్యవహరించునపుడు కంపెనీతో సంప్రదింప నామోదించినాడు. 1792–99 లలో మైసూరు నుండి లభించిన ఫలితములను వీడుటకు గూడ నిచ్ఛగించినాడు.

10 మహారాష్ట్రులు. 1802-1803

1800 సంవత్సరమున నానాఫడనవీసు కాలధర్మము నొందెను. అంతతో, మహారాష్ట్రశౌర్య ప్రతాపవివేకములు చల్లారసాగినవి. 1802–3 లో పీష్వాబేసీను ఒడంబడిక నంగీకరించినాడు. ఈయొడంబడిక ననుసరించి సామంతరాజుగ నొనరింపబడినాడు. కంపెనీకి లొంగిపోయినాడు. పీష్వాయు, అతని మిత్రమండలియు, కంపెనీయు పరస్పర సంరక్షణమునకై ఒడంబడిక గావించుకొనినట్లుగ ఒడంబడిక గోచరించును. కాని, పీష్వా, సహాయసైన్యమును పోషించుటకును, 6 సైనిక దళములకు తక్కువ గాకుండగ తన రాజ్యభాగమునం దుంచుకొనుటకు నంగీకరించినాడు. సూరతుపై గల హక్కు లన్నియు విడి వేయబడినవి. ఆంగ్లేయ ప్రభుత్వ విరోధులగు ఐరోపా ఖండవాసుల నెవ్వరిని తన సిబ్బందియందు చేర్చుకొనకుండ నుండుటకును, గైకువారుతో గావించికొనిన షరతులను గమనించుటకును, కంపెనీపట్ల విరోధమును మానుటయేకాక యితరరాజులతో నెట్టి రాయబారములను గాని గావించుకొనకుండుటకును, నైజాముతో గాని, గైకువారుతోగాని, గలుగుస్పర్థలలో ఆంగ్లేయ మధ్యవర్తిత్వము నంగీకరించుటకును పీష్వా యంగీకరించుటవల్ల యీ ఒడంబడిక సమాన హోదాతో గావించుకొనిన ఒడంబడికయని చెప్పవీలులేదు. మహారాష్ట్ర రాష్ట్రముల మేటియెకిమీాడు కంపెనీకి తలయొగ్గినాడు. కంపెనీసంరక్షణ మంగీకరించినాడు. విదేశ వ్యవహారములలో హక్కును విసర్జించినాడు. ఇంతతో హిందూదేశ సామ్రాజ్యము ఆంగ్లేయులకు తర్పణమొనరింపబడిన దనుట నిర్వివాదాంశము.

11 ఒరిస్సా. 1803 ఈరీతిగనే 1803 డిశంబరు 15 తేదీని డియోగానునందు (Deogaon) గావింపబడిన ఒడంబడికననుసరించి బోన్సలీ రాజు సంరక్షణ సైనికపద్ధతి కంగీకరించినాడు. ఈ యొడంబడికయు బేసినుఒడంబడికవలెనేయున్నది. కటకు, కంపెనీ స్వాధీనమైనది. ఇంకతో ఒరిస్సాదేశము కంపెనీ రాజ్యమైనది.

12 ఆగ్రా-బ్రోచి-ఢిల్లీ. 1803 1803 డిశంబరు 30 తేదీని సుర్జీఔరంగానునందు గావింపబడిన ఒడంబడిక ననుసరించి సింధియా కంపెనీకి లోనయినాడు. ఆగ్రా—ఢిల్లీ—బ్రోచి మొదలగు నితరప్రదేశములు కంపెనీవారి పరమైనవి,

13 హోల్కారుతో యుద్ధము. 1805 ఇంతవరకును విజయవంతముగ నెగిరిన కంపెనీపతాకము హోల్కారుతో గావింపబడిన యుద్ధమున క్రిందకువ్రాలవలసివచ్చినది. అయినను యీాయనయును 1805 లో సంరక్షణ సైనికపద్ధతి నంగీకరించినాడు.

14 భరతపురం రాజా 1805 ఈవిధముగనే భరతపురం రాజుతోసల్పిన యుద్ధమునగూడ 1805 లో కంపెనీ ఓడిపోయినది. (Lake) ఈయన రాజ్యమును చెదరగొట్ట జాలకపోయినది.

15 ఢిల్లీసుల్తాను వెల్సలీప్రవర్తనము ఢిల్లీసుల్తానుపట్ల షోరుగారును వెల్సలీగారునుకూడ నొకరీతిగనె వర్తించిరి. 1797 లో షోరుగారు, బీగముగారిని ఆయన ఇరువురుకొడుకులను బెనారెసునందు సందర్శించియుండెను. చక్రవర్తికుటుంబము కంపెనీవారి పోషణమునం దుండియుండినను షోరుగారు చక్రవర్తికుటుంబముకడ ప్రవర్తించవలసిన రీతిగనే సవినయముగ తాబేదారుగనే ప్రవర్తించియుండెను. రాజకుటుంబము చక్రవర్తిహోదా కనువైనరీతిగనే సంభాషించియుండెను. చక్రవర్తులు తమ సామంతరాజులకు ఒహూకరించిన రీతిగనే షోరుగారికి నూతనవస్త్రము లొసంగబడినవి.

1803 లో సింధియారాజు అపజయముగాంచిన తరువాత ఢిల్లీపాదుషా పూర్తిగ ఆంగ్లేయుల అండజేరినాడు. అనాడే ఢిల్లీపాదుషాయొక్క సర్వాధికారమును కంపెనీ తీసికొనియుండెడిది. గాని యేరీతిగనైనను చక్రవర్తి ఫ్రెంచివారితో లాలూచీచేయునేమో యనుభయమున వెల్సలీ యందులకై ప్రయత్నించలేదు. అందువల్ల చక్రవర్తి ఆంగ్లేయసంరక్షణక్రింద నుండుటకును ఢిల్లీకోటలోనే తనసర్వాధికారమును చెలాయించుటకును నిర్ణయింపబడినది. ఈయన పోషణకై ఢిల్లీచుట్టునున్న జిల్లాయందలి రాబడి పాదుషాకొసంగబడినది. ఈ జిల్లాపరిపాలనమాత్రము ఆంగ్లేయోద్యోగి నిర్వహించుచుండెడివాడు. కాని పాదుషా పేరుమీదుగనే పరిపాలనమొనరించుచుండెడివాడు. ఈ జిల్లాయందు మహమ్మదీయ శాసనములాచరణయందుంచబడినవి. హిందూదేశచక్రవర్తుల పట్ల చూపవలసిన గౌరవమర్యాదలన్నింటిని చూపవలసివచ్చునను భయమున చక్రవర్తిగారిని వెల్సలీదర్శించలేదు. కాని లేకుగారు సమర్యాదలతో సవినయముగ చక్రవర్తిగారిని సందర్శించుటయేకాక ఆయనచేత క్రొత్తదుస్తులచే బహూకరింప బడుటయేకాక ఆయనయొసంగిన బిరుదమునుకూడ స్వీకరించియుండెను. ఇందువల్ల అంతదనుక చక్రవర్తియొక్క సర్వాధికారము కంపెనీయంగీకరించుచున్నదనే చెప్పవచ్చును. అయినను ఆచరణయందు చక్రవర్తిగారిపక్షమున కంపెనీ యేజెంటుగా సర్వాధికారమును చెలాయింపసాగినది. ఈయెత్తువల్ల వెల్సలీయొక్క రాజ్యస్థాపన కృత్యములచే రగుల్కొల్పబడిన కోపతాపోద్రేకము లొకింత చల్లారినవి. రసపుత్రులీపద్ధతిని యంగీకరించిరి. వంగము—అయోధ్య—కర్నాటకములను లాగికొనుటవల్లను టిప్పును విధ్వంసమొనరించుటవల్లను, మహమ్మదీయలోకమునందుగలిగిన అశాంతియు చల్లారినది. ఇంతతో మహమ్మదీయ హిందూసామ్రాజ్యమునకు గోరికట్టుప్రయత్నములు పూర్తిఅయినవని చెప్పదగును.

16 కారనువాలీసు రెండవపరిపాలనము

ఈవిధముగ వెల్సలీనడిపిన సామ్రాజ్యస్థాపనయుద్ధములచే కంపెనీ దివాళాతీయు స్థితికివచ్చినది. అనవసరముగ రాజ్యస్థాపనమునకై తాముతమసిరిని వ్యయపెట్టినట్లుగ కంపెనీ వాపోయినది. వెల్సలీని వెంటనే యుద్యోగమునుండి సీమకు పిలిపించివేసినది. పిమ్మట పార్లమెంటు సభ్యులు వెల్సలీకృత్యములకై

వారను హేస్టింగ్సును విచారించినటుల విచారింప ప్రయత్నించిరికాని విఫలులైరి. ప్రధానమంత్రి పిట్టుగారినడక నే వెల్సలీ నున్నటనే యితరులకాయనను విచారింప జేయగల తాహాతులభించలేదు. ఈయనస్థానమున కంపెనీవారిగి 66 సంవత్సరముల వయస్సుగల వృద్ధుడగు కారన్‌వాలీసునే గవర్నరుజనరలుగా నియమించి యుండెను. హిందూదేశమునం దశాంతిలేకుండగ చేయవలెనని యీయన పంపబడినాడు.

17 బార్లోగవర్నరు జనరలు 1805-1807

ఈరాజనీతి ననుసరించి యితను ప్రదర్శించిన ప్రవర్తనము మహారాష్ట్ర యోధులతో రాజీపడుటకు సావకాశమేర్పడినది. కాని యీయన మూడుమాసములలోనే చనిపోవుట వల్ల గవర్నరుజనరలు — కౌన్సిలులో ప్రథమసభ్యుడుగ నున్న బార్లో గవర్నరు జనరలుగ నియమింపబడెను. ఈయన వెల్సలీగారి శిష్యుడు. ఆయన అడుగుజాడలలోనే ప్రవర్తించినాడు. వెల్సలీగారి సామంతరాజ సంరక్షణవిధానమును స్వదేశరాజులందరిచేతను అంగీకరింపజేయవలెననియే యీయనకృషి సల్పినాడు. ఇందులకు హెచ్చుఖర్చు అగుచుండుటవల్ల కంపెనీయంగీకరించి యుండలేదు. అందువల్ల స్వదేశరాజులమధ్య పరస్పరకలహములను పెంచుటకై ప్రయత్నింపసాగినాడు. రసపుత్రులు మహారాష్ట్రయుద్ధములలో ఆంగ్లేయుల అండగనుండినారు. వీరిసంరక్షణమునకై వెల్సలీ హామీయిచ్చియున్నాడు. ఈహామీని బార్లోనెరవేర్చలేదు. పయిగ రసపుత్రులలో నొకరిపై నొకరికి అంతః కలహములను పెంచి పోరాటములను రగుల్కొల్పెను. 1

18 హోల్కారు సింధియాల ఒడంబడికలు. 1805—1806

హోల్కారుతో 1806 జనవరి 7 వ తేదీని గావింపబడిన ఒడంబడికననుసరించియు 1805 నవంబరు 22 తేదీని సింధియాతో గావింపబడిన ఒడంబడికననుసరించియు యీ మహారాష్ట్రప్రభువులకు తిరిగి, కంపెనీతాను జయించెననుకొనబడిన రాజ్యభాగములను చాలవరకు యీడవలసివచ్చినది. రసపుత్రవీరులను మహారాష్ట్రప్రభువులకు లోబడియుండు

1. See, Political History of India by Sir John Malcolm "The policy of Sri George Barlow from Kays selection from the papers of Lord Met-calf p. 7 See B. D. Basu p. 581-585

నట్లొనరింపవలెనని చేయబడిన కంపెనీప్రయత్నములంతతో విరమింపబడినవి. 1805 ప్రక్రియలులో జోధపురం రాజు కంపెనీ వారికి సామంతరాజుగనుండుట కంగీకరింప నిరాకరించి సంరక్షణముగూడ నిరాకరించుటచే వెల్సలీ జోధపురంరాజును సింధియాకు వప్పగించినాడు. రసపుత్రవీసులీవిధముగ మహారాష్ట్రులకు స్వాధీన పరుపబడినపుడు రసపుత్రులుకంపెనీవారిని సంరక్షింపగోరిరి. మొగలాయి సర్వ రాజ్యాధిపత్యము కంపెనీకి సంక్రమించుటచే కంపెనీ రసపుత్ర మోధులను సంరక్షింప వలసిన విధియని వీరివాదము. కాని బార్లోగారీవాదము సంగీకరించలేదు. 1

19
వెల్లూరు తిరుగుబాటు
1806

హిందూరాజ్యము లీవిధముగ మనాయాసముగ తమకు లోబడిపోవుటవల్ల హిందూదేశమందలి మతములుగూడ లోబడునని వెల్సలీగారిచేత యూహింపబడెను. కలకత్తా విలియము పోర్టునందిందులకై యొక కాలేజీ నిర్మింపబడినది. (క్రైస్తవమతవ్యాప్తికి ప్రథమమునుండియు మదరాసు రాజధానియే సుక్షేత్రముగ నుండెను. ఇచ్చటనే హిందూదేశస్తులు హెచ్చుమంది క్రైస్తవు లయినారు.2

పంధొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున మదరాసుగవర్నరుగానుండిన లార్డు విలియము బెంటింకుగారును—వాడుసైన్యాధిపతిగానుండిన క్రాడకుగారును-భారతీయసైనికుల మతవిశ్వాసములపై దాడివెడలసాగిరి. వెల్లూరుకోటలో టిప్పు యొక్క కుమారులు ఖయిదీలుగ బంధింపబడియుండిరి. ఇచ్చటనే సిపాయీల తిరుగుబాటు హఠాత్తుగ 1706 జూలై 10 తేదీ రెండుగంటలకు ప్రారంభించినది. ఆంగ్లేయోద్యోగులందరు ముట్టడింపబడిరి. సైనికాధికారి చంపివేయబడినాడు. కాని తిరుగుబాటు అణచివేయబడినది. తిరుగుబాటుదారులు శిక్షింపబడిరి. తిరుగుబాటుకారణముల నరయుటకై విచారణసంఘము నియమింపబడినది. ఇందుగల సివిలుసిబ్బందీసభ్యులు అవివేకముతోగూడిన సైనికసంస్కరణములవల్ల యీతిరుగుబాటు సంభవించినదనిరి. సైనికసభ్యులు టిప్పుకొడుకులను చెరనుండి

1. See Thompson and Garratt. British rule in India p. 237. Roberts. p. p. 289—94.

2. See B. D. Basu. Chapter on "Christianization in India" in his "The consolidation of the Christian power in India.

విడిపించుటకై గావింపబడిన రాజకీయవిప్లవమనిరి. ఈరెండునుగూడ నిందులకై కారణములై యుండవచ్చును. సిపాయీలు బొట్టుపెట్టుకొనరాదనియు చెవులకు పోగులుధరించరాదనియు సిపాయీలశిక్షణాకాలముయందు నున్నగాగడ్డము గొరిగించికొనియుండవలయుననియు మీసములనుంచుకొను పద్ధతిగూడ నిర్ణయింపబడి శాసింపబడుటచేగూడ తిరుగుబాటునకు సావకాశముగలదు. ఈతిరుగుబాటువల్ల గవర్నరును సైన్యాధిపతియుగూడ ఉద్యోగములనుండి తీసివేయబడి సీమకు మరల్చబడిరి. ఈతిరుగుబాటునకు ముఖ్యముగ కంపెనీవారి క్రైస్తవమతవ్యాప్తిదృష్టియే కారణమనుటయు నిశ్చయము.1 ఈ పరిస్థితులు బార్లోగారి గవర్నరుజనరలు పదవిక్రింద సంభవించుటచే యీయన మదరాసు గవర్నరుగా లార్డువిలియము బెంటిక్కుస్థానమునకు దిగలాగబడినాడు. ఈయనస్థానమున లార్డుమింటోగారు గవర్నరుజనరలుగా నియమింపబడినాడు. ఈయనను ఆంగ్లేయ మంత్రివర్గము నియమింపజేసినది. కంపెనీపెత్తనము సాగలేదు. టిప్పూకొడుకులను వంగదేశమునకు దీసికొనిపోయిరి.

20
లార్డు మింటో
పరిపాలనము.
1807-1813

చాలవరకు హిందూదేశము కంపెనీ కావృత్తక్రిందకు వచ్చినది. స్వదేశరాజులుపలువురు సామంతరాజులుగ నుండ నంగీకరింపజేయబడినారు. అయినను రాజ్యస్థాపనవిషయమునకై ప్రయత్నింపలేదను తెరమరుగు తీసివారవేయుటకికను ఆంగ్లేయప్రభుత్వమునకు జంకుపోలేదు. ఇందులకగుఖర్చును భరింపజాలక కంపెనీడైరక్టరులు పెడమొగమును పెట్టుచున్నారు.

మింటోగారిరాకతో డైరక్టరులు పెడమొగముపెట్టుటకూడ మానివేసిరి. స్వదేశరాజులపోరాటములలో జోక్యము గలుగజేసికొనకుండ వీలులేదని డైరక్టరులుగూడ నిశ్చయించుకొనిరి. అయినను 1809లో బీరారునుండి అమీరుఖాను తరిమివేయబడినప్పటికిని ఆంగ్లేయమిత్రమండలికి చేరనివారిపై నీతపెల్లుప్రవర్తించి నను జోక్యముకలిగించుకొనబడలేదు. కాని మెటుకాఫీద్వారా సట్లజు సంస్థానములన్నియు ఆంగ్లేయసంరక్షణ కంగీకరింపజేయబడినవి. రంజితుసింగు అంగీక

1. See Edinburgh Review for 1807. The Conversion of India by Rev. Sydney Smith.

లించుకనుల నిరోధింపబడినారు. నాభా, సర్‌హిందు, ఫరీదుకోట, పాటి యాలా సంస్థానములు సంరక్షణమునకంగీకరించినవి. 1809 మే 3 తేదీని గావింప బడిన ప్రకటనలో నీసంస్థానములు కప్పముగట్ట నవసరములేదనియు, ఆంగ్లేయసం రక్షణము నంగీకరించుటకు మున్నుగల యధికారమునుహక్కులును గలిగియుండు నవియు ప్రకటింపబడియుండెను. ఈసంస్థానాధిపతులు యుద్ధకాలమునందు వీరి రాజ్యభాగములగుండ పోవుసైన్యమునకు ధాన్యాదులు మొదలగుఅవసరపదార్థము లను సరఫరాచేయుచుండవలెననియును ఎవరిదాడినైనను ఎదుర్కొనుటకు ఆంగ్లే యులతో చేతులు జోడింపవలెననియును షరతు లేర్పరుపబడినవి. కాని యీసం స్థానములు తమలోతాము శాంతిని నిలకొల్పుకొనుట యత్యవసరమని తేలినది.

ఈవిధముగ లార్డుమింటోగారి ప్రభుత్వము ఆంగ్లేయస్వాధికారము సంర క్షించుటకై వలయుకృషినంతయు గావించినది. రాజ్యభాగములయందు ప్రజల తిరుగుబాటు లేకుండగను స్వదేశరాజులదండయాత్రలు సంభవింపకుండగను ఆంగ్లేయాధికారము సంరక్షింపబడినది. పశ్చిమోత్తర పరగణాలనుండి హిందూ దేశముపై దండయాత్రలు సాగుననుభయము ప్రప్రథమమున మింటోగారి ప్రభు త్వమునందే గలిగినది. పంజాబునకును, ఆఫ్గనిస్థానమునకును — సింధు—పెర్షి యాలకును సంరక్షణసహాయపు (Defensive allience) టొడంబడికలను గా వించుకొన రాయబారులుపంపబడిరి. ఈనెపమున వారిసైనికశక్తిని అన్వేషింప వలయుననిగూడ మింటోప్రభుత్వపుటుద్దేశ్యము. ఈవిధముగనే సముద్రమార్గ మునగూడ విదేశప్రభుత్వములు హిందూదేశముపైదాడి వెడలుననుభయము మింటోప్రభుత్వమును వేధించినది. హిందూమహాసముద్రతీరమునందు ఫ్రెంచి వారికిగల ద్వీపములు స్వాధీనపరచుకొనవలెనను తలంపు వెల్సలీగారి నాటినుండియు గలదు. ఈసంకల్పమీడేరుటకు 1809 లో ఆంగ్లేయప్రభుత్వాధి కారముతో మింటోగారు ఫ్రెంచివారిద్వీపములను ముట్టడించిరి. 1810 లో ఆ ద్వీపము లన్నియు స్వాధీనముగావించుకొనబడి ఆంగ్లేయబావుటాక్రిందకు తేబడినవి.

ఈవిధముగనే 1811 లో డచ్చివారితాలూకు రాజ్యభాగములుగూడ (Indian Archipelgo) ఇండియా ఆర్చిపెలగో స్వాధీనపరచుకొనబడినది. 1

1. See. Lord Minto in India, p. p. 333-334 and B.D. Basu 618 to 619,

ఈవిధముగ మింటోగారికాలమునందు విదేశీయులరాజ్యభాగములు హిందూదేశమునందలి ఆంగ్లేయప్రభుత్వమునకు జతచేసికొనబడినవి. "హిందూదేశమున మాత్రము మహానమునగాని సైనికశక్తివల్లగాని— రాజ్యవిస్తీర్ణముచేయలేదు. ఇందులకు సంకల్పబలిమి కొఱవడుట కారణముగాదు. ఆయనకాలమున "ఆంగ్లేయసైనికశక్తి తనగౌరవమును కోల్పోయియున్నది. అధమావస్థయందున్నది. పలుకుబడినంతయు గోల్పోయినది. ఆంగ్లేయప్రభుత్వమునకాకాలము బహుప్రమాదస్థితి. అటువంటివిషమ పరిస్థితులలో హిందూదేశమునం దంతకుపూర్వమే నెలకొల్పబడిన రాజ్యమును సంరక్షించుటయే ఘనమైనపని". ఈసంరక్షణకై ప్రయోగింపబడిన సాధనవిధానము మాత్రము కుతంత్రములమాటయనుట నిర్వివాదాంశము. 1

21
మదరాసు
ఉద్యోగుల
తిరుగుబాటు

కంపెనీప్రభుత్వమున కానాడుగల ఆర్థికదుర్భిక్షమువలన ఉద్యోగుల జీతబత్తెములు తగ్గింపబడినవి. మదరాసురాష్ట్రమున యుద్యోగులు తిరుగుబాటునలిపిరి. నాటిమదరాసు గవర్నరగు బార్లోగారు నిదానముగ ప్రవర్తించియుండినచో నీతిరుగుబాటు సంభవించెడిదికాదు. మచిలీపట్టణము - శ్రీరంగపట్టణము - హైదరాబాదు మొదలగు స్థానములలో నీతిరుగుబాటు సంభవించినది. "ఇది చాలవిపరీతపరిస్థితులలో సంభవించినది. రంజితుసింగు సట్లజునదిని దాటియుండినచో మహారాష్ట్రులును బందేలుకండును నంగముపై దాడివెడలియున్నచో లార్డుక్లైవు స్థాపించినంత రాజ్యముమాత్రమే ఆంగ్లేయులకు మిగిలియుండెడిది. ఈప్రమాదమునుగ్రహించియే మదరాసుతిరుగుబాటు దారులు స్వస్థతజెందిరి. ఈవిధముగ తిరుగబడినను ఒక్కసైనికోద్యోగియు కాల్చిచంపబడలేదు." 2

ఈవిధముగ తిరుగుబాటుదారులు సకాలమున వారివారియుద్యోగములను స్వీకరించకుండనుండినచో "మహారాష్ట్రులు తాముకోల్పోయిన రాజ్యమును

1. See B-D. Basu, p. 620.

2. p. p. 323-324. Vol. 1. The letters of M. Victor Jacquemont written to his father from India on 28 October 1830.

తిరిగి జయించియుండుటకును, నాడుఖయిదులో బంధితులుగానున్న నైజామును-పీష్వాయున్నూ కారాగృహవిముక్తులైయుండుటకును నావకాశమేర్పడియుండెడిది. ఈప్రమాదములను తప్పించియున్నను మింటోగారు ఉద్యోగకాలపరిమితి పూర్తిగాకపూర్వమే సీమకుమరలించి వేయబడినాడు.

**మార్క్విసు హేస్టింగ్సు గవర్నరు జనరలుపదవి 1813–1823**

ఈయనతరువాత మార్క్విసు హేస్టింగ్సుగవర్నరుజనరలుగా నియమింపబడినాడు. ఈయనకాలమున తిరిగి స్వదేశ రాజులందరు ఒకే బావుటాక్రిందకు తీసికొనిరాబడు సంరక్షణ పద్ధతి మరల ప్రారంభింపబడినది. బ్రిటిషుప్రభుత్వము కపటనాటకము విరమించినది.

1813 సంవత్సరమునందు గావింపబడిన శాసనమునందు ఆంగ్లేయప్రభువునకు హిందూదేశమునందలి కంపెనీరాజ్యముపై సర్వాధికారముగలదని ప్రకటింపబడినది. ఇదేవిధముగ ఫ్రాన్సుతో పారిసునగరమునందు గావింపబడిన ఒడంబడికలోగల 12 వ నిబంధనము ననుసరించిగూడ హిందూదేశమునందు ఆంగ్లేయప్రభుత్వమునకు సర్వాధికారముగలదని స్పష్టపరుపబడినది. ఫ్రాన్సుతోపాటు హాలెండుగూడ బ్రిటిషుప్రభుత్వ సర్వాధికారము నంగీకరించినది. ఢిల్లీలో మెటుకాఫ్ గారు నవాబునకుగల చక్రవర్తిపదవిని రద్దుచేయవలెనని తలంచియుండెను. హేస్టింగ్సుగారు చక్రవర్తిగారికి లోబడిన మర్యాదలను పొందుట కష్టము గలిగియుండెను. చక్రవర్తికి సంబంధించినంతవరకు ముద్ర (Seal) తీసివేయబడినది. సామంత రాజచిహ్నముద్ర అంతవరకును కంపెనీవ్యవహారముల నుపయోగించు ముద్రలో నుండెడిది. గవర్నరు జనరలు తన సామంతప్రభుచిహ్నముగ చక్రవర్తికి పంపవలసిన బహుమానములను పంపుట మానివేయబడినది. హేస్టింగ్సు రెండవ అక్బరును సందర్శించ నిరాకరించినాడు. అక్బరు తన చక్రవర్తి లాంఛనములను తీసివేయ నిరాకరించినాడు. చక్రవర్తిలాంఛనములను వదలుకొనుదాక తాను చక్రవర్తిని చూడనని హేస్టింగ్సు పట్టుదల. వీరిరువురును తుదకు సమావేశమే కాలేదు.

23 మహారాష్ట్రియు. మహారాష్ట్రప్రభుత్వముకు సంపూర్ణముగ హేస్టింగ్సు తొలగద్రోయుటతో సైనికసంరక్షణవిధానము నలుగడల పూర్తిఅయినది. ఈయనకీ రాజనీతియందు మెట్‌కాఫు అంశ. మెట్‌కాఫునకు భారతీయ ప్రభువులన్న అసహ్యాము. బహుళశక్తివంతమగు సైనికబలముకు పోషించవలయునవియు ప్రత్యర్థులగు రాజులను పదభ్రష్టులుగ నొనరింపవలయుననియు వీలయినంతవరకు రాజ్యవ్యాప్తిని చేయవలయుననియు ఆంగ్లేయప్రభుత్వముపై ఆధారపడియున్న సామంతరాజులవంకి ధన సహాయమునుగూడ పొందవలయుననియు మెటకాఫుగారి రాజనీతి. ఈ రాజనీతిని హేస్టింగ్సుచేత కొనసాగింపవేయుటకై ఉత్తరసర్కారులపైకిని వంగదేశముపైకిని వచ్చిన పిండారీల దండయాత్రలు సాకుగనొంకినవి. వీరు సింధియా-హోల్కారులతో మైత్రిగలవారనబడినది. ఈసాకున రసపుత్ర రాజ్యములు ఆంగ్లేయసంరక్షణ క్రిందకు తీసికొనబడినవి. 1805 సంవత్సరమున గావింపబడినసంధి ఒడంబడికలు రద్దుగావింపబడినవి. సింధియాకును హోల్కారునకును మైత్రి ప్రకటింపబడినది.

24 సింధియా. 1817 నవంబరున సింధియాచేత ఆంగ్లేయకంపెనీ ప్రభుత్వ నిర్ణయమంగీకరింప చేయబడినది. 1817 – 1818 లో ఉదయపూరు జోధపూరు, జయపూరు, కోరా, భోపాలు, బండి, మొదలగు ఇతరరాజులతో ఢిల్లీయందు ఒడంబడికలు గావింపబడినవి. ఈఒడంబడికల ననుసరించి యీరాజ్యములు కంపెనీప్రభుత్వమునకు లోబడిన సామంతరాజ్యములుగ నుండుటకే ర్పాటు. ఇంతతో సింధియా బ్రతికి బయట పడలేదు. సింధియా కంపెనీప్రభుత్వమునకు వ్యతిరేకముగ వర్తించుచున్నటుల కంపెనీచే పన్నుబంపబడినది. 1818 లో మరియొక ఒడంబడికను గావించుకొనుటకు సింధియాకు విధియైనది. ఈయొడంబడిక ననుసరించి అజ్మీరును కంపెనీకిచ్చి వేయుటకు సింధియా అంగీకరింపవలసి వచ్చినది.

25 హోల్కారు. ఇక హోల్కారునకును ఈగతియేపట్టినది. 1818 లో మందసరునొద్ద అపజయము గాంచినాడు. నర్మదానదీ దక్షిణప్రాంత రాజ్యమునంతయు కంపెనీకి తర్పణమొనరించినాడు. రసపుత్ర యోధులపై నెట్టిహక్కునులేదని యంగీకరించినాడు.

అమీరుఖానునకు స్వాతంత్ర్యము గలదని గుర్తించినాడు. తనసైన్యమును తగ్గించుకొనుటకును, కంపెనీవారి సైన్యముతో గలిసిపనిచేయుటకై వలయు నొక సైనికదళమును పోషించుటకును సంగీకరించినాడు. కంపెనీప్రభుత్వప్రతినిధి యొకడు తనరాజ్యమునందుండుట కొప్పుకొనియున్నాడు. (Resident).

26
నాగపురము :- ఈవిధముగనే నాగపూరురాజు సింహాసనమునుండి కూలద్రోయబడినాడు. సాగరు, నర్మదా రాజ్యభాగము లీరాజ్యమునుండి వేరుచేయబడి కంపెనీ ప్రభుత్వము భుక్తపరుచుకొన సాగినది.

27
పీష్వా :- మహారాష్ట్రరాజ్యసర్వాధికారి యగు పీష్వా 1817 లో నీసర్వాధికారపదవిని విసర్జింపచేయబడినాడు. కొంకణ తీరమంతయు కంపెనీ దఖలుపరచుకొనినది. గైకువారిపై తనకుగల యధికారమును విసర్జించినాడు. అయనకు సంవత్సరము 1 కి నాలుగు లక్షలరూపాయలు కప్పముగట్టుపద్ధతిని అహమ్మదాబాదు నొసంగుట కంగీకరించినాడు. కంపెనీకి కతియవారు కప్పము నొసగుటకుగూడ నంగీకరింప చేయబడినాడు. తుట్టతుదకు యుద్ధానంతర మీయన అధికారమంతయు కంపెనీప్రభుత్వ మూడబెరికికొనినది. 1818 లో రాజ్యభ్రష్టునిగ చేయబడి స్థానభ్రష్టునిగగూడ చేయబడినాడు. స్వయంపోషణకుమాత్రము గౌరవభృతి యొసగబడెడిది.

28
సతారా :- సతారా రాజుగ నొకశివాజీ వంశీకుడు సింహాసనమెక్కింపబడెను. ఈయనతో గావించుకొనిన ఒడంబడిక యింతకు ముందుగావింపబడిన ఒడంబడికలవంటిదిగాదు. పరస్పర సహకారసూత్ర మీయొడంబడిక కాధారముగాదు. "జోహుకుం" పద్ధతి యీయొడంబడికకు ముఖ్యప్రాణము.

29
గైకువారు:- గైకువారు, కంపెనీప్రభుత్వపు బుజ్జగింపులలో నిదివరకే మునిగిపోయియుండెను. 1802 లోనే బరోడా రాజ్యమున కొంత, కంపెనీప్రభుత్వమునకు సమర్పింపబడియున్నది. బరోడా రాజ్యవ్యవహారములలో, కంపెనీపెత్తనము చెలాయించుటకంగీకరింపబడి

నది. 1805 లో మరియొక నూతన యొడంబడిక గావింపబడినది. ఈయొడంబడికననుసరించి, సంరక్షణసైన్యమును పోషించుటకంగీకరింపబడియుండెను. పీష్వాతోగాని, యితరరాజులతోగాని, గలుగుసన్వర్థలను కంపెనీవారికి నివేదించుటకై యొడంబడియుండెను. 1817 లో మూడవ యొడంబడిక గావింపబడినది. దీని ననుసరించి, సంరక్షణసైన్య మభివృద్ధిచేయుటకును, అహమ్మదాబాదు కంపెనీ వారికొసంగుటకును నిర్ణయింపబడియుండెను. (అహమ్మదాబాదునకు బదులుగ మరొకప్రదేశ మొసగబడినది.)

30
మహారాష్ట్రులు
రసపుత్రులు

మహారాష్ట్రవీరులకును, రసపుత్ర యోధులకును మధ్య ప్రబలిన యుద్ధములవల్లసంభవించిన అరాజకపరిస్థితులు యీడ ఒడంబడికలవల్లనే సరిచేయబడినవి. గ్వాలియరు, ఇండోరు, ధారు, దేవాను సంస్థానములకును రసపుత్రరాజ్యములకును మధ్యగావింపబడిన ఒడంబడికలననుసరించి రసపుత్రరాజ్యములు, మహారాష్ట్రములకు కప్పముగట్టునట్లును, ఈకప్పములకు కంపెనీప్రభుత్వము తనసార్వాధికారపదవి ననుసరించి హామీనిచ్చుటకును నిర్ణయింపబడినది. ఈవిధముగ, మహారాష్ట్రులకును, రసపుత్రులకును ఒడంబడికలుగావించి యిరువురపైనను ఒడంబడికల నమలుబరుపు బాధ్యతవహించురీతిగ హేస్టింగ్సు సార్వాధికారమును స్థాపించినాడు. కాలక్రమమున, రసపుత్ర అనుబంధ రాజ్యములపై (Feudatories) యధికారము ఆంగ్లేయప్రభుత్వవశమైనది. 1921 వ సంవత్సరమునందు మాత్రమే గ్వాలియరు సంస్థానమునకు అనుబంధరాజ్యములపై తొలుదొల్తగలయధికార మొసంగబడినది. ఒడంబడికలు భగ్నమైనపుడుమాత్రమే ఆంగ్లేయప్రభుత్వము జోక్యముకలిగించుకొనుట కధికారముగలదని మరల నిరూపింపబడినది. రాజపుటానా సంస్థానములతో గావింపబడిన ఒడంబడికలననుసరించి యీసంస్థానములకు ప్రత్యేకవ్యక్తిత్వ ముంచబడినది. అంతర్గతపరిపాలనమునందు స్వాతంత్ర్య మొసంగబడినది. విదేశరాజ్యవ్యవహారములపట్ల వ్యవహరించుట కధికారము నిషేధింపబడినది. ఆయధికార మాంగ్లేయప్రభుత్వమునకు సంక్రమింపచేయబడినది. మహారాష్ట్రరాజ్యముల కొసగవలసిన కప్పములను ఆంగ్లేయప్రభుత్వముద్వారా పంపునట్లు నిరూపింపబడినది.

31 భూపాలము

భూపాల నవాబులు 1774 వ సంవత్సరమునుండియు ఆంగ్లేయులకండగనేయుండిరి. ఈవిధముగ నాంగ్లేయుల విశ్వాసమునకు పాత్రులగుటవల్ల కొంత రాజ్యభాగ మొసగబడినది. హోల్కారుతో గావింపబడిన ఒడంబడిక ననుసరించి ఓరాసంస్థానము సృష్టింపబడినది.

32 అయోధ్య

అన్నింటికంటె అయోధ్యకథ అతివిచిత్రము. నేపాల రాజ్యముతో మైత్రిని నెలకొల్పుట అయోధ్యనవాబున కత్యవసరమగు నెపమున నవాబు రెండుకోట్ల రూపాయలను కంపెనీకిచ్చుకొనునట్లు నిర్బంధింపబడినాడు. మరియు, 1818 లో నవాబును స్వతంత్ర రాజలాంఛనములతో వర్తింపవలసినదని హేస్టింగ్సు ప్రోత్సాహపరచియుండెను. హైదరాబాదు నవాబిట్లు ఒనరింప నిరాకరించియుండెను. ఇట్లొనరించుటవల్ల, మహమ్మదీయలోకముయొక్క ప్రేమను గోల్పోయిన వాడాయెను. ఢిల్లీపాదుషాయొక్క సర్వాధికారపదవిని నిర్మూలన మొనరించుటకే హేస్టింగ్సు యీయెత్తు నెత్తినాడు. అయోధ్యనవాబునకును, ఢిల్లీపాదుషాకును, గవర్నరు జనరలునకంటె ఎక్కువవ్యవహారిక మర్యాదగలదు. వీరి గౌరవార్థము 21 మార్లు తుపాకులు ప్రయోగించబడుచుండెడివి. 1831—1837 లో మాత్రమే నవాబు తనతో సమానునిగ పాదుషాచేత వ్యవహరింపబడినాడు. 1

33 నేపాళము

నేపాళముతో విసుగువిరామములేనియుద్ధము హేస్టింగ్సుచే గావింపబడినది. 1816 వ సంవత్సరమున మాత్రమే సంధిజరిగినది. గార్వాలు, కుమాను (Kumaun) సిక్కిములు కంపెనీప్రభుత్వపర మొనరింపబడినవి. కఠమండులో ఆంగ్లేయప్రభుత్వప్రతినిధి వసించుట (Resident) కును, ఆంగ్లేయప్రభుత్వాధికారమునకు లోబడియే విదేశరాజ్యములతో వ్యవహరించుటకును నేపాళసంధియందు ముఖ్యషరతులు.

---

1. See, Lee warner, Lord Dalhousie ii, 230.

34 కూచిబీహారు

ఈవిధముగనే కూచిబీహారు (Cutch) కూడ ఆంగ్లేయ సంరక్షణము నంగీకరించినది. అందువల్ల, యీసంస్థాన వ్యవహారములలోగూడ ఆంగ్లేయప్రభుత్వము జోక్యము గలిగించుకొన నారంభించినది. సింధురాజ్యముపైకి దండయాత్ర వెడలకున్నను సింధుసామీప్యసంస్థానముపై ఆంగ్లేయు లక్షకారమును చెలాయించసాగుటయే సింధు అమీరుల కలవరకారణమైనది.

35 అక్రమవర్తనము

దగాచేతను, దౌర్జన్యముచేతను హిందూదేశపురాజుల యొక్కయు, ప్రజలయొక్కయు స్వాతంత్ర్యము నపహరించి ఆంగ్లేయసామ్రాజ్యమును భారతదేశమునందు నిర్మించిన ముగ్గురుమూర్తులలోను హేస్టింగ్సు ముఖ్యవాడు. (వెల్సలీ—హేస్టింగ్సు—డల్‌హౌసీ) హేస్టింగ్సు నిర్వహించిన యుద్ధకార్యక్రమమంతయు సీమప్రయోజనముకొరకే యనుట నిర్వివాదాంశము. అనాడు నెపోలియను సీమదిగుమతులపై ప్రకటించిన బహిష్కరణమునుండి కోలుకొనుటకును, నెపోలియనుతో యుద్ధములను విజయవంతముగ కొనసాగించుటకును, భారతదేశము హేస్టింగ్సుచే రక్తస్రావము గావింపబడి, పీల్చివేయబడినది. 1

హేస్టింగ్సుయొక్క యుద్ధనీతి వివరముగ నర్థముగావించుకొనుటకాయనను గురించిన ఆరువిషయములు జ్ఞప్తియందుంచుకొనిన సుబోధకము కాగలవు. (1) లార్డుమింటోగారికి ఆయనకాలపరిమితి పూర్తిగాకపూర్వమే సీమకు పిలిపించి వేయబడెను. ఇందులకు తగిన కారణములు సుబోధకముగుటలేదు. (2) హేస్టింగ్సు గవర్నరుజనరలుగను, సర్వసైన్యాధిపతిగనుగూడ నియమింపబడియుండెను. (3) కారనువాలీసువలెనే, హేస్టింగ్సుయొక్క జీవితముగూడ అమెరికాస్వాతంత్ర్య సంగ్రామములో నపజయముగాంచినది. ఈయనగూడ కారనువాలీసు క్రింద

1. See. H. H. Wilson. VI. P. 385. See Ruin of Indian trade and industries by B. D. Basu. See also "The first letter Book of the East India Company 1600-1619 and Memorials of Indian Govt. being a selection from the papers of Henary St. George Tacker. Edited by John William Raye. P. P. 233-234.

అమెరికాలో సైన్యమునందు పనిజేసి పరాజితుడై సీమకు పారిపోయివచ్చుట నాతురటస్థించినవి. ఆ అప్రతిష్ఠను కారనువాలీసువలెనే హిందూదేశమున మాపి కొన ప్రయత్నించియున్నాడు. (4) ఆనాడు, ఐరోపాఖండములోగల రాజకీయవాతావరణము గమనింపవలసియున్నది. ఏవిధముగ నెపోలియను ఆంగ్లేయ వస్తువులను యేయితర ఐరోపాఖండ దేశములకు గాని దిగుమతిగాకుండ నిషేధించియుండెనో, నావిషయముగూడ గుర్తింపవలసియున్నది. (5) నెపోలియను నోడించుటకై యితరయూరోపుఖండ దేశములకు లంచములనిచ్చుటకు, వాటితో కుట్ర బన్నుటకు, వలయుధనమును సంపాదించవలసిన యత్యవసరము సీమ కానాడు గలిగినదనిగూడ మరుపరాదు. (6) హిందూదేశపు వస్త్ర పరిశ్రమను నశింపుజేసి, ఇంగ్లండు తనకు గావలసిన ధనమును సంపాదింపగలిగినది. 1

ఈవిధముగ సీమ కన్నివిధముల తోడ్పడియున్నను మార్క్వెసు హేస్టింగ్సు గూడ తన యుద్యోగకాలపరిమితి పూర్తిగాకుండగనే సీమకు మరలి పోవలసినవాడయ్యెను.

"యుద్ధములకై కావలసిన సైనికవ్యయమును సమకూర్చుకొనుటకై దివాళాకోరుకోశ మొసగవలసిన అన్నివిధములగు షరతులనునొసగి డబ్బుసంపాదింపవలసినవాడాయెను. అయోధ్యనవాబునుండి విశేషముగ ఋణమొసరించి యుండెను. ఇతరహామీలులేనందువల్ల ఘూర్కాలవల్ల వదలబడిన రాష్ట్రములీ నవాబున కమ్మివేయబడినవి.......రాష్ట్రములును అందలి ప్రజలును కూరగాయలవలె వాడబడిరి.........హేస్టింగ్సుయొక్క సన్నిహితసంబంధీకుడు, డబ్ల్యుపామరు అండ్ కో (W. Palmer and Co, Financing house) లో భాగస్వామిగనొనరించినాడు. ఈఋణదాతల సంఘము హైదరాబాదు నవాబునకు 100 కి 25 వడ్డీగట్టి ఋణమొసగసాగినది. ఈఋణమంతయు నైజాము నిర్బంధముగ సైన్యపోషణమునకై యిచ్చుకొనవలసివచ్చినది. కంపెనీడైరక్టరు లీ ఘోరమును మాత్రము సహింపజాలకపోయిరి. ఈసంగతి మర్యాదమీరినదని కంపెనీవారు తలంచిరి. కంపెనీవారీయనను సీమకువెంటనే మరలించిరి. 2

1. See B. D. Basu, P. 627, Second Edition.
2. See, Empire in Asia How we came by it; A book of confessions P.P. 290-291. panini office Reprint—(See. Keith P. 119) B. D. Basu 734.

"పిండారీలను నశింపుచేయుసాకున నడిపిన రెండవ, లేక, మూడవ మహారాష్ట్రయుద్ధఫలితముగ, హేస్టింగ్సు గవర్నరుజనరలుగారు కోటీశ్వరుడయినాడు. మహారాష్ట్రయుద్ధవిజయమునకై కంపెనీవారు పౌ 60,000 ల నొసగి యొక ఎస్టేటును హేస్టింగ్సునకు కొనిపెట్టి బహూకరించిరి." 1 హేస్టింగ్సు ఈవిధముగ బహూకరింపబడుటకు తగినవాడే. ఈయనగవర్నరుజనరలుపదవియందు సుమారు 50,000 ల చతరపుమైళ్ళు వైశాల్యముగల రాజ్యభాగమును కంపెనీవారికి సంపాదింపగలిగినాడు. సతారారాజునకు మినహాయింపబడిన రాజ్యభాగము తప్ప, మిగిలిన పీష్వారాజ్యమంతయును ఆంగ్లేయ పతాకముక్రిందకువచ్చినది. సింధియా, హోల్కారు, నాగపూరురాజు వీరిభాగ్యవంతములైన రాజ్యభాగములన్నియు అపరాధముక్రింద తీసికొనివేయబడినవి. ఈరాజ్యభాగములే నేడు మధ్యహిందూదేశమనియు, లేక, మధ్యరాష్ట్రములనియు, పేరున బరగుచున్నవి. (Central Provinces or Central India).

36
అమ్‌హెరెస్టు
గవర్నరుజనరలు
1823–28

హేస్టింగ్సుగారు సీమకు మరల్చివేయబడినవెంటనే గవర్నరుజనరలు కౌన్సిలునందలి ప్రధానసభ్యుడు (Senior member) ఆడమ్సుగారు గవర్నరుజనరలుగా పనిచేయవలసివచ్చినది. ఈయన 7 మాసములే యీపదవియందుండెను. ఈస్వల్పకాలములోనే యీయనఅధికారప్రాగల్భ్యమును వినియోగించి కలకత్తాజనరలు పత్రికాధిపతిని సీమకు పంపివేసెను. ఒక ఆంగ్లేయునిపై ఆడమ్సుగారి యిష్టమునకు వ్యతిరేకముగ తన పత్రికయందు వ్రాయుటయే యీయన సీమకు మరలింపబడుటకు కారణము. ఇంతలో అమ్‌హెరెస్టుగారు గవర్నరుజనరలుగా నియమింపబడి 1823 ఆగస్టు 1 వ తేదీని తనపదవిని స్వీకరించియుండెను.

37
బర్మాయుద్ధము

ఈలార్డు అమెహెరెస్టుగారే బర్మాదేశమునుండి కొంతరాజ్యభాగమును కంపెనీప్రభుత్వమునకు సంపాదింపగలిగిన గౌరవమును పొందగలిగిరి. వీరు 1824–6 సంవత్సరముల మధ్యజరిగిన యుద్ధఫలితముగ ఎండభూమిలోజరిగిన సంధిఫలితముగ 1826 జనవరి

1. B. D. Basu. P. 733.

3 వ తేదీయొడంబడికననుసరించి అరఖాను (Arkan) టెనాశరిన్ (Tenasserin) అస్సాము (Assam) కాచారు (Caebar) జయంత (Jainta) మణిపురములను కంపెనీ ప్రభుత్వము వశపరచుకొనినది. అపరాధముక్రింద నష్టపరిహారముగూడ బర్మాప్రభువునుండి కొంతపణము వసూలుచేయబడినది. కలకత్తాకు బర్మాప్రతినిధిని పంపుటకును బర్మాకు బ్రిటిషు ప్రతినిధిని రానిచ్చుటకును ఏర్పాటుగావింపబడినది. ఇది ఆచరణలోనికి రాలేదు. "బర్మాయుద్ధము తప్పనిసరిగ చేయువలసివచ్చినది. వేరుమార్గము ప్రభుత్వమునకు లేదు. బర్మాదేశము కలకత్తాపైకి దండెత్తివచ్చినది. అర్కానుదండయాత్రకై నష్టపరిహారములనుకోరినది." 1 అనికొందరి మతము. కింగుబేరింగు (Kingburing) 1811 మేలో అర్కానుమీదకు చిటగాంగునుండి వెడలిన దండయాత్రకు ఆంగ్లేయులొనరించిన కుట్రయే కారణమనియు ఆంగ్లేయులకుట్ర లేనియెడల అంతమంది తగ్గులతో నాతడు దండయాత్ర వెడలజాలడనియు కొందరిమతము. 2 "యీ క్షేత్రమున ఆంగ్లేయులుకూడ కుట్రబన్నిరని బర్మాప్రభుత్వము ఆంగ్లేయప్రభుత్వముపై నేరారోపణమొనరించుటకు తగిన కారణమున్నదని" లార్డు మింటోగారును ఆయన కౌన్సిలునుగూడ యంగీకరించియుండెను. 3

ఇట్టి హేతువులవల్ల బర్మాప్రభుత్వము నేరస్థులను తన స్వాధీనమొనరించవలెనని ఆంగ్లేయులను కోరియున్నది. ఇంతకుముందు బర్మాదేశమునుండి చిటకాంగునకు దాడివచ్చిన బర్మావారిని 1793 లో బర్మాప్రభుత్వము తగురీతిని శిక్షించియున్నది. అట్టిధర్మమును నెరవేర్చుమనియే బర్మాప్రభుత్వము కోరినది. ఇదియే రాజీరాజీ యుద్ధకారణముగ ఆంగ్లేయప్రభుత్వముచే పరిగణింపబడి బర్మారాజ్యభాగములు స్వాధీనమొనరించుకొనబడినవి. "ఈయుద్ధచరిత్రలో మర్యాదలక్షణము లేవియులేవు. 4

---

1. See Keith. P. 119.
2. B. D, Basu. P. 740–741.
3. See the Despatch of Lord Minto and his council to the court of Directors on 1st August 1812.
4. See Mayor Archer's Tours in upper India and in parts of the Himalayan Mountains Vol. ii. PP. 296–304.

38
భారతీయ సిపాయీల చిత్రవధ

ఈకథసందర్భమున మరియొక ఘోరము జ్ఞప్తికి రాకమానదు. బారకుపురమునుండి రంగూనునకు సైన్యమును పంపుటకై సర్వసైన్యాధిపతి ప్రయత్నించుచున్నాడు. విదేశగమనము మతవిరుద్ధమని విశ్వసింపబడు నాకాలమున హిందూశిపాయీలు తాము రంగూనునకు ఓడప్రయాణము చేయజాలమని సర్వసైన్యాధిపతికి లిఖితపూర్వముగ నివేదించుకొనిరి. ఈలిఖితనివేదనమే సుశిక్షణకు భంగకరమైనదని బారకుపురమునందు హైందవసిపాయీలు నవంబరు 1 వ తేదీని చిత్రవధ చేయబడిరి. "వీరిపై తుపాకీమంటలు ప్రయోగింపనారంభింపబడెను. తిరుగుబాటుదారులగు సిపాయీలందరు భయభ్రాంతులై విహ్వలులైరి. ఆయుధములు పారవేసిరి. నదియొద్దకు పోయిరి. కొందరు కాల్చిచంపివేయబడిరి. కొందరు నదిలో ముంచివేయబడిరి. యుద్ధముచేయవలెనని సిపాయీలెంతమాత్రము ప్రయత్నించియుండలేదు. అట్టిసంకల్పముగూడ వీరి కదివరకుగూడ గలిగియుండలేదు. వీరిచే భూమిపై పారవేయబడినతుపాకులు పరీక్షింపబడగా అందు మందు దట్టింపబడియుండలేదు." 1 మృదువైన శాంతియుతమగు కొన్నిహిందూస్థానీమాటలు ఆ 1 వ నవంబరు ఉదయమునందు సిపాయీలకు చెప్పబడియున్నచో ఈసిపాయీలందరు హేతువాదము సంగీకరించియుండెడివారు. ప్రభుభక్తి గలిగియుండెడివారు. 2 ఇట్లొనరింపబడలేదు. మానవచిత్రవధయే నాడుతగినదని యని యీసర్వసైన్యాధిపతి తలంచియుండెను.

39
భరతపురము ముట్టడి.
1825

భరతపురరాజ్యవ్యవహారములలో జోక్యముకలిగించుకొనుటకై ఆంగ్లేయులకెట్టియవసరమును లేదు. అయిననేమి? స్వప్రయోజనముతో జోక్యముగలిగించుకొన నిశ్చయించుకొనిరి. 1825 లో భరతపురపరిపాలకుడు దివంగతుడయినాడు. ఈయన వారసులిరువురు సింహాసనమునకై తగవులాడుకొనజొచ్చిరి. ఒకమైనరు సరియగువారసుడని అచ్చటగల ఆంగ్లేయప్రతినిధి నిర్ణయించియుండెను. ఈనిర్ణయమును అమలుజరుపుటకై సర్వాధి

1. See Kaye History of the Sepoy War. Vol. i. 1870. PP. 268-69.
2. See Kaye.

కారము వహించిన ఆంగ్లేయప్రభుత్వము సాయుధశక్తితో ప్రయత్నించవలెనని ఆంగ్లేయప్రతినిధియగు మెట్కాఫ్‌గారు గవర్నరుజనరలును ప్రోత్సహించి యుద్ధమున కంగీకరింపజేసెను. సర్వసైన్యాధిపతియగు లార్డు కంబెరు మయరు స్వయముగ 25000 మంది సైనికులతో కోటను 1825 డిశంబరు 10 వ తేదీని ముట్టడించి 1826 జనవరి 18 వ తేదీని కోటను స్వాధీనపరచుకొనెను. ఈవిధముగ అనవసరముగ భరతపురవ్యవహారమున జోక్యము కలిగించుకొనబడినది! ఈరహస్యము నాడు ఆంగ్లేయప్రతినిధిగ భరతపురమునందున్న మెట్కాపుగారి వ్రాతను పరీక్షించుచో సుబోధకమగుచున్నది.

"ఇతరరాజ్యముల వ్యవహారములలో మనము జోక్యము కలిగించుకొనరాదనుట సర్వసామాన్యముగ నందరిచేతను నంగీకరింపబడిన సిద్ధాంతమే! ఈ సిద్ధాంతమే తరుచు కంపెనీడైరెక్టర్ల సంఘముగూడ తెలియజేయుచున్నది. కాని నిరంతరము మన మీనియమము నతిక్రమించుటయే విధియగుచున్నది. ఈనియమ మనాచరణీయముగ గోచరించుచున్నది. ఈ నియమోల్లంఘనమును కంపెనీ సామాన్యముగ నామోదించుచునే యున్నది. ఆమోదించుటయేకాక కంపెనీ నియమోల్లంఘన మొనరింపనాజ్ఞాపించుచున్నది. ... ... భరతపురం రాజాగా బల్వంతసింగునొనరించుట మనకర్తవ్యము. భరతపురం సంస్థానముపట్ల నీకర్తవ్యమును నెరవేర్పవలసిన ఒడంబడికలేమియును లేకపోయినను ఆసంస్థానము మనసహాయమును కోరుటకు హక్కుగలిగి యుండకపోయినను, హక్కులను— శాసనములను— శాంతిభద్రతలను కాపాడవలసిన సర్వసంరక్షకత్వవిధి మనకు గలిగియుండుటచే నీకర్తవ్యమేర్పడుచున్నది. మరేవారసునిగాని మనమంగీకరింపరాదు. ... ... అవసరమైనయెడల మనము మనశక్తిని ప్రజ్ఞను తీవ్రముగ ప్రయోగించినచో అందలిమనుష్యుల చిత్తవృత్తులు సక్రమము కాగలవు. భరతపురమును విఖ్యాతవంతముగ ముట్టడించి స్వాధీనపరచుకొనగలిగినచో హిందూదేశమునం దంతటను మనము గౌరవము సంపాదింప గలిగినవారమగుదుము. ఇదివరకు మనకుగలిగిన అపజయమువల్ల సంభవించిన అపఖ్యాతి తొలగిపోవుట కింతకంటె మంచిదని మరియొకటి యూహింపబడజాలదు." 1

1. See Kay's selections from the papers of Lord Metcalfe p. p. 122-131.

40 ఢిల్లీ పాదుషా అవమానింపబడుట అమహెర్స్టు

ఈవిధముగనే అక్యాబు సంస్థానముపట్లగూడ జోక్యము గలిగించుకొనబడినది. ఈయుద్ధవిజయములతో గవర్నరు జనరలు అమహెర్స్టీయున్మత్తుడై పోయినాడు. మరియు బర్మాయుద్ధమువల్ల నితనిపై సీమలోగలిగిన యసంతృప్తిని తొలగించుకొనుటకై మరియొకదారి త్రొక్కినాడు. 1827 ఫిబ్రవరి 15 వ తేదీని ఢిల్లీకిజేరి 17 వ తేదీని ఢిల్లీపాదుషాను సందర్శించియుండెను. ఇట్లు సందర్శించునప్పుడు సామంతరాజులు చూపవలసిన లాంఛనములేవియు అమహెర్స్టీ పాదుషాకు చూపించియుండలేదు. పాదుషాతో సమానహోదాను ప్రదర్శించియుండెను. అనుబంధప్రభువు లొసంగెడి రీతిని బహుమానములను తీసికొనిపోలేదు. అయినను పాదుషా తనకష్టము లీడేరునేమో యని తలంచి గవర్నరుజనరలునకు ముత్యాలహారమును బహుమతిగానొసంగియుండెను. ఇందులకు మారుగ అమహెర్స్టీ తన యుత్తర ప్రత్యుత్తరములలో పాదుషాను చక్రవర్తిని సంబోధించినటుల మామూలుననుసరించి సంబోధించుటకూడ మానివేసెను.

"ఈవిధముగ లార్డుఅమహెర్స్టుగారు ఢిల్లీచక్రవర్తిగారిపట్ల అంతవరకు కంపెనీప్రభుత్వము చూపుచువచ్చిన సామంతరాజవర్తనమును లేక ఆవర్తనము రాజకుటుంబముపట్ల బ్రిటిషుప్రభుత్వ విధియని తలంపబడుటయు - విరమింపజేయబడెను. ఈవిషయమూకాలమున కొంతయాందోళనము గలిగించినది. ఆంగ్లేయాధికార స్వాతంత్ర్యమును బహిరంగముగను నిశ్చయముగను ప్రకటించుట కదియే ప్రథమ మగుట ఆందోళన కారణమైనది. అంతతో హిందూస్థానపు కిరీటము బ్రిటిషుజాతికి సమర్పింపబడినదని తలంచబడినది. 1

41 లార్డువిలియము బెంటిక్కు 1828–1835

అమహెర్స్టీగారీవిధముగ ఆంగ్లేయప్రభుత్వ సంపూర్ణ స్వాతంత్ర్యపతాకము నెగురవేసిన వెంటనే లార్డువిలియము బెంటిక్కుగారు హిందూదేశమునకు గవర్నరు జనరలుగ పంపబడిరి. మదరాసు గవర్నరుగనుండి వేలూరుతిరుగుబాటులో అపఖ్యాతిని సంపాదించి సీమకు మరలిపోయిన యీ బెంటిక్కుగారుతిరిగి హిందూదేశమునకువచ్చి తనయపఖ్యాతిని మాపుకొన

1. See Peter Auber Rise and Progress of the British Power in India Vol. ii p. 606.

వలెనను తీవ్రసంకల్పముతో గవర్నరుజనరలు పదవికై తంటాలుపడి సంపాదించి భారతవర్షమునకు వచ్చియుండెను.

42 కూర్గును లాగికొనుట 1834

ఈతృష్ణను దీర్చికొనుటకే 1790 లో కంపెనీ ప్రభుత్వము నాటి కూర్గురాజుతో గావించుకొనిన యొడంబడికను భంగముగావించి కూర్గురాజుపై బెంటిక్కు దాడివెడలెను. కూర్గురాజు రాక్షసప్రభుత్వమును కొనసాగించుచుండెనని సాకుచెప్పబడినది. కూర్గు ప్రకృతి సౌందర్యముతో తులతూగు భాగ్యవంతమగు ప్రదేశము. బెంటిక్కుగారు మదరాసు గవర్నరుగానుండుటచే కూర్గుయొక్క సౌందర్యాతిశయము లీయనకెరుక. ఆంగ్లేయులు నివసించుటకనువగు స్థానము. ఈయాశయే బెంటిక్కుదాడికి కారణము. హఠాత్తుగ గావింపబడినయొక ప్రకటనమూలముగ కూర్గు ఆంగ్లేయప్రభుత్వభాగముగ దీసికొనబడినది. రాజు బందీగ పట్టుకొనబడి కాశీకి పంపివేయబడినాడు. రాజు క్రూరుడయినచో యీయన వారసులకెవరికైనను పట్టాభిషేకము చేయవచ్చునుగదా! అట్టిపనిని బెంటిక్కు చేయలేదు. ఇది పశుబలమున గావించిన రాజ్యాపహారణమనుటకు సందియము లేదు.1

43 కబారు :—

ఇంతతో బెంటిక్కునకు తృప్తిలేదు. కబారురాజ్యము వారసు లేడనునెపమున లాగివేయబడినది.

44 మైసూరురాజు అధికారమును లాగికొనుట 1831

ఈవిధముగనే మైసూరురాజ్యమును లాగివేయ బెంటిక్కునకు కుతూహలము లేకపోలేదు. కాని నైజామునకు నగమైనను నొసంగకుండ అంతయుదీసికొనుటకు వీలులేక మైసూరు రాజ్యముపై పరిపాలనాధికారము నంతయు ఆంగ్లేయాధికారుల వశమొనరించియుండెను. మైసూరు రాజు నీవిధముగ నిర్వీర్యునిగ నొనరించుటకు హేతువులేదు. ఆయనపై గావింప

1. See L. Bowring who was for some years Chief Commissioner of Mysore and Coorg Eastern Experiences pp. 223-238 and prosperous British India p. 41. By W. Digby.

బడిన నేరారోపణమునకు సమాధానము నొసంగుటకుగూడ నీయనకు నావకాశ మొసంగియుండలేదు.

45 జయపురము :— ఈవిధముగనే బెంటికు స్వదేశసంస్థానముల వ్యవహారములలో తరుచు జోక్యము కలిగించుకొనియుండెను. జయపుర వ్యవహారములలో జోక్యముకలుగజేసికొని మైనరు రాజుపక్షమున పరిపాలనాసంఘమును నియమించెను. (Council of Regiency) జూతీరామును మంత్రిగా నియమించెను. ఈనియామకమువల్ల రాజపుతానా రాజ్యములలో నొకటగుజయపురమును కంపెనీకి స్వాధీనపరచవలెనని బెంటికు ప్రయత్నించెనని విశ్వసింపబడినది.[1]

46 జయంత :— హిందూదేశమును వీడిపోవుటకు ముందుగనే జయంత రాజు ఒడంబడికను భగ్నమొనరించెనను సాకున కొంత రాజ్యభాగమును దీసికొనెను.

47 జోధపురము :— జోధపురసంస్థానాధీశుడు కప్పమునుగట్టుట యందాలస్యమైనది. అంతమాత్రమున ఆరాజున్యాని పదభ్రష్టునిజేయ బెంటికు ప్రయత్నించెను. కప్పమునకుహామీగా సంబారు జిల్లాను, సంబారునందలి ఉప్పుచెరువునందొక(Lake) భాగమును హామీగాస్వాధీనపరచుకొనబడినవి. "ఈకృత్యము రాజునకును, ప్రజలకునుగూడ కోపోద్రేకకారణమైనది. 1835జూన్4వ తేదీని బెంటికు ఇండియానువీడిసవెనక కొలదిమాసములకే ఆంగ్లేయ సహాయప్రతినిధి చంపివేయబడెను. ప్రతినిధిబాధను తప్పించుకొనెను."[2]

48 అయోధ్య నవాబు 1831 లో బెంటికుగారు అయోధ్యను దర్శింపబోయిరి. సందర్శించినపిమ్మట అయోధ్యను లాగికొనుటకై యాశపొడమినది. బ్రిటిషుగవర్నమెంటు అయోధ్యను దీసికొనుటయే సత్పరిపాలనకు కర్తవ్యమని బెంటికుగారు 1831 వ జూలై 11 వ తేదీని వ్రాసియుండిరి. ఈవ్రాతయే డల్హౌసీగారి యగ్నిహోత్రమున కాహుతిగ పరిణమించినది.

---

1. See Political History of Jaipore p. 29.
2. History of British India Vol. ii. P, 95.

49 గ్వాలియరు

ఇట్లే మహారాష్ట్ర రాజ్యమగు గ్వాలియరునుకూడ కబళింప వలెనని బెంటిక్కు పన్నాగములను బన్నియుండెననుసంగతి యేలనో సుప్రసిద్ధముకాలేదు. 1 "కలకత్తా గవర్నరుజన రలు, కౌన్సిలుకార్యదర్శి గ్వాలియరులోనున్న ఆంగ్లేయప్రతినిధికి వ్రాయబడిన లేఖను పరీక్షించిన యీసత్యము సుబోధకమగును."

"............మహారాజుని నేను చుట్టుముట్టియున్న కష్టపరంపరలచే ముఖ్యముగ, మనప్రభుత్వముచేతనే సృష్టింపబడినకష్టములకులోనై, రాజ్యమును వీడి, బ్రిటిషుప్రభుత్వమునకు ఒప్పగించి, ఆయనరాజ్యమందలి రాబడిలోనుంచి సంతృప్తికరమగు గౌరవభృతిని దీసికొనునేమో ఊహించూడవలయును." 2

50 ఝాన్సీ దత్తత 1835

ఈవిధముగనే మధ్యరాష్ట్రములలోని యితరసంస్థానము లనుగూడ స్వాధీనపరచుకొన బెంటిక్కు పన్నుగడలను పన్నెను. 1835 లో ఝాన్సీ సింహాసనమునకై వార సత్వపుతగవు జనించినది. నలుగురు వారసులమనిరి. "ఈతరుణమున పిరోహ-రామ-భూరామొక్క సహోదరుడు వారసుడుగా పరిగ ణింపబడినాడు. రాజు దివంగతుడగుటకుముం దొకరోజున పెంచుకొనబడెనని చెప్పబడు కుర్రవాడు వారసుడుగాడనబడెను. ఈకుఱ్ఱవాడు నిజముగ పెంచుకొన బడియుండినచో దత్తతతండ్రియొక్క ఆస్థికంతకును పినతండ్రికిమారుగ నీతడే హక్కుదారుడుకాగలడు. కాని, దత్తతజరిగినదియు, లేనిదియు, విచారింప బడనేలేదు. ఇది విచారింపతగిన యొక విషయముక్రిందనే పరిగణింపబడలేదు." అని, బెంటిక్కుగారి నిర్ణయమును గురించి నాటి ప్రభుత్వకార్యదర్శియే వ్రాసి యుండెను.3 ఈవిధముగ యీరాజ్యవిషయములలో అనవసరముగ జోక్యము కలి గించుకొని, రాజకుటుంబమునందు కలహములను గల్పించి, రాజ్యమునందరాజ కము ప్రబలినదనుపేరున నీరాజ్యమును ఆంగ్లేయులవశ మొనరింపవలెననియే బెంటిక్కుగారిప్రయత్నము. బెంటిక్కుగారొనరించిన యీయుదాహరణమును

1. B. D. Basu P. 781.
2. " The house of Linolia, a sketch published in 1863 by Messers Longman Green.
3. Jhansi Blue book, P. 18.

గైకొనియే 1853 లో ఝాన్సీగారి రాజ్యమును, వారసులు లేరను నెపమున ఆంగ్లేయపతాకము క్రిందకు జేర్చిరి.

51 ఇందూరు దత్తత 1834

కాని, ఇందూరు రాజ్యమునకు, మల్హారురావు హోల్కారొక దత్తుడు. సింహాసనమున కర్హుడై యున్నను, అతని పక్షమున బెంటిక్కు ఇందూరుసింహాసన వ్యవహారములలో జోక్యము గలిగించుకొనలేదు. ఈసింహాసనమునకై నలుగురు తమహక్కు బేహక్కులను గురించి పోరాడసాగిరి. వీరిలో వీరు కలహించుకొనుటయే మంచిదని బెంటిక్కుసంకల్పము. "సంస్థాన వ్యవహారములపట్ల బోవుచున్న అసందర్భము (Inconsistency–Caprice–mutabulity) చలచిత్తత—లేకచాపల్యము—అస్థిరత్వములతోగూడిన యభిప్రాయములే హిందూదేశమున మనకుగల సర్వాధికారమునకు సంభవించుచేటు." అని ఇందూరు దత్తతపై బెంటిక్కుప్రభుత్వ మవలంబించిన రాజనీతిపై నాటి బొంబాయిగవర్నరగు సర్ జార్జిక్లర్కుగారు వ్రాసియుండిరి.

52 ఆఫ్గనుస్థానము సింధు, పంజాబులు

1839–1842 సంవత్సరములలో ఆఫగనుస్థానముతో సంభవించిన పోరాటములకును, సింధు, పంజాబులను లాగికొనుటకై గావింపబడిన యుద్ధములకును బెంటిక్కుగారే మొలకులనాటిరి. సింధునదీ నౌకావిధాన (Indus Navigation Scheme) మను మరుగున సింధు పంజాబులను లాగికొనుటకై ప్రయత్నింపబడినది. 1

"నౌకావిధాన ప్రయత్న మొకటక్కరిపని. మనప్రభుత్వమర్యాదకు తగని పని. ఈకుట్ర ఎవరిపై పన్నుచున్నామో, వారికీ టక్కరితనము తెలిసినచో, తెలియకమానదుగదా? మనపై వారికి అసూయా, ద్వేషములు పుట్టును"...... అని బెంటిక్కుగారి కౌన్సిలుసభ్యుడగు మెట్కాఫ్‌గారే వ్రాసియుండిరి. 2

1, See Captain Cunningham History of the Siks P. 205 Ist Adition.

2. See the minute dated October 1830 by Metcalfe, condemning the Sind Navigation Scheme. See also kaye's Selections from the writings of Lord Metcalfe P P. 211-217.

సింధుదేశమును, ఆంగ్లేయుల వశమొనరించుకొనవలెనను నూహగలిగి యుండియే బెంటిక్కుగారిచే మహారాజా రంజితసింగుతో 1809 లో గావించు కొనిన యొడంబడికను భంగమొనరించి, సింధుదేశమును రంజితసింగు జయించి తీసికొనరాదని నిషేధింపబడినది. రంజితసింగుపట్ల బెంటిక్కుగారు వేగులవాని వలె ప్రవర్తించిరి.[1] సిక్కురాజ్యనాశనమునకై పునాదులను బెంటిక్కుగారే త్రవ్విరి.[2]

53
ఢిల్లీ పాదుషా
రూపాయిల
ముద్రణము ;
పాదుషాబొమ్మను
దీసివేయుట.
1835

ఢిల్లీపాదుషాపట్ల బెంటిక్కుగారి నడవడిక అమరహేస్టు గారి ప్రవర్తనమునే యనుసరించినది. అమరహేస్టుగారి ప్రవర్తనమును ఏవగించుకొని పాదుషా యీవిషయమును సీమప్రభుత్వమునకు తన పక్షమున నివేదించుటకై శ్రీరాజా రామమోహనరాయలను రాయబారిగ బంప నిర్ణయించుకొని యుండెను. ఈసందర్భముననే రామ మోహనరాయలకు 'రాజా' బిరుదమును పాదుషా యొసంగి యుండెను. ఈవిధముగ రాయబారిని బంపజూచుట బెంటిక్కు సహింపజాలక పోయెను. ఢిల్లీమీదుగ బెంటిక్కు ప్రయాణము జేయుచు పాదుషాను సందర్శించి యుండలేదు. ఈవిధముగ పాదుషాను అగౌరవపరచుట ప్రధమభారత స్వాతంత్ర్య సంగ్రామమున కొక ముఖ్యహేతు వయినది.

ఈవిధముగ సందర్శింపకుండ నగౌరవపరచుటయేకాక, చెలామణి రూపా యిలపైన 1835 నుండి షాఆలెము (పాదుషా) బొమ్మను ముద్రించుట బెంటిక్కు గారిచే మానివేయబడినది. ఇంతతో చక్రవర్తిపదవి సర్వతోముఖముగ, మనోవాక్కాయకర్మల యందునను ఆంగ్లేయప్రభుత్వము తీసివేసినదనుట నిశ్చయము.

---

1. See British India Vol. II page 97 by John Malcolm Lerdlow and see also jacquemonts letters from India London 1834 Vol. ii. p 111.

2. See the Exiorence of captain Macan before the select committee of the House of Commons on the affairs of the East India Company on 22nd March. 1832.

54
సర్ ఛార్లెసు
మెట్ కాఫ్
గవర్నరు జనరలు.
1835-1836

బెంటికిక్కుగారు 1835 మార్చిలో సీమకుబయలుదేరిన నాటనుండియు 1836 వ మార్చివరకు గవర్నరు జనరలు, కౌన్సిలు సభ్యులలో ప్రధానుడగు మెట్ కాఫ్‌గారు గవర్నరు జనరలుగ బనిజేసియుండెను. "మనసామ్రాజ్యవ్యాప్తివల్ల మనము ప్రమాదస్థితియందున్నామని విపరీతముగ తలంపబడుచున్నది. అటువంటి ప్రమాదమేమియు లేకుండగనే హిందూదేశమునందంతటను మనరాజ్యము స్థాపింపవచ్చునని నాతలంపు."1 ఈమెట్ కాఫ్‌గారి యీసంకల్పమే దీర్చుకొనుటకు తగినంత ఉద్యోగకాల పరిమితి యీయనకు లభించలేదు.

55
లార్డు అకలాండు
గవర్నరు జనరలు.
1836-1841

అకలాండుగారి పరిపాలనము ఘోరమైనదని చరిత్రకారులంద రంగీకరించు విషయమే.

1839 లో సతారా రాజునకీయనయే చిట్టచివరకు రాజ్యభ్రష్టత్వమును సంప్రాప్తింపజేసెను. పోర్చుగీసువారితోను, యితర హిందూదేశ సంస్థానాధీశులతోను రాజుకుట్ర బన్నెనను సాకు జెప్పబడినది.

మదరాసు రాజధానియందలి కర్నూలునవాబు యుద్ధమునకు డీకొననున్నాడని సాకుజెప్పబడి కర్నూలురాజ్యము, ఆంగ్లేయప్రభుత్వములో కలిపి వేయబడినది.

1840 లో జలూను (Jalaun) కలిపివేసికొనబడినది. 1842 లో సూరతులో నామమాత్రముగనున్న నవాబుగిరి తీసివేయబడినది.

56
అఫ్‌గనుస్థాన
యుద్ధము

అయోధ్యనవాబుతో తిరిగి అసందర్భపుటొడంబడికగావింపబడినది. ఆఫ్‌గనుస్థానముతో రాజ్యకాంక్షతో యుద్ధము ప్రారంభింపబడినది. సింధు అమీరుల ఇష్టము కాకుండగనే సింధురాజ్యమును ఆంగ్లేయ సైన్యము బలవంతముగ అఫ్‌గను యుద్ధమునకు తీసికొనిపోబడినది. "అమీరులు సిరసులుగానున్నారు. వీరు

1. See Kaye's Selections from the papers of Lord Metcalfe.

భాగ్యవంతులను విశ్వాసము ప్రబలియున్నది. వీరి ధన మపహరింపవలెను. వీరి రాజ్యము జయింపబడవలయును. తుపాకీమడమనుజూపి లోగడ వీరితోగావించు కొనిన ఒడంబడికలు రద్దుచేయవలయును. ఈపనినంతయు అపారకృపాభిమానము లతోగూడిన మైత్రిని సాటించుచునే చేయవలసియున్నది. 1 ఈయుద్దేశ్యముతో సైన్యమును బలవంతముగ సింధుదేశముమీదుగ నడిపించుటయేకాక, సింధు అమీరులనుండి సైనికవ్యయమునకుగాను ధనముకోరబడినది. ఇందులకై యొక క్రొత్తయొడంబడిక అమీరులతోగావింప ఆంగ్లేయప్రభుత్వమునిశ్చయించినది.

"ఫరంగీల వాగ్దానముపై ఆధారపడినవారు మహాపాపులు......" మీ ఒడంబడికలు మీయిష్టము ననుసరించియు, మీఅవసరముల ననుసరించియు మార్చుకొన దగినవనియే నాకు తోచుచున్నది. మీస్నేహితులకు, మీయుప కారులకు చూపవలసిన మర్యాద యిదియేనా? మారాజ్యమునుండి మీసైన్యము నుచితముగ పోనీయవలయునని మమ్ములనుకోరిరి. మేమందుల కనుమానము లేకుండ నంగీకరించితిమి. మీసైన్యము మా రాజ్యములో ప్రవేశించిన పిమ్మట మాయధికారమునకే మీకు ప్రమాదము దెచ్చెదరని మిమ్ములను నూతనయొడం బడికకు సాలుసరి మూడువందలవేలరూపాయిలు కప్పముగ కట్టవలయుననియు, వెంటనే సైనికవ్యయముక్రింద 21 లక్షలరూపాయిల నిచ్చుకొనవలయుననియు బలవంతపరచెదరనియు గ్రహింప గలిగియుండినచో మా దేశసంరక్షణకును, ప్రాణ సంరక్షణకును వలయు నేర్పాటులనే గావించుకొని యుండెడివారము" అని నూరు మహమ్మదు, ఆకెప్టెను యీస్టులిక్కునకు సభాముఖమున నుడివియుండెను." (Captain East Wick). ఒడంబడిక కప్పుడంగీకరించి యుండలేదు. ఇట్టి కృత్యములే అమీరుల యవిశ్వాసమునకు కారణము లయ్యెను.2

**ఆఫ్గనుస్థాన అపజయము**

ఆఫ్గనుస్థానమున ఆంగ్లేయసైన్యము ప్రవేశించినది. సింహావలోకన మొనరించినది. జయించినది. షాసుజా తిరిగి సింహాసనాసీనుడుగ నొనరింపబడినాడు. ఈతడు ఆంగ్లే యుల చేతియందలి కీలుబొమ్మ. దోస్తుమహమ్మదు ఖయిదీగ పట్టుకొనబడి

1. See Kaye History of the war in Afghanstan. Vol. i. P.398-401.
2. Autobiography of Lutfullah. PP. 294-296.

హిందూ దేశమునకు పంపివేయబడినాడు. బ్రిటిషువారు ఆఫ్గనుస్థానముపట్ల ప్లాసీయుద్ధానంతరమునుండి వంగదేశమునందవలంబించిన రాజనీతినే యవలంబింప సాగిరి.1 ఆఫ్గను యుద్ధనాటకమునందలి ముఖ్యపాత్రలైన షానుజా- బరన్సు- మెక్‌నాగటను యీ ముగ్గురును ఆఫ్గనులచే కాల్చి చంపివేయబడిరి. ఈ త్రిమూర్తులు చంపివేయబడినపిమ్మట, అంతవరకును ఆఫ్గను దేశమును పీడించుచున్న ఆంగ్లేయసైన్యము, ఆఫ్గను దేశమునువీడి హిందూ దేశమునకు మరలవలసి వచ్చినది. శీతకాలమిూవిధముగ ఆంగ్లేయులు తమ యుద్యోగస్థుల కొందఱను, వారిభార్యలను ఆఫ్గనుయధికారుల చేతియందుంచి మరల వలసినవారైరి. మధ్యమార్గమున చాలమంది చంపివేయబడిరి. పలువురు శీతవాతావరణముచేత చచ్చిపోయిరి. మరికొందరు ఖయిదీలుగ పట్టుకొనబడిరి. 16 వేల సైనికులలోను తానొక్కడే బ్రతికి జలాలబాదు జేరుకొనగలిగెనని డాక్టరు బ్రయిడనుగారు నుడివిరి.2 ఈవిధముగ అకులాండుగారు ప్రారంభించిన మొదటి ఆఫ్గనుయుద్ధము ఆంగ్లేయులకు తలవంపులతో ముగియవలసి వచ్చినది.

1842 ఏప్రియలు 5 వ తేదీని షానుజా బలవంతముగ చంపివేయబడినాడు. 1842 ఫిబ్రవరి 28 తేదీని గవర్నరు జనరలు పదవి నధిష్టించిన ఎలింబరో ప్రభువు ఆఫ్గను దేశమును వీడుటయే సమంజసమగు రాజనీతియని తలంచినాడు.

57
లార్డు ఎలింబరో
గవర్నరు జనరలు
1842–1844

అకలకండుగారి పిమ్మట లార్డు ఎలింబరోగారు గవర్నరు జనరలుగ నియమింపబడిరి. ఈయనకు హిందూదేశ వ్యవహారములు కొంతవరకు దెలియును. ఇండియాబోర్డునకీయన ముమ్మారు ప్రెసిడెంటుగా పనిజేసియున్నాడు. అకలుకండుగారి ఆఫ్గను యుద్ధనీతిని నిరసించినవారిలో ఎలింబరో ముఖ్యుడు. అయనను భారతదేశమునం దీతడెట్టి రాజనీతి నవలంబింప గలిగినదియు 1833 జూలై 5 వ తేదీని లార్డులసభలో నీయనగావించిన యుపన్యాసమును బట్టియే గ్రహించుట కవకాశము గలిగినది. "స్వప్రేమతోనుండువాడెవడుగాని హిందూదేశమునందు రాజకీయ, సైనిక, అధికారమును భారతీ

1. See. B. D. Basu. P. 820–21.
2. See. B. D. Basu, P. 822.

యులహస్తములయం దుంచవలెనని తలంచబడు. ... ... భారతదేశమునందు భారతీయులను రాజకీయ, సైనికఅధికారములనుండి తొలగించివేయుటయందే మనయధికార మాధారపడియున్నది. మనమచ్చట యుండవలెనని యుండలేదు. భారతదేశ మామూలాగ్రముగ రక్తసిక్తముగాకుండ తప్పుకొనజాలని పరిస్థితులలో మనమచ్చట నుండవలసివచ్చినది. హిందూదేశ సామ్రాజ్యమును కత్తితో మనము జయించితిమి. ఈ సాధనముననే సంరక్షించుకొన వలసి యున్నది. అయితే, మన మచ్చటనే యుండుటకు వలయు పరిస్థితుల కనువగునట్టి రీతిగ ప్రజల కుపకారము చేయుచుండవలయును. 1

"సైనిక, రాజకీయవేత్తగ నుండవలె ననియే ఎలింబరో యాశయము."2 అయినను, శాంతిని వాంఛించువానిగ నుపన్యాస పరంపరలను గురిపించిన వారిలో నీయన ప్రధానుడు.3 శాంతిగీతముల పాటుననే యుద్ధములను విజయవంతముగ కొనసాగింప నావకాశముగలదని విశ్వసించి, తనవిశ్వాసము నక్లే యాచరణ యందుంచగలిగిన ఆంగ్లేయరాజకీయవేత్తలలో ఎలింబరో గూడ గణింపదగినవాడు.

58 గ్వాలియరు; సింధియా

ఎలింబరో విచిత్ర రాజనీతి కీగ్వాలియరు గురియైనది. గ్వాలియరు మహారాజు జంకోజీసింధియా, అనపత్యుడై 1843 ఫిబ్రవరి 7 వ తేదీని మరణించియుండెను. జంకోజీ భార్య 11 సంవత్సరముల బాలిక. అందువల్ల గ్వాలియరు దర్బారు జంకోజీ సన్నిహితుడగు నొక 8 సంవత్సరముల బాలకుని వారసునిగ నిర్ణయించిరి. ఈ బాలకుని పక్షమున దర్బారే రాజ్యపరిపాలన మొనరింపసాగినది. ఎలింబరో యిందులకు మారుగ, రాణీ చిన్నపిల్లయైయున్న దనునెపమున, రాణీ పక్షమున వ్యవహరించుటకుగాను దర్బారులోనున్న ఆంగ్లేయులచేతియందు కీలుబొమ్మవలె నటింపగల మామాసాహెబు రాజప్రతినిధిగ నెన్నుకొనబడున ట్లొన

1. Hausard Vol, XIX. third series. page. 191.

2. See. Nineteen Centuary for August 1899. P. 238 written by Lord Colchester who edited the letters and correspondence of Lord Ellenborough.

3. See. His speach No 4. 3rd 1841 on the eve of his departure to India, at a dinner party given in his honour by the Court of Directors.

రించెను. (Regency) ఇట్లొనరించుట తనకుసంతోషదాయకమైన పనియని గూడ ఎలింబరో లేఖవ్రాసియుండెను. అయిననేమి? ఈ మామాసాహెబు, ఎలింబరోచేతిలోని కీలుబొమ్మ. 21-3-1843 నుండి ది 8-6-1843 సంవత్సరములోపుగనే పదభ్రష్టుడై గ్వాలియరు రాజ్యమునుండి తరిమివేయబడినాడు. ఈతనిస్థానమున, దర్బారు, దాదా, ఖాజీవాలా (Khasjee walla) రాజప్రతినిధిగ నెన్నుకొనబడియుండెను. (Pegent) అయితే, యీయనకు ఎలింబరో ప్రభువు మామాసాహెబునకుగల యధికారముల నొసంగియుండలేదు. గ్వాలియరులో నంతవరకుగల ఆంగ్లేయప్రభుత్వ ప్రతినిధియగు కల్నలుస్పాయిర్సుగారు తీసివేయబడినారు. ఆయనస్థానమున కల్నలుస్లీమాను నియమింపబడినాడు. ఈయన ఎలింబరో చెప్పినట్లు వర్తింపగలవాడు. వీరిరువురునుగలిసి గ్వాలియరును స్వాధీనపరచుకొనవలెననియే తంత్రములను బన్నుచుండిరి. సాకులకై వెతకసాగిరి. గవర్నరుజనరలుగారు 13 సంవత్సరముల వయస్సుగల మహారాణీకి పెర్షియను భాషలో వ్రాసినలేఖను, ఆమహారాణి మంత్రియగు ఖాజీవాలా విప్పి ఆమెకు చదివి వినిపించుట మహానేరముగ గవర్నరుజనరలుచేత పరిగణింపబడినది. ఈ నేరమునకై మంత్రిని ఆంగ్లేయప్రభుత్వమునకు స్వాధీనమొనరింపవలయునని ఎలింబరోగారు గ్వాలియరుదర్బారును నిరోధింపసాగెను. దర్బారీమంత్రిని తీసివేసి, రామారావుఫాల్కా అను ఆంగ్లేయప్రభుత్వమిత్రుని మంత్రిగా నియమించియుండెను. అయినను, ఎలింబరో తృప్తుడుకాలేదు. హఠాత్తుగ, గ్వాలియరును సైన్యముతో ముట్టడించి ఖాజీవాలాను ఒప్పగించుకొని అతనిని ఆగ్రాకోటకు ఖయిదీగ పంపియు, ఎలింబరో తృప్తుడుకాలేదు. గ్వాలియరుసైనికబలమును తగ్గించుటయే ఆయన సంకల్పము. ముందు పంజాబును స్వాధీనపరచుకొనుటకు గ్వాలియరు సైనికబలము ప్రతిబంధక మగునేమోయని యీయనభయము. అందుచే గ్వాలియరుపై దండెత్తెను. గ్వాలియరు స్వయంరక్షణకై యుద్ధమునకుదిగుట తప్పనిసరియయినది. మహారాజపూరు, పన్నియారు యుద్ధములు 1843 డిశంబరు 29 వ తేదీని జరిగినవి. గ్వాలియరు ఓడింపబడినది. గ్వాలియరురాజ్యమునంతయు ఆంగ్లేయప్రభుత్వస్వాధీనమొనరించుకొనుచో స్వదేశసంస్థానముల తిరుగుబాటు వచ్చునేమోయని ఎలింబరో బెదరియుండెను. పార్లమెంటునందలి యతివాదులాయనను దూషింతురను భయముకూడ గలదు. అందుచేత నూతనమగు ఒడం

బడికను గావించుకొనుటయే సమంజస మని తలంచెను. గ్వాలియరు రాజ్యము, ఆంగ్లేయప్రభుత్వ అనుబంధరాజ్యముగ నొనరింపబడినది. గ్వాలియరు సైనికశక్తి తగ్గించివేయబడినది. కంపెనీప్రభుత్వ సైనిక దళమొకటి గ్వాలియరుకోటలో నుంచబడుటకు నిర్ణయింపబడినది. మైనరుయువరాజు పక్షమున పదిసంవత్సరము లాంగ్లేయాధికారులే రాజ్యముచేయ నంగీకరింపబడినది. 1

59 సింధు రాజ్య ఆక్రమణము

సింధు దేశముగూడ 1843 లో కంపెనీవారి విస్పష్టమగు నాజ్ఞల ననుసరించి ఆంగ్లేయప్రభుత్వమునకు కలిపివేయబడినది. "సింధురాజ్యమును కలిపివేసికొనుటకు కారణమును జూపుటదుస్తరము." 2 సింధు నీవిధముగ స్వాధీనమొనరించుకొనుటయే, పంజాబును పిమ్మట స్వాధీనమొనరించుకొనుటకు మార్గమైనది. "అత్యుపయోగమైన, అన్యాయమైన, మానవుడు చేయగలిగిన దుష్కార్య మిదియే. సింధును స్వాధీనమొనరించుకొనుటకు మనకు హక్కులేదు. అయినప్పటికి మన మట్లుచేసి తీరవలయును." అని సింధును స్వాధీనమొనరించుకొనిన సర్ ఛార్లెసు నేపియరుగారే వ్రాసియుండిరి. 3

60 కత్యాలు స్వాధీనపరచుకొనుట

"1809 లో ఆంగ్లేయప్రభుత్వము కత్యాలు, సిక్కురాజ్యముతో నొడంబడిక గావించుకొనియుండెను. ఈరాజు వారసులులేకుండగ చనిపోయియుండెను. అందువల్ల యీ రాజ్యము, ఆంగ్లేయప్రభుత్వమునకు చెందినదని ఆంగ్లేయ చరిత్రకారులు వ్రాయ సాహసించుచున్నారు. ఇది ఒకప్పుడు, ఆంగ్లేయులచే రాజున కొసగబడియున్నచో నిస్సంతువల్ల తిరిగి చెందిన దనవచ్చును. కాని, నిస్సంతునెపమున లాగికొనిన రాజ్యము చెందిన" దనుట సమంజసముకాజాలదు. మరియు, నీరాజుయొక్క ఆడంగులును, మంత్రివర్గమునుకూడ ఆంగ్లేయసైనికుల నెదిరించియే చివరకు రాజ్యమును విడిచిరి. 4

---

1. See. B. D. Basu for more details.
2. Keith. P. 121.
3. See, Lights and Shadows of Military life P. 323. by Sir Charles Napier, the Conqueror of Sindh.
4. See. Ellenborough's letter dated Agra April 20. 1843 to the Queen.

61
ఢిల్లీపాదుషా

నామమాత్రముగ నున్న ఢిల్లీపాదుషాపదవిపై ఎలింబరో గారిదృష్టిగూడ ప్రసరించినది. ఇంతవరకు, ఆంగ్లేయు లాయనను దర్శించుచుండుటయు, కానుకల నొసంగుచుండుటయు నాచారముగ నున్నది. ఆయాచారమునుగూడ ఎలింబరో మానివేసి నాడు. పాదుషాపదవిని, సీమరాణికి చెందింపజేయవలెనని సామ్రాజ్యతత్వవేత్తయగు ఎలింబరో తలక్రిందుల ప్రయత్నములనుజేసి అందుల కింకను అదనురాలేదని తలంచి యూరకుండెను. పాదుషాను ఢిల్లీకోటనుండి బయటకుతరిమివేయవలెనని కూడ ఎలింబరో దలంచియుండెను. కాని, ఆసంకల్పమును కొనసాగించుకొనలేదు.

"ముసలిరాజును బలవంతముగ కోటనుండి బయటకు తరిమివేసితి మను దృశ్యము గోచరించరాదు. నాపిమ్మట వచ్చు గవర్నరుజనరలు, పాదుషాకు పిమ్మట వచ్చు పాదుషాతో నేదో యొకవిధమగు ఏర్పాటుగావించుకొని ఢిల్లీ కోటను, రాజ్యమునకు ముఖ్యస్థానమును వశపరచుకొనగలడు. భారతీయ సామ్రాజ్య పురాతనముఖ్యస్థానమగు ఢిల్లీ మన చేతులయం దుండవలయు ననియు ఆఢిల్లీనుండియే మన రాజ్యపరిపాలన జరుపవలయు ననియు, నాకు చిర కాలమునుండియు గల మహోన్నతాదర్శము." అని ఎలింబరోగారు తమ లేఖలో వ్రాసియుండిరి.[1]

నైజాము రాజ్యమునుగూడ ఆంగ్లేయుల వశమొనరించుకొనవలెనని ఎలింబరోకు సంకల్పము గలదు. ఉత్తరహిందూస్థానవ్యవహారములలో జిక్కుకొని నైజామువంకకు ఎలింబరో పూర్తిగ తన దృష్టిని ప్రసరింపజేయజాలకపోయెను.

62
ఎలింబరో
మరలింపబడుట.

ఎలింబరోగారు హిందూదేశమున తనఉద్యోగకాల పరిమితి నంతయు గడిపి యుండినచో నైజాము అయోధ్య మొదలగు సంస్థానములు గూడ ఆంగ్లేయ పతాకముక్రిందకు తేబడి యుండెడివే. కాని రెండుసంవత్సరముల ఆరుమాసములు మాత్రమే ఆయన హిందూదేశమున పనిచేసియుండెను. ఈ రెండు సంవత్సరముల

1. See. Ellenborough's letter 18 Dec. 1842 to Walmer Castle in reply to his letter dated 27 th Sep. 1842.

న్నర కాలములోను వెల్సలీగారికంటె హెచ్చుయుద్ధములను గావించియుండెను. ఈయనరాజనీతిని కంపెనీ డైరెక్టరులు సంపూర్ణముగ నామోదించి యుండలేదు. పార్లమెంటునందలి వ్యతిరేకపక్షముగూడ ఎలింబరో చర్యలను తరచు ఖండించుచు వచ్చిరి. ఈయన యొక్క నిరంకుశప్రభువు. నిరంకుశత్వముతో హిందూదేశమును పరిపాలింప సంకల్పించినవారిలో నీయన అగ్రగణ్యుడు. కంపెనీ డైరక్టరులే యీయన నిరంకుశపరిపాలనా విధానమును, సహింపజాలకపోయిరి. ఉద్యోగ కాలపరిమితి పూర్తికాకుండగనే నీమ కీయనను మరలించివేసిరి. 1844 ఆగష్టు 1 తేదీని గవర్నరు జనరలుపదవిని ఎలింబరో వదలివేయవలసివచ్చినది. 1

63
లార్డుహార్డింజి
1844-48

ఈయన స్థానమునందు గవర్నరుజనరలు పదవియందు నియమింపబడిన సర్ హెనరీహార్డింజిగారు ఎలింబరో రాజనీతినే యాచరణ యందుంచిరి.

64
పంజాబు.

ఈయన యుద్యోగకాలమే రెండు శిక్కుయుద్ధములకును కారణమైనది. ఈయుద్ధముల ఫలితముగనే 1849 లో పంజాబును ఆంగ్లేయప్రభుత్వము వశపరచుకొనినది. పంజాబు నందలి సిక్కురాజ్యమును వశపరచుకొనవలె నని చాలకాలమునుండి కంపెనీ ప్రభుత్వముచేయుచున్న కృషిని హార్డింజిగారు సఫలపరచిరి.

65
కాశ్మీరము.

1846 కాశ్మీరమొక అనుబంధరాజ్యముగ నొనరించి గులాబుసింగునకు బహుమతిగ నొసంగబడినది. ఈతడే సిక్కురాజ్య విద్రోహి. సిక్కులతో 1846 లో మొదటి యొడంబడిక గావింపబడినది. ఈయొడంబడిక ననుసరించి సిక్కురాజ్యము స్వాతంత్ర్యమును గోల్పోయినది. చాలరాజ్యభాగమునుగూడ ఆంగ్లేయప్రభుత్వ వశమొనరింపబడినది. మొదటియొడంబడిక వ్రాసినత్రాత మాయనైనను మాసిపోలేదు. సిరా అయినను ఆరలేదు. మొదటియొడంబడిక ననుసరించి

1. See Sir Robert Puts private letter to Hardinge to know more about Ellenborough.

కాశ్మీరమును విద్రోహియగు గులాబుసింగునకొసంగుట కంగీకరించలేదని రెండవ యొడంబడిక నిర్బంధించి గావింపబడినది. లాహోరుదర్బారున కధికారిగనున్న లాలుసింగు పదచ్యుతుడయినాడు. మైనరు రాజాపక్షమున ఆంగ్లేయప్రభుత్వమే 8 సంవత్సరములు రాజ్యభారమును వహించుట కంగీకరింపజేయబడినది. ఆంగ్లేయ మంత్రి రాజ్యమును పరిపాలింప నిర్ణయము; రాణికి అధికారమేమియు నుంచలేదు. సాలుసరి పౌ 15000 లు పింఛను నిచ్చుటకేర్పాటు గావింపబడినది. ఈవిధముగ సిక్కు స్వాతంత్ర్యమపహరింప గలిగినందులకు హార్డింజికి హిందూదేశ ప్రభుత్వాదాయమునుండి సాలుసరి పౌ 3000 లు పింఛనునిచ్చుటకు కంపెనీ తీర్మానించినది. 1847 లో సీమప్రభుత్వపు మంత్రివర్గము మారాడుటచే హిందూదేశపు గవర్నరు జనరలగు హార్డింగుగారు తమపదవికి రాజీనామానొసంగి 1848 జనవరి 18 వ తేదీని హిందూదేశమునువీడిరి. వీరిస్థానమున లార్డుడల్హౌసీగారు నియమింపబడిరి.

డల్హౌసీగారి గవర్నరు జనరలుపదవిక్రింద ఆంగ్లేయ సామ్రాజ్యస్థాపనము పూర్తిఅయినది. సామ్రాజ్య స్థాపనముకొరకు దేశమును రక్తసిక్తమొనరించిన కడపటి గవర్నరు జనరలు డల్హౌసీ. భారతదేశమునం దాంగ్లేయ రాజ్యస్థాపనము సంపూర్ణమొనరించుటకై డల్హౌసీగారుచేయని పనికిమాలిన పని యేదియును లేదు. సైనికశక్తి ప్రదర్శింపబడినది. మోసగొండితనమున కంతులేదు. ఒడంబడికలు భగ్నమొనరింపబడినవి కపటనాటకము లాడబడినవి.

66
లార్డు డల్హౌసీ
1848
దత్తతల సిద్ధాంతము.

1848 లో డల్హౌసీ గవర్నరుజనరలుపదవికి రాకపూర్వమే రాజ్యములను కంపెనీ ప్రభుత్వమునకు కలిపివేయుట ప్రారంభింపబడినవి. వీలయినంతవరకు దత్తత నిరాకరించుచు రాజ్యములను కలిపివేయవచ్చునను సిద్ధాంతము 1834 లోనే కంపెనీ నిరూపించినది. ఆంగ్లేయ ప్రభుత్వాధీనముగనున్న ఏ సంస్థానమునకైనను (1) ఆంగ్లేయప్రభుత్వముచే సృష్టింపబడిన రాజ్యభాగమైనచో, లేక, (2) సామంతరాజులుగనుండి వారిపై పాదుషా, పీష్వాలస్థానమున సర్వాధికారము కంపెనీకి సంక్రమించియున్న రాజ్యములైనచో, అట్టిరాజ్యములు నిస్సంతుగా నుండినయెడల వాటికి దత్తతాధికారమును తరచుగ నొసగరాదని

కంపెనీ నిర్ణయించినది. మహారాష్ట్రరాజన్యుల కాలమునందిట్టి సిద్ధాంతముగలదని కొందరి వాదము. రసపుత్రులు, సామంతరాజులును సంతానములేనివారయి నపుడు దత్తతాధికారము మహారాష్ట్రసార్వభౌములకు చెందియుండెడిదనియు, దత్తతాధికారము నొసగునపుడు కొంత రాజ్యభాగమును పుచ్చుకొనుటకును, లేక, కప్పమును వృద్ధిచేయుటకును, లేక, రాజ్యాధికారప్రసరతులు మార్పుదలచేయుటకును, మహారాష్ట్రరాజన్యు లధికారమును గలిగియుండెడివారనియును ఆంగ్లేయ చరిత్రకారులవాదము.[1] ఇట్టి యధికారమును మహారాష్ట్రసార్వభౌములు గలిగియుండినను, వారెన్నడును హిందూదేశసాంప్రదాయములకు విరుద్ధముగ దత్తత స్వీకారమును నిరాకరించిన యుదాహరణములు చరిత్రయందు గోచరించుటలేదు. సంతానములేని నెపమున రాజ్యములను ఆక్రమించివేసికొనుట హిందూరాజ్య యుగమునందు గాని, మహమ్మదీయరాజ్య యుగమునందుగాని గోచరింపదు. రాజ్యతృష్ణాపరులైన కంపెనీరాజ్యమునందే యీవిధాన మాధిపత్యము వహించినది. డల్హౌసీకిపూర్వమే దత్తతనిరాకరింపబడి, కొలాబా, మండలీ, అంబాలా రాజ్యములు కంపెనీ ప్రభుత్వముచే నాక్రమించుకొనబడినవి. డల్హౌసీ పరిపాలనమున దత్తత నిరాకరింపబడి సతారారాజ్యము 1848 లో యాక్రమించుకొనబడినది.

67 సతారా.

ఈ సతారారాజ్యము కంపెనీచేత సృష్టింపబడినదికాదు. శివాజీయొక్క వంశపారంపర్యముగ నున్న రాజ్యము.

68 సంబలపురము.

ఈవిధముగనే సంబలపురము 1849 లో దత్తతనిరాకరింపబడి ఆక్రమించుకొనబడినది.

69 నాగపురము. 1854

1853 లో నాగపురపురాజు కాలగతినొందియుండెను. సంతానములేదు. దత్తత కుమారుడుగలడు. ఈతనితో నిమిత్తములేకుండగ నాగపురమాక్రమించి వేసికొనబడినది.

ఈ నాగపురరాజ్యము స్వాతంత్ర్యము గలిగియుండెనని 1826 లోనే ప్రకటింపబడియుండెను. ఆంగ్లేయప్రభుత్వ మిత్రమండలిలో నొక

1. See. Keith, P. 122.

రాజ్యముగ నొడంబడిక గావించుకొనబడియుండెను. అనుబంధ రాజ్య భాగముగ పరిగణించుటకైన పీలులేదు. గవర్నరు జనరలుగారి కౌన్సిలు సభ్యుడగు 'లా' గారీ విధముగ నాగపుర మాక్రమించుకొనుట తగనిపనియని ప్రతిఘటించిరి. విఫలులైరి. సతారా రాణీపట్లనవలెనే నాగపుర రాణీపట్లగూడ అన్యాయముగ ప్రవర్తింపబడినది.1

70 డల్హౌసీ విభజనము

డల్హౌసీగారు స్వదేశసంస్థాన రాజ్యముల రెండువిధము లుగ విభజించిరి. (1)సామంతరాజ్యములు, అనుబంధ రాజ్యములుగనుండు రాజ్యములు (Tributary and subordinate) ఇట్టి రాజ్యములు దత్తతనుగావించుకొనుటకు కంపెనీప్రభుత్వమువారి యామోదమును పొందవలసియున్నవి. (2) కంపెనీ వారిచేత సృష్టింపబడిన రాజ్యములు ; ఇట్టి రాజ్యములకు దత్తతాధికారమేలేదు. నాగపురమును కంపెనీవారిచేత సృష్టింపబడినరాజ్యముగ డల్హౌసీ పరిగణింప సాహసించినాడు. ఈతనిచర్యను కంపెనీడైరక్టరు లామోదించియుండిరి.

71 ఝాన్సీ

ఝాన్సీ కథ భారతదేశమునందు సుప్రసిద్ధము. పీష్వాల కాలము నాటినుండియు నొకసుబేదారుచే పరిపాలింప బడుచుండెడిది. అనగా, పీష్వాలచే నియమింపబడిన గవర్నరుచేత పరిపాలింపబడుచుండెడిని. పీష్వారాజ్యము మాసిపోవుటతో దీనిపై సర్వాధికారములు కంపెనీప్రభుత్వమునకు సంక్రమించినవి. కంపెనీ ప్రభుత్వ మీరాజ్యమునకు దత్తతాధికారమును నిరాకరించుటకు హక్కును గలిగియేయున్నదని ఆంగ్లేయచరిత్రకారులవాదము. 2 ఈవాదమున చరిత్ర కారులామోదింపవలసిన సత్యముగోచరింపదు. 1817 నవంబరు 18 వ తేదీని ఈ ఝాన్సీ సుబేదారునితో కంపెనీప్రభుత్వమొక ఒడంబడికగావించుకొనినది, అందు ఝాన్సీరాజ్యము వంశపారంపర్యముగ సుబేదారులవంశస్థులచే పరిపాలింప

1. See The Empire in Asia. Major Evans Bell has discussed at great length the question of annexation of Nagapur in his two works, viz, "The Empire in India and Prospects and Retrospects of Indian Policy.

2. See. Keith. P. 123.

బడుటకు కంపెనీప్రభుత్వ మంగీకరించినది. ఈయంగీకారపత్రము ననుసరించియే ఝూన్సీరాజ్యము ఆంగ్లేయప్రభుత్వముచే నిర్మింపబడిన రాజ్యముగ వ్యాఖ్యానము గావింపబడినది. కాని, సంతానములేనపుడు ప్రభుత్వవశమగునని ఒడంబడికలో వ్రాయలేదు. వంశపరంపరగ ననుభవించుటయని యుండుటచే దత్తతాధికారముగూడ నిందుచేరియేయున్నది. అయినను, డల్హౌసీ ఝూన్సీరాజునకు దత్తతాభిప్రాయమేలేదని గూడ ప్రకటించి 1854 ఫిబ్రవరి 27 వ తేదీని ఝూన్సీని ఆక్రమించివేసికొనెను. 1

"1835 లో ఝూన్సీవారసులుగ నలుగురు బయలుదేరిరి. వారసత్వపు స్పర్థజనించినది. దత్తతచేసికొనలేదని జెప్పెడివారనేకులు కొందరుగలరు. అందువల్ల 1835 లో దత్తతజరిగినదా? లేక దత్తతకై యొకరు నిరూపింపబడిరా? అనుఅంశము సంశయాస్పదము. (Nomination or adoption). 1853 లో మాత్రము దత్తతవిషయమై యెట్టిసంశయమునులేదు. 1835 లో ఝూన్సీ దత్తతపట్ల గావింపబడిన నిర్ణయమునకు తోడుగనుండగలిగిన దేమియునులేదు. ఇందుల కుదహారణముగ చూపగలిగినదియు, మరియొకటిలేదు." అనిబెల్లుగారు వ్రాసిరి.......... 2

ఈనిర్ణయ ఫలితముగనే ఝూన్సీలక్ష్మీబాయి వీరవనితయై 1858 వ సంవత్సరపు ప్రథమభారత స్వాతంత్ర్య సంగ్రామమునందు ప్రళయకాల రుద్రదేవతవలె మూర్తీభవించి వీరస్వర్గ మలంకరించినది.

72
ఇతర రాజ్యములు
దత్తత నెపమున
లాగి వేసికొనబడినవి

ఈవిధముగనే సంతానములేకుండ రాజులుచనిపోయినందున దత్తతలు నిరాకరింపబడి 1849 లో సంబలపురము (మధ్యరాష్ట్రములలో నిది నేడు బీహారులోనున్నది) నుజ్జయపురములను కంపెనీ ప్రభుత్వ మాక్రమించికొనినది.

---

1. See. Marquess of Hastings, private journal. P. 313 Pavini Office Reprint. The tittle of Subadar was changed to that of Raja in 1832 during the regime of Lord William Bentick.

2. See Retrospects and Prospects of Indian Policy. P. 24 by Bell.

73
తంజావూరు :- ఈసిద్ధాంతము నుపయోగించియే 1855 లో తంజావూరు గూడ నాక్రమించుకొనబడినది. "తంజావూరును వారసు డగు కొడుకు లేడను నెపమున తనరాజ్యమున గలిపి వేసి కొను టకు కంపెనీ ప్రభుత్వమున కెట్టి యధికారమును లేదు. అని ప్రీవీకౌన్సిలు తీర్పులో వ్రాయబడియుండెను. 1

74
కర్నాటక నవాబు :- కర్నాటకనవాబు 1855 లో చనిపోయెను. ఈతని తరు వాత అజిముజాకు, నవాబుబిరుదము నొసగియుండలేదు. అనాడు లార్డుహారిసుగారు మదరాసుగవర్నరు. "అధి కారములేని నామమాత్రపురాజరికము అధికారపుదిష్టిబొమ్మ. ఇది నశింపు కావల యును. ఎప్పుడైనను ఇట్టిస్థానములు రాజద్రోహమునకు మూలము గావచ్చును." అని మదరాసుగవర్నరుగారు వ్రాసిరి. ఈనామమాత్రపు నవాబుగిరీ తీసివేయ బడినది. ఈవిధముగ డల్హౌసీకాలమునందే విపరీతముగ రాజులు వారసులు లేకుండగ చనిపోవుట యాశ్చర్యకరము.

75
అయోధ్య నవాబు:-
1856
"అయోధ్యనవాబులు తరతరములనుండియు చెప్పనలవి గానంత రాజభక్తితో కంపెనీపట్ల వ్యవహరించుచుండిరి. వీరిని పదభ్రష్టులుగ నొనరించుటకు ఏసాకునుగాని ఎవరును నూహించుటకుగూడ నావకాశములేదు." 2 1837 లో అకులాండుగారు గావించిన ఒడంబడిక ననుసరించి అయోధ్య పరిపాలనమునందు కంపెనీవారు జోక్యముగలిగించుకొనుట కధికారముగలదు. కాని యీఒడం బడికను కంపెనీ యంగీకరించి యుండలేదు. ఈసత్యమెవరికిని అకలాండుగారు తెలిపియుండ లేదనబడుచున్నది. 1847 లో హార్డింజిగారు నవాబును మందలించి యుండిరి. 1849—1855 లో అయోధ్యయందున్న కంపెనీప్రభుత్వప్రతినిధులు— నవాబుపరిపాలన అధ్వాన్నముగ నున్నదని వ్రాసిరి. అయినను 1855 లో ప్రభుత్వప్రతినిధి జేటురాముగారీరాజ్యమునుకలిపివేసికొనుటకు వ్యతిరేకులు. కాని కంపెనీప్రభుత్వ మయోధ్యపై చిరకాలమునుండి కన్ను వేసియున్నది. అందుచే

1. See. Bell Empire India.
2. Keith. P. 123.

అయోధ్యను స్వాధీనమొనరించు కొనుటకు ఆతురతతోనుండి ఆతృష్ణను 1856 లో తీర్చికొనినది. నవాబుకుటుంబమునకు సరియగు గౌరవభృతులుగూడ సకాలమునం దొసంగబడియుండలేదు. ఈరాజ్యసైనికబృందములు చెదరగొట్టివేయబడినవి. ఈసైనికవర్గము సిఫాయీల తిరుగుబాటునందు ముఖ్యస్థానము వహించియుండిరి.

76 బీరారును లాగుకొనుట

సత్పరిపాలన లేదనునెపముననే బీరారుగూడ వశపరచుకొనబడినది. ఆనాడు బీరారు నైజాము రాజ్యమునం దుండెడిది. 1853 లో యీరాజ్యమును డల్హౌసీ కంపెనీకి స్వాధీనపరచెను. పిమ్మట కర్జను బీరారును కంపెనీకి శాశ్వతకాలునకు దీసికొని బీరారును నైజామువదలివేయునట్లొనరించియుండెను. అధికసైన్యపోషణ నెపమున బీరారు లాగివేయబడినది.

77 యుద్ధములు:—

ఈవిధముగ చాలారాజ్యములు మోసగొండితనమున దగాగానుమాత్రమే కంపెనీచేత ఆక్రమించుకొనబడినవి. బర్మాలో కొంతభాగమును పంజాబులో కొంతభాగమును స్వాధీనపరచుకొనుటకు మాత్రమే, డల్హౌసీ యుద్ధములను జేసియుండెను.

డల్హౌసీకి పిమ్మట హిందూదేశమునందలి ఆంగ్లేయ సామ్రాజ్యమును పెంపొందింపగల వారెవరునులేరు. డల్హౌసీ గీచిన సరిహద్దు గీతలను మార్చగలిగిన వారెవరు లేకపోయిరి. డల్హౌసీ గవర్నరుజనరలు పదవికి 23 సంవత్సరములకు పిమ్మట జరిగిన రెండవ ఆఫ్గనియుద్ధమువల్లను, 30 సంవత్సరములకు పిమ్మట జరిగిన బర్మాయుద్ధమువల్ల మాత్రమే సరిహద్దులు విస్తరింపబడినవి.

డల్హౌసీ రాజ్యనీతిని కంపెనీ పూర్తిగ నామోదించుచువచ్చినది. హేస్టింగ్సు వెల్సలీలు ప్రారంభించిన సామ్రాజ్యనిర్మాణము డల్హౌసీ పూర్తిచేయగలిగెను. సంస్థానములన్నింటితోను కంపెనీప్రభుత్వ మేదోయొక పద్ధతిని ఒడంబడికలను గావించుకొనినది. కొన్నింటిని స్వాధీనపరచుకొనినది. మరికొన్నింటిని అనుబంధరాజ్యములుగ తీసికొనినది.

78
పాదుషాపదవి
అంతరించినది
చక్రవర్తిత్వము

డల్హౌసీ నామమాత్రముగనున్న పాదుషాపదవిని తీసివేసి ఢిల్లీకోటను ఆంగ్లేయప్రభుత్వవశ మొనరించుకొనవలె నను సంకల్పముండెడిది. రెండవబహదూర్‌షా మరణించిన వెంటనే ఫకీరుద్దీను; పాదుషా వారసుడు. ఈయన గవర్నరుజనరలును సమానునిగా జూడ నంగీకరించి యుండెను. కోటను కంపెనీప్రభుత్వమునకు స్వాధీన మొనరింప నిశ్చయించియుండెను. కాని 1856 లో ఫకీరుద్దీను మరణించుటచే ఈయేర్పాటు విఫలమైనది. నామమాత్రపు పాదుషాపదవి గూడ ఏనాడయితే పాదుషా రాజద్రోహనేరమునకై విచారింపబడి (సిఫాయీల తిరుగుబాటులో జేరినందులకై విచారింపబడి) రంగూన్ నందు నిర్బంధింపబడెనో ఆనాడే అంతరించిపోయినది. పాదుషా 1862 లో మరణించుటతో యిందులకై విచారించువారుగూడ లేకపోయిరి. హిందూదేశమునందు చక్రవర్తిత్వము సర్వాధికారము. ఆంగ్లేయప్రభుత్వ మానాటి నుండియు బహిరంగముగ చెలాయింపసాగినది.

# 18. 1813 నుండి 1853 వరకు పార్లమెంటు శాసనములు

1793 వ సంవత్సరమునందు ఒసగబడిన అధికారపత్ర శాసనమునందు నిర్వచింపబడిన రాజ్యాంగవిధానము, యూరపుసంగ్రామకాలమునందు ముఖ్య విషయములయం దెంతమాత్రమును మార్పు చెందియుండలేదు. స్వల్పవిషయములయందు పార్లమెంటుశాసనముల ననుసరించి కొంతమార్పు సంభవించుచు వచ్చినది.

1
1797
శాసనము
కారనువాలీసు

ఆంగ్లేయులు స్వదేశసంస్థానములకు ఋణములిచ్చుచుండు నాచారమువల్ల హేస్టింగ్సు గవర్నరుజనరలుగూడ, ఆశాపిశాచమునకులోనై అమర్యాద పాల్పడవలసివచ్చినది. 1797 వ శాసనమునను సరించి కంపెనీప్రభుత్వము వారియొక్క, లేక, స్థానికప్రభుత్వముయొక్క అనుమతిలేనిదే స్వదేశసంస్థానములకాంగ్లేయులు ఋణ మొసగరాదని నిషేధింపబడినది. ఈ

శాసనముననుసరించియే, హేస్టింగ్సు నైజామునకు ఋణమిప్పించుటయు, దాని ఫలితముగ తనపదవికి రాజీనామా నొసగిపోవుటయు తటస్థించినది.

ఈ శాసనమే వంగదేశమునం దాచరణయందున్న శాసన విధానము నావిర్భవింపజేసినది. కారనువాలీసు చాల (రెగ్యులేషనులను) శాసనరూపమగు నిబంధనలను గావించియుండెను. ఈనిబంధన లన్నియు 1793 లో క్రోడీకరింపబడినవి. ఈ క్రోడీకరణము 1773 వ సంవత్సర శాసనము ననుసరించియే చేయబడలేదు. నవాబుగారి శాసనాధికారమంతయు సంక్రమించినవానివలె, శాసనములుగావింప దొడంగెను. కాని, 1781 వ సంవత్సరశాసనము ననుసరించి గవర్నరుజనరలునకు లభింపజేయబడిన శాసనాధికారము, సవిస్తరమును, సంపూర్ణమును గాదను సంశయము కారనువాలీసునకు లేకపోలేదు. పార్లమెంటును, గవర్నరుజనరలుగారి శాసనాధికారమును గురించిన శాసనములను గావింపవలెనని కారనువాలీసు కోరుట కిదియే కారణము. ఈతని కోరిక ననుసరించియే యీతడు గావించిన శాసన నిబంధనలన్నింటిని పార్లమెంటు అంగీకరించినది. ఈనిబంధనలు వంగదేశ పరిపాలనకు సంబంధించి గావింపబడినవి. ఆస్తులహక్కులకు సంబంధించిన నిబంధనలన్నియు క్రోడీకరింపబడి ప్రకటింపబడవలయునని పార్లమెంటు నిర్ణయించినది. రాష్ట్రీయకోర్టు లీనిబంధనల ననుసరించియే న్యాయవిచారణ గావింపవలెనని పార్లమెంటు నిర్ణయించినది. ఈనిబంధనల నకళ్లు కంపెనీ డైరక్టరులకును, ఇండియా బోర్డునకును పంపవలెననిగూడ పార్లమెంటు శాసనమునందు గలదు. ఈశాసనము ననుసరించియే కలకత్తాసుప్రీముకోర్టున కిరువురు జడ్జీలు (ప్రధాన న్యాయమూర్తిగాక) మాత్రమే చాలునని జడ్జీలసంఖ్యను తగ్గించినది. మదరాసు, బొంబాయిలలో రికార్డు కోర్టులను సృష్టించినది.

2
1800–1823
శాసనములు

1800 సంవత్సరమునను, 1823 వ సంవత్సరమునను పార్లమెంటు గావించిన శాసనముననుసరించి సుప్రీము కోర్టుల యధికారములు మార్చబడినవి. (ఈయధికారములు వేరొకచోట వ్రాయబడినవి.) 1800 సంవత్సరపు శాసనము ననుసరించి వంగదేశమునకు చేర్చబడిన కాశీ మొదలగు రాజ్యభాగముల పైనగూడ కలకత్తా సుప్రీముకోర్టున కధికారమొసగబడినది.

1807 వ సంవత్సరమున, మదరాసు, బొంబాయి గవర్నరులకును, వారి కౌన్సిలునకునుగూడ శాసనాధికార మొసగబడినది. ఈనగరములకును, వీటికి చేర్చబడిన రాజ్యభాగములకును వీరిశాసనములు వర్తింపచేయబడినవి. ఈశాసనాధికారము, రిగ్యులేటింగు శాసనమునందు వంగదేశమునకొసగబడిన శాసనాధికారములవలెనే యున్నది. కాని, యీశాసనములు సుప్రీముకోర్టు వారిచేతను, రికార్డుకోర్టువారిచేతను, గూడ నామోదింపబడవలె నను నిబంధన మేర్పరుపబడినది. కాని, 1753 వ సంవత్సరపు అధికారపత్రము ననుసరించియే మదరాసు, బొంబాయీలు శాసనాధికారమును చెలాయించుచుండెడివి. 1800 సంవత్సరము నుండియు వంగదేశమునందువలెనే కంపెనీవారి కోర్టుల నిబంధనలతో జోక్యము కలిగించుకొనుటకై మదరాసు ప్రభుత్వమున కధికార మొసగబడినది. ఆనాటికి మదరాసు రాజ్యభాగము విస్తరించుటయే యిందులకు కారణము.

3
సైన్యము.
1799-
శాసనము

కంపెనీవారికిగల ఆంగ్లేయ సైనికదళములను గురించి 1799 వ సంవత్సరపు శాసనముననుసరించి నిర్ణయింపబడినది. హిందూదేశమునందు సైనికోద్యోగములయం దుండదలచిన వానిని సీమప్రభుత్వమే యుద్యోగములకు తీసికొని, కంపెనీవారి కవసరమువెంబడిని, కంపెనీ కోరికపై సీమప్రభుత్వ మొసగుచుండుటకు నిర్ణయము. ఈసైనికశాఖ సంఖ్య మొత్తము 3000 మందికంటె మించరాదు. లేక, తిరుగుబాటుదారుల శాసనము ననుసరించి (Mutiny Act) నిర్ణయింపబడిన సంఖ్యకు మించరాదు. కంపెనీకూడ 2000 మందికి హెచ్చుగాని సైనికసంఖ్యను తరిఫీతు నొసగవచ్చును. సైనికోద్యోగులను నియమించుటకుగూడ నధికార మొసగబడినది. హిందూదేశమునకు ప్రయాణముచేయుటకు ఓడ నెక్కునంతవరకును, సైనికులకు సీమతిరుగుబాటుదారుల శాసనము వర్తించునట్లును, పిమ్మట హిందూదేశపు తిరుగుబాటుదారుల శాసనము వర్తింపజేయుటకును శాసింపబడినది.

4
పార్లమెంటు విచారణ సంఘము; 1808

1813 లో, కంపెనీవారికి అధికారపత్రమును తిరిగియొసగుటకుముందు పార్లమెంటు హిందూదేశ వ్యవహారములను గూర్చి విచారించుటకై యొకసంఘమును నియమించినది. ఈసంఘము 1808 లో నియమింపబడినది. ఈనివేదికలను పరిశీలించుచో, ఆనాటికి హిందూదేశమునగల న్యాయశాఖ— పోలీసుశాఖాపరిపాలనములను గురించియు, భూమిశిస్తునిర్ణయములను గురించియు సవిస్తరముగ బోధపడగలదు. ఇందీసంఘమువారి అయిదవ నివేదిక యతిప్రాముఖ్యమైనది. ఈసంఘము, వెల్సలీగారి యుద్ధనీతివలన సంభవించిన ఆర్థికపరిస్థితులనుగురించి విశేషముగ విచారించినదే కాని, వెల్సలీగారియుద్ధనీతిని గురించి మాత్రము విచారించలేదు. కంపెనీయొక్క ఋణవిమోచనకై సీమప్రభుత్వమును కంపెనీ సహాయము గోరియుండుటయే, కంపెనీవ్యవహారములను గురించి యోజనజరుగుటకైగల కారణము.

1811 సంవత్సరాంతమున సీమప్రభుత్వము, హిందూదేశవర్తక వ్యాపారమునం దందరాంగ్లేయులు పాల్గొనుటకధికారమును గలిగియుందురని తన యభిప్రాయమును తెల్పినది. వర్తకవ్యాపారమును, రాజ్యాధికారమును అవినాభావ సంబంధము గలవనియు, నవి వేరుజేయుటకు వీలులేనివనియు, అందువల్ల వర్తకవ్యాపార ప్రత్యేకసౌకర్యములు కంపెనీకే చెందియుండవలెననియు, కంపెనీ వాదించినది. కంపెనీప్రభుత్వముక్రింద నుండనివారిని హిందూదేశమునకు పోనిచ్చుటవల్ల చాలప్రమాదములు గలవనికూడ కంపెనీయు, వారనుహేస్టింగ్సును వాదించిరి. వీరినేరములను సుప్రీముకోర్టులును, ప్రధాన నగరమందుండు యితరకోర్టులును మాత్రమే విచారించుట కధికారముగలిగియుండుటచే, వీరికి నేరములొనరించుట కెక్కుడు సావకాశములున్నవనియు, అందువల్ల యితరులకు హిందూదేశమునకుపోవు స్వాతంత్ర్య మొసగరాదనియు కంపెనీవాదము. సీమప్రభుత్వమును, కంపెనీయు, నీవిషయమై నాడు రాజీపడిరి. హిందూదేశమునకు వలసపోవనెంచువారు లైసెన్సులను పొందునట్లు నిర్ణయింపబడినది. స్థానికప్రభుత్వ నిబంధనలకు బద్ధులైయుండవలెననియు, వీరి నివాసస్థానములను

గురించి స్థానికప్రభుత్వములొనరించు నియమములకు కట్టుబడియుండవలయు, ననియుగూడ నిరూపింపబడినది.

5
1813 సంవత్సరపు శాసనము.

1813 వ సంవత్సరపుశాసనము గావించుటకు పూర్వము పార్లమెంటు 13 తీర్మానములను గావించి యుండెను. ఈతీర్మానఫలితములే పై నిర్ణయములు. ఈతీర్మానముల యందలి ముఖ్యసూత్రములే 1813 వ సంవత్సరపు శాసన స్వరూపము.

(1) హిందూదేశమునందలి కంపెనీవారి రాజ్యభాగములపై, రాజ్యాధికారమును, రాజ్యాధికారము ననుసరించిన రాబడులపైన కంపెనీకిగల హక్కును తీసివేయబడలేదు.

(2) కాని, యీరాజ్యభాగములపై సీమదేశప్రభువునకు సర్వాధికారము గలదని విస్పష్టముగ ప్రకటింపబడినది.

(3) ఈయధికారము మరి యిరువదిసంవత్సరములవరకు నొసగబడినది.

(4) కంపెనీవారికి చైనావర్తకమునందునను, హిందూదేశపు టీవర్తకము నందునను ఏకస్వతంత్ర వ్యాపారాధికార మొసగబడినది. (Monopoly). ఇతర వర్తక వ్యాపారమునం దందరాంగ్లేయులకును సమాన వర్తక వ్యాపారాధికార మొసగబడినది. స్వతంత్రవ్యాపార సిద్ధాంత మంగీకరింపబడినది. (Free Trade)

(5) వర్తక లాభనష్టములనుజూపు లెక్కలను — పరిపాలనా — ఆదాయ వ్యయములను జూపులెక్కలను వేరువేరుగ నుంచవలయునని నిర్ణయింపబడినది.

(6) ఇండియాబోర్డునకు సంపూర్ణ పరీక్షాధికార మొసగ బడినది. (Superintendence).

(7) కంపెనీయొక్క ఋణము తగ్గించుట కంగీకరింపబడినది.

(8) 100 కి 10½ వంతున లాభమును పంచిపెట్టవచ్చును. మిగిలిన లాభమున ఆరింట ఐయిదువంతులు సీమప్రభుత్వమునకు చెందుట కేర్పాటు.

(9) కంపెనీడైరక్టరుల సంఘమే యుద్యోగస్థులనందరిని నియమించుటకు గల యధికారము తీసివేయబడలేదు. కాని, గవర్నరుజనరలు, గవర్నరులు, ప్రధానసైన్యాధిపతి యుద్యోగ నియామకములకు చక్రవర్తిగారి యామోదము తుది నిర్ణయముగ నొనరింపబడినది. మరికొన్ని యితరయుద్యోగనియామకములకు ఇండియాబోర్డువారి యంగీకార మవసరముచేయబడినది.

(10) ఇంగ్లండునందు 1805 లో సృష్టింపబడిన హైలీబర్రీ (Heiley bury) కాలేజీ ఆపుచేయబడకుండ నడిపించుటకును, యిందులో వరుసగ రెండుసంవత్సరములు (Four terms) శిక్షను బొందిన వారినిమాత్రమే సివిలుయుద్యోగములకు నియమించుటకును నిర్ణయింపబడినది. ఎడిస్కోంబు పాఠశాలగూడ సైనిక విషయములకై కొనసాగింపబడుటకును నిర్ణయింపబడినది. ఈ రెండుపాఠశాలలపైన, ఇండియాబోర్డునకు పెత్తన మొసగబడినది. ఈవిధముగనే కలకత్తా మదరాసులలో వెల్లులీగారిచేత నేర్పాటుగావింపబడిన పాఠశాలలనుగూడ ఇండియాబోర్డువారే నిర్వహించుటకు నిర్ణయము. (ఇండియాయందలి పాఠశాలలు, సివిలుసర్వీసు ఉద్యోగులు భారతీయభాషలను నేర్చుకొనుటకై పెట్టబడినవి.)

(11) హిందూదేశ ప్రభుత్వాదాయమునుండి కర్చులను భరించు పద్ధతిని సీమప్రభుత్వము హిందూదేశమునకు పంపు ఆంగ్లేయసైనికదళ సంఖ్య 20,000 మందిగనుండ నిర్ణయము.

(12) హిందూదేశ మందలి ప్రభుత్వములు భారతీయ సైనికులపట్ల తగు నియమావళిని గావించుటకును, శాసనములను గావించుటకును, సైనికశాసనము నమలుజరుపు సైనికకోర్టుల నేర్పాటు జేయుటకునుగల కంపెనీ యధికారము విస్పష్టపరుపబడినది.

(13) కంపెనీడైరక్టరులయొక్కయు, ఇండియాబోర్డుయొక్కయు నామోదముతో హిందూదేశమునందలి సుప్రీముకోర్టుల యధికారమునకు లోబడియున్న పౌరులందరిపైన పన్నునువిధించుటకు హిందూదేశ ప్రభుత్వముల కధికార మొసగబడినది. అట్టిపన్ను నొసగ నిరాకరించువారికి కారాగృహశిక్షనుగూడ

విధించుట కధికారమొసగబడినది. స్వదేశరాజ్యములు స్వాధీనమగుటవల్ల, సంక్రమించుటవల్ల లభించిన పన్నువిధించు నధికారమున కీయధికారము తోడుగ నొసగబడినది. ఆంగ్లేయపౌరులపై స్వదేశసంస్థానాధికార సంక్రమణము ననుసరించి పన్నువిధించుటకుగల యధికారము సశాస్త్రీయము కాదేమోయను సంశయమే యీయధికారమొసగుటకు కారణము.

(14) స్వేచ్ఛావ్యాపారమువల్ల విశేషముగ ఆంగ్లేయవర్తకులు వలసపోవుటకు సిద్ధపడియుండుటచే, మేజస్ట్రీటులకు, ఆంగ్లేయపౌరుల నేరములను విచారించుటకుగూడ నధికారమొసగబడినది. (Tresspass or Assult and small debts due to Indians). హిందూదేశస్థుల కాంగ్లేయులొసగవలసి యుండు స్వల్పఋణములను గురించి విచారించుటకుగూడ మేజస్ట్రీటుల కధికారమొసగబడినది. రాష్ట్రముఖ్యస్థాన నగరములకు పదిమైళ్ళదూరమునందు నివసించెడి, వర్తకముచేసెడి లేక, స్థిరాస్తిని గలిగియుండెడి, ఆంగ్లేయపౌరులపై తేబడు సివిలుకేసులను రాష్ట్రీయకోర్టులే విచారించునట్లుగ నేర్పరుపబడినది. క్రిమినలు నేరములను విచారించుటకై ప్రత్యేకపు ఏర్పాటులు గావింపబడి, అధిక సౌకర్యము లొసగబడినవి.

(15) హిందూదేశమునకు వర్తకులుగను, లేక, మిషనరీలుగను పోవువారు కంపెనీ డైరక్టరులచేత లైసెన్సును పొందవలసియున్నది. వీరు నిరాకరించుచో, ఇండియాబోర్డున కప్పీలుగావించుకొనుటకు సావకాశము లేర్పరుపబడినవి. ఈ విధముగ లైసెన్సును పొందినవారిని సద్వర్తనగలిగి, నియమావళికి లోబడి, యుండినంత కాలమే హిందూదేశమునం దుండనిచ్చుటకును, లేనియెడల, తిరిగి పంపివేయబడుటకును సావకాశములు గల్పింపబడినవి. లైసెన్సుపొందకుండ హిందూదేశమునకు పోయియుండిన వారిపై, దగావర్తకులపై విధించుట కధికారముగల శిక్షలనన్నింటిని హిందూదేశమునందే విధించుటకు కంపెనీప్రభుత్వమున కధికారమొసగబడినది. ప్రధాననగరమునకు పదిమైళ్ళదూరమున నివసించుటకు లైసెన్సును పొందినవారు ఆ జిల్లాకోర్టులో రిజిష్టరుచేయించుకొనవలసియున్నది.

(16) ఆంగ్లేయ పౌరులొనరించు దొంగతనము, దగా, మోసగొండి తనము, నాణెముల ముద్రణము మొదలగు నేరములకై శిక్షలను సూచించు ప్రత్యేకనియమము లొనరింపబడినవి.

(17) ప్రతిసంవత్సర మొకలక్షరూపాయిలు వాఙ్మయాభివృద్ధికిని, పండిత సత్కారమునకును, శాస్త్రపరిశోధనములకును ప్రత్యేకింపబడినవి. ఈసొమ్ము కంపెనీ ప్రభుత్వమునందున్న భారతీయ పౌరులక్రింద వినియోగింపవలె నను నిర్ణయము.

(18) క్రైస్తవమతవ్యాప్తికై బిషపును పంపుటకుగూడ నిర్ణయింపబడినది. ఈయనకర్చు హిందూదేశపు ప్రభుత్వాదాయమునుండియే భరింపబడినది.

1813 వ సంత్సర శాసనమునందలి ముఖ్యవిషయము లివి. వీటి యంత రార్థమును గ్రహించు టత్యవసరము.

6.
అంతరార్థములు

1813 వ సంవత్సరమునుండియే హిందూదేశమునందలి ఆంగ్లేయ ప్రభుత్వవర్తకనీతి మారినది. వర్తకనీతి 1813 వ సంవత్సరశాసనము నాటనుండియే ప్రారంభమైనది. అంతవరకును, వర్తకమునకై ఏర్పరుపబడిన కంపెనీ హిందూదేశ సంస్కృత పదార్థములను ఐరోపాదేశముల కెగుమతి చేయుచుండెడిది. అందువల్ల హిందూదేశపరిశ్రమలు నశించిపోవలేదు. కాని, 1813 నుండియే హిందూదేశపరిశ్రమలు నశింపజేయ ప్రయత్నింపబడినవి. స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతము మరుగున హిందూదేశపు బజారులన్నియు, సీమసరకులతో నింపివేయబడినవి. సీమయందు తయారుకాబడిన సరకునకై విడుదల బజారులు కావలసి వచ్చినవి. ఇందులకై, సీమవర్తకులు, కంపెనీవారి, ఏకవర్తకస్వాతంత్ర్య మాటంకముగనున్నది. ఈగుత్తవ్యాపారము నశించినగాని స్వేచ్ఛావ్యాపారమునకు స్థానములేదు. గుత్తవ్యాపారము నశింపుజేయవలెనని పలువురు సీమవర్తకులు పార్లమెంటునకు నివేదించుకొనిరి. ఇందుతోబాటు నెపోలియను బెర్లినులో గావించిన నిర్ణయముననుసరించి ఆంగ్లేయపదార్థముల విడుదలకై యూరపు బజారులలో స్థానములేకుండ పోయినది. హిందూదేశపు బజారులును యితర

తూర్పుదీవులును మాత్రమే లోకువగ గోచరించినవి. "తూర్పుదీవులతో స్వేచ్ఛా వ్యాపారము నొసగుచో అవసరమైనన్ని క్రొత్తబజారులు లభించగలవు. వర్తక మచ్చట స్థాపించుకొనవచ్చును. నేడు శద్దిబద్ధములేక ఫ్రాన్సును పరిపాలించుచున్న (నెపోలియను) యూరపుఖండపు ఆజన్మశత్రువుగావించిన నిషేధములను ధిక్కరింపగలుగుదుము. సీమదేశవర్తకమును స్వేచ్ఛావ్యాపారముతో ఏవిధమైన నిరోధములేకుండగ యీమహాభాగ్యవంతమైన, విశాలమైన, దేశముల వెంట ప్రవహింపనిచ్చుచో, ధనవంతుడైన, సాహసికుడైన, న్యాయవంతుడైన, అపజయములేని ఆంగ్లేయవర్తకునకు, ఏయితరప్రతిరోధమును నిరోధింపజాలనిది కాజాలదు. ఎట్టి యీర్ష్యయు దాటనేరనిది కాజాలదు. ఎట్టి కష్టమును, హృదయ దౌర్బల్యమును తేజాలదు. ఎక్కడ ఏది అవసరమో దానిని సరఫరా చేయగలదు. ఎచ్చట కోరికలు లేవో (సీమవస్తువులకై) అట్టి కోరికల తనివి దీర్చుట మూలముగ నూతనవాంఛితములను సృష్టింపగలదు." అని షెఫీల్డుగారు పార్లమెంటునకు బంపిన పిటీషనునందు వ్రాయబడినది. 1

నూతనవాంఛితములను స్పష్టించుటనుగురించి హాల్టుమెకంజీగారు 1832 ఫిబ్రవరి 23 వ తేదీని కామనుల సభోపసంఘ సమక్షమునం దొసంగిన సాక్ష్యముగూడ గమనీయము.

"యూరపుదేశీయులతో కలిసిమెలిసి చరించుటవల్ల సారాయములను త్రాగునలవాటు హెచ్చుచున్నది. నైతికసిద్ధాంతముల ననుసరించి దుఃఖింపదగినదైనను రాబడికి చాల తోడ్పడుచున్నది. వారినొకర్లు సామాన్యముగ మంచిదుస్తులనే వాడుచుందురు. దుస్తులు పన్నులకు లోబడియుండుటచే (రివిన్యూ) రాబడి హెచ్చుచున్నది. కలకత్తాయందుండి నేనీవిషయములను నిర్ణయించుచుండుటచే ఆంగ్లేయషోకిలా సరకులలో భారతీయులు మునిగిపోవుచుండు స్వభావము హెచ్చుచున్నదని చెప్పగలను. వారి యిండ్లలో నేడు మంచిసామానులుగలవు. చాలమంది గడియారములను వాడుచున్నారు. సారాయములను త్రాగుటకుగూడ అలవడియుండిరి. 2

1. See. Thornton IV 216 for Shefield's Advised Petition.
2. See. Mr. Halt Macken Zie's Evidence before the Commons Committee on the 23 rd Feb. 1832.

"కలకత్తాయందు నేడు సారాయములు విరివిగ భారతీయులచే నుపయోగింపబడుచున్నవి. కొనగలిగిన వారందరు కొనుచున్నారు." అని బ్రాకెనుగారు 1832 మార్చి 24 వ తేదీని తమ సాక్ష్యమునందు కామన్సు సంఘమునకు దెలిపిరి.[1] ఈపరివర్తనముకొరకే 1813 వ సంవత్సర శాసనము ననుసరించి యీస్టిండియా కంపెనీకి గుత్తవ్యాపారము తొలగింపబడినది. స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతము సీమప్రయోజనమున్నకై వినియోగించుకొనబడినది.[2]

7 స్వేచ్ఛావ్యాపారము

సీమయొక్క స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతమున కర్థమేమి? "సీమ దేశము తన తయారైన సరకునంతయు హిందూ దేశముపై బడ వేయవలయు ననియేకాని, హిందూ దేశములో తయారైన ఒక్కసరకునైనను సీమకు దిగుమతి చేసికొనవలయునని స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతమున కర్థముకాదు. భారత దేశమునుండి దూదిని దిగుమతి చేసికొనుచున్నమాట నిజమే. సీమయందలి యంత్రములచే హిందూ దేశమునందలి కంటె చౌకగ బట్టలను నేయకలుగుటచేతనే దూది తీసికొనబడుచున్నది. "మీరు నేతనుమానివేయుడు. ముడిదినుసు మాకు పంపుడు. మేము మీకు నేసిపెట్టెదము." అని చెప్పబడును. ఈవర్తకులును, పారిశ్రామికులును హిందూ దేశ శ్రేయోభిలాషులుగ ప్రకటించుకొనుచున్నారు. ఇందులకుమారుగ హిందూ దేశవిరోధులమని చెప్పుకొనియున్నచో హిందూ దేశపరిశ్రమల నన్నింటిని నశింపుచేయుటకంటె మరేమి వీరు చేయగలరు?" (మిత్రులనబడేవారు.)[3]

మంత్రులు, "భారత దేశ సరకుపై దిగుమతి సుంకములను తగ్గించవలెను. సీమసరకులపై అత్యల్పముగ సుంకములు విధింపబడినవి. అత్యధికముగ భారతీయ సరకుపై సుంకములు విధింపబడినవి. ఇదియేనా (స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతముయొక్క) పరస్పరసహాయము? ఇదియేనా స్వేచ్ఛావ్యాపారము?" అని పార్లమెంటులో 1833 లో ఛార్లెసుపోర్చునుగారు నుడివిరి. స్వేచ్ఛావ్యాపార

---

1. See. Mr. Braken's Evidence on 24 th March 1832 before the Commons Committee.

2. భారత దేశము — ఆర్థిక చరిత్ర: అ. గోవిందాచార్యులు, చూడుడు.

3. See. Thornton IV. 241—42.

సిద్ధాంతపు మరుగున ఆంగ్లేయవర్తకవ్యాప్తిని గావించుకొనుటకే కంపెనీకి అంత వరకుగల గుత్తవ్యాపారాధికారము 1813 లో తొలగింపబడెననుట నిశ్చయము.

"ఆనాడు సీమవారి యీ కపటచిత్తవృత్తిని గ్రహింపగలిగినవారు లేరు. విద్యావంతుడును దూరదృష్టియుగల రామమోహనరాయిగూడ నాడుగ్రహింప జాలక పోయినాడు. ఆనాడే 1813 లో ఆంగ్లేయప్రభువులపై చిత్తవృత్తిని భారతీయులు గ్రహింపగలిగియున్నచో ఆనాడు అమెరికాలో విప్లవకాలమున విజయము గాంచినటులనే హిందూదేశమునందుగూడ స్వదేశీయోద్యమము విజయవంతమై యుండెడిది.[1] ఈవిధముగ సీమవర్తకవ్యాపారము నభివృద్ధి గావింపవలెనని గలిగినసంకల్పమువల్లనే స్వదేశరాజ్యముల నాక్రమించుకొనిన రాజనీతిని యపరోక్షముగ సీమప్రభుత్వ మంగీకరించినది. 1793 సంవత్సరమునం దొసంగబడిన అధికారపత్రములో రాజ్యవిస్తీర్ణత సీమకు గౌరవభంగమని ప్రకటింపబడియుండియు 1813 లో ఆశాసననియమము కంపెనీవారిచే వ్యతిరేక ముగ నాచరింపబడుటనుగురించి ఎట్టివిచారణయును పార్లమెంటు జరిపియుండలేదు. 1813 సంవత్సరమునకు పిమ్మటనైనను వెల్సలీగారి రాజనీతి మరేగవర్నరుజనరలు చేతను అనుసరింపబడకుండ 1813 వ శాసనమునందు నిషేధింపబడలేదు. కంపెనీ వారిసైనికబలమువల్ల సంపాదించినరాజ్యాధికారమువల్లనే నేడు హిందూదేశము నందుమనకుగల వర్తకములభించినది. ఈ రాజ్యాధికారమే లేకపోయినచో స్వదేశరాజుల యీర్ష్యలకును పన్నులకునులోబడి అత్యల్పవ్యాప్తియందే బంధింపబడియుండెడిది. టిప్పుసుల్తానువంటివారిచే నిషేధింపబడిగూడ నుండెడిది." అని నాడు మదరాసుగవర్నరుగానున్న సర్ థామసుమన్రోగారు వ్రాసియుండిరి. ఈ హేతువువల్లనే రాజ్యవ్యాప్తి ప్రయత్నము నిరోధింపబడియుండలేదు.

8 తేయాకు వర్తకము

కంపెనీవారికి తేయాకువర్తకముపట్లను చీనావర్తకము పట్లను గుత్తవ్యాపారాధికారము నుంచుటకును తేయాకు వ్యాపారమునందు కంపెనీ ప్రత్యేకించి యుండుట యొక కారణము. టీ ఆసీమదేశమున ఆహారపదార్థములలో నొకటియైనది.

---

1. See B. D. Basu. p. 629.

మరియు టీ దిగుమతివల్ల సీమప్రభుత్వమునకు సాలుసరి 40 లక్షల పౌనులు ఆదాయము లభించుచువచ్చినది. టీవర్తకమునందుమార్పు సంభవించిన ఆదాయము తగ్గునను భయమును, ఆదాయముతగ్గిన నెపోలియనును ప్రతిఘటించుట దుర్లభమనియును గల భయముచే తేయాకువర్తకమునందు కంపెనీకి గుత్తవ్యాపారముంచబడినది. ఈవిధముగనే చీనాదేశవర్తకముగూడ ప్రత్యేకపరిస్థితులయందున్నది. కంపెనీకి గుత్తవ్యాపారమును తొలగించుచో అసలుచీనాదేశముతో వర్తకము నశించునేమో నను పరిస్థితులానాడు గలవు. అందువల్ల కంపెనీకి గుత్తవ్యాపారముగూడ ప్రత్యేకించబడెను.1

ఈవిధముగ వర్తకమంతయు స్వేచ్ఛావ్యాపారమున కొసంగబడుటచే ఆంగ్లేయులు తండోపతండములుగ భారతదేశమునకు వలసరా ప్రారంభించిరి. 1813 నకు పిమ్మట 18 సంవత్సరములలోను హిందూదేశమునకు లైసెన్సులను పొంది 1324 మంది ఆంగ్లేయులు వచ్చియుండిరి. 2

9
కంపెనీ నౌకర్లు

పిట్టుగారిశాసనము ననుసరించి కంపెనీయుద్యోగస్థుల నెవరినైనను సీమకుమరలించుటకు సీమరాజున కధికారము గలదు. ఈయధికారమును 1806 లో గవర్నరు జనరలు సర్ జార్జిబార్లోగారిపై ప్రయోగించబడినది. ఉద్యోగకాలపరిమితి పూర్తికాక పూర్వమే వెనుకకు మరలింపబడినాడు. కాని హిందూదేశమందలి కంపెనీ సిబ్బందీ చాలవరకు సరియగునది కాదని పార్లమెంటుసభ్యులు తరుచు విమర్శించుచునేయుండిరి. ఉన్నత వంశీకులను- విద్యావంతులను పంపినగాని రాజ్యపరిపాలనము సక్రమముగ జరుగనేరదను విశ్వాసమభివృద్ధి గాజొచ్చినది. హిందూదేశమునందలి సివిలు మిలిటరీ యుద్యోగములన్నియు పోటీపరీక్షలలో గెలుపొందినవారికి మాత్రమే యొసంగవలయునని లార్డు గ్రీనువిల్లుగారు పార్లమెంటుచర్చలలో నుడివిరి. 3 కలకత్తాలో వెల్సలీగారు కళాశాలనుస్థాపించుట యందిదియే యుద్దేశ్యమని కొందరిచరిత్రకారుల నిర్వచనము. కాని ఈ పని

1. See Wilson.
2. See Roberts P. 278.
3. Thoronten iv. 233.

నెరవేరలేదు. హిందూదేశభాషల నభ్యసించుటకు మాత్రము కలకత్తా- మదరాసు- బొంబాయి కళాశాలల లుపయోగించినవి. ఈకళాశాలలే సివిలుసర్వీసు వారి యుపయోగార్థము భారతీయప్రభుత్వ కోశమునుండి పోషింపబడసాగినవి. ఈవిధముగనే సాలుసరి లక్షరూపాయలు ప్రజోపయోగము నిమిత్తము ప్రత్యేకించుట హాస్యాస్పదముగ నుండుటయేకాక యిం దంతరార్థముగూడ నున్నది.

10
క్రైస్తవమత ప్రచారము.

హిందూదేశమునకుబోయి అచ్చట నివాసముండువారు భారతీయులయం దుపయోగకరమైన విజ్ఞానమును-మతనైతిక ప్రచారమును వృద్ధిచేయవలెనని 1813 శాసనమునందు నిరూపింపబడినది. క్రైస్తవమత ప్రచారమునుగావించుటయే యిందుల కర్థము. ఈప్రచారముకొరకే బిషపునునియమించి క్రైస్తవమత ప్రచారశాఖ నిర్మింపబడినది. ఈశాఖకగు ఖర్చులన్నియు భారతదేశమునందలి కంపెనీ ప్రభుత్వకోశమే భరించునట్లు శాసింపబడినది. మతవిషయమున ఆంగ్లేయ ప్రభుత్వము తాటస్థ్యమువహించి యుండెననిచెప్పుట సత్యదూరమని 1813 శాసనాంతరమునుండియు చెప్పవచ్చును.

11
1813 శాసనమునకు కారణములు.

"వెల్లస్లీగారుగావించిన యుద్ధములకేమైన కారణములను చెప్పిన చెప్పవచ్చును. గాని హేస్టింగ్సుగావించిన యుద్ధముల కెట్టికారణములుగాని నిరూపింప వీలులేదు. ఫ్రెంచివారు స్వదేశరాజులతో కుట్రచేయుచున్నారనుటకు వీలులేదు. ఆంగ్లేయచరిత్రకారులు మనకు చెప్పకపోయినప్పటికిని 1813 లో కంపెనీకొసంగబడిన నూతన అధికారపత్రమునందలి యధికారములను పరిశీలించుచో స్వదేశరాజులతో గావింపబడిన యుద్ధములకు రెండుకారణములు గోచరించకమానవు. ఈకారణముల నిరూపించుటలో నంశయములేదు. (1) హిందూదేశమందలి కంపెనీరాజ్యము విస్తరింపజేసి సీమసరకులకు వలయు బజారుల నేర్పరచికొనుట. (2) హిందూదేశమునందలి అరణ్యప్రదేశము నంతయు కంపెనీప్రభుత్వము స్వాధీనపరచుకొని ఆంగ్లేయులు వసతు లేర్పరచుకొనవలెనను సంకల్పము.1"

1. See B. D. Basu 632.

"ఈనాడు హిందూదేశము దరిద్రమయమైయుండుటకును సర్వైశ్వర్య సంపన్నమగుదేశము క్షామదేవతకాకరమై రోగపీడితమగుటకును భారతీయు లనీతిపరులై యుండుటకును సుశిక్షితులుగా లేకపోవుటకును హిందూదేశమునం దశాంతి ప్రబలియుండుటకును మొదలగుకష్టములకన్నింటికి 1813 సంవత్సరపు శాసనమే విశేషముగ కారణమని చెప్పవచ్చును. ఈశాసనము భారతీయుల పురోభివృద్ధికి దారితీయలేదు. ఇందువల్లభారతీయుల కెట్టిహక్కులును లభించలేదు.[1]

1813 వ సంవత్సరమునందు మరియిరువై సంవత్సరములకు కంపెనీవారి కొసంగబడిన నూతనాధికారపత్ర మింతటి భావగర్భితమైయున్నది.[2]

12
1814 వ
సంస్కరణ శాసనము

1814 లో మరియొక శాసనము గావింపబడినది. ఈ శాసనము ననుసరించి హిందూదేశ ప్రభుత్వములకు సుంకములను నితరవిధములగు పన్నులను ఆంగ్లేయపౌరుల మీదను విదేశీయులమీదను నితరులమీదను విధించుట కధికార మొసంగబడినది.

13
1815
శాసనము

1815 లో మరియొక శాసనముగావింపబడినది. ఈశాసనము ననుసరించి నగరసరిహద్దులను పెంపొందించుటకు హిందూదేశ ప్రభుత్వముల కధికారమొసంగబడినది. హిందూదేశవాసులుగాని లేక ఆంగ్లేయ పౌరులుగాని కానివారిని హిందూదేశమునుండి పంపివేయుటకు హిందూదేశ ప్రభుత్వముల కధికారముగల్గింప బడినది.

14
1819
శాసనము

1819 లో హిందూదేశ సైనికశాలలో నుద్యోగస్థులుగ ఏ హిందూదేశ ప్రభువు నైనను చేర్చుకొనుటకుగాను కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారి యనుమతిని ముందుగ పొందవలెనని శాసింపబడినది. (Foreign Enlistment Act of 1819)

1. See B. D. Basu, p. 632.
2. See Wilson. B.K. Ch. 8 and appendix X which gives the 13 resolutions passed by the Parliament prior to the passing of this act of 1813.

15 ఇతర వివరములు

1820 1820 సంవత్సరమున కంపెనీ సిబ్బందీనుండియే 800 మందికి మించని కాల్బలమును తయారుజేయుటకు కంపెనీ కధికారమొసంగబడినది.

1823 సంవత్సరమున హిందూదేశమున పనిజేయుచున్న
1823 సీమప్రభుత్వసైనికదళములకు పింఛనుక్రింద పౌ 60,000లు హిందూదేశ ప్రభుత్వకోశమునుండి యొసంగబడినది. మరియొక శాసనమునను సరించి సైన్యములో తిరుగుబాటుదారులను శిక్షించుటకై గావింపబడిన నియమములన్నియు క్రోడీకరింపబడినవి.

1828 లో బొంబాయియందున్న నావికాదళము తిరుగు
1828 బాటుదారుల శాసనాధికారమునకు లోబరుపబడినది. (Mutiny Act) 1818 లో కంపెనీ నౌకల నద్దికిపుచ్చుకొను నియమములు క్రోడీకరింపబడినవి. 1823 లో గావింపబడిన నౌకాశాసనము ననుసరించి యితర ఓడరేవులన్నింటితోను నౌకావర్తకము కొనసాగింపవచ్చునని శాసింపబడెను. చైనా ఓడరేవులు మాత్రము కంపెనీకి ప్రత్యేకింపబడియే యుంచబడినవి.

1823 మొదలు 25 వరకును గావింపబడిన శాసనముల ననుసరించి హిందూదేశమందలి క్రైస్తవమతగురువుల జీతబత్తెములు నిర్ణయింపబడినవి. అధికారములు నిరూపింపబడినవి.

1832 లో సివిలు సర్వీసులో లేనివారినిగూడ మేజస్ట్రీటు
1832 లుగ నియమింపవచ్చునని నిరూపింపబడెను. 1823-6 సంవత్సరముల న్యాయశాఖలోనివారి జీతబత్తెములు నిర్ణయింపబడినవి. క్రైస్తవమతస్తుల నేరముల విచారణకు మధ్యవర్తులను నియమించు విషయములుగూడ సవరింపబడినవి. (Juries and Grand juries)

1823 లో బొంబాయియందు సుప్రీముకోర్టు స్థాపింపబడి
1823 నది. క్రైస్తవ వివాహములకు సంబంధించిన శాసనాధికారములు 1818 లో సవరింపబడినవి.

దివాళా శాసనముగావించుటకును సుప్రీముకోర్టుల యధి
1828 కారములకు లోబడియున్న ప్రదేశములలో చనిపోయిన
ఆంగ్లేయపౌరుల అప్పులకు అతని స్థిరాస్తిపై బాధ్యతను
మోపుచు శాసనములుగావింపబడి రాష్ట్రప్రభుత్వ శాసనాధికారము వివరింపబడి
నది. సీమదేశమునందలి కొన్నిక్రిమినలు శాసన నిబంధనలు హిందూదేశము
నందు వర్తింపచేయబడినవి.

1824 లో హిందూదేశమునందునను మలాకాయందునను
16 1824 సింగపురము డచ్చివారికిగల ప్రదేశములను కంపెనీవారుతీసికొనిరి.
జెన్నిలోనును సుమిత్రాదీవులలో ఆంగ్లేయులకుగల ప్రదే
శములను వినిమయముగ డచ్చివారి కొసంగబడినవి.
1824 సంవత్సరపు శాసనమునుసరించియే సింగపురము కంపెనీ ప్రభుత్వమునకు
బదిలీచేయబడినది. 1825 లో సింగపూరు పరిపాలనావిధానము శాసింపబడినది.

కోరమాండలు సముద్రతీరప్రాంతములను ఉత్తరసర్కారు
17 ఉత్తరసర్కారులు 1825 లును మదరాసు ప్రభుత్వాధికారమునకు 1825 లో
లోబరుపబడినవి. తిరిగి యిరువది సంవత్సరములును ముగిసి
1833 లో కంపెనీవారికి నూతనాధికారపత్ర మొసంగు
టకు శాసనము గావింపబడునంతవరకును మధ్యమధ్య పార్లమెంటు కంపెనీవారి
యధికారములను పెంపొందించుచు శాసనములను గావించినది.

1833 వ సంవత్సరమునందు కంపెనీకొసంగబడిన యధికార
18 1833 వ సంవత్సర శాసనము. పత్రమునకు ముందుగూడ పార్లమెంటు హిందూదేశ
రాజ్యాంగపర్తక వ్యవహారములనుగురించి విపులముగ
యోజించినది. ఈశాసనము గావింపబడినపుడు ఇండియా
బోర్డునకు మెకాలే కార్యదర్శిగ నున్నాడు. ఆనాడు సీమదేశమున లిబరలుపార్టీ
సిద్ధాంతములు పలుకుబడియందున్నవి.

1793 వ సంవత్సరశాసన మంతకుపూర్వము గావింపబడిన శాసనముల
నన్నింటిని సంక్షిప్తపరచినది. అయినను 1813 వరకు హిందూదేశవ్యవహారముల

వల్ల సీమదేశప్రభుత్వ మొనరించిన శాసనములన్నియు తాత్కాలికములే యన దగును. 1833 లో మాత్రమొక రాజ్యాంగవిధానమును తయారుచేయవలయు నని, నాటి సీమరాజకీయనాయకులగు నిగ్గుగారును, టోరీగారును కూడ సంకల్పించి రనదగును. కంపెనీగూడ నిందుల కామోదించవలసిన పరిస్థితులలోనికి వచ్చినది. కంపెనీ, రాజ్యముపై వచ్చుచున్న రాబడి పరిపాలనకు సరిపుచ్చుకొనుటలేదు. కంపెనీవారి వర్తకలాభములనుండి పరిపాలనావ్యయములకు కావలసిన తరుగును పూడ్చుకొనుచున్నది. ఈతరుగు సగటున వరుసగ 16 సంవత్సరములు సాలునరి పౌ 630,000 లని లార్డుఎలింబరోగారు మదింపువేసిరి. మరియొకరు మరి పౌ 100,000 లు గూడ హెచ్చుతరుగు గలదనిరి.1

దీనికితోడుగ చైనాదేశవర్తక క్లిష్టపరిస్థితులు 1813 లో వలెనేయున్నవి. ఈపరిస్థితులలో హిందూదేశ రాజ్యభారనిర్వాహణమునకు వలయువ్యయమును కొంత సీమప్రభుత్వముభరించవలెనని కంపెనీకోరియున్నది. కాని యీ కోరికలు నిరాకరింపబడినవి. హిందూదేశమువంటి భాగ్యవంతమైన దేశములో బహు విస్తీర్ణతనుగావించిన రాజ్యభాగములలో రాజ్యాధికారనిర్వాహణమునకు రాబడి చాలకపోవుటకు దుబారాకర్చులే కారణమని రాజ్యాంగవేత్తలు విశ్వసించిరి.2 కంపెనీ యిందువల్ల తనపెట్టుబడికిని, దానిపై వడ్డీకినిమాత్రమే సంరక్షణముకోరెడి స్థితికివచ్చినది. ఈసంరక్షణ మొసగబడినది. కంపెనీపెట్టుబడిపై 100కి 10½ లాభ ముల నొసగుటకు హిందూదేశప్రభుత్వాదాయము హామీ యొసంగబడినది. ప్రభుత్వాదాయమునుండి మొట్టమొదటగ కంపెనీకిలాభములను పంచిపెట్టుట విధియొనరింపబడినది. కంపెనీయొక్క అధికారమును పూర్తిగతొలగించవలసిన నాడు కంపెనీకి, ప్రొప్రయిటరులకు మొత్తముమీద పౌ 12,000,000 ల నొసగు టకు నిర్ణయింపబడినది. (The Company's Capital was E 6 Millions, but they had been paying 10½% dividends for many years. So this rate was continued and the price for buying the Company off was fixed in view of the high market value of

1. Thornton. V. 257-282-5 and Wilson iii. 483.
2, Auber ii. 684.

the company's stock.) ఇందలి న్యాయాన్యాయవిమర్శనకుగాను భారత దేశము ఆర్థికచరిత్ర చూడుము.)

ఆనాడు ప్రజాప్రభుత్వసిద్ధాంతములవ్యాప్తి ప్రబలియుండుటచే ఆవాతావరణమునుండి ఆంగ్లేయ రాజకీయవేత్తలు తప్పించుకొని 1833 వ సంవత్సరశాసనముగావించుట శ్రమయైయుండినది. "అయిరోపాదేశమునందు సుప్రభుత్వము లభించుటయెట్లను ప్రశ్న వేయబడుచో రాజకీయములందు తప్పటడుగులు మాత్రమే వేయుచున్నవారుగూడ ప్రజాప్రతినిధిసంస్థల మూలముగనే సుపరిపాలనము లభింపగలదని సమాధానముచెప్పగలరు" అని మెకాలేగారు నుడివిరి. అయినను, భారతదేశమునమాత్రము ప్రజాప్రతినిధి సంస్థలమూలముగ పరిపాలనముగావించుట యూహింపదగిన విషయముగూడ కాదని పార్లమెంటులో జేమ్సుమిల్లుగారు తమసాక్ష్యమునందు చెప్పినవిషయమును జ్ఞప్తికిదెచ్చుకొనిరి. కాని, సాలుసరి పౌ 22,000,000 ల రాబడివచ్చు నొక నూతనసామ్రాజ్య పరిపాలనము కంపెనీచేతులలో నుంచుట కానాటి రాజకీయవేత్తల కయిష్టమైనది. ఇండియాబోర్డువారికొనసాగుటకును సమ్మతికలుగుటలేదు. ఇందులకు పార్లమెంటు హిందూదేశ వ్యవహారములలో తగుశ్రద్ధ వహింపకపోవుటయే కారణముగ నిరూపింపబడినది.1

ఇందువల్ల, ఇండియాబోర్డు డైరక్టరులకోర్టు, హిందూదేశపు గవర్నరు జనరలు— ఈమూడు సంస్థలునుగలిసి హిందూదేశప్రభుత్వముగ మరి యిరువది సంవత్సరములు పనిజేయుటకే కంపెనీకధికారపత్ర మొసగబడినది. హిందూదేశమందు స్థాపింపబడిన ఆంగ్లేయప్రభుత్వము కంపెనీకే యుంచబడినది. కాని, యీ రాజ్యభాగముపై హక్కుమాత్రము చక్రవర్తిగారికిని, ఆయన వారసులకును మాత్రమేకలదని ప్రకటింపబడినది. ఈకంపెనీకి యీస్టిండియాకంపెనీ యని పేరు సంక్షిప్తమొనరింపబడినది. కంపెనీసిబ్బందిలో నున్నవారు డైరక్టరులుగనెన్నుకొనబడరాదను 1773 వ సంవత్సర శాసనమునననుసరించిన నిషేధము తొలగింపబడినది. మొట్టమొదటగ కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారికే

1. See Macaulay. Mix. Writings and Speeches. popular Ed. 551. 572.

హిందూదేశ ప్రభుత్వాధికారమంతయు నొసగదలంపబడెను. కాని, శాసన రూపముదాల్చుసరికి గవర్నరు జనరలుగారికి రాష్ట్రప్రభుత్వముల, సివిలు, సైనిక, రాజ్యాంగవ్యవహారము లన్నిటిపైన సంపూర్ణాధికార మొసగబడినది. ఇతర రాజధాని ప్రభుత్వములు, కలకత్తాప్రభుత్వమునకు తమ వ్యవహారముల నకళ్ళను ఎప్పటికప్పుడు పంపుచుండవలెనని శాసింపబడినది. ప్రతిస్వల్పవిషయము లందును గూడ గవర్నరుజనరలునకు సంపూర్ణాధికార మొసగబడి భారతదేశపరిపాలనము కేంద్రీకరింపబడినది

రాజధానిప్రభుత్వములు వెనుకటివలెనే డైరక్టరులకోర్టునకుగూడ తమ వ్యవహారములను దెలుపుచుండవలయుననియు నిర్ణయింపబడినది. ఈవిధముగ దెలుపబడిన వ్యవహారములను, డైరక్టరులకోర్టు, ఇండియాబోర్డునకు పంపుచు వారియుత్తరువులను స్వీకరించుచుండువిధానము దృఢపరుపబడినది. యుద్ధము లనుగురించియు, సంధియొడంబడికలనుగురించియు, నిర్ణయించుటకు ఇండియా బోర్డునకుమాత్రమే యధికార మొసగబడినది. స్వదేశసంస్థానములతోనుండు సంబంధములనుగురించియు, వాటితోజరుపు రాయబారములును, గవర్నరు జనరలుగారి యధికారమునందు కేంద్రీకరింపబడుట సమంజసమని తలంపబడినది. కాని, ఇది యాచరణయందు దుర్ఘటమైనది. బొంబాయి, మదరాసు, కలకత్తా రాజధానులలోగల సైన్యమేకసైన్యముగ నొనరింపబడుటకు సావకాశము లానాడులేవు. ఆనాటికి ముఖ్యరైలుమార్గములుగూడ వేయబడలేదు. గవర్నరు జనరలునకుగల ప్రత్యేకాధికారముగూడ విస్పష్టపరుపబడినది. గవర్నరు జనరలుగారు స్వేచ్ఛతో వ్యవహరించుటకు గలయధికారము (To act at his discretion) తీసివేయబడలేదు. కాని, యీస్వేచ్ఛావృత్తిని, హిందూదేశము నందుగల రాజ్యభాగముల సంరక్షణభద్రతలకు ప్రమాదముగలుగునని తలంప బడినపుడుమాత్రమే వినియోగించునట్లుగ నిర్వచింపబడినది. ఇతరవిషయములలో తన కౌన్సిలుతీర్మానానుసారమే ప్రవర్తించవలసియుండును. గవర్నరుజనరలుగారు తన ప్రత్యేకస్వేచ్ఛాధికారమును వినియోగించునపుడు స్వదస్తూరీతో ఆయనయు, ఆయనకౌన్సిలు సభ్యులును వారివారి యభిప్రాయములను లిఖితపూర్వకముగ తెలియపరచుకొనవలెనని శాసింపబడినది. అయినను, కంపెనీడైరక్టరులకోర్టు

గవర్నరు జనరలునకు రహస్యముగనొసగిన సూచనలలో తరుచుగ నీప్రత్యేకాధికారమును వినియోగింపవలదని వ్రాసియుండెను. గవర్నరు జనరలుగారు కార్యనిర్వహణ మొనరించుటకై ఆయనతోపాటు మరియొక కౌన్సిలునభ్యుడు కూడ హాజరయిన జాలును. గవర్నరుజనరలుగారి కౌన్సిలు నిర్వహించు మామూలు కార్యనిర్వహణమునకును న్యాయశాసనములను గావించుటకుగూడ అనుసరింపవలసిన నియమములను డైరక్టర్లకోర్టే వ్రాయుట కధికారమొసగబడినది. కాని, డైరక్టరులకోర్టుచే వ్రాయబడి ఇండియాబోర్డువారిచే ఆమోదింపబడి రెండుపార్లమెంటుసభలకును నివేదించవలసియున్నది. అప్పుడుమాత్రమే డైరక్టరులకోర్టుచే వ్రాయబడిననిబంధనలు పార్లమెంటుచేగావింపబడిన శాసనమునకుగల యధికారమును పొందగలవు.

ఈశాసనము ననుసరించి డైరక్టరులకోర్టునకు వర్తకవ్యాపారనిర్వహణము తీసివేయబడినది. అందువల్ల యిండియాబోర్డునకు, డైరక్టులకోర్టు వ్యవహారములను నడుపుటకు పై సంపూర్ణాధికార మొసగబడినది. హిందూదేశప్రభుత్వమునం దుద్యోగస్థులను నియమించుటకు డైరక్టరులకోర్టునకుగల యధికారము తీసివేయబడలేదు. కాని, ఇండియాబోర్డువారి యంగీకారముతో, హిందూదేశమునందలి యుద్యోగస్థులెవరికైనను, యీనియామకాధికారమును బదిలీ చేయుచుండుటకు డైరక్టరులకోర్టునకు స్వాతంత్ర్యమొసగబడినది. 1

హిందూదేశమందలి ఆంగ్లేయప్రభుత్వమున మత కుల జాతి భేదముల ననుసరించి యుద్యోగముల కనర్హులుగారని యీ 1833 వ శాసనమునందు వివరింపబడినది. కాని, హిందూదేశ నివాసులుగనున్న ఆంగ్లేయులనెక్కుడుగ గమనింపవలయునని కంపెనీ డైరక్టరులు రహస్యపు సూచనలను గావించిరి (Covering letter). కంపెనీవారికే గలవర్తక స్వాతంత్ర్యము 1833 వ సంవత్సర

1. See Kaye. P. 420. See. Roberts 222 - 227. Cornwallis 74 - 78 to know in detail about the worth and amaluments of the Company's Servants. Even after the Bentick's retrenchment the average income of Civilian ranging from a memder of a Council to writer, the lowest grade was still as high as £ 2,000 a year. Roberts P. 302.

శాసనము ననుసరించి రద్దుచేయబడినది. హిందూదేశమునకుబోవు ఆంగ్లేయులు లైసెన్సులను పుచ్చుకొనవలెనను నిబంధన తీసివేయబడినది. హిందూదేశమున భూఆస్తిని సంపాదింపరాదను నిషేధములుగూడ తొలగింపబడినవి. ఇందువల్ల విశేషముగ నాంగ్లేయులు హిందూదేశమునకు వలసపోయెదరని సీమప్రభుత్వ మాసించినది. ఈవిధముగ వలస వచ్చినవారియందుద్యోగముల కర్హులగువారు విశేషముగనుందురని నాటి ఆంగ్లేయప్రభుత్వాశయము. ఈ యాశవల్లనే హిందూదేశమున "పరిపాలించు జాతియనునది" వేరుగ నుండరాదనియు, అర్హతయే ప్రధానముగ నుండవలయుననియు, డైరక్టరులు తమలేఖయందు 1833 వ శాసనమునకు వ్యాఖ్యానముచేసి గవర్నరుజనరలునకు సూచించిరి. ఆచరణయందాశించినంతగ, ఆంగ్లేయుల వలసయు కొనసాగలేదు. భారతీయుల కున్నతోద్యోగములును లభింపజేయలేదు. పైయభిమతము భావప్రపంచమునందే విహరించినది. 1793 వ సంవత్సరపు శాసనమునందు సాలుసరి పౌ 500/ లకు పైగ జీతములుగల యుద్యోగములను భారతీయులకొసగరాదను నిషేధముగలదు. ఇట్టియుద్యోగములన్నియు సివిలుసర్వీసువారికే యొసగబడవలయునను నియమ మేర్పరుపబడినది. ఈనియమము 1833 వ సంవత్సర శాసనమునందు రద్దుచేయబడలేదు. హిందూదేశమున కుద్యోగమునకైపోవు ఆంగ్లేయులు హైలుబర్రీ కళాశాలయందు మూడుసంవత్సరములు శిక్షను పొందవలయుననియును, ప్రతియుద్యోగ పదవికిని నలుగురు నియమింపబడి, అందు పోటీలో విజయవంతులైనవారే శిక్షణకు పంపబడవలయుననియుగూడ 1833 వ సంవత్సరపు శాసనమునందు నిరూపింపబడియుండెను. కాని, మరుసటి సంవత్సరమే డైరక్టరు లీనియమమాచరణకు రాకూడదని మరియొకశాసనమును పార్లమెంటును ప్రోద్బలపరచి గావింపజేసిరి.

హిందూదేశమునందు 1843 వ సంవత్సరమునందు గావింపబడిన "బానిసతనపు శాసనము" (Indian Slavary Act of 1843). గావింపబడుటకు 1833 వ సంవత్సరపు శాసనమునందు బానిసతనమును తొలగింపవలయునని గల సూత్రమే కారణము.

వంగదేశ ప్రభుత్వపు గవర్నరుగారే హిందూదేశ ప్రభుత్వపు గవర్నరు జనరలుగా నింతవరకును పనిచేయుచుండిరి. 1833 వ సంవత్సర శాసనము ననుసరించి వంగదేశప్రభుత్వము రెండుప్రభుత్వములుగ విభజింపబడినది. ఆగ్రా రాష్ట్రమునకు కౌన్సిలుయుతుడగు గవర్నరు, లేక, గవర్నరు ఒక్కడుమాత్రము నియమింపబడవలెననియు, వంగరాష్ట్రమునకు డిప్యూటీగవర్నరు నియమింపబడవలయుననియును, శాసింపబడినది. గవర్నరుజనరలు భారతదేశ మంతటిపైన ప్రభుత్వవ్యవహార నిర్వహణ మొనరింప దగుననియు శాసింపబడినది. కాని యీ సూచనలు ఆచరణయం దుంచబడలేదు. 1835 సంవత్సర శాసనము ననుసరించి యీవిభజన మాపివేయబడినది. పశ్చిమోత్తర పరగణాలకొరక లెప్టనెంటు గవర్నరును నియమించుటకుగూడ 1835 సంవత్సరశాసనము ననుసరించి నిరూపింపబడినది. గవర్నరుజనరలుగారే వంగదేశపు గవర్నరుగా పనిచేయుచుండుటకును ఆయన సహాయార్థ మొక డిప్యూటీగవర్నరును నియమించుకొనుటకును ఏర్పాటు గావింపబడినది.

19
శాసనాధికారము.

ఈ 1833 సంవత్సర శాసనము ననుసరించి హిందూదేశ ప్రభుత్వ శాసనాధికారమున ప్రాముఖ్యమగు మార్పులు గావింపబడినవి. పరిపాలనాధికారమునకును శాసనకర్తృత్వాధికారమునకునుగల విభేదము గుర్తింపబడినది. ఈసూత్రము ననుసరించి గవర్నరుజనరలు కౌన్సిలునందు నాల్గవసభ్యుడు నియమింపబడుటకు నిర్ణయింపబడెను. ఈ అదనపుసభ్యుడు కంపెనీ సిబ్బందీలోనివాడై యుండరాదు. ఈయన గవర్నరుజనరలుగారి కార్యనిర్వాహకవర్గ సభజరుగునపు డందు చర్చలో పాల్గొనవచ్చును. కాని విషయనిర్ణయమునందు ఓటునొసంగుట కధికారము గలిగియుండలేదు. శాసనములను గావించుటకై సమావేశపరుపబడిన కార్యనిర్వాహకవర్గ సభయందు మాత్రము ఓటుచేయుట కధికార మొసంగబడినది. ఈవిధముగ మెకాలేగారు గవర్నరుజనరలుగారి కార్యనిర్వాహకవర్గ సభలలో పాల్గొనుచుండెడివారు. న్యాయశాస్త్రశాసనములలో ప్రత్యేకసమర్థతగలవారి యనుభవము లభించుటకై యీవిధముగ న్యాయశాస్త్ర శాసనముకొరకు ప్రత్యేకసభ్యుడు నియమింపబడుట యందుగల సిద్ధాంతము.

ఈశాసనము ననుసరించి మదరాసు బొంబాయిప్రభుత్వములకుగల శా
నాధికారము రద్దుచేయబడినది. వంగదేశప్రభుత్వపు కౌన్సిలుయుతుడగు గ
ర్నరుజనరలుగారి శాసనాధికారము విశేషముగ విస్తరింపబడినది. ఈమూడు
రాజధానుల యందుననుగల ఆంగ్లేయులు భారతీయులుగూడ సుప్రీముకోర్టుచే
నామోదింపబడిన నియమములకు బద్ధులుగ శాసనమునం దొనరింపబడిరి.
ఆచరణకు మాత్రము రాలేదు. రాష్ట్రప్రభుత్వము లీశాసనవిధానమును ప్రతిఘ
టించినవి. ఈ పద్ధతి నాచరించలేదు. గవర్నరుజనరలుగారు తనకు గల
సర్వాధికారమును (వీటో) వినియోగించియే యుండలేదు. మూడు రాజధాని
ప్రభుత్వవ్యవహారములును సమన్వయింపబడలేదు. ఇందుచేతనే పార్లమెంటు
తరచు హిందూదేశమునందలి స్థానికవ్యవహారములను గురించిగూడ శాసనము
లను గావించుచువచ్చినది. 1726 సంవత్సరపు అధికారపత్రము ననుసరించి
ఆంగ్లేయశాసనములు హిందూదేశ సుప్రీముకోర్టులకు వర్తింప చేయబడినవి.
(Common and Statutory law). రాష్ట్రీయ న్యాయస్థానములకు 1793 లో
కారనువాలీసు గావించిన నియమావళియు నిబంధనలును తదుపరి 1834 వరకును
గావింపబడిన నిబంధనలును (Regulations) నున్నవి. మదరాసునకు 1802
మొదలు 1834 వరకును గావింపబడిన నిబంధనలును. బొంబాయికి 1799
మొదలు 1834 వరకునుగల నిబంధనములును 1827 లో ఎలిఫినుష్టోను
గావించిన నిబంధనములును రాష్ట్రీయకోర్టుల యాచరణవిధాన నిర్ణయమునకై
యున్నవి. ఈవిధముగ న్యాయనిర్ణయమునకై వలయు శాసనములును నిబం
ధనములును మూడురాజధానులకును వేరువేరు విధముగనున్నవి. హిందూ
దేశమునందలి చాలరాజ్యభాగము కలిపివేసికొనుటవల్లనో లేక జయింపబడుట
వల్లనో సీమప్రభుత్వమువారి యాధీనమైనది. ఈరాజ్యభాగమున చక్రవర్తి
సర్వాధికారమప్రతిహతము. మొగలాయిచక్రవర్తియొక్క సర్వాధికారము నామ
మాత్రము. కంపెనీ రెండువిధములగు నధికారములను చెలాయించుచున్నది.
(1) సీమప్రభుత్వమువారినుండి కొన్నియధికారములు సంక్రమించినవి. (2) హిందూ
దేశ మందలి రాజులనుండి వారిస్థానము లాక్రమించుకొనుటవల్ల కొన్నియధికార
ములు సంక్రమించినవి. ఈయధికారములను కంపెనీప్రభుత్వము హిందూదేశము
నందు చెలాయించుటకు సీమప్రభుత్వమంగీకరించుచునేయుండినది. రాష్ట్రీయకోర్టుల

మూలముగను నిబంధనల నొనరించుటమూలముగను నీయధికారములు చెలా యింపబడుచుండెడివి. పార్లమెంటువారిచే సంక్రమింపచేయబడిన యధికారముల వల్ల 1698—1726 వ సంవత్సరముల అధికారపత్రములయందలి యధికారములు రద్దుకాబడినవి. హిందూదేశచక్రవర్తులవల్ల సంక్రమింపబడినయధికారములు పన్నులను విధించుటకుగల యధికారముతోపాటుగ వివాదగ్రస్తములయినవి. హిందూదేశమునకు ఆంగ్లేయులు వలసవచ్చుటకు సావకాశమొసంగుటకు నిర్ణయింపబడుటవల్ల నూతనసమస్య లుదయించుచున్నవి. ఆంగ్లేయపౌరుడను శబ్దనిర్వచనము సందిగ్ధస్థితికి తెచ్చిపెట్టినది. రెండువిధములగు న్యాయశాఖలును, రెండువిధములగు శాసనాధికారములును అమలునందుండుట అసమంజసమైనది. ఈకారణములవల్ల న్యాయశాఖాపరిపాలనావిధానమును శాసనాధికారమును సక్రమముగ నిర్వచింపబడుట యుక్తమని పార్లమెంటు విచారణసంఘపు మూడవ నివేదిక వ్రాసినది. ఈసూచనల నమలులోపెట్టుటకే గవర్నరుజనరలు కౌన్సిలునకు నాల్గవసభ్యుడుగూడ నియమింపబడవలెనని నిర్ణయింపబడుటకు కారణము.

గవర్నరుజనరలుతోగూడిన యీ నలుగురుసభ్యులును గలిసి భారతదేశ ప్రభుత్వమునకు శాసనసభగా నొనరింపబడినది. ఈ విచిత్రశాసనసభ ఆంగ్లేయ స్వాధీనమందున్న రాజ్యభాగములకన్నింటికిని శాసనములగావించుట కధికారము గలిగియుండెను. ఈశాసనములకు పార్లమెంటుగావించిన శాసనమునకుగల యధికారమే కలదు.

1. ఈశాసనసభ హిందూదేశమునందుగల రాజ్యమునందంతవరకునుగల శాసనములను సవరించుటకును సంస్కరించుటకును మార్చుచుండుటకును అధికారము గలిగియున్నది.
2. ఈశాసనసభ శాసనములన్నివిధములగు కోర్టులకును వర్తింపజేయబడినవి. ఆంగ్లేయ - విదేశీయ - భారతీయ పౌరులందరును నీశాసనములకుబద్ధులు.
3. ఈశాసనసభ హిందూదేశమునందలి రాజ్యభాగమునకంతకును అన్నివిషయములపైనను శాసనాధికారమును గలిగియుండెను.

4. స్వదేశసంస్థానములయందుండు కంపెనీసిబ్బందికిగూడ వర్తించు శాసనముల నీసభ గావించుట కధికారమును గలిగియుండెను.

5. స్వదేశసైనికోద్యోగులపట్ల సైనిక యుద్ధనియమములను గావించుటకును సైనికశిక్షణ కోర్టులన్యాయవిచారణచేయు విధానమును నిరూపించుటకును గూడ నధికారమును గలిగియుండెను.

కాని గవర్నరు జనరలు కౌన్సిలుశాసనసభకు 1833 సంవత్సరపు పార్లమెంటుశాసనమును మాత్రము సవరించుట కధికార మొసగబడలేదు. ఇక్లేండు చక్రవర్తిగారికిని పార్లమెంటునకునుగల సర్వాధికారములనుగురించి యెట్టి శాసనములునుగాని గావించుట కధికారమొసంగబడి యుండలేదు.

డైరెక్టరులయంగీకారమును ముందుగ బొందనిదే యూరపుఖండమందు జననమొందిన ఆంగ్లేయపౌరులమీదను లేక వారిపిల్లలమీదను ఉరిశిక్షలవిధించుటకే కోర్టునకుగాని అధికారమొసంగుచు నీశాసనసభ శాసనములను గావించుట కధికారమును గలిగియుండలేదు. అధికారపత్రముల ననుసరించి ఏర్పరుపబడిన హైకోర్టులకుమాత్రమే అట్టియధికారము సంక్రమింపచేయవచ్చును. ఈవిధముగనే అధికారపత్రములననుసరించి స్థాపింపబడిన ఏకోర్టునుగాని రద్దుబరచుచు శాసించుటకుగూడ నీశాసనసభకధికార మొసంగబడలేదు. పార్లమెంటునకు హిందూదేశవ్యవహారములను గురించిశాసించుటకుగూడ నీశాసనసభ కధికారమొసంగబడలేదు. పార్లమెంటునకు హిందూదేశవ్యవహారములనుగురించి శాసించుటకు గలయధికారము చెలింపచేయబడలేదు. హిందూదేశశాసనములన్నియు పార్లమెంటువారికి సమర్పింపబడుచుండవలయును. పార్లమెంటీశాసనములను సవరించుటకు మార్చివేయుచుండుటకునుగూడ అధికారమును గలిగియుండెను. కౌన్సిలు యుతుడగు గవర్నరుజనరలుగారి యీశాసనసభగావించిన శాసనములనువేటినైనను ఇండియాబోర్డువారి యనుమతితో కంపెనీడైరక్టరులు రద్దుచేయుటకధికారమును గలిగియుండిరి. వీరిచేతరద్దుకాబడనియెడల శాసనములైపైరీతిగ భారతదేశమునకు వర్తింపగలవు.

హిందూదేశమున న్యాయశాస్త్రమును నిరూపింపవలయుననియును హిందూదేశశాసనములు పరిశోధింపబడి క్రోడీకరింప బడవలయుననియును — న్యాయస్థానశాఖ న్యాయవిచారణ నీతి నియమబద్ధ మొనరింపవలయు ననియును గూడ నీ 1833 వ శాసనమున నిరూపింపబడినది. ఇందులకై ఇండియను లా కమీషను నియమింపబడినది. ఇందు మెకాలేగారు సభ్యులు.

మొట్టమొదటగ 1 వ జనవరి 1800 సంవత్సరమున కర్నాటకము— కటకము (Cuttak). సింగపురములకు ఆంగ్లేయులువలసవచ్చుటకై సావకాశ మొసంగబడినది. నిరకునామా కార్యాలయములలోనే వీరు కాపురముండ నిశ్చయింపబడినది. వేరుస్థానములలో నివాసమేర్పరచుకొనుటకు లైసెన్సు ఏర్పాటుచేయబడినది. 1833 వ శాసనమునననుసరించి ఇతరరాజ్యభాగములకు గూడ ఆంగ్లేయులు వలసపోవుటకు సావకాశ మొసంగబడినది. లైసెన్సుపద్ధతి రద్దుచేయబడినది. కాని హిందూదేశపు గవర్నరుజనరలుగారి శాసనసభ అవినీతికరముగ వలసవచ్చువారినిగురించియు కాపురముండువారినిగురించియు శాసనములగావింప నిరూపింపబడినది. ఈయధికారము ననుసరించి 1864 సంవత్సరపు 3 వ శాసనముగావింపబడినది. 1

ఈవిధముగ వలసవచ్చుఆంగ్లేయులు భారతీయులను చెరసాలలు పట్టకుండగను వీరిమతముమీదను అభిప్రాయములమీదను దాడివెడలకుండగను సంరక్షింపగల శాసనములొనరింపవలెననిగూడ నిరూపింపబడినది. దీనిఫలితముగనే ఇండియను పీనలుకోడునందలి 295—298 వరకుగల శెక్షనులు గావింపబడినవి. ఈశాసనముననుసరించి హిందూదేశమునకు ముగ్గురు బిషపులు పంపబడిరి. కలకత్తాబిషప్‌నకు వీరిపై యధికారమొసంగబడినది. కలకత్తాబిషప్‌పై లండను నందలి కాంటనుబరీ ఆర్చిబిషప్‌నకు పెత్తనమొసంగబడినది. (Arch bishop of Canterbury) రాజధానికి యిరువురు (Chaplains) సలహాదారులు గూడ నియమింపబడుట కవకాశము గలిగింపబడినది.

---

1. The Act iii of 1864. See Keith. P. 135.

20
1835–1840
1848
శాసనములు

1833 వ సంవత్సరపు శాసనము మరిరెండు శాసనములచే బలపరుపబడినది. హిందూదేశవర్తకమును, చీనాదేశ వర్తకమును, తేయాకు వర్తకమునుగురించియు నీశాసనములు గావింపబడినవి. 1835 లో వంగరాష్ట్రమును రెండు రాష్ట్రములుగ విభజింపకుండ నుండుట కనుమతి నొసగుచు శాసింపబడియుండెను. 1840 లో హిందూదేశ సైనికుల తిరుగుబాటు శాసనములు సంస్కరింపబడినవి. (Indian Mutiny Acts). నావికాదళమును గురించి శాసనములను గావించుటకు గవర్నరుజనరలు శాసనసభ కధికారమొసగబడినది. 1848 లో దివాళాకోరు శాసనము సంస్కరింపబడినది. 1909 వ సంవత్సరమున తిరిగి సంస్కరింపబడువరకును ఆచరణయందున్నది.

ఈ 1833 వ సంవత్సరమునందు కంపెనీ కొసగబడిన సం. 20 రముల ఆయుర్దాయము ముగియుకాలమున, కంపెనీ ప్రభుత్వవ్యవహారములు బహు తీవ్రముగ నాలోచింపబడినవి. కంపెనీ ప్రభుత్వమును రద్దుజేసి, సీమరాజుగారి ప్రభుత్వమును స్థాపింపవలయునను యభిప్రాయము లల్లుకొనసాగినవి. డైరక్టరుల యధికార మానాడు నామమాత్రముకాదు. ప్రభుత్వవ్యవహార నిర్వాహణమునందు డైరక్టరుల పలుకుబడి గమనార్హముగనే యున్నది. ఉన్నతోద్యోగుల నియామకముమాత్రము సీమప్రభుత్వమువారు చెలాయింపసాగిరి. మెట్కాఫ్ గారి స్థానమున 1835 లో లార్డు అకలుకండుగారు డైరక్టరుల యభిమతమునకు విరుద్ధముగనే రాజుగారి ప్రభుత్వముచే గవర్నరుజనరలుగ నియమింపబడిరి. ఈ విధముగనే సీమప్రభుత్వమున కయిష్టులై గవర్నరుజనరలు పదవియందున్నవారిని ఉద్యోగమునుండి సీమకుమరలించు నధికారముగూడ సీమప్రభుత్వము చెలాయింపసాగినది. 1844 లో ఎలింబరో ప్రభువును సీమకు మరలించుటయే యిందుల కుదాహరణము. సీమప్రభుత్వపు రాణిగా రీవిషయమున వ్యతిరేకాభిప్రాయమును గలిగియున్ననుగూడ, ఎంలిబరోగారు సీమకుమరలింపబడిరి. (Recall) అయినను, డైరక్టరుల యనుభవము వినియోగింపబడకుండ హిందూదేశపరిపాలనము కొనసాగింపబడుట దుస్తరమను భయముకూడ నాటి సీమప్రభుత్వమునకు లేకపోలేదు.

21
1853 సం॥
శాసనము

ఈభయమువల్లనే 1853 వ సంవత్సరమున పార్లమెంటు గావించిన శాసనమునందుగూడ డైరక్టరుల యధికారమును తొలగింపకపోవుటకు కారణము. సీమప్రభుత్వ ధర్మకర్తగ మాత్రమే, కంపెనీవారి భారతదేశ ఆంగ్లేయ రాజ్యముపట్ల వ్యవహరించుట కిదివరకుగల యధికారము తీసివేయబడలేదు. కాని, మామూలుగ ప్రతి అధికారపత్రమును యిరువదిసంవత్సరముల కాలపరిమితితో నొసంగబడుచువచ్చినది. 1853 వ సంవత్సరపు టధికారపత్రమునందు మాత్రము మరి యిరువదిసంవత్సరముల పర్యంతము కంపెనీ కధికారమొసగబడలేదు. సీమప్రభుత్వము తిరిగి వేరువిధముగ శాసించువరకు మాత్రమే యధికార మొసగబడినది. డైరక్టరులసంఘబలము తగ్గించుటయు గమనింపదగిన మార్పులలో నొకటి.

22
డైరక్టరుల సంఘము
మార్పు

అంతవరకును డైరక్టరులసంఘమున 24 గురు సభ్యులుండెడివారు. వీరిసంఖ్య 18 గురికి తగ్గించివేయబడినది. ఈ 18 గురిలోను ఆరుగురిని సీమమంత్రివర్గము (Crown) నియమించుటకేర్పాటు. మిగిలిన 12 గురిలోని 6 గురును, మంత్రివర్గముచే నియమింపబడిన వారివలెనే, కనీసము 10 సంవత్సరములైనను హిందూదేశమున కంపెనీప్రభుత్వమున పనిజేసినవారై యుండవలెను. ఇక ఆరుగురిని మాత్రమే వాటాదారులు తమ యిష్టమువచ్చినవారి నెన్నుకొనుటకు సావకాశముంచబడినది. ఈనిబంధనవలన డైరక్టరులసంఘ మనుభవముతో కూడిన సలహానొసగ గలదిగ నుండగలదని తలంపబడినది. డైరక్టరుల సంఘపు కనిష్టసంఖ్య 13 మందినుంచి 10 మందికి తగ్గించివేయబడినది. హిందూదేశమునందలి యుద్యోగమును డైరక్టరుల యిష్టముననుసరించి పంచిపెట్టుటకు వీలు లేకుండగ నొనరింపబడినది. ఇండియాబోర్డువారిచేత తయారుచేయబడిన ప్రణాళిక ననుసరించి పోటీపరీక్షయందు దుత్తీర్ణులైన ఆంగ్లేయుల కొసగబడుటకు శాసింపబడినది.

23
ఇండియాబోర్డు

ఇండియాబోర్డున కీవిధముగ ఉద్యోగముల నొసగుటపై, అపరోక్షముగ నధికార మొసగుటయేకాక, యీబోర్డు ప్రెసిడెంటుగారి హోదా హెచ్చింపబడినది. రాజ్యాంగ కార్యదర్శిహోదాతో జీతమునందు సమాన మొనరింపబడినది. హిందూ దేశమునందలి గవర్నరుజనరలు గవర్నరుల, కౌన్సిళ్ళకు—కార్యనిర్వాహకవర్గ సభలకు సభ్యులుగ లేక కౌన్సిలరులుగ నియమింపబడువారి నియామకములన్నియు మంత్రివర్గముచేత (రాజుగారిచేత. Crown), నంగీకరింపబడుట విధిగావింపబడినది.

24
వంగదేశ పరిపాలనము.

వంగదేశపరిపాలనా విధానము మొట్టమొదటనుండియు ఘోరముగనేయున్నది. అది ఏశాసనమువల్లగాని సక్రమముగ సంస్కరింపబడి యుండలేదు. 1853 వ సంవత్సర శాసనము ననుసరించి వంగరాష్ట్రమునకొక ప్రత్యేకగవర్నరును, లేక, లెఫ్టనెంటు గవర్నరు నియమింపబడుట కధికారము గలిగించుకొనబడినది. 1859 లో పంజాబునకు లెఫ్టనెంటుగవర్నరు నియమింపబడియుండెను. గవర్నరుజనరలుగా రొక్కరే హిందూదేశ వ్యవహారములను, వంగరాజ్యపరిపాలనమునుగూడ గావింప నశక్తులగుటచే, ప్రభుత్వప్రాథమిక విధియగుప్రాణ సంరక్షణముగూడ వంగమున లభించలేదు. 1

25
శాసనాధికారములు, శాసనసభ.

1833 వ సంవత్సర శాసనముననుసరించి గవర్నరుజనరలుగారి కౌన్సిలునందు నియమింపబడుచువచ్చిన నాల్గవ సభ్యుని హోదా హెచ్చింపబడినది. ఇతరసభ్యులతోపాటు శాసన విషయములందేగాక, అన్నివిషయములందునను పాల్గొని ఓటునిచ్చుట కధికార మొసగబడినది. ఈయధికారమును మెకాలేగారు కోరియుండిరి. యొసగబడినది. ఇంతవరకును గవర్నరుజనరలుగారు తమతోబాటుగ మరియొక కౌన్సిలరు హాజరయినమాత్రమున కార్యనిర్వాహణ మొనరించుట కధికారమును గలిగియుండెను. కార్యనిర్వాహకవర్గము గావించిన తీర్మానములను రద్దుజేసి స్వేచ్ఛగ వ్యవహరించుటకుగూడ నధికారమును గలిగి

1. See. Keith. P. 137.

యుండెను. గవర్నరుజనరలుగారు హాజరుకాని సమయములలో ఆయన కౌన్సిల్లు ముగ్గురు హాజరయి శాసనములగావించుట కధికారమును గలిగియుండిరి. వీరి నిర్ణయములను రద్దుచేయగలిగిన గవర్నరుజనరలుగారి యధికారము తీసివేయబడినది.

1853 వ సంవత్సర శాసనమునుసరించి కౌన్సిలు నిర్ణయములను వెను కటివలె గ్రోసిరాజనుట కధికారము లేకపోయినను, గ్రోసిరాజని ఆగవర్నరు జనరలుగారే నూతననిర్ణయములను గావించుటకుగూడ నధికారమునుగలిగి యుండకపోయినను, అధికసంఖ్యాకులగు కౌన్సిలరులచే గావింపబడిన శాసనము లకు గవర్నరుజనరలుగారు తనసమ్మతి నొసగని రాకరించుట కధికారమును గలిగియుండెను. ఈశాసనము ననుసరించి కౌన్సిలుసభ్యుల సంఖ్యగూడ హెచ్చింపబడినది.

గవర్నరుజనరలు, సర్వసైన్యాధిపతి, నలుగురు కౌన్సిలుసభ్యులు, ప్రతి రాజధానికి యొకప్రతినిధి, లేక, లెఫ్టనెంటుగవర్నరు (పదిసంవత్సరముల యుద్యోగానుభవముగలిగి గవర్నరుచేత నియోగింపబడిన) ప్రతినిధి, వంగదేశపు ప్రధానన్యాయమూర్తి-మరియొక సుప్రీముకోర్టు న్యాయమూర్తిగలిసి మొత్తము 12 గురి సభ్యులతోగూడిన హిందూదేశశాసనసభ ఏర్పరుపబడినది. ఈసభలో మరియిరువురు సివిలుసర్వీసు యుద్యోగులుగూడ నియమింపబడవచ్చును. కాని నియమింపబడలేదు.

ఈశాసనసభ శాసనములనుగావించుటకై బహిరంగముగ సమావేశము కావలసియున్నది. ఈశాసనసభాచర్యనంతయు ప్రకటింపవలసియున్నది. ఈశాసనసభకు హిందూ, మహమ్మదీయ సంఘప్రతినిధుల నిరువురనుగూడ చేర్చవలెనని సూచనగావింపబడినది. కాని యీసూచన యంగీకరింపబడలేదు.

ఈ నూతనశాసనసభ త్వరలోనే ప్రభుత్వఅయిష్టమునకు గురియైనది. మైసూరురాజులకొసగిన విరాళములనుగురించి ప్రభుత్వచర్యను ఖండించినది.

కార్యనిర్వహణమునందుగూడ జోక్యము కలిగించుకొనసాగినదని తలంపబడినది. ఈ పద్ధతి 1861 లో సవరింపబడినది.

1833 వ సంవత్సరశాసనము ననుసరించి ఏర్పరుపబడిన 'లా' కమీషను యొక్కపని నిష్ప్రయోజనమైనది. సీమలో కమీషనరులనియమించి ఇండియాలో కమీషనుచేసినపని కొకస్వరూప మొసగబడుటకు సావకాశము గలిగింపబడినది.

26
సివిలు సర్వీసు.

హిందూదేశమునకుపంపబడు నుద్యోగులకువలయు పోటీ పరీక్షా నియమములు మెకాలేసంఘము 1854 లో తయారుజేసినది. ఈపోటీపరీక్ష సీమలో ఆంగ్లేయులకు మాత్రమే ఏర్పరచుటవల్ల భారతీయులు భారతదేశమున సివిలుసర్వీసు ఉద్యోగులుగనుండుటకు సావకాశములేకపోయినది. 1858 వ సంవత్సరమునుండియు హైలీబరీకళాశాల శిక్షణస్థానముగ విరమింపబడినది. మెకాలేసంఘము వ్రాసిననియమములే హిందూదేశ సివిలుసర్వీసుశాఖకు ప్రథమనిబంధనలు.

27
1854 సం॥ శాసనము.

1854 లో హిందూదేశపరిపాలనా విధానమునుగురించిన మరియొకశాసనము గావింపబడినది. నాడు వంగరాష్ట్రము మహావిశాలమై అతివిస్తీర్ణత గాంచియున్నది. జయింపబడిన, లాగివేసికొనబడిన స్వదేశరాజ్యములన్నియును, వంగరాజధానికే జతచేయబడియున్నవి. 1834 లో యీబాపతు రాజ్యభాగమునకే ఆగ్రారాష్ట్రమని నామకరణమొసగబడినది. 1836లో పశ్చిమోత్తరపరగణాలకు నామకరణము గావింపబడినది. లెఫ్టినెంటు గవర్నరురాష్ట్రముగ జేయబడినది. 1826 లో అస్సాము, ఆర్కాను, టెనాసెరిములు స్వాధీనపరచుకొనబడినవి. 1824 లో డచ్చివారితో రాజ్యభాగములు మార్చుకొనబడినవి. 1845 లో డెన్మార్కు-రాజుగారినుండి సెరాముపురము కొనబడినది. 1835 లో సికింనుండి డార్జెలింగు తీసికొనబడినది. 1850 లో సికింలోని కొంతభాగముకూడ తీసికొనబడెను. అందుచే పరిపాలనావిధానమున క్లిష్టసమస్య లుదయింపసాగినవి. మొట్టమొదటగ ఏ రాజ్యభాగమునైనను కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారు తన స్వంత పరిపాలనయందు డైరక్టరులయొక్కయు, ఇండియాబోర్డుయొక్కయు, అను

మతితో నుంచుకొనవచ్చును. పిమ్మట ఆరాజ్యభాగమునకు పరిపాలనావిధానమును నిరూపించుచుండవచ్చును. ఈవిధముగ పరిపాలింపబడసాగిన జిల్లాలముఖ్యాధికారులకు ఛీఫ్ కమీషనరులని, నామకరణము చేయబడినది. కేంద్రప్రభుత్వమీ కమీషనరులకు కొన్ని యధికారములను సంక్రమింపజేయుచుండెడిది.

ఈవిధానమును 1870 వ సంవత్సరశాసన మామోదించినది. ఈవిధముగ 1853 వ సంవత్సర శాసనముననుసరించి వంగ, ఒరిస్సా, అస్సాముమరాష్ట్రములకొక లెఫ్టినెంటుగవర్నరు నియమింపబడినపుడు, టెనాసిరము గవర్నరు జనరలుగారి పరిపాలనమునందుండెడిది. ఆర్కను మొట్టమొదట లెఫ్టినెంటు గవర్నరుగారి పరిపాలనమునం దుంచబడినను, తిరిగి గవర్నరుజనరలుగారి పరిపాలనమునం దుంచబడినది.

నర్మదా– సాగరరాజ్యములు స్వాధీనముచేసికొని నప్పటినుండియు అస్సాము, ఆర్కను, టెన్నాసిరములు 1824–6 లలోను, పెగు, 1852 లోను లోబరచుకొనినపుడును యీరాజ్యముల పరిపాలనమునకు, బెంగాలు పరిపాలనానిబంధనలు వర్తింపవనియు, నిబంధనలులేని రాజ్యములుగ (Non – Regulation Provinces) సివిలుమిలటరీ యుద్యోగులను నియమించుచు పరిపాలింపవలయుననియు ప్రభుత్వము నిర్ణయించియేయున్నది. ఇది, నాడు న్యాయశాస్త్ర సమ్మతము కాకపోయినది. అందుచే శాసనరూపముగ నీవిధాన మంగీకరింపబడినది.

ఈ 1854 సంవత్సరశాసనము ననుసరించి గవర్నరు జనరలునకు, వంగదేశగవర్నరు పదవి తీసివేయబడుటచే బిరుదముగూడ తీసివేయబడినది. గవర్నరులపై యధికారమునేకాని, గవర్నరుల యధికారమును కౌన్సిలు యుతుడగు గవర్నరుజనరలునకు తీసివేయబడెను. హిందూదేశమునందలి రాష్ట్రముల సరిహద్దులను సీమప్రభుత్వాంగీకారముతో మార్చుటకు వలయు నధికారముగూడ కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారి కొసగబడినది.

# పరిపాలనా విధానము.

## (1793-1813-1833-1853.)

28 సీమయందు ఇండియా సంఘము. ఈకాలమునందలి రాజ్యాంగపరిణామము నింతవరకును గమనించితిమి. ఇక, పరిపాలనావిధాన మెట్లుండినదియు గమనింపదగును. కంపెనీ యింతవరకును నామావశేషము కాలేదు. హిందూదేశరాజ్యాంగ వ్యవహారములలో కంపెనీ డైరక్టరుల పలుకుబడి గమనార్హముగనే యున్నది.1

కంపెనీ, గవర్నరు జనరలుగనున్న ఎలింబరో ప్రభువును ఉద్యోగకాల పరిమితి పూర్తిగాకపూర్వమే సీమకు మరల్చివేయగలిగినది. ఈవిధముగనే వెల్లులీ ప్రభువును తన గవర్నరుజనరలుపదవికి రాజీనామా నిచ్చునట్లు చేయగలిగినది.

ఇండియాబోర్డునకు వర్తకవ్యాపారమునందుతప్ప యితర రాజ్యాంగము లందు సర్వాధికారములుగలవు. 1784వ సంవత్సర శాసనమునునుసరించిఇండియా బోర్డువారికి కంపెనీవారి పరిపాలనపై పరీక్షాధికారము హెచ్చింపబడినది. హిందూదేశ వ్యవహారములను పరీక్షించుటయేకాక, వాటిపై అన్నివిధముల పెత్తనమును వహించుటకుగూడ నధికారము సంక్రమించినది. (To superintendent direct control). కంపెనీడైరక్టరులుపంపు ఉత్తరువులు, ఉత్తరములు, మొదలగు సర్వవ్యవహారములను ఇండియా సంఘము ఆమోదించుటకు, లేక, నిరాకరించుటకునుగూడ ఇండియాసంఘమునకు 1833 వ సంవత్సరమునందు అధికారము సంక్రమింపజేయబడెను. మరియు, యీస్టిండియాకంపెనీవారికి సీమలోగలప్రభుత్వ కోశాగారమునుగూడ ఇండియాసంఘమువారికి దఖలుపరుప బడినది. కంపెనీవారికి వర్తకలాభములేమియు లేకుండుటయే యిందులకు కారణముగ పేర్కొనబడినది. హిందూదేశప్రభుత్వమునందు పనిజేయుటకై

1. See Kaye, Memorials of Indian Govt. P. 483. Administration of the East India Company P. P. 129. Roberts India under wellesle P. P. 268-88.

ఉద్యోగస్థులను నియమించుట, లేక, వారినిబర్తరఫు జేయుచుండుట మొదలగు నుద్యోగస్థులకు సంబంధించిన యధికారములుమాత్రమే యింకను కంపెనీడైరక్టరులకు మిగిలియున్నవి. కాని, సాలుసరి నియమించదలంచిన సివిలుమిలిటరీ ఆఫీసర్ల సంఖ్యనుమాత్రము ఇండియాసంఘమువారే నిర్ణయించుట కధికారము గలదు. ఇండియాసంఘమువారు నిర్ణయించిన సంఖ్యననుసరించియే కంపెనీడైరక్టరు లుద్యోగస్థులను నియమించుచుండిరి. ఇదియే వారికిమిగిలిన యధికారము. ఇండియాసంఘమునకు కంపెనీవారి సీమకార్యాలయమునందలి యుద్యోగస్థులమీదగూడ అధికారములేదు. కాని, ఎంతసొమ్ము సీమకార్యాలయముమీద ఖర్చుపెట్టవలసినదియు నిర్ణయించు నధికారముమాత్రము ఇండియాసంఘమునకే యొసగబడినది.

29
ఇండియా సంఘమువారు చెలాయించిన అధికారములు.

ఈవిధముగ ఇండియా సంఘమువారు హిందూదేశ పరిపాలనపై చెలాయించిన పెత్తనమునుగురించి యిండియా సంఘోద్యోగియగు వాటరుఫీల్డుగారు 1853 వ సంవత్సరమునందు యిండియా పరిపాలననుగురించి విచారణ సలిపిన పార్లమెంటువారి సంఘసముఖమున వివరించి యుండిరి. ఈయనసాక్ష్యమును గమనించుచో ఆనాడు ఇండియాసంఘమువారేవిధమగు పరిపాలనము కొనసాగించినదియు సుబోధకము కాగలదు. నేటికిని యిట్టిచిహ్నములు యిండియారాజ్యాంగ కార్యాలయమునందు గోచరించుచుండుటవల్ల నాటిలక్షణముల నొకింత గమనించుటయవసరము.

(1) పరీక్షాధికారమును చెలాయించిన పద్ధతి:— ఇండియారాజ్యాంగ కార్యాలయము ఆరుశాఖలుగ విభజింపబడినది. (1) "రెవిన్యూ; హిందూదేశమునందు పన్నులువిధించుట—వసూలుచేయుట, మొదలగుపనులకు సంబంధించినవ్యవహారము లీశాఖకుచెందినవి.

(2) ఆర్థికము:— లెక్కలు; ఆదాయవ్యయనిర్ణయము; మూడు రాష్ట్రములయందునుగల టంకశాలల పరిపాలనము. (3) సైన్యము. (4) నావికాదళము; మతసంబంధ విషయములు; ఇతర చిల్లర విషయములు.

(5) రాజకీయములు. (6) న్యాయపరిపాలనము. శాసనాధికారము. ఈశాఖలు గాక మరొకరహస్యపు శాఖగలదు. ఈశాఖపై యిండియాసంఘపు అధ్యక్షునికే సంపూర్ణాధికారము గలదు. ఈశాఖతాలూకు ఉత్తర ప్రత్యుత్తరములన్నియు నాతడు స్వయముగా జూచుకొనెడివాడు. రాజ్యాంగ కార్యాలయమునకు జోక్యములేదు. ఈరహస్యపుశాఖలో విశేషపుపని యుండెడిది.

ఇతరశాఖలకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములన్నియు రాజ్యాంగ కార్యాలయమునందే తయారుచేయబడుచున్నవి. ఈ కార్యాలయమునకు వచ్చు ప్రత్యుత్తరములు మొట్టమొదటగ కంపెనీచైర్మను ఇండియాసంఘపు ప్రెసిడెంటునకు పంపుచుండును. ఈప్రత్యుత్తరముతోపాటు అందులనుగురించిన తన యభిప్రాయములనుగూడ వ్రాసిపంపుచుండును. కంపెనీడైరక్టరుల సంఘమున కీవిషయము తెలుపుటకు ముందుగనే యిండియాసంఘపు ప్రెసిడెంటునకు పంపబడుచుండును. ఇట్టి ప్రత్యుత్తరముతో ఆవిషయమునుగురించి హిందూదేశోద్యోగస్థులతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరముల రికార్డునంతనుకూడ పంపుచుండును. ఇట్టిరికార్డు లొకప్పుడు చాలపెద్దవిగ నుండును. ఒక ఆర్థికవిషయమును గురించిన ప్రత్యుత్తర మొకప్పుడు 416 పేజీలతో గూడియున్నది. మరొకప్పుడు మిలిటరీశాఖకు సంబంధించిన యొకప్రత్యుత్తరము 13511 పేజీలతో గూడియుండెనదని కానింగుగారు పార్లమెంటుసభలో నుడివిరి. రివిన్యూ డిపార్టుమెంటులో మరియొక ప్రత్యుత్తరమునకు సంబంధించి 16263 పేజీలుగలవు. ఈడిపార్టుమెంటునకు సంబంధించి 1845 సంవత్సరములో నొకప్రత్యుత్తరము 46000 పేజీలుగలిగియున్నది. ఇట్టికాగితములను, అందుపై ఉద్యోగస్థులచేత వ్రాయబడిన యభిప్రాయములను ప్రెసిడెంటుచదివి ఆయన నిర్ణయమును వ్రాసెడివాడు. "ఈవిధముగ ముందుగనే ప్రతివిషయముపైన రికార్డులను పంపుచుండుటవలన కంపెనీతాలూకు 24 గురు డైరక్టరుల వ్యవహారకాండలపైనను ఇండియాసంఘము సక్రమమగు పెత్తనము వహింపగలుగుటకు సావకాశముండెడిదికాదు."

ఇండియాసంఘపు ప్రెసిడెంటుగారి వ్రాతతోగూడిన "ఉత్తరప్రత్యుత్తరముల" రికార్డు (Previous Communications) కంపెనీ డైరక్టరుల సంఘ

మునకు తిరిగిపంపబడును. పిమ్మట కంపెనీడైరక్టరుల చైర్మను ప్రెసిడెంటుగారి యుత్తరువులను గ్రహించి, అందుతో నేకీభవింపవచ్చును. లేదా వ్యతిరేకాభిప్రాయమును గలిగియుండవచ్చును. లేదా సంస్కరింప కుతూహలుడు కావచ్చును. ఏవిధముగ నాతడు తలంచి నిర్ణయించుకొనినను, ఆయన నిర్ణయమును డైరక్టరుల సభాసమక్షమునం దుంచును. ఈడైరక్టరుల నిర్ణయము తిరిగి ఇండియాసంఘమునకు రికార్డులతో సహా పంపబడును. ఈడైరక్టరుల నిర్ణయముతో ప్రెసిడెంటు ఏకీభవించనియెడల, అట్లేకీభవించక పోవుటకుగల నిర్ణయములను నిరూపించుచు ప్రెసిడెంటుగారు తిరిగి వారియిష్టప్రకార మావిషయము నిర్ణయించును. ఈవిధముగ యిండియాసంఘమే తుదినిర్ణయమును గావించుచుండెను. ఈతుదినిర్ణయమును కంపెనీడైరక్టరులు హిందూదేశప్రభుత్వమునకు ఉత్తరువుల రూపముగ జారీచేయుచుందురు. ఇట్టిఉత్తరువులనకలును తిరిగి ఇండియాసంఘమున కీస్టిండియాకంపెనీ పంపుచుండవలయును. ఇట్లుపంపుట వలన తమనిర్ణయములను కంపెనీవారుసక్రమముగ నిర్వహించుచున్నదియు లేనిదియు తెలిసికొనుటకు ఇండియాసంఘమునకు సావకాశము గలుగుచుండును.

ఈవిధులు మాత్రమేకాక ఇండియాసంఘపు ప్రెసిడెంటునకు యింకను పనియున్నది. ఈయన యితరప్రభుత్వ శాఖలతోగూడ రహస్యముగ నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచుండును. 1811 వ సంవత్సరము మొదలు ఆంగ్లేయ ప్రభుత్వమంత్రివర్గమునం దాయనగూడ నొకమంత్రిగనున్నాడు. ఈయనయే హిందూదేశపు గవర్నరుజనరలుగారితోను యితరముఖ్యాధికారులతోను ఎడతెరిపిలేని ఉత్తరప్రత్యుత్తరములను వ్రాయుచుండెడివాడు. ఈయనకాలమంతయు నీవిధముగనే సరిపోవుచున్నది. 1

ఈయధికారములన్నియు ఇండియాబోర్డు అధ్యక్షునియొక్క వ్యక్తిత్వము ననుసరించియే అమలుజరుపబడినవి. ఆచరణయందు ఇండియాబోర్డు ప్రెసిడెంటీబోర్డుగవ్యవహరించినాడు. ఈప్రెసిడెంటుగారును, డైరక్టరులబోర్డు చైర్మనుగారును సమాలోచనజేసియే, వ్యవహారములను నిర్వర్తించు చుండెడివారు.

---

1. Quoted by A. Ranga swami Ayyangar. The Indian Constitution P. 18—21.

ఈవిధముగ డైరక్టర్ల సంఘము, ఇండియాబోర్డు కెంటియొక్క ద్వంద్వ పరిపాలనము, వెనుకటి పరిపాలనమును సంస్కరించినదని కొందరి చరిత్రకారులమతము ఈపద్ధతివల్ల హిందూదేశప్రభుత్వమునకును సీమప్రభుత్వమునకును అవినాభావ సంబంధ మేర్పడినదనియు నీసంబంధము శ్రేయోదాయకమైనదనియు కొందరు చరిత్రకారులు నిస్సంశయముగ వ్రాయసాహసించిరి. కర్జనుగారుమాత్ర మీ పద్ధతి నిరుపయోగమైనదని విస్పష్టముగ వ్రాయగలిగిరి.[1] 1853 వ సంవత్సర శాసనము పార్లమెంటునందు చర్చింపబడునప్పుడు, జాన్‌బ్రైటు గారొసంగిన యుపన్యాసము గమనీయము. హిందూదేశ ప్రభుత్వ పరిపాలనమంతయును సీమప్రభుత్వమేప్రత్యక్షముగ నిర్వహింపవలయునని యీయనవాదము. "ఇంత వరకునుగల హిందూదేశ రాజ్యాంగచరిత్ర రాబడిని దుర్వినియోగపరచిన చరిత్ర, యుద్ధములవల్ల సుపరిపాలనము నిరోధింపబడినచరిత్ర—''. . . డైరక్టరులసంఘము—ఇండియాబోర్డు—యీద్వంద్వపరిపాలనము రాజ్యాంగమున చెప్పనలవిగానంత అరాజకమును, అవినీతిని, (Corruption) తెచ్చిపెట్టినది. ప్రజలకు దారిద్ర్యమును, దుర్భరస్థితినిదాపరింపజేసినది." . . . "ఈపద్ధతి యొకగారడీ. ఇదిప్రజాభిప్రాయమునుమోసపుచ్చుచున్నది. బాధ్యతను మరుగుపరచుచున్నది. పార్లమెంటువారి పెత్తనమును తప్పించుకొనుచున్నది."

30 హిందూదేశ పరిపాలనము

ఈ పరిస్థితులలో హిందూదేశ పరిపాలనావిధానము, హిందూదేశమునకు పంపబడిన గవర్నరుజనరలుగార్ల యొక్క యోగ్యతాయోగ్యతలననుసరించియే కొనసాగింపబడినది. సీమదేశమునందలి రాజకీయనాయకులుగ నుండువారిని, లేక, ప్రభువులహోదా గలిగియుండువారిని గవర్నరుజనరలు పదవికిని, గవర్నరులపదవులకును నియోగించుచో పరిపాలన సుకరముగను, యోగ్యముగను నుండునని యొకప్పుడు తలంచబడినది. ఈయభిప్రాయముననుసరించియే కారనువాలీసుగారు గవర్నరుజనరలుగ నియమింపబడినారు. కాని, యీయనస్థానమున ప్రభువులహోదాలోనివాడుగాని షోరుగారు 1793 లో నియమింపబడినాడు. ఇందులకు ప్రత్యేకకారణములున్నవని ఆంగ్లేయచరిత్రకారుల నిర్ణ

1. See. British Govt. in India. ii. 67.

యము. 1 ఈయన పరిపాలనయు మంచిదనుటకు వీలులేనట్లుగనే యున్నది. 1805–7 మధ్యగల బార్లోగారి పరిపాలనముగూడ గౌరవప్రదము కాలేకపోయి నది. మెట్ కాఫ్‌గా రీస్థానమునందు నియమింపబడుటకు సీమప్రభుత్వ మంగీక రించియుండలేదు. అసమర్థుడయిన అకలాండుగారు గవర్నరుజనరలుగ పంప బడిరి. సిపాయిల తిరుగుబాటు ముగిసినపిమ్మట హిందూదేశమునకు గవర్నరు జనరలు పదవి నధిష్ఠించుటకై పంపబడినవారందరు ప్రభువుల కోవలోనివారే. ఒక్కలారెన్సుగారే యీతెగకు చేరరు.

కంపెనీసిబ్బందీయందు పనిజేసినయుద్యోగుల నీ యున్నతోద్యోగములకు నియమించుటవల్ల అవినీతిప్రబలు నని తలంపబడినది. ప్రభువులకోవలోనివా రైనచో ఉన్నతాదర్శములతో, సత్ప్రవర్తకులుగ నుండగలరని తలంపబడినది. యూహించుటయం దీసిద్ధాంతము సమంజసముగ దోచకమానదు. కాని, ఆచరణయం దీకోవకుచెందినవారైనను ఒక్కరీతిగనే ప్రవర్తించిరి. మరియు, ప్రభువులకోవలోనివారేపనిజేసినను వారిమాటను డైరక్టరులును, ఇండియా బోర్డునుగూడ త్వరితగతిని యామోదించుచుండెడిది. వీరికి సీమయందుగల పలుకుబడియే యిందులకు కారణము.

మదరాసు, బొంబాయి రాష్ట్రగవర్నరుల నియామకమును పరీక్షించినచో విలియముబెంటెక్కు మినహా యితర గవర్నరులందరును రెండవ తరగతికిని, మూడవ తరగతికిని జెందినవారేకాని సరియైనవారెవరును నియమింపబడి యుండ లేదు. 1780 సంవత్సరమున మెకార్ట్నీ మదరాసు గవర్నరుగ నియమింప బడిన నాటనుండియే మార్పుగలిగినది. డల్హౌసీ యీపద్ధతిని విరమించుట సమంజసమని తలంచియుండెను. మహారాష్ట్రయుద్ధములలో ఆంగ్లేయ దృక్పథమునకు బాగుగ వర్తించినవాడని మన్రోగారికి మదరాసు గవర్నరు పదవియును, ఎలిఫిన్‌స్టన్‌గారికి బొంబాయిగవర్నరు పదవియు నొసంగబడెను.

---

1. See Keith P. 141.

31
రాష్ట్ర ప్రభుత్వ అంగ నిర్మాణము.

రాష్ట్రప్రభుత్వములుగూడ కేంద్రప్రభుత్వ అంగనిర్మాణము ననుసరించియే నిర్మింపబడినవి. గవర్నరు, మరి యిద్దరుకౌన్సిలర్లు, సేనాధిపతియునుగలిసి రాష్ట్రప్రభుత్వముగ నిర్మింపబడినది. గవర్నరుజనరలుగారివలెనే గవర్నరులకు కూడ తమకౌన్సిలు తీర్మానములను రద్దుజేసి వ్యవహరించుట కధికారమును గలిగియుండిరి. 1833 వ సంవత్సరపు శాసనముగావింప బడువరకును శాసనాధికారమును, కార్యనిర్వాహణాధికారమును నిర్వర్తించుచుండిరి. ఈ యధికారములు సుప్రీముకోర్టు అధికారమునకు లోబడియుండు పౌరులమీదనే వర్తింపజేయ బడగలవు.

కారనువాలీసునకు పిమ్మట రాష్ట్రప్రభుత్వములు గవర్నరుజనరలు అధికారమునకు సంపూర్ణముగ లోబరుపబడినవి. 1793 వ సంవత్సరశాసనము ననుసరించి గవర్నరుజనరలు యితరరాష్ట్రములను సందర్శించి, వంగరాష్ట్రప్రభుత్వముమీద తాను చెలాయించగల యధికారము లన్నియు, యితరరాష్ట్రప్రభుత్వములమీద గూడ చెలాయింపగలిగియుండెను. ఆరాష్ట్రమునందలి ఏకంపెనీ యుద్యోగికైనను రాష్ట్రప్రభుత్వసలహా సంప్రదింపులతో నిమిత్తమేమియును లేకుండగనే తనయిష్టమువచ్చిన నాజ్ఞలనొసగ గలిగియుండెను. ఈయధికారము ననుసరించియే వెల్సలీ గవర్నరుజనరలు 1798 లో మదరాసుప్రభుత్వము నిరోధించుచున్నను, ఆనిరోధమును పాటింపక టిప్పుసుల్తానును రాజ్యభ్రష్టునిగ నొనరించుటకై వలయుయుద్ధ ప్రయత్నములను చేయించగలిగి యుండెను. (Wellesley used to dominate his Council and received strong disapproval from the directors for it; and he personally dictated Policy to the Governers.) 1

అయినను వెల్సలీగారుకూడ ఆయన నాజ్ఞలకు సిబ్బందీ త్వరితగతిని విధేయులగుట లేదని తలంచియుండెను. ఈయనకు పూర్వముగల షోరుగారితో సంప్రదించకుండగనే లార్డుహోబర్టుగారు సముద్రతీరమున నావికా వర్తకమునకై యాజ్ఞయిచ్చియుండెను. షోరుగారికిని హోబర్టుగారికిని పరస్పరకలహము సంభ

1. See Roberts, India under Wellesley P. P. 3—8. 279—85 for his control of Lord Clive at Madras. P. P. 44-8.

వించినది. హాబర్టుగారు సీమకుమరలిరి. గవర్నరుజనరలు పదవికిగల సావ కాశము గోల్పోయిరి. 1

గవర్నరు పదవులును, కౌన్సిలరులపదవులును, కంపెనీ సిబ్బందీయందలి ప్రతివారికిని వెనుకటివలె లభింపజేయకుండుటవల్ల వారికినష్టపరిహారముగ కొన్ని ప్రత్యేకసౌకర్యము లొనగూర్చబడినవి. 1793 వ శాసనమునుసరించి కౌన్సిలరుపదవులకు తక్కువపదవులన్నియు సిబ్బందీకే యొసగుటకు నిర్ణయింపబడి హామీయొసగబడినది. సాలుసరి పౌ 500 లు జీతముగల నుద్యోగములొసగుటకు మూడుసంవత్సరములును, పౌ 1500 ల జీతముగలవాటికి ఆరుసంవత్సరములును, పౌ 3000 ల జీతముగలవాటికి 9 సంవత్సరములును, పౌ 4000 లు జీతముగలవాటికి 12 సంవత్సరములును నుద్యోగమును జేసియున్నవారికే యొసగబడవలయునని శాసింపబడెను. ఈకాలపరిమితులు తిరిగి నాలుగు, ఏడు, పది సంవత్సరములకు తగ్గించబడినవి. ఇంతటి అధికజీతములకు కారణమేమి యను ప్రశ్నకు కంపెనీలాభములు తగ్గించుటకేనను సమాధానమును ఆంగ్లేయచరిత్రకారులొసగుచున్నారు.2 కంపెనీ వాటాదారులు అధికలాభములను పంచుకొనినను, లేక, పెద్దయుద్యోగులకు జీతములధికముగ నొసగినను హిందూదేశము తన ధనమును గోల్పోవుటకు, రెండునుసమానములే.

"నూతన పరిపాలనమున డైరక్టరులయొక్క ఉద్యోగముల పంపకపు టధికారము కనిష్ఠస్థితికి తగ్గించబడినది. గుమాస్తా యుద్యోగములను మాత్రమే కంపెనీ యొసంగగలదు. ఇందువల్ల ఉద్యోగములకై హిందూదేశమునకు పోవుచున్న దురాశాపాతకులగు సాహసగాండ్ర వరదకు కట్టవేయబడినది." అని కీతుగారి యభిప్రాయము. కాని, రిగ్యులేషనులు వర్తింపని రాష్ట్రముల కీనిబంధనలు వర్తింపవు. ఇచ్చట శాసన నిబంధనములన్నియు తలక్రిందులు చేయబడినవి. కీతుగారి యభిమతప్రకారము వెనుకటి పట్టపగటిదోపిడీకి ఆనకట్టకట్టబడినను యీయుద్యోగములన్నియు ఆంగ్లేయులకే గుత్తగ నొసగబడినవి. భార

1. See. Teignmouth. Life of Shore i, 372.
2. See Keith P. 142.

తీయులకు బాధ్యతగల పెద్దయుద్యోగములేవియు నొసంగబడుటకు సావకాశము లేదు. 1833 వ సంవత్సర శాసనమునందు జాతి, మత వివక్షత లుద్యోగముల పట్ల పాటింపరాదను సిద్ధాంతము ప్రకటింపబడియున్నను, ఆసిద్ధాంతప్రకారమైన నీ దురాగత మాపివేయబడలేదు. 1853 వ సంవత్సరశాసనము ననుసరించి సీమలో పెట్టబడిన పోటీపరీక్షలవల్ల ఆంగ్లేయుల యొక్క ఉద్యోగముల గుత్త సక్రమముగ సంరక్షింపబడినది.

కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారికొసగబడిన ప్రత్యేకాధికారములననుసరించి యితరరాష్ట్రముల ప్రభుత్వాంగనిర్మాణముగూడ వంగరాష్ట్ర ప్రభుత్వాంగనిర్మాణమువలె తయారుచేయబడుటకై తరుచువినియోగింపబడినవి. కాని, యితర రాష్ట్రములీ వంగ, అంగనిర్మాణవిధానమును భర్జించుకొన నిరాకరింపసాగినవి. వంగదేశమునందుననే, కారనువాలీసుగావించిన ప్రభుత్వ సంస్కరణవిధానమంతయు నిరుపయోగమని గ్రహింపవలసివచ్చినది. కారనువాలీసుపద్ధతి మార్చివేయుట అత్యవసరమని విశ్వసింపబడినది.

## వంగదేశ పరిపాలనము, కారనువాలీసు.

32 భూమిశిస్తు నిర్ణయము న్యాయశాఖ. వంగదేశపరిపాలనయందు కారనువాలీసు ప్రవేశపెట్టబడిన సంస్కరణములు గమనీయములు.

(1) భూమిశిస్తు శాశ్వతనిర్ణయవిధానము. (2) భూమిశిస్తువసూలు—న్యాయశాఖలను విడదీయుట. (3) ఆంగ్లేయులనే పెద్దపెద్దయుద్యోగముల యందు నియమించుట. (4) ఉద్యోగుల నడవడికలకును పరిపాలనకును సంబంధించిన వివిధరీతుల నిబంధనల నేర్పరచుట. (Regulations). ఈ నాలుగు విషయములలో మొదటి రెండువిషయములయొక్క యోగ్యతాయోగ్యతలు నాటినుండి నేటివరకును తర్కించబడుచునే యున్నవి. మొట్టమొదట భూమిశిస్తు నిర్ణయపద్ధతి సక్రమముగ కొనసాగియుండలేదు. కోర్టులన్నియు దావాలతో నిండిపోయినవి. జమీందారీలు తరుచు అమ్మివేయబడవలసివచ్చినవి.

1795–1799 సంవత్సరములలో జమీందారులకు శిస్తువసూలిచ్చునటుల రైతులను నిర్బంధించగల యధికారములుగూడ నొసంగబడినవి. మరుసటి సంవత్సరమే జమీందారులనే అరెస్టుచేయుటకు వలయునిబంధన లేర్పరుపబడినవి. మొట్టమొదటగ జమీలనుపొందినవారు తమజమీలను చాలమంది అమ్మివేసి కొనినపిమ్మట కొంతకాలమునకు జమీందారీపద్ధతి సక్రమముగ నడిచినది.

కాని కారనువాలీసు పరిపాలనావిధానమునందు తగవులు మితిమీరి పోయినవి. కోర్టులన్నియు దావాలతో నిండిపోయినవి. దావాకోరుతనము భారతదేశమున నాడే ప్రారంభింపబడి వృద్ధియైనది. 1 కోర్టులయందు పెరిగిన దావాలఒత్తిడిని తగ్గించుటకై కొన్నిప్రయత్నములు జరిగినవి. ఇందులకై సబు ఆర్డినేటు భారతీయజడ్జీలసంఖ్య పెంచబడినది. వీరియధికారములుగూడ హెచ్చింపబడినవి. అపీళ్ళకు సావకాశమును సంకుచితమొనరింపబడినది. 1801 లో సాదరుదివానీ అడాలటునకు ముగ్గురుజడ్జీలు నియమింపబడిరి. ఇంతతో గవర్నరు జనరలు కౌన్సిలునకు న్యాయవిచారణాధికారము తొలగిపోయినది. కాని 1818 వరకును మదరాసురాష్ట్రమునుండి చేయబడినఅపీళ్ళుమాత్రము కలకత్తాగవర్నరు జనరలుగారి కౌన్సిలు విచారించుచు తీర్పులను జెప్పుచుండెడిది. 1807 లో ఈసాదరుదివానీ అదాలతు జడ్జీలసంఖ్య నలుగురికి హెచ్చింపబడినది. 1811 లో అవసరమైనపుడెల్ల ప్రధానన్యాయమూర్తిగాక యితరజడ్జీలసంఖ్య హెచ్చించుచుండుటకు నిర్ణయింపబడినది. 1797 లో రాష్ట్రీయకోర్టులు సంచారరమునందున్నపుడు (Circuit Courts) ఆకోర్టుఅపీళ్ళను సాదరుదివానీకోర్టు విచారించుచుండెడిది. చిన్ననేరముల విషయములలో మేజస్ట్రీటులకు శిక్షింపగల అధికార మభివృద్ధిచేయబడినది. కాని యీమార్పులేమియు న్యాయశాఖా పరిపాలనమును సంస్కరింపజాలకపోయినవి. 1814 లో మాత్రమే కారను వాలీసుగావించిన విధానమూలసూత్రములు మార్చబడినవి. 1814 లో కంపెనీ డైరక్టరులును ఇండియాబోర్డునుగూడ కలెక్టరులకు తిరిగి న్యాయశాఖపరిపాలనము నందలికొంతఅధికారము నొసంగవచ్చుననితలంచిరి. పోలీసుశాఖపై పెత్తనము నొసంగుచు నేరములనుశిక్షించుటకు వలయుమేజస్ట్రీటుల యధికారమునుగూడ

1. See Keith . P. 143.

నొసంగ నిర్ణయింపబడినది. కాని యీ సంస్కరణము లోక్కమాటుగ జరుపుటకు స్థానికాధికారులు త్వరితగతి నంగీకరింపకుండుటవల్ల క్రమక్రమముగనే ఆచరణకు వచ్చినవి. 1813–1814 లో పోలీసుశాఖ పునర్నిర్మాణ మొనరింప బడినది. 1814–1821-31 సంవత్సరములమధ్య మునసబులకును ఆసాదరు అమీనులకును సివిలుదావాలలో హెచ్చుఅధికార మొసంగబడినది. సాదరు దివానీ అదాలతుకోర్టునకు అయిదవజడ్జీకూడ నియమింపబడి జడ్జీలమధ్యదావాలు పంచిపెట్టబడుచు వ్యవహారింపబడసాగెను. ఈవిధముగనే జిల్లాజడ్జీలసంఖ్య హెచ్చింపబడినది. కలెక్టరులకు రివిన్యూకేసులు విచారణకై పంపబడసాగినవి. 1819 లో పన్నును కట్టరాదని వాదించుకొనుదావాలును 1822 లో వేలములలో వచ్చినపొరబాటులను సవరించవలసినదావాలును కలెక్టరులవిచారణకై పంపబడి నవి. 1819 లోగావించిన 8 వ శాసనము (రెగ్యులేషను) ననుసరించి భూమియందు రైతులకుగలహక్కులు నిర్వచింపబడినవి. ఈనిర్వచనము ననుస రించియే భూమిశిస్తుదావాలలో కోర్టులు తీర్పులుచెప్పుచుండెడివి. 1821 లో గావింపబడిన 15 వ రిగ్యులేషను ననుసరించి క్రిమినలునేరములలో కలెక్ట రులే మేజస్ట్రీటులుగ పనిచేయవలెనని నిరూపింపబడినది. 1824–1831 సంవత్స రములలో కలెక్టరులకు రైతులుచెల్లించు శిస్తుదావాలను విచారించుటకై యధికార మొసంగబడినది. ఈకలెక్టరులు కలకత్తాయందున్న రివిన్యూబోర్డు పెత్తనమునకులోబడి పనిచేయుచుండెడివారు. 1829 లో రివిన్యూకమీషనరులు నియోగింపబడిరి. వీరు సంచారముగూడ చేయుచుండెడివారు. (Commissi-oners of Revenue and Circuit) కలెక్టరులు- మేజస్ట్రీటుహోదాలను చెలాయించుచున్న జడ్జీలునుగూడ వీరిపెత్తనమునకు లోబడియుండెడివారు. ఈ కమీషనరులే క్రిమినలుకేసుల విచారణలుగూడ జేయుచుండెడివారు. వీరికి రాష్ట్రీయకోర్టుల విధులప్పగించివేయబడినవి. కాని 1831 లో కమీషనరులనుండి యీ యధికారముతీసివేయబడి జిల్లాజడ్జీలకే క్రిమినలునేరములను విచారించుట కధికార మొసంగబడినది. జిల్లాజడ్జీలకుగల మేజస్ట్రీటుఅధికారము కలెక్టరుల కొసంగబడినది. కాని 1837 లో న్యాయశాఖ–కార్యనిర్వహణశాఖ తిరిగి విడదీయబడినవి. ప్రతిజిల్లాకును ఒకజిల్లాజడ్జీయు క్రిమినలు అధికారములతోగూడిన

ఒక కలెక్టరును ఒక మేజస్ట్రీటును నియోగింపబడిరి. వీరి ముగ్గురికిని డిప్యూటీ కలెక్టరు — సబుజడ్జీ — సబుకలెక్టరు సహాయులుగ నుండెడివారు. వీరు మాత్రమితరుచు హిందూదేశస్థులుగ నుండెడివారు. జిల్లాముఖ్యస్థానములలో కలెక్టరుకచేరీయందు కోశాగారముండెడిది. (Treasury) 1833 లో డిప్యూటీ కలెక్టరు పదవులును 1843 లో డిప్యూటీమేజస్ట్రీటు పదవులును శాసనబద్ధ మొనరింపబడినవి. బెంటికుగారి హయాములో జాయింటుమేజస్ట్రీటు పదవు లేర్పరుపబడినవి. వీరే కొంతకాలమునకు సబుడివిజనల్ ఆఫీసర్లుగా మారిరి. వీరికి పోలీసుమీదగూడ పెత్తన మొసంగబడినది. కొంతమంది కలెక్టరులకు మేజస్ట్రీటు అధికారములుగూడ నొసంగబడినవి. బెంటికుగారి హయాములో సాదరుఅమీనుకోర్టు లేర్పరుపబడినవి. ఈయుద్యోగములు భారతీయులకు తరుచొసంగబడుచుండెడివి. ఈకోర్టులు రు 5000 ల విలువ వరకుగల దావాలను విచారించుట కధికారమును గలిగియుండెను. వీటినుండి కొన్నిదావాలలో సాదరుదివానీ అదాలతుకోర్టునకే అపీలుచేసికొను అధికారమేర్పరుపబడినది. ఈవిధముగ న్యాయశాఖను కార్యనిర్వాహకశాఖను వేరుచేయవలెనను సిద్ధాంతమునకు కారనువాలీసు కారకుడు. "భూమిశిస్తును వసూలుచేయు కలెక్టరులకు తమచర్యపై తామే తీర్పునుజెప్పుకొనగల యధికారమును తీసివేయవలయును. న్యాయస్థానములకు వీరిచర్యలను లోబరచవలయును. కలెక్టరులు ప్రభుత్వపు రాబడిని వసూలుచేయుటలో అనవసరముగచేయు హెచ్చువసూళ్ళకును— యీ వసూళ్ళకునుగల నిబంధనలను దాటి చేయుప్రతిపనికిని శిక్షార్హులుగ నుండవల యును" అని కారనువాలీసుగారీసిద్ధాంతమునుగురించి 1793 లో వ్రాసియుండిరి. కాని యీ సిద్ధాంత మితరసామ్రాజ్య నిర్మాతలకును సంస్థాపకులకును సంరక్షకులకును నయించలేదు. కలెక్టరులు సర్వాధికారులుగ నొసరింపబడకపోయినచో ఆంగ్లేయరాజ్యభద్రతకు ప్రమాదమువాటిల్లుననుభయము జనించినది. 1854 లో మొదటిలెఫ్టినెంటు గవర్నరగు డల్హౌసీగారును 1857 లో కానింగుగారును ఈ విధానమును రద్దుచేయవలయుననియు కలెక్టరునకే రివిన్యూ క్రిమినలు అధికారములురెండును సంక్రమింపజేయవలయుననియును పట్టుబట్టిరి. ఆనాడు మదరాసు బొంబాయి పశ్చిమోత్తర పరగణాలలోనున్న జిల్లాయుద్యోగితో సమానముగ వంగదేశమునందు గూడ కలెక్టరులకే యధికార మొసంగుటయే తగుపని యని

వారు పట్టుపట్టిరి. సిపాయీల యుద్ధానంతర మీవిధముగ మార్పుచేయబడి కలెక్టరులు జిల్లాలకు సర్వాధికారులుగ నొనరింపబడిరి. సిపాయీల తిరుగుబాటు నందు గలిగిన యనుభవమువల్ల సర్వాధికారులగు కలెక్టరులు ప్రతిజిల్లాయందున నుండుట యత్యవసరమని నిర్ణయింపబడినది.

రిగ్యులేషను లేని రాష్ట్రములు ఆక్రమణ రాజ్య భాగములు

1795 లో కాశీరాజ్యమునకు — కాశీలో నొకకోర్టును మూడుజిల్లాకోర్టులును స్థాపింపబడినవి. వీటితీర్పులపై అపీళ్ళకు రాష్ట్రీయ కోర్టుగూడ నెలకొల్పబడినది. 1803 లో అయోధ్యరాజ్యమునగూడ వంగదేశ పరిపాలనాపద్ధతి యాచరణకు తేబడినది. 1804 లో డూబా యందుగూడ ప్రవేశపెట్టబడినది. 1831 లోనే పశ్చిమోత్తరపరగణాలకు గూడ సాదరు దివానీ అడాలతుకోర్టు స్థాపింపబడినది. 1795 లోనే క్రిమినలు నేరములను విచారించుటకై కాశీపట్టణజిల్లాజడ్జీలకే మేజస్ట్రీటుహోదాగూడ యొసంగబడినది. రాష్ట్రీయకోర్టునకే సంచారపుకోర్టు అధికారముగూడ సంక్రమింప జేయబడినది. ఈకోర్టులన్నింటిపైన సాదరు నిజామటు అడాలటుకోర్టున కధికారమొసంగబడినది. 1803 లో అయోధ్యరాజ్య జిల్లాజడ్జీలగు 7 గురికిని మేజస్ట్రీటు అధికారములుగూడ సంక్రమింపజేయబడినవి. రాష్ట్రీయకోర్టు సంచారపుకోర్టుగా నొనరింపబడినది. దీనిపైన సాదరు నిజామతు కోర్టునకు అధికారముండెడిది. 1804–5 లో డూబాకుగూడ ఇట్టి యేర్పాటులే గావింపబడినవి. 1817 లో ఢేరాడన్ను కునూనులురెండింటియందునను న్యాయశాఖ ప్రవేశపెట్టబడినది. 1831 లో ప్రత్యేకముగ నీప్రదేశములకు అలహాబాదులో సాదరు నిజామతు అదాలతుకోర్టు స్థాపింపబడినది. ఈకోర్టునకు పశ్చిమోత్తర పరగణాలపైనను కూనూను—సాగరు—నర్మదారాజ్య భాగములపై అధికారమొసంగబడినది. కటకము 1804 లో ఆక్రమించుకొనబడినది. ఇందుగూడ న్యాయశాఖ ప్రవేశపెట్టబడినది. కలకత్తా సంచారపుకోర్టున కీరెండుజిల్లాలు లోబరుపబడినవి. ఈకోర్టులన్నియు స్వదేశరాజులవల్ల సంక్రమించిన యధికారము ననుసరించి స్థాపింపబడినవి. ఈకోర్టుల యధికారము 1836 లో ప్రజలందరిపైన వర్తింపచేయబడినది.

సుప్రీముకోర్టు

ఈకోర్టులుమాత్రమేకాక పార్లమెంటువారి శాసనముల ననుసరించి స్థాపింపబడిన కోర్టులుగూడగలవు. కలకత్తా యందలి సుప్రీముకోర్టు 1853 లో కలకత్తావాసులందరి పైన యధికారము గలిగియుండెను. ఆనాడు కలకత్తాయందు 4,13,182 మంది జనాభా గలదు. హిందూమహమ్మదీయ మతములపై మాత్రము మతాధికారమును చెలాయించియుండలేదు.

అధికారమును మాత్రము గలిగియుండెడిది. సీమ దేశములో పుట్టిన వారికిని వారిసంతతికిని కలకత్తారాజధానిలో నివసించుచున్నయెడల లేక ఆరాష్ట్రములో నివసించుచున్నఎడల నీ సుప్రీముకోర్టుఅధికారము వర్తింపచేయబడినది. కలకత్తాలోగూడ వాసమేర్పరుచుకొనియుండి యీప్రదేశములలో నివసించువారందరు లేక కలకత్తాలో తమ ఏజెంట్లుద్వారా వర్తకవ్యాపారము కొనసాగించుకొను వారునుగూడ యీసుప్రీము కోర్టు యధికారమునకు లోబడినవారుగనే పరిగణింపబడిరి. ఏదావా విలువ రు 500 ల కంటె హెచ్చుగ నుండునో అట్టి దావాల హిందూదేశస్థులు వ్రాతమూలకముగ నీకోర్టు అధికారము నంగీకరించెదమని వ్రాసియిచ్చినయెడల యీకోర్టు ఆదావాలనుగూడ విచారించుట కధికారమును గలిగియుండెను. కంపెనీయొక్క సిబ్బందీయంతేయు వారి నేరముల కన్నింటికిని నీకోర్టుచేతనే విచారింపబడెడివారు. బ్రిటిషుపౌరులు గూడ నీకోర్టుయొక్క క్రిమినలు అధికారమునకు లోబరుపబడిరి. వీరి సివిలు దావా లీకోర్టుచే నుభయపక్షము లంగీకరించినపుడే విచారింపబడెడివి. నావికు లొనరించు నేరముల నీసుప్రీముకోర్టే విచారించెడిది. బెంగాలు బీహారు ఒరిస్సాలలో మాత్రమే సివిలు అధికారము ఈకోర్టునకు గలదు. స్వదేశసంస్థానములలో ఆంగ్లేయపౌరులొనరించు దుండగములన్నియు నీకోర్టుచేతనే విచారింపబడెడివి.

న్యాయశాస్త్రము.

ఈసుప్రీముకోర్టుచే పాటింపబడిన న్యాయశాస్త్రము వివిధముగ నున్నది. (1) 1726 సంవత్సరమువరకును గల కామను లా. (2) ఆంగ్లేయన్యాయ శాసనములు. (Statue law). (3) హిందూదేశమునకు వర్తింపచేయబడిన ఆంగ్లేయశాసనములు లేక

హిందూదేశమున వాటివలెనే గావింపబడిన శాసనములు. (4) సీమదేశమునం దాచరణలోనుండిన క్రైస్తవ మతశాసనములు. నావికాశాసనములు. (5) 1813 సంవత్సరమునకు పూర్వము గవర్నరుజనరలుగారిచేత శాసింపబడి సుప్రీముకోర్టుచే రిజష్టరుచేయబడిన నిబంధనలు. (6) శిస్తులు – వస్తువులు – భూములకుగల వారసత్వమునకు సంబంధించిన హిందూమహమ్మదీయ శాసనములు.

ఈవిధముగ కోర్టుల యధికారములు కోర్టులచే పాటింపబడు న్యాయ శాస్త్రములు–శాసనములును కలగాపులగముగనున్నవి. న్యాయములభించుట దుస్తరముగ నుండెడిది. ఒకవంక ప్రభుత్వమువారి లెక్కలు, మరొకవంక నిజామతు దివానీ అదాలటు కోర్టులసూచనలు, వేరొకవంక సంధిమొడంబడికలు, అంతర్జాతీయ శాసనములు, న్యాయమూర్తులు గమనింపవలసి వచ్చెడివి. కంపెనీవారిచే స్థాపింపబడిన కోర్టులవ్యవహార మింతకన్నను అధ్వాన్నముగ నుండెడిది. 1833 వ శాసనముగావింపబడిన పిమ్మటగూడ న్యాయశాఖ సక్రమముగ నిర్వహింప బడలేదనుట నిశ్చయము.

**పోలీసు :-** పోలీసుశాఖ పరివర్తన మీకాలమునందుగూడ నిష్ప్రయోజనముగనేయున్నది. 1837 మొదలు 1854 వరకును కమీషనరుల పెత్తనము పోలీసుశాఖపై తీసివేయ బడినది. సూపరెండెంటు పెత్తనమునం దుంచబడినది. ఈమార్పును ప్రజోపయోగముకాలేదు. 1856 వరకును గ్రామములు సక్రమముగ సంరక్షింపబడ లేదు. 1 జిల్లామేజస్ట్రీటులకు లోబడి చౌకీదారులు నియమింపబడిరి. వీరి జీత బత్తెములకు తిరిగి ప్రజలపై పన్ను విధింపబడినది.

1836 లో బందిపోటు దొంగలకు వారితోజతపడినవారికి ఉరిశిక్షవిధింప బడునట్లు శాసింపబడినది. బందిపోటులనుగురించి సం 1843–1851 రములలో గూడ శాసనములు గావింపబడినవి.

---

1. See Keith. P. 147

భూమిశిస్తు శాశ్వతనిర్ణయము ననుసరించిగూడ కంపెనీ

ఆర్థికము :— ప్రభుత్వమువారి ఆర్థికస్థితి చక్కబడలేదు. జమీందారులు పెస్కులను భరించ నిరాకరించిరి. ఉప్పు—నల్లమందు వర్తకములే ముఖ్యముగ రాబడి మార్గములైనవి. ఈరాబడులపై రివున్యూ బోర్డువారికి అందరిపైన పైపెత్తన మొసంగబడినది.

# 33. మదరాసు రాష్ట్ర పరిపాలనము.

మదరాసు రాజధానియందు పరిపాలనయని చెప్పుకొనదగిన ప్రభుత్వవిధానము చాలకాలమువరకు ప్రారంభింపబడలేదు. డిండిగల్లును బర్మహాలును కారనువాలీసుచేత ఆక్రమణచేసికొనిన నాటనుండియే ఒకవిధమగు పరిపాలనము మదరాసురాష్ట్రమున ప్రారంభింపబడిన దనదగును. అంతవరకును ఉత్తరసర్కారుల పరిపాలన మనాథరాజ్యమువలెనున్నది. అసమర్థులును దుర్మార్గులునునగు కంపెనీయేజెంట్లపరిపాలనమున కంపెనీవారి జాగీరు దుష్పరిపాలన కాలవాలమైనది. 1786 లో రివున్యూబోర్డు స్థాపింపబడినది. 1794 లో హూబర్టుగారు రివున్యూబోర్డునకులోబడి పనిచేయు జిల్లాకలెక్టరులను సర్కారులకు నియమించెను. జాగీరు ప్రత్యేకముగ నొక జిల్లాకలెక్టరు యధీనమునం దుంచబడినది. 1798 లో వంగదేశమున భూమిశిస్తు శాశ్వత నిర్ణయపద్ధతి యాచరింపబడినది. 1802-4 మధ్య ఆపద్ధతియే ఉత్తరసర్కారులలోగూడ నాచరింప నాజ్ఞాపింపబడినది. బర్మహాలు - డిండిగల్లులలో శాశ్వతభూమిశిస్తు నిర్ణయవిధానములు సూచించబడినవి. వంగదేశమునందలి న్యాయశాఖవంటి న్యాయశాఖ స్థాపింపబడినది. ఇచ్చట జిల్లాజడ్జీలు మేజస్ట్రీటులుగ నుండిరి. పోలీసువారిపైకూడ పెత్తనము గలదు. ఈజడ్జీలతీర్పులపై రాష్ట్రీయకోర్టులకు అపీలుచేసికొనుటకు సావకాశముండెడిది. ఈరాష్ట్రీయకోర్టులే సంచారపుకోర్టుల క్రిందగూడ పనిచేయుచుండెడివి. (Circuit Courts) ఈవిధానమే తరువాత కర్ణాటకమున ప్రవేశపెట్టబడినది. కాని 1803—7 మధ్య లార్డు విలియముబెంటిక్కు - మన్రోగారి యభిప్రాయములతో నేకీభవించి రైతువారీ పద్ధతి సమంజసమని తలంచి

యుండెను. కాని రివిన్యూబోర్డువారు గ్రామవారీ సెటిలుమెంటుపద్ధతి ఆచరణ యోగ్యమేమోనని ప్రయత్నించి చూచిరి. కాని విఫలులైరి. అందువల్ల రైతువారీపద్ధతి నామోదించవలసినవారైరి. కలెక్టరునకే పోలీసుశాఖపై నధికారముండవలయుననియు మేజస్ట్రీటు అధికారమునుగూడ గలిగియుండవలయుననియు మన్రోగారి పరిపాలనా విధానములోని ముఖ్యాంశము. పంచాయితీలు సాధ్యమైనంతవరకు తగవులను తీర్చుటకై యధికారమును గలిగియుండవలయుననియునుగూడ మన్రోగారి నిశ్చితాభిప్రాయము. ఆంగ్లేయజడ్జీలు ప్రమాదకరమైన క్రిమినలునేరములను అపీళ్ళను మాత్రమే విచారించుచుండవలెనని మన్రోగారి పద్ధతి. ఆంగ్లేయజడ్జీలను నియమించుటవల్ల అత్యధికవ్యయ మగుటయేకాక న్యాయశాస్త్రక్లిష్టపరిస్థితులవల్ల ప్రజలకు న్యాయములభించుటలేదని మన్రోగారు విశ్వసించిరి. ఈయన పద్ధతియు రాజనీతియు 1818 లో యంగీకరింపబడినవి. రివున్యూకలెక్టరులకు మేజస్ట్రీటు అధికారముగూడ నొసంగబడినది, పోలీసుపై పెత్తనమొసంగబడినది. రు 200 ల విలువగల దావాలను విచారించుటకు మునసబులు నియమింపబడిరి. గ్రామమునసబులకుగూడ చిన్నతగవులను తీర్చుటకధికార మొసంగబడినది. పంచాయితీ లుభయపక్షము లంగీకరించుచో పతీర్పునైనను తీర్చుటకధికార మొసగబడినది. జిల్లాకోర్టుజడ్జీలకుగూడ కొన్ని క్రిమినలు అధికారములొసంగబడినవి. మొత్తముమీద క్రిమినలు అధికారములు నాలుగు రాష్ట్రీయ సంచారపు కోర్టులకొసంగబడినవి. సం. 1807 రము నుండియు సాదరు అడాలటుకోర్టు స్థాపింపబడినది. ఇది సివిలుదావాలను తుదిపరిష్కారమును చేయుటకధికారమును గలిగియుండెను. ఈకోర్టే క్రిమినలు కేసులను విచారించునపుడు సాదరు ఫౌజుదారీ అడాలటుపేరున వ్యవహరింపబడుచుండెడిది. దీనికి ముఖ్యన్యాయాధికారిగ గవర్నరుగారి ప్రభుత్వకౌన్సిలరొకడు వ్యవహరించుచుండెడివాడు. సం. 1827 లో స్వదేశీయులకు సంబంధించినంతవరకు సివిలు క్రిమినలు జడ్జీలను స్వదేశీయులనే నియమించు నాచారము ప్రారంభింపబడినది. కొన్ని ప్రత్యేకజిల్లాలలో ఆంగ్లేయులమీదను అమెరికా వారిమీదను గూడ అధికారమును గలిగియున్న జడ్జీలు నియమింపబడిరి. సంచారపుకోర్టులలో విచారణలకు పెద్దమనుష్యులను రావించు సావకాశమేర్పరుపబడినది.

1843 లో నీరాష్ట్రీయ కోర్టులెత్తివేయబడినవి. జిల్లాకోర్టుల యధికారములు కొన్ని సాదరు అమీనుకోర్టుల కొసంగబడినవి. మరికొన్ని యధికారములుసివిలు సెషన్సు జడ్జీలకొసంగబడినవి.

1818 లో రైతువారీ భూమిశిస్తు నిర్ణయపద్ధతి యంగీకరింపబడిన నాటనుండియు ఆచరణయందుంచబడినది. 1822 లో కలెక్టరు తనయిష్టమువచ్చినట్లు భూమిశిస్తు (అద్దెలు) ను నిర్ణయించుట కధికార మొసంగబడెను, గాని కోర్టుతీర్పుల వల్ల యాపద్ధతి విరమింపబడినది. పోటీపద్ధతి నిర్ణయింపబడసాగెను. లైసెన్సు పన్నులు—పొగాకు గుత్తవ్యాపారము — అంతర్వ్యాపార శుల్కములు—ఉప్పు వ్యాపారము—కల్లుసారాయముల త్రాగుడుమీద వచ్చుపన్ను—దిగుమతి సుంకములును మదరాసుప్రభుత్వాదాయము. 1852 పొగాకు గుత్తవ్యాపారమును 1844 లో అంతర్వ్యాపారశుల్కములును రద్దు చేయబడినవి.

సుప్రీము కోర్టు

వంగదేశమునందువలెనే మదరాసునకుగూడ నొకప్రత్యేకపు సుప్రీముకోర్టుగలదు. 1801 డిశంబరు 26 తేదీని యొసంగబడిన అధికారపత్రము ననుసరించి యీసుప్రీముకోర్టు స్థాపింపబడినది. ఈకోర్టువల్ల రికార్డులకోర్టు లేక మేయరుకోర్టు 1797 లోని శాసనము ననుసరించి స్థాపింపబడినకోర్టు రద్దుకాబడినది. (రద్దుగావింపబడిన కోర్టులో - మేయరు - ముగ్గురు - ఎల్డరుమెను - వ్రాతగుమాస్తా ఉండెడివారు. మదరాసు సుప్రీముకోర్టునకుగూడ కలకత్తా సుప్రీముకోర్టునకుగల యధికారములే యుండెడివి. ఈకోర్టునకు మదరాసుపట్టణముపైనను మదరాసున కనుబంధముగనున్న రాజ్యభాగములపైనను - మదరాసు ప్రభుత్వమున కనుబంధపు ప్రభుత్వములుగనున్న స్వదేశరాజుల రాజ్యములపైనను అధికారముండెడిది. 1781వ సంవత్సర శాసనసిద్ధాంతము లేవిధముగ కలకత్తా సుప్రీముకోర్టునకు వర్తింపజేయబడినవో ఆవిధముగనే మదరాసు సుప్రీముకోర్టు అధికారవ్యాప్తికిగూడ వర్తింపజేయబడినవి.

# 34. బొంబాయి రాష్ట్ర పరిపాలనము.

**పరిపాలనశాఖ:—** బొంబాయి రాజధానియందు త్వరితగతిని రాజ్యవ్యాప్తి జరిగి యుండలేదు. 1782 లో బొంబాయిద్వీపములు సాలభాయి ఒడంబడికవల్ల లభించినవి. దక్షిణకొంకణ తీరమందలి బాన్‌కటు మహారాష్ట్రులనుండి 1775 లో తీసికొనబడినది. 1759 నుండియు సూరతును నవాబుపక్షమున కంపెనీ యుద్యోగి పరిపాలించుచుండెను. 1800 లలో నవాబు చనిపోయినపుడు ఆ రాజ్యపరిపాలన మంతయు నాక్రమణజేసికొనబడినది. సింధియా, గైకువారు రాజ్యములనుంచి చాల రాజ్యభాగము సంపాదింపబడినది. కట్టకడపటి మహారాష్ట్రయుద్ధానంతరము విశేష రాజ్యభాగ మాక్రమించుకొనబడినది. ఈ రాజ్యభాగమంతయు గలిసి బొంబాయి రాజధానియైనది.

**న్యాయశాఖ: —** వంగదేశమందలి న్యాయశాఖవిధానమే యీరాష్ట్రమున గూడ మొట్టమొదటగ ననువదింప నారంభింపబడినది. 1812—13 వ సంవత్సరములలో గుజరాతునకు సాదరు అదాలతుకోర్టు స్థాపింపబడినది. ఈకోర్టునకు లోబడి క్రిమినలుజడ్జీలును, మేజస్ట్రీటులును పనిచేయుచుండెడివారు. సాదరు, అమీనుకోర్టులు పట్టణములలో సివిలు దావాలను విచారించుచుండెడివి. ఈకోర్టుల దావాలపై అప్పీళ్ళను, సంచారపు కోర్టుక్రిందగూడ పనిజేయుచుండెడి అదాలతుకోర్టే విచారించుచుండెడిది. 1818 లో రివిన్యూ కలెక్టరులకు మేజస్ట్రీటు అధికారములొసగబడినవి. పోలీసు శాఖపైగూడ పెత్తన మొసగబడినది. 1827 లో సాదరు దివానీ అదాలతు కోర్టునకు నలుగురు జడ్జీలుండెడివారు. సాదరు, ఫౌజుదారీ అదాలతు కోర్టునకు గవర్నరుగారి కౌన్సిలుసభ్యుడొకడును, మఱిముగ్గురు జడ్జీలునునుండెడివారు. ఈ రెండుకోర్టులును బొంబాయికిమార్చబడినవి. జిల్లాలయందు క్రిమినలు, సివిలు అధికారములు రెండును గలిగియున్న జడ్జీలు పనిచేయుచుండెడివారు. 1830 వరకు గుజరాతులో వీరు సంచారపుకోర్టునకు లోబడియుండెడివారు. 1830

నుండియు స్వదేశీజడ్జీలుకూడ నియమింపబడుచుండెడివారు. సివిలుదావాలు చాలవరకు వీరిచే విచారింపబడుచుండెడివి. కలెక్టరుల, మేజస్ట్రేటుల అధికార మభివృద్ధి చేయబడినది. భూములకు సంబంధించిన సివిలు దావాలనుగూడ విచారించి హక్కు, బేహక్కులను నిర్ణయించుటకుగూడ కలెక్టరుల కధికార మొసగబడినది. వీరి తీర్పులపై జిల్లాకోర్టులకు అప్పీలుచేసికొనుట కవకాశముండెడిది. సక్రమన్యాయ పరిపాలనము లభింపజేయుటకై గుజరాతు, దక్కనులకు కమీషనరులు నియమింపబడిరి. వీరీప్రదేశములను తరుచు సంచారముచేయుచుండెడివారు. మదరాసులో నుండినట్టి రికార్డరులకోర్టువంటి కోర్టు, 1797 లో బొంబాయియందుగూడ స్థాపింపబడినది. 1823 వ సంవత్సరపు శాసనము ననుసరించి యీకోర్టు సుప్రీముకోర్టుగా మార్చివేయబడినది. కలకత్తా సుప్రీము కోర్టునకుగలయట్టి అధికారపరివ్యాప్తమే బొంబాయి సుప్రీముకోర్టునకుగూడ నుండెడిది. బొంబాయియందలి, బొంబాయి కనుబంధముగనున్న రాజ్యభాగములలోను, స్వదేశసంస్థానములలోనున్న ఆంగ్లేయ పౌరులందరిపైన నీకోర్టున కధికారముండెడిది. పెద్దమనుష్యులను (జ్యూరీలను) క్రిమినలు కేసు విచారణలకు రావించుటకు సుప్రీముకోర్టునకే యధికార మొసగబడినది.

1799 వ సంవత్సరములో రు 175 ల వరకు విలువగల దావాలను విచారించుటకై ఒకకోర్టు స్థాపింపబడినది. (Small Causes). 1812–30 సంవత్సరములమధ్య సీనియరు, రెండవక్లాసు, మూడవక్లాసు మేజస్ట్రేటు కోర్టు లేర్పరుపబడినవి. 1812 నుంచియు (Petty Sessions) చిన్నక్రిమినలు కేసులు విచారింప బడుచుండెడివి.

కలకత్తా, మదరాసులలోవలెనే బొంబాయియందుగూడ నీకోర్టులు నిర్ణీతమగు న్యాయశాస్త్రము లేక న్యాయవిచారణయందు అధ్వాన్నమగు స్థితియందుండెడివి. 1827 వ సంవత్సరములో మహమ్మదీయ క్రిమినలు 'లా' తీసివేయబడి నూతన శాసన నియమము లేర్పరుపబడినవి. అంతకుపూర్వపు 28 సంవత్సరముల శాసననిబంధన లన్నియుగలిపి 1827 లో క్రోడీకరింపబడినవి. 1867 నుండియు రికార్డరులకోర్టు, లేక, పిమ్మట సుప్రీముకోర్టులలో రిజష్టరుచేయ

బడిన నిబంధనలన్నియు నీకోర్టునకు వర్తించినవి. ఈకోర్టు స్వదేశస్థులపైన గూడ లేనిపోని అధికారమును చెలాయింపసాగినది.

సింధురాష్ట్ర మాక్రమించుకొనబడిన నాటనుండియు నొక కమీషనరుచే పరిపాలింపబడు చుండెడిది. ఈయనక్రింద పనిజేయు కలెక్టరులకు మేజస్ట్రీటు అధికారములుంటయేకాక, సివిలు, క్రిమినలుకోర్టులలో న్యాయనిర్ణయమున న్యాయమూర్తులుగగూడ నుండెడివారు.

రివిన్యూశాఖ— రైతువారీ పద్ధతిని భూమిశిస్తు నిర్ణయమొనరింపబడినది. ప్రభుత్వము గ్రామకరణములను నియమించినది. వీరే రైతువారీ భూమివిస్తీర్ణపులెక్కలను తయారుచేయు చుండెడివారు. వీరిలెక్కలననుసరించి పన్నులువసూలు చేయబడుచుండెడివి. దిగుమతి సుంకములు, త్రాగుడుపన్ను, ఉప్పుపన్ను, వారసత్వపుటాస్తిపై విధింపబడిన జరిమానాలు, పచ్చగడ్డి మేతరుసుము, అడవులలో కలపగొట్టుకొనినందులకు రుసుము, భూమిశిస్తును గలిసి బొంబాయి ప్రభుత్వమునకు రాబడిగ నుండెడిది.

## 35. పశ్చిమోత్తర పరగణాలు; యితర రాష్ట్రములు.

పరిపాలనాశాఖ. 1775 లో అయోధ్యరాజ్యమునుండి తీసికొనబడిన కాశీ చుట్టుపట్ల రాజ్యములతో పశ్చిమోత్తర పరగణాలు 1836 లో జేర్పబడినవి. ప్రస్తుతపు సంయుక్తరాష్ట్రము నందుగల భూభాగమంతయు, అయోధ్యతప్ప, నాటిపశ్చిమోత్తర పరగణా రాష్ట్రము. ఇందు 1801 లో అయోధ్యరాజ్యమునుండి విడదీయబడినట్టియు, 1803 లో సింధియాను జయించి తీసికొనబడినట్టియు, అప్పుడు పీష్వానుండి తీసికొనబడిన బదలుకొండు నందలి కొంతరాజ్యభాగమును, 1816 లో నేపాళరాజ్యమునుండి వేరుచేయబడిన ఉత్తర పర్వతప్రాంతపుజిల్లాలును, 1818 లో నాగపుర

మునుండి లాగికొనిన సాగరు, నర్మదారాజ్యభాగములును నుండెడివి. 1861 లో మధ్యరాష్ట్రములు సృష్టింపబడునవరకు మాత్రమే సాగరు, నర్మదారాజ్యభాగములు పశ్చిమోత్తర పరగణాలయం దుండెడివి.

1809 లో సట్లజు సంస్థానములు ఆంగ్లేయ సంరక్షణము నంగీకరించినవి. ఇందు ఆరుసంస్థానములు తప్ప మిగిలినవి కంపెనీవారి పరమైనవి. 1846 లో సిక్కు యుద్ధానంతరము జలంధరుదూబా వశపరచుకొనబడినది. 1849 లో పంజాబు వశపరచుకొనబడినది. 1853 లో నాగపురమును, ఝాన్సీరాజ్యమును కంపెనీకి సంక్రమింపజేసికొనబడినవి. ఆ సంవత్సరమే బీరారును నైజాముప్రభు విచ్చియున్నాడు. 1856 లో అయోధ్యరాజ్యము కలిపివేసికొనబడినది. ఈ రాజ్యభాగము లిన్నింటియందునను పరిపాలన మొకరీతిగనే లేదు.

సట్లజు సంస్థానములును, దూబాయును మొదట కమీషనరుల పరిపాలనమునందుండెడివి. 1849 లో పంజాబులో చేర్చబడినవి. మధ్యపరగణాలు సృష్టింపబడినపుడు నాగపురమందు చేర్చబడినది. ఝాన్సీ పశ్చిమోత్తర పరగణాలలో గలుపబడినది. బీరారునకు ప్రత్యేకముగ నొక కమీషనరు వేయబడినాడు. 1903 లో మధ్యరాష్ట్రములలో కలుపబడినది. 1877 వరకును అయోధ్య కమీషనరు పరిపాలనయం దుండెడిది. అటుపిమ్మట పశ్చిమోత్తర పరగణాల లెఫ్టినెంటు గవర్నరు అధికారమునకు లోనుచేయబడినది. ఇదియంతయును గలిసి నేడు ఆగ్రా—అయోధ్యల సంయుక్తరాష్ట్రములక్రింద పరిగణింపబడుచున్నది. 1858 వ సంవత్సరములో ఢిల్లీ రాజ్యభాగము పశ్చిమోత్తర పరగణాలనుండి విడదీయబడి పంజాబునకు చేర్చబడినది.

మొట్టమొదటుగ నాక్రమించుకొనబడుచువచ్చిన రాజ్యభాగములన్నియు వంగదేశ ప్రభుత్వమున కనుబంధముగ నొనరింపబడినవి. వంగదేశప్రభుత్వ నిబంధనలే యీరాజ్యభాగములకుగూడ స్వల్పభేదములతో వర్తింపజేయబడినవి. కాని, నేపాలునుండి తీసికొనబడిన రాజ్యభాగములును, ఢిల్లీరాజ్యమును వంగదేశ ప్రభుత్వానుబంధముగ నొనరింపబడలేదు. తదుపరి, ఆక్రమించు

కొనబడిన రాజ్యభాగములకుకూడ వంగదేశప్రభుత్వ శాసన నిబంధనలు వర్తింప జేయబడలేదు. ఈరాజ్యభాగముల పరిపాలనకు గవర్నరుజనరలుగారు తమ కవసరమని తోచినరీతిని నిబంధనలను గావించుచుండెడివారు. ఆయన యిష్టము వచ్చిన ఉద్యోగస్థులను నియమించుచుండెడివాడు. వీరికి వంగప్రభుత్వ నిబంధనలు వర్తింపవు. ఈవిధముగనే స్థానికాధికారులుగూడ వారికిగల కార్యనిర్వహణాధికారమును పురస్కరించుకొని వారికితోచిన నిబంధనలను గావించుచుండెడి వారు. ఈపద్ధతికి 1861–70 సంవత్సరములలోనే ఒకనిర్ణీత విధానమేర్పరుపబడినది.

న్యాయశాఖ.

(రిగ్యులేషనుజిల్లాలు) నిబంధనలుగల జిల్లాలకును, తీసికొనబడిన, జయింపబడిన జిల్లాలకును, బకలకండు రాజ్యభాగమునకును కారనువాలీసు గావించిన పరిపాలనా నిబంధనలును, న్యాయశాఖా నిబంధనలును పూర్తిగ వర్తింపజేయబడినవి. కలెక్టరులు శిస్తు (రివిన్యూ) వసూళ్ళకుమాత్రమే నియోగింపబడిరి. జడ్జీలును, మేజస్ట్రీటులును క్రిమినలు, సివిలువ్యవహారములను పరిష్కరించుచుండెడివారు. రాష్ట్రీయ కోర్టు లీతీర్పులపై పునర్విమర్శనాధికారమును గలిగియుండెడివి. ఈరాష్ట్రీయపు కోర్టులపై కలకత్తాయందున్న సాదరు, దివానీ, సాదరునిజామతు కోర్టుల కధికారముండెడిది. 1829 లో డివిజనులు కమీషనరులు నియమింపబడిరి. రాష్ట్రీయ కోర్టుల క్రిమినలు విచారణాధికారము వీరి కొసగబడినది. 1831 లో ప్రత్యేకముగ ఆగ్రాలో సాదరు, అదాలతుకోర్టులు స్థాపింపబడినవి. 1833 లో నీకోర్టులు రాష్ట్రీయకోర్టుల సివిలు అధికారమును తీసికొనినవి. రాష్ట్రీయకోర్టు లెత్తివేయబడినవి. కమీషనరుల క్రిమినలుఅధికారములు జిల్లాజడ్జీల కొసగబడినవి. జిల్లాజడ్జీలే సివిలు, క్రిమినలు అధికారమునుగలిగియుండిరి. పిమ్మట, జడ్జీలయొక్క, మేజస్ట్రీటు అధికారములు కలెక్టరులకొసగబడినవి. కలెక్టరులు మేజస్ట్రీటులుగూడనైరి. ఇచ్చట వంగదేశములోవలె తిరిగి 1837–1589 ల మధ్య న్యాయశాఖ, కార్యనిర్వాహకశాఖ వేరుచేయబడి కలెక్టరుల అధికారములు తీసివేయబడలేదు. 1831 లో సబార్డినేటుజడ్జీల సివిలుదావాల విచారణాధికారము హెచ్చింపబడినది. మొట్టమొదటగ అన్నిరకముల సివిలుదావాలు సబుకోర్టులలోనే విచారింపబడునట్లొనరింపబడినది. సబుజడ్జీలు చాలవరకు భారతీయులుగనుండెడివారు. 1843 లో

డిప్యూటీ మేజస్ట్రీటులు నియమింపబడుటకు సావకాశము గల్పింపబడినది. భారతీయులకు, ఆంగ్లేయులకునుకూడా నీయుద్యోగము లొసగబడెడివి. వీరికి సివిలుసర్వీసులోనివారి హోదాలేదు. (Not in the Covenented service) ఇతరరాష్ట్రములలో మహమ్మదీయ క్రిమినలు 'లా' వర్తింపజేయబడెడిది. ఈ మహమ్మదీయ 'లా' కొంతవరకు నిబంధనల ననుసరించియు, తీర్పులననుసరించియు, సంస్కరింపబడెను. సివిలుదావాలలో హిందూమహమ్మదీయ ధర్మశాస్త్రములు రెండును వర్తింపజేయబడెడివి. భూమిదావాలలో నాటివరకుగల ఆచారము పాటింపబడెడిది.

రివిన్యూశాఖ.

వంగదేశపద్ధతియే రివిన్యూపరిపాలనమునందాచరింపబడినది. కాని, 1811 లో భూమిశిస్తు శాశ్వత నిర్ణయమును గురించి డైరక్టరులు అసమ్మతిని ప్రకటించిరి. 1822 నుండియు, నూతనపద్ధతి ప్రారంభింపబడినది. గ్రామసమోహిని భూమిశిస్తు నిర్ణయింపబడసాగినది. 1832 నుంచియు 12 సంవత్సరములు భుక్తమున్నచో శాశ్వతహక్కును వంశపారంపరహక్కును లభించునట్లుగ నిర్ణయింపబడినది. భూమిశిస్తు న్యాయస్థానమున నిర్ణయింపబడసాగినది. 1859 లో యీనిబంధనలతో గూడబడిన శాసనము గావింపబడినది. ఈశాసనము వంగరాష్ట్రమునకు గూడ వర్తింపజేయబడినది. త్రాగుడుపన్ను, నల్లమందు, గుత్తవ్యాపారము ముఖ్యమయిన ప్రభుత్వరాబడు లయినవి.

36
నిబంధనలు లేని రాష్ట్రములు;
పరిపాలనాశాఖ:–
Non-Regulated provinces;

నిబంధనలు లేని రాష్ట్రములలో జిల్లాకలెక్టరులు, లేక, డిప్యూటీ కమీషనరులు అనుపేరుతో వ్యవహరింపబడినవారికే సర్వాధికార మొసగబడినది. కార్యనిర్వాహణాధికారము, మేజస్ట్రీటు అధికారము, న్యాయపరిపాలనాధికారములుగూడ నొసగబడినవి. కమీషనరులకు వీరిపై పెత్తన మొసగబడినది. వీరి తీర్పులపై పునర్విమర్శనాధికార మొసగబడినది. అందువల్ల యీప్రాంతముల పరిపాలన మీయుద్యోగస్థుల వ్యక్తిగత యోగ్యతాయోగ్యతల ననుసరించి యుండెడిది.

ఈపద్ధతి సాగరు, నర్మదా రాజ్యములలో దుర్నయములకు మూలమైనది. పంజాబంతయు వశపరచుకొనినపిమ్మట నీపద్ధతి అచ్చట కొంతవరకు సక్రమముగ పనిజేసియున్నదని ఆంగ్లేయ చరిత్రకారులమతము. 1 ఈనిబంధనలులేని రాజ్య భాగమంతయు 8 డివిజనులు, కమీషనరులచేతను, 24 జిల్లాల డిప్యూటీకమీష నరులచేతను, వీరిక్రిందపనిజేయు తాలూకా తహశ్శీలుదారులచేతను పరిపాలింప బడెడిది. వీరిపైన గవర్నరుజనరలుగారి సర్వాధికారమునకు లోబడిన ముగ్గు రితోగూడిన నొకబోర్డు పరిపాలనాధికారమును వహించియుండెడిది.

రివిన్యూపరిపాలనము.

వంగదేశమువలె గాక యిచ్చట భూమిశిస్తు తాత్కాలిక ముగ నిర్ణయింపబడినది. గ్రామసమోహినే నిర్ణయింప బడినది. కొంత రైతువారీనిర్ణయముగూడ గావింపబడి నది. ప్రభువులున్నచోట భూమిశిస్తు నిర్ణయింపబడినది. వంగదేశమునందు వలె భూమిపై సర్వాధికారము లొసగబడియుండలేదు. పశ్చిమోత్తర పరగ ణాలలోవలె 12 సంవత్సరముల భుక్తపుహక్కును గమనించుసూత్రము వర్తింప జేయబడినది. సెటిల్‌మెంటు ఉద్యోగులకు హక్కు, బేహక్కుల నిర్ణయించు టకు వలయు సివిలు అధికారముగూడ నొసగబడినది.

ఈరాష్ట్రమందలి ప్రజలందరు నిరాయుధులుగ నొనరింపబడిరి. డిప్యూటీ కమీషనరులక్రింద పనిజేయుచుండిన 7000 మంది పోలీసు సిబ్బందియునుగాక, మరి 8000 మంది సైనికులగు పోలీసుదళముగూడ నీరాష్ట్రమునందుంచబడినది. బెంగాలునందలి క్రిమినలు శాసనములే యిచ్చటగూడ వర్తింపజేయబడినవి. 1855 లో సివిలుకోడు ప్రకటింపబడినది. ఇందు, ఆచారములు, మామూళ్ళు నిర్వచింపబడినవి. ప్రత్యేక నియమములు వర్తింపని దావాలలో వంగదేశ నిబంధనలుగూడ వర్తింప జేయబడినవి.

1853 లో పరిపాలక సంఘమెత్తివేయబడినది. (Board). జోనులారెన్సు గారు ప్రధాన కమీషనరుగ నియమింపబడినారు. ఈయనకు సహాయకారులుగ

1. See. Keith P. 153.

ఆర్థిక కమీషనరు, న్యాయశాఖ కమీషనరులు నియమింపబడిరి. న్యాయ శాఖ కమీషనరులే పోలీసు, విద్య, స్థానిక సంస్థలపై యధికారమును వహించెడివారు.

అయోధ్య :— అయోధ్యరాజ్యము వశపరచుకొనినవెంటనే నిబంధనలు వర్తింపని రాష్ట్రముగ పరిగణింపబడి ఒకప్రధాన కమీషనరు నియమింపబడినాడు. భూమిశిస్తు మొదలు తుద లేని యిష్టమువచ్చిన పద్ధతిని నిర్ణయించివేయుబడినది. డల్హౌసీగారంతవరకును, భూమిశిస్తు వసూలుచేయుచున్న తాలూకాదార్లపరంగా భూమిశిస్తు నిర్ణయించి యుండలేదు.

నాగపురము. 1818 మొదలు 1830 వరకును నాగపురపు యువరాజు మైనరైనందున, రెసిడెంటే పరిపాలనమును కొనసాగించి యుండెను. ఈయన 1853 లో చనిపోవువరకును రెసిడెంటుగారి పరిపాలనాపద్ధతినే కొనసాగించియుండెను.

37 ప్రీవీకౌన్సిలు. హిందూదేశమందలి న్యాయశాఖా పరివర్తనముపై ఇంగ్లండునందలి ప్రీవీకౌన్సిలు పెత్తనము చెలాయించి యుండలేదు.

1726—1753 సంవత్సరముల అధికారపత్రముల ననుసరించి 1000 పెగోడాలకు పైబడిన దావాలలో ప్రీవీకౌన్సిలునకు అపీలుచేసికొను సావకాశ మొసగబడినది. 1773 లో కలకత్తాయందును సుప్రీముకోర్టు స్థాపించినపు డీసిద్ధాంతమే యనుసరింపబడినది. 1797 లో మదరాసునందు బొంబాయియందు రికార్డుల కోర్టు స్థాపింపబడినపుడుగూడ నీసిద్ధాంతమంగీకరింపబడి 1801—1823 లలో సుప్రీముకోర్టులు స్థాపింపబడి వాటికిగూడ వర్తింపజేయబడెను. బొంబాయి సుప్రీముకోర్టునుండి రు 3000 లకు పైబడిన దావాలలో ప్రీవీకౌన్సిలునకు అప్పీలు సావకాశ మొసగబడినది. ఏదావాలోనైనను సీమప్రభుత్వము అప్పీలుసావకాశ మును ప్రసాదించుచుండుట కధికారమును గలిగియుండెను. కంపెనీవారిచే

స్థాపింపబడిన కోర్టులనుండి, అనగా, గవర్నరును—కౌన్సిలును విచారించిన దావాలపై రూ 5000 లకు మించిన విలువగలదావాఅయినచో ప్రీవీకౌన్సిలునకు అప్పీలు చేసికొనవచ్చునని 1781 లో గావింపబడిన శాసనమునందు గలదు. అప్పీలు ఆరుమాసముల లోపుగ జేసికొనవలయును. అప్పీలుఖర్చులకు ముందుగనే హామీ యొసగుట విధి. గవర్నరును—కౌన్సిలును నొసంగినతీర్పులపై మదరాసు బొంబాయి రాష్ట్రములనుండిగూడ 1818 నుండియు ప్రీవీకౌన్సిలునకు అప్పీలు చేసికొనుటకు నావకాశ మొసగబడినది. కాని, దావావిలువమాత్రము నిర్దేశింపబడియుండలేదు. అయినను విశేషముగ అప్పీళ్ళు చేయబడియుండలేదు.

1833 లో న్యాయసంఘమొకటి సీమలో నేర్పరుపబడినది. (Judicial Committee). ఈకమిటీ విదేశమునుండి వచ్చు అప్పీళ్ళను విను నధికారమును గలిగియున్నది. 1833 వ శాసనమునందే నియమావళి నిరూపింపబడినది. 1838 లో రూ 10,000 ల విలువగల దావాలు విచారింపబడునట్లుగ మార్చబడినది. 1833 నుండియు సాదరు అదాలతుపై అప్పీళ్ళను కంపెనీయే తన ఏజంట్లు ద్వారా నిర్వహించుచుండెడిది. 1845 నుండియు నీయాచారము విరమింపబడినది. అప్పీళ్ళను చేసికొనదలంచినవారే స్వయముగ ఇంగ్లండునందలి తమ ఏజంట్లతో వ్యవహరించు కొనునట్లును, అప్పీలురికార్డులను కంపెనీప్రభుత్వమే ఇంగ్లండునకు పంపునట్లును నేర్పరుపబడినది. రెండుసంవత్సరముల లోపుగ నిట్టి దావాలపై వ్యవహారము జరుగుట కవకాశ మొసగబడినది.

## 19 కంపెనీయొక్క సైనికదళములు: 1668-1856

1 సైన్యము.

17 వ శతాబ్దముయొక్క అంత్యభాగమున కంపెనీవారి నౌకాస్థానములయందు ఓడరేవులందు మాత్రమే కొలదిగ కంపెనీవారి సైన్య ముంచబడెడిది. 1668 లో బొంబాయియందుండెడి సైనికదళమును కంపెనీ తీసికొనినది. ఇదియే బొంబాయి ఆంగ్లేయ సైనికదళమునకు మూలమైనది. మదరాసుగూడ ఆంగ్లేయసైన్యమును కొలదిగ గలిగియున్నది. 1748 లో మొట్టమొదటి మదరాసుసైనిక

దళముక్రింద (తుపాకిపట్టెడిసిపాయిలు) నేర్పడినది. ఫ్రాన్సువారు 1721 నుండి సిపాయిలను మాహీలో పశ్చిమసముద్రతీరమున, 1774 నుండి తూర్పుతీరమునను సైనికదళముక్రింద నేర్పరచిరి. 1748 లో కంపెనీవారి సైనికదళములనన్నింటిని నడుపుటకు, మేజరుపదవితో, సీమప్రభుత్వాధికారముతో హిందూదేశమునకు లారెన్సుగారువచ్చిరి. 1754 లో పిట్టుగారు సీమప్రభుత్వమువారి ఫిరంగులదండుతో హిందూదేశమునకువచ్చిరి. ప్లాసీయుద్ధానంతరము కంపెనీవారి మూడురాజధానుల సైన్యమును పునర్నిర్మాణ మొనరింపబడినది. మూడు రాజధానులలోను ఆంగ్లేయసైనికదళములును, సిపాయీలదళములును (సిపాయీ లనగా హిందూదేశ సైనికులు) ఏర్పరుపబడినవి. ఈ సైనికదళములయందుగల చిన్నయుద్యోగములు హిందూదేశస్థులకే యొసగబడినవి. కంపెనీవారి సైనికదళములను నడుపు అధికారులు సీమసైన్యమునుండి తీసికొనిరాబడెడువారు. 1796 లో కంపెనీవారి సైనికదళములు, మరల, పునర్నిర్మాణము గావింపబడినవి. ఈ పునర్నిర్మాణ ఫలితముగ చిన్నయుద్యోగములుకూడ భారతీయుల కొసగబడలేదు. 1824 లో మూడవసారి సైనికదళములు పునర్నిర్మాణము గావింపబడుటలో భారతీయ సైనికదళము విభజింపబడినది. వంగమునకు 68 పటాలములును, (1000 మంది సైనికులు ఒక పటాలము) మదరాసునకు 58 పటాలములును, బొంబాయికి 24 పటాలములును, విభజింపబడినవి. పిరంగులదండు తురగబలముగా (Cavalary) మార్చబడినది. మదరాసులో 8 తురగబలములును, బొంబాయిలో మూడు తురగబలముల దండులును నుంచబడినవి. అయోధ్యవాసులే చాలవరకు వంగదేశసైనికదళములు. మదరాసు సైనికదళములలో మహామ్మదీయులు, ఆంధ్రులు, తమిళులును, హెచ్చుమంది సిపాయిలుగ నుండెడివారు. వంగదేశ సైన్యమున బ్రాహ్మణులును, రసపుత్రులునుగూడ సిపాయీలుగ నుండెడివారు. వీరికి కులాచార ఛాందసము హెచ్చుగ నుండెడిదని ఆంగ్లేయ చరిత్రకారులవ్రాత. 1

కంపెనీవారిపట్ల ఆంగ్లేయ సైనికదళములు వినయవిధేయలతో నుండుట

1. See keith P. 156.

అరుదు. 1674-1679 లలో బొంబాయియందు ఆంగ్లేయసైనికులు తిరుగుబాటును గావించిరి. 1683 లో కెయిగువినుగారు తిరుగుబాటుదారులైరి. 1764 లో వంగదేశమునందలి ఆంగ్లేయ సైనికదళము తిరుగబడినది. దీని వెనువెంటనే సిపాయీలుగూడ తిరుగబడిరనియు, మన్రోగారీతిరుగుబాటు నణచివేసిరనియు ఆంగ్లేయచరిత్రకారు లనువారి కొందరిమతము. 1765 లో క్లైవుగారు ఆంగ్లేయ సైనికదళోద్యోగుల తిరుగుబాటు నణచివేసెను. 1806 లో వెల్లూరునందలి సిపాయిలు తిరుగబడిరి. ఇందులకు హిందూమతముపై క్రైస్తవమతవ్యాప్తి సంకల్పులెత్తిన దాడియేకారణము. 1824 లో బర్మాయుద్ధ కారణమున సూరతు పురమున సిపాయీలు తిరుగుబాటు చేసిరని ఆంగ్లేయచరిత్రకారుల మతము. సిపాయీలు తిరుగుబాటుజేసిరను నెపమున సిపాయీలు ఘోరముగ కాల్చిచంప బడిరని చరిత్ర పరిశోధనలు తెల్పుచున్నవి. 1809 లో ఆంగ్లేయోద్యోగు లందరు మదరాసులో తిరుగుబాటొనరించిరి. ఇదియు నణచివేయబడినది.

ఈవిధముగ సిపాయీలును, ఆంగ్లేయసైనికులును గావించు తిరుగుబాటు నణచివేయుటకై వివిధములగు శాసనములు గావింపబడుచువచ్చినవి. అధికార పత్రములయందు అధికారములు గల్పింపబడుచు వచ్చినవి. సైనికశాసనములు వర్తింపజేయబడి, సైనికకోర్టులు వ్యవహరించినవి. కౌన్సిలుయుతుడగు గవ ర్నరుజనరలుగారే సైనికదళాధ్యక్షులను నియమించుచుండెడివారు కాని, యీ అధ్యక్షులకు ఆంగ్లేయసైనికదళములను నడుపుటకధికారము గలిగియుండెడి వారుకాదు. 1788–9 లో యీపరిస్థితులు తొలగింపబడినవి. సర్వసైన్యాధి పతి సీమప్రభుత్వపుటాజ్ఞల ననుసరించి కంపెనీవారి సైనికాధ్యక్షులకు ఆపదవు లను ఖాయపరచెను.

నూతన రాజ్యములను స్వాధీనముచేసికొనినప్పుడెల్ల వాటిసంరక్షణకై పటాలములను హెచ్చించుచువచ్చిరి. పదాలతులదళము, ఫిరంగులదండు, తురగబలములను ఆంగ్లేయోద్యోగుల ఆధిపత్యమున హైదరాబాదునవాబుగారు కంపెనీ పక్షమున పోషించునట్లొనర్పింపబడిరి. 1816 సకు పిమ్మట ఘూర్కా దండు సమకూర్చబడినది. (Irregular Forces) 1838 లో ఆఫ్ఘను స్థాన

ములో ఘూర్కాదండు పనిజేసియున్నది. 1846 నుండియు పంజాబులో సమకూర్చబడిన క్రమగతము కాని వివిధరకముల సైనికదళములు సమకూర్చబడినవి. ఇది గమనార్హమగు విషయము.

ఈసైనికదళముల యుద్ధ నీతిపై గవర్నరుజనరలుగారే పెత్తనమును చెలాయించుచుండెడివారు. వెల్సలీగారి యుద్ధ నీతివల్లనే మహారాష్ట్రులును, టిప్పును అణగద్రొక్కబడిరి.1 హేస్టింగ్సుగారి నీతివల్ల మహారాష్ట్రులు స్వాతంత్ర్యమును గోల్పోయి లొంగిపోయిరి. ఆఫ్గనుయుద్ధనీతిలో అకలండుగారుకూడ భాగస్వాములే. ఎలింబరోగారుకూడ సర్వసైన్యాధిపతితో గ్వాలియరుతో సంరంభమున పాల్గొనియుండిరి. హార్డింజిగారు సైన్యాధిపతిక్రింద సిక్కుయుద్ధమున పనిజేసియే యుండిరి.2 డల్హౌసీగారు సర్వసైన్యాధిపతులపై రాజకీయాధికారమును కృతనిశ్చయుడై చెలాయించుచుండెడివాడు. ఇందువల్లనే నాపియరు రాజీనామాకూడ యొసగియుండెను. ఈసైన్యాధిపతిని బర్తరఫుచేయుటకుకూడ తనకధికారమున్నదని డల్హౌసీగారి నిశ్చయము.3 ఈవిధముగ వర్తించుటకై తన కౌన్సిలుయొక్క మద్దతునుగూడ గవర్నరుజనరలుగారు కలిగియుండుట యవసరము. అకలుకండును కౌన్సిలు మద్దతుచేయుచుండెడిది. కాని, ఎలింబరో సైనికతత్త్వమున మునుగుచున్నాడనియు, సివిలు అధికారులసలహాలను త్రోసివేయుచున్నాడనియు, అతని కౌన్సిలు తలంచుచుండెడిది.

2
నౌకాదళము.

1613 వ సంవత్సరమునుండియు కంపెనీవారికి నౌకాదళమున్నదని జెప్పవచ్చును. ఆనాడు సూరతునందు పోర్చుగీసువారి ముట్టడినుండి తమవర్తకపు ఓడలను సంరక్షించుకొనుటకై నౌకాదళ సహాయమున ప్రయత్నించినది. బొంబాయి కంపెనీకి లభించిన నాటనుండియు నౌకానిర్మాణము బొంబాయియందే కొంచెము ప్రారంభింపబడినది. అరేబియా సముద్రతీరమందలి తమవర్తకమును కాపాడుకొను

1. See. Roberts India under Wellesley PP. 54, 212.
2. See. India under Lord Ellenborough PP. 121 and Viscount Hardinge PP. 104, 105.
3. See. Kurgon, British Govt. in India ii. 207

34

టకై నౌకానిర్మాణము ప్రారంభింపబడినది. 1686 లో కంపెనీవారి నౌకాదళ మునకు బొంబాయి ప్రధానస్థాన మొనరింపబడినది. బొంబాయిఓడలపై నౌకా అధికారి నియమింపబడెడివాడు. ఓడలను నడపువారందరు సీమనుండి తీసికొని రాబడెడివారు. బ్రిటిషుప్రభుత్వ నావికాదళముగూడ కంపెనీవారికి 1772 లో విఫలమైన ఆలీబాగు కోటముట్టడిలో తోడ్పడియుండెను. నాలుగునౌకలు కమదోరుమాయానా ఆధిపత్యమునతోడ్పడినవి. పోర్చుగీసు, మహారాష్ట్రులు, జంజిరాసిడీలతోగలిగిన యుద్ధముల ననుసరించి నౌకాదళము వృద్ధిజేయ ప్రారంభింపబడినది. 1735 లో బొంబాయి ప్రభుత్వము, బొంబాయిలోని నౌకానిర్మాణశాలను నవజీ, వసరరంజీ, వాడియాగారి యాధిపత్యమున నిర్మింప నిర్ణయించుకొనినది. ఈకుటుంబమే 1754 మొదలు 1810 వరకును నిర్మింపబడిన నౌకానిర్మాణశాలతో 1885 వరకును సంబంధముగలిగి యున్నది. 1756 లో చంద్రనాగూరును పట్టుకొనుటలో నౌకాదళముకూడ సహాయపడి యున్నది. మహారాష్ట్రయుద్ధములలోగూడ నౌకాదళ సహాయము విశేషముగ నుపయోగింపబడినది. ఈయుద్ధములు ముగిసిన పిమ్మట 1798 లో నౌకాదళవిధులు నిర్ణయింపబడినవి. వర్తకసంరక్షణము, దగావర్తకులను నిరోధించుట, యుద్ధములలో పాల్గొనుట, ఎగుమతిదిగుమతులను గావించుట సైనికులరాకపోకలకు తోడ్పడుట మొదలగుపనులు నౌకాదళవిధులుగ నిర్వచింపబడినవి. ఈనౌకాదళముపై పెత్తనము వహించుటకై నౌకాసంఘ మేర్పరుపబడినది. (Marine Board). 1827 లో నౌకాదళమందలి యుద్యోగులకు సీమప్రభుత్వ నౌకాదళ మందలి యుద్యోగులహోదా యొసగబడినది. సీమప్రభుత్వనౌకాదళమువారి యాజ్ఞానుసారము యూనియన్ జాక్ జెండా యీనౌకాదళముపై నెగురవేయుట కధికార మొసగబడినది. ఈశాఖ సూపరింటెండెంటు సీమప్రభుత్వ నౌకాదళ శాఖలోని యుద్యోగియై యుండవలయునని విధింపబడినది.

1823 లో యీనౌకాదళమునకు హిందూదేశ తిరుగుబాటుదారుల శాసనము వర్తింపజేయబడినది. 1830 లో "హిందూదేశ నౌకాబలము" అను పేరు గుర్తింపబడినది. 1848 లో నౌకాదళ సూపరింటెండెంటునకు సర్వనౌకాదళాధిపతి (Commander-in-Chief) యను హోదా యొసగబడినది. నౌకా

ధ్వజము మార్చివేయబడినది. పసుపుపచ్చ అడ్డగీతలతోగూడిన రక్తధ్వజమెత్తబడి, అందు కంపెనీవారిగుర్తు వేయబడి, పసుపుపచ్చరంగులో సింహములును, కిరీటమునుగల సీమప్రభుత్వపుగుర్తుగూడ వేయబడినది. హిందూదేశమును స్వాధీనపరచుకొనుటలో మాత్రమేకాక, యీనౌకాదళము విదేశములను వశపరచుకొనుటయందుకూడ కృషిసల్పియున్నది. కంపెనీవారికి 1839 లో ఏడెనును, 1846 లో న్యూజిలండును, 1852 లో బర్మా, బోర్నియోలను పట్టుకొనుటయందీ నౌకాదళమత్యంతోపయోగమైనది. 1856 లో హోడేడీయాలో తురుష్కులకుగూడ సహాయపడియుండినది. (Turks).

# 20 క్రైస్తవమతము; విద్య; సంఘసంస్కారణము.

1
క్రైస్తవమతవ్యాప్తి
1698_1863

1698 వ సంవత్సరపు అధికారపత్రమునందు కంపెనీఫ్యాక్టరీలలో పంతుళ్ళను నియమించుట కధికార మొసగబడినది. కాని, కంపెనీక్రైస్తవ మిషనరీ పంతుళ్ళను హిందూదేశమునకు రప్పించినచో తమ వర్తకము కొనసాగజాలదేమోయను భయమున నాపనికి బూనలేదు. మదరాసునందు రోమనుకేతలిక్కు మతస్థులు విరివిగనుండిరి. అందువల్ల స్పర్థలు గలిగినవి. జర్మను, డానిషు, మిషనరీలకు కంపెనీడైరక్టరులు ధనసహాయ మొసగియుండిరి. 1793 లో గావింపబడిన వంగదేశపరిపాలనా నిబంధనలలో భారతీయమత స్వాతంత్ర్యమున ఆచార వ్యవహారముల జోక్యముగలిగించు కొనబడదని వ్రాయబడి మాత్రముండెను. 1793 లో విల్బెరుఫోర్సుగారు క్రైస్తవమిషనరీలకు తోడ్పడుట అత్యావసరమని విశ్వసించి డైరక్టరులను ప్రోద్బలపరచియున్నారు. 1806 లో జరిగిన వెల్లూరు సిపాయీల తిరుగుబాటువలన కంపెనీ భయపడినది. ఈ తిరుగుబాటు ఫలితమున క్రైస్తవమతమును బహిరంగముగ సాయుధములతో ప్రచారము చేయుట కొంతవరకు తగ్గినది. కలకత్తాప్రభుత్వము మిషనరీల వ్యాప్తిని సుహృద్భావముతో ప్రోత్సాహపరుప సాహసింపజాలకపోయినది. 1819 లో క్రైస్తవమతమును పుచ్చుకొనిన సిపాయి, సేననుండి భర్తరఫుచేయబడినాడు.

క్రైస్తవులకు సిపాయీలదళమున ప్రవేశము నిరాకరింప బడసాగినది.1 సారంపురపు మిషనరీలకును, ప్రభుత్వమునకును స్పర్థ ఏర్పడినది. డైరక్టరులు విస్పష్టముగ మిషనరీలకు అండదై నిలువజాలకపోయిరి. 1813నుండియు క్రైస్తవ మత మిషనరీలు హిందూదేశమునకు వచ్చుటకై ఇండియాబోర్డువల్ల లైసెన్సుపొందున ట్లేర్పరుపబడెను. ఈనాటినుండియు పార్లమెంటుశాసనములే మిషనరీల దిగుమతికిని, క్రైస్తవమతవ్యాప్తికిని తోడ్పడియుండినవి. కలకత్తా యందు హిందూదేశాదాయముతో బిషపును, పోషింపబడునట్లు 1833 వ శాసనమునందు సావకాశము గల్పింపబడినది. 1833 లో లైసెన్సులు తీసివేయ బడినవి. మిషనరీలు విశేషముగ దిగుమతి అయినారు. 1854 లో మిషనరీల పాఠశాలలకు ప్రభుత్వాదాయమునుండి విరాళముల నొసగువిధి గుర్తింపబడినది.

కాని, హిందూదేశస్థులు క్రైస్తవమత స్వీకారమొనరించుటకు కొన్ని ఆర్థిక ప్రతిబంధకములు ప్రతిరోధములైనవి. క్రైస్తవమతమును స్వీకరించిన వాడు కుటుంబాస్తికి అర్హుడుకాడు. అందువల్ల 1832 లో యీప్రతిబంధ కము వంగదేశమున తొలగించివేయబడినది. మతస్వీకారులుగూడ ఆస్తికి అర్హులని శాసింపబడినది. 1850 లో డల్హౌసీగారు మతమునుండి వేరుమతమునకు బోయినయెడల ఆస్తిహక్కులు పోవునను నియమములన్నింటిని రద్దుపరచిరి. ఈవిధముగ క్రైస్తవమతవ్యాప్తిని నిరోధింపగల అడ్డంకులన్నియు క్రమక్రమముగ కంపెనీప్రభుత్వము తొలగించుచునే వచ్చినది. మతవ్యాప్తి కనువగు వాతా వరణమును, పరిస్థితులను సృష్టించుటకు 1813 నకు పిమ్మట సంకోచించి యుండలేదు.

1856 లో హిందూమతమునందలి విధవలుకూడ వివాహమాడవచ్చు నను శాసనముగావింపబడినది.

తీర్థయాత్రలకు పోవువారిపై పన్నువేయబడి, ఆరాబడి మతవిషయము లకై ప్రతిరాష్ట్రమందు వినియోగింప బడుచుండెడిది. ఆరాబడియు, మతవిష యక కట్టడములును, ఆనాడు భారతీయప్రభుత్వముల ఆధీనమునందుండెడివి.

1, See. Kaye Administration of E. I. Co. PP. 625.

ఈయధికారమే కంపెనీకి సంక్రమించినది. ఈయధికారము సద్వినియోగపరచుటకు మారుగ 1833 లో ఇండియాబోర్డు ప్రభుత్వమును విరమించుకొనవలెనని సూచించినది. 1838 లో ఇండియాబోర్డువారు అంతవరకును హిందూమతవిషయమున ప్రభుత్వము జూపుచు రావలసివచ్చిన గౌరవచిహ్నముల నన్నింటిని మానివేయవలెనని యాజ్ఞాపించిరి. ఇందులకు మదరాసు రాష్ట్రప్రభుత్వమును, ఉద్యోగేతరులగు ఆంగ్లేయులును, బిషప్పును గలిసి గావించిన యాందోళనమే కారణము.[1] 1863 నుండియు మతసంస్థలకు ప్రభుత్వోద్యోగుల సంరక్షణము తొలగించివేయబడుచు శాసింపబడినది. ఈవిధముగ హిందూమత సంరక్షణము వీడబడి, ప్రభుత్వ మొసగవలసిన గౌరవచిహ్నములు తొలగించివేయబడెను. క్రైస్తవమత ప్రభుత్వపునీడను క్రైస్తవమతప్రచారకులు వృద్ధియైరి. క్రైస్తవమతవ్యాప్తికి సహాయ మొసగబడినది. క్రైస్తవమత బిషప్పుగారు హిందూదేశప్రభుత్వకోశముచే పోషింపబడుచుండిరి.

సంఘసంస్కరణము.[2]

1833 వ సంవత్సరశాసనము ననుసరించి "బానిసల వర్తకము" నిరోధింపబడినది. (Slave Trade). 1843 లో అన్యాయమని ప్రకటింపబడినది. 1860 వ సంవత్సరపు (పెనలుకోడులో) శిక్షాస్మృతిలో బానిసలవర్తకముగూడ నేరముక్రింద పరిగణింపబడినది. ఈసంస్కరణమున కంత ప్రతిరోధముగలుగలేదు. కాని, సతిని నిషేధించుట దుస్తరమైనది. భర్తయొక్క మృతకళేబరముతోపాటు సజీవమగు భార్యనుగూడ దహనమొనరించు ఆచారము ప్రబలియుండెడిది. మహమ్మదీయ పరిపాలన ఫలితముగ హిందూదేశమునందీ దురాచారము నాడు ప్రబలియున్నది. వారనుహేస్టింగ్సుగా రీయాచారమును రద్దుచేయ సాహసింపజాలక పోయినాడు. కాని, సుప్రీముకోర్టు తనయధికారవ్యాప్తికి లోబడిన ప్రదేశములలో "సతి" జరుగరాదని నిషేధించినది. కారనువాలీసు, షోరుగార్ల దృష్టియు నీదురాచారముల వంకకు మరలలేదు. వెల్సలీగారుకూడ నేమియుచేయజాలక పోయిరి. నిజామతు, అదాలతు కోర్టువిషయమై విచారణసలిపినది. కొన్ని జిల్లాలయం దీదురాచారము నిషేధింపబడవలయుననియు, మరికొన్నిజిల్లాలలో

1. See Keith P. 161.

హద్దులేర్పరుపవలయుననియు విచారణనివేదికయందు వ్రాసినది. ఈసలహా నను సరించి ప్రభుత్వము చర్యతీసికొనియుండలేదు. ఇందులకుమారుగ 1812—17 మధ్య యీ "సతి" మతానుసార మొనరించు కొనదగుననిగూడ ప్రభుత్వమంగీక రించినది. 1823 లో డైరక్టరులీ నీతిని హృదయపూర్వకముగ నంగీకరించి యుండలేదు. కాని, 1829 లో లార్డువిల్లియము బెంటిక్కుగారు మాత్రమే యీదురాచారమును నిషేధింపగలిగిరి. ఇందులకు శ్రీ రాజారామమోహన రాయలు విపరీత కృషిచేసియుండెను. "సతి" నిషేధము రామమోహనుని కృషిఫలితమే. ఆతడు చరితార్థుడు. 1830 సంవత్సరములో మదరాసు, బొంబాయిరాష్ట్రములలో గూడ వంగమునందువలెనే నిషేధింపబడినది. హిందూసంఘాచార మిట్లు రూపుమాప వలదని మహాజరు ప్రీవీకౌన్సిలునకు పంపబడినది. అచ్చట త్రోసివేయబడినది. "సతి" నిషేధము సుస్థిరమైనది. ఈస్టిండియా కంపెనీ భారతవర్షమునం దొనరించిన దుర్న్యయ సముద్ర మహా వీచికలలో సంతోషదాయకముగ నడయాడుచున్న దీ "సతి" నిషేధశాసన మొక్కటియే. భారతదేశ ఆంగ్లేయప్రభుత్వ చరిత్రయందు సువర్ణాక్షరములతో వ్రాయగలిగిన విషయముగూడ నిదియొక్కటియే. 1

మొక్కలక్రింద బాలురను బలియిచ్చు నాచారము సాగరుద్వీపమునం దుండెడిది. ఈ యాచారమునుగూడ వెల్లస్లీప్రభువు నిరోధించియుండెను. 1795 నుండియు నీప్రయత్నము గావింపబడినది. ఒరిస్సా దేశమునందు మానవబలి యుండెడిది. 1837—52 మధ్య నీ మానవబలివిధానము నిరోధింపబడినది. తగ్గులు 1830 మొదలు 1837 వరకు నిరోధింపబడిరి.

3 విద్య:— హిందూదేశమందలి, కంపెనీకాలమందలి విద్యావిషయ మును గురించి యోజించునప్పు డొక్కవిషయమే రాజ్యాంగపరిణామ దృక్పథమున పరీక్షింపదగియున్నది. అదియే యింగ్లీషుభాషను ప్రభుత్వభాషగ నొనరించినవిషయము. 1835 మార్చి 7 వ తేదీనుండియు ఇంగ్లీషుభాషయే భారతదేశప్రభుత్వ భాషగ నొనరింపబడినది.2

1. See. E. Thompson, Suttee, Indias cries to British Humanity. 1832.
2. See. Arthur Mayhem. The Education of India.

ఇందులకు మెకాలేకారకుడు. మెకాలే విద్యాసంఘమున కానాడు అధ్యక్షుడు. (President of the Council of Public Instruction). ఈయన ప్రాచీన హిందూదేశపు భాషలన్నింటికంటె ఇంగ్లీషు చాల ప్రశస్తమైనదని బెంటిక్కు గారికి నూరిపోసినాడు. ప్రాచీనహైందవ భాషల వాసనగూడ నీయనకు లేక పోయినను, హైందవభాషలకంటె ఇంగ్లీషు ప్రశస్తమైనదని తీర్పుజెప్పుటకు వెరవ లేదు. ఈవిధముగ ఇంగ్లీషుభాష హిందూదేశప్రభుత్వ వ్యవహారిక భాషగ నొనరించుటకు మెకాలేగారి యభిమతమేమి?

"మనము వేసిన పన్నాగములన్నియు కొనసాగినచో మరిముప్పదిసంవత్సరములలో వంగదేశమున గౌరవకుటుంబములలో విగ్రహారాధకుడొక్కడు గూడ నుండడని నాదృఢవిశ్వాసము" అని మెకాలేగారు తనతండ్రికి హిందూదేశముననుండి 1836 లో వ్రాసియుండెను.1 అనగా హిందూదేశమందు సాంఘిక పరివర్తనము క్రైస్తవమతానుసారము గావింపవలెననియే మెకాలేగారి ప్రయత్నమనుట నిర్వివాదము.2 1844 వ సంవత్సరమునుండియు యింగ్లీషువిద్యావంతులకే ప్రభుత్వోద్యోగ మొసగు విధానము హార్డింజిప్రభుత్వము ప్రారంభించినది. 1854 లో మాత్రము ఇండియాబోర్డు ప్రెసిడెంటుగారైన ఛార్లెసుఉడ్డు గారు ప్రాచీనహైందవ భాషలకుగూడ ప్రోత్సాహ మొసగ వలయుననెను. 1857 లో కలకత్తా, మదరాసు, బొంబాయి విశ్వవిద్యాలయములు స్థాపింపబడినవి.

4 పత్రికాస్వాతంత్ర్యము.

1835 లో మెట్కాఫ్‌గారు పత్రికాస్వాతంత్ర్య మామోదించిరి. 1780 సంవత్సరమునుండియే కలకత్తాలో ఇంగ్లీషు పత్రికలు ప్రకటింపబడసాగినవి. వెల్సలీ, మింటో గారలు పత్రికాస్వాతంత్ర్య నిరోధమునకు బూనియుండిరి.3 ఇందులకీ పత్రికలలో వారి చర్యలు ఖండింపబడుటయే కారణము. హేస్టింగ్సు పత్రికా

1. See. The History of Education in India under the Company by B. D. Basu, PP. 80 and 145.
2. See. The Indian Daily News-Leader on March 29th 1909.
3. See. Roberts. India under Wellesley. PP. 175-7.

స్వాతంత్ర్యముపై దాడివెడలలేదు. ఎలిఫిన్‌స్టన్, మన్రో, మాల్కొలముగారలు పత్రికాస్వాతంత్ర్యము నంగీకరించియుండలేదు. 1857 లో కానింగుగారు పత్రికా స్వాతంత్ర్యమును నిరోధించి చెరబట్టిరి. సిఫాయీల తిరుగుబాటునకు స్వదేశ పత్రికలప్రబోధమే కారణమని కానింగుగారు విశ్వసించుటయే యిందులకు కారణము.

## 21 పరిపాలనా ఫలితములు.

ఇంతవరకును రాజ్యాంగ విధానమునుగురించి వివరముగ చర్చింపబడినది. ఈయంగవిధానఫలితముల నొక్కపరి సింహావలోకన మొనరింపదగును.

(1) "ప్రస్తుత హిందూదేశ ప్రభుత్వాంగ విధానము తికమకలుగను, దుర్వ్యయ భూయిష్టముగను, అసమర్థముగను, అయోగ్యముగను నున్నది. హిందూదేశజాతుల ప్రేమకును, ప్రభుభక్తిని తగనట్టి విచిత్రపద్ధతిని పరిపాలనా విధానస్వరూపము నిర్ణయింపబడినది. సుపరిపాలన కవసరమైన ప్రతివిషయము నందునను ఆచరణలో సక్రమముగ వర్తింపలేకపోయినది.

(2) ఒక్కొక్కప్పుడు దోపిడిగాండ్ర పట్టపగటి హింసాకృత్యములకు ప్రజలను వదలివేసియు, ఎల్లప్పుడును మోసగాండ్రును, దుర్మార్గులును నగు ఉద్యోగస్థుల కృపకు పాత్రులు కావలసిన స్థితిలో ప్రజలనుంచియు, హిందూదేశమునందలి బహువిస్తార ప్రదేశములలో ఆస్తికిగాని—వ్యక్తికిగాని సంరక్షణ మొసగజాలక పోయినది.

(3) న్యాయశాఖావిధానము దుర్భరవ్యయకారణముగను, అసమర్థముగను, న్యాయము సునాయాసముగ జాగులేకుండ లభింపనిదిగను నున్నది.

(4) రివిన్యూవిధానము రాజకీయార్థిక శాస్త్రమునందలి కొంచెమించుమించుగ అన్ని సిద్ధాంతములకును వ్యతిరేకముగనున్నది. వీలయినంత నిర్బంధ పద్ధతియు, శోషణమును, అవినీతియు, వృద్ధియగుటకు సావకాశ ముండురీతిని ప్రతిశాఖయు రివిన్యూవిధానమున నిర్మింపబడినట్లుగ దోచుచున్నది.

(5) నిశ్చయముగ దేశమునందలి విస్తారప్రదేశములలో శరీరదారుఢ్యము నందునను నైతికశక్తియందునను గూడ ప్రజలుక్రుంగిపోవుచున్నారు. పైన చెప్పబడిన యీచెడుగులలో విశేషభాగము ఆంగ్లేయులచే ప్రవేశపెట్టబడెను. కొంతభాగము ఆంగ్లేయ పరిపాలనమున హెచ్చెను.

(6) వ్యక్తుల యోగ్యతనుబట్టియే ప్రతిమంచిపనియు జరిగినది. కాని, యీ మంచి పేర్కొనతగినంతగ లేదు. లేక, అసంపూర్ణముగగాని, వేషముగ గాని, యున్నది.

'సతిని' నిరోధించుట, బాలబలిని రూపుమాపుటవల్ల సంరక్షింపబడిన ప్రాణముల సంఖ్యకంటె, అధికపు పన్నులమూలమున అణగద్రొక్కబడి, ప్రభుత్వకట్టడముల విధానములవల్ల నిరోధింపగలిగియుండియు, అట్లు జరుగక దాపరించిన కరువుల నెదుర్కొన జాలక మృత్యువువాతబడిన జనసంఖ్య చాల హెచ్చుగ గలదు.

ఉత్తరహిందూస్థానమునందు త్రవ్వింపబడిన కాలువలును, దానికి సంబంధించిన కంకరరోడ్డును మొదలగు కట్టడములు స్వదేశరాజులకాలమున జరుపబడిన పనులతో పోల్చి చూచుకొనినచో గమనింపదగినవిగ నుండవు. ఇవి చాల జిల్లాలలో పడిపోవుచున్న స్థితిలో నున్నవి.

(7) సరిక్రొత్త దురాచారమైన త్రాగుబోతుతనము హిందూజన సామాన్యమునందు వ్యాపింపజేయబడినది. దీనివ్యాప్తికిని, దీని అభివృద్ధి పరచుటకును, ప్రభుత్వమునకు దీనివల్లవచ్చు రాబడియే కారణము........" అని యీస్టిండియా కంపెనీ పరిపాలనమును గురించి జాను, మాల్కొలములడ్లో గారు తమ పుస్తకమునందు వ్రాసియుండిరి. 1

---

1 See. British India, its Races and its History, by John. Malcolm Ludlow, Vol. I. PP. 198-199. PP. 335-337. See also B. D. Basu. 976-977.

# 22 సింహావలోకనము.

1
కంపెనీప్రభుత్వము నశించుట ; 1858 వ శాసనము

కంపెనీచే స్థాపింపబడిన విధానము వివరింపబడినది. హిందూదేశమునందర్థించి, ఓడరేవులను సంపాదించుట గమనింపబడినది. ఫ్యాక్టరీల నిర్మాణము యోజింపబడినది. వాటిపరిపాలన పరిశీలింపబడినది. హిందూదేశపుగడ్డపై గట్టిగకాలుమోపిన దాదిగ వర్తకాభివృద్ధికై పెనగులాడు విధానము, ఆంగ్లేయ ప్రభుత్వ ప్రోత్సాహపద్ధతియు గుర్తింపబడినది. భారతావనియందుగల రాజన్యులపై సర్వాధికారము సంపాదింప ప్రయత్నములు విచ్చలవిడిగ సాగించెడి భావపరివర్తనము కంపెనీకిగలిగిన నాటనుండియు, సంభవించిన రాజ్యాంగపరివర్తనమునందలి ముఖ్యఘట్టములను, వాటిఫలితములను స్థాలీపులాకన్యాయముగ నిచ్చుట సింహావలోకన మొనరింపదగును.

మహారాష్ట్రయుద్ధములు, పిండారీ, ఆఫ్గనుయుద్ధములు, సిక్కు బర్మా యుద్ధములఫలితములు చరిత్రాంశములు. ఈఫలితముల ననుసరించి, లభించిన అత్యధిక రాజ్యాధికారముల నేవిధముగ కంపెనీవహింపగలిగినది, సీమప్రభుత్వమేవిధముగ కంపెనీకి తోడ్పడి సామరస్యముతో రాజ్యాధికారమునకు కోట గట్టిన దను విషయములు గ్రాహ్యములు. క్లైవు (Bengal, Bhihar and Orissa) వంగ, అంగ కళింగ దేశములలో దివానుగిరీ సంపాదింపబడిన నాట నుండియే సీమప్రజల దృష్టి, హిందూదేశవ్యవహారములవంక కొంకింత మరలినదని చెప్పవచ్చును. కంపెనీవ్యవహారములపట్ల సీమప్రభుత్వము తగుశ్రద్ధవహింప వలెనను ప్రజాందోళనము ప్రారంభింపబడినది.

"కంపెనీ పరిపాలనము చెడిపోయినది. అంతకంతకు భ్రష్టమగుచున్నది. కంపెనీ ఆర్థిక పరిస్థితులు దుర్భరమై వారనుహేస్టింగ్సును బెంగాలుగవర్నరుగా నియమింపవలసివచ్చినది. వంగదేశమందలి ద్వంద్వపరిపాలనమును - అనగా కంపెనీయొక్కయు, నవాబుయొక్కయు ఉమ్మడి పరిపాలనమును తుదముట్టించి దివానుగిరీని వెంటనే చేబూని వంగరాష్ట్రమును అరాజకమునుండియు, దారిద్ర్యము

నుండియు, వినాశనమునుండియు సంరక్షించుటకై హేస్టింగ్సు నియమింపబడి నాడు. హేస్టింగ్సు బెంగాలుగవర్నరుగ విశేషశ్రమపడియున్నాడు. ఈతనిచేష్టలు కొంతకాలమునకు పిమ్మట వివాదగ్రస్తమయినప్పటికిని కంపెనీవారి రాజ్యాధికారమును వంగమున సుస్థిర మొనర్పగలిగినవి. కాని, సీమయందలి కంపెనీకి మాత్ర మార్థికముగ లాభించలేదు. కష్టములు గట్టెక్కలేదు. ఆకాలమున కంపెనీ ప్రజలనుండి పౌ 1,400,000 లు ఋణమును చేయవలసి వచ్చినది. ఈ తరుణమును జూచియే ప్రజలును, ప్రభుత్వమును, కంపెనీవ్యవహారములలో జోక్యము కలిగించుకొన తలంచిరి. కలిగించుకొనిరి. ఈసంవత్సరమే ఈస్టిండియా కంపెనీయొక్క వ్యవహారములు ఇండియా, ఐరోపా దేశములయం దంతటను సక్రమముగ నిర్వహింపబడుటకై యొక శాసనమును గావించినది. ఈరిగ్యులేటింగు శాసనము ననుసరించియే వర్తకపుసంఘము సంపాదించిన రాజ్యముపై బ్రిటిషుజాతి, ఒకజాతిగ, రాజ్యాధికారము వహింప మొదలుపెట్టినది......... ఈప్రథమ ప్రయత్నమున చాలలోట్లుగలవని త్వరలోనే పార్లమెంటుసభ గ్రహింపగలిగినది. వివిధములగు వాదోపవాదముల కీ శాసనము కారణమయినది పారిపాలనాప్రతిష్ఠంభనలకుగూడ హేతువైనది. ఈపరిస్థితులను చక్కజేయుటకై పార్లమెంటుసభ 1784 వ సంవత్సరమున మరియొక శాసనమును గావించినది. కాని, 1784 వ సంవత్సరమున గావించిన పిట్సు శాసనమునకును, అంతకుముందు గావింపబడిన రిగ్యులేటింగు శాసనమునకును మధ్యగల పదిసంవత్సరములకాలమును విశేషచరిత్రాంశములతో గూడియున్నది. హిందూదేశవ్యవహారములు, సీమయందలి రాజకీయపార్టీల వ్యవహారములతో ముడివడినవి. రిగ్యులేటింగు శాసనము ననుసరించి గవర్నరుజనరలుగారు కంపెనీ డైరక్టరులపై ఆధారపడవలసి వచ్చుటయేకాక, బ్రిటిషుప్రభుత్వమంత్రివర్గము వారిపై గూడ నాధారపడవలసివచ్చినది. వీరియనుగ్రహమును బడయుటకై హిందూదేశ పరిపాలనయందలి లాభములలో వార్లకుగూడ కొంతభాగము నొసగవలసివచ్చుచుండెడిది. ప్రత్యక్షముగనే పార్లమెంటు హిందూదేశపరిపాలనలో జోక్యము కలిగించుకొనుట కానాటిపరిస్థితులు సమంజసముగ లేవు. పార్లమెంటువారు కంపెనీ వ్యవహారములలో జోక్యముకలిగించుకొని దానిపై యధికారమును చెలాయింపజూచుట కంపెనీ డైరక్టరులును, పెట్టుబడిదారులునుగూడ సహింప

జాలకపోయిరి. ఈఅసహనముగూడ హేస్టింగ్సునకును, ఆయన కౌన్సిలరుల కును మధ్య గలిగిన వివాదముతో సంబంధము గలిగియున్నది. ఈ వివాద ముతో నాటి రాజకీయ పక్షములుగూడ జోక్యము కలిగించుకొనినవి.”
(By Mr. Forrest in his introduction to the selections from state papers of the Governer's-General of India relating to Warren-Hastings)

కంపెనీ పరిపాలనయందలి యీపరిస్థితులే ఆంగ్లేయప్రజలకన్నులను కొంతవరకు తెరిపింపగలిగెను. కంపెనీ సంపాదించిన రాజ్యాధికారము ననుస రించి భారతఖండముపై కొంచెమించుమించుగ కంపెనీకి సర్వాధికారము లభిం చినదని చెప్పవచ్చును. ఒక వర్తకసంఘ మంతటి రాజ్యాధికారమును సక్రమ ముగ నిర్వహింపజాలదని అనుభవపూర్వకముగ సీమప్రజలు గ్రహింపగలిగిరి. మరియు, ఆంగ్లేయరాజ్యాంగముననుసరించి కంపెనీకి సంక్రమింపజేసిన అధికారము లును, హక్కులును, సమన్వయింపబడుటకు వీలులేకుండనుండెను. పార్లమెంటు గావించిన విచారణలేక కంపెనీ పరిపాలనమంతయు నవినీతికరమయినదని రుజువయ్యెను. దీనిఫలితముగనే విలియముపిట్టుగారి శాసనము 1784 లో అమలులోనికి వచ్చినది. ఛార్లెసు జేమ్సు ఫాక్సుగారిబిల్లు వీగిపోయినది. ఈ విలియముపిట్టుగారి శాసనము హిందూదేశమున ద్వంద్వప్రభుత్వమును ప్రవేశపెట్టినది. (1) డైరక్టరుల సంఘముతోగూడిన కంపెనీ పరిపాలనము. (2) పార్లమెంటువారికి బాధ్యతవహించుచు కంపెనీపై పెత్తనము చెలాయించు ఇండియా సంఘాధికారము. ఈద్వివిధ పరిపాలనా పద్ధతి 1858 వరకునుగలదు.

1773 సంవత్సరము మొదలు 1784 వ సంవత్సరమువరకు గావింపబడిన శాసనములవల్ల హిందూదేశ పరిపాలనావిధానమునందు గలిగిన కొన్ని మార్పు లలో గమనీయమగు మార్పొక్కటియే గలదు. “1786 వ సంవత్సరమున బహిరంగముగ ఇంగ్లీషు సర్వాధికారము హిందూదేశమునందు గవర్నరు జనరలుగారిక్రింద ప్రతిష్ఠింపబడినది. బ్రిటిషుజాతీయ ప్రతినిధులగు పార్లమెంటు వారిచేత హిందూదేశపు గవర్నరుజనరలుగారికి యధికారము లొసగబడినవి. వర్తక సంఘమునకు అధికారపత్రములమూలమున సంక్రమించిన ప్రధానగవర్నరు

పదవి ప్రత్యక్షముగ రాజ్యాధికారము నిర్వహించెడి గవర్నరుజనరలు పదవిగ తారుమారైనది. కారనువాలీసు యీగవర్నరుజనరలు పదవిని స్వీకరించుటతో (ఆంగ్లేయాధికారమునకు) నూతనాభివృద్ధికాలము ప్రారంభమైనది." (Thus Described by Sir Alfred).1

ఇంతనుంచియు, అనగా 18 వ శతాబ్దమునుండియు ఆంగ్లేయ సామ్రాజ్య స్థాపనము సుస్థిరమైనదని భారతీయులు తలంపసాగిరి. గతశతాబ్దమునందు గల అరాజకస్థితితో విసిగివేసారిన ప్రజలు సుస్థిరమగు నొక, ప్రభుత్వము—పరప్రభుత్వ మైన ఆంగ్లేయ ప్రభుత్వమైనప్పటికిని, స్థాపింపబడినందుల కీ ప్రభుత్వమునందు కొంత విశ్వాసమును జూపించసాగిరని కొందరిమతము. ఈఆంగ్లేయ ప్రభుత్వము నకును, భారతదేశమునం దచ్చటచ్చట గల స్థానికప్రభుత్వములకును మధ్యగల సంబంధము లన్నిఁటిపట్లను సమానముగలేవు. వివిధరీతుల గలవు. అయినప్పటికి ఆంగ్లేయ సర్వాధికారము మాత్రము గుర్తింపబడుచునే వచ్చినది. ఈ సర్వాధి కారము సుస్థిరమై పరివ్యాప్తమగుననుట నిశ్చయమనిగూడ తలంపబడసాగినది. అయినను, అంతుపంతులేని రాజ్యవిస్తీర్ణమునం దొక మహాప్రమాద మిమిడి యున్నదని విలియము పిట్టుగా రానాడే గ్రహింపగలిగిరి. ఇందులకై వలయు సంతత యుద్ధసన్నద్ధత సమంజసముగాదని తలంపబడినది. 1793 వ సంవత్స రమునందు కంపెనీవారికి మరల యొసగబడిన అధికారపత్రమునం దీవిషయమై విస్పష్టముగ వ్రాయబడెను.

"హిందూదేశములో రాజ్యస్థాపన మొనరించుటయు, దానిని విస్తరింప జేయు కార్యక్రమము బూనుటయు, యీ జాతీయా (సీమ) భిమతమునకును, గౌరవమునకును, రాజనీతికినిగూడ విరుద్ధ విషయములు. సీమప్రభుత్వమువారి విస్పష్టమగు ఆజ్ఞలేనిదే హిందూదేశమునందు కౌన్సిలుయుతుడగు గవర్నరు జనరలుగారు యుద్ధములను ప్రకటించుటయు, యుద్ధమునందు పాల్గొనుట కెవరితో నైనను ఒడంబడిక గావించుకొనుటయు, ఏదేశముయొక్క ఆక్రమణమైనను

1. Quoted by A. Rangaswami Ayyangar. The Indian Constitution. P. 13.

సంరక్షించుటకు హామీయొసగుటయు (సంస్థానాధిపతులు — సంస్థానములు) అశాస్త్రీయము. ఆంగ్లేయజాతిపై హిందూదేశమున యుద్ధము ప్రకటింపబడి యుండినచో మాత్రము పైసూత్రము వర్తించదు.'' ఈసూత్ర మాచరణయం దొక బూటక మైనది. వెల్సలీగారి గవర్నరుజనరలు పదవి కాలమునందు ఆంగ్లేయరాజ్యము బహువిస్తీర్ణ మైనది. నాటికిగల స్వదేశరాజ్యముల నన్నిం టిని ఆంగ్లేయబావుటా క్రిందకు దెచ్చుటయే వెల్సలీగారి ఆశయము. కొన్ని ఆక్రమణ జేసికొనుటయు, మరికొన్నింటిని సామంతరాజ్యములుగ గావించుకొను టయు వెల్సలీగారి రాజ్యనీతి. స్వదేశరాజ్యము లేవిధముగను ఆంగ్లేయాధి కారముపై తిరుగబడకుండ నిరపాయస్థితియం దుంచుటయే వెల్సలీగారి పతకము. స్వదేశరాజ్యములతో ఒడంబడికలను గావించుకొనుటయే ఆంగ్లేయ సర్వాధి కారమును సుస్థిరమొనరించుటకుగల మార్గమని వెల్సలీగారి నిర్ణయము.

"ఆనాడు ఐరోపాఖండమందు నెపోలియను యుద్ధములఫలితముగ గావింప బడిన ఒడంబడికలవలెనే హిందూదేశమునందుగూడ సామంతరాజులుగ కొంద రితో నొడంబడికలు గావింపబడినవి. ఈ ఒడంబడికలే రానురాను ఆంగ్లేయ సంరక్షణకు మార్గములైనవి. (Protected States). సరిహద్దులయందు నామ మాత్రపురాజులను నిలువబెట్టుటయు, నీ రాజనీతిలోని నొకభాగమే. లార్డు వెల్సలీగారు వృద్ధిపొందించిన "స్వదేశసంస్థానముల సంరక్షణపద్ధతియే'' (Subsidiary system). ఆంగ్లేయరాజ్య విస్తీర్ణమునకు మూలమై స్వదేశ సంస్థానములపై ఆంగ్లేయుల బలవంతపు సంరక్షణ విధింపబడుటకు మార్గమైనది.

2
అధికారపత్రములు ; రాజ్యాంగపరిణామము

19 వ శతాబ్ది ప్రారంభమునుండియు కంపెనీకిలభించిన అధికారపత్రములయందలి రాజ్యాంగ పరిణామమునకును- ఆంగ్లేయరాజ్య విస్తీర్ణ రాజనీతికిని అంతగ సంబంధము లేదని కొందరిమతము. కంపెనీవారికి 1813-1833-1853 సంవత్సరములలో నొసగబడిన అధికారపత్రములును, యింతకుపూర్వము 1773—1793 సంవత్సరములలో నొసంగబడిన అధికారపత్రములును, పరిపాలనను గురించిన, పార్లమెంటువారి విచారణలు జరిగినపిమ్మట కంపెనీవారి కొసగబడినవి.

ఈయధికారపత్రములు విచారణల ఫలితమనదగును. ఈయధికారపత్రముల ననుసరించిన మార్పులు రాజ్యాంగయంత్రమునందు వివిధసంస్కరణములకు మార్గములైనవి. ఆంగ్లేయప్రభుత్వదక్షతక్రింద (Supervision) అధికారపత్రముల ననుసరించి కొనసాగింపబడుచున్న కంపెనీ పరిపాలనమును, ప్రత్యక్షముగ సీమ ప్రభుత్వమే పరిపాలించునట్లుగ గావింబడిన ప్రయత్నములను సింహావలోకన మొనరింపదగును.

ఈస్టిండియా గవర్నమెంటువారి పరిపాలనపై పరీక్షాధికారముగలదని 1781 వ సంవత్సరపు శాసనము ననుసరించియే బ్రిటిషుప్రభుత్వము నిర్ణయించినది.

ఈశాసనము ననుసరించి కంపెనీ డైరక్టరులు వీరి యుత్తరువులకు సరియయిన నకళ్ళను ఎప్పటికప్పుడు బ్రిటిషు ప్రభుత్వమునకు సమర్పించుచుండవలయును. రివిన్యూ, సివిలు, మిలిటరీ విషయములకు సంబంధించిన యుత్తరువులను దాఖలుచేసికొనుటయేగాక, యుద్ధములనుచేయుటకును, ఒడంబడికలను గావించుకొనుటకును, సంబంధించి ఆంగ్లేయప్రభుత్వ మెప్పుడే ఉత్తరువు నొసంగునో అప్పుడాఉత్తరువును శిరసావహించి ఆచరించవలసి యున్నది.

1784 వ సంవత్సర శాసనము ననుసరించి కమీషనరుల సంఘము నిర్మింపబడినది. 1833 వ సంవత్సరపు శాసనము ననుసరించి దీని అంగనిర్మాణము నవరింపబడినది. ఇదియే ఇండియాబోర్డు. ఈబోర్డు ఖర్చులక్రింద 1793 వ సంవత్సరమువరకును పార్లమెంటువా రెప్పుడును ధనమును ప్రత్యేకించియుండలేదు. పిమ్మట ఇండియాబోర్డు (Board of Control) సభ్యులకును, ఉద్యోగస్థులకును ఆకర్షణీయమైన జీతము లొసగబడసాగినది. హిందూదేశప్రభుత్వాదాయము నుండియే వీరి జీతబత్తెము లొసగబడుట ప్రారంభింపబడినది. 1853 వ సంవత్సరపు అధికారపత్ర శాసనముతో యీస్టిండియాకంపెనీ యించుమించుగ చనిపోయినదనియే చెప్పదగును. ఈశాసనము గావించుటకు ముందుగ, హిందూదేశ వ్యవహారములనుగురించి లోగడ జరిగినట్టి విచారణలవంటి, పార్లమెంటు సంఘమువారి విచారణ జరుపబడినది. ఈశాసనమునందు పార్లమెంటువారి

పక్షమున మాత్రమే హిందూదేశరాజ్యము కంపెనీవారి పరిపాలనయం దుండవలెననియు, నీవిధముగగూడ పార్లమెంటు వేరువిధముగ నిర్ణయించువరకు మాత్రమేననియు విస్పష్టపరుపబడెను. (In trust for the Crown).

ఈశాసనము 1858 వ సంవత్సరమువరకు అమలునం దున్నది. 1858 వ సంవత్సరమునందు జరిగిన భారతదేశ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ ఫలితముగ, 1858 వ సంవత్సరమున మరియొకశాసనము గావింపబడినది. ఈశాసనము ననుసరించి హిందూదేశ రాజ్యాంగమును, రాజ్యపరిపాలనయు, ప్రత్యక్షముగ సీమదేశ చక్రవర్తిగారికి సంక్రమింపజేయబడెను. నాటనుండియు సీమదేశ ప్రభుత్వమే హిందూదేశరాజ్య పరిపాలనమును కొనసాగించుచున్నది. ఎట్లు?

3
చక్రవర్తిపేర చక్రవర్తి పరిపాలనము. 1858 శాసనము.

1858 వ సంవత్సరపుశాసనము ననుసరించి యీస్టిండియా కంపెనీ డైరక్టర్లనుండి రాజ్యాధికారము లాగివేయబడినది. ఇదే విధముగ ఇండియాలో సంఘముగూడ రద్దుచేయబడినది. (Board of Control) కాని ఇండియాసంఘమునకు మారుగ పార్లమెంటునకు బాధ్యతవహించెడి హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి సృష్టింపబడినాడు. ఈయనకొక సలహాసంఘ మేర్పరుపబడినది. హిందూదేశమందలి ఆంగ్లేయ పరిపాలనయొక్క రాజ్యాంగ పరిణామమునందు గమనార్హమగు మార్పుసంభవించినది. హిందూదేశపరిపాలనపై పార్లమెంటువారి సర్వాధికార మంగీకరింపబడినది. ఇంతతో హిందూదేశము బ్రిటిషుసామ్రాజ్యమునం దొక, అనన్యకాంతితో వెలుగొందు మహామణియైనది. హిందూదేశరాజ్యాంగ పరిణామము బ్రిటిషుప్రభుత్వము, లేక, పార్లమెంటువారి కాలిబొటనవ్రేలికి ముడిపెట్టబడినది.

4
రాజ్యాంగ పరిణామ ముఖ్యవిషయములు

భారతభూమియందలి యీ ఆంగ్లేయ సామ్రాజ్యనిర్మాణ చరిత్రయు రాజ్యాంగపరిణామక్రమమును గుర్తించుటలో కొన్ని ముఖ్యవిషయములు గమనింపదగును. 17 వ శతాబ్దాంత్యమువరకును రాజ్యాంగపరిణామ మన్న, ఈస్టిండియా కంపెనీవారియొక్కయు, వారి డైరక్టరులయొక్కయు, వారి ఉద్యో

గష్టులయొక్కయు లాభములనియే తేలుచున్నది. ఇందులకై కంపెనీయొక్క సిబ్బందీ యవలంబించిన వివిధకృత్యములన్నియు దుర్నయములని నిర్ణయింపదగును. కంపెనీవారి సెటిలుమెంటులలోగల శాసనాధికార పరివర్తనమును, న్యాయాధికారపరివర్తనమును, పరిపాలనాధికార పరివర్తనమును, కంపెనీవారి యొక్క రాజ్యాక్రమణ విధానకార్యక్రమమందలి మార్గాంతరములుమాత్రమే అయినవి. ఈపరిణామము, చక్రవర్తిగారికి వ్యక్తిగతముగగల సర్వాధికారము (Prerogative) ననుసరించియే జరిగినది. ఆంగ్లేయజాతి, యొకజాతిగ, హిందూదేశవ్యవహారములపట్ల నెట్టిజోక్యమును గలిగించుకొని యుండలేదు.

కాని, 18 వ శతాబ్ద ప్రారంభమునుండియు మాత్రము పార్లమెంటువారు భారతరాజకీయ రంగమునం దడుగిడసాగిరి. యితరదేశములలో ఆంగ్లేయులు సంపాదించిన రాజ్యములపై చక్రవర్తిగారికిగల సర్వాధికారవినియోగముపై పెత్తనము చెలాయింప పార్లమెంటువారు ప్రారంభించిరి. ఇది, రెడ్ బ్రిడ్జినావను కంపెనీ పట్టుకొనినసందర్భమున పార్లమెంటు స్థిరపరచుకొనగలిగినది.

కంపెనీవారు అత్యధిక రాజ్యాక్రమణమును గావించుచుండుటయు, కంపెనీ సిబ్బందీ అత్యధికభాగ్యమును హిందూదేశమునుండి తర్లించుచుండుటయును, కంపెనీ వ్యవహారములు హిందూదేశమునందునను, ఇంగ్లండునందుననుగూడ అసంతృప్తికరముగ నుండుటయు, 1770 వ సంవత్సర ప్రాంతమునుండియు, పార్లమెంటువారి దృష్టి హిందూదేశ వ్యవహారములపట్ల నాకర్షింపబడుటకు కారణములయ్యెను. ఇందులకు రిగ్యులేటింగుఆక్టు తార్కాణము. "హిందూదేశమునందునను, ఐరోపాదేశమునందుననుగూడ కంపెనీవ్యవహారములు సక్రమముగ పరిపాలింపబడుటకే" రిగ్యులేటింగు శాసనము గావింపబడినది. ఆనాటనుండియు, ప్రతి యిరువదిసంవత్సరముల కొకమారు కంపెనీ వ్యవహారములను గురించి, విచారణలు సలుపుచుండుటయు, నూతనాధికార పత్రముల నొసగుచుండుటయు, పార్లమెంటు నిర్వహించుచు వచ్చినది. ఈ అధికారపత్రముల శాసనములయందు మాత్రమేకాక వాటికి మధ్యకాలమందు గావించుచు వచ్చిన యితర శాసనములయందు గూడ కంపెనీ పరిపాలనపై పార్లమెంటు

క్రమక్రమముగ తన యధికార మెట్లు స్థాపించుకొనుచు వచ్చినదియు తేటతెల్లముగ నున్నది.

పార్లమెంటు కంపెనీ పరిపాలనా వ్యవహారములపట్ల నీవిధముగ స్థాపించుకొనుచువచ్చిన యధికారము 1833–1858 సంవత్సరములలో పార్లమెంటు గావించిన శాసనములనుబట్టి సుస్థిరమైనది. విస్పష్టమైనది.

1858 వ సంవత్సరపు శాసనమునందు తెరచాటు వ్యవహారమంతయు తొలగిపోయినది. ప్రత్యక్షముగనే ఆంగ్లేయ ప్రభుత్వము భారతీయప్రభుత్వమునకు బాధ్యత వహించినది. రాజ్యాంగపరిణామక్రమమునందు యీస్టిండియా కంపెనీకిని హిందూదేశమునకును నాటివరకునుగల రాజ్యాంగ సంబంధమును తెగినది. బ్రిటిషు ప్రభుత్వాచిరవాంఛితమును నీడేరినది.

హిందూదేశ ప్రభుత్వమునకు బాధ్యతవహించుట మూలముగ ఆంగ్లేయ ప్రభుత్వము, నాడు చేయగలిగినదంతయు జేసినది. అట్లొనరింపనియెడల ఆనాడే, 1857 వ సంవత్సరమునందే, పవిత్రభారతావనియందలి ఆంగ్లేయరాజ్యము తుదముట్టియుండెడిది. భారతీయులే భారతీయసామ్రాజ్యమునకు సర్వాధికారులై యుండెడివారు. భారతీయ సర్వాధికార స్థాపనకై గావింపబడిన ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామము విఫలమై, నాడు చేయబడిన కృషియే ఆంగ్లేయ సర్వాధికార స్థాపనకు మూలమైనది. అయినను వర్తకమునకై వచ్చి రాజ్యస్థాపన మొనరించిన కంపెనీప్రభుత్వము మాత్రమంతటితో నాశనమైనది.

వందేమాతరం

# 2 వ పర్వము.

# బ్రిటిషు ప్రభుత్వ ధర్మకర్తృత్వము

లేక

# పార్లమెంటు సర్వాధికారము.

1858 వ సంవత్సరమునందు పార్లమెంటు గావించిన భారతీయ రాజ్యాంగ శాసనము ననుసరించి భారతదేశముపై పార్లమెంటునకు శాసనబద్ధముగ సర్వాధికారము లభించినది. పార్లమెంటునకు లభించినదనగా, చక్రవర్తిగారికి—లార్డుల సభకు—కామనులసభకు—మూడింటికిని గలిసి లభించెడి యధికారమే పార్లమెంటునకుగల యధికారమని శాస్త్రీయముగ బిలువబడుచున్నది. ఈయధికారము ననుసరించి హిందూదేశ వ్యవహారములపట్లు పార్లమెంటు తనయిష్టమువచ్చిన శాసనములను గావించుచుండవచ్చును. ఈశాసనములను భారతీయులు శిరసావహించుట శాస్త్రవిధి. భారతీయప్రభుత్వయంత్రమంతయు "జీ—జోహుకుం—" అనవలసినదే. ఈఅధికార ప్రారంభమునకు 1767 వ సంవత్సరమే మొదలని కొందరిమతము.

కాని, ఆనాడు పార్లమెంటుజోక్యము కలుగజేసికొనినదేకాని, హిందూదేశమునందలి కంపెనీవారి రాజ్యభాగములపై తనకే యధికారముగలదని ప్రకటించియుండలేదు. తానే ప్రభుత్వమును నిర్వహింపబూనలేదు. కంపెనీనుండి కొంత కప్పమునుమాత్రము పుచ్చుకొనినది. "ఏ పౌరుడుగాని—ఎచ్చటగాని వ్యక్తిగతముగ రాజ్యమును సంపాదింపవీలులేదు. పౌరులవ్యక్తిగత రాజ్యసంపాదనమంతయు ఆపౌరు లేదేశమునకు చెందియుందురో, ఆదేశమునకే వారిరాజ్యసంపాదనముచెందు" నని నాడు రాజ్యాంగశాస్త్రమున నిర్వచింపబడినది. ఇది లార్డు ఛాతముగారి నిర్వచనము. (Lord Chatham). ఈయనయే, "హిందూదేశ ప్రభుత్వము నంతయు సీమప్రభుత్వము వశపరచుకొనుట, ప్రభుత్వపు

హక్కనియు విధియనియు" గూడ వాదించియుండెను. రాబర్టు క్లైవుగారుగూడ నీయనతో నేకీభవించియుండిరి. అయినను పార్లమెంటు రాజ్యాంగముపైగాని, రాజ్య భాగములపైగాని సర్వాధికారమును శాసనరూపముగ ప్రకటించియుండలేదు. ఆనాడు ప్రకటించక పోవుటయేకాదు. పిమ్మటగూడ నొకశతాబ్దమువరకు విస్పష్టముగ పార్లమెంటు తనసర్వాధికారమును ప్రకటించుకొనియుండలేదు. 1773 వ సంవత్సరపు శాసనమునందు పార్లమెంటువారి యధికారము విస్తరింపజేయబడి కొంతవరకు నిర్వచింపబడినది. ఈనిర్వచనముగూడ సంకుచితముగనే చేయబడినది. "విలియముపోర్టుయొక్క సివిలు మిలిటరీ పరిపాలనమును—ఇతర రాజ్యభాగములయొక్క పరిపాలనయును—బెంగాలు, బీహారు, ఒరిస్సా దేశముల రివిన్యూరాబడియును—కంపెనీవారి యధికారమునం దున్నంతకాలమును వీటిపై యధికారము గవర్నరుజనరలుగారును, విలియముపోర్టు కౌన్సిలువారును కలిగియుందురు. ఇదివరకు వీ రేవిధముగ పై రాజ్యములయం దింతవర కధికారమును గలిగియుండిరో, అట్టి యధికారమునే నేటినుండియు గలిగియుందురు." అని ప్రకటింపబడినది. ఇందు సర్వాధికారమును పార్లమెంటు సంక్రమింపజేసికొన సాహసించలేదు. కంపెనీవారు సంపాదించుకొనిన అధికారములకును, హక్కులకును సీమప్రభుత్వము క్రమక్రమముగ తెరమరుగుననుండి 1853 వ సంవత్సరమువరకును వ్యవహరించినది. 1853 వ సంవత్సర శాసనమునందుమాత్రము పార్లమెంటుపక్షమున కంపెనీవారు ధర్మకర్తలుగమాత్రమే, పార్లమెంటువారు వేరువిధముగ నిరూపించువరకు వ్యవహరించవలెనని శాసింపబడినది. ఈశాసనము ననుసరించి కంపెనీవారి సర్వాధికారము తొలగింపబడినది. పార్లమెంటువారు బహిరంగముగ సర్వాధికారమును ప్రకటించుకొనలేదుగాని పరోక్షముగ ప్రకటించియుండిరి. కంపెనీకి సర్వస్వామ్యములు లేవనియు పార్లమెంటు పక్షపు ధర్మకర్తలు మాత్రమేయనియు ప్రకటింపబడినది. (The Indian territories should remain under the Govt. of the Company in trust for the Crown until Parliament other wise direct.)

1858 వ సంవత్సరమునందు పార్లమెంటు గావించిన శాసనమునం దీ తెరమరుగు తీసివేయబడినది. అంతవరకును, "పార్లమెంటునకు ధర్మకర్తలుగ

కంపెనీవారు వ్యవహరించుచున్న రాజ్యభాగములు చక్రవర్తినిగారిచే పరిపాలింప బడును.........కంపెనీవారి యధికారమునందుండి కంపెనీవారిచే పరిపాలింప బడుచున్న రాజ్యభాగమంతేయు చక్రవర్తిగారికి సంక్రమించినది. కంపెనీవారి కందుగల సర్వాధికారములు-హక్కులు-అనుభవములు అన్నియును చక్రవర్తి గారికి సంక్రమించుచున్నవి.'' అని విస్పష్టముగ వ్రాయబడినది. ఇంతతో ఆంగ్లేయప్రభుత్వమునకు హిందూదేశ రాజ్యాంగము సంపూర్ణముగ సర్వాధి కారములతోను సంక్రమించినది.

1 రాజకీయ ధర్మకర్తృత్వము.

అయితే, యీసర్వాధికార సంక్రమణముతో ఆంగ్లేయ ప్రభుత్వమునకు భారతజాతీయ ధర్మకర్తృత్వము సంక్ర మించినదా? కంపెనీవారిని 1853 లో తమధర్మకర్తలుగ శాసించినది పార్లమెంటు. ఎవరిపక్షమున? పార్లమెంటు పక్షమున. ఏధర్మకర్తృత్వమును కంపెనీకి పార్లమెంటు 1853 లో సంక్రమింప జేసినదో దానినే వారు తిరిగి 1858 లో లాగికొనిరి. లేక తమకు సంక్రమింప జేసికొనిరి. ఇది అధికారము చెలాయించుచు బలవంతముగ తమ దేశపు పార్ల మెంటు సభలో తమ యిష్టమువచ్చినట్లు శాసించుకొని సంక్రమింపజేసికొనిన శాసనరూపమగు సర్వాధికారమే కాని ధర్మబద్ధమైన ధర్మకర్తృత్వముమాత్రము గాదు. రాజ్యాంగశాస్త్రము ననుసరించిన రాజకీయ సర్వాధికారమునుగాదు.

"సర్వాధికారము రెండువిధములు. రాజకీయ సర్వాధికారము. (Political Sovereignity) శాస్త్రీయ సర్వాధికారము (Legal sovereignity) ఈరెండుసర్వాధికారము లొకదానితో నొకటి విశేష సంబంధమును గలిగియున్నను రెండును ప్రాముఖ్యముగల ప్రత్యేకవిషయములే...''[1] అప్రతిహత మైన శాసనాధికారమే శాస్త్రీయసర్వాధికార మనబడుచున్నది. (Power of Law Making Unristricted by any Legal limit is legal sovereignity). రాజ్యాంగమునందు ఏసంస్థయొక్క యభిమతమును ఆరాజ్యమం దలి పౌరులు శిరసావహించెదరో ఆసంస్థ ఆరాజ్యముపై రాజకీయసర్వాధికారము వహించుచున్నది. ఈనిర్వచనము ననుసరించి బ్రిటిషు దీవుల సర్వాధికారము,

1. The Law of Constitution. V. Dicey. Seventh Edtion p. 72.

చక్రవర్తియు, లార్డులును గలిసియుండిన బ్రిటిషుఓటరులకు చెందియున్నదగును. నిజమును నిశ్చయముగ చెప్పవలసివచ్చుచో చక్రవర్తిగారికిని, లార్డులకునుగూడ లేదు. బ్రిటిషుప్రజలకు లేక ఓటరులకు మాత్రమే సర్వాధికారము సంక్రమించి యున్నది. ఏలనన, ఆంగ్లేయ రాజ్యాంగపరివర్తనము ననుసరించి తుట్టతుదకు ఓటరుల యభిప్రాయనిర్ణయమే ప్రభుత్వము శిరసావహింపవలసి వచ్చుచున్నది. ఇదియే రాజకీయ సర్వాధికారము. ఇదిశాస్త్రీయ సర్వాధికారముకాదు." 1 ఈసూత్ర ప్రకారము భారతీయ రాజ్యాంగమునకు రాజకీయసర్వాధికారులెవరు? భారతీయరాజ్యాంగము ఆంగ్లేయప్రభుత్వమగు పార్లమెంటుచే నిరూపింపబడి నది. పార్లమెంటుయొక్క రాజకీయ సర్వాధికార మాంగ్లేయపౌరులది. అందు వల్ల భారతీయుల రాజకీయసర్వాధికార మాంగ్లేయపౌరులకు చెందుచున్నది. కాని, భారతీయ ప్రభుత్వముపై భారతీయపౌరుల కెట్టిసర్వాధికారమును లేదు. భారతీయ ప్రభుత్వాభిమతమునుగూడ భారతీయపౌరులు బుద్ధిపూర్వకముగ శిరసావహించుటలేదు. పార్లమెంటునకుగల శాస్త్రీయ సర్వాధికారమును, ఆంగ్లేయపౌరులకుగల రాజకీయ సర్వాధికారమును ఆంగ్లేయు లెట్లు వినియోగించిరి? ఆంగ్లేయపౌరుల రాజకీయ సర్వాధికారమును భారతీయు లెట్లు మొట్ట మొదటనుండియు నిరాకరించుచు వచ్చిరి? భారతరాజ్యాంగ పరిణామావస్థలను-ఆంగ్లేయ రాజకీయవేత్తల వాగ్దాన పరంపరలను స్థాళీపులాక న్యాయముగ పరీక్షించుచో, ఆంగ్లేయులు, ఆంగ్లేయపార్లమెంటు-వారికి సంక్రమించినదనుకొను ద్వివిధ సర్వాధికారముల నెట్లు వినియోగించినదియు సుబోధకము కాగలదు. భారతీయస్వాతంత్ర్య సంగ్రామ పరివర్తనమును-భారతీయ రాజకీయోద్యమము లను నొకింతగుర్తించుచో ప్రప్రథమమునుండియు భారతీయు లెట్లాంగ్లేయ సర్వాధికారమును నిరాకరించుచున్నదియును వ్యక్తముకాగలదు.

1 ధర్మాకర్తృత్వ మెట్లు నిర్వహింపబడినది

"పార్లమెంటుశాసనము ననుసరించి, రాజనీతిని నిరూపించుటకును, పరిపాలనకు సూచనలను గావించుటకును, తిరస్కరించుటకును, ప్రతి సమస్యమీదను మొట్టమొదటి మాటయు, తుదిమాటయుగూడ జెప్పుటకును రాజ్యాంగ కార్యదర్శిమూలకముగ నాంగ్లేయమంత్రివర్గమున కెవరును తొలగింపజాలని

1 See. Dicy. Law of Constitutions. P. 71. Seventh Edition.

యధికారము గలదు. మరేవిధమునగాని సర్వాధికారమునే హిందూదేశ ప్రభుత్వముపై, సీమప్రభుత్వము గలిగియున్నది." హిందూదేశముపై సీమ ప్రభుత్వమునకుగల సర్వాధికారము నీరీతిగ లార్డుమార్లేగారు నిర్వచించియుండిరి. (Lord Morely) ఈ సర్వాధికారమును సీమప్రభుత్వము చెలాయించుట యనగా సీమప్రభుత్వమునకెన్నికదారులగు ఆంగ్లేయపౌరులే చెలాయించుట యగును. అపరోక్షముగ గల యీ మహాభారము నాంగ్లేయపౌరులు సక్రమముగ వహింపగలిగిరా? 1853 వ సంవత్సరశాసనము గావింపబడినపుడు జరిగిన ప్రభువుల విచారణసంఘు సముఖమున మల్లుగారొసగిన సాక్ష్య మిచ్చట గమనింపదగియున్నది. అధినివేశరాజ్యాంగములకును — హిందూదేశరాజ్యాంగమునకును విశేషతారతమ్యముండుట యత్యావసరమని మల్లుగారు తలంచిరి. అధినివేశ రాజ్యాంగములలో ప్రజాప్రతినిధులతోగూడిన సభలున్నవనియు — ఆసభలే ప్రభుత్వపరిపాలనపై వలయు పెత్తనమును వహింపగలవనియు — పార్లమెంటువారి పెత్తనముతో నిమిత్తములేకుండగనే అచ్చట ప్రభుత్వనిర్వహణము కాగలదనియు మల్లుగారి తలంపు. హిందూదేశమునందిట్టి ప్రజాప్రతినిధిసంస్థలు నెలకొల్పబడుటకు వూనుకొననందున హిందూదేశప్రభుత్వముపై సీమలో పెత్తనము వహింపబడుటకు వలయు సాధనోపాయము లరయుట అత్యావసరమనియు మల్లుగారు నుడివిరి. "ఒక దేశమునందలి ప్రజాభిప్రాయము మరియొక దేశమునందలి సుపరిపాలనమున కెంతమాత్రమును హామీ కాజాలదు. ఏ దేశ సుపరిపాలనకైనను ఆ దేశమునందలి ప్రజాభిప్రాయమే సక్రమమగు హామీ. హిందూదేశ ప్రజలనుగురించియు, హిందూదేశ పరిస్థితులనుగురించియు, సీమ ప్రజలకు సరియగు పరిచయము లేదు. హిందూదేశప్రజల ప్రయోజనమును గురించి యోచించవలయునని తలంచరు. ఇందువల్ల హిందూదేశప్రభుత్వ సుపరిపాలనముపట్ల సీమప్రజలకుగల యభిప్రాయమున కేమియువిలువలేదు. ఎప్పుడైనను సీమప్రజలు హిందూదేశవ్యవహారములలో జోక్యము కలిగించుకొనుచుండినచో, అందులకు హిందూదేశముతో సంబంధముగల ఆంగ్లేయుల ప్రోత్సాహమే కారణము. కాని హిందూదేశ ప్రజల ప్రోత్సాహమువల్ల మాత్రముకాదు."

2
హిందూదేశము. ఆంగ్లేయ రాజకీయ పక్షములు—

ఇందుల కాంగ్లేయ రాజకీయపక్షములు హిందూదేశవ్యవహారములపట్ల జూపుచున్న సవతితల్లి ప్రేమయే యుదాహరణము. హిందూదేశ వ్యవహారము లాంగ్లేయ రాజకీయ పక్ష కార్యక్రమమునం దెన్నడును చేర్చబడి యుండలేదు. హిందూదేశ రాజకీయములు సీమ రాజకీయ పక్ష వ్యవహారములయం దెన్నడును జేర్చబడరాదని అన్ని రాజకీయ పక్షములు నంగీకరించియే వ్యవహరించుచున్నవి. సీమ రాజకీయ పక్షవ్యవహారములలో భాగముగ హిందూదేశవ్యవహారములు చేర్చబడిననాడు పార్లమెంటులో జరుగు చర్చలవల్లనే హిందూదేశమును కోల్పోవలసి వచ్చునని గత శతాబ్ద ప్రారంభమునందు సర్ ఛార్లెసు మెటకాఫ్‌గారు నుడివియుండిరి. 1 ఆంగ్లేయ రాజ్యపరిపాలకులు, సివిలుసర్వీసు ఉద్యోగస్థులు, రాష్ట్రములగవర్నరులు, హిందూదేశ వ్యవహారములలో పార్లమెంటు జోక్యము కలిగించుకొనుటను సహింపజాలరనుటయే మెటకాఫ్‌గారి వాదమునకు కారణము. వైస్రాయిలు గూడ నీయభిప్రాయమునే వెల్లడించుచుండెడివారు. లార్డుకర్జనుగారు వైస్రాయిగా మరల హిందూదేశమునకు బయలువెడలుతరుణమున తిన్న పార్లమెంటు పద్ధతులయందుగల, అమితప్రేమకు నిదర్శనముగ బాధించవలదని ఆంగ్లేయ సభికుల. కుపన్యసించియుండెను. 2 "కాని, సీమవారి ప్రస్తుత రాజకీయ పక్ష విధానము ననుసరించి, వారివారి పక్ష దృక్పథములతో హిందూదేశ వ్యవహారముల బరీక్షింపకుండ నుండుటయు, పార్టీపద్ధతిని హిందూదేశ వ్యవహారముల పట్ల ఓటుచేయకుండ నుండుటయు దుస్తరము." అని మితవాదనాయకులగు సర్. మోచర్ల రామచంద్రరావుపంతులుగారివంటి రాజకీయవిజ్ఞానులు 1917 వ సంవత్సరమువరకును విశ్వసించుచునే యుండెడివారు. కాని, యీవిధముగ హిందూదేశ వ్యవహారములు సీమ రాజకీయకక్షులవారు, తమపక్ష కార్యక్రమముగ 1858 నుండి 1945 సంవత్సరమువర కెన్నడును గ్రహించి యుండలేదు. ఏరాజకీయపక్షపు ఎన్నికల కార్యక్రమములోగాని హిందూదేశ వ్యవహారములు ప్రాముఖ్యస్థానమైనను వహించియుండలేదు. హిందూదేశ వ్యవహారముల

1. See. P. 84. Indian Polity. by Mr. M. Ramachandra Rao.
2. Quoted by Mr. M. Ramachandra Rao (Afterwards. Sir See. P. 84. Iidian Polity).

చర్యవల్ల, లేక, రాజనీతివల్ల సీమప్రభుత్వ మంత్రివర్గమెప్పుడును ఓడించబడి యుండలేదు. ఏరాజకీయపక్ష మధికారము వహించియున్నను అన్నిరాజకీయ పక్షము లేదోయొక విధముగ నేకీభవించియే హిందూదేశముపట్ల వ్యవహరించుట పరిపాటయినది. ఆంగ్లేయ రాజకీయములయందు హిందూదేశమునకుగల నిజమగుస్థాన మిదియే. పార్లమెంటునందుగల వ్యతిరేకపక్షములైనను—సీమ వ్యవహారములలో పార్లమెంటునందు జోక్యముగలిగించుకొనిన రీతిగ, విమర్శించినరీతిగ హిందూదేశ వ్యవహారములను ముఖ్యములుగ గణించి విమర్శించియైన నుండలేదు. ఇందులకాంగ్లేయ రాజకీయ వేత్తల సమాధానమేమి?

1
పార్లమెంటు సభ్యులందరు భారతదేశప్రతినిధులే.

పార్లమెంటునందుగల సభ్యులందరునుగూడ భారతదేశ పక్షమున ప్రాతినిధ్యము వహించుచుండుటచే వివిధరాజకీయపక్షముల ప్రత్యేక కార్యక్రమమునందు భారతదేశ వ్యవహారములు చేర్చబడుచుండుటలేదని కొందరాంగ్లేయ రాజకీయ వేత్తలవాదము. ఐర్లండుదేశమున కొకప్పుడు పార్లమెంటునందు ప్రాతినిధ్యముండెడిది. ఆవిధముగ హిందూదేశమునకెన్నడును పార్లమెంటునందు ప్రాతినిధ్యమొసగియుండలేదు. పార్లమెంటుసభ్యులకు హిందూదేశ వ్యవహారములన్న నేమియును దెలియదు. "హిందూదేశ వ్యవహారములన్న పశ్చిమోత్తర పరగణాలని కొందరు పార్లమెంటు సభ్యులతలంపు. లేదా పెర్షియాయనుతలంపు. మరికొందరికి దూదిబట్టలు, లేక, మట్టిపాత్రలనియు తలంపు. హిందూదేశ రాజ్యాంగనీతియు, విధానమును చాలమంది పార్లమెంటు సభ్యులకు సీలుచేసి మూసివేయబడిన పుస్తకమునంటివి."1 ఎవరైనను హిందూదేశ వ్యవహారములను గురించి పార్లమెంటులో తలపెట్టియుండినచో అందులకు రెండేకారణములు. (1) హిందూదేశముపట్ల సానుభూతిగలిగియుండుట—లేక—హిందూదేశపు సివిలుసర్వీసువారితో సంబంధమును గలిగియుండుట. హిందూదేశముపట్ల సానుభూతితో వర్తించినవారిలో ఎడ్మండుబర్కు—పిట్టు—పాక్సు షేరిడాను—మెకాలే, హెన్రీమెయిను—బ్రైటు—ఫాసెట్టు మొదలగువారిని మితవాద రాజకీయవేత్తలు కొందరు విశ్వసించుచుండెడివారు. నవీనచరిత్ర

1. See Indian Polity. P. 86. Sir M. Ramachandra Rao.

పరిశోధనలవల్ల పిట్టు, మెకాలే మొదలగువారు భారతదేశముపట్ల జూపిన సానుభూతిమరుగున సామ్రాజ్యతత్వ మిమిడి యున్నదని తెలిసను కొండ రాంగ్లేయ రాజకీయవేత్తలు సుహృద్భావముతోనే వర్తించియుండిరనియు నంగీకరింపక తప్పదు. హిందూదేశమునం దుద్యోగములుజేసి గౌరవభృతులనుగొన్న కొందరకు హిందూదేశ వ్యవహారములపట్ల అసత్యప్రకటనమును గావించుటయే వృత్తి యైనది. హిందూదేశ వ్యవహారములు పార్లమెంటునందు చర్చించునప్పుడు ఖాళీ బల్లలుండుటయే ఆచార మైనది. చాలమంది సభ్యులప్పుడు తమకు సంబంధము లేని విషయముగ భావించి లేచి వెళ్ళిపోవుటయు పరిపాటి. సీమదేశము నందలి భారతదేశకాంగ్రెసు సంఘశాఖ యొకప్పుడు హిందూదేశ వ్యవహారము లను గురించి పార్లమెంటుసభ్యులకు ప్రబోధముజేయ సంకల్పించియుండెను. కాని, యీప్రయత్నము విఫలమైనది.[2]

"గత అర్థ శతాబ్దమునుండియు పార్లమెంటునందు హిందూదేశమును గురించి గావింపబడిన చర్యలను పరీక్షించుచో హిందూదేశమునందు పనిజేయు చున్న ఆంగ్లేయోద్యోగుల కదనపు సౌకర్యములొనగూర్చుటకే పార్లమెంటు వారి దృక్పథము ప్రసరించినదని సామాన్యముగ జెప్పవచ్చును. బ్రిటిషుదీవుల యందలి వర్తకుల ప్రయోజనమును పెంపొందించుటకుగూడ పార్లమెంటు తన దృష్టిని ప్రయోగించిన దనదగును. హిందూదేశప్రజల ఆర్థిక, నైతిక, సాంఘి కాభివృద్ధుల కవసరమగు విషయములు పార్లమెంటువారి దృష్టి నాకర్షించి యుండలేదు. పార్లమెంటు వెనుకటివలెగాక హిందూదేశ వ్యవహారములపట్ల ముందు ఎక్కుడు దృష్టిని నిగుడ్చుచో అది అత్యాశ్చర్యకరవిషయ మగును." అని సర్. మోచర్ల రామచంద్రరావు పంతులుగారివంటి స్వచ్ఛందమితవాది 1917లో తమ పుస్తకమునందు వ్రాసియుండిరి. ఈవిషయ మాద్యంతము యదార్థము.

బ్రిటిషుసామ్రాజ్యమునందలి వివిధజాతులకు స్వపరిపాలన మొసగవలయు నని 1902 లో పార్లమెంటునందొక తీర్మానము ప్రవేశపెట్టబడినది. ఈ తీర్మా నము నుపపాదించుచు నుపపాదకు డొసంగిన యుపన్యాసము గమనీయము.

2. See. P. 87. Sir, M. Ramachandra Rao.

"ఆంగ్లేయ సామ్రాజ్యమునందుగల అస్వాతంత్ర్యదేశములలో పెద్దదియు, ముఖ్యమయినదియు నగు భారతదేశ వ్యవహారములు, ప్రతి సంవత్సరమును ఒక మధ్యాహ్నకాలమునందే పరిసమాప్తి చెందుచున్నవి. ఇది, ఆంగ్లేయజాతికి గౌరవప్రదముకాదు." "హిందూదేశమునందు పన్నులనిచ్చువారు నిస్సహాయులై యున్నారు. వారికి వారిదేశపరిపాలనమునం దెంతమాత్రమును జోక్యము లేదు. సీమయందలి పార్లమెంటు సక్రమమగు జోక్యమును గలిగించుకొనుచో సహకారిగ నుండెడిదేమో? అట్లెన్నడును జరిగియుండలేదు. హిందూదేశ ఆదాయ వ్యయపత్రము పార్లమెంటులో నాచారము ననుసరించి ఆగష్టులో ప్రవేశబెట్టబడుచుండెడిది. హిందూదేశమునం దీ ఆదాయవ్యయ శాసనము మార్చినెలాఖరునుండియే ఆచరణయందుండెడిది. ఆచరణయందున్న ఆర్థికపత్రమాచారానుసారము ప్రవేశపెట్టబడినప్పుడైనను హిందూదేశ వ్యవహారములను పార్లమెంటు సభ్యులు శ్రద్ధాభక్తులతో కనుగొనదలంచిరైనను మెరుగరు. ఈ ఆర్థికపత్రముగూడ పార్లమెంటు సభాసమావేశము పూర్తియగునప్పుడే పార్లమెంటునకు సమర్పింపబడుచుండెడిది. ఏపార్లమెంటు సభ్యుడుగాని ఎప్పుడుగాని ఆర్థికపత్రముపట్ల, లేక, మరేవిషయముపట్లను శ్రద్ధను జూపి మెరుగడు.

"ఈవిధముగ బుద్ధిపూర్వకముగను, అంతరాయములేకుండగను హిందూదేశవ్యవహారముల శ్రద్ధపాలుచేయబడుచుండుట హిందూదేశభక్తులగు పార్లమెంటు సభ్యులకు కొందరకు కష్టముదోచుచుండెడిది. గత అరశతాబ్దము నుండియు ప్రతిసంవత్సరమును పార్లమెంటునందు జరిగిన చర్యలను పరీక్షించుచో హిందూదేశ ఆర్థికపత్రమును పార్లమెంటునకు సమర్పించిన విధానవిమర్శనలు గోచరించుచున్నవి.

2
పౌలరుగారి
విమర్శనము
1873.

మొట్టమొదటగ 1873 లో ఆర్. ఎస్. పౌలరుగారీవిధముగ విమర్శించియుండిరి. "హిందూదేశ ఆదాయ వ్యయములను తెలుపుపత్రము పార్లమెంటుసావకాశముగ విమర్శింపగలిగిన తరుణమునందే పార్లమెంటునకు సమర్పింపబడవలయును. అని పౌలరుగారు తీర్మానము నుపపాదించిరి. "కంపెనీ పరిపాలనమునుండి హిందూదేశ ప్రభుత్వము సీమ

ప్రభుత్వమువారి దక్షతక్రిందకు తీసికొని రాబడుచో పార్లమెంటుసభ హిందూ దేశ వ్యవహారములపట్ల విశేషశ్రద్ధను జూపగలుగును.” అని యానాడు పార్లమెంటునందుగల ప్రభుత్వపక్ష నాయకుడును, వ్యతిరేకపక్ష నాయకుడునుగూడ జెప్పియుండిరి. ఈవిధముగ, నాడు పార్లమెంటునాయకు లొనరించిన వాగ్దానము అధికసంఖ్యాకులగు పార్లమెంటుసభ్యులచే నామోదింపబడిన వాగ్దానము నేటి కెంతవరకు నెరవేర్చబడినది? ఇంతకుముందు పార్లమెంటు సభాసమావేశ సమాప్తికాలమునందే భారతదేశ ఆర్థికపత్రము పార్లమెంటునకు సమర్పింపబడు చుండెడిది. చక్రవర్తిగారికి రాజ్యాధికారము సంక్రమింపచేయబడిన పిమ్మట వెనుకటివలెగాక నూతనవిధాన మాచరింపబడునని తలంచుట సమంజసమే. కాని, సం॥ 1856–1870 ల మధ్యగల కాలములో ఆర్థిక పత్రసమర్పణకాలమును పరీక్షించుచో పార్లమెంటు సభాసమాప్తకాలమునందే ఆర్థికపత్రమును ప్రవేశబెట్టు నాచారమే నేటికిని కొనసాగింపబడుచున్నదని రుజువగును.” ఈదిగువ పట్టికను పరిశీలించినచో పార్లమెంటున కార్థికపత్రము సమర్పింపబడిన తేదీయు-పార్లమెంటుసభ సమాప్తమయిన తేదీయు వీటి రెంటికిని మధ్యగల కాలపరిమితి యును బోధపడగలవు.

## పార్లమెంటులో

| హిందూదేశ ఆర్థికపత్రము ప్రవేశబెట్టిన తేదీ | పార్లమెంటు సభా సమాప్తమయిన తేదీ | ప్రవేశపెట్టబడు తేదీకిని-సమాప్తమగు తేదీకిని మధ్యగల కాలపరిమితి |
|---|---|---|
| 1859 - 8 - 1 | 1859 - 8 - 13 | 12 రోజులు |
| 1860 - 8 - 12 | 1860 - 8 - 28 | 15 ,, |
| 1861 - 7 - 25 | 1861 - 8 - 6 | 12 ,, |
| 1862 - 7 - 17 | 1862 - 8 - 7 | 21 ,, |
| 1863 - 7 - 23 | 1863 - 7 - 28 | 5 ,, |
| 1864 - 7 - 21 | 1864 - 7 - 29 | 8 ,, |
| 1865 - 7 - 29 | 1865 - 8 - 6 | 8 ,, |

| హిందూదేశ ఆర్థికపత్రము ప్రవేశపెట్టిన తేదీ | పార్లమెంటు సభాసమాప్తమయిన తేదీ | ప్రవేశపెట్టబడు తేదీకిని- సమాప్తమగు తేదీకిని మధ్య గల కాలపరిమితి | |
|---|---|---|---|
| 1866 - 7 - 19 | 1866 - 7 - 31 | 12 | ,, |
| 1867 - 8 - 12 | 1867 - 8 - 21 | 9 | ,, |
| 1868 - 7 - 27 | 1868 - 7 - 31 | 4 | ,, |
| 1869 - 8 - 3 | 1869 - 8 - 11 | 8 | ,, |
| 1870 - 8 - 5 | 1870 - 8 - 10 | 5 | ,, |

ఈవిధముగ హిందూదేశ ప్రభుత్వ ప్రాముఖ్యవిషయమగు ఆర్థికపత్రము పట్లనే పార్లమెంటు శ్రద్ధయనునది జూపించి యెరుగదు. "హిందూదేశ ఆర్థిక వ్యవహారము ప్రస్థుతస్థితి ననుసరించి, రాబోవు పార్లమెంటుసభలో విచారించుటకై యొకయుపసంఘమును నెలకొల్పదగును. హిందూదేశ ఆర్థికపత్రము సభాసమాప్తికాలమందు సమర్పించుచుండుట శోచనీయము." అనుతీర్మానమును 1870 లో సమర్పింపబడిన ఆర్థికపత్రముపై ఫాకెట్టుగా రుపపాదించియు నుపసంహారించుకొనిరి. (Mr. Fawcett). ఈపరిస్థితులపై ఫౌలరుగారు యదార్థమును ప్రకటించిరి. "ఈవిధముగ ప్రాముఖ్యవిషయచర్చ కట్టకడపటివరకును నిలిపివేయుచుండుట కామన్సు సభావ్యవహార నిర్వాహణమునకు గౌరవప్రదము కాజాలదు. ఈసభయందలి సభ్యులు హిందూదేశ ప్రజలధర్మకర్తలు. ఈ ధర్మకర్తృత్వము ననుసరించియైనను హిందూదేశప్రయోజనమును సంరక్షించుట సీమవారివిధి. హిందూదేశ వ్యవహారములు పార్లమెంటుసభ అలసిసొలసిపోయిన సమయములయందు, సభాసమాప్తికాలమున విమర్శింపబడ జూచుట పార్లమెంటునకగౌరవకారణము. నిందాకరము. హిందూదేశప్రజలు తమవ్యవహారములపట్ల పార్లమెంటుసభ యెక్కుడు గౌరవమును జూపదగునని తలంచెదరు. సీమప్రభుత్వము హిందూదేశవ్యవహారముల నశ్రద్ధతో జూడవలయునను ఆత్మహత్యాకరమగు నీతినే కృతనిశ్చయముతో కొనసాగించుచున్నదని భారతీయులు తుదినిర్ణయమునకు వచ్చెదరు."

3 ఫాలరుగారి తీర్మానము.

ఇట్టి విమర్శనలుగూడ పార్లమెంటునం దరణ్యరోదనమే అయినవి. 1883 లో తిరిగి ఫాలరుగారు 1873 లో నుప పాదించిన తీర్మానమువంటి తీర్మానమునే పార్లమెంటునం దుపపాదించిరి. 1873 - 1883 వరకును మధ్యగల దశ యందైనను పరిస్థితులు సక్రమముగ మారియుండలేదు.

| | | |
|---|---|---|
| 1873 - 7 - 31 | 1873 - 8 - 5 | 5 రోజులు |
| 1874 - 8 - 3 | 1874 - 8 - 7 | 4 ,, |
| 1875 - 8 - 9 | 1875 - 8 - 13 | 4 ,, |
| 1876 - 8 - 10 | 1876 - 8 - 15 | 5 ,, |
| 1877 - 6 - 21 | 1877 - 8 - | 0 ,, |
| 1878 - 8 - 13 | 1878 - 8 - 16 | 3 ,, |
| 1879 - 5 - 22 | రెండుసార్లుచర్చనిలుపుజేయ బడినది. | కొంచెము వ్యవధి యొసగబడినది. |
| 1880 - 8 - 17 | సభాసమాప్తికి మూడువార ములు ముందుగ — | వ్యవధి బాగుగ గలదు. |
| 1881 - 8 - 21 | 1881 - 8 - 27 | 6 రోజులు |
| 1882 - 8 - 14 | 1882 - 8 - 18 | 4 ,, |

ఈ విధముగ పార్లమెంటుసభ తన యశ్రద్ధను విడువకుండ కొనసాగింప సాగినది.

"ఈదుర్న్యయమును విరమించుటకై చేయగలిగిన దేమియునులేదా? యని నిస్పృహతో ఫాకెట్టుగారు సీమప్రభుత్వమునకు పార్లమెంటు సభాసముఖమున మొరబెట్టుకొనియుండిరి. "ఈపద్ధతివల్ల పార్లమెంటు హిందూదేశ వ్యవహారము లలో గలిగించుకొనవలసినంత జోక్యమునుగలిగించుకొనక పోవుటయేకాక, కంపెనీ వారి నుండి హిందూదేశ ప్రభుత్వమును తీసికొనినప్పుడు, ఆంగ్లేయప్రముఖులు గావించిన వాగ్దానములన్నియు భగ్నమొనర్పుటయుగూడ నగును. పార్ల

మెంటున కితరప్రాముఖ్య వ్యవహారములున్నననుట నిజమేయయినను, హిందూ దేశ ప్రజలపట్ల కామన్సుసభ వారికి మహానిధియు నొకటికలదని తలంపకతీరదు.'' అని ఫౌలరుగారు సీమప్రభుత్వమును హెచ్చరించిరి.

4 క్లాడువెల్లుగారి తీర్మానము. 1899.

ఈ హెచ్చరిక చెవిటివానియొద్ద నూదినశంఖమైనది. మరి 15 సంవత్సరములకు పిమ్మట 1899 లో క్లాడువెల్లు గారు ప్రభుత్వమును విమర్శించుచు నొకతీర్మానమును పార్లమెంటు సభయం దుపపాదించిరి.

"ప్రస్తుత విధానము ననుసరించి పార్లమెంటు హిందూదేశ వ్యవహారములపై సక్రమముగ పెత్తనము నిర్వహించుటలేదు.'' అని క్లాడువెల్లుగారి తీర్మానము. హిందూదేశ వ్యవహారములపట్ల కామన్సు సభ్యులు శ్రద్ధవహించు చుండుట లేదని క్లాడువెల్లుగారు విస్పష్టముగ దెల్పియుండిరి.

ఈతీర్మానముపై సర్. విలియమ్ వెడ్డరుబరన్‌గారు నాడొసగిన యుపన్యాస సారము తుదివరకు హిందూదేశ వ్యవహారములపట్ల వర్తించుచున్నది.

"సర్. హెన్‌రీ ఫౌలరుగారు హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగ నున్నప్పుడు యీకామన్సుసభలోని సభ్యులందరును హిందూదేశప్రతినిధులేయని ప్రకటించియుండెను. ఈయభిప్రాయము సమంజసముగనే యున్నదని తలంచబడినది. ఇందువల్ల హిందూదేశముపట్లగల బాధ్యతను పార్లమెంటు సభ్యులు గుర్తించినట్లుగ నేను సంతసించితిని. కాని, యీరాత్రి యీఖాళీబల్లలను చూచినపుడు, ఆంగ్లేయప్రజలకు సంబంధించిన ముఖ్యవిషయములు నేడు చర్చింపబడనున్నచో నీవిధముగ ఖాళీబల్లలుండవని యంగీకరింపకతప్పదు. హిందూదేశ వ్యవహారము పట్ల వలయు పరీక్షాధికారమును నిర్వహించుటయందు, హిందూదేశ పరిస్థితులయందలి లోటులను చక్కజేయుటయందు నీసభ కృతార్థత జెందుచుండుటలేదు. ఈమాటలను నేను విషాదకరమగు స్వానుభవము ననుసరించి జెప్పుచున్నాను. గత ఆరుసంవత్సరములనుండియు హిందూదేశ వ్యవహారములపట్లగల హిందూదేశాభిప్రాయమును వినిపించప్రయత్నించుచు విఫలుడనగుచున్నాను. ఏవిషయమునంతుగాని, వ్యక్తిగతమైనను, సంఘపరమైనను

యావద్భారతదేశమునకును సంబంధించినదైననుగూడ, ఏలోటును చక్కదిద్దుట కీసభ సంకల్పించుటలేదు. ఈసభకు హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి బాధ్యుడనుమాట నిజమే. హిందూదేశవిషయ లోపములనుగురించి యోజించునపుడు రాజ్యాంగకార్యదర్శి న్యాయమూర్తివలె వర్తింపవలెనని తలంచబడుచున్నది. రాజ్యాంగ కార్యదర్శికి సీమ మంత్రివర్గమువారిబలము వెనుకనుండుటచే కామన్సు సభ కాయన యధికారియే యగుచుండెను. గాని సాకరుగానుండుటలేదు. న్యాయమూర్తిగ వ్యవహరించుటకు మారుగ హిందూదేశమును పరిపాలించుచున్న ఆంగ్లేయోద్యోగుల కూటమునకు ప్రతినిధిగ వ్యవహరించుచున్నాడు. సహజముగ, నీయుద్యోగులకూటము మీదనే నేరారోపణము చేయబడుచుండుటవల్ల, వీరిని సమర్థించినచో తానే హిందూదేశ పరిపాలనకు ముఖ్యుడయి యుండుటచే తనకీనిందగలుగునను తలంపుతో ఉద్యోగులకూటమునకు తోడ్పడుచున్నాడు. ఈయన ఇండియాసంఘము నందుండిమాత్రమే అన్నివిషయములను తెలిసికొనుచుండును. అందువల్ల ఏయుద్యోగస్థుని మీదనైనను, ఎవరైనను ఏనేరములనైన తెలియబరచుచో ఆయుద్యోగస్థులకే ఆవిషయము తెలుపబడి వారియభిప్రాయమును తెలిసికొనుచుండును. ఆయుద్యోగస్థులు నేరమును చేయలేదని తెలుపుటపాటి. అట్లు తెలిసినవెంటనే రాజ్యాంగకార్యదర్శియు నేవిధమగులోటును లేదని వెంటనే కామన్సుసభలో సమాధానము చెప్పుచుండును. అంతేగాని, ఏలోటును గురించిగాని, ఏనేరారోపణమునుగురించిగాని, విచారించుటకై ప్రత్యేకసంఘము నియమింపబడుటలేదు. హిందూదేశ వ్యవహారములు చర్చించునపుడు పార్లమెంటుసభ్యులు తమస్థానములను వీడిపోవుటచే బెంచీలన్నియు, ఖాళీయయినదృశ్యము పత్రికల కాహ్లాదకరముగనే యున్నది. తృప్తినే వెల్లడించుచున్నవి. తమ విధిని గుర్తించలేక పోయినట్టి సభ్యులను మందలించుటకు మారుగ పత్రికలు హిందూదేశ వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుచున్న కామన్సు సభ్యులను మూర్ఖవాదులనియు, వినేవారులేకపోయినను ఉపన్యసించెడి వెఱ్ఱులనియు, పేరుపెట్టుచున్నవి. హిందూదేశ వ్యవసాయదారుని చిరకాల దుర్భిక్షస్థితిని గురించిన వాదము హేళనగా వినదగిన విషయముగా వీరు తలంచుటయే యిందులకు కారణము.” వెడ్డరుబరనుగారి యీవాక్యములు సువర్ణాక్షరములతో ముద్రింపదగినవి.

5 హారువుడ్డు గారి విమర్శనము

కామన్సు సభికుడగు హారువుడ్డుగారుకూడ తీవ్రముగు నాత్మావలోకనము గావించిరి. "మానవప్రపంచము నందలి నాల్గవవంతు జనసంఖ్యగల హిందూసామ్రాజ్యమును నిరంకుశోద్యోగుల ప్రభుత్వమున కప్పగించివేయుట తగినపనియేనా? వివేకవంతమైన కార్యమేనా? ఈనిరంకుశప్రభుత్వవిధాన మెంతటి మంచిదియైనను, సమర్థతగలదైనను, నాగరికతగల, సీమప్రభుత్వము హిందూదేశ సామ్రాజ్యమునుగురించి అశ్రద్ధవహించుట వివేకము కాజాలదు. హిందూదేశవ్యవహారచర్య యొక్క ప్రశాంతమగు తమాషా యని పత్రికలు వ్రాయుట శోచనీయము. అది ప్రశాంతముగ నుండుట గౌరవప్రదము కాదు. తమాషా యనుట కది వింతలు, వేడుకలు గల హాస్యవిషయమును గాదు. అది తమాషా గాదు. తలంచుకొనినపుడు సిగ్గగుచున్న యొక్క మహావిషాదాంత వృత్తాంతము. హిందూదేశమునుగురించి విశేషముగ నటించుచు నత్యల్పముగ శ్రద్ధవహించుట నగుబాటు పనియే. పార్లమెంటునకు సంబంధించినంతవరకు హిందూదేశమునకు బాధ్యతాయుత పరిపాలనము లభింపకుండ జేయుటకై గావింపబడుచున్న ప్రయత్నమిది యని హారువుడ్డుగారు దెల్పిరి.[1]

ఈవిధముగ ఆంగ్లేయ ప్రజాస్వామిక ప్రభుత్వము హిందూదేశముపట్ల తన ధర్మకర్తృత్వము నెన్నడును సక్రమముగ నిర్వహించియుండలేదు. భారత దేశమునందలి రాజకీయాందోళన పరిణామావస్థల బరీక్షించినచో ఆంగ్లేయ ప్రభుత్వము తన ధర్మకర్తృత్వము నెట్లు దుర్వినియోగము జేసినదియుగూడ సుబోధకము కాగలదు. భారతదేశమందలి రాజ్యాంగపరివర్తన ఘట్టములన్నియు భారతీయుల జాతీయస్వాతంత్ర్యేచ్ఛ నణగద్రొక్కజాలక ఆంగ్లేయులు భారతీయుల నూరడించుటకై వేసిన యెత్తులని చెప్పుట సాహసము కాజాలదు. 1853 వ సంవత్సరమునందే పార్లమెంటుసభ భారతరాజ్యాంగ శాసనమును గావించినది. అయిదుసంవత్సరములు ముగియుటకుపూర్వమే తిరిగి మరొక రాజ్యాంగశాసనము నేల గావింపవలసి వచ్చినది? అంతవరకును, తెరమరుగున నున్న పార్లమెంటు సభ నాడే బహిరంగముగవచ్చి సర్వాధికారము నేల వహించవలసి వచ్చినది?

1. Quoted by Sir M. Ramachandra Rao in his Indian Polity P. 90-95.

కుంపెనీ పరిపాలన నంతమొందుటకు పార్లమెంటువారి సుహృదయత్వమే కారణమనుటకంటె నాడు భారతీయులు సల్పిన ప్రథమభారత స్వాతంత్ర్యసంగ్రామమే కారణమనుటయే ముమ్మాటికిని సత్యము.

6 లార్డు కానింగు జోశ్యము

ఈస్టిండియాకంపెనీ యాధిపత్యము నందలి కడపటి గవర్నరుజనరలు ఛార్లెసు, జాను, విస్కవుంటు కానింగు. ఈయన 1857-1862 సంవత్సరముల మధ్య హిందూదేశమును పాలించియున్నాడు. ఈకానింగుగారి కాలముననే హిందూదేశచరిత్రయం దొక నూతనఘట్ట మారంభమైనది. ఈయన హిందూదేశమునకు వచ్చునప్పుడే సీమయం దీయన గౌరవార్థ మొసగిన విందునందనిన మాటలు జోస్యమై భవిష్యత్తును సూచించినవి. "ప్రశాంతియుతమగు నుద్యోగ కాలము నాశించుచున్నాను. కాని, హిందూదేశ గగనమండలమున నొక చిన్న మేఘము పొడసూపవచ్చును. ఇది నేడొక హస్తప్రమాణముగమాత్రమే యుండవచ్చును. అయినను, దినదిన ప్రవర్ధమానమై మహామేఘమై ప్రళయాభ్రమై బద్ధలై మనవినాశనహేతువు కావచ్చును." ఈవాక్యములు యదార్థములైనవి. ప్రథమస్వాతంత్ర్య సంగ్రామ ముప్పతిల్లినది. ఈవాక్యముల ననుసరించి కానింగుగారు సీమను వీడుటకు బూర్వమే భారతవర్షమునందు విప్లవ చిహ్నములు గోచరించుచునే యున్నవని తేలును.

3 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామము

"భారతస్వాతంత్ర్య సంగ్రామమును గురించిన సత్యమును స్వేచ్ఛతో భారతీయులు వ్రాయుట క్షేమకరముగనుండుట లేదు. ఈవిషయము నిశ్చయముగ ముఖ్యమైనది. పక్షపాతములేక విమర్శింపదగినది. అందువల్ల ఆంగ్లేయులీవిషయమై యొసగిన యభిప్రాయములనే పరిగ్రహించి సంతృప్తులము కావలసియున్నది." 1

"భారతీయులందర సంతృప్తులైయుండిరి. ఈఅసంతృప్తికి తగినంత హేతువున్నది. అరడజను తిరుగుబాటులకు సరిపడినంత విరోధభావ మున్నది...

1. See B.D. Basu, Rise of the Christian Power in India. P. 935. Second Edition.

సివిలుసర్వీసు ఉద్యోగస్థుల లాభముకొరకు హిందూదేశము శోషింపదగిన దేశమను సిద్ధాంతమే అంతకును మూలము. ఇంతవరకు నేదృక్పథమున హిందూదేశమును మనము జూచితిమో ఆదృక్పథముననే అనగా, ఇంగ్లీషు ఉద్యోగులు కొల్లగొట్టుకొనుటకుమాత్రమే తగినస్థలముగా, యింకనుజూచినచో మనము హిందూదేశమును గోల్పోవుట నిశ్చయము. గోల్పోవుటకే మన మర్హులమగుదుము.'' అని డ్రమెంసుగారు పార్లమెంటుసభయం దుపన్యసించిరి.1 "ఇంగ్లీషు పరిపాలనము హిందూదేశస్థుల ఆమోదమును బొందుచున్నదని గ్రుడ్డిగా నుండదలచిన గ్రుడ్డివాండ్రు దప్ప యితరులెవరును చెప్పజాలరు.''2

"దురభిప్రాయము నభివృద్ధి జెందించుటకు తగిన కారణములున్నవని పరిస్థితులు నాకు రుజువుజేసినవి. ఈద్వేషము వ్యక్తిగతముగాదు. ఇది జాతీయ ద్వేషము......'' అని మల్లిసనుగారు తిరుగుబాటును గురించివ్రాసిరి. 3

1 సంగ్రామ కారణములు

సిపాయీల తిరుగుబాటునకుగల కారణములిట్లు క్రోడీకరింపబడుచున్నవి. (1) భూమిశిస్తు నిర్ణయము దుర్భరమై రైతులు దివాళా తీయునట్లుగ నుండుట. (2)న్యాయ పరిపాలన అసమర్థతతో గూడియుండుట. (3) ప్రభుత్వ పరిపాలనయందు భారతీయుల కర్హస్థానములేకుండుట. (4) దేశీయభాషలు తెలియకుండుట. దేశీయులపట్ల ఆంగ్లేయులు విద్వేషభావము గలిగియుండుట. (5) విద్య, మతము, మిషనరీలచర్యలు. (6) కులము. (7) పత్రికాస్వాతంత్ర్యము. (8) నాణెములుచెలామణి సక్రమపద్ధతిని లేకుండుట. (9) నల్లమందువర్తకము. (10) ప్రజోపయోగకరములైన కట్టడముల నశ్రద్ధజేయుట. (11) ఆంగ్లేయుల లాభమునకై అవలంబింపబడిన నిర్బంధవిధానము. (12) స్వదేశరాజ్యముల నాక్రమించుకొనుచుండుట. (13) హిందూధర్మశాస్త్రానుసారముగ గల వారసత్వపుహక్కులను త్రోసిపుచ్చుట. (14) సతారా, నాగపూరు, కర్నాటక,

1. See Mr. Drummond's speech on the Govt. of India June 7th 1858.
2. Says another English writer quoted by Mr. B. D. Basu. P. 955. Second Edition.
3. See The Indian Mutiny of 1857. Colnel G. B. Malleson C. S. i. Page Viii.

ఝాన్సీ, తంజావూరు, అయోధ్య, మొదలగు స్వదేశసంస్థానములను నాశన మొనరించుట. (15) వంగదేశ సైన్యపరిస్థితులు, శిక్షణతగ్గుట, సైనికోద్యోగుల నితర యుద్యోగశాఖలలోనికి మార్పివేయుట, ఆంగ్లేయసైనికుల మందకొడి-భారతీయసైనికుల యసంతృప్తి, కొవ్వుతూటాలు. (16) మహమ్మదీయుల కుట్ర. (17) విదేశీయుల కుట్రలు-పెర్షియా, రష్యాలకుట్రలు. 1

ఈకారణములన్నియు నిజమైనవని గ్రహించినను యిందుకొన్ని కారణములే సత్యములైనవని విశ్వసింపబడినను సిపాయీలతిరుగుబాటునకు జాతీయ స్వాతంత్ర్యకాంక్షయే కారణమని తేలగలదు.

అపజయ కారణములు[2]

(1) ఈసంగ్రామమునందు సిక్కు- లాంగ్లేయులయెడ హృదయ పూర్వకముగుభక్తి విశ్వాసములనుగలిగి ప్రవర్తించి యుండిరి. (2) దోస్తు మహమ్మదు ఆంగ్లేయులతో గావించుకొనిన ఒడంబడిక ననుసరించి నిశ్చయముగ నాంగ్లేయుల పక్షము వహించియుండెను. (3) మదరాసు సేన లీతిరుగుబాటులో నెంతమాత్రమును జోక్యమును గలిగించుకొని యుండలేదు. (4) బొంబాయిసేనలుగూడ నిట్లే ఉత్తరహిందూస్థానపు సిఫాయిలకు తోడ్పడకుండ చేతులుముడుచుకొనియుండిరి. (5) సర్. డెంకరురావు గ్వాలియరు హైదరాబాదు నవాబగు సర్. సాలారు జంగును యీసంగ్రామము జరిగిన రెండుసంవత్సరములును ఆంగ్లేయుల పక్షమున భారతీయసేనలతో పోరాడియుండిరి. (6) ఆంగ్లేయులపక్షమున భారతీయసేనల నెదుర్కొనిన లారెన్సు—జేటురాము, హేవలక్, నైకలుసను, నీలు, ఎర్వర్డు, మొదలగువా రతిక్రూరముగను, అపినీతికరముగను, రోషావేశముతోగూడిన పౌరుషముతోను పోరాడియుండిరి. (7) ఈతిరుగుబాటునకు కారకులైన వారందరియం దేకైక స్వాతంత్ర్య సంపాదనాదర్శ మున్నప్పటికిని, హిందూమహమ్మదీయ నాయకులలో పరస్పరవిశ్వాసము లేకపోవుటయు గూడ నొకకారణమని కొందరి చరిత్రకారుల విశ్వాసము. నానాసాహేబు మహారాష్ట్రపతాకము నెగురవేయవలయుననియు, మహమ్మదీయులు కృశించి

1. See. The Expansion of British India 1818—1858. Anderson and Subedar P. 116.

నశించిపోయిన మహమ్మదీయ సామ్రాజ్యమును తిరిగి పునరుద్ధరించుకొనవలయుననియు, తలంచియుండిరనియు కొందరి చరిత్రకారుల వాదము. రాణీ లక్ష్మీభాయియు తన రాజ్యముకొరకే పోరాడియున్నదనిగూడ ఆంగ్లేయచరిత్రకారులును, కొందరు భారతీయ చరిత్రకారులును గూడ వ్రాయ సాహసించిరి. 1 ఈ చరిత్రకారుల వ్రాతల కాధారములు గోచరించవు. హిందూమహమ్మదీయ పరస్పర అవిశ్వాస మొక కారణముగ నిరూపింపబడుటకు హేతువులు గోచరింపవు. యావద్భారత దేశమునందునుగల భారతసైనిక నివహంబులన్నియు నొక్కుమ్మడిగ తిరుగబడి యుండకపోవుట అపజయమునకు ప్రధానకారణముగ దోచుచున్నది. స్వదేశరాజులు దేశద్రోహులై ఆంగ్లేయుల కండగనిలుచుట — రెండవకారణ మనుటకు సందేహింప బనిలేదు. ఈ రెండు కారణములవల్లను ఆంగ్లేయులే విజయులైరి.

"ప్రజలను దరిద్రులనుగా జేయుచున్న ఆర్థికశోషణయు, రాజులు తమ రాజ్యభాగములను గోల్పోవుచుండుటయు, విదేశప్రభుత్వము స్థాపింపబడుచుండుటయు, ప్రజలలో నసంతృప్తిని యసహ్యతను గలిగించినవి. ఇందువల్ల సంభవించిన 1857 వ సంవత్సరపు తిరుగుబాటు విదేశదాస్యమును త్రోసివేయుటకై గావింపబడిన, ఆయుధములతోగూడిన స్వాతంత్ర్య సంగ్రామము. దీనికి నిస్సంశయముగ కొంత మతసంబంధమున్నది. అక్బరు, ఔరంగజేబుల వంశీకుడగు నామమాత్రపు ఢిల్లీపాదుషాయును, పూనాపీష్వాల వంశీకుడగు నాయనయు భారతీయ రాజ్యమును స్థాపించుటకై గావింపబడిన తిరుగుబాటునకు ముఖ్యులై యుండుటను బట్టిజూడ ప్లాసీయుద్ధము సం 1757 లో ముగిసిన నాటనుండియు నూరుసంవత్సరముల కాలములో దినదినాభివృద్ధి గావించుచు, గుట్టపడియున్న కృత్యములుమాత్రమే కారణముగాక, మానవ హృదయాంతరాళములయందు అన్ని దేశములలోను - అన్నిసంఘములలోను, స్వజాతీయులచేతనే తాము, పరిపాలింపబడవలెననియు అన్యులచేత తాము పరిపాలింపబడరాదనియు సహజముగ స్ఫురించు స్వాతంత్ర్యేచ్ఛగూడ కారణమై యున్నది." అని

1. See. P. 394, A History of India. Vol. III.

కాంగ్రెసు చరిత్రయందు తిరుగుబాటు కారణములు వివరింపబడి యున్నవి. 1 కాలకర్మవశమున భారతీయు లీసంగ్రామమునందు పరాజితులైరి. "సర్వకార్య ద్రష్టయగు, నా సర్వేశ్వరు డాంగ్లేయులకు గర్వభంగ మొనరింపవలెనని మాత్రమే సంకల్పించెను గాని సమూలనాశన మొనరింప సమకట్టియుండలేదు. నామ రూపములు లేకుండ వినాశన మొందకుండ మనము తప్పించుకొనగలుగుట కెన్నియో యద్భుతవిషయములు సంభవించుటయే కారణమని నేడు హిందూ దేశమునందుగల యోచనాపరులును, అనుభవజ్ఞులును నగు ఆంగ్లేయులందరు తలపోయుచున్నారు. అనేక విషయములయందు తిరుగుబాటుదారులు శాప బద్ధులవలె ప్రవర్తించిరి. ఈతిరుగుబాటుదారులలో సమర్థుడగు నాయకు డొకడు బయలుదేరియుండినచో, లేక చాలచోట్ల తామాచరించిన పద్ధతిగాక మరొకపద్ధతి ననుసరించియున్నచో మనము స్వరూపనాశన మైపోయియుండెడి వారము. కాని, యీవిధముగ జరుగలేదు. ఈసంగ్రామము నాగరికులకును, అనాగరికులకును, మధ్య జరిగినది. క్రైస్తవమతమునకును—విగ్రహారాధనకును మధ్య జరిగినది. అందువల్లనే మనము జయించితిమి. మనము దాటిపోవుట కింతకంటె కారణమేమియు గోచరించదు." అని సర్. జోను లారెన్సుగారు ఆంగ్లేయవిజయమును గురించి వివరించిరి. 2 ఈయన వాక్యము ననుసరించియే భారతీయస్వాతంత్ర్యయోధులు మహావీరసంగ్రామము సలిపినటుల ఋజువగు చున్నది. ఎటులనో ఆంగ్లేయ రాజ్యము నిలిచినదిగాని ఆనాటి స్వరాజ్యస్థాపన ప్రయత్నములు "శాపవశమున" విఫలములయినవని లారెన్సుగారితో నంగీక రింపవచ్చును. సంగ్రామమున భారతీయులు పరాజితులైనను, దీనిఫలితముగనే ఈస్టిండియా కంపెనీగూడ నాశనమైనది. హిందూమహమ్మదీయ రాజవంశము లన్నియు తుదముట్టింపబడినవి. 1857 వ సంవత్సరపు తిరుగుబాటువంటి తిరుగుబాటునకు కొలికిపూసగ పనిజేయుటకు రవంతయు నావకాశములేకుండగ రాజవంశములు రూపుమాసినవి. భారతీయులపై నుచ్చుమందు చల్లుటకే పార్ల

1. See. Dr. Pattabhi's Congress History P. 8.

2. See. Minute by Sir John Lawrence dated April 19-1858. Punjab Govt. Records, quoted by Anderson and Subedar. The expansion of British India. p. 114.

మెంటు రాజ్యాధికారమును వహించినది. పార్లమెంటు రాజ్యాధికారమును వహించుచు గావించిన వాగ్దానమేమి?

**3 రాణీప్రకటన**

నాడు విక్టోరియారాణి గావించిన ప్రకటనము గమనార్హము. రాణీ ప్రకటనమును లార్డు కానింగుగారు అలహాబాదులో సం॥ 1858-11-1 వ తేదీని జదివియుండిరి. ఈ అలహాబాదులోనే క్లయివునాటి ఢిల్లీసుల్తానగు షాఆలమునుండి దివానుగిరీని సంపాదించి ఆంగ్లేయరాజ్యమునకు శంఖుస్థాపనము వేసియుండెను. రాణీగారి ప్రకటనముతో సీమప్రభుత్వాధికార సౌధము మహావైభవముతో అలహాబాదునుండియే నిర్మింపబడినది. అలహాబాదు ఆంగ్లేయరాజ్య సూర్యోదయ స్థానము. ఈపావన త్రివేణీతీరమే అఖిలభారతదేశీయ మహాజనసభకుగూడ నేడు ముఖ్యస్థానము. ఈప్రయాగయే భారతీయస్వాతంత్ర్య ద్వారముగూడ నైనది.

విక్టోరియారాణి గావించిన ప్రకటనమే ఆధునిక భారతీయ రాజ్యాంగ పరిణామమునకు పునాది యైనది.

**4 రాణీగారి ప్రకటన-నాటి రాజనీతి**

ఈప్రకటనయందే (1) సంస్థానాధీశ్వరుల కభయమొసగబడినది. కుంపెణీవారు స్వదేశరాజులతో గావించిన యొడంబడిక లన్నియు మన్నింపబడుననియు, స్వదేశరాజుల గౌరవమర్యాదలన్నియు రాణీగారి స్వంతమర్యాదలవలెనే భావింపబడి మన్నింపబడుననియు స్వదేశరాజుల కభయ మొసగబడినది. (2) బ్రిటిషు ప్రభుత్వమునందుగల యితరపౌరులయెడగల బాధ్యతలవలెనే భారతీయులపట్ల గూడ విధ్యుక్తధర్మములు గమనింపబడి త్రికరణశుద్ధిగ, దైవసాక్షిగ, నవి నిర్వహింపబడునని, భారతీయులను రాణీ విశ్వసింపగోరినది. (3) క్రైస్తవమతసాక్షిగ ఆంగ్లేయమత విశ్వాసములను భారతీయపౌరులలో బలవంతముగ ప్రవేశపెట్టవలె నను సంకల్పముగాని, అధికారముగాని, లేదని ప్రకటింపబడినది. ఎవరుగాని మతవిభేదముల సాకున, ఎట్టికష్టములకును గురిచేయబడరు. అన్ని మతముల పౌరులును సమానముగ సంరక్షింపబడుదురు. రాణీ

గారి యధికారమునకు లోబడిన యుద్యోగులందరు భారతీయుల మతవిషయము లలో జోక్యముకలిగించుకొనరాదని విస్పష్టముగ యాజ్ఞాపింపబడుదురని మతము పట్లుగల ప్రభుత్వనీతి వెల్లడింపబడినది. (4) మరియు, అర్హులగు భారతీయు లందరును అన్ని యుద్యోగములలోనికి మత కుల, జాతుల విభేదములు పాటింప బడకుండ చేర్చుకొనబడుదురని భారతీయులకు వాగ్దాన మొసంగబడినది. (5) భూమిహక్కులనుగురించిన మామూళ్లను, ఆచారములును, పాటింపబడుననియు, సక్రమమైనంతవరకే ప్రభుత్వము పన్నులను విధించుననియు రైతులకు హామీ యొసగబడినది. (6) ఆశాపరులగు కొందర సత్యప్రచారము జేసి తమ దేశీయు లను మోసపుచ్చి తిరుగుబాటులోనికి దింపినను, అట్టివారు క్షమింపబడుదురనియు కూడ తిరుగుబాటుదారుల కభయహస్త మొసగబడినది. (ఆంగ్లేయులను వధించిన వారు మాత్రము క్షమింపబడరు.) (7) హిందూదేశ పరిశ్రమనభివృద్ధిజేసియు, ప్రజోపయోగకరములగు కట్టడములను కట్టించియు, భారతీయపౌరుల యభివృద్ధి కొరకు మాత్రమే భారతీయప్రభుత్వము పాటుబడుననియు, భారతీయుల యభి వృద్ధియందే తమశక్తి యిమిడియుండినదనియు, భారతీయుల సంతృప్తియందే నీమప్రభుత్వ స్థిరత్వమిమిడియున్నదనియు, వారి కృతజ్ఞతయే తమకు కానుక యనియు, భారతీయులు హెచ్చరింపబడిరి. కంపెనీ ప్రభుత్వమున జరిగినదుండ గముల కీప్రకటన మొక క్షమాపణపత్రముగ నున్నది. తిరుగుబాటునకు గల తాత్కాలిక కారణముల కుపశాంతి గీతమువలె నున్నది. ఈ ప్రకటనము, ఆచరణయందు మన్నింపబడలేదు. బ్రిటిషుప్రభుత్వ మీప్రకటన నుల్లంఘిం చుటయందే, దీనిని నెక్కుడుగ గమనించినది. ఈ ప్రకటనయందలి హామీ లన్నియు నాచరణయం దదృశ్యములై యంతర్ధాన మొందినవి. (1) స్వదేశ సంస్థానాధీశుల కెట్టి స్వాతంత్ర్యమును లభించియుండలేదు. వారి హక్కులు కాపాడబడియు నుండలేదు. (2) భూమిశిస్తు నిర్ణయమున నాటికిని-నేటికినిగూడ రైతులకు న్యాయములభించలేదు. (3) భారతీయులహక్కులును, ఆంగ్లేయుల హక్కులును భారతదేశమునందే సరిసమానముగలేవు. అధినివేశ రాజ్యముల యందు జెప్పనేల? (4) మతవిషయమున పరోక్షముగ జోక్యము కలిగించుకొను చుండుటవల్లనే లక్షలకొలది భారతీయులు క్రైస్తవమతమును స్వీకరించుచుండిరి. మతము ననుసరించిన ప్రభుత్వాదరణయే పలువురు భారతీయుల క్రైస్తవమత

స్వీకరణమునకు కారణము. మతముపట్ల సమానగౌరవమును జూపింప ప్రతిన జేసియు, ప్రభుత్వము భారతీయుల ధనమునుండియే క్రైస్తవమతగురువులను పోషించుచున్నది. ప్రభుత్వమునందు క్రైస్తవమతశాఖ యొకటి నిర్మింపబడినది. క్రైస్తవమత మిషనరీలు హిందూమత సాంప్రదాయముల నీసడించుచు నేడుగూడ విశేషప్రచారభావమును సలుపుచునేయున్నారు. (5) ఆంగ్లేయులకును భారతీయులకును నుద్యోగార్హతలు సమానముగ నుండుననియు, సంపదకు సమానహక్కులొసగబడుననియు గావింపబడిన వాగ్దాన మక్షరాలా యసత్యమైనది. నేటికి గూడ ఆంగ్లేయులకే కొన్ని పెద్దయుద్యోగములు ప్రత్యేకింపబడియున్నవి. (6) హిందూదేశార్థికాభివృద్ధి గావించెదమని చేయబడిన వాగ్దాన మార్థికవినాశనమును గావించురీతిగ నాచరింపబడినది. ఆంగ్లేయ యుగమందలి యార్థికనీతిని పరీక్షించినచో నీ సత్యము విస్పష్టము కాగలదు. (7) రాణీ ప్రకటన నాట నుండియు గూడ భారతదేశప్రభుత్వము భారతీయుల విశ్వాసమును చూరగొని భారతీయుల సంతృప్తిపై భారతీయుల యభీష్టానుసారము, భారతీయప్రయోజనము కొరకు కొనసాగింపబడుచున్నదనుట కంటె; ఆంగ్లేయ సునిశితఖడ్గధార నాధారముగగొని ఆంగ్లేయులకొరకు భారతీయులు పరిపాలింపబడుచున్నారనుట ఆంగ్లేయరాజనీతిజ్ఞులు ప్రకటించిన సత్యమే. “............హిందూదేశ మాంగ్లేయుల నిశితఖడ్గధారచే జయింపబడినది. ఈ సునిశిత ఖడ్గధారచేతనే పట్టియుంచబడినది.”

హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగ నున్న లార్డుబర్కెనుహెడ్డుగారి పైప్రకటనమే యిందులకు తార్కాణము.

“హిందూదేశమును, హిందూదేశస్థుల లాభముకొఱకు మేముజయింపలేదు. భారతీయుల నుద్ధరించుటకై భారతదేశమును జయించితిమని మిషనరీల మీటింగులలో జెప్పబడుచున్నదని నే నెఱుంగుదును. ఇది శుద్ధాబద్ధము. సీమదేశపు సరకులు విడుదలయగుటకు హిందూదేశమును జయించితిమి. కత్తిచే భారతదేశమును జయించితిమి. కత్తిచేతనే భారతదేశమును పట్టియుంచవలెను. హిందూదేశమును హిందూదేశస్థులకొఱకే పట్టియుంచితిమని చెప్పుటకు నేను మోసగాడను

కాను. సీమసరకుల విడుదలకుదగిన ప్రశస్తమైన బజారుగను, ముఖ్యముగ లాంకుషైరు బట్టల విడుదలకును హిందూదేశమును పట్టియుంచితిమి.'' 1 ఈ యాంగ్లేయామాత్యుని వాక్యములు గూడ పైసత్యము నుద్ఘోషించుచున్నవి. (8) రాణీగారి ప్రకటనమునందు హిందూదేశమందుగల యాంగ్లేయ సామ్రాజ్యాభివృద్ధికి ప్రయత్నములు జరుగవని వాగ్దానమొసంగబడినది. అయినను, యీ నియమమునకు వ్యతిరేకముగ భూటాను రాజ్యమునుండి కొంతభాగము తీసికొనబడినది. నాటి గవర్నరు జనరలగు 'సర్, 'జోనులారెన్సు' గారు తమ భూసంపాదనతృష్ణకు లొంగిపోయిరి. కలింగకోట, ఫసాక- దేవనగిరి కోటలు స్వాధీనపరచుకొనబడినవి. భూటాను ప్రభుత్వమున కొసగబడెడి కప్పములు మానివేయబడినవి. 2

రాణీప్రకటనము అమలునందుంచలేదు.

"రాణీగారి ప్రకటన మక్షరాల నాచరింపబడవలె నను సంకల్పముతోనే గావింపబడెనని నేను తలంచెదను. బ్రిటిషుమంత్రివర్గమునం దెవరుగాని ఆచరింపవలె నను సంకల్పము లేకుండగ నీ ప్రకటనమును గావించియుండరు. భగ్నమొనరించుటకై రాణీగారిపేరున వాగ్దానముల నొసగియుండరు. కాని, యీ ప్రకటనముతోపాటుగన,ప్రకటనమయిన పిమ్మటనుగూడ, నీ ప్రకటనముయొక్క ప్రత్యక్షరమును, తత్వమునుగూడ నుల్లంఘింపబడి ప్రకటనకు వ్యతిరేకకృత్యములు హిందూదేశప్రభుత్వమువల్ల గావింపబడినవని హిందూదేశస్థులు విశ్వసించుచున్నారు. రాణీగారి పరిపాలనముగూడ "పాతతమాషాక్రొత్త పేరుతో" ప్రదర్శింపబడుదానిగ మారునని తలంపబడుచున్నది." అని 'లడ్లో' గారు తమ పుస్తకమునం దాకాలముననే స్వానుభవముతో వ్రాసియుండిరి. 3 ఇందువల్ల

1. From the speech of Sir. William Joyson Hicks Home Minister of the Govt. in England since 1925. quoted in.
భారతదేశము – ఆర్థిక చరిత్ర. P 2137. ఆ. గోవిందాచార్యులు.

2. See. The Proclamation of the Govt. of India 12th Nov. 1864. and the secretary of States despatch of 1st Feb. 1866, for the alleged lands of Bhutan war.

3. See. P. 326. Thoughts on the Policy of the Crown towards India by Mr. Ludlow.

రాణీప్రకటనము నందానాటి భారతీయులుగూడ విశ్వసించి యుండలేదని తేలుచున్నది.

నాటి భారతీయవీరయోధుడగు శ్రీరాజా రామమోహనుకు కూడ కంపెనీ పరిపాలనము తుదముట్టింపబడి, పార్లమెంటు అధికారమును సంపూర్ణముగా వహించుటకు సంతృప్తి పడినవాడుకాడు. అధినివేశ రాజ్యములకు సంబంధించినవరకు, స్వానుభవము ననుసరించి, మంత్రియే సర్వాధికారియనియు, పార్లమెంటుసభ మంత్రికి లొంగియుండుననియు గ్రహింపగలిగి యుండెనని" రామమోహనురాయని కార్యదర్శి వ్రాతనుబట్టి గ్రహింపగలుగుచున్నాము. 1

"ఈమార్పు అధికారదుర్వినియోగమునకు విస్తారముగావీలులేని, యనేక ప్రతిరోధములకు లోబడియున్న కంపెనీపరిపాలనమునకు మారుగా, నప్రతిహతమైన నిరంకుశప్రభుత్వమును నెలకొల్పుటయేయగు" నను రామమోహనుని యభిప్రాయము కాలానుక్రమణమున సత్యదూరము కాలేదు.

"రాణీగారిప్రకటన మాంగ్లేయులచే నాహ్వానింపబడి యాచరణయందుంచబడుటకు మారుగా చాలాకాలము త్రొక్కివేయబడి యధికారులచే నిర్లక్ష్యము చేయబడినది. ఆచరణయందుంచుటకు సంపూర్ణాధికారముగల యాంగ్లేయపార్లమెంటీవిషయమై చూచీచూడనట్లు నటించినది. హిందూదేశమునందుగల ఉద్యోగులలోకంటె సీమయందుగల యుద్యోగస్థులలోనే ప్రతీకారభావము హెచ్చుగనున్నది. కొంతకాలమైనపిమ్మట, యీ ప్రకటనవల్ల కొంతయుపయోగము గలిగినను, మొదట కొన్నిసంవత్సరములవరకు, యీ ప్రకటనరూపముగా హిందూదేశముపట్లగల ఆంగ్లేయనిశ్చితరాజనీతి ప్రకటింపబడియు జాతివిద్వేషముతో గూడిన విరోధ భావాభివృద్ధివలన నాచరణయం దుంచబడలేదు.

"ఊహాలు – నాశలు, కొనసాగింపబడవని మన కంఠరకు దెలియును. వీటిని నిషేధించుట లేక నొసగించుట – యీ రెంటిలో నేదో

1. See page 65. The Rise and Growth of the Congress in India.

యొకటి, మనమాచరింపవలసి యున్నది. అందువల్ల మనముమాత్రము, మౌనమార్గమునే యవలంబించితిమి. ... ... ... సీమప్రభుత్వమును_ హిందూదేశ ప్రభుత్వమును నేటివరకును నందరి చెవులకు వినిపించునట్లు గావించిన వాగ్దానములు హృదయవిదారకముగ నన్నిరీతుల భంగ మొనరించిన వను నేరమునకు మనము సరియగు సమాధాన మొసంగజాలక పోతిమి.” అని లిట్టను ప్రభువుగారువ్రాసిన రహస్యపు వ్రాతలలో గలదు.1 ఇంత విస్పష్టముగా నితరులు వ్రాసియుండలేదు కాని— రాణీగారి ప్రకటనము నందుగల “వీలయినంతవరకు” (As far as possible) అనుమాటల నాధార ముగా గొని, ప్రకటన నుల్లంఘించుటకు, హేతువాదమును జూపిరి.

ఇక భారతదేశమున శాంతియేది? అయితే, తిరుగుబాటు నణచివేసిన పిమ్మట భారతదేశమున స్మశానశాంతి మాత్రము ప్రబలినది. తిరుగుబాటు కాలమున నానాసాహేబు సంగ్రామనీతిగ కొన్ని యత్యాచారములు గావించిన మాట వాస్తవము. ఇందులకు మారుగ కల్నలు నీలువంటి యాంగ్లేయ సైనిక నాయకులుగావించిన యత్యాచారములకు మేరలేదు. నిర్బంధవిధానము మితి మీరి యవలంబింపబడినది. ప్రజాసమూహము భయకంపితులైరి. నిర్బంధ విధా నమువల్ల భారతీయులు నిస్సహాయులై, నిస్పృహాయుతులై విధికృతముగ విదేశ ప్రభుత్వమునకు తలయొగ్గిరి కాని రాణీప్రకటనమువల్ల దేశమునందు శాంతి జనించలేదు. రాజ్యాంగము మారినను, పరిపాలనావిధానమున మార్పులును సంభవించలేదు. భారతీయులు శస్త్రసన్యాసులు గావింపబడిరి. (Arms Act). భారతీయ పత్రికాస్వాతంత్ర్యమపహరింపబడినది. భారతీయ సైన్యనివహములు తీసివేయబడినవి. సైన్యమున భారతీయులకు నాంగ్లేయులకును మధ్య వ్యత్యాస ములు గల్పింపబడినవి. తిరుగుబాటుఫలితముగ సైన్యమునందు గావింపబడిన మార్పులను గమనించుచోమాత్రమే యాంగ్లేయప్రభుత్వమున కానాడు భార తీయులయందు జనించిన యవిశ్వాసము రుజువుకాగలదు. 2

---

1. From Gokhale's Presidential address Penares. 1905.

2. భారతదేశము—ఆర్థికచరిత్ర. పే. 1778 మొదలు 1792 వరకు చూడుడు. సైన్యము నందు జరిగినమార్పులు గుర్తించుడు. గ్రంథకర్త ఆ. గోవిందాచార్యులు.

సంగ్రామమునందాంగ్లేయులు ప్రదర్శించినదారుణత్వమునకు భారతీయుల స్వాతంత్ర్య కాంక్షాపూరితమైన హృదయము విచ్ఛిన్నమైపోయినదనుట నిశ్చయము.

"మహాసైనికచరిత్ర నేడిట చెప్పబోవుటలేదు. ఏలననగ- మానవ హృదయము, భరింపరాని ఘోరములను నాటకరంగములపై చూపక, తెరమఱుగున విష్కంభముగ జేయుట సనాతన భారతనాటక సాంప్రదాయము. ఈ మహాసైనిక ప్రళయచారిత్రకనాటకమంతయు-యిట్టి ఘోరములతోనే నిండియున్నది. ఆ నరహత్యలు-ఆ యమానుషకృత్యములు - ఆ మనుష్యులను రోడ్లప్రక్క చెట్ల కొమ్మలకు ఉరిదీయుటలు-ఫిరంగిమూతులకుకట్టి తునాతునకలుగ, నెగురగొట్టివేయుటలు- యిండ్లుతగులబెట్టుటలు- ఆస్తులు- దోచుకొనుటలు,- బావులజలములలో విషములుకలుపుటలు- రక్తప్రవాహములను బారించుటలు- శవములనందు తేలించుటలు- అబ్బబ్బా!- యీఘోరముల నన్నిటిని నేనేమని వర్ణింతును? వర్ణింపదలచుకొన్నచో, యిక నిన్ని సంపుటములువ్రాసినను తీరదు. ఇది నా వల్లకాదు బాబూ! నేను వర్ణింపను జాలను. పాఠకులు చదివి సహింపనుజాలరు. మానవహృదయవిదారకములగు, నిట్టి ఘోరదురంతోదంతములు - లోకములో ననేకచోట్ల ననేకకాలములయందు - ననేకఖండములలో జరిగియుండెను. కాని యవేమియు- నిక్కడ నీసమయములలో జరిగినవానికి చాలవు. కాబట్టి, యీ యధ్యాయమునంతను విష్కంభముగ తెరమరుగునకు త్రోసివేసెదను. తెర మఱుగున చూడగల గుండెదిటవుగలవారు - "కే", "మావెసక" మున్నగు నింగ్లీషువారు వ్రాసిన గ్రంథములే చదువుకొందురుగాక. ఇవికాక మన భారతీయులే వ్రాసినగ్రంథములు పెక్కుగలవు. దొరికినచో, వానినిగూడ పఠింపవచ్చును. నామట్టుకునేను- యీ దారుణములను చదువలేక- వినలేక- నాచక్షుశ్శ్రోత్రములను ఉపసంహరించుకొనుచున్నాను. దీనిపై తెర నింతటితో దింపివేయుచున్నాను."[1]

ఈ దుర్భర పరిస్థితులలో, అంధకారబంధురమైన - యిట్టి భవిష్యత్తు

1. బ్రిటిషుయుగము రెండవసంపుటము. పే. 1114. బాపుగారి గ్రంథమునకు, ఆంధ్రానువాదము. గ్రంథకర్త. శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు.

నందు, తిరిగి, స్వాతంత్ర్యోద్యమము జనించుటకు, కొంతకాలము పట్టుటయం దాశ్చర్యమేమి?

## 5. సం॥ 1858 ర॥ రాజ్యాంగశాసనము - నాటి రాజనీతి.

1 1857—1862 లార్డు కానింగు గవర్నరుజనరలు.

లార్డుపాలు మెర్ట్సను సీమదేశ ప్రధానామాత్యుడు; 1857 డిశంబరు 19 వ తేదీనే కంపెనీ యెత్తివేయబడవలసి వచ్చునని డైరెక్టరులకు తెలిపియుండెను. సీమప్రభుత్వమే హిందూదేశప్రభుత్వాధికారమును స్వయముగ వహింపగలదనియు, తెలిపియుండెను. 1858 ఫిబ్రవరి 12 వ తేదీని హిందూదేశ రాజ్యాంగశాసనము పార్లమెంటులో నుపపాదింపబడినది. ఈస్టిండియా కంపెనీడైరెక్టరు లిందుపై రోషావేశులైరి. దీనిని ప్రతిఘటింప సంకల్పించుకొనిరి. జాను, స్టూఆర్టుమిల్లుగారిచే వ్రాయబడిన నివేదికను కంపెనీ, ప్రభుత్వమునకు సమర్పించినది. ఇందు గత 30 సంవత్సరములనుండియు గావింపబడిన సంస్కరణ లుదహరింపబడినవి. ఈ విధముగ ననాగరికజాతిపరిపాలనము (Semi-barbarous dependency) సీమప్రభువునకు సంక్రమింపజేయుట గొప్పతప్పిదమనియు, దుండగీడుతనమనియు, కంపెనీ వ్రాయసాహసించినది. (A folly and mischief). అయిననేమి? ఇంతలో పాలెమెర్ట్సనుగారి ప్రభుత్వము కూలిపోయినది. పిమ్మట నిండియాబోర్డు ప్రసిడెంటుగారయిన లార్డు ఎలింబరోగారిచే వ్రాయబడిన యిండియాబిల్లు పార్లమెంటుసముఖమునందుంచబడినది. ఈ (Desraeli) 'డసరాలీ' గారి బిల్లుపైనగూడ ననుపమానప్రతిఘటనము బయలుదేరతీయబడినది. దీనికి మొదటిదానిగతియే పట్టినది. లార్డుఎలింబరో రాజీనామానిచ్చి మంత్రివర్గమునుండి వెడలిపోవలసివచ్చినది. లార్డు జోనురసెలుగారి సలహాపై నూతనముగ సిద్ధాంతములను తీర్మానరూపముగ నిర్ణయింపదగునని యంగీకరింపబడినది. యిండియాబోర్డుప్రసిడెంటయిన లార్డు స్టాన్లీగారిచే మూడవబిల్లు జూనుమాసమున పార్లమెంటులో ప్రవేశపెట్టబడినది. 2 వ ఆగష్టు 1858 వ సంవత్సరమందు

నూతనహిందూదేశ శాసనముగావింపబడినది, ఈ శాసనమువల్ల హిందూదేశ ప్రభుత్వమునకు నామభేదముమాత్రమే లభించినది గాని విశేష రూపభేదము లభించలేదు. ఫలితమునం దిసుమంతయు తారతమ్యములేదు. ఈ శాసనము గావింపబడిననాటినుండియు, పార్లమెంటు హిందూదేశ పరిపాలనమునుగురించి అధికారపత్రములను గావించునపుడు సలిపిన విచారణలవంటి విచారణలను సలుపుట మానివేసినది. శాసనరూపముగ నితరులకు సంక్రమింపజేయబడిన శాసనాధికారమునననుసరించి గావింపబడు నియమముల నామోదించుట మూల ముగ హిందూదేశపు రాబడులపై పెత్తనము చెలాయించుట మూలముగ హిందూదేశప్రభుత్వమునకు బాధ్యుడయిన మంత్రిని ప్రశ్నించుటమూలముగ పార్లమెంటు హిందూదేశ వ్యవహారములపై పెత్తనము చెలాయింపసాగినది."[1] 1858 సంవత్సరపు హిందూదేశరాజ్యాంగశాసనము ననుసరించి డైరెక్టరులకోర్టు నకు నిండియాబోర్డునకునుగల యధికారము లన్నియు హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి కొసంగబడినవి. ఈయనమూలకముగ పరిపాలన సాగింపబడుచు వచ్చినది. కాని హిందూదేశప్రజలకు లభించిన రాజ్యాధికార మేమియును లేదు.

"పార్లమెంటువారీశాసనములను గావించుచో నిందువల్ల హిందూదేశము పట్ల గలుగు వ్యత్యాస మేమియునుండదు. ఇంతటినుండియు సీమనుండి పంపబడు నుత్తరువులు హిందూదేశరాజ్యాంగ కార్యాలయపు ప్రెసిడెంటుగారి సంతక ముతో పంపబడును. ఇందులకు సమాధానముగూడ కంపెనీ డైరక్టరుల కొసగ బడుటకు మారుగ, రాజ్యాంగకార్యాలయపు ప్రెసిడెంటుగారి చిరునామాకే పంపబడును. ఇదియే యీ శాసనమువల్ల గలుగు మార్పు." అని, యీ శాస నమును కామన్సుసభలో రెండవపర్యాయ ముపపాదించిన విస్కవుంటుపాల్ మర్స్టనుగారు నాడు నుడివిరి.[2] కంపెనీ పరిపాలనమునుండి సీమప్రభుత్వము హిందూదేశ సామ్రాజ్యమును తన స్వాధీనము జేసికొనుటయం దంతరార్థమేమి?

"ఇతర దేశములలోకంటె రాజ్యాంగశాస్త్రము సుబోధకమైన యీ

1. See. the Report on Indian Constitutional Reforms 1918. Para 33.
2. See. Viscount Palmerston's Speech. House of commons 12th Feb. 1858.

దేశము ప్రజాప్రాతినిధ్య సిద్ధాంతము సుస్థిరమొనరింపబడిన యీ దేశము, బహు విస్తీర్ణమైన, వివిధ ప్రయోజనములుగల, యధికజనసంఖ్యగల దేశపరిపాలనము నొక చిన్న వర్తకసంఘమువారి యాధీనమునందుంచుట నిశ్చయముగ గమనార్హ మగు ప్రత్యేకత్వముగల విషయము. అమెరికాయందలి ఉత్తరదిశలో, ఎచ్చట చతుష్పాద జంతువులుమాత్రమే నివసించుచుండునో, మరియు నెచ్చట అడవి జాతుల, హిందూదేశస్థులుమాత్రమే వసించుచుందురో, కంపెనీకి ఎచ్చట జంతు జాలముల బొచ్చు నూడదీయుటయును, ద్విపాదజంతువులను మచ్చికపరచుట యును ముఖ్యకృత్యములై యుండితీరవలయునో అట్టి అడవిప్రాంతములను కంపెనీ పరిపాలనమునకు నిడుట నెట్లైనను సునాయాసముగ నూహింపగలుగుదుము; కాని, మనదేశమువంటి ఘనతజెందిన దేశము వర్తకవృత్తిమాత్రమే కల యొక కంపెనీకి; ననార్యులగు వ్యక్తులగుంపునకు; మహావిస్తీర్ణమై, వివిధమతములతో, వివిధజాతులు నివసించుచున్న దేశపరిపాలనా సమస్యానిర్ణయములు, యుద్ధము లకును, శాంతిస్థాపనకును, అంతర్జాతీయ వ్యవహారములకును స్వతంత్రులగు రాజన్యులతో వ్యవహరించుటకును సంపూర్ణాధికారము నొసగుటకు మానవజాతి చరిత్రలో నింతకుముం దెన్నడును కని, విని యెరుంగని పరిస్థితి" ... ... ... "ఈవిధముగ కంపెనీ పరిపాలనము చక్రవర్తిగారి పరమొనరించుట- సీమదేశము నుండి యనేక సైనిక నివహంబులను హిదూదేశమునకు పంపుటకు సమానము. ఇందువల్ల జనించుభావము బహు ప్రయోజనకరము. సీమయొక్క నైతిక, రాజకీయ పలుకుబడిని ప్రపంచమునందుగల యీ మహావిశాల ప్రదేశమున బల పరచి సుస్థిరమొనరింపగలుగును." ... ... హిందూదేశపరిస్థితులింకను చక్క బడకపూర్వమే, కష్టదశయందున్నప్పుడే, తిరుగుబాటునుండి పూర్తిగ బయట పడకపూర్వమే హిందూదేశమునందంతటను తిరిగి మనయధికారము సుస్థాపన మొనరించుటకుపూర్వమే హిందూ దేశ రాజ్యాంగమును మార్చవద్దని కొందరి వాదము. ఈ వాదమును పరీక్షించిన తేలునదేమి? హిందూదేశమునం దింకను చేయవలసినపని చేయుట కష్టమనియు, దానిని ముగించుటకు బలవత్తరమగు నధికారము కావలయుననియు తేలుచున్నది. ఇందులకు బాధ్యతగల మంత్రి వర్గము సక్రమమగు సాధన విధానముకాదని ఎవరైనను నటించుచునైన చెప్ప గలరా?" ... ... "హేతువాది ఎవరుగాని ప్రస్తుతరాజ్యాంగవిధాన మిందు

లకు, నేను సూచింపబడుచున్న దానికంటె శ్రేష్ఠమైనదని చెప్పజాలరు" ...... హిందూదేశమునకును, హిందూదేశవాలకులకును సీమజాతికిని, కంపెనీనుండి అధికారమును తీసికొనుటవల్ల నష్టకోపయోగము కలుగనని నా విశ్వాసము"... ఇవియు పాల్మర్స్టన్‌గారి వాక్యములే. ఈ వాక్యములననుసరించి హిందూదేశమునందలి ఆంగ్లేయసామ్రాజ్యమును సంరక్షించుకొని పదిలపరచుకొనుటకే సిపాయిల తిరుగుబాటు ఫలితముగ సీమప్రభుత్వము హిందూదేశప్రభుత్వాధికారమును వహించినదని తేలుచున్నది. 1 ఈ శాసనసారాంశమే 1861 వ శాసనము.

## 6. సం॥ 1861 వ శాసనసభల శాసనము-<br>నాటి రాజనీతి.

1861 వ సంవత్సరమునందు హిందూదేశకౌన్సిళ్ళ శాసనముగావింపబడినది. (Indian Councils Act of 1861). ఈ శాసనము గావించుటలో పార్లమెంటువారి యుద్దేశ్యమేమి? "విద్యావంతులును, అంతస్థుగలిగినటువంటి వారును నగు భారతీయులు, మనచే పరిపాలింపబడుచున్న యితరదేశములలో ప్రజలవల్లనే స్వపరిపాలన మొనరించుకొనుట నేర్చుకొనుటకుగాను" కౌన్సిళ్ళ శాసనము గావింపబడినది. కాని, యీ కౌన్సిళ్ళలో సభ్యులు ప్రజాప్రతినిధులుగ నుండజాలరు. "అవి కొందరిని శిక్షించుటకును, మరికొందరిని బుజ్జగించుటకును పూనినరోజులు. ఎవరు దండింపబడవలెను? ఎవరు బహూకరింపబడవలెనను సంగతి నిర్ణయించుటకు లార్డుకానింగుగారొక్కరే సర్వాధికారి." 2 ఈ కౌన్సిళ్ళలో విప్లవకాలమున తనకు తోడ్పడినవారిని నియమించుటకై కానింగుగారు తన యధికారమును వినియోగించుచువచ్చిరి. అంతియేకాని, విప్లవకారణమగు స్వాతంత్ర్యకాంక్షను తృప్తిపరచుటకై పార్లమెంటువారెట్టిప్రయత్నమును జేసియుండలేదు.

సైనికుల తిరుగుబాటునకు పిమ్మట హిందూదేశ ప్రజానాయకుల సమ్మతి

1. See. Palmerston's speech in Commons. 12th Feb. 1858.
2. See. The Company and the Crown. p. 43.

కొంతవరకైనను దేశీకొనినటుల నటింపకపోయినచో ప్రభుత్వమును కొనసాగించుట దుర్ఘటమనియు, అశాంతి ప్రబలిపోవుననియు, నాటి ఆంగ్లేయరాజకీయవేత్తలు తలంచుటయే సం॥ 1861 వ శాసనసభల శాసనము గావింపబడుటకు ముఖ్య కారణము. 1

"పలుతెఱంగుల భాషలు, వివిధ ఆచారవ్యవహారములు, రకరకముల మతములు గల వివిధజాతులకు-అనగా, తమరాజ్యాధికారమును మన మపహరించితిమని తలంచు మూర్ఖులగు మహమ్మదీయులు మొదలు అప్రతిహతముగ తరతరములనుండి, వంశపారంపర్యముగ తనకు సంక్రమించిన కులము, మతము, న్యాయశాస్త్రము, ఆచారములును, పదిలపరచుకొనుచు తమ్ము జయించినవారి కెల్ల తల లొగ్గుచున్న పిరికిపందలగు హిందువులవరకునుగల ప్రజకు మనము శాసనములను గావింపవలసియున్నది. ఇందులకు దోడుగ హిందూదేశమున నివాసమేర్పరచుకొనిన ఆంగ్లేయులున్నారు. వీరు భారతీయజాతులతో నన్ని విషయములయందునను వ్యత్యాసమును గలిగియున్నారు. సాహసికులు, శక్తివంతులు, ఉత్తమజాతికిని, విజయులకును నుండెడి గర్వముతో నిండియున్నారు. వీరి యత్యున్నత శక్తిపైననే ఆధారపడుచు, ననేకవిషయములలో జాతీయులను హేయముగ జూచుచు మరికొన్ని జాతీయ విషయముల నుల్లంఘించుచు నున్నారు. అయినప్పటికిని వీరును స్వదేశీయులతో కలిసిమెలసి శాసనముల శిరసావహింపకతప్పదు. ఆధునిక పరిస్థితులలో నాగరిక జాతులకును ననాగరిక జాతులకును మధ్యనుండవలసిన సంబంధ మీ విషమవిషయముగనే, యెప్పుడును తలంచుచున్నారు. ఈక్లిష్టపరిస్థితియే అమెరికాయందు, ఆఫ్రికాయందు, న్యూజిలాండునందు తటస్థమైనది. కాని, అతివిశాలమగు నాంగ్లేయసామ్రాజ్యమునం దెచ్చటగాని యీసమస్యకు హిందూదేశమునం దంతటి యతికష్టస్థితి దాపురించి యుండలేదు. హిందూదేశమునందుగల యాంగ్లేయులు భారతదేశమున స్థిర నివాస మేర్పరచుకొనినవారు కారు. ఈ శాసనాధికారమునకు లోబడవలసిన వారిలో కొందరుమాత్రమే హిందూదేశమునకు కొంతకాలముండుటకే పోయెదరు. ఉద్యోగస్థులు, ఉద్యోగకాలపరిమితి పూర్తియయిన వెంటనే తిరిగివచ్చె

1. See. Minitue of Sir Bartle Frere 1860.

దరు. వర్తక, వ్యవసాయవృత్తులలో నుండువారు ధనము నార్జించినపిమ్మట మనదేశమునకే మరలి వచ్చెదరు. హిందూదేశమునం దాంగ్లేయజాతి భారతీయ జాతిలో నొక సుస్థిరమగు భాగముగనున్నను, యీభాగముగనేర్పడిన వ్యక్తులను గమనించి వ్యక్తిపరముగ యోచించుచో నీభాగము తాత్కాలికమని చెప్ప వలసివచ్చును. ఈపరిస్థితులలో నీశాసనము గావింపవలసియున్నది. ఈకష్టములు, నీమధ్య సంభవించిన తిరుగుబాటువలన నత్యధికమైనవని చెప్పవలసి వచ్చినందులకు విచారించుచున్నాను. కొన్ని సంవత్సరములకు పూర్వము భారతీయులయం దాంగ్లేయులకుగల యపార విశ్వాసము నేడు నశించిపోయినది. అవిశ్వాసము ప్రబలిపోయినది."........."హిందూదేశమునందు దినదినాభివృద్ధిగ నభివృద్ధిచెందుచున్న కష్టములను గమనించక దివాంధములగుట యవివేకమగును. హిందూదేశమునందలి మన రాజ్యాంగవ్యవస్థ కట్టుదిట్టములగు పునాదులపై వెంటనే నిర్మించవలసివచ్చుట కిదియొక అదనపు హేతువు.".......

ఇవి సర్ ఛార్లెసు వుడ్డుగారి వాక్యములు. సం॥ 1861 ర శాసనసభల శాసనమునకుగల కారణములు వుడ్డుగా రీశాసనమును పార్లమెంటులో నుపపాదించుచు గావించిన పైమాటలలో సువ్యక్తమగుచున్నవి. నేటినుండియు లెంపపెట్టును, వీపుతట్టును నాంగ్లేయ రాజనీతియని గ్రహింపగలుగుటకు పై వాక్యములే యుదహారణము. 1

1 లార్డుఎలిజన్ వైస్రాయి.

1862-63 మధ్య లార్డు ఎలిజన్‌గారు వైస్రాయిగనుండిరి. ఈయనయే సీమదేశ ప్రభుత్వముచేత నియమింపబడిన మొదటి వైస్రాయి. "సర్వాధికారమును గలిగియున్న ప్రభుత్వప్రతినిధిగా హిందూదేశమున శాంతి నెలకొల్పుట నావిధి. ఇందుకొఱకు రాణీగారు పెద్దదయినటువంటిన్ని, శౌర్యముగలిగి యున్నటువంటిన్ని సైన్యనిహావమును నాకొసగియుండిరి. అవసరమైనయెడల, "నీసైన్యము నశాంతి నణగద్రొక్కుటకును, నశాంతికారకులగువారిని శిక్షించుటకును, వినియోగించుటకై వెనుదీయును." ఇటవే ఎలిజనుగారు ప్రయోగించిన

1. See. Sir Charles wood's speech. House of Commons, 6th June, 1861.

రాజనీతి. పరిపాలితుల యభిమతము ననుసరించి యీయన పాలింపఁబ్రయత్నింప లేదు. ఆంగ్లేయ సునిశితఖడ్గ మీ పరిపాలన కాధారమని దర్బారులయందు బహిరంగముగ ప్రకటింప సాహసించెను.

2 లార్డులారెన్సు వైస్రాయి.

ఈయన తరువాత (1864-69) లార్డులారెన్సుగారు వైస్రాయిగా నుండిరి. ఈయనయే సివిలుసర్వీసు శాఖనుండి వైస్రాయిగా నియమింపబడుటకు ప్రథములు. ఈయన కాలమున ప్రజాభిప్రాయము ప్రభుత్వమునకు మరింత వ్యతిరేకమైనది. కంపెనీ పరిపాలకులు హిందూదేశమున క్రైస్తవమతవ్యాప్తికి దృఢసంకల్పము కలిగియుండలేదు. విప్లవానంతరము నుండియు పరిపాలకుల యందు క్రైస్తవమతవ్యాప్తిసంకల్ప ముద్భవించినది. ఇందులకు లారెన్సుగారు ముఖ్యులు. ఈయన శిష్యుడును, పంజాబు ప్రభుత్వాధికారియునగు కల్నలు, ఎడ్వర్డ్సుగారు వహించిన క్రైస్తవమత పక్షపాతమువల్ల ప్రజలలో నధికకలవరము గలిగినది. 1 ఈయన పరిపాలనమునందే భారతీయులు వైస్రాయి గావించు విందులలో పాల్గొనరాదని నిషేధింపబడి జాతిద్వేషము రెచ్చగొట్టబడినది. రాజ్యాంగ కార్యదర్శి యాజ్ఞ ననుసరించి పిమ్మట నీనిషేధము తొలగింపబడినది.

## 7. విప్లవాంకురములు.

1 లార్డుమేయో వైస్రాయి.

అయినను భారతీయ హృదయాంతరాళములయందు జనింపజేయబడిన భేదము సమసిపోవలేదు. లార్డుమేయో గారి వైస్రాయిపద వీకాలమునందే హిందూదేశమున విప్లవోద్యమము ప్రారంభింపబడినట్లుగ చరిత్ర పరిశోధనముల వల్ల తెలుచున్నది. 1871 వ సంవత్సరం సెప్టెంబరు 20 వ తేదీని కలకత్తా హైకోర్టు ప్రధానన్యాయమూర్తియగు జాన్‌ఫాక్సుటను నారిమనుగారు కత్తితో పొడువబడి, అబ్దుల్లాయను నాతనిచే చంపబడెను. "ఈహత్యకు రాజకీయ విప్లవోద్యమమే కారణమని తలపబడినది. కాని, పరిశోధనలవలన నట్టియను

1. See. India under the British Crown. P. 80.

మానమునకు సావకాశములేదని తేలుచున్నది." అని సర్. జి. కాంబేలుగారు వ్రాసిరి. 1 ఈహత్య జరిగినపిమ్మటనే లార్డుమేయో వైస్రాయిగారు గూడ అండమానుదీవులలో హత్యకు గురియయిరి.

## 8. స్వరాజ్యాందోళన ప్రారంభము.

1
లార్డు నార్తుబ్రూకు
వైస్రాయి
1872–76

ఈవిధముగ హిందూ దేశమునం దశాంతి ప్రబలియుండెను. మేయోగారి మరణానంతరమునాటి మదరాసుగవర్నరగు నేపియరుగారు నార్తుబ్రూకుగారు వచ్చువరకును వైస్రాయిగ బనిజేసియుండిరి. నార్తుబ్రూకుగారు శాంతిప్రియుడు. "హిందూ దేశమును మనప్రయోజనముకొఱకును, లాభము కొఱకునుగాక, భారతీయులకొరకే పరిపాలించుట మనవిధి యని మరువరాదు." అని లార్డునార్తుబ్రూకుగారు విశ్వసించిరి. 2 "విద్యావంతులగు స్వదేశస్థులకు గూడ ప్రభుత్వయంత్రమునం దర్హస్థానమొసగుటకు తగుచర్య తీసికొనబడునని యాశించుచున్నాను. ప్రతిరాష్ట్రములోను కొందరకు కౌన్సిలరులుగబిరుదమునొసగ వలయును. శాసనములనుగురించి వారితో సంప్రతించుచుండవలయును. ఇందుల కనువగు విధానమును త్వరలో నమలునందుంచకపోయినచో దేశమునందు గమనార్హమగు నసంతృప్తి జనించుట నిశ్చయము" అని నార్తుబ్రూకుగారు 1881 లో వ్రాసియుండిరి. 3 కాని, యీయన మాటలాలింపబడలేదు. వంగదేశము క్షామదేవత కాకరమైయుండినను, వంగదేశధాన్యము నెగుమతి కాకుండ చేయవలెనని వంగదేశపుగవర్నరు సూచించియుండినను యాయన అట్లాచరించి యుండలేదు. ఇందువల్ల జనక్షోభకు మేరలేకపోయినది. ఒరిస్సాక్షామసంక్షోభమున కిది దోహద మొసగినది. నార్తుబ్రూకుగారి యధికారకాలమునందే బరోడామహారాజుపై రెసిడెంటునకు విషముపెట్టె నను నేరము మోపబడినది. మహారాజు నిందితుడు గాడని న్యాయస్థానమునందు నిర్ణయింపబడినది. అయినను, అరాజక పరిపాలన

1. See. Sir George Campbell, the Lieutenant Governer of Bengal.
2. See. His statement made in the town Hall of Birmingham on October 29, 1880.
3. See. P. 162, Earl of North Brooke.

నేరమారోపింపబడి బరోడామహారాజు రాజ్యభ్రష్టుడు గావింపబడినాడు. ఇంతతో ప్రజలలో ప్రబలమగు నశాంతి యుద్భవించినది. "భారతీయులుగూడ మనతోసమానమగు విద్య నభ్యసించుచున్నారు. మన న్యాయస్థానములలో న్యాయవాదులుగ బనిచేయుచున్నారు. వారి దేశపు ప్రభుత్వములోవారికి తగిన భాగమొసగనిచో విపరీతమగు నసంతృప్తి జనించకమానదు." అని నార్తుబ్రూకు గారు 1884లో లార్డు డఫెరనుగారికి వ్రాసియుండిరి. దీనిననుసరించి నార్తుబ్రూకు గారి కాలముననే స్వరాజ్యాందోళనము ప్రబలియున్నదనుట నిజము. ఈ ప్రజాందోళనము నాంగ్లేయరాజకీయవేత్తలెవరును మన్నించలేదనుటయు సత్యము. 1876 ఏప్రియల్ 12 వ తేదీని నార్తుబ్రూకుగారు తమ వైస్రాయి పదవికి రాజీనామా నొసగిరి.

2
లార్డు లిట్టను వైస్రాయి.
1876–1880.

ఈయన స్థానమున లార్డులిట్టనుగారు వైస్రాయిగ నియమింపబడియుండిరి. ఈయన వైస్రాయిపదవియందే ఇంగ్లండు దేశపు రాణిగారు "హిందూదేశపు చక్రవర్తిని" బిరుదమును వహించినది. ఈబిరుదమును వహించిన వేడుక 1877 జనవరి 1వ తేదీని ఢిల్లీయందు జరుపబడినది. హిందూదేశ ప్రభుత్వమునందలి పైయధికారులందరీదర్బారు నలంకరించిరి. 1200 మంది సివిలుసర్వీసుఉద్యోగస్థులును, 14000 మంది ఆంగ్లేయ, భారతీయ సైనికులును, 77గురు స్వదేశసంస్థానాధీశులును, 300మంది భారతీయజమీందారులును, భూకామందులును నీదర్బారునకు హాజరుపెట్టబడిరి.1 లిట్టనుగారి పరిపాలన, ముందు సంభవించిన ఘోరకాటకమున భారతీయు లన్నమోరామచంద్రా యని యల్లాడిపోయిరి. ఈయన పత్రికా నిర్బంధ శాసన మమృతబజారు పత్రికపై తీవ్రముగ ప్రయోగించియుండెను. దేశభాషాపత్రికలమీద దాడివెడలియుండెను.

"లిట్టనుగారి హిందూదేశపరిపాలనమును సీమయందలి కొందరు రాజకీయవేత్త లేవగించుకొనసాగిరి. లార్డు బీకన్సుఫీల్డుగారి గవర్నమెంటుసీమలో మారిపోయినది. 1880-4-28 వ తేదీని గ్లాడుస్టనుగారు సీమప్రభుత్వమున కధిపతి

1. See. The History of Lord Lytton's Indian Administration by Lady Balfour.

అయినాడు. విస్కౌంటు కాన్‌బ్రూకుగారిస్థానమున హారింగుటనుగారు రాజ్యాంగ కార్యదర్శిగ వచ్చినాడు. ఈ నూతన ప్రభుత్వము లిట్టనుగారి పరిపాలనా కృత్యముల నామోదింపజాలదని లిట్టనుగారే యిందుకుముందుగ తమ పదవికి రాజీనామానొసగిరి.

"లార్డులిట్టనుగారికాలమున చంద్రమండలమునుగూడ నాంగ్లేయరాజ్యము నకు కలుపవలయునను పన్నాగములు పన్నబడినవనుటలో నాశ్చర్యముండదు." అని లూసీను వుల్ఫుగారు వ్రాసిరి. 1 లార్డులిట్టనుగారి గవర్నరుజనరలు పదవి యంత్యకాలమునకు భారతదేశము మహాసంక్షోభమున మునిగియున్నదని జెప్ప వచ్చును. 2 ఈ సంక్షోభఫలితముగ దేశమునందు "దార్జన్యము, నేరములు, కూనీలు, బ్యాంకులదోపిడి, బజారులనుకొల్లగొట్టుట మొదలగు కృత్యములు ప్రబలిపోయి తదితరపరిస్థితులతో సమ్మేళనమగుచో దేశమునందు తిరుగుబాటు సంభవింపవచ్చును." అని, హ్యూముగారుతలచిరి. 3 ఈ పరిస్థితులయందుద్భ వించిన దేశీయ మహాసంక్షోభమును వెళ్ళగ్రక్కుట కొకమార్గముగనే దేశీయ మహాజనసభ స్థాపింపబడినది. 4

# దేశీయ మహాజనసభ లేక కాంగ్రెసు.

1 సంక్షోభ ఫలితము.

దేశీయమహాజనసభను స్థాపించుసంకల్పముతో హ్యూము గారు 1 వ మార్చి 1883 వ సంవత్సరమున కలకత్తా విశ్వవిద్యాలయ విద్యార్థులకు వ్రాసినలేఖ చిరస్మరణీ యము. భారతజాతీయ చరిత్రయందు సువర్ణాక్షరములతో ముద్రింపదగిన త్యాగో ద్బోధనము. "మీయందు ఘనుడగువాడు మీసేవకుడుగ నుండవలయును. మీరు స్వార్థమును, సౌఖ్యమును, త్యజింపజాలక పోయినచో దేశాభివృద్ధి జరుగు నను నాశకు నేడు స్థానములేదు. నేడు, హిందూదేశ మనుభవించుచున్న

1. Quoted in India under the British Crown. P. 211.
2. See. Congress History P. 11.
3. See. Congress History P. 11.
4. See. Congress History P. 11.

ప్రభుత్వమునకంటె మంచిప్రభుత్వమును కలిగియుండుటకు హిందూదేశము కాంక్షించుచున్నదనిగాని, హిందూదేశమున కర్హత గలదనిగాని నిశ్చయముగ జెప్పదగును." హ్యూముగారి యీ వాక్యముల గమనించుచో 19 వ శతాబ్దాంతమున భారతరాజకీయ రంగమునం దెంతటి మహాప్రళయమగు తుపాను బట్టియున్నదియు సుబోధకము కాగలదు.

2 లార్డు రిప్పను వైస్రాయి 1880-1884

రిప్పనుప్రభువు వైస్రాయిగ నియమింపబడి యుండెను. ఈయనకాలమున రాజకీయాసంతృప్తి కొంతవరకు తొలగించుట యవసరమని గ్రహింపబడినది. 1882 లో స్థానికపరిపాలన మేర్పరుపబడవలెనని రిప్పనుగారు నిర్ణయించిరి. స్థానికసంస్థల యుద్యోగాధికారములు రెండును, ఉద్యోగేతరుల చేతియందే యుండవలయునని రిప్పనుగారి సంకల్పము. పత్రికానిర్బంధవిధాన శాసనమును తొలగించుట, విద్యావిధానమున సంస్కరణములు గావించుట మొదలగు కృత్యములొనరించి, లిట్టనుగారికాలమునం దసంతృప్తిమయమై పోయిన హిందూదేశమునం దొకింత సంతృప్తినెలకొల్ప బ్రయత్నింపబడినది. రిప్పనుగారినామము భారతరాజ్యాంగచరిత్రయందు సంస్మరింపతగినదే.

# 10. 1892 రాజ్యాంగ సంస్కరణములు - నాటి రాజనీతి.

1 లార్డుడఫెరను 1884-1888

రిప్పనుగారి యనంతరము లార్డు డఫెరనుగారు వైస్రాయిగా నియమింపబడిరి. (ఈకాలముననే బర్మాదేశము జయింపబడినది. మైసూరురాజ్యము హిందూ రాజవంశస్థుల కొసగబడినది.) లార్డురిప్పనుగారి పరిపాలన నాటనుండియు హిందూదేశమున జనించిన రాజకీయవాతావరణమును డఫెరనుగారు గూడ బాగుగ గ్రహించియే యుండిరి. "పునాది కట్టుదిట్టములేనిదే భవనముపై బరువు మోపినచో భవంతి కూలిపోవురీతిగనే, వివిధజాతులతోగూడిన దేశమున

సామ్రాజ్య నిర్మాణమును పునాదుల కట్టుదిట్టములేకుండగ అపాయాపాయముగ చేసిన కొలదియు ప్రమాదమని డఫెరనుగారు తనసాటి యాంగ్లేయ రాజకీయవేత్తలకు వ్రాసియుండిరి. శాసనసభలలో భారతీయులకు స్థానమొసగుట యవసరము. నేడు పశుబలమున గావింపబడుచున్న దనబడే ప్రభుత్వచర్యలు భారతీయుల సలహా సంప్రదింపులతో గావించిననాడు, ప్రజానుమతిని పొందిననాటిగ నవి పరిగణింపబడును. అందులకై భారతీయులకు శాసనసభలలో స్థానమొసగ వలయు” నని డఫెరనుగారు తలంచిరి. కాని, రాజ్యాంగ నిర్వాహణమున కర్తృ స్థానమొసగుట కీయనకయిష్టము. భారతీయులను బుజ్జగించుటకు తగినంతగ మాత్రము రాజ్యాంగము సంస్కరింపవలయునని యాయన విశ్వాసము.

“కాంగ్రెసు తీర్మానరూపముగ గోరుచున్న కోర్కెలు అమితముగనున్నవి. అణగద్రొక్కవలసినవిగ నున్నవి.” ... ... అని డఫెరనుగారు రాజ్యాంగ కార్యదర్శికి వ్రాసియుండిరి. (1888–12–3 తేదీ జాబు)

“జాతీయమహాజనసభ యనే పెద్దపేరుపెట్టుకొని వ్యవహరించే వంగదేశ సంఘనాయకులు ఆంగ్లేయరాజ్యాంగమువంటి రాజ్యాంగము భారతదేశమునకు కావలయునని కోరుచున్నారు. వీరికి నాయుపన్యాసమునందలి కొన్నిభాగము లాశాభంగమును గలిగింపవచ్చును. అతివాదులకు జాగరూకతతో నొసగబడ నున్న యీ సంస్కరణములు సంతృప్తికరములుగ నుండకపోవచ్చును.” అని డఫెరనుగారు ఆంధ్రూసువిందునందొసగిన యుపన్యాసమున నుడివిరి. ఈ వాక్యములు బుద్ధిపూర్వకముగ నొసగినవే యని తమ జాబునందు వ్రాసిరి. ఈవిధముగ డఫెరనుగారు నాడుగావించిన యుపన్యాసములును, విమర్శనములును, మొట్ట మొదటినుండియు, ఆంగ్లేయరాజకీయవేత్తలు భారతీయులను వీలువెంబడిని బెదిరించుటకును, ననువుననుసరించి బుజ్జగించుటకు పూనియుండిరని రుజువు చేయుచున్నవి. ఈ ఆంగ్లేయరాజనీతికి డఫెరనుగారు వన్నెదెచ్చిరని చెప్పవచ్చును.

2
లైన్స్డౌను ప్రభువు.
1893–1894

డఫెరనుగారిస్థానమున వైస్రాయిగ నియమింపబడిన లాన్సుడవును ప్రభువుగారు భారతీయులు, భారతీయసంతృప్తి మీదనే పరిపాలింపబడుచుండిరనియు, 1833 వ సంవత్సర ప్రాంతములందువలె దౌర్జన్యము నాధారముగ జేసికొని పరిపాలింపబడుట లేదనియు, విశ్వసించుచునే భారతదేశమునకు వచ్చియుండెను.1

నూతనరాజ్యాంగ సంస్కరణముల నమలులోనికి దీసికొనివచ్చు బాధ్యత లాన్సుడవునుగారి పరమైనది. ఆంగ్లేయరాజ్యాంగమువంటి రాజ్యాంగమును కోరెడి భారతీయులకట్టి రాజ్యాంగము లభింపజేయబడదని లాన్సుడవునుగారు విస్పష్టముగ జెప్పియుండిరి. "నావిశ్వాసము ననుసరించి హిందూదేశముపట్ల నమితసానుభూతిగల ఆంగ్లేయరాజకీయవేత్తలుగూడ, వారుహిందూదేశమునకు పాశ్చాత్యరాజ్యాంగ విధానమును సూచించుచున్నారని తలంపబడుటకు సావకాశము లేకుండగనే జాగరూకత వహించియున్నారని యంగీకరింపక తప్పదు.2 ఈ నూతనసంస్కరణముల ననుసరించి కౌన్సిలుసభ్యులసంఖ్య పెంచబడినది. వివిధవిషయములపై సభ్యు లుపన్యసించుటకును, ప్రశ్నించుటకును మాత్రమే కౌన్సిలుసభ్యుల కధికారము లొసంగబడినవి. ఈ సంస్కరణములు 1893 లో నాచరణకువచ్చినవి. 1890 సంవత్సరమున, కాంగ్రెసు, భారతీయవాంఛితములను సీమప్రభుత్వమునకు దెల్పుటకై యొకరాయబారవర్గమును పంపియుండెను. 1890 లో బ్రాడ్లాగారు హిందూదేశమునకువచ్చి, భారతీయాభిప్రాయమును స్వయముగ గనుగొని వెడలవలసినంతగ ప్రజాభిప్రాయము భారతదేశమున విజృంభించినది. ఈయనయే మరుసటిసంవత్సరము పార్లమెంటులో కౌన్సిలు సంస్కరణ శాసనముల నుపపాదించియుండెను.3

"ప్రశ్నల నడుగుటకు సావకాశ మొసంగబడినది. ఆదాయవ్యయ శాసనమును విమర్శించుట కధికార మొసంగబడినది. ఈవిధముగ బాధ్యతాయుత

1. See. His reply to the address presented by some Indians at Lord North Brooke's house on the eve of his departure for India.
2. See. Page 313. B. D. Basu India under British Crown.
3. See. A Nation in Making. Sir Surendranatha Benerjee.

పరిపాలనమును నెలకొల్పుటకు ప్రశంసనీయమగు మొదటిమెట్టు వేయబడినది. ఇందులకు కాంగ్రెసు చేసిన ప్రయత్నమే కారణము. కాంగ్రెసు రాయబార వర్గపుకృషియే కారణము. 1892 వ శాసనము 1909 లో తిరిగి సంస్కరింప బడినది. కాని, 1892 లో ప్రజాప్రతినిధి పరిపాలనకు వలయుపునాదులు నిశ్చయమైనవి. నిజముగ వేయబడినవి.'' అని సురేంద్రనాథ బెనర్జీగారు విశ్వసించి యుండిరి. 1 కాని, యీ విశ్వాసము ప్రజాబాహుళ్యమునకు లేదు ఈ సత్యము రౌలటుకమిటీ నివేదికననుసరించి గ్రహింప గలుగుచున్నాము. రౌలటు కమిటీ తన నివేదికలో 1893 వ సంవత్సరమునుండియు, హిందూదేశమున విప్లవోద్యమము స్థాపింపబడియుండెనని వ్రాసినది. ఈవ్రాత నిజమగుచో, 1892 సంవత్సరపు సంస్కరణములు ప్రజావిశ్వాసమునకు పాత్రముకాలేదనుట సత్యమగును. మరియు ఆంగ్లేయప్రభుత్వ పరిపాలనపై 1893 నుండియు ప్రజలలో నీ విశ్వాసము విపరీతముగ జనించియుండెనని యంగీకరింపకతప్పదు. "వంగదేశ విభజనకాలము నాటినుండియు, ననగా 1905 వ సంవత్సరము నాటనుండియు మాత్రమే హిందూదేశమున విప్లవోద్యమము ప్రారంభింపబడియుండెనని యింతవరకును తలంపబడుచున్నది. కాని, రౌలటుకమిటీ 1893 వ సంవత్సరమునుండియు విప్లవోద్యమము ప్రారంభింపబడెనని ఆ సంవత్సరము జరిగిన కొన్ని నేరములనే యాథార్థ్యముగ గొని వ్రాసినది. అట్లయినచో హిందూదేశమున సిఫాయిల తిరుగుబాటుకాలము నాటనుండియు విప్లవోద్యమ మున్నదని యేల చెప్పరాదు? లార్డుమేయోగారి హత్యగూడ గమనింపబడి సిఫాయిలతిరుగుబాటు నాట నుండియు హిందూదేశ చరిత్రయందు విప్లవోద్యమము ప్రారంభింపబడియే యున్నదని చెప్పవచ్చును." 2

"హిందూదేశమునందలి ప్రభుత్వాధికారమును విస్తరింపజేయుటయు, పునాదులను పెంచుటయు — నూతన రాజ్యాంగశాసనముయొక్క యుద్దేశ్యమని జెప్పుట నావిధి. ప్రభుత్వకార్యనిర్వహణమున నేడులేని మరికొన్ని సావకాశము లను దేశీయులకును, ఉద్యోగేతరులకు, నొసగజూచుటయే యీశాసనోద్దేశ్యము.

1. See. A Nation in making PP. 110.

2. Tribune remarked thus, quoted by B. D. Basu. P. 498. India under Crown.

1858 వ సంవత్సరమునుండియు, హిందూదేశ ప్రభుత్వమును సీమప్రభుత్వము వశపరచుకొనిన నాటినుండియు, భారతీయులయందుత్తమతరగతి ప్రజలలో గోచరించుచున్న రాజకీయాభినివేశమును - రాజకీయ కార్యనిర్వహణశక్తియును గుర్తించుటయే యీశాసనాభిప్రాయము. సం॥ 1861 రపు రాజ్యాంగ శాసనమును సవరించుటయే యీశాసన కర్తవ్యము. చిరకాలమునుండి శాసనాధికారములు హిందూదేశమునందుగలవు. కాని, యివి పరస్పర విరుద్ధములుగ నున్నవి. ట్యూడరు, స్టూవర్టు రాజులు మొదలు యీస్టిండియా కంపెనీ కాలములోగూడ నున్నవి.".........."ఈసంస్కరణముల బిల్లును గురించిన చరిత్రము, పార్లమెంటు జీవితముయొక్క వాతావరణము ననుసరించి యిటునటు తక్కువగ కొట్టుకొనియుండలేదు. 1890 లో రాజ్యాంగకార్యదర్శిచే యీబిల్లు మొట్టమొదటగ ప్రభువుల సభలో ప్రవేశపెట్టబడినది. రెండవపర్యాయ మీ బిల్లుపై విశేషమగు చర్చ జరిగినది. ఈచర్చ గమనీయమైనది. ప్రత్యేక సంఘ విచారణయందు ప్రభువులు ముఖ్యములగు సవరణలను గావించియుండిరి. ఈప్రభువులు హిందూదేశప్రభుత్వ నిర్వహణమున విశేషముగ ననుభవమును సంపాదించియుండిరి. పిమ్మట ప్రభువులసభ యంగీకరించి యున్నది. కాని, కామన్సుసభలో మొదటి పర్యాయము మాత్రమే, పార్లమెంటు సమావేశమున చదువబడినది. 1891 లో గూడ నట్టివిపరీత పరిస్థితులకే గురియయినది. ..................ఈ విధమగు అలస్యము హిందూదేశమునందాశాభంగము సహజముగ గలిగించినది........... ...ఈ యాశాభంగము సక్రమమైనదే."............ఇవి జార్జి నతీనియలు కర్జనుగారు బిల్లు నుపపాదించుచు గావించిన నుడులు. 1892 వ రాజ్యాంగ సంస్కరణలపై కామన్సు సభయందొసగిన యుపన్యాసభాగములు. ఈవాక్కుల ననుసరించి యీశాసనోద్దేశ్యములు సుబోధకములగుచున్నవి. ఇందును గురించి పార్లమెంటుసభ జూపిన శ్రద్ధయు ప్రస్ఫుటమగుచున్నది.[1] "......ఈబిల్లు త్వరలో శాసనము కాగలదను నాశను నేను వెల్లడించుచున్నాను. ఇటువంటి ముఖ్యశాసనము సంవత్సరములకొలదిగ నిలుపుదల చేయబడియుండుట నిశ్చయముగ దురదృష్టము.

1. See George Nathaniel Curzon's Speech. House of Commons 28th March 1892.

మనకు మనదేశవ్యవహారము లెంతటి ముఖ్యవిషయములైనను, హిందూదేశము నందుగల మహత్తర సామ్రాజ్యముపట్లగూడ విశేషబాధ్యతగలదని మనము మరువరాదు. అట్లు మరచుట మనకు శ్రేయోదాయకమును గాదు. ఈవిషయము వెంటనే పూర్తిచేయవలయునని నాయాశయము. ఏలనన, సంతోషముతో నేనొక విషయమును గమనించితిని. హిందూదేశమున ప్రజాభిప్రాయము చాలమితవాదమునకు వచ్చినది. హిందూదేశమునంగలి సభలలో వివేకయుక్తమగు ధోరణి వినిపించుచున్నది. ఈసంస్కరణము లామోదింపబడునని తలంచుటకు వలయు నావకాశములు గోచరించుచున్నవి. సంపూర్ణాంగీకారముకొరకై యొక్కసారిగ నెదురుచూడరాదు. కాని, మనము సంస్కరణములు ప్రారంభించుచో నిజమగు నుపయోగమునకును-మన హిందూదేశ సామ్రాజ్య సంరక్షణమునకును నిశ్చయమగు పునాదులు వేసినవార మగుదుము.” ఇవి హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగ నాడుండిన కింబర్లే ప్రభువుగారి వాక్యములు. ఈవాక్యములతో నతీనియల్ కర్జనుగారు గూడ తమ యుపన్యాసమునం దంగీకారమునుదెల్పిరి. ఈవాక్యముల ననుసరించి యీ శాసనమున కాధారమైన రాజనీతికి ప్రజాందోళనయు, ప్రభుత్వ నిర్బంధ విధానమును, సామ్రాజ్యసంరక్షణ తృష్ణయు కారణములనుట నిర్వివాదాంశము.

## 11 నిర్బంధవిధాన విజృంభణము.

1
రెండవ ఎలిజను
ప్రభువు
1894–1899

ఈచంచల పరిస్థితులే 1893 నుండియు వృద్ధికాజొచ్చినవి. ఆంగ్లేయ రాజకీయ వేత్తలుగూడ నట్టి పరిస్థితులకు దోడ్పడుచునేవచ్చిరి. లాన్సుడవును వైస్రాయికాలములో ప్రజాందోళనము, నిర్బంధవిధానము, విప్లవోద్యమములు మూడును నొకదానివెంట మరియొకటి ప్రారంభింపబడినవని చెప్పుట సమంజసము. “1898 వ సంవత్సరము రాజకీయాకాశము మేఘావృతమైనది. ప్రజాందోళనమును, దానివెనువెంటనే నిర్బంధవిధానమును, ప్రారంభింపబడినవి. పూనాలో ప్లేగు నివారణకై యాచరింప బడసాగిన విధానము

వల్ల ప్రజాందోళనము మరింత హెచ్చినది. దీని ఫలితముగ నిరువురాంగ్లేయో ద్యోగులు హత్యగావింపబడిరి. ఇందువల్ల నాటుసోదరులు ప్రవాసమున కంప బడిరి. పశ్చిమరాజధానిలో విప్లవోద్యమము పట్టుకొనబడినదని చెప్పబడినది."1 ఇంతతో ఎలిజను ప్రభుత్వము తృప్తి చెందియుండలేదు.

1891 లో వంగదేశమున బంగబాసీ సంపాదకుడు - ప్రకటించువాడు - మేనేజరు — ముప్పురును రాజద్రోహనేరమునకై శిక్షింపబడిరి.

లార్డురిప్పనుగారు సం॥1882 రములో పత్రికాస్వాతంత్ర్యము తిరిగి యొసంగి రని ప్రొఫెసరు కీతుగారివంటి చరిత్రకారులు వ్రాయ సాహసించిరి. 2 ఇది యసత్యమని బంగబాసీ రాజద్రోహనేరారోపణమే రుజువొనరించినది. "పత్రికా స్వాతంత్ర్యము దుర్వినియోగమొనరింపబడినది. మహా సంస్కృత విద్వాంసుడగు బాలగంగాధరతిలక్ గారి నాయకత్వమున బొంబాయిలో హిందూమత పూర్వా చార పరాయణత్వము విజృంభించినది. 1896లో వచ్చిన కరువునకు తోడుగ విపరీతమగు ప్లేగుజాడ్యముకూడ విజృంభించినది. ఈ ప్లేగుజాడ్యమునకు గురి యైనవారిని ప్రత్యేకించుట కాంగ్లేయసైనికులు వినియోగింపబడిరి. ఈ తరుణము నూతగగొని తిలకుగారు తన పత్రికయగు 'కేసరి' మూలమున ననాగరికులపట్ల క్రోధోద్రేకములను రగులుగొల్పసాగిరి. ఈ విధముగ ప్రజలను రెచ్చగొట్టుటవల్ల నిరువురు ప్రభుత్వోద్యోగు లవమానింపబడిరి. ఈకారణమున తిలకుగారు తమ వ్రాతలకై రాజద్రోహమునకై విచారింపబడి శిక్షింపబడిరి." అని కీతుగారు పత్రికాస్వాతంత్ర్యము నరికట్టిన ప్రభుత్వచర్యను సమర్థింపసాగిరి. 1897లో లోక మాన్య బాలగంగాధరతిలకుగారిపై తేబడిన కేసుగూడ ఆసేతుహిమాచల పర్యంతము జాతీయవాదమును మారుమ్రోగించినది. తిలకుమహాశయుడు బాలబాలికలను శరీరవ్యాయామముజేయ ప్రోత్సహించుచుండెడివాడు. ఈ ప్రోత్సాహము విప్లవోద్యమ ప్రోత్సాహ మనబడినది.

"క్రోడీకరించి చెప్పవలెనన్న హిందూదేశీయైహిక సుఖస్థితి యెట్లున్న దనగా నాంగ్లేయులచే ననగద్రొక్కివేయబడి, యవినీతికి గురిచేయబడుటయే

1. See. A Nation in Making PP. 143-44.
2. See. Prof. Keith. Constitutional History of India. P. 226.

గత శతాబ్దమునందలి ముఖ్యలక్షణములు. ఈ శతాబ్దములో అత్యధికజీతములతో, నాంగ్లేయోద్యోగుల నమితభారముతో భరించుటయే భారతదేశార్థికస్థితి. ఇందువల్ల హిందూదేశమునకు "అర్థము" అనునది లేనేలేదు. ఏయర్థనీతిజ్ఞుడుగాని, హిందూదేశమున నారోగ్యకరమగు "అర్థనీతిని" నిరూపింపజాలడు. రెండురెళ్ళను కలిసితే ఆరగు ననగలిగిన ఆర్థిక నీతికోవిదుడుమాత్రమే సమర్థుడు కాగలడు. అసలుండవలసిన ప్రధానస్థితి లేదు. పన్నులను చెల్లించువారే పన్నులను ఖర్చుపెట్టుటకును, పన్నులను చెల్లించువారికొరకే ప్రభుత్వకోశము వినియోగించుటకును — వలయు నధికారములేదు. పన్నుల మూలమున వసూలుచేయబడుచుండిన సొమ్ము ప్రతిసంవత్సరమును చాలభాగము భారతీయులుకానివారిచే మ్రింగివేయబడుచు, విదేశములకుగొంపోబడుచున్నది." అని దాదాభాయినౌరోజీగారు 1894 ఆగష్టు 14 వ తేదీని పార్లమెంటుసభయందుపన్యసించిరి. ఈ పరిస్థితు లీకాలమునం దమితముగ నుండెను. రెండవ ఎలిజనుగారి పరిపాలనకాలమున హిందూదేశము యుద్ధములవల్లను, కఱవుకాటకములవల్లను క్షోభించినది. ఇందులకుతోడు ప్రభుత్వ నిర్బంధవిధానమును, ప్రజాందోళనమును — రాజకీయ వాతావరణమునంతయు నల్లకల్లోలమున ముంచివేసినది. పత్రికాస్వాతంత్ర్య మపహరింపబడినది. స్థానికపరిపాలనపై దండెత్తబడినది. భారతీయులమధ్యను, నాంగ్లేయులమధ్యను జాతిద్వేషము పెరిగినది. ఇందులకు వైస్రాయిగారు విశేషముగ దోడ్పడియుండిరి. హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి "ముక్కునకు తాడుబోసి ఎటులాగిన నటుల వైస్రాయిలు నడువవలసి యున్నదని ఎలిజనుగారు చెప్పినమాటలలోనే ఆయన పరిపాలనయందలి అపభ్రంశములకు గారణములను దెలిసికొనగలము. 1

2
గ్లాడుస్టను గారి
విమర్శన.

"ఈ మహోత్తమజాతియొక్క యాశోదయము నలక్ష్యముగను, ననాదరణముగను, జూచుట తగనిపని ..... (సం॥ 1888 లో) .....(1894 లో) అతిరహస్యముగ, అర్థరాత్రమువేళ, పార్లమెంటునకు తెలియకుండగ, దేశమునకు తెలియకుండగ పత్రికాస్వాతంత్ర్య మపహరించుచు, హఠాత్తుగ, తంతికి

1. See. B. D. Basu P. 352 India under Crown.

ప్రత్యుత్తరముగ, నొక శాసనము గావింపబడినది. ఇట్టి శాసనము బ్రిటిషు సామ్రాజ్యమున కవమానకరమని నా యభిప్రాయము.'' అని ఆంగ్లేయులకు పూజ్యనీయు డగు గ్లాడుస్టనుగారు నుడివిరి.[1] నాటి రాజకీయపరిస్థితులను, భారతీయ చిత్తవృత్తులను, దెలిసికొనుటకు ఆర్గలుగారి యభిప్రాయములుగూడ గమనింపదగియున్నవి. హిందూదేశము దీర్ఘదరిద్రవ్యాధిచే పీడింపబడుచున్నది. జీవించియుండుటకుమాత్రమే తగినంత ఆహారము లభించెడి స్థితికి వచ్చినది. పాశ్చాత్య ప్రపంచమునందు సాటిలేని కనిష్టజీవనోపాధిమాత్రమే భారతీయ ప్రజాసామాన్యమునకు లభించుచున్నది. "1888 సం॥ లో......ఆంగ్లేయులు తమ వాగ్దానములను, ఒడంబడికను నెరవేర్చియుండలేదు." ఈపరిస్థితు లావేటి కావేడు దోహదము గావింపబడుచువచ్చినవి. స్వరాజ్యకాంక్షను నిర్బంధ విధానమున పుట్టుకలోనే త్రుంచివేయవలెనని యాంగ్లేయ రాజనీతి. శస్త్రములు లేవు. పత్రికాస్వాతంత్ర్యములేదు. వాక్స్వాతంత్ర్యములేదు. సభాస్వాతంత్ర్యముగూడ సంపూర్ణముకాదు. ఇక కర్తవ్యమేమి? బోనునందు బంధింపబడిన సింహకిశోరములవలె, కాంగ్రెసు మహామంటపమునుండి తీర్మానరూపముగ భారతీయులు తమ స్వాతంత్ర్యఘోషను వెల్లడించుకొనుచుండెడివారు. కాంగ్రెసు శక్తివంతమైనకొలదియు, ప్రభుత్వనిర్బంధవిధానముగూడ తీవ్రస్వరూపము దాల్చ సాగినది. "పరిపాలనయు, ఆర్థికశోషణయు, నొకదానివెంట మరియొకటి యంటియేయుండు'' నని లార్డు కర్జనుగారొక యుపన్యాసమున నుడివియుండిరి.[2] (Administration and exploitation go hand in hand.) ఈచిత్తవృత్తి జాతీయోద్యమమున కెప్పటికప్పుడాహుతి నొసగుచునే వచ్చినది.

## 12 వంగదేశ విభజనము.

1 కర్జను ప్రభువు. 1898–1905

ఈపరిస్థితు లానాటికానాడు దినదినాభివృద్ధి నందసాగినవి. కర్జనుప్రభువుగారి హయాములో భారతరాజకీయ వాతావరణమంతయు తుపానుబట్టిన సముద్రమువలె నున్నది. "చెప్పిన దొకటి. చేసే దొకటి." యీాయన పరిపాలనా ఫలితములు.

1. Quoted by the President of the Indian National Congress at the 3rd Congress Session at Madras. See. History of the Congress. P. 134.
2. See. Congress History. P. 113.

"నేను భారతదేశమును, భారతీయులను, భారతచరిత్రమును, భారతీయ ప్రభుత్వమును, భారతీయనాగరిక జీవితములయందలి క్లిష్టస్థితులను ప్రేమించెదను." అని కర్జనుగారు వైస్రాయిగ నియమింపబడిన వెంటనే నుడివిరి. 1 కాని, ఫలితమేమి? హిందూదేశ రాజ్యాంగమున కాధారభూతములగు ప్రతిసిద్ధాంతమును, కర్జనుగారు త్వరితగతిని తుడిచివేసిరి.

(1) "కర్జనుప్రభువు విద్యావంతులనందరను క్షమార్హము గానికతిగ ప్రభుత్వమునకు విముఖులుగ నొనరించగలిగెను.

(2) వ్యవసాయదారులు, క్షామదేవతకు గురియగుచుండగా అనుభవజ్ఞుల సలహాలను గ్రహింపక వారిని అన్నాతురులుగనొనరించి యాకలిబాధచే మరణావస్థకు దిగలాగెను.

(3) వాచామృదువుగ మాట్లాడినను, నసంతృప్తికరముగనే సంస్థానాధీశుల పట్లగూడ వర్తించెను. అని యీయన చరిత్రయందు వ్రాయబడినది.3 భారతదేశమునం దన్నితరగతుల ప్రజలయందునను సర్వతోముఖమగు నసంతృప్తిని జనింపజేయ కలుగుటలో కర్జనుప్రభువుగారు సర్వసమర్థుడుగా పరిగణింపబడినాడు.

ఆంగ్లేయప్రభుత్వము భారతదేశమును "విడదీసి పరిపాలించవలెనను" రాజనీతిని ప్రయోగింపసాగినపుడెల్ల ప్రజలలో స్వదేశోత్సాహములు రగుల్కొనసాగినవి. వంగదేశము రెండుభాగములుగ నొనరింపబడినది. ఏక భాషను మాట్లాడువారిని రెండు ప్రత్యేకప్రభుత్వములక్రింద విభజించుట వంగీయులలో గల నైకమత్యము నశించిపోవుటకు తగినసాధనమని యూహింపబడినది. జాతీయసంరంభమున భారతదేశమునకు నాయకమణియై విరాజిల్లసాగిన వంగీయు లిందుల కియ్యకొనజాలకపోయిరి. వీరిమాతృభాషాప్రేమ యొక మహాజాతీయోద్యమమునకు పునాదియైనది. "నేలకుకొట్టబడిన బంతి, కొట్టినకొలదియు పైకెగురు

1. A Nation in Making. P. 156.
2. See. The Failure of Lord Curzon.
3. See. The Failure of Lord Curzon. An open letter to the Earl of Rosebery by "Twenty eight years in India. London 1903. PP. 2—3.

నట్లు, వాయించినకొలదియు తాపా ప్రతిధ్వనించుచు ప్రమోగునట్లు, ప్రభుత్వ నిర్బంధవిధానము హెచ్చినకొలదియు 1905—1906 వ సంవత్సరపు జాతీయోద్యమము దినదినాభివృద్ధి గాంచసాగినది. 1

1902—3 సంవత్సరములకే విప్లవోద్యమము హిందూదేశమున పాదుకొన సాగినది. ఈ విప్లవోద్యమమునకు వంగదేశవిభజనము దోహదమైనది. పరిపాలనా సౌకర్యముకొరకును, ప్రజోపయోగము కొరకుమాత్రమే వంగదేశ విభజనమునకు గడంగవలసివచ్చినదని ప్రభుత్వపక్ష వాదము. ఈ విభజనమువలనగలిగిన రెండవరాష్ట్రము "పూర్తిగ మహమ్మదీయ రాష్ట్రమగును. ఢక్కాలో రెండవహైకోర్టు పెట్టబడునని కలకత్తాన్యాయవాదు లసూయకు పాలైరి. తూర్పువంగదేశమునకు జరిగినయన్యాయము గుర్తింపబడలేదు." అని కీతుగారు వంగదేశవిభజనమును ప్రభుత్వపక్షమున 1935 లో సమర్థింపబూనుట చరిత్రకారుల లక్షణముగాదు.2 వంగదేశ విభజనకు "విడదీసి పరిపాలించు" రాజనీతియే కారణము. వేరువిధముగ సమర్థింపబూనుట సత్యవిరుద్ధము. లేనియెడల యీ విభజనోద్యమ మాసేతు హిమాచలపర్యంతముప్రాకి మహాజాతీయోద్యమముగ విజృంభింపజాలదు. "రహస్య విప్లవసంఘములు త్వరితగతిని నెలకొల్పబడినవి. ఆయుధములు సమకూర్చుకొనబడినవి. రాజకీయపు బందిపోటులమూలముగ వలయుధనము సేకరింపబడినది. రాజద్రోహప్రచారము పత్రికలమూలమున వ్యాపింపసాగినది. బహిరంగముగగూడ యుగంతరపత్రికలలో దౌర్జన్యము ప్రచారముచేయబడినది. 1908 వ ఏప్రియలు 30 వ తేదీని ముజఫర్ పూరు జిల్లాజడ్జీని చంపుటకై విసరబడిన బాంబు లచ్చటగల యిరువురాడవాండ్రపై బడుట తటస్థించినది. కుదీరాంబోసు అను యువకుడందులకై యురిదీయబడినాడు. యుగంతరపత్రికా సంపాదకుడు ప్రవాసశిక్షకు గురియైనాడు. వందేమాతరం పత్రికాసంపాదకుడగు అరవిందఘోషుపైగూడ రాజద్రోహనేరము మోపబడినది. ప్రజలు బ్రిటిషు వస్తు వస్త్ర బహిష్కరణోద్యమ ప్రచారము సాగింపసాగిరి. స్వదేశీతత్వము నెలకొనసాగినది. వంగదేశమునందు మాత్రమేకాదు, 1907 లో

1. Congress History. P. 164.
2. See. Keith. P. 227. Constitutional History of India.

పంజాబునందుగూడ విప్లవోద్యమము విస్తరించినది. పోలీసువారి దళము సేనలను తిరుగదీయు ప్రత్నములుజరిగినవి. పంజాబు కేసరియగు లాలాలజపతి రాయి, అజతుసింగులు హిందూదేశమునుండి తరిమివేయబడిరి. 1908 లో సభానిషేధ శాసనమును, పత్రికాప్రచార నిషేధశాసనమును గావింపబడినవి. (Seditious meeting Act and Press Act).

అయిననేమి? అక్కడక్కడ, అప్పుడప్పుడు హత్యలుజరుగుచునే వచ్చినవి. ఇంగ్లడునందు స్థాపింపబడిన ఇండియాసంఘమొక విప్లవసంఘముగ భావింపబడినది. ఈ సంఘమును నెలకొల్పిన శ్యామ్జీకృష్ణవర్మ విప్లవనాయకునిగ పరిగణింపబడినాడు. 1 వ జూలై 1909 వ సంవత్సరమున యింపీరియల్ యిన్స్టిట్యూటునొద్ద సర్. డబ్ల్యు. సి. విల్లీగారును, డాక్టరు లాల్కాకాగారును హత్యగావింపబడిరి. విల్లిగారిని రక్షింపబోయి పార్శీయగు లాల్కాకాగారుగూడ హత్యకు గురియయిరి. ఈ హత్యలకు కారకుడగు మదనలాల్ డింగ్రా ఉరిదీయబడినాడు. ఇట్లే నాసిక్ కలెక్టరగు జాక్సనుగారుగూడ హత్యగావింపబడిరి. ముజఫర్పూరు కేసుపై పత్రికలో వ్యాఖ్యానము గావించినందులకు తిలకుగారికి 6 సంవత్సరముల ఖయిదువిధింపబడెను. ఈయన మాండలేజైలులో, బర్మాయందుంచబడెను. మానిక్టుల్లా కుట్రకేసులోగూడ 15 గురు వంగీయులు శిక్షింపబడిరి. 9 గురు స్వదేశమునుండి తరిమివేయబడిరి. గోపాలకృష్ణగోఖ్లే, లార్డుమోర్లేగారుకూడ తిలకుగారిపై తేబడిన రాజద్రోహనేరమున కసమ్మతిని దెలిపిరి. అయినను "లా" ను మన్నించునపు డీనేరారోపణము సమంజసమైనదే నని కీతుగారి నిర్ణయము. ఇట్టి పక్షపాతములతో గూడిన నిర్ణయములును, దుందుడుకుతనములును నాటి ప్రభుత్వోద్యోగుల చర్యలకు కారణమగుటయే జాతీయోద్యమ విజృంభణకు మూలమైనది. "నన్నొక్కడను రాజద్రోహనేరమునకై శిక్షించుచో నావెనుక నా పత్రికాసంపాదకత్వమునకై మూడువందల మిలియనుల సంపాదకులున్నా"రని యుగంతరపత్రికా సంపాదకుడగు భుపేంద్రనాధదత్తు కోర్టులో నుడివియుండెను. "జూరీ నేను నేరస్థుడనని చెప్పియుండినను, నేను నేరస్థుడ గాననియే చెప్పుచున్నాను. లోకపరివర్తనముపై యధికారము చెలాయింపమానవేతరశక్తులుగలవు. నేను స్వతంత్రునిగ నుండుటవల్లకంటె నస్వతంత్రునిగ

నుండి బాధలననుభవించుటవల్లనే నే చేయదలచినపని యభివృద్ధి చెందవలెనని భగవంతుని యాశయముకావచ్చును.” అని బాలగంగాధర తిలక్కు ధీరోదాత్తునివలె త్యాగారాధనాశక్తిని గురించి వివరించియుండెను. వీరిరువురి ప్రకటనలయందునుగల సత్యమే అటుపిమ్మట రాజ్యాంగపరిణామమునకు మూలమైనది. విదేశీవస్తుబహిష్కరణోద్యమ పతాకము నెగురవేసిన 1905వ సంవత్సరం ఆగష్టు 7 వ తేదీయు, వంగదేశ విభజన మొనరించిన 16 వ అక్టోబరు దినమును భారతీయరాజ్యాంగపరిణామ చరిత్రయం దర్ధస్థానము వహింపగలిగినవి. సిఫాయిల తిరుగుబాటు జరిగినపిమ్మట భారతీయస్వాతంత్ర్యోద్యమ కాంక్షను రేకెత్తింపగలిగిన సుదినము లివియే. సిఫాయిల తిరుగుబాటు విఫలమైనది. కాని, స్వదేశీ యుద్యమమును, విభజనోద్యమమును, సఫలములైనవి. ఆనాటి స్వదేశీ యుద్యమబీజములే నేటికి మొలకలై, మహావృక్షములై, శాఖోపశాఖలై, చిగురించి పుష్పించి భారతీయస్వయంసహాయ సూత్రమున కాధారభూతములైనవి.

# 13 మింటో-మార్లే సంస్కరణములు-నాటి రాజనీతి.

1
లార్డుమింటో
1905-1910
17 th. Nov. 1905

కర్జను ప్రభువు పరిపాలనమునందు జనించిన ప్రజాందోళనమును కొంతవరకు చల్లార్చు టవసరమని యాంగ్లేయ రాజనీతిజ్ఞులు తలంచిరి. ఆనాడు మోర్లేగారు రాజ్యాంగ కార్యదర్శి. మింటోగారును, మోర్లేగారునుకూడ కలిసి పాలకులకును పాలితులకునుమధ్య పరస్పరానురాగ మేర్పరచుటవసరమని తలంచిరి. ఆనాడు హిందూదేశమున సంచార మొనరించిన యువరాజుగారికిపరిస్థితి యత్యవసరమని తలంచిరి. “చూపులకు పైపైన ప్రశాంతముగ గోచరించుచున్నను, యీప్రశాంతతకు నడుగుభాగమునం దపరిమితమయిన రాజకీయాసంతృప్తి ఘనీభవించియున్నది. ఈయసంతృప్తి సహేతుకమే. ఈ హేతువులను మనము పరీక్షించి తీరవలయును.” అని మింటోగారు వ్రాసియుండిరి.

"అసంతృప్తిని తొలగించుట కొక్కటేమార్గమున్నది. విద్యావంతులకు తమ దేశపరిపాలనములో, తమకర్హస్థానము హెచ్చుగ గలిగింపవలయును. . ఈవిధముగ నొనరించెదమని యాంగ్లేయ రాజకీయవేత్తలు వాగ్దానము లొనరించియే యుండిరి. భారతదేశ మీనాడు కోరునదేమి? అన్నింటికంటె ముఖ్యముగ పాలకులు విదేశీయులుగనున్నను సరే భారతదేశప్రభుత్వమున జాతీయతత్వ ముదయించవలెను. "ఇదియే భారతీయ వాంఛితము."

గోపాలకృష్ణ గోఖలేగారు 1906 వ మార్చిలో శాసనసభయం దిట్లుపన్యసించియుండిరి. ఈ యుపన్యాస భావముతో మింటోగా రేకీభవించిరి. "1906 జూన్ 15 వ తేదీని మార్లేగారు మింటోగారికి సంస్కరణములనుగురించి వ్రాసిన జాబిచట గమనీయము. "ప్రజాకర్షణకు వీలుగ మనమిప్పుడు సంస్కరణములను ప్రారంభించుటకు పూనుకొనలేమా? మనమట్లొనరింపక పోయినచో భారతీయుల కోరికలు పెచ్చుపెరిగిపోవా? పెరిగి జాతీయవాదముక్రిందమారదా? నేనీ విషయమును చాల అనుమానముతోను, సంశయముతోను చూచుచున్నాను. మా లెజిస్లేటివు కౌన్సిలులోను, రాష్ట్రీయ శాసనసభలలోను భారతీయ సభ్యుల సంఖ్యను పెంచుట, వెనువెంటనే యాచరింపవలసిన విషయముగనేల గ్రహింపరు? మీ శాసన సభలో నార్థికపత్రమును చర్చించుటకు నాలుగయిదుగంటలు ప్రత్యేకించుటకు మారుగ, సంపూర్ణముగ చర్చించుటకును, సవరణల నుపపాదించుటకును ఏల సావకాశముగలిగింపరాదు?

(ఉద్యోగస్థులగు సభ్యులే అధికసంఖ్యాకులుగ నుందురు.) మీయుత్తరములను బరీక్షించుచో నిట్టి మార్పులకు మీరు వ్యతిరేకులు గారనియు, ననుకూలురేయనియు, నాకు తోచుచున్నది. ఇక, నిట్టి విధమగు సంస్కరణములను ప్రకటించుటకేల సంసిద్ధముగనుండరాదు? మీరు నాకేవిధముగ నొక నివేదికను పంపిననుసరే. లేక నేనొకదానిని పంపెదను. ఇందులో కష్టమేమియు నుండ నవసరములేదు. వైస్రాయి కార్యనిర్వాహక వర్గమునందొక భారతీయ సభ్యుని నియమించుట సరిపోదని తలంచెదను. ఇది నిశ్చయము. ఇది సహజముగ నీరసులుగా నుండు నాంగ్లోయిండియనులకు భయము గలిగించును."

ఈ జాబునకు మింటోగారు 11 వ జూలై 1906 న తేదీనా డొసంగిన ప్రత్యుత్తర మిట్లున్నది.

"భారత దేశ రాజకీయ భవిష్యత్తును గురించి మీరు వ్రాసిన విషయ మంతటితో నేను హృదయ పూర్వకముగ నేకీభవించుచున్నాను.......మనము సంస్కరణములను మెట్టుమొదటినుండియు ప్రారంభించవలెను. కాంగ్రెసు నాయకులన్ననో మెట్టుపైనుండి ప్రారంభింపవలెనందురు. తయారయిన అధికారము తీసికొనివచ్చి చేతిలో పెట్టవలెనని వీరికోరిక. మన దేశములో తర తరముల కొలది రాజ్యాంగవిధానము పరిణామమునొందినది. నేటికి ప్రస్తుతస్థితి యందలి ప్రజాప్రభుత్వము నడచుచున్నది. హిందూ దేశమునం దట్లుగాదు. అంతయు తేడాయే. సనాతన కాలమునుండియు, నిరంకుశ ప్రభువులు పరిపాలించి యుండిరి. ఆధునిక రాజ్యాంగపద్ధతులకు సంసిద్ధులుగలేని ప్రజలపై పాశ్చాత్య రాజ్యాంగవిధానము మోపబడకుండ మనము కడుజాగరూకత వహించవలసి యున్నది......" మార్లే మింటోగారి యీయుత్తర ప్రత్యుత్తరములు పరీక్షించినచో వీరును భారతీయుల కన్నీటినితుడుచుటకే ప్రయత్నించియుండినట్లు తేలుచున్నది. అధికారముతోగూడిన బాధ్యతాయుత ప్రభుత్వము నొసగ వీరును హృదయపూర్వకముగ సంకల్పించియుండలేదు. నిర్బంధవిధానమువల్ల గలిగిన యసంతృప్తిని సద్దుచేయుటకై భారతీయులను బుజ్జగించవలెననిమాత్రమే ప్రయత్నించిరనుట నిశ్చయము. ఈవిధముగ ముందునకు ముందుగనే రాజ్యాంగ కార్యదర్శియు, వైస్రాయియును సంస్కరణములను గురించి నిశ్చితాభిప్రాయమునకు వచ్చియే బహిరంగముగ జరుగవలసిన తంతును నడుపుటకు ప్రారంభించిరి. ఈరాజనీతియే, మింటో మార్లే సంస్కరణముల పునాది.

2 సంస్కరణముల సంఘము.

1906 వ ఆగష్టులో సంస్కరణములను గురించి విచారించుట కొక సంఘమును మింటోగారు నియమించిరి. (1) సంస్థానాధీశుల కౌన్సిలు నేర్పరచుట. ఇందులకు వీలు లేనిచో, వైస్రాయిగారి లెజిస్లేటివు కౌన్సిలులో వారికి ప్రాతినిధ్య మొసగుట. (2) వైస్రాయిగారి కార్యనిర్వాహకవర్గములో భారతీయ సభ్యుని నియమించుట. (3) శాసనసభలలో ప్రాతినిధ్యమును హెచ్చించుట.

(4) ఆర్థిక పత్రవిమర్శన కాలమును హెచ్చించుట—సవరణల నుపపాదించుటకు హెచ్చు సావకాశమును గల్పించుట.'' యీయైదువిషయములను గురించియు, యోజించి నివేదించవలెనని సంఘము నియమింపబడినది. ఈసంఘమొక మాసము దినములలో తన నివేదికను సమర్పించినది. వైస్రాయిగారి కార్య నిర్వాహకవర్గమున, భారతీయుని కార్యనిర్వాహకవర్గ సభ్యునిగా నియమించరా దని ప్రతిఘటించినది. కాని, మింటోగారీవిషయమై చాలపట్టుదలవహించిరి. "వీరివల్ల మనకు చాల సహాయము లభించును. భారతీయసభ్యుని నియమించని యెడల కాంగ్రెసునాయకుల వన్నాగములలోనికి మన ముఱికినవార మగుదుము'' అని వ్రాసిన మింటోగారి వ్రాతలను గమనించుచో భారతీయుని, కార్యనిర్వాహకవర్గమునందు సభ్యునిగా నియమించవలెనని మింటోగారు కాంగ్రెసువారి యాందోళనా భయమువల్ల పట్టుపట్టి యుండిరని తేలుచున్నది. 1 మోర్లేగారిందులకు సంపూర్ణముగ సంసిద్ధులైగూడ నుండలేదు. లార్డు ఎలిజను-లార్డు లాన్సుడవును-లార్డుకర్జను- మొదలగు వెనుకటి వైస్రాయి లిందులకు వ్యతిరేకముగ నుండుటయే కారణము.

లార్డుమోర్లేగారు "ఆంగ్లేయరాజ్యము నిలువవలెనన్న సంస్కరణముల నొసగుటయే మార్గ మనునంతటి'' తీవ్రముగ హిందూదేశమం దశాంతి ప్రబలి పోయినది. 1 వ నవంబరు 1908 వ సంవత్సరమున, నవగా రాణీగారి ప్రకటన జరిగిన 50వ సంవత్సరీకమునాడు సంస్కరణములనుగురించిన చక్రవర్తిగారి సందేశమును జోధపూరు దర్బారులో మింటోగారు ప్రకటించిరి. డిశంబరు 1908 లో మింటో – మోర్లే సంస్కరణములు సీమయందునను, హిందూదేశమునందునను ప్రకటింపబడినవి.

మితవాదు లీసంస్కరణముల నాహ్వానించిరి. సంస్కరణములవల్ల "హిందూదేశ మరాజకమునుండి సంరక్షింపబడినదని'' గోపాలకృష్ణగోఖలేగారు నుడివిరి. మొట్టమొదటగ హిందూదేశ ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గమునందు

1. See. Lord Minto's letter of Feb. 27 th 1907 to Lord Morely. Quoted by B. D. Basu. P. 427.

2. See. Morley's Recollections. Vol. ii. P. 211.

ఎస్. పి. సింహాగారు 1909 వ మార్చి 24 వ తేదీని సభ్యుడుగా నియమింపబడి యుండిరి. సంస్కరణముల శాసనము 1909 వ మేయి 25 వ తేదీని పార్లమెంటునం దంగీకరింపబడినది.

1910 వ జనవరి 25 వ తేదీని సంస్కరణశాసనముల ననుసరించిన నూతన శాసనసభ ప్రారంభింపబడినది. ఈ నూతన శాసనసభ తన జీవితమును నూతన పత్రికానిర్బంధశాసనమును గావించుటతో మొదలుపెట్టెనని చెప్పదగును. 1910 ఫిబ్రవరి 9 వ తేదీని నూతన పత్రికానిర్బంధశాసనము గావింపబడినది.

ఈ మింటో — మార్లే సంస్కరణములకు మూలము హిందూదేశ ప్రజాభిప్రాయమును, నాందోళనయు ననుట నిర్వివాదాంశము. ఇందులకు మార్లేగారి వ్రాతయే సాక్ష్యము. "విదేశస్తులకును — విదేశ పాలితులకును మధ్య సహకారభావ ముండుననుట కలయే కావచ్చును. చాలవర కిది నిశ్చయమే. అయితే, సంపూర్ణమైన నిర్బంధవిధానమును, సునిశితఖడ్గములే మార్గాంతరము. కాని, సర్దుబాటువలెనే యీ పద్ధతియు నపాయకరము. చంచలము. బాలఫర్ గా రిది యెంత చెడుపద్ధతియని తలంచినను స్వదేశ సైనికులకు తిరుగుబాటు తత్వపు టంటువ్యాధి వ్యాపించకుండనుండ రైళ్ళను — టెలిగ్రాములును, సివిలు జనసంఖ్యకుకూడ సైనికుల తిరుగుబాటు సంభవించుచో నూతనకష్టముల దెచ్చిపెట్టెడివి. లిబరలుపక్షసాధనములు నిష్ప్రయోజనములు కావచ్చును. కాని, కన్సర్వేటివుల యసంపూర్ణ సంస్కరణములు నిష్టములేకుండ నిచ్చే సంస్కరణములు నిశ్చయముగ ప్రమాదకరమగు నసమర్థస్థితిని దెచ్చిపెట్టును. చెడ్డమార్గ మగుగాక. మంచిమార్గ మగుగాక. ఆంగ్లేయపరిపాలకులను భారత జాతీయనాయకులతో స్నేహితులుగ నొనరించుటకు వలయు ప్రయత్నము లొనరించుట యొక్కటియే మార్గము. దీనితోబాటుగ రాజకీయబాధ్యతను నేర్పుటకు గూడ చేయగలిగినంతటి ప్రయత్నమును చేయవలయును.[1] ఈతత్వము నాటికిని, నేటికిని గూడ నాంగ్లేయ రాజకీయవేత్తలు హృదయపూర్వకముగ నంగీకరించి యుండలేదు. మింటో—మార్లే సంస్కరణముల నొసగుట యందుగల ముఖ్యోద్దేశము — సంస్కరణముల నొసగు రాజనీతియు — మార్లేగా రిట్లు సువ్యక్తపరచిరి.

---

1 See. P. 436. B.D. Basu. India Under British Crown.

"హిందూదేశపరిస్థితి యప్రతిహతముగను, సమూహ్యముగను నున్న దని నేను డిశంబరు మాసమున మాట్లాడినట్లుగ లార్డుడవును ప్రభువు నాకు జ్ఞప్తికి దెచ్చుచున్నాడు. నేడును, హిందూదేశవాతావరణ మట్లేయున్నదా యని ప్రశ్నించుచున్నాడు. ఈభావమును నేను మార్చుకొనను. కాని, నేటి పరిస్థితి వెనుకటియంతటి యప్రతిహతముగను, సమూహ్యముగనుమాత్రము లేదని నా యూహ. ఒక చేతితో ప్రయోగింపబడుచున్న నిర్బంధ విధానము గాని, వేరొకచేతితో నొసగబడుచున్న సంస్కరణములుగాని, కొన్ని వారము లలో విప్లవోద్యమమును సమూలచ్ఛేదము చేయగలవని యూహింపదగదు. కాని, ఒకచేతితో నెడదెగని నిర్బంధ విధానమును ప్రయోగించుచు, వేరొక చేతితో విశ్వాసముతో శీఘ్రగతిని సంస్కరణముల నొసగుటయు, జరుగుచో విప్లవోద్యమమును నశింపజేయగలమని లేక బలహీన మొనరింప గలుగుదుమనియు నాశించుట సహేతుక మగును.

ఈసంస్కరణ విధానమును గురించి యోజించునపుడు హిందూదేశము నందుగల మూడురకముల ప్రజలను మనమెంచవలసి యున్నది. అతివాదులు గలరు. వీరు, మనలనొకనాడు హిందూదేశమునుండి తరిమివేయగలమను మూర్ఖపుకలలను పోషించుకొను చుందురు. ఈ యతివాదుల తరగతిలో సిద్ధాంతులు కొందరు. దౌర్జన్యకారకులు కొందరు. విద్యావంతులనబడు వారిలో నీ యతివాదుల సంఖ్య యంతయుగలిపి జూచినను 100కి ముగ్గురుకంటె నుండరు. లేదా మొత్తపువిద్యావంతులలో 10వ భాగముందురు. రెండవ రకమువా రిట్టి యాశయములుగలవారు కారు. అధినివేశ స్వరాజ్యమువంటి రాజ్యాంగము నాశించుచున్నారు. ఇక మూడవరకమువారు వారి సహకార మును మన ప్రభుత్వయంత్రమునందుపయోగించుకొనవలెనని కోరికగలవారు. వారి ప్రజల కష్ట నిష్ఠూరములను మనకు తెలుపుటకు వలయు సావకాశములను కోరువారు వీరు. ఈసంస్కరణముల ఫలితముగ రెండవతరగతి మూడవతరగతిలో చేరగలదు. వీరికి సహకారము లభింపజేసినచో సంతృప్తులగుదురు." ... అయినను, హిందూదేశ పరిస్థితి బహు విషమముగ నున్నది." ... ... "మన

దేశమున (సీమలో) రెండు పరస్పరవ్యతిరేకాభిప్రాయములుగల పక్షములున్నవి. (హిందూదేశ రాజ్యాంగమును గురించి). హిందూదేశ సుపరిపాలనకు సమర్థతయే మూలముగ నుండవలయుననెడివారు కొందరు. కాని, యీసమర్థతయే హిందూదేశమునందలి మన పరిపాలనమును తుదముట్టించగలదు. మరికొందరు సమర్థతను గమనించుచు రాజకీయ సంస్కరణములనుగూడ నొసగవలెనందురు. కర్జనుగారు తాము వైస్రాయిగ నున్నపుడు రాజకీయసంస్కరణముల సిద్ధాంతమున కంగీకరించియుండలేదు.......హిందూదేశమునకు సీమప్రభుత్వ మంతకుముం దెన్నడును కర్జనుగారికంటె నధికు డగువానిని లేక, సమాను డగువానినింతవర కెన్నడును వైస్రాయిగ పంపించియుండలేదు. కాని, యీయన కార్యనిర్వహణమును సమర్థత దృక్పథమున వీక్షించినచో విజయవంత మయినను వెనుకకు తిరిగిచూచుచో కర్జనుగారివంటి యధికుని పరిపాలనమునందు మకుటమువలె నుండవలసిన సంతృప్తికరమగు పరిస్థితులు హిందూదేశమున లేవు.'' ఇవి నాడు హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగనున్న మార్లేగారి వాక్యములు. ఈవాక్యముల ననుసరించి కర్జనుగారి పరిపాలనాఫలితములును, సంస్కరణోద్దేశ్యములును మనకు సుబోధకము లగుచున్నవి.[1]

హిందూదేశమును పరిపాలించు జాతికి పాపిష్టితనమే ఆదర్శము. వారి జీవితములు పశుప్రాయములు. వారి నడత లసహ్యాకరములు.'' అని హిందూదేశస్థులు పలువురు తలంచెదరు. ఈపరిస్థితి మనము తొలగించివేయవలయును. భారతీయాదర్శములను విశేషముగ సహింపగలిగిననాడే యీపరిస్థితులు తొలగగలవు. కాని, యింతటినుంచి తటస్థింపనున్నదాని నెట్లో నే డొప్పుకొనుటవల్ల యీపని జరుగదు.'' అని ప్రభువులసభలో కర్జనుప్రభువు చెప్పిన మాటల ననుసరించి, నాడు 1909 లో హిందూదేశమునందు పాలక—పాలితుల మధ్య గల భావసంబంధము సుబోధకమగుచున్నది.[2]

1. See. Viscount Morley's speech. House of Lords. 23rd Feb. 1909.
2. See. Lord speech. House of Lords. 24th, Feb. 1909.

3 మింటో — మార్లే సంస్కరణములు. స్వరాజ్యతీర్మానము.

"రాజ్యాధికారమును దృఢపరచుటకై నిర్వహింపబడిన కార్యవిధానముతోపాటు (నిర్బంధవిధానముతోపాటు) భారతీయమితవాదులయొక్కయు, జమీందారులయొక్కయు, తోడ్పాటులభించెడిరీతిని రాజ్యాంగ సంస్కరణములను ప్రభుత్వమాలోచించినది.1 కాంగ్రెసుమహాజనసభ 1904వ సంవత్సరమునుండియు ప్రభుత్వయంత్రమున ప్రజాప్రాతినిధ్యమును గోరుచున్నది. 1906 వ సంవత్సరమునందే కాంగ్రెసుమహాజన సభాముఖమునుండి భారతీయులు స్వరాజ్యమును వాంఛించుచున్నటుల ప్రకటింపబడినది. ఆయేడే అధినివేశస్వరాజ్యవిధానమును భారతదేశమున కొసగవలయునని కాంగ్రెసుమహాజనసభ తీర్మానించినది. అయినను 1909 వ సంవత్సరము వరకును సంస్కరణ శాసనము గావింపబడలేదు. "1909 వ సంవత్సరపు సంస్కరణములు స్వపరిపాలనోద్యమమును నిరోధించు సంకల్పముతో గావింపబడియున్నచో నా యుద్దేశ్యము నెరవేరలేదు. విఫలమయినది." "1909 — 12 సంవత్సరపు సంస్కరణము లతివాదులను సంతృప్తిపరుపనే జాలవు. మితవాదులనుగూడ సంతృప్తిపరుపజాలనంత స్వల్పముగ నున్నవనుట నిశ్చయము."2 ఇక రాజకీయాందోళన మెట్లు చల్లారగలదు?

## హార్డింజిమీద బాంబు విసరుట.

4 1910-1916 హార్డింజి ప్రభువు—వైస్రాయి, 21 నవంబరు 1910 న వచ్చియుండెను.

హార్డింజిప్రభుత్వముగూడ సభాస్వాతంత్ర్య నిర్బంధశాసనమునుగావించుటతో ప్రారంభించినది. 1911వ మార్చి 20 వ తేదీని రాజద్రోహ సభానేరశాసనము గావింపబడినది. (Seditions meeting Act). మార్లేగారు వంగదేశ విభజనము ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ గావింపబడెనని చెప్పియున్నను, విభజనమునురద్దుజేసియుండలేదు.3 మింటోగారికి పిమ్మటవచ్చిన హార్డింజిప్రభువుగారి పరిపాలనాప్రారంభమునందే

1. See. Keith. Constitutional History of India. P. 228.
2. See. Keith Constitutional History. P. 232 and 237 respectively.
3. See. A Nation in making. P. 284.

విభజనమును రద్దుజేయుట తప్పనిసరి యయినది. 1911 డిశంబరు 12 వ తేదీని ఢిల్లీదర్బారులో చక్రవర్తిగారిచే వంగదేశవిభజనము రద్దుజేయబడినట్లుగ ప్రకటింపబడినది. చక్రవర్తియు, చక్రవర్తినియు, హిందూదేశసామ్రాజ్యపు గద్దెపై కాలుబెట్టుట కిదియే మొదటిసారి. ఒకవంక నీవిధముగ శాంతినిస్థాపింప బ్రయత్నించుచు, వేరొకవంక నిర్బంధవిధానమునకై హార్డింజి ప్రభుత్వముగూడ నడుముగట్ట నారంభించినది. చక్రవర్తిగారు ఢిల్లీదర్బారులో ప్రకటించినటుల హిందూదేశప్రభుత్వ ముఖ్యస్థానమును కలకత్తానుండి ఢిల్లీకిమార్చుటకు నిర్ణయింపబడినది. ఈ మార్పుననుసరించి రాష్ట్రప్రభుత్వముల నిర్మాణమునందు గూడ మార్పులు జేయవలసివచ్చెను. ఈ మార్పులన్నియు 1912 వ సంవత్సరమునందు గావింపబడినవి.

1912 వ సంవత్సరము డిశంబరు 23 వ తేదీని ఢిల్లీనగరమునకు రాజధాని మార్చబడినది. యీ సమయమున గావింపబడిన యూరేగింపులో గవర్నరు జనరలుగారైన లార్డుహార్డింజిపై బాంబు రువ్వబడినది. దైవవశమున హార్డింజిగారు మృత్యుముఖమునుండి తప్పించుకొనగలిగిరి.

"1912 లో వంగదేశమునందు విప్లవోద్యమము తలయెత్తినది. 1912 డిశంబరులో హార్డింజిప్రభువుపైనే బాంబు విసరబడినది. ఈ యుద్యమము జాతీయోద్యమముతో సంబంధమును గలిగియుండలేదు. దానిదారి నదిపుట్టి పెరిగినది. 1915 లోగావింపబడిన హిందూదేశసంరక్షణ శాసనప్రయోగమున (Defence of India Act 1915) విప్లవోద్యమ మణచివేయబడినది.[1]

5 విదేశములలో భారతీయుల స్థితి–దక్షిణాఫ్రికా.

ఈ తరుణముననే అధినివేశరాజ్యములలో భారతీయులు బానిసలుగ పరిగణింపబడసాగిరి. దక్షిణాఫ్రికాయందు ముఖ్యముగ నల్లవారగు భారతీయులపై విద్వేషాలనజ్వాలలుమిన్నుముట్టసాగినవి. భారతీయులను దక్షిణాఫ్రికానుండి తరిమివేయుటకై పలయు ప్రయత్నము లన్నియు గావింపబడినవి. బ్రిటిషుప్రభుత్వ మీ జాతివిద్వేషమును తొలగింపజాలకపోయినది.

1. See. The Making of India by Yusuf Ali P. 200.

బ్రిటిషుసామ్రాజ్యమునందే బ్రిటిషుప్రభుత్వము భారతీయుల ప్రాథమికహక్కులను సంరక్షింపజాలకపోయినది. మహాత్మాగాంధీ, నాడు దక్షిణాఫ్రికావాసి; ఆయన భారతీయుల దుస్థితినిబాపుటకై సాత్వికనిరోధ తత్వమును భారతీయుల కుపదేశించి సత్యాగ్రహోద్యమమును నడిపింపసాగెను. ఈసత్యాగ్రహదావాగ్ని కీలలు భారతీయహృదయకుహరములలో జొచ్చినవి. భారతీయస్వాతంత్ర్యాగ్ని జ్వాలల రగుల్కొల్పసాగినవి. కాంగ్రెసుమహాసంస్థ యీా సత్యాగ్రహుల నభినందింప మొదలిడినది. (1909–1910 సంవత్సరముల కాంగ్రెసుసభలు) 1911 వ సంవత్సరమున గాంధీమహాత్ముడు తన సత్యాగ్రహోద్యమమునకు విజయపతాక మెత్తెను. పిమ్మట మహాత్ము డైరోపామహాసంగ్రామము 1914 వ సంవత్సరములో ప్రారంభింపబడిన వెంటనే హిందూదేశమునకు మరలివచ్చెను.

ఈవిధముగనే కనడాదేశమునకు భారతీయులు పోవుటకును, కనడాదేశమునందుగల భారతీయులు హిందూదేశమునందలి, వారికుటుంబములను కనడాదేశమునకు తీసికొనిపోవుటకును వీలులేని నియమములను కనడాప్రభుత్వమువారు గావించియుడిరి. (Canadian Privy Council Order No. 920. Known as the "Continuous Journey Clause") ఈనిషేధ మక్రమమని కాంగ్రెసు మహాజనసభయు తీర్మానించినది. (1913) బ్రిటిషుప్రభుత్వ మీా యన్యాయమును తొలగింప జాలకపోయినది.

## 14 ఐరోపా మహాసంగ్రామము.

ఇంతలో 1914 వ ఆగష్టులో నైరోపా మహాసంగ్రామము ప్రారంభింపబడినది. "1914 లో యుద్ధము ప్రారంభింపబడునాటికి హార్డింజిగారి పరిపాలనమునం దొడుదుడుకులులేవు. హార్డింజిగారు ప్రజానురాగమునకు పాత్రులైయుండిరి. హిందూదేశమార్థికముగ కొంతవరకు కోలుకొనినది. మొదట ప్రజాసామాన్యమున తప్పనిసరిగ కొంతభయభ్రాంతి సంభవించితీరినది. విదేశములయందున్న భారతీయులునడుపుచున్న విప్లవోద్యమము బ్రిటిషుసామ్రాజ్య

శత్రువర్గమువారిచే వినియోగించుకొనబడసాగినది. యుద్ధకాలమున హిందూదేశము బ్రిటిషుసామ్రాజ్యమునకు – దాని మిత్రమండలికిని చేసిన సహాయము 250 మిలియనుల స్టెర్లింగులని యంచనావేయడినది. 800,000 సైనికులను, (Combatants), 400,000 యితరులను భారతదేశము యుద్ధసేవకై పంపినది. యుద్ధప్రదేశములన్నింటికి, ఫ్రాన్సు– ఫాండెర్సు– తూర్పుఆఫ్రికా– ఏడెను– మెసపుటోమియా– గాలిపోలీ– సలోనికా– ఈజిప్టు – పాలస్టైయిను– మొదలగు చోట్లకు భారతీయసైనికులు గొంపోబడిరి. పెర్షియా– పెర్షియనుజలసంధి– ఆఫ్గనుస్థాన సరిహద్దులలోగూడ భారతీయులు పోరాడిరి. భారతీయులవల్లనే మెసపటోమియా, పాలస్తయిను యుద్ధములు జయింపబడినవి. 100,000 మంది భారతీయులు యుద్ధమున నపహతులైరి. 30,000 మంది చనిపోయిరి...... హిందూదేశమొసగిన 250 మిలియనులపౌనుల స్టెర్లింగుల సహాయముమాత్రమే కాక, హిందూదేశపు రూపాయఋణము మరి 250 కోట్లాకాలమున యుద్ధము వలన పెరిగినది. ఇదియుగాక, వివిధమగు యుద్ధసహాయనిధులకు భారతదేశము తోడ్పడియున్నది.[1]

1 గాడరు పార్టీ. "యుద్ధమునకు పూర్వమే చాల సంవత్సరములనుండియు చురుకుగ పనిచేయుచున్న వంగదేశవిప్లవసంఘము 1914 ఆగష్టులో గమనార్హమగు విజయమును బడసినది. కలకత్తాలో విశేషముగ మందుగుండుసామానును, తుపాకులను పట్టుకొనగలిగినది. ఈ యాయుధములు విరివిగ పంచిపెట్టబడి, పిమ్మట ననేక ఘోరములు చేయబడినవి. ఈ వంగదేశవిప్లవ సంఘీయులు జర్మను ఏజంట్లతోను, విదేశములయందలి విప్లవ సంఘీయులతోను గూడ, సంబంధము నేర్పరచుకొని యుండిరి. విదేశీయ విప్లవసంఘపు పేరే 'గాడరు'పార్టీ. ఈపార్టీ అమెరికా నుండియు, జర్మనీనుండియు, గూడ డబ్బుసంపాదించినది. హిందూదేశమునకు మందుగుండుసామానులను, ఆయుధములను పంపి హిందూదేశమున సాయుధ విప్లవమును గలిగించుటకై ప్రయత్నించియుండెను. కాని, యీకుట్ర పట్టుకొనబడినది. ఈ సంఘనాయకు లరెస్టుచేయబడిరి. ఈగాడరుపార్టీవారి పలుకుబడి

1. See. the Making of India. PP. 291-22.

చాల హెచ్చుగనున్నది. ఇతరవిధముగ చాల ప్రమాదకరము.” అని ప్రభుత్వ నివేదిక యందుగలదు.1

2 కొమ్మగట్టుమారు; కనడా దేశము.

“కొమ్మగట్టుమారు” అను పేరుగల నౌకస్టీమరు గురుదత్ సింగుచే సద్దెకు గైకొనబడినది. అందు 600 సిక్కు ప్రయాణీకు లుండిరి. ఈ స్టీమరు హాంకాంగు, టోకియోలలో మామూలుగ నాగకుండగనే ప్రయాణము జేసినది. అయినను, ఈ యోడయందలి ప్రయాణీకులను కనడా దేశమునందు కాలు పెట్టనివ్వలేదు. తిరిగి హిందూదేశమునకు రావలసినవారైరి. సెప్టెంబరులో హిందూదేశమునకు తిరిగి వచ్చిన వీరు కలకత్తానుండి తిన్నగ (బడ్జిబడ్జి) పంజాబునకు రైలుపై వెళ్ళవలయునేగాని, మరెచ్చటకును పోరాదని నిషేధింపబడిరి. “ఇట్టి యన్యాయ నిషేధమువల్ల తమ కెంతయో నష్టము వచ్చునని ప్రభుత్వమునకు విన్నవించుకొననిదే రైలుపై పంజాబునకు వెళ్ళజాలమని గురుదత్ సింగుగారి ముఠా చెప్పినది. వారెంటుమూలమున నరెష్టుచేయబడుటకు సిద్ధముగనున్నామనియు గూడజెప్పిరి.2 వీరు “బెంగాలీవారి సహాయముతో 1915 వ ఫిబ్రవరి యందు తిరుగుబాటు జరుప ప్రయత్నించివచ్చిరి. ఈప్రయత్నములు విఫలము గానరింపబడినవి. ఇట్లే కాశీయందుగూడ విప్లవోద్యమము విఫలమొనరింపబడినది.3

ఆసమయమునం దొక్క దొమ్మీ జరిగినది. పలువురు తుపాకులతో కాల్చి చంపివేయబడిరి. పలువురు కారాగృహమునం దుంచబడిరి. (ఈదండునాయకుడగు గురుదత్ సింగు 8 సంవత్సరములు ప్రభుత్వమునకు చిక్కకుండగ ఒరియా, దక్కను, గ్వాలియరుసంస్థానము, రాజపుటానా, కతియవారు, సింధురాష్ట్రములలో గూఢచారియై తిరుగజొచ్చెను. 1918 లో బొంబాయిలో నోడలకంపెనీకి మేనేజరుగా వల్లరాజను పేరున పనిజేసియుండెను. పిమ్మట మహాత్ముని సలహాపై 1921 వ నవంబరులో ప్రభుత్వమునకు తన్నుతానే తెలియబరచుకొనెను. నిర్బం

1. Quoted by B. D. Basu. P. 468.
2. Congress History P. 81.
3. Mr. Keith Constitutional History P. 238.

ధింపబడెను. 1922 లో ఫిబ్రవరి 28 వ తేదీని లాహోరుజైలునుండి విడుదల గావింపబడెను.

3 తిరుగుబాటు తత్వము; మహమ్మదీయులు.

దేశమునం దీవిధముగ తిరుగుబాటుతత్వ మా నాటి కా నాడు విజృంభింపసాగినది. ఇందన్ని జాతులు చేతులు జోడింప సాగినవి. "ఐరోపా మహా సంగ్రామమున టర్కీపై గూడ యుద్ధము ప్రకటింపబడుటవల్ల మహమ్మదీయులుగూడ తిరుగుబాటుతత్వమున బ్రవేశించిరి. కొంతమంది విద్యార్థులు, కాబూలు కొండజాతుల ప్రదేశములలో ప్రవేశించిరి. అచ్చట హిందూదేశ ప్రభుత్వమును గూలద్రోయుటకై జర్మను, టర్కీమిషనులతో చేతులుగలిపిరి. అమెరికా దేశమందలి గాడరుపార్టీ విప్లవోద్యమమును తీవ్రముగ పోషింప సాగినది. సయాముద్వారా బర్మాలో సైనికులను, పోలీసువారిని తిరుగదీయ బ్రయత్నించి కొంతవరకు సఫలులైరి. జర్మనీదేశము బంగాళాఖాతమునుండి యాయుధములను సరఫరాచేయుటకు తోడ్పడసాగినది. ఆ కాలమునాటి ఐర్లండు స్వాతంత్ర్యోద్యమము భారతీయాశయములకు ప్రోత్సాహమొసగ గలిగినది." 1

## 15. మాంటేగూ సంస్కరణములు- నాటి రాజనీతి.

4 లార్డు చెలమ్సుఫర్డు. 1916 ఏప్రియల్ 5వ తేదీ మొదలు 1921.

ఈవిధముగ నశాంతిమయమైయున్న భారతదేశము లార్డు చెలమ్సుఫర్డుగారి పరిపాలనమునం దశాంతిసముద్రమున ముంచివేయబడినది. ఆనాటికే మింటో-మార్లే సంస్కరణములు నిరుపయోగములైన వను విశ్వాసము ప్రబలియున్నది.

"మనము పరిపాలించుటా, లేక, ప్రజలను పరిపాలించుకొనని చ్చుటా, ఈరెంటిలో నేదోయొకపనికి మనము నిశ్చయించుకొనవలసియున్నది. రెంటికిని

1. Keith Constitutional History of India Page 239.

మధ్య మార్గములేదు. మన మిప్పు డేమియును జేయుటలేదు. ప్రస్తుతము కొలది కొలదిగ స్వాతంత్ర్యము నిచ్చుచు పరిపాలించుచున్నాము. ఇచ్చినదియెల్ల యీకొలదియు మనయొద్దనుండి బలవంతముగ దీసికొనబడుచున్నట్లున్నది. రాజీలను, బేరములను జేయుచు పరిపాలనమును సాగించుచున్నాము. ఈ బేరసారములు గూడ బజారునందలి ప్రశస్తములైన బేరసారములుకూడ గావు. దౌర్జన్యమునకు లొంగిపోవుటయే మనపనిగానున్నది. ఇందువల్ల రెండునైపులను మనోమాలిన్యము తొలగిపోవుటలేదు. ఇందులకు వ్యక్తులది తప్పుగాదు. చుట్టునలముకొనియున్న వాతావరణపు పలుకుబడియే యిందులకు కారణము. లార్డుకర్జనుగారి పరిపాలనమువరకు హిందూదేశమునకు మంచిదని మనము తలంచిన దానిని మాత్రమే, హిందూదేశము దాని నంగీకరించినను, నంగీకరించక పోయినను చేయవలెనను కృతనిశ్చయ ముండెడిది. కర్జనుగారి పరిపాలనానంతర మొసగబడిన సంస్కరణములకు సవాళ్ళును, ప్రతిఘటనమును ఫలితమయ్యెను. బాధ్యతలేని పలుకుబడి గలిగినది. తరచు పోరాటమునకు మనము తలయొగ్గవలసి వచ్చుచున్నది. ఉపకారపూర్వక నిరంకుశ ప్రభుత్వమును మనము సడలించుచున్నాము. (Benevolent Despotism). ప్రజలు ముఖ్యముగ మనకు హితులగువారు మన మేవిధాన మవలంబించెదమో తెలిసికొనజాలకున్నారు. అచంచలమైన నిరంకుశత్వమునకు మరలుచో ప్రజలను విశేషముగ మనతో నుంచుకొనవలసి వచ్చును. ప్రశాంతి నెలకొల్పవలసివచ్చును. ఇది ఆచరణీయముగాదు. అందువల్ల ప్రాచ్యపరిపాలనా పద్ధతులనుండి - పాశ్చాత్య పరిపాలనాపద్ధతులవంకకు మనము మరలుచున్నామని విస్పష్టముగ నిరూపింపవలసి యున్నది. ఇందుతోపాటు ప్రభుత్వాధికారమును సంపూర్ణముగ పోషింపవలసియున్నది. లేనియెడల, దేశమునందు శాంతిగాని, ప్రజల సహకారముగాని, లభింపవు. మన అసమర్థతయే బట్టబయలగును. ప్రాచ్యదేశములలో అసమర్థత బయలుపడుటవల్ల విపరీత పరిస్థితు లుదయించగలవు.'' 1

ఈవిధముగ ప్రభుత్వపక్షపు టాంగ్లేయ చిత్తవృత్తి పరిణమించినది. ఇందులకనువుగనే ప్రభుత్వము నిర్బంధవిధానమును కొనసాగింపబూనినది. ప్రజాందోళనమును హెచ్చినది.

1. Quoted in the report on Indian Constitutional Reforms PP. 66-67.

సం॥ 1916 ము లక్నో కాంగ్రెసునందే, కాంగ్రెసు మహాజనసభ స్వారాజ్యమును గోరుచు తీర్మానించియున్నది. అధినివేశ స్వారాజ్యమువంటి స్వారాజ్యము నొసగవలె నని విస్పష్టపరచినది. "స్వాతంత్ర్యప్రయోజనము కొరకు మాకు స్వారాజ్యము కావలయును. సుపరిపాలనముకొరకు మాకు స్వారాజ్యము కావలయును. ఆత్మసంరక్షణముకొరకు మాకు స్వారాజ్యముకావలెను. ముఖ్యముగ జాతీయజీవితముకొఱకు, ప్రజల నైతికాధ్యాత్మికాభ్యుదయముకొఱకును మాకు స్వారాజ్యముకావలయును." అని స్వారాజ్యతీర్మానము నుపపాదించుచు సురేంద్రనాథ బెనర్జీగారు కాంగ్రెసునందు గర్జించియుండిరి.

16 హోంమురూలు ఉద్యమము.

1914 వ సంవత్సరమున లోకమాన్య బాలగంగాధరతిలకు గారు కారాగృహమునుండి విడుదలయైరి. వీరును, యానిబిసెంటుగారును కలిసి "హోంమురూలు" ఉద్యమమును ప్రారంభించిరి. ఈ హోంమురూలు ఉద్యమమా సేతుహిమాచలపర్యంతము పరివ్యాప్తమైనది. దిక్కులు మారుమ్రోగినవి. ఈ యుద్యమవిజృంభణకు ఫలితముగ డాక్టరు బీసెంటుగారును, ఆమె యనుచరులగు మరియిరువురును 1917 వ సంవత్సరం జూన్ 15 వ తేదీని ప్రవాసమునందుంచబడిరి. (Internment). "శివుడు తనభార్యను 52 ముక్కలుగ కోసియుండెను. ఇందువల్ల 52 ముక్కలును 52 భార్యలుగ తయారైరి. ఇదియే బీసెంటుగారి నిర్బంధమువల్ల హిందూదేశప్రభుత్వమునకు సంభవించినది." అని మాంటేగూగారు బీసెంటు నిర్బంధమును గురించి వ్రాసియుండిరి. (Mr. Montagu in his dairy) ఈమె విడుదలకై దేశమునందంతటను సాత్విక నిరోధము బయలుదేరదీయుటకుగూడ కాంగ్రెసుమహాజనసభ యూహించినది.

ఈ స్వారాజ్యాందోళనము నణచివేయుటకై ప్రభుత్వమువారు మామూలుగ నిర్బంధవిధానమును సాగింపసాగిరి.

సంరక్షణశాసనము.

1915 వ సంవత్సరములో హిందూదేశసంరక్షణశాసనము గావింపబడినది. (Indian Defence Act). ఈశాసనము ననుసరించి విప్లవకారులు విచారణలేకయే యనుమాన మున్నంతమాత్రమున నిర్బంధింపబడవచ్చును. వీరికి విధించుశిక్షలపై

అప్పీలుచేసికొనుటకుగూడ సావకాశములేదు. ఈశాసనమునకు పత్రికా స్వాతంత్ర్య నిరోధశాసనముగూడ తోడైనది. "ఈశాసనమునసుసరించి 143 పత్రికలు చర్య దీసికొనబడునని బెదరింపబడినవి. (Warning). మూడు ముద్రాలయములను ప్రభుత్వము లాగివేసికొనెను. (Forfuture). 55 ముద్రణాలయములు బెదరింపబడినవి. ఇందు పదమూడు ముద్రణాలయములవారి ధరావతుసొమ్ము ప్రభుత్వము లాగివేసికొనెను. ఒక ముద్రణాలయమునకు రెండుమార్లుగూడ ధరావతు లాగివేయబడినది. ఆలీసోదరులు 1914 లో ప్రవాసమునందుంచబడిరి. వీరిని విడుదల చేయవలసినదిగ 1917 వ సంవత్సరపు కాంగ్రెసుసభ తీర్మానించినది. మౌలానా అబ్దులుకలామ్ అజదుగారుగూడ ప్రవాసమునందుంచబడిరి. లోకమాన్య బాలగంగాధరతిలకుగారును, బిపినచంద్రపాలుగారును పంజాబు, ఢిల్లీలలో కాలుపెట్టరాదని నిషేధింపబడిరి. జిల్లాకలెక్టరుగారి యనుమతిని పొందనిదే తిలకుగా, రెచ్చటగాని యుపన్యసించరాదని వాగ్బంధన గావింపబడిరి. బీసెంటుగారు బొంబాయి రాజధానికి పోరాదని నిషేధింపబడిరి. వంగదేశమున సుమారు 3000 మంది సంరక్షణశాసనముక్రింద ప్రవాసమునందుంచబడిరి. హిందూదేశ సంరక్షణ శాసనము (The Defence of India Act) విలయతాండవ మాడసాగినది. దీని సహాధ్యాయియగు ఆంగ్లేయ సంరక్షణశాసనము ప్రచండనృత్య మొనరింప మొదలుపెట్టినది. (The British Defence of the realm Act. D. O. R. A.). ఈ శాసనము ననుసరించి దేశమునందలి ఏపౌరుడయినను, ఏపనినైనను జేయవలెనని ప్రభుత్వమువారిచే నాజ్ఞాపింపబడవచ్చును.

1
రౌలటుకమిటీ నియామకము.

విప్లవోద్యమమును గురించి విచారించి యణచివేయుటకై తగుసాధనోపాయము లరయుటకై రౌలటుకమిటీ నియమింపబడినది. ఈ రౌలటు సంఘమునకు రౌలటుగారధ్యక్షుడు. కుమారస్వామి శాస్త్రిగారును, ప్రోవోష్ చంద్రమిత్రగారును, యిందలి సభ్యులు. వీరిరువురును హైకోర్టుజడ్జీలు. విప్లవోద్యమముతో సంబంధముగల కుట్రలనుగురించి తెలిసికొనుటకును, వీటిపై చర్య దీసికొనుటలోగల ప్రతిబంధకముల నరయుటకును, వీటిని నిరోధించుట

కవసరమగు శాసనములను సూచించుటకును నీసంఘము నియమింపబడినది. ఈనిర్బంధ శాసనములుచాలక నూతన నిర్బంధ శాసనములనుగూడ గావింప ప్రభుత్వము సంకల్పించినది. విప్లవోద్యమము ప్రబలియున్నదనుమాట నిశ్చయము.

రౌలటు రిపోర్టునం దీవిషయములు కరతలామలకములు. 1918 వ సంవత్సరమునం దీసంఘమువారి రిపోర్టుప్రకటింపబడినది. సంరక్షణ శాసనముక్రింద నిర్బంధింపబడిన 800 మందియొక్క నేరములను గురించి రహస్యముగ విచారింపబడినవి. ఈవిచారణఫలితముగ 6 గురు మాత్రమే విడుదల గావింపబడిరి. ఇంతలో యుద్ధము ముగిసినది. అయినను, రౌలటుకమిటీ సూచించినప్రకారము నిర్బంధశాసనములను గావించుప్రయత్నమును ప్రభుత్వము విరమించలేదు. భారతీయ స్వాతంత్ర్య హృదయావేదన మినుమడింప సాగినది.

ఐరోపా మహా సంగ్రామానంతరము ప్రజలఆశయము

ఐరోపా మహాసంగ్రామమునం దాంగ్లేయ సామ్రాజ్యము కొరకు భారతీయు లొనరించిన త్యాగమపారము. భారతీయ ప్రాణములు తండోపతండములుగ నైరోపా మహాసంగ్రామమునం దాహుతి గావింపబడినవి. భారతీయ కోశమునుండి కోట్లకొలది ధనము సైన్యపోషణకై యుద్ధమునందు వెచ్చింపబడినది. యుద్ధానంతరముగూడ ఆంగ్లేయప్రభుత్వమునకు భారతీయప్రభుత్వమపార విరాళ మొసగినది. 1 యుద్ధమునందు భారతీయసైనికులు జూపిన యపార ధైర్య సాహసము లాంగ్లేయుల పొగడ్తల కాకరమై భారతీయాత్మగౌరవ, మనోగర్వములకు నిలయములైనవి. భారతీయుల యాశయములు సిద్ధించు కాల మరుదెంచినదని విశ్వసింపబడినది. హిందూదేశమునకు మాంటేగూగారు మిత్రుడని విశ్వసింపబడినది. ఆంగ్లేయులు "ప్రతిష్ఠ యను శబ్దముపై నాధారపడియుండరాదు. ఆంగ్లేయభాషాకోశమునుండి "ప్రతిష్ఠ" (Prestige) యను శబ్దము తొలగింపబడియున్నచోనో హిందూదేశమా! నీచరిత్ర మహాసుఖప్రదమై యుండెడిది. కాని, అచ్చట సాంప్రదాయానుగుణమగు సామ్రాజ్య

1. భారతదేశార్థిక చరిత్ర చూడుడు. యుద్ధమునందు భారతీయు లొనరించిన ధన, ప్రాణత్యాగములు సుబోధకము కాగలవు.

తత్వ మతివికృతముగ నున్నది. మన మిచ్చుట తప్పును సరిజేయుటకు లేము. అన్యాయమును సంస్కరించుటకు లేము. అనుభవమును ప్రయోజనకరముగ వినియోగించుకొనజాల కున్నాము. మన తప్పులకు మనము దోసిలియొగ్గ వలసినదే. ప్రజాభిప్రాయమును ధిక్కరించవలసినదే. ఇదియంతయు నేను చెప్పిందేచెప్పాను." అనుటకే నేను "ప్రతిష్ఠను" గురించి యివివరలో యితర స్థానములయందుగూడ జెప్పియున్నాను. ఈశబ్దప్రయోగమువల్ల హిందూదేశ ముపై యధికారము చెలాయింపజాలము. న్యాయమగు సంస్థలవల్ల పాలితుల సమ్మతిమీాదమాత్రమే కాలముగడచిన కొలదియు పరిపాలింపగలము." 1 ఇట్టి వాక్యము లనిన, మాంటేగూగారు హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగ వచ్చుటతో భారతీయుల ఆశ లినుమడించుటలో ఆశ్చర్యములేదు.

17 కాంగ్రెసు లీగుస్కీము.

1916 వ సంవత్సరం ఏప్రియలులో అలహాబాదునందు సమావేశమైన కాంగ్రెసు ప్రతినిధులయొక్కయు, ముస్లిం లీగు ప్రతినిధులయొక్కయు, సభయందునను, 1916 నవంబరు మాసములో కలకత్తాయందు జరిగిన కాంగ్రెసు ముస్లింలీగు ప్రతినిధుల సభయందునను సమకూడిన హిందూమహమ్మదీయైక మత్యముగూడ భారతీయుల యాశాలతలకు పునాదిగనున్నది. భారతీయ రాజ్యాంగ పరిణామమునకు హిందూమహమ్మదీయాంతఃకలహములు ప్రబలి ప్రతిబంధకములైనవి. ఈయంతఃకలహములు లార్డుమింటోగారి హయాములో 1907 లో సృష్టింపబడినవి. స్వపరిపాలనా విధానమును నిరూపింప సమకట్టిన 1917 వ సంవత్సరమున హిందూదేశమందు సాంఘికైకమత్యము లభించుట శుభ సూచకమయినది. కాంగ్రెసు సంస్థయు, ముస్లింలీగును, ఏకీభవించి స్వపరి పాలనాప్రణాళిక నొకదానిని తయారుజేసెను. ఈ స్వపరిపాలనావిధానమునందు, స్వపరిపాలనాసూత్రము లన్నియుగూడ పూర్తిగ పాటింపబడలేదు.

(1) కార్యనిర్వాహకవర్గము శాసనసభాధికారమునకు బద్ధులైయుండవల యును. అయినను శాసనసభలయందు అయిదింట ఒకవంతు ప్రభుత్వ నియ

1. Mr. Montagui's speech in 1912.

మితులుండవచ్చును. ఒకవిధమగు కర్త్రీరాష్ట్రస్వాతంత్ర్యము కోరబడినది. శాసన సభాతీర్మానములను రద్దుజేయుటకు కౌన్సిలుయుతుడగు గవర్నరుగారి కధికార మొసగబడినది. కాని, యీతీర్మానములే మరియొక సంవత్సరానంతరముగూడ శాసనసభచే నామోదింపబడినయెడల ప్రభుత్వ మాతీర్మానములకు బద్ధులై యుండవలయును. గవర్నరుగారి కౌన్సిలు సగము, నియమిత సభ్యులతోను, సగము ఎన్నికసభ్యులచేత నెన్నుకొనబడిన సభ్యులతోను గూడి యుండును. మహమ్మదీయులకు వారి జనసంఖ్యకంటె హెచ్చుస్థానములు శాసనసభలలో నొసగుట కంగీకరింపబడినది. (అల్పసంఖ్యాకులుగనున్నచోట) (వివరము లల్పసంఖ్యాకుల పర్వమునందు గమనింపదగును.)

సంస్కరణ శాసనసభ్యుల ప్రణాళిక

కాంగ్రెసుసంస్థయు, ముస్లింలీగును గలిసి గావించిన యీ కోరిక అత్యల్పమైనది. ఇట్లే 1916 సంవత్సరము అక్టోబరులో భారతశాసనసభ్యులు 19గురు కలిసి యొక స్వరాజ్యవిధానమును తయారుజేసిరి. ఈ స్వరాజ్యవిధానమొక మహావిపరీతచర్య యని నాటి గవర్నరుజనరలుగారగు లార్డు చెలమ్సుఫర్డుగారు తలంచిరి. ఈ 19గురి సూచనలును విప్లవసూచనలనియు, హిందూదేశమునందు సంభవింపనున్న మహాప్రళయసూచనలనియు, సీమలో సిడెనుహాముప్రభువుగా రుపన్యసించియుండెను. ఈ ప్రళయసూచనల నరికట్టుటకై నిర్బంధవిధానమవలంబింపవలెనని హెచ్చరింపబడెను. ఈ సూచనలకు జర్మనీ వారి కుట్రగూడ కారణమని సిడెనుహాము ప్రభువు చెప్పుటకువెనుదీయలేదు. హిందూదేశప్రభుత్వముగూడ రాష్ట్రప్రభుత్వములకే స్వరాజ్యాందోళనను గురించిన ప్రతిచర్యను సూచించినది. నాటి మదరాసు గవర్నరుగారగు పెంటలండు ప్రభువు జాతీయవాదులకోరికలు గాడరుపార్టీవారి విప్లవచర్యలవలె నున్నవనుటకు సాహసించెను. "యుద్ధమువల్ల గలిగిన రాజకీయ పరిస్థితులు గమనార్హములు. ఆంగ్లేయ ప్రయోజనమున్న భారతీయులందరు సంరక్షించిరి. ఇందులకు వలయు రీతిగ బహూకరింపబడుదుమని యూహించిరి."[1] నిర్బంధవిధానమే భారతీయుల కొసగబడిన బహూకరణమైనది.

1. Keith. P. 241.

1 శాసనసభ్యులు కోరినదేమి?

భారతశాసనసభ్యుల ప్రణాళికయందు కోరినకోరిక లేల విపరీతముగ తలంచబడినవో! వీరు కోరినదేమి? "యుద్ధము ముగిసినపిమ్మట నాగరిక ప్రపంచమం దంతటను రాజ్యాంగధర్మములలో నూతనమగు మార్పు సంభవింపగలదనుట నిశ్చయము. ముఖ్యముగ అల్పజాతులస్వాతంత్ర్య సంరక్షణమునకై యుద్ధమునకు దిగిన బ్రిటిషుసామ్రాజ్యమునం దంతర్జాతీయవ్యవహారములలో న్యాయముకొఱకును, మానవప్రపంచము కొఱకును, నమూల్యమగు రక్తమును ధారపోయుచు, నమూల్యమగునంత మూల్యమును వెచ్చించుచున్న యాంగ్లేయ సామ్రాజ్యమునందు మార్పులు జనించుననుటలో సందేహములేదు. ఈ సంరంభమున హిందూదేశము విశేష భాగస్వామియగుటచే, నూతన వికాసము హిందూదేశమునందుగూడ రాకమానదు. యుద్ధానంతరము హిందూదేశ రాజ్యాంగము నూతన దృక్పథమున పరివీక్షింపబడగలదను యాశ లుదయించినవి. ......"హిందూదేశము కోరునది సుపరిపాలనము, సమర్థతతో గూడిన పరిపాలనము మాత్రమేకాదు; ప్రజలకు బాధ్యతవహింపగలిగి, ప్రజలచే నంగీకరింపబడు ప్రభుత్వము కోరబడుచున్నది. యుద్ధానంతర నూతన దృక్పథమున కిదియే యర్థముగ భారతభూమి గ్రహించుచున్నది. యుద్ధానంతరము భారతదేశస్థితి యుద్ధాత్పూర్వమెట్లున్నదో అట్లే యుండినయెడల హిందూదేశమునం దపారాశాభంగమును, నసంతృప్తియు గలుగుననుట నిస్సంశయము." ........ "ప్రభుత్వపరిపాలనముపై ప్రజలకు గమనార్హమగు నధికార మొసంగవలయును. సాయుధులుగనుండుటకుగల ప్రతిబంధకములనన్నింటిని తొలగించివేసి, సాయుధులుగ నొనరించి, యాత్మవిశ్వాసముగలవారిగ నొనరించవలయును." ...ఈ సూత్రములు రాజ్యాంగ విధానమును వివరించుటయందు శాసనసభ్యులే పూర్తిగ గమనించియుండలేదు. వారిసూచనల వివరణమున సంపూర్ణస్వరాజ్యమును గూడ కోరియుండలేదనదగును. అయిననేమి? సిద్ధాంతప్రకటనయే, సీమ ప్రభువులు కండ్లెఱ్ఱజేయుటకు కారణమయ్యెను.

బ్రిటిషు ప్రభుత్వ ప్రకటనము.

20 వ ఆగష్టు 1917 వ సంవత్సరమున బ్రిటిషు ప్రభుత్వము భారతీయ వాంఛితమునకు సమాధానము జెప్పినది. పరిపాలనాశాఖలలో భారతీయుల కధిక ప్రాతినిధ్య మొసగబడుననియు, స్వపరిపాలకసంస్థలు క్రమాభివృద్ధివల్ల సామ్రాజ్యములో భారత దేశము క్రమక్రమముగ బాధ్యతాయుత ప్రభుత్వమును పొందుననియు ప్రకటింపబడెను. (Responsible Govt.).

ఈ ప్రకటనయందుపయోగింపబడిన "బాధ్యతాయుత పరిపాలనము" అను శబ్దమునకు నాటినుండియు తుదివరకును విపరీతార్థములు గల్పింపబడుచునేయున్నవి. "ఈ శబ్దముయొక్క అర్థము విస్పష్టము. అధినివేశరాజ్యములలోగల స్వపరిపాలనమువంటి స్వపరిపాలనమే యని లార్డు కర్జను గారు గ్రహింపజాలకపోవుట కడుంగడు నాశ్చర్యకరము." 1 ఈ ప్రకటనమునుగావించిన మాంటేగుగారు మాత్రమీ శబ్దార్థమును విస్పష్టముగనే గ్రహించి ప్రయోగించిరని విశ్వసింపబడినది. ఈ సుహృదయమున కుదాహరణముగ సైన్యములో కింగ్సుకమీషను స్థానములు భారతీయుల కొసంగబడునని ప్రకటించి జాతివివక్షతను తొలగించెను. భారతీయుల పరిపాలనార్హతను క్రమక్రమముగ నిర్ణయించు నధికారముమాత్ర మాంగ్లేయప్రభుత్వమునకే చెందియున్నదని గూడ నీప్రకటన యందుగలదు. ఈ ప్రకటనతోపాటు మాంటేగూగారు స్వపరిపాలనాసమస్యను స్వయముగ విచారించుటకై భారతదేశమునకే తెంచుచున్నటుల గూడ ప్రకటింపబడినది. ఈ నూతన రాజనీతిననుసరించియే బీసెంటుగారును, ఆమె అనుచరులును 16 వ సెప్టెంబరు 1917వ సంవత్సరమున విడుదలగావింపబడిరి.2

మాంటేగూ రాక-పోక

మాంటేగూగారును, వైస్రాయిగారైన చెమ్సుఫర్డు గారును భారతదేశ సంచారమును సాగించిరి. వీరికి భారత జాతీయైక్యాభిప్రాయమును విన్నవింప కాంగ్రెసు—ముస్లిం లీగులు ఏకీభావముతో నిర్ణయించిరి. 16 వ అక్టోబరు 1917 లో అలహాబాదులో

1. Keith P. 243.

2. See. Govt. of India Notification also July 1918 regarding Commissions in the Army.

నీ రెండుసంస్థలును సమావేశమయినవి. మాంటేగూగారికి యాదాస్తును బంప నిర్ణయించిరి. ఇందులకై యొక 12 గురి సంఘ మేర్పరుపబడినది. దీని కాంగ్ర ప్రముఖులగు సి. వై. చింతామణిగారు కార్యదర్శిగ నియమింపబడిరి. ఈ సంఘమువారు వారి యాదాస్తుతో మాంటేగూ — చెలమ్సు — ఫర్డుగార్లను, 1917 నవంబరులో దర్శించిరి. ఈయాదాస్తు మన రాజ్యాంగపరిణామమున ప్రముఖస్థానము నలంకరింపకతప్పదు. దీనిననుసరించి నాటి భారతరాజకీయ చిత్తవృత్తి సుబోధకము కాగలదు. భారతీయవాంఛిత మెంత మృదువుగను, స్వల్పముగను, నున్నదియు తేటతెల్లమగును. ఈ భారతజాతి, పరిపాలనాదక్షతను, స్వపరిపాలనార్హతను రుజువు చేసినది. ప్రాచీన నాగరికజాతి పరాధీనస్థితిని గలిగియుండుట భారతజాతి ఆత్మగౌరవమున కన్ని వేళలయందునను, నన్ని పరిస్థితులయందునను బాధకరముగనున్నది. ఈ భావమునే కాంగ్రెసుమహాజనసభ వ్యక్తీకరించుచున్నది.

“కాంగ్రెసుమహాజనసభ తన తీర్మానములలో వ్యక్తీకరించినటుల స్వపరిపాలనార్హతను, పరిపాలనాదక్షతను, రుజువేసినట్టియు సాంప్రదాయసిద్ధముగ ప్రాచీన నాగరికతకుజెందినట్టియు, నొకజాతి యన్ని వేళలయందునను, నన్ని పరిస్థితులయందునను, పరాధీనస్థితియందుండుట, దాని యాత్మగౌరవమునకు బాధకరముగనున్నది.” అని ప్రప్రథమమునందే మాంటేగుగారి కీసంఘమువారు విస్పష్టముగ నుడివిరి.

మాంటేగూగారు హిందూదేశ సంచారమునందు చేసినదేమి? వివిధపక్ష రాజకీయ నాయకులతో సంప్రదించినమాటనిజము. ఈ సంప్రదింపుల నాధారముగగొని నూతనసంస్కరణ శాసనము తయారుచేయుటకు మాంటేగారు హిందూదేశ సంచారముచేయ బూనియుండలేదు. “మాంటేగు సంస్కరణ శాసనమందలి ప్రతి విషయమునుగూడ 1916 వ సంవత్సరపు మార్చియందే నిర్ణయింపబడియుండె ననువిషయము చాలమందికి వార్తగనుండవచ్చును. హిందూదేశమునందలి సైన్యములో లార్డుచెలమ్సుఫర్డుగారు మేజరుగ నున్నప్పుడాయన వైస్రాయిగ నియమింపబడియుండెను. ఈయన 1916వ మార్చిలో ఇంగ్లం

డునకు వెళ్ళినప్పుడే యీయనకు నూతనసంస్కరణ శాసనము చూపింపబడినది. ఈసత్యము 1934 లో మాత్రమే లోకమునకు తెలిసినది. మాంటేగూగారు తన హిందూదేశ సంచారమునందు గావించినపనియేమి? ఆయన సంస్కరణముల నామోదించి పనిజేయుటకంగీకరించు మంత్రులను, కార్యనిర్వాహకవర్గ సభ్యులను, ఎడ్వకేటు జనరలుపదవి గైకొను వారలను, నిర్ణయించుకొనుటయే ఆయనపని యయినది. మాంటేగూగారిని దేశమంతయు బలపరచవలెనని యానాడెల్లరును పాడినపాటలోని యంతరార్థమిదియే.''1 కాని, 9 లక్షలమంది ప్రజలు కాంగ్రెసు-లీగు-స్కీముపై సంతకములుజేసి మదరాసులో మాంటేగూగారికి సమర్పించియుండిరి. 1917 వ సంవత్సరమునందుజరిగిన కలకత్తాకాంగ్రెసున కధ్యక్షత స్థానమునలంకరించిన డాక్టరుబీసెంటు 1923—1928 వ సంవత్సరముల లోపుగ స్వపరిపాలనమును, హిందూదేశమున స్థాపించుటకై 1918 వ సంవత్సరమునందే శాసనమొనరింప వలయునని గర్జించినది. అధినివేశములకును, సీమప్రభుత్వమునకునుగల సంబంధముమాత్రమే భారతదేశమునకును, సీమప్రభుత్వమునకును మధ్య నెలకొల్పదగుననియు నామె భారతీయులపక్షమున నుడివినది. ఆ కాంగ్రెసు మహాజనసభ మాంటేగూగారిరాకకు స్వాగతముగూడ నొసగినది. కాంగ్రెసు-లీగుస్కీమును, బ్రిటిషుప్రభుత్వమును ప్రథమసోపానముగ నంగీకరింపవలయుననియు, కొంతకాలనిర్ణయమును శాసనరూపముగ నిర్ణయించి ఆ నిర్ణయములోనే సంపూర్ణ స్వపరిపాలనమును నెలకొల్పవలెననియు కలకత్తాకాంగ్రెసు తీర్మానించినది.

1
అధినివేశ రాజ్యములకుగూడ భారత దేశముపై హక్కునొసగ జూచుట.

ఈ తరుణమునం దధినివేశరాజ్యములకు గూడ భారతభూమిపై పరిపాలనాధికారమొసగ ప్రయత్నింపబడినది. సామ్రాజ్యసంఘీభావ మనుపేర నొకసంఘమును స్థాపించి యా సంఘమునకు సామ్రాజ్యమునందలి దేశములపై కొంత పరిపాలనాధికారమొసగ ప్రయత్నింపబడినది. ఈ ప్రయత్నమునకు కాంగ్రెసు సంపూర్ణవ్యతిరేకాభిప్రాయమును దెల్పినది. చింతామణిసంఘమువారి నివేదికయం దీసూచన తీవ్రముగ ప్రతిఘటింపబడినది. ఒకవేళ

1. See. Congress History. p. 223.

అట్టిసంఘు మేర్పరుపబడుచో నందు భారతదేశమునకుగూడ సమానప్రతిపత్తితో సభ్యత్వ ముండవలెనని చింతామణిసంఘము కోరినది. కాంగ్రెసు దృఢనిశ్చయము ననుసరించియే, బహుశః యీసూచన నాచరణయందుంచలేదు. మఖిలో పుట్టి పుబ్బలోమాడిపోయినది.

19
మాంటేగూ నివేదిక.

మాంటేగూ, చెలమ్సుఫర్డు నివేదిక 1918 జూన్ మాసమున ప్రకటింపబడినది. ఈ నివేదికయందు స్వపరిపాలనకై గలభారతీయుల యర్హతమాత్రము నిష్పక్షపాత బుద్ధితో వివరింపబడినదని యంగీకరింపకతప్పదు. ఈ నివేదిక మృదు మధురశైలియందు వ్రాయబడినదనిగూడ నంగీకరింపదగును. అయిన నేమి? ఇందు స్వపరిపాలనా ప్రతిబంధకములు గోరింతలు కొండంతలుగ వ్రాయబడినవనుటయు నిశ్చయము.

1
మాంటేగూ నివేదిక సారాంశము.

(1) "స్థానికసంస్థలలో ప్రజలకు పైయధికారుల ప్రతిబంధకము లేమియులేని సంపూర్ణమగు పెత్తనముండవలయును. (2) బాధ్యతాయుత ప్రభుత్వము క్రమాభివృద్ధిని జెందుటకు రాష్ట్రములలోవలయు కార్యక్రమము శీఘ్రగతిని ప్రారంభింపవలయును. వెనువెంటనే కొంతబాధ్యత నొసగవలయును. పరిస్థితులనుకూలముగ మారినవెంటనే పూర్ణమైనబాధ్యత నొసగవలయునని మా ఆశయము. అనగా, హిందూదేశప్రభుత్వముతో నిమిత్తములేకుండగ రాష్ట్రములకు పరిపాలనా స్వాతంత్ర్యము శాసనాధికార స్వాతంత్ర్యము, ఆర్థిక స్వాతంత్ర్యము, చాలవరకొసంగుట యగును. ఈ స్వాతంత్ర్యము హిందూదేశ ప్రభుత్వము తనబాధ్యతలను సక్రమముగ నిర్వహించుట కనుకూలమగు రీతిగనే యొసగబడవలయును.

(3) హిందూదేశప్రభుత్వము పార్లమెంటునకే బాధ్యతవహించి యుండవలయును. రాష్ట్రములలో గలుగుమార్పుల ననుసరించిన బాధ్యతలుమినహా యితర ముఖ్యవిషయములలో హిందూదేశ ప్రభుత్వాధికారము సుస్థిరముగ

నుండవలయును. భారతశాసనసభమాత్రము పెద్దదిగనొనరింపబడి, హెచ్చు ప్రాతినిధ్యము గలదానిగ నొనరింపబడి ప్రభుత్వముపై తనపలుకుబడిని వినియోగించుటకు సావకాశములను వృద్ధిచేయవలయును.

(4) పైసూత్రములననుసరించి గావింపవలసినంతవరకు పార్లమెంటువారి యొక్కయు, రాజ్యాంగకార్యదర్శి యొక్కయు, అధికారము కేంద్రరాష్ట్ర ప్రభుత్వములపై తొలగించవలయును.1

కాంగ్రెసు — లీగు స్కీములో కార్యనిర్వాహకవర్గములు శాసనసభలకు బాధ్యతమాత్రమే వహించునట్లుగ నుండవలెనని కోరబడినది. మాంటేగూ నివేదికయందు మంత్రివర్గములుండుటయు, శాసనసభల యసమ్మతితో మంత్రి వర్గములు కూలిపోవుటకు సావకాశ మేర్పరుపబడుటయు కొందరిని సమ్మోహన మొనరించినదనుట వాస్తవము. చాలమంది మితవాదులీనివేదిక ప్రకటింపబడక పూర్వమే యందలివిషయముల నంగీకరించినట్లుగ మాంటేగూగారి డయిరీవల్లనే విదళమగుచున్నది. అందువల్ల మితవాదు లీనివేదికను పొగడుటయందు, నంగీకరించుటయందు, దానినిస్వీకరించి యాచరించుటయందుగూడ నాశ్చర్యములేదు. చిత్తరంజనదాసుగారు 5 సంవత్సరములలో స్వపరిపాలన మొసంగవలయునని కోరినటులగూడ మాంటేగూగారి డయిరీవల్ల తేలుచున్నది. అనగా, మాంటేగూగారి హిందూదేశసంచారము సంఘీభావముతోనున్న కాంగ్రెసు సంస్థను రెండుభాగములుగ, నతివాదులుగను — మితవాదులుగను విడదీయుటకై యెక్కుడుగ వినియోగింపబడినదని, యాయన డయిరీవల్లనే తేలుచున్నది. "నూతనమగు, నొకప్రత్యేకసంస్థను, ప్రభుత్వమువారి సహాయముతో నిర్మింపవలెనని యొకసూచన చేయబడినది. ఈ సంఘ మాసూచనల నామోదించుచు ప్రచారము చేయుటకును—సూచనలను సమర్థించుటకై యింగ్లండున కొక రాయబారవర్గమును పంపుటయు నీ సూచనలోగలదు." అని మాంటేగూగారే తన డయిరీయందు వ్రాసియుండిరి.

---

1. See. Report on Indian Constitutional reforms by Edwin's. Montagu and Lord chelmsford. 1918.

2 మాంటేగూగారి నివేదిక నిరసింపబడుట.

ఈ పరిస్థితులలో, తెరమరుగున తన సంచారమునకు ముందే తయారైన మాంటేగూ సంస్కరణ విధానమును భారతజాతీయవాదు లెట్లంగీకరింపగలరు? "ఈ సంస్కరణ విధానము నీమదేశము గౌరవప్రదముగ నొసగదగినది కాదు. సగౌరవముతో భారతజాతి యంగీకరింప దగినదియుకాదు." అని డాక్టరు బీసెంటుగారు ప్రకటించిరి. 1918 ఆగష్టు 29 తేదీని బొంబాయిలో సమావేశమయిన ప్రత్యేక కాంగ్రెసు మహాజనసభ యీ మాంటేగూ నివేదిక "అసంతృప్తికరముగను, నాశాభంగకరముగను" నున్నదని నిర్ణయించినది. (Disappointing and Unsatisfactory).

కాంగ్రెసు మహాజనసభ యీవిధముగ మాంటేగూనివేదికను నిరాకరించుటలో నాశ్చర్యము లేదు. మాంటేగూనివేదిక కాంగ్రెసు సూచనలకు భిన్నముగ నాచరణీయమని త్రోసివేసినది. సంపూర్ణ రాష్ట్ర స్వాతంత్ర్యమునకు కాలమింకను పరిపక్వముగాలేదని యీసడించినది. తదితర సంస్థలసూచనలు గూడ త్రోసివేయబడినవి. రాష్ట్రప్రభుత్వముల గవర్నరులైదుగురు జనవరి 1919 లో గావించిన సూచనలుగూడ నిరాకరింపబడినవి. ఇట్లే యీనివేదికగూడ సర్వసామాన్యముగ నిరాకరింపబడినది. ప్రభుభక్తిపరాయణులును - మాంటేగూ గారికి విచారణకాలమునందే తమ సమ్మతికి హామీనొసంగియుండిన మితవాదులును— ఉద్యోగ వాంఛితులును— మాత్రము మాంటేగూనివేదిక కాహ్వాన మొసగిరి. మాంటేగూగారికి సహాయమొనరించుటయే కర్తవ్యమని వాదింప సాగిరి. కాంగ్రెసు మహాజనసభమాత్రము తన నిశ్చితార్థము నీ విధముగ ప్రకటించినది.

20 జాతీయ వాంఛిత మేమి?

(1) హిందూదేశ స్వరాజ్యార్హతకు ప్రతిబంధకములు మాంటేగూ రిపోర్టునందు నిరూపింపజూచుట సమంజసము గాదు. భారతజాతి స్వరాజ్యమునకు సంపూర్ణార్హతను గలిగియున్నది.

(2) రాష్ట్రప్రభుత్వములయందును, కేంద్రప్రభుత్వమునను గూడ బాధ్యతా

యుత ప్రభుత్వము ప్రవేశపెట్టవలెననియు, రాష్ట్రములయందలి స్వపరిపాలనా సామర్థ్యమును గమనించియే కేంద్రమున మార్పులు గలిగించవలె ననుసూత్రము నిరాకరింపబడినది.

(3) భారతీయపౌరుల ప్రాథమికహక్కులు సంరక్షింప బడవలెననియు, శాసనమునం దీహక్కులు వివరింపబడవలయునని యు కోరబడినది.

(1) భారతీయులకు వ్యక్తిస్వాతంత్ర్యము, ఆస్తిస్వాతంత్ర్యము, సభా స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యములకు శాసనరూప ముగ హామీకోరబడినది. ఈవిషయములలో నేరస్థులు బహిరంగముగ న్యాయ శాస్త్రప్రకారము విచారింపబడి శిక్షింపబడవలయును.

(2) భారతీయుల కాయుధముల ధరించుటకు స్వాతంత్ర్య మొసగ వలయును. బ్రిటిషుదీవులలో గల రీతిని లైసెన్సుమాత్ర ముండదగును.

(3) పత్రికాస్వాతంత్ర్య ముండవలయును.

(4) భారతీయు లందరు న్యాయశాస్త్రప్రకారము సమానముగ జూడ బడవలయును.

(5) హిందూదేశప్రభుత్వమే, యనగా, కేంద్రప్రభుత్వము, శాంతి బాధ్యతలకును, దేశసంరక్షణకును సంబంధించిన పరిపాలనాధికారమును సంపూర్ణ ముగ గలిగియుండవలయును.

(6) భారతశాసనసభగూడ అధినివేశరాజ్యముల శాసనసభలవలెనే యార్థికస్వాతంత్ర్యమును గలిగి యుండవలయును.

(7) రాష్ట్రములలోవలెనే కేంద్రప్రభుత్వమునందుగూడ కొన్ని ప్రజా యత్తశాఖ లుండవలెననియు, ప్రభుత్వపరముగ విదేశ వ్యవహారములు— సైన్యము — నావికాదళము స్వదేశ వ్యవహారములుమాత్రమే ప్రత్యేకింప బడ వలయును.

(8) సంస్కరణముల ననుసరించిన నూతన భారతశాసన సభయొక్క మొదటి కాలపరిమితి పూర్తియయినపిమ్మట, ప్రజాయత్తశాఖలపట్ల నైస్రాయిగా రధినివేశరాజ్యములలోనుండు చక్రవర్తిప్రతినిధిగ మాత్రమే యుండవలెను.

(9) శాసనాధికార మన్నిశాఖలపైన భారత శాసనసభకే యుండ వలెను. ప్రత్యేక శాఖలకు వలయు శాసనములను శాసనసభ తిరస్కరించి నప్పుడే గవర్నరుజనరలుగారు ప్రత్యేక శాసనాధికారమును వినియోగించుచుండ వలయును.

ఇట్లు గావింపబడిన శాసనము లొకయేడుమాత్రమే యమలునందుండ దగును. ఆయేటి కాలపరిమితి దాటినపిమ్మట గూడ నీశాసనము లమలునం దుండవలెనన్నచో హాజరయిన శాసనసభ్యులలో కనీసము 100 కి 40 మంది అంగీకరించుచుండవలయును.

(10) స్టేటు కౌన్సిలుసభ యుండరాదు. ఒకవేళ ఏర్పరుపబడుచో సగముమంది నైనను నెన్నుకోబడవలయును. ప్రత్యేకింపబడిన ప్రభుత్వశాఖ లకు సంబంధించిన విషయములలో మాత్రమే గవర్నరుజనరలు తన ప్రత్యేకాధి కారమును వినియోగించి వీగిపోయిన వాటిని సజీవ మొనరించుచుండవచ్చును.

(11) ప్రత్యేకశాఖల కార్యనిర్వాహకవర్గ సభ్యులు సగముమంది నైనను భారతీయులుగ నుండవలయును.

(12) భారతశాసనసభలో 150 మంది సభ్యు లుండవలయును. ఇందులో నాలుగువంతులైనను, ఎన్నుకొనబడిన సభ్యులుగా నుండవలయును. అధ్యక్ష, ఉపాధ్యక్షులను, శాసనసభయే ఎన్నుకొనుచుండవలయును. వ్యవహార నియ మములను గావించుకొనుటకు శాసనసభకే యధికార ముండవలయును.

(13) కనీసము 15 సంవత్సరములలో భారతదేశమునందంతటను బాధ్యతా యుత ప్రభుత్వమును నెలకొల్పవలయును. (Responsible Govt.)

(14) రాష్ట్రములయందు ప్రజాయత్త శాఖలపై గవర్నరుగారి యధికారము శాసనసభయొక్క మొదటి కాలపరిమితి యయినపిమ్మట నధినివేశ రాజ్యములలో వలెనే యుండవలయును.

(15) కార్యనిర్వాహక వర్గమునందు సగముమందియైనను భారతీయులుండవలయును.

(16) ఆరు సంవత్సరముల కాలమువరకు పోలీసుశాఖ, 'లా' న్యాయ శాఖలు కార్య నిర్వాహకవర్గసభ్యుల హస్తములయం దుండవచ్చును.

(17) రాష్ట్రశాసనసభలు తమ అధ్యక్ష, ఉపాధ్యక్షులను ఎన్నుకొను చుండవలయును.

(18) రాష్ట్ర విషయములలో సంపూర్ణశాసనాధికారము రాష్ట్రశాసన సభలకే యుండవలయును. లా—పోలీసు—న్యాయశాఖలకు సంబంధించిన శాసనములతో రాష్ట్రప్రభుత్వ మంగీకరింపజాలనప్పుడు మాత్రమే హిందూదేశ ప్రభుత్వమునకు పంపవచ్చును. ఆప్రభుత్వము భారతశాసనసభవారి సముఖమునందీ విషయము నుంచుచుండవలయును.

(19) పార్లమెంటు యొక్కయు, హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి యొక్కయు నధికారములు సంస్కరింపబడవలయును. కేంద్రరాష్ట్రప్రభుత్వములపై నియోజకవర్గపు బాధ్యత నభివృద్ధిచేయవలయును.

(20) రాజ్యాంగకార్యదర్శి, కౌన్సిలుమాత్రము రద్దుచేయబడవలయును. ఇరువురు సహాయకార్యదర్శులు మాత్ర ముండవలయును. స్త్రీల కనర్హత లుండరాదు.

(21) హిందూ మహమ్మదీయ సమస్య కాంగ్రెసు—లీగు స్కీము ప్రకారమామోదింపవలయును.

(22) హిందూదేశ ప్రభుత్వమున కార్థిక విషయములలో స్వాతంత్ర్యముండవలయును.

(23) 15 సంవత్సరములలో సైన్యమునందు 100 కి 50 సైన్యాధికార పదవులు (కమీషనులు) భారతీయుల కొసగబడవలయును.

(24) న్యాయశాఖను, కార్య నిర్వాహకశాఖను విడదీయవలయును.

ఇవియే కాంగ్రెసుకోర్కెలు. ఈ కోరికలనే ముస్లింలీగుకూడ నామో దించినది.

1 కమీషనుల నియామకము.

మాంటేగూ నివేదిక యనంతర మీ సూచనల నాచరణ లోనికి దెచ్చుటకై 1918 అక్టోబరు మాసమున రాష్ట్ర, కేంద్రప్రభుత్వముల యధికార నిరూపణమునకు, లేక, వేరువేరుగ నిరూపించుటకు ఫేథము కమీషను (Featham Commission) ఎన్నికదారులను ఎన్నికదారుల నియోజకవర్గములను నిర్ణయించుటకు సౌతుబరోకమీషను (Southborough Cimmission or Franchise Commission) నియమింపబడినది. ఈ కమీషను లాయా రాజకీయ సంఘముల రాయబారములు వినసాగినని. ఈసమయమునందే దక్షిణ భారతదేశమున, నవగా మదరాసు రాజధానియందు బ్రాహ్మ ణేతరోద్యమము పుట్టినది. 1917 వ ఫిబ్రవరిలో జనించిన బ్రాహ్మణేత రోద్యమము 1918 వ సంవత్సరమున కమిత శక్తివంత మైనది. అప్రతి హత మైనది. బ్రాహ్మణేతరులకు శాసనసభయందు ప్రత్యేకప్రాతినిధ్య ముండవలెననియే యప్పటి కీయుద్యమ ప్రధానోద్దేశ్యము. సౌతుబీరోకమిటీ యందు శ్రీనివాసశాస్త్రిగా రొక సభ్యుడు. ఈయన పలుకుబడినిబట్టి బ్రాహ్మణే తరులకు ప్రత్యేకప్రాతినిధ్యము లభించదేమో యని బ్రాహ్మణేతర యుద్యమ నాయకులు భయపడిరి. సౌతుబీరోసంఘమును బహిష్కరించిరి. ఇంగ్లండు నకు రాయబారము వెడలిరి. అచ్చట వీరిసంకల్ప మీడేరినది. ఈకమీషనులు హిందూదేశ సంచారమొనరించి సూచనలుగావించినవి. లార్డుక్రూగారి యధ్యక్షతను మరియొక కమిటీ నియమింపబడినది. ఈ కమిటీ సీమయందు గల భారతీయ వ్యవహారముల కార్యనిర్వాహణాధికారమును గురించి విచా రించినవి. ఈ కమీషనులు తమ రిపోర్టులను 1919 వ ఫిబ్రవరి మాసమునందు ప్రకటించి యున్నవి.

21

అలజడి—పరిస్థితులు చాంపరాన్, కెయిరా సత్యాగ్రహములు—

ఈవిధముగ నొకవంక కాంగ్రెసు మహాసభయు, ప్రభుత్వమునుగూడ రాజకీయ సంస్కరణములవంకకు దృష్టిని మరల్చినవి. మరియొకవంక కాంగ్రెసు జాతీయోద్యమమును, ప్రభుత్వనిర్బంధవిధానమునుగూడ చెలరేగుచునే యున్నవి. ఒకవంక బీసెంటుగారి హోమురూలు యుద్యమము ప్రబలముగనున్నది. మరియొకవంక మహాత్మాగాంధీ బీహారునందలి చాంపరాను జిల్లాయందు నీలిమందు పైరులలో పనిజేయు కూలీల దుస్థితిని గురించి విచారింపసాగెను. ఈ విచారణఫలితముగ సత్యాగ్రహ మొనరింపవలసివచ్చెను. 1917 ఏప్రియలు మాసమున మోతీహారినుండి యొక గ్రామమునకు పోవుచుండగ మహాత్ముడచ్చటకు పోవలదని 144 వ సెక్షనుక్రింద నిషేధింపబడినాడు. జిల్లాను వీడిపొమ్మని యాజ్ఞాపింపబడినాడు. ఈయుత్తరవును మహాత్ము డుల్లంఘించియుండెను. కేసుపెట్టబడి విచారింపబడెను. నేరము జేసితినని యంగీకరించియుండెను. అయినను, ప్రభుత్వమువారు నేరారోపణము నుపసంహరించుకొని యుండిరి.

కూలీల దుస్థితినిగురించి విచారించుటకై యొకసంఘము నియోగింపబడినది. ఆసంఘనిర్ణయముల ననుసరించి కూలీలకష్టములు గట్టెక్కినవి. మహాత్ముడు విజయపతాకము నెగురవేసెను.

1918 లో ఈవిధముగనే బొంబాయి రాజధానిలో కెయిరాజిల్లాయందు రైతులసత్యాగ్రహము నడుప మహాత్ముడు ప్రారంభించియుండెను. అచ్చట కరువు పరివ్యాప్తమైనది. గవర్నమెంటు పన్నులువసూలుచేయుట విరమించలేదు. పన్నుల నిచ్చుకొనజాలమని రైతులఘోష. ఈఘోషనివారణకై మహాత్ముడు పూనెను. ఆనాడే సర్దారు వల్లభాయిపటేలు తన న్యాయవాదవృత్తిని విసర్జించి మహాత్ముని కండగ నుండ ప్రారంభించియుండెను. రైతులు పన్నులు నిరాకరింపసాగిరి. ప్రభుత్వము, వారి పంటలను జప్తుచేయ నారంభించిరి. రైతులు జప్తులోనున్న పంటలగూడ తీసికొనిపోవ మొదలిడిరి. ప్రభుత్వము రైతులను శిక్షింపసాగినది. రైతులు ఓపికతో జైళ్ళకు పోయిరి.

జరిమానాలను భరించిరి. ప్రభుత్వమువారు బహిరంగముగ రాజీపడక పోయినను రైతులకంతరకు ప్రభుత్వచర్యవల్ల లాభముకలుగక పోయినను, సత్యాగ్రహ సిద్ధాంతమునకు మాత్రము విజయము చేకూరినది.[1]

ఇట్టి విధముగనే యహమ్మదాబాదు మిల్లు కూలీలసత్యాగ్రహమును కూడ మహాత్ముడు నడిపియుండెను. ఇచ్చటకూడ మహాత్మునకు సంపూర్ణ జయము చేకూరినది. మహాత్ముని సత్యాగ్రహసిద్ధాంత మాసేతు హిమాచల పర్యంతము మారుమ్రోగనారంభించినది. ఏమూల జూచినను భారతదేశమంత యును నిర్బంధవిధాన ఘోషతో మారుమ్రోగుచున్నది.

రౌలటుశాసనము

ఈ పరిస్థితులలో రౌలటుసంఘమువారు సూచించినరీతిని ప్రభుత్వమువారు నూతన నిర్బంధ శాసనములను గావింప బూనిరి. ఈ రౌలటు నివేదికను కాంగ్రెసుసంస్థ తీవ్రముగ నిందించినది. (ఇందలి సూచనలు పౌరుల ప్రాథమిక సత్వములకు భంగకరమని వాదించినది. ఈ సూచనల నామోదించి యాచరణయందుంచ రాదని ప్రభుత్వమును వారించినది.)

11వ నవంబరు 1918వ సంవత్సరమున యుద్ధము విరమింపబడి తాత్కాలికశాంతి (Armistice=సంధి) ప్రకటింపబడుటతో ప్రపంచరాజకీయ వాతావరణమే తారుమారైనది. భారతీయ రాజకీయ పరిస్థితులయందుగూడ మార్పుజనించుట సహజము. అమెరికా ప్రసిడెంటు విల్సనుగారు ప్రకటించిన "స్వయంనిర్ణయసూత్రము" (Self determination) ప్రపంచము నందలి యస్వాతంత్ర్య దేశములలో నూతన జీవకళ నుద్భవింప జేసినది. ఆంగ్లేయరాజనీతిజ్ఞుడును నాటియాంగ్లేయ ప్రధానామాత్యుడునగు లాయడుజార్జిగారీసూత్రముతో నేకీభవించుటచే భారతీయ హృదయపటములనుండి నూతనాశాతేజము ప్రజ్వరిలసాగినది. ఈ నూతనతత్వము కాంగ్రెసులో ప్రతిబింబించుటయందాశ్చర్యము లేదు. అయిరోపా మహాసంగ్రామము "యుద్ధములనణచుటకై చేయబడిన

1. Congress History P. 240.

యుద్ధమని ప్రకటింపబడినది. (A war to end war). ఇట్టియుద్ధము విజయవంతముగ ముగియుట మిత్రమండలి కంతకును సంతోషదాయకమైనది. అందు ముఖ్యముగ భారతీయయోధుల వీరరక్తధారలలో నీదులాడిన మిత్రమండలి విజయమునకు భారతదేశము సంతోషము వెలిబుచ్చుట సహజము. ఆశావృతమై యుండుటయు సహజము. ఢిల్లీయందు సమావేశమయిన కాంగ్రెసు మహాజనసభాతీర్మానములలో నీ నూతన చిత్తవృత్తియే గోచరించుచున్నది. దేశమంతయు నిర్బంధవిధాన తీవ్రాగ్నిజ్వాలల కాహుతియగుచున్నను, నా తీవ్రాగ్నిజ్వాలల మధ్యనుండియే ప్రశాంతముగ యుద్ధవిజయమునకై చక్రవర్తిగారి నభినందించినది. రాజభక్తిని ప్రకటించినది. అయిరోపా మహాసంగ్రామము సర్వమానవ స్వాతంత్ర్యమునకై జరిగినదను విశ్వాసమే యిందులకు కారణము. యుద్ధానంతర మస్వాతంత్ర్యదేశము లుండవను యాశయే యిందులకు మూలము. ఈయాశననుసరించియే "స్వయంనిర్ణయసూత్రము" హిందూదేశమునకు వర్తింపజేయవలెనని కాంగ్రెసు కోరినది. ఈ సిద్ధాంతము వర్తింపజేయుటకు సూచనగా, నిర్బంధ విధానమంతయు నుపసంహరించుకొనవలయునని ప్రభుత్వమును కోరినది. రౌలటు నివేదిక సూచన లమలునందుంచబడుచో రాజ్యాంగసంస్కరణములు విజయవంతముగ నెరవేరవని మరొకమారు కాంగ్రెసు ప్రకటించినది. నిర్బంధితులను విడుదల చేయుమని కోరినది. నిర్బంధ శాసనములు సవరించవలయునని హెచ్చరించినది. నిర్బంధ విధానముపట్ల తన యసమ్మతిని జూపించుచు యువరాజుగారి కాహ్వానము నిరాకరించినది యుద్ధానంతరమున గల నూతనతత్త్వము ననుసరించి రాష్ట్రీయ స్వాతంత్ర్యము సంపూర్ణముగ నుండవలెనని కోరబడినది. ఈ భారతీయ వాంఛితములకు లభించిన సమాధానమేమి? యుద్ధానంతరము నిర్బంధ విధానమున కవసరము లేదు. ఉపసంహరించుకొనకుండుటకు కారణములు లేవు. నూతన నిర్బంధ శాసనముల కగత్యమిసుమంతయు గోచరించదు. అయిననేమి? 6వ ఫిబ్రవరి 1919 వ సంవత్సరమున రెండు రౌలటుబిల్లులును తలయెత్తి సర్ విలియము విన్సెంటుగారిచే భారత శాసనసభలో ప్రవేశబెట్టబడినవి. రెండవబిల్లుపసంహరించుకొనబడినది. మొదటిబిల్లు మార్చి పదునెనవవారమున 1919లో శాసనముగ గావింపబడినది. ఇంతతో భారత రాజకీయరంగమున నూతన ప్రళయము

సంభవించినది. నవీనశక్తి యుదయించినది. చరిత్రయందు కని వినని కార్య క్రమము నిరూపింపబడినది. ఆ కార్యక్రమమే సత్యాగ్రహము. గాంధీమహాత్ముడే యీ యుద్యమనాయకుడు. [ఈ గాంధీతాత యెవరు?]

1 రౌలటు శాసనములు. సత్యాగ్రహము-

"గాంధీ యత్యుత్తమాదర్శములును, సంపూర్ణ స్వార్థ త్యాగమును గల టాలస్టాయి సిద్ధాంతముల వాడని లోక ప్రతీతి. సుప్రసిద్ధ విరాగియై, మతోద్ధారకుడగు వానియెడ తూర్పుదేశము సాంప్రదాయ సిద్ధముగ చూపెడిగౌరవమును, దక్షిణాఫ్రికాయందు భారతీయుల పక్షమున పనిచేసిననాటనుండియు, భారతీయులు గాంధీగారి యెడల చూప సాగిరి. ఈయనపట్ల మరియొక విశేషము గలదు...... ఈయన కన్నిమత ముల యందు ననుచరులు గలరు. అణగద్రొక్కి వేయబడినవ్యక్తి లేక కనిష్ట తరగతిలోనివారని తలంచువారి పక్షము బూనుట కెప్పు డీయన సంసిద్ధముగ నుండుటచే ప్రజాసామాన్యమున కీయన ప్రియతముడయ్యెను...... పశుబలమున కంటె నాత్మశక్తి యత్యుత్తమమైనదని యీయన విశ్వాసమగుటచే దక్షిణాఫ్రి కాయందీయన శక్తివంతముగ ప్రయోగించిన సత్యాగ్రహసాధనమును రౌలటు చట్టముపై గూడ ప్రయోగించుట విధియని యీయన విశ్వసించెను. ఈ బిల్లులు శాసనమగుచో సాత్వికనిరోధము లేక, సత్యాగ్రహమును నడిపెదనని ఫిబ్రవరి 24 వ తేదీనా డీయన ప్రకటించియుండెను. ఈ ప్రకటన మహోపద్రవకర మైనదని ప్రభుత్వమువారును, భారత రాజకీయవేత్త లనేకమందియు గూడ తలంచి యుండిరి. ఈ పద్ధతి ప్రమాదకరమని భారత శాసనసభ యందలి మితవాదసభ్యులు కొందరు బహిరంగముగ తమ భయమును ప్రకటించియుండిరి. భారతీయచిత్తవృత్తిని బాగుగ గ్రహింపజాలనంతటి చెడుగు నుద్భవింపజేయగల శక్తు లుదయించునని గాంధీగారిని హెచ్చరించినది. (warned). సాత్విక నిరో ధము వికల్పవిధానమేగాని సంకల్పవిధానముగాదు. (Negitive and not a Positive Force). పశుబల మవలంబనీయముగాదని గాంధిగారు విస్పష్టముగ వెలిబుచ్చిరి. శాంతియుతమగు సివిలు శాసనోల్లంఘనమువల్ల రౌలటుచట్ట మును విరమించుకొనునట్లుగ ప్రభుత్వమును నిర్బంధింపవచ్చునని గాంధిగారి

విశ్వాసము. మార్చి 19 వ తేదీన ఆయన రౌలటు బిల్లులను గురించిన శపథపత్రమును ప్రకటించియుండెను. సం॥ 1919వు 1వ ఇండియను క్రిమినలు 'లా' సవరణ చట్టమును, 2వ క్రిమినలు 'లా' ఎమర్జన్సీ బిల్లును నన్యాయమయిన వనియు, స్వాతంత్ర్యసిద్ధాంతమును తలక్రిందులుచేయునవియు, హిందూదేశము యొక్క — హిందూదేశప్రభుత్వముయొక్క సంరక్షణ కవసరమగు వ్యక్తిస్వాతంత్ర్యమును, పౌరుల ప్రాథమిక హక్కులను నశింపజేయునవియు, నని నేను ఆత్మ సాక్షిగ తలంచుచున్నందున యీ బిల్లులు శాసనములైనపక్షమున, నా శాసనము లుపసంహరింపబడువరకును, శాంతియుతముగ నీ శాసనములను, నిందుకొరకై ముందునియమింపబడు కమిటీ వారు పేర్కొను యితర శాసనములను మన్నింప నిరాకరించెదము. ఈ కార్యాచరణయందు సత్యప్రవర్తకులమై యుండెదమనియు, ప్రాణములు, వ్యక్తులు, లేక, నాస్తులపట్ల నెట్టి దౌర్జన్యమును గాని చేయమనియుకూడ ప్రతిజ్ఞ బూనుచున్నాము." హిందూదేశ ప్రభుత్వము వారు తమ సంవత్సరాది నివేదికయం దీవిధముగ నాటి సత్యాగ్రహోద్యమమునుగురించి వ్రాసి యుండిరి.[1] ఈ వ్రాత ననుసరించియే రౌలటు బిల్లులపైగల ప్రజాభిప్రాయము గుర్తింపవచ్చును. ఈ సత్యాగ్రహోద్యమమును మహాత్ముడు పవిత్రముగు నుపవాసముతో ప్రారంభించెను. 1919 వ మార్చి 30వ తేదీననాసేతు హిమాచలపర్యంతము హరతాళములు జరుగవలెనని నిర్ణయింపబడినది. పిమ్మట ఏప్రియలు 6 వ తేదీ కీకార్యక్రమము మార్చివేయబడినది. ఈమార్పుసకాలమున దెలియక ఢిల్లీలో మార్చి 30 వ తేదీనే హరతాళము జరుపబడినది. యీనాడే యీ రేగింపును నడుపుచున్న స్వామి శ్రద్ధానందుడు కాల్చివేయబడునని యాంగ్లేయసైనికులచే బెదరింపబడెను. స్వామి యీ బెదరింపులకు జంకలేదు. కాని, ఢిల్లీ రైలుస్టేషనువద్ద కాల్పులుజరిగినవి. అయిదుగురు మరణించిరి. చాలమంది గాయపడిరి. ఏప్రియలు 6 వ తేదీన నాసేతు హిమాచలపర్యంత "మమితోద్రేకముతో" సభలు జరుపబడినవి.[2] ఈ కార్యక్రమ ప్రారంభము హిందూ మహమ్మదీయ సఖ్యతతో ప్రారంభింపబడినది. [హిందూమహమ్మదీయ సఖ్యతకు "కిలాఫతు" ప్రమాదస్థితియందుండుటొక కారణమైనది.]

1. Vide India 1919.
2. India in 1919.

23 పంజాబుహత్యలు

“పంజాబున కుక్కుతునక యనదగు సర్ మైకేలు ఒడయరుగారు కాంగ్రెసు తత్వము పంజాబులో వ్యాప్తిగాకుండ నిరోధించుటకై నిశ్చయించుకొని యుండెను. 1919 లో నమృతసరమునందు జరుగవలసిన కాంగ్రెసు మహాజనసభ జరుగుటా-జరుగకుండుటా యనువిషయమై ఒడయరుగారికిని, కాంగ్రెసునకును మధ్య ద్వంద్వ యుద్ధము సాగినది.”1 డాక్టరు కిచ్లూ - డాక్టరు సత్యపాలుగార్లిరువురును జేరి కాంగ్రెసు నిర్మాణమునకుబూనిరి. 10-4-1919 వ తేదీని వీరిరువ్వురును నమృతసరమునందు జిల్లాకలెక్టరుగారిచే పిలువ నంపబడి ఎచ్చటికో తీసికొనిపోబడిరి.

ఇంతతో కల్లోలము సాగినది. వారిపోకనుగురించి కనుగొన కలెక్టరుగారి కడకు బో నారంభించిరి. దారిలో సైనికబృందముతో పోరాటము సాగినది. ప్రజలు రాళ్లురువ్విరని చెప్పి వారిపై తుపాకిగుళ్లు వదలబడినవి. ప్రజలుద్రేకపూరితులై హతులైనవారితో నూరేగుచు దారిలో నేషనల్ బ్యాంకు భవనములను తగులబెట్టిరి. దాని యాంగ్లేయ మేనేజరును చంపివేసిరి. ఈప్రజోద్రేకమువల్లను, దౌర్జన్యమువల్లను అయిదుగు రాంగ్లేయులు మరణించిరి. బ్యాంకుభవనము తగులబడినది. రైలుసరుకుల గిడ్డంగి తగులబెట్టబడినది. కొన్ని యితరభవనములు గూడ వీతిహోత్రుని పాలయినవి. గుజరనువాలా-కాసూరుల యందుగూడ ప్రజలు దౌర్జన్యమొనరించిరి. ధన, భవన, ప్రాణహానులు సంభవించినవి. ప్రభుత్వకార్యాలయము లగ్నిహోత్రుని కాహుతి యొనరబడినవి. ఈవిధముగనే యచ్చటచ్చట గూడ దౌర్జన్యము జరిగినది. లాహోరు, కలకత్తాలలో గూడ దౌర్జన్యము సంభవించినది. ఈవార్తలువిని గాంధీగారు పంజాబునకు బయలుదేరిరి. (8-4-1919) కాని, ప్రభుత్వమువారు గాంధీ పంజాబు, ఢిల్లీలలోనికి కాలుపెట్టరాదని నిషేధింపబడి రైలునుండి వెనుకకు మరలింపబడి బొంబాయికి దీసికొనిపోబడెను. ఈవార్త యహమ్మదాబాదు నందుగూడ దౌర్జన్యకారణ మయినది. దౌర్జన్యమువలన నాంగ్లేయ-హైందవ ఉద్యోగులు కొందరు దివంగతులైరి. ఈవిధముగనే కలకత్తా, నడయూరు, వీరమంగము మొదలగు స్థానములలో దౌర్జన్యములు జరిగినవి. ధన, ప్రాణ,

1. Congress History P. 276.

భవనవినాశహేతువు లయినవి. ఈదౌర్జన్యములవలన మహాత్ముడు సత్యాగ్రహమును విరమించివేసెను. ఈ పరిస్థితు లిట్లుండ నమృతసరములో ఏప్రియలు 10 తేదీ నుండియు 'మార్షలు' 'లా' పరిస్థితులు ప్రబలియున్నవి. 'మార్షలులా' 15 వ ఏప్రియలు వరకు ప్రకటింపబడకపోయినను మార్షలులా పరిపాలనమే లాహోరు, అమృతసరములలో కొనసాగింపబడుచున్నది.

జలియనువాలాబాగుతోటలో సంవత్సరాదినాడు బహిరంగసభ జరిగినది. ఈ బహిరంగసభకు 20 వేలమంది ప్రజలుహాజరైరి. ఈతోటకొక్కటే సన్నని గుమ్మమున్నది. వేరుమార్గములు లేవు. గోడలచే చుట్టియున్నది. ఇదియే సమయమని తలంచి జనరలుడయ్యరు, సైన్యముతో నచ్చటకుపోయి సభపై కాల్పింపసాగెను. సభను మానివేయవలెనని ప్రకటించిన రెండుమూడు నిమిషములలోనే తుపాకిమ్రోతలు మిన్నుముట్ట సాగినవి.1 ఇరువదివేలమంది రెండుమూడు నిమిషములలో సన్నని త్రోవగుండ సభనుండివెడలిపోవుటయెట్లు! ప్రజలువెళ్ళుటకు తగిన సావకాశమిచ్చియుండలేదు. తూటా లాఖరగువరకు ప్రజలు కాల్చిచంపబడిరి. 400 మంది చచ్చిరి. ఒకటి-రెండు వేలమధ్య జనాభా గాయములపాలైరి. మందు సరిపోనందువల్ల మాత్రమే అంతతో తుపాకిమంట లాగినవనియు, లేనిచో నింకను కాల్చిచంపియుండెడివాడనని డయ్యరుగారే ఒప్పుకొనిరి. 2 అంతతో పంజాబునందు మానవవధ ప్రారంభింపబడినది. ధన, మాన, ప్రాణములకు సంరక్షణ లేకపోయినది. బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు వీరు వారననేల? ఎల్లరు హింసింపబడిరి. పంజాబు దురంతముల కంతులేదు. కొరడాలతో కొట్టబడిరి. పొట్టలపై నడి ఎండలో ప్రాకింపబడిరి. స్త్రీల మానభంగములకు దరిదాపులేదు. మార్షలులాకోర్టుచే 218 గురు శిక్షింపబడిరి.

ఇందు 51 మందికి మరణదండయు, 46 మందికి ద్వీపాంతరవాసశిక్షయు, 2 రకు 10 సంవత్సరముల శిక్షయు విధింపబడినది. 79 గురికి 7 ఏండ్లు, 10 మందికి అయిదుఏండ్లు, 13 గ్గురికి మూడేండ్లు, 11 గురికి చిల్లరగను శిక్షలు

1. See. Dyer's evidnec before Huntur Committee.
2. See. Huntur Committee's report for details.

విధింపబడినవి. వీరుగాక మరి 155 గురుగూడ మామూలు మేజిస్ట్రేటులచే శిక్షింపబడిరి.

"నేనొక ముష్కరకృత్యమును జేయవలసివచ్చినది. ఇది దయతోఁగూడిన దనియే నా తలంపు. తీవ్రముగను, విచ్చలవిడిగను, తుపాకిమంటలను ప్రయోగించి తీరవలెనని నిశ్చయించుకొంటిని. నేనుగాని, మరెవ్వరుగాని మరొకమారు కాల్చవలసినయవసరము లేకుండపోవుటకే యిట్లొనరించితిని. తుపాకికాల్పుంత్రో పనిలేకుండగనే సభను చెదరగొట్టుటకు సావకాశమున్నదనియే నాతలంపు. అట్లొనరించియుంటినేని వారు మరలతిరిగివచ్చి నన్నుజూచి నవ్వెడివారు. నేనొక నెత్తివెంగళప్పనైపోయెడివాడను." అని డయ్యరుగారు తానొనరించిన ఘాతుక కృత్యమునుగురించి యంగీకరించియుండిరి.[1] ఆ కాలమున పంజాబులోజరిగిన యీ యమానుష కృత్యములు, దురంతములు, మృగప్రాయపు చర్యలు ఓడ్వాయ్యరుగారుమాత్రమే చేయలేదు. "కల్నలు, జాన్సను, బాస్వర్తు, స్మిత్తు, కల్నలుఓబిరను మొదలగు సివిలుమిలిటరీ యుద్యోగులొనరించిన పనులనుదలంచుచో రక్తమట్లుడికిపోవునట్లుడికిపోవును."[2] ద్రౌపది నాడు మహాభారతయుద్ధమునందు చెప్పినటుల "చిచ్చోడింగట్టినయట్లు — బెద్దయును కాలము దీనికి నారుపెన్నడుంబుట్టడు." ఈ పంజాబువధలరణము నాటనుండియు భారతరాజ్యాంగ పరిణామమునం దెడతెగకుండ శెలలనువేయుచునేయున్నది. కలకవేయుట మానలేదు. నాటితో భారతరాజ్యాంగ పరివర్తనయుగమున నూతనశక మారంభమయినది.[3] ఈఘోర దురంతచర్య పంజాబుగవర్నరగు మైకేలుఓడ్వాయ్యగారి యామోదమునుగూడ బొందినది. గాంధీ, తాను సత్యాగ్రహోద్యమమును ప్రారంభించుటలో హిమవత్పర్వతమువంటి ఘనమగుతప్పిదము నొనరించు నట్లంగీకరించుచు సత్యాగ్రహమును విరమించుకొనెను. అయినను ప్రభుత్వముమాత్రము పంజాబులో 'మార్షలులా' ను 11 వ జూనువరకును విరమించనేలేదు. శంకరునాయరువంటి

1. See. Hunter Committee Report.

2. Congress History.

3. See. Hunter's Report and Congress Enguiry Report and Congress History for details regarding Punjab atrocities in 1919. Indeed we find there in really blood Crudling picture of the events.

ప్రభుత్వపక్షవాదిగూడ మార్షలులాపట్ల ప్రభుత్వాచర్య యకృత్యముగనున్నదని తనకార్యనిర్వాహక సభ్యత్వమునకు రాజీనామా నొసగియుండెను. (19 జూలై 1919).

24
హంటరు కమిటీ నివేదిక — ప్రజల యసమ్మతి, కాంగ్రెసు కమిటీ నివేదిక.

"పంజాబుదురంతముల పరిస్థితులనుగురించి విచారింపవలె నని ప్రజాందోళనజరిగినది. "ఈకృత్యమును గురించి వెను వెంటనే విచారించుట, యిందులకుసంబంధించినవ్యక్తులందరి పట్లను న్యాయముగ నుండవలెననుట నిర్వివాదాంశము. అయినను ప్రభుత్వము సెప్టెంబరులోమాత్రమే హంటరు కమిటీని నియమించినది.1 ఈ హంటరుకమిటీయొక్క విచారణాధికార మత్యల్ప ముగనున్నదని కాంగ్రెసుతలంచినది. అయినను, కొంతవరకు, హంటరుకమిటీకి కాంగ్రెసు తోడ్పడినది. కాని, మధ్యయందు హంటరుకమిటీని కాంగ్రెసు బహిష్కరించినది.

మార్షలులా శిక్షితులగువారీకమిటీచే చేయబడు విచారణయందు కాంగ్రెసునకు సహాయము చేయవలసియున్నదనియు, వారిని కమిటీయెదుటకు ప్రభుత్వబంధితులుగనే తీసికొనిరావలయుననియు, కాంగ్రెసువారు కోరిరి. ఈకోరికను రాష్ట్ర, కేంద్రప్రభుత్వములును, రాజ్యాంగ కార్యదర్శియుగూడ నిరాక రించెను. ఈ నిరాకరణమే కాంగ్రెసు బహిష్కరణమునకు కారణము. తదుపరి కాంగ్రెసు నియామకసంఘము విచారణ సలిపినది. (కాంగ్రెసు విచారణసంఘ సభ్యులు. (1) గాంధీ. (2) మోతీలాలు. (3) దాసు. (4) ఫజలల్‌హక్కు. (5) అబ్బాసు, తయాబ్జి. (6) కె. సంతానం. అమృతసరము కాంగ్రెసునకు మోతీలాలధ్యక్షుడుగ నెన్నుకొనబడుటవల్ల సభ్యత్వమును వదలుకొనెను. జయకరుగారు వీరిస్థానమునందు నియోగింపబడిరి. ఆంధ్రూసుగారీసంఘము నియమింపబడుటకుముందు విచారింప ప్రయత్నించినపుడు ప్రభుత్వమువారీయన విచారణను నిరోధించిరి. ఈ తరుణముననే బి. జి. హార్నిమనుగారు ఇంగ్లండు నకు పంపివేయబడిరి. మార్షలులా పరిపాలనమును ఖండించుటయే యీయన నేరము.)

1. See. Keith. P. 275.

"జనరలు డయ్యరుగారి ఏప్రియలు 13 వ తేదీ చర్యముందుగనే యాలోచించి చేయ నిశ్చయించుకొనినట్టి, యమాయకులైన, నిరాయుధులగు, న్వుద్రేక కారకులుగాని, పెద్దలను, పిన్నలను, నిర్దాక్షిణ్యముగ గావించిన చిత్రవధకంటె వేరేమియును కాజాలదు. ఆధునికకాలములో నీహృదయవిదారకమగు, నీచమగు, పశుప్రాయమగు నీ చర్యకు పోలిక యుండనేరదు. ఈ విషయము డయ్యరుగారు హంటరుకమిటీవారిముం దంగీకరించిన విషయములవల్లనే రుజు వగుచున్నది." అని కాంగ్రెసు విచారణసంఘమువారు వారి యభిప్రాయమును వెల్లడించిరి.

ప్రభుత్వవిచారణసంఘమగు హంటరుకమిటీ నివేదిక 1920 మే 28 వ తేదీ నాడు ప్రకటింపబడినది. ఈ సంఘసభ్యులంద రేకీభవించి ఈ నివేదికను వ్రాసి యుండలేదు. ఆంగ్లేయులంద రేకమైరి. భారతీయులంద రొకటయిరి. ఆంగ్లేయులు, పంజాబున ప్రజలుగావించిన యల్లరులకంతకు ముందుగావింపబడిన కుట్ర గారణమనిరి. భారతీయులు తాత్కాలికోద్రేకము కారణమనిరి. "కొన్ని కార్యముల పట్ల గావింపబడిన యధికార దుర్వినియోగమువల్లను, నన్యాయప్రవర్తనమువల్లను, బాధ్యతలేని ప్రవర్తనమువల్లను మలినమైనది. వివేచనగల మనిషి ఎవ్వరైనను అవసరమగునని తలంచునంతటికంటె డయ్యరువర్తనము హెచ్చుగ నున్నది. యీపట్ల నవసరమగు మానవతత్వముతో నీతడు ప్రవర్తించియుండలేదు." అని ప్రభుత్వ మంగీకరించినది. (The Administration of Martial Law was warned in particular instances by misuse of power, by irrigularity and by injudicious and irresponsible acts; that General Dyer acted beyond what any reasonableman, would have thought it to be necessary; and that he did not act in such humanity; as the case permitted".) ఆంగ్లేయ ప్రభుత్వముగూడకొన్ని కృత్యములను ఖండించినదిగాని, జనరలు డయ్యరుగారి చర్య బుద్ధిపూర్వకము గాదనియు, పొరపాటుగ మోచించుటయే యాయన చర్యకుగల కారణమనియు, హిందూదేశమిత్రు డనుకొనబడిన మాంటేగూగారు నుడివిరి. (General Dyer acted to the best of his lights and with a sincerity of purpose; but that he committed an error of Judgement).

పంజాబుహత్యకు కారకులైనవా రెవరుగాని తగురీతిని శిక్షింపబడలేదు. ఇంక ఈనిర్బంధవిధానమునకు వెనువెంటనే నడచుచుండు రాజ్యాంగసంస్కరణల పరిణామగతి గమనింప దగియున్నది.

25
పార్లమెంటు-ఉప సంఘము. సంస్కరణ ముల శాసనము

మాంటేగూ సూచనలతో తయారుచేయబడిన నూతన సంస్కరణ ప్రణాళిక మే మాసాంతమున పార్లమెంటు సభలో ప్రవేశపెట్టబడినది. జూన్ 5 వ తేదీని రెండవ మారు చదువబడినది. లార్డ్సుల సభవారి యామోదముతోసహా నీబిల్లు విచారణకై రెండు సభలనుండియు గలిపి యొక యుమ్మడిసంఘము నియమింపబడినది. ఈసంఘమునకు కామన్సు సభ 7 గురు సభ్యులను జూలై మూడవ తేదీనాడును, మరి 7 గురు సభ్యులను లార్డ్సులసభ జూలై 7 వ తేదీనాడును ఎన్నుకొని యుండెను. ఈసంఘమునకు లార్డుసెల్‌బారను (Lord Selborne) గారధ్యక్షులుగ నెన్నుకొనబడియుండిరి. "ఈసంఘ నియామకమువల్ల లార్డ్సులసభయొక్క ముఖ్యావసరము గమనింప బడినదని గుర్తింపవలసియున్నది.1 ఈజాయింటు పార్లమెంటరీ సంఘము జూలై 10 వ తేదీ నుండి అక్టోబరు 15 వ తేదీవరకును 72 సాక్షులను విచారించినది. హిందూదేశమునుండి వివిధరాయబారవర్గములు సీమకు ప్రయాణము జేసినవి. కాంగ్రెసు మహాజనసభ 21 వ ఏప్రియలు 1919 లో నియోగించిన కాంగ్రెసు రాయబారవర్గముగూడ సీమలో కమిటీవారి కట్టెదుట సాక్ష్యమొసగినది. కాంగ్రెసు రాయబారమునందు విఠల్‌భాయి పటేలుగారును, వి. పి. మాధవరావుగారును, సభ్యులు. వీరికి తిలకు, బిపినచంద్రపాలు, కపర్ది, డాక్టరు మెహతా, ఎ. రంగస్వామిఅయ్యంగారు, కేల్కారు, హస్సేను, యిమాము, హార్నిమను, డాక్టరు సాత్యే, పి. చెంచయ్యా సహాయకులుగ పని జేసియుండిరి. మితవాదులు, జస్టిసుపార్టీ, హోంమురూలులీగు-అల్పసంఖ్యాకులు, రాయబారవర్గములను సీమకుపంపిరి. మహారాష్ట్రహోంమురూలు లీగు రాయబారవర్గము కొలంబోనుండి వెనుకకు మరల్చివేయబడినది. ఇంగ్లండునకు కాంగ్రెసు రాయబారవర్గమును బీసెంటుగారుకూడ ప్రతిఘటింపసాగిరి. బీసెంటు

1. Keith P. 126.

మాంటేగు ప్రణాళిక నామోదించుచున్నది. కాంగ్రెసు రాయబారవర్గము స్వయం నిర్ణయసూత్రమును-బాధ్యతాయుత ప్రభుత్వమును, ఢిల్లీ కాంగ్రెసు తీర్మానానుసారము కోరియున్నది. ఈవిచారణ ముగింపబడి 1919 వ నవంబరు 17 వ తేదీనాడు తన నివేదికను పార్లమెంటునకు సమర్పించినది. ఈనివేదిక యందైనను భారతీయాభిప్రాయము గమనింపబడలేదు. "పరస్పర సంఘర్షణము లకు తావలమైన, లేక, నావకాశములు గలిగించెడి, లేక ననవసరమైన విషయ ములు తీసివేయబడి యవసరమైన విషయములు చేర్చబడినవి. బాధ్యత ప్రతి చోటను నిర్ణయింపబడినది. కార్యనిర్వాహకవర్గము తననిశ్చయమైన బాధ్యతను నిర్వహించుటకువలయు సరియగు నాయుధము లొసగబడినవి." అని జాయింటు కమిటీ అధ్యక్షుడగు శాలబారనుగారు నుడివిరి.[1]

"బాధ్యతతో గూడిన రాష్ట్రీయ కార్యనిర్వాహక వర్గములును, శాసన సభలును వీరి రాజకీయాధికారులగు ఎన్నికదారులును, తప్పిదములను చేయుదు రని మేము తలంచెదము. ఈ తప్పిదములయొక్క తీవ్రఫలితములను తగ్గించు టకు వలయు మార్గములును, సంరక్షణములును, యీబిల్లునందు చేర్చబడి యుండెనని మేము చెప్పగలము." అని నూతన సంస్కరణముల బిల్లునుగురించి లార్డుసిన్హాగారు నుడివిరి.

(ఈయన ఒకప్పుడు కాంగ్రెసు ప్రెసిడెంటు. సంస్కరణముల విచారణకాలమున సహాయ రాజ్యాంగకార్యదర్శిగ పనిజేసియుండెను.[2] ఈసంస్కరణముల చట్టము జాయింటుకమిటీవారి పరీక్షానంతరము డిశంబరు 5 వ తేదీని కామన్సుసభవారి యామోదముతో లార్డుల సభకు పంపబడినది. లార్డు లీబిల్లును 18 వ తేదీనా డంగీకరించియుండిరి. 23 వ డిశంబరు 1919 వ సంవత్సరమునాడు చక్రవర్తిగారి యామోదమును బడసినది. ఈవిధముగ 1858 వ సంవత్సరమునందు గావింపబడిన ప్రధమ భారత రాజ్యాంగశాసనము సమూలముగ 1919 వ సంవత్సరాంతమునందే తిరిగి మార్పుచెందెను.

1. Quoted by B.K. Thakore B. A., I. E. S. The Dawn of Responsible Govt. P. 412. published 1922.
2. Quoted by Thakore. Indian Administration. P. 412.

"యుద్ధకాలమున భారతీయుల సహకారమును బొందుటకై సీమప్రభుత్వము తాను ప్రకటనగావించి యుండెనని కొందరు క్రూరచిత్తమున దెల్పుచున్నారు. నేడు మనపని జరిగినందున ఏరుదాటి తెప్ప తగులవేయుదు మనుచున్నారు. ఈశాసనమును గావించుటయం దాలస్యము పనికిరాదనుటకే యీమాటలను జెప్పితిని. ఆలస్యము-శుభమార్గముగాని ఆలశ్యము-మనకర్తవ్యమునకు ప్రతిబంధకము. అందువల్లనే యీ విషయము రెండేండ్లు యోజించిన పిమ్మట యీబిల్లు కామన్సుసభలో ప్రవేశపెట్టబడినదనియు—యిట్లు ప్రవేశపెట్టుటలో తొందరపడి యుండలేదనియు, చెప్పుచున్నాను."......నే నీసభకు మనవి చేయున దేమనగా 20 వ ఆగష్టున గావింపబడిన ప్రకటన ప్రకార మీబిల్లు బుద్ధిపూర్వకముగ హిందూదేశమునకు నిలకడ గలిగియుండు రాజ్యాంగము నొసగినట్లు నటింపజాలదు. ఇది తాత్కాలికము. పార్లమెంటువారి ఏజంట్ల పరిపాలనమునకును, ప్రజాప్రతినిధుల పరిపాలనమునకును మధ్యగల యేరున కీబిల్లు వంతెనవంటిది."......

బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపింపబడుటకు-నధికార కేంద్రీకరణమును తగ్గించుటకును అంద రంగీకరించియుండిరి. క్రమక్రమముగ పార్లమెంటువారి ఏజంట్ల పరిపాలనముతగ్గి, పరిపాలనము ప్రజాప్రతినిధుల వశము కావలయును." ఇవి మాంటేగూగారి ఆశయములు. సంస్కరణశాసనమును రెండవ పర్యాయము కామన్సు సభలో ప్రవేశపెట్టబడినపు డిట్లు తన భావ పరివర్తనమును మాంటేగూగారు విశదపరచిరి. ఈయుత్తమ భావము సంస్కరణములయందు ప్రతిబింబించుటలేదని మాంటేగూగారే పైవాక్యములలోనే యంగీకరించి యుండిరి.

1
ఖిలాఫతుయుద్యమము
మహమ్మదీయుల
యసమ్మతి.

ఈ పరిస్థితులకు "ఖిలాఫతు" కథ దోహదమైనది. టర్కీదేశముగూడ అయిరోపా మహాసంగ్రామమునందు దగుల్కొనినది. టర్కీ సుల్తానునందే మహమ్మదీయ మతాధికార మిమిడి యున్నదనియు, మహమ్మదీయ పుణ్యక్షేత్రములన్నియు ఆయన యధికారమునందే యుండవలెననియు, హిందూదేశ మహమ్మదీయుల విశ్వాసము. ఈవిశ్వాసము సంర

క్షింపబడుననియు, టర్కీ సుల్తానుయొక్క భాగ్యవంతములగు రాజ్యభాగము లేవియు నపహరింపబడవనియు, నాటి బ్రిటిషు ప్రధాని యగులాయడుజార్జి భారతీయ మహమ్మదీయులకు వాగ్దాన మొసగినమాట నిజము. ఈ వాగ్దానమునకు పిమ్మట నపార్థము గల్పింపబడి వాగ్దానభంగ మొనరించుటయు, సత్యమే. సంధిషరతుల ననుసరించి టర్కీ రాజ్య విచ్ఛిన్న మొనరింపబడినది. థ్రేసు, గ్రీసున కొసగబడినది. ఆసియాఖండమందలి టర్కీ రాజ్యభాగములను సీమవారును, ఫ్రాన్సువారును తమలోతాము పంచివేసికొనిరి. ఈ పంచుకొనుటకే "సంరక్షణ రాజ్యము"లని పేరుపెట్టబడినది. టర్కీదేశ పరిపాలనము మిత్రమండలివారిచే నియమింపబడిన హైకమిషనువారి హస్తగత మొనరింపబడినది. టర్కీసుల్తాను నామమాత్రపురాజుగ తన సింహాసనమునందే బంధింపబడినాడు. ఇదియంతయు నాంగ్లేయ ప్రధానామాత్యుని విశ్వాసద్రోహమనుట నిర్వివాదాంశమే. ఆంగ్లేయప్రధానామాత్యుడు "కిలాఫతు" సంరక్షణమునకై గావించిన వాగ్దానముల నాధారముగ జేసికొనియే భారతీయ మహమ్మదీయులు సైన్యమునందు జేరి అయిరోపా మహాసంగ్రామమునందు పోరుసల్పిరి. ఏ నాడీ వాగ్దానము భంగమైనదో యానాటినుండియు, భారతమహమ్మదీయులలో మతావేశము దినాదినాభివృద్ధి గాంచసాగినది. ఆంగ్లేయ ప్రభుత్వముపట్ల ద్వేషము రగుల్కొనసాగినది. ఈ యుద్యమమున కాలీసోదరులు నాయకులు. కిలాఫతు రాయబారవర్గము 17 వ మార్చి 1920 వ సంవత్సరమున నింగ్లండునకు గూడ పోయినది. స్వయముగ హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి పక్షమున పిషరుగారికిని, లాయడుజార్జిగారికిని తమ కోరికలను నివేదించిరి. శాంతిసభకు కూడ తమ యభిమతమును విన్నవింపదలంచినది. నిరాకరింపబడినది. ఆశాలేశము లేక రాయబారవర్గము భారతదేశమునకు మరలివచ్చినది. శాంతిసభవల్ల మహమ్మదీయులయాశ లడియాసలుగ మారినవి. కిలాఫతు యుద్యమమునకై మార్చి 19 వ తేదీ 1920 హరతాళ దినమైనది. ఇందులకు గాంధీ మహాత్ముడాశీర్వదించి యున్నాడు. మహాత్ముడు సత్యపరాక్రముడు. సత్యవిరుద్ధముగ కిలాఫతు వాగ్దానములు........బ్రిటిషు ప్రభుత్వము భంగమొనరించుటయే యీయుద్యమము మహాత్ముని యాశీర్వచన పాత్రమగుటకుగల హేతువు. ఈవిధముగ మత—రాజకీయోద్యమములను కలుపుటవల్లనే మహమ్మ

దీయులలో మతావేశము హెచ్చుపెరిగి రాను, రాను, రాజకీయ దృక్పథము సన్నగిలుటకు కారణమైనదని మహాత్మునిపై కొందఱు రాజకీయవాదుల నేరారోపణము. మహాత్మునకు, మతమునకును—రాజకీయములకును, విభేదము లేకపోవుటయే మహాత్ముడు 'ఖిలాఫతు' ఉద్యమమునకు సానుభూతి, సహాయము లొసగుటకు కారణము—

26 దేశ సంక్షోభము. ఈ విధముగ 1920 సంవత్సరారంభమునకు భారతదేశము మూడు తాత్కాలిక సన్నివేశములవల్ల సంక్షోభితమై పోయినది.

(1) ఒకవంక మాంటేగూసంస్కరణములవల్ల భారతీయ స్వరాజ్యవాంఛ యీడేరక భారతదేశ మసంతృప్తిపరమైయున్నది.

(2) వేరొకవంక పంజాబుదురంతములు భారతదేశ నిస్సహాయతను బహిరంగపరచి యాత్మగౌరవ, పౌరుషోద్రేకములను రెచ్చగొట్టినవి.

(3) మరియొకవంక కిలాఫతుసమస్య మహమ్మదీయ మతావేశమును ప్రభుత్వమునకు ప్రబలవద్వ్యతిరేకముగ పురికొల్పసాగినది. ఈమూడు కారణముల సంపర్కమే మహాత్ముని యసహాయోద్యమమునకు మూలమైనది. భగ్నజాతీయాత్మగౌరవ మహాస్రవంతి వెల్లువలై పారుటకు మహాత్మునిత్యాగ స్వరూప సంయుతమైన అహింసాపదమే మూలకందమైనది.

ఈ మూడుకారణములును, భారతీయ తాత్కాలికోద్రేక పౌరుషముల రెచ్చగొట్టుట కుపాధియైనను, భారతరాజ్యాంగ పరిణామావస్థలలో 1858 వ సంవత్సరమునుండియు 1920 వరకు తీరని భారతీయవాంఛితములును – ఆంగ్లేయ ప్రభుత్వభగ్నవాగ్దాన పరంపరలును భారతజాతీయోద్యమమునకు మూలములనుట నిశ్చయము. ఇచ్చట 1858 వ సంవత్సరమునుండియు (కాంగ్రెసు పుట్టిన నాటనుండియు) నీడేరని భారతీయవాంఛితార్థముల స్మరించుట యుక్తము.

(1) సీమయందున్న రాజ్యాంగకార్యదర్శి కౌన్సిలును, ఎత్తివేయుట (1885 వ సంవత్సరపు కాంగ్రెసువాంఛితము).

(2) సివిలుసర్వీసు పరీక్షలను హిందూదేశమునందునను, సీమయందునను గూడ నొకేసారిజరుపుట. (1885).

(3) భారతదేశసైనిక వ్యయమును న్యాయసమ్మతముగ భారతదేశమునకును, సీమకును పంచుట. (1885).

(4) జ్యూరీలవల్ల న్యాయవిచారణను సలుపుపద్ధతిని విస్తరించుట. (1886).

(5) జ్యూరీనిర్ణయము తుదినిర్ణయ మొనరించుట. (1886).

(6) వారంటుకేసులలో జిల్లాకలెక్టరుగారివిచారణ మవసరములేదనియు, జిల్లాజడ్జియే విచారింపవలయుననియు, కోరుటకు ముద్దాయిల కధికారముండవలయును. (1886).

(7) న్యాయకార్య నిర్వాహకశాఖల విభజన. (1886).

(8) భారతీయ ఐచ్ఛికసేవాదళము. (1887).

(9) భారతీయులను సైనికోద్యోగులుగ తరబీతుచేయుటకు సైనికశిక్షకళాశాలలను స్థాపించుట.

(10) ఆయుధశాసన సవరణము; నియమముల సవరణము. (1887).

(11) సాంకేతిక విద్యావిధానము; పారిశ్రామికాభివృద్ధి. (1888).

(12) ప్రభుత్వ భూమిశిస్తు నీతి. సంస్కరణము. (1889).

(13) నాణెముల చెలామణీనీతి. (1892).

(14) హిందూదేశమునందే ప్రత్యేకవైద్యవృత్తి సిబ్బందీశాఖను నెలకొల్పుట. (1893).

(15) మారకపు తబ్బిబ్బులవల్ల నాంగ్లేయోద్యోగులకొసగు ముదరాల పద్ధతిని తొలగించివేయుట. (1893). Abolition of exchange compensation allowance).

(16) నిర్బంధ కార్మికపద్ధతి, నిర్బంధాహారపదార్థముల సరఫరా. (1893). (Abolition of forced labour and forced contributions of supplies).

(17) సీమకట్నములను తగ్గించుట. (Home charges. 1894).

(18) పత్తి ఉత్పత్తిసుంకమును రద్దుచేయుట. (Repeal of cotton-excise duty. 1894).

(19) న్యాయవాదులనే యున్నత న్యాయస్థానోద్యోగులుగ నియమించు చుండుట. (1894).

(20) అధినివేశ రాజ్యములలోగల భారతీయుల స్థితి. (1894).

(21) స్వదేశ సంస్థానములలోగల పత్రికలనుగురించి 1891 లో హిందూదేశప్రభుత్వము ప్రకటించిన ప్రకటనను రద్దుచేయుట. (1894).

(22) వ్యవసాయదారుల ఋణగ్రస్థతను తొలగించుటకు వలయు శాసనములను గావించుట. (1895).

(23) మూడవతరగతి రైలుప్రయాణీకులదుస్థితిని తొలగించుట. (1895).

(24) రాష్ట్రములకార్థిక స్వాతంత్ర్య మొసగుట. (1896).

(25) విద్యాశాఖ సిబ్బందీని భారతీయులకు న్యాయము జరుగునట్లనుకూలముగ మార్చుట. (1896).

(26) 1818 బెంగాలు, 1819 మదరాసు, 1827 బొంబాయి రిగ్యులేషనుల (నిర్బంధశాసనములు) రద్దుచేయుట. (1897).

(27) 1898 వ రాజద్రోహశాసనమును రద్దుచేయుట. (1897).

(28) 1898 వ క్రిమినలు ప్రొసీజరుకోడు సంస్కరణ. (1897)

(29) 1899 వ కలకత్తా మ్యునిసిపాల్టీ శాసనము. (1898).

(30) 1900 వ పంజాబుభూమి అన్యాక్రాంత శాసనమునుగురించి. (1898).

(31) భారతీయార్థిక పరిస్థితులనుగురించి విచారించుట. (1900).

(32) చిన్న సివిలుసర్వీసులలో భారతీయులనే విశేషముగ నియమించుట. (1900).

(33) ప్రజోపయోగకట్టడముల శాఖలో పెద్దయుద్యోగస్థులుగ భారతీయులను నియమించుట. (1900).

(34) సీమలోజరుగు పోలీసుశాఖ పోటీపరీక్షలలో పాల్గొనుటకు భారతీయుల కర్హతనొసగుట. కృతార్థులైనవారిని పోలీసుశాఖలో పెద్దయుద్యోగములలో చాలమందిని నియమించుట.

(35) ఆంగ్లేయసైనికులు హిందూదేశమునం దుండుటవల్ల బ్రిటిషుప్రభుత్వము భరించుచున్న సాలుసరి పౌ 786,000 ల వ్యయము నంతకంటె హెచ్చించుట. (1902).

(36) హిందూదేశ విశ్వవిద్యాలయ కమీషను సూచలనుగురించి.(1902).
(37) సం॥ 1904 వ హిందూదేశ విశ్వవిద్యాలయ శాసనము గురించి.
(38) 1904 వ ఉద్యోగస్థుల రహస్యపుశాసనమును గురించి. (1903).
al Secrets Act).
(39) రాజ్యాంగ కార్యదర్శి కార్యాలయపు ఖర్చులు. కార్యదర్శి జీత

(40) భారతరాజ్యాంగ వ్యవహారములను నిర్ణీతకాలములయందు విచా

(41) స్థానికపరిపాలనయం దభివృద్ధి. (1905).
(42) సం॥ 1908 వు క్రిమినలు లా ఎమెండుమెంటు ఆక్టుసవరణము.
(43) సం॥ 1908 వు పత్రికాశాసనము. (1908).
(44) ప్రారంభోచిత విద్య. (1908).
(45) శాసనసభల నియమముల సంస్కరణము. (1909).
(46) పశ్చిమోత్తర పరగణాల పరిపాలనావిధానమును గురించి విచా
(1909).
(47) లా మెంబరుపదవి న్యాయవాదులకొసగుట. (1910).
(48) రాజద్రోహ సభాశాసనమును గురించి. (1910).
(49) హిందూదేశ పత్రికా శాసనముగురించి. (1910).
(50) ప్రభుత్వ వ్యయాభివృద్ధినిగురించి విచారించుట.
(51) రాజకీయ నిర్బంధితులను వదలుట.
(52) గోఖ్లేగారి ప్రారంభోచితనిర్బంధ విద్యాశాసనము. (1910).
(53) సంయుక్తపరగణాలకు కౌన్సిలుయుతుడగు గవర్నరుండుట. (1911).
(54) పంజాబుప్రభుత్వమునకు కార్యనిర్వాహకవర్గమునేర్పరచుట.(1911).
(55) హిందూదేశ రాజ్యాంగకార్యదర్శికౌన్సిలునుసంస్కరించుట.(1913).
(56) ఇంగ్లండునందలి భారతీయవిద్యార్థులు (1915).1
(57) పంజాబుహత్యలకు కారకులైనవారిని శిక్షింపకపోవుట.

---

See. Congress History. P. 94—95. By Dr. B. Pattabhi Seeta-

# 27. సహాయనిరాకరణోద్యమ ప్రారంభము.

సం॥ 1919 పు నూతన రాజ్యాంగసంస్కరణశాసనము 1920 డిసెంబరు నుండియు నాచరణలోనికి వచ్చినదని చెప్పవచ్చును. (రాజ్యాంగ కార్యదర్శి జీతబత్తెము లానాటినుండియు సీమప్రభుత్వము భరింపసాగినది.) శాసనమంతయు 1921 వ సంవత్సరపు ఫిబ్రవరి 9 వ తేదీనుండియు నమలునందుంచబడినదనుట సమంజసము. ఆనాడే కేంద్రశాసన సభను డ్యూకు ఆఫ్ కనాటుగారు చక్రవర్తి గారి సందేశముతో ప్రారంభము చేసియుండిరి.

ఆసహాయోద్యమ ప్రారంభము[1] –

"కొన్ని సంవత్సరములనుండియు, లేక, కొన్ని తరముల నుండియు, రాజభక్తులును – దేశభక్తులును తమ మాతృదేశమునకు స్వరాజ్యమును వాంఛించుచున్నారు. నాటినుండియు నా సామ్రాజ్యములో మీకు స్వరాజ్య ప్రాతిపదికలు లభించినవి. నా యితర, యధినివేశ స్వరాజ్యము లనుభవించు చున్నంతటి స్వాతంత్ర్యము మీకుగూడ లభించుటకు వలయునంతటి సావకాశము లును, సదుపాయములును గలిగింప బడినవి." అని చక్రవర్తిగారి సందేశ మును కనాటుప్రభువు ప్రకటించియున్నాడు. ఈ శాసనసభ కాలమందు నాటి వైస్రాయిగారైన చెలమ్సుఫర్డు ప్రభువుగారొసగిన సందేశముగూడ గమ నింపదగియున్నది.1 "చరిత్ర విరామములేని గాధ ప్రకృతిలో వలెనే, మానవ వ్యవహారములలో గూడ నిశ్చితమగు ప్రారంభావస్థలుండవు. ఏ కొలది సంవత్స రములలోనో త్వరితగతిని గావింపబడినమార్పులెంత గొప్పవయినను, యీ మార్పు లన్నియు నాకప్పుడు గుర్తింపనట్టియు, అవగాహనము గానట్టియు, అంతకుపూర్వ పరిస్థితి గతులయొక్క విధాయక పరివర్తనలే యని చరిత్రకారునిదృష్టికి గోచ రించుచుండును. 1917 వ సంవత్సరం ఆగష్టుమాసమునందు గావింపబడిన ప్రకటన మాంగ్లేయపరిపాలన ప్రారంభమునుండియు నున్నట్టియు, నాచరణ యందు గోచరించుచున్నట్టియు, లక్షణముయొక్క నూతనప్రదర్శనము మాత్రమే కాని వేరుకాదు. కాని, మార్పుల యంతరాయములనుబట్టి మార్పులాధిక్య

1. See Lord Chelmford's Speech of 9th Feb. 1921.

తను బొందుచుండును. ఇదియు నట్టి మార్పే". (History is a continuous process. In human affairs and in nature, there are no absolute beginings, and however great the changes that may be compressed in a few crowded years, they are to the eye of the Historian the inevitable consequences of other changes some times but little noticed or understood at the time which have prceeded them.........In the lost analysis the declaration of August 1917 is only the most recent and most memorable manifestation of a tendency that has been operative through out British rule. But there are Changes of Degree so great as to be changes of kind and this is one of them.")

ఈ సందేశములతో భారతజాతియందు ఆంగ్లేయ రాజనీతిజ్ఞులు రాజ్యాంగ పరిణామమును గురించి విశ్వాసము నుదయింపజేయ ప్రయత్నించిరి. "నా జీవితమునందొక వయస్సువచ్చినది. ఈ వయస్సులో గాయములను మాన్ప వలెననియు, విచ్ఛిన్నమైనవాటిని తిరిగి జతచేయవలెననియు నా మనోభీష్టము. గతజలసేతుబంధనమువలదు. భూతకాలముతోపాటు గడచిపోయిన దప్పిదములను – అపోహాలను ఖననము చేయుడనియును – ఏ విషయములలో మీరు క్షమించవలసియున్నదో ఆ విషయములలో క్షమించవలసినదనియును, మాతో చేతులనుగలిపి యీ రోజుతో ప్రారంభమగుచున్న ఆశ లుత్తీర్ణమగునటుల పనిచేయవలసినదనియును, హిందూదేశపు చిరకాల స్నేహితుడనయిన నేను భారతదేశమందలి యాంగ్లేయులను - భారతీయులను గోరుచున్నాను." అని కనాటు ప్రభువు పంజాబుహత్యలను గురించి ప్రబోధించియున్నాడు. "అసంగతమైన, పనులొనరింపబడినందులకు ప్రభుత్వము చాల విచారించుచున్నది. మానవదృష్టి పారగలిగినంతవరకు భవిష్యత్తునందట్టిదురాగతములు జరుగకుండ జూచుటకై ప్రభుత్వము కృతనిశ్చయమైనది." అని పంజాబు హత్యలను గురించి భారతశాసనసభలో సర్ విలియం విన్సెంటుగారు నుడివిరి.1 ఈ విధ

1. See. Sir William Vincent's Speech on the resolution raised in the Imperial Legislative Assembly regarding Punjab Tragedy.

ముగ పంజాబు హత్యలనుగురించికూడ ప్రభుత్వము తప్పిదము నంగీకరించి క్షమాపణముకోరియున్నది. అయిననేమి? ఏపనియైనను సకాలమునం దొనరించినపుడే యది విలువనుగలిగి యుండును. అకాలమునం దొనరించుచో నిష్ప్రయోజనమైపోవుట సహజము. పంజాబు హత్యలనాటి కాలప్రవాహము వడి తగ్గిన నేడానాటి రాజకీయపరిస్థితుల నాత్మపరీక్షగ వెనుకకు సింహావలోకన మొనరించి చూచినచో ఊహల విపరీతములును, ఆశ్చర్యములును నేడు గోచరింపక మానవు.

జాతీయవాదులుగూడ ప్రథమమున సంస్కరణముల నామోదించుట.[2]

మొట్టమొదట నూతనము సంస్కరణ శాసనము నామోదించుచు, చక్రవర్తిగారు గావించిన ప్రకటనమును మహాత్మాగాంధీ యాహ్వానించి యున్నాడు. "చక్రవర్తిగారి యనుమతితో ప్రకటింపబడిన సంస్కరణ శాసనమును, అందుతో జతపరుపబడిన చక్రవర్తిగారి ప్రకటనయును, భారతీయుల కాంగ్లేయులు న్యాయమొనరింప దలంచినట్లు చూపించుచున్న సుహృద్భావము ఇందువల్ల ననుమానము తొలగిపోవలయును. సంస్కరణములను శల్యభేదన మొనరించి విమర్శించుట మనపనికాదు. సంస్కరణములు జయప్రదమగునటుల ప్రశాంతముగ బనిజేయుటయే మనవిధి." అని మహాత్ముడు యంగిండియా పత్రికయందు వ్రాసియున్నాడు.1 మహాత్ముడానాటికి మితవాది యని పరిగణింపబడుచుండెను.

భారతదేశమున కేకైక ప్రతినిధిగ మాట్లాడగల నాయకత్వ మానాటికి మహాత్మునకు లభింపలేదు. లోకమాన్యుడానాటి రాజకీయరంగమున ప్రధాన మూర్తి. ఈ అతివాదనాయకుడును, లోకమాన్యుడును నగు బాలగంగాధర

1. Young India Dec. 31-1919. The Reforms Act coupled with the proclamation is an earnest of the intention of the British People to do Justice to India and it ought to remove suspicion on that score........ our duty therefore is not to subject the reforms, to scarping criticism but to settle down quietly to work so as to make them a success."

తిలకుగారుగూడ సంస్కరణముల కాహ్వానమే యొసగియున్నాడు. సీమ నుండి హిందూ దేశమునకు బయలుదేరి వచ్చినతోడనే, అమృతసరము కాంగ్రెసు నకు పోవుదారిలోనే రైలుస్టేషనునుండియే తిలకుగారు సంస్కరణ శాసనములకై చక్రవర్తిగారి నభినందించుచు తంతిని బంపియుండెను. పరస్పర సహకార విధాన మున సంస్కరణములను, తాను పనిజేసెదనని తిలకుగారు తంతిలో వ్రాసియుండిరి. (In this Connection the manifestos of Tilak and Gandhi on their respective Programmes of work also are worthy of Note to understand their mentality regarding the reforms.) ఇంక బీసెంటుగారి సంగతి చెప్పనక్కరలేదు. ఈమె, మాంటేగూగారి సంస్కర ణములను తొలినుండియు, పొగడసాగినది. నాటి రాజకీయ నాయకులగు నీముగ్వురునుగూడ సంస్కరణముల నంగీకరించియే యుండిరి. కాంగ్రెసు మహా జనసభకూడ నమృతసరపు కాంగ్రెసులో సంస్కరణము లసంతృప్తికరములనియు, నత్యల్పములనియు, నాశాభంగకరములనియు, ప్రకటించినను బాధ్యతాయుత ప్రభుత్వము ననతికాలములో నెలకొల్పుకొనుటకు వీలగునటుల సంస్కరణములను స్వీకరించి పనిచేయుటకే యంగీకరించియున్నది. అయిననేమి? ఇట్టి సహకార చిత్తవృత్తియంతయు నొక్కమారుగ తారుమారై పోయినది.

పంజాబుహత్యలు జరుగకపోయినను, జరిగినప్పటికి, నాదురంతములను గురించి విచారించుటకై వెనువెంటనే యొక విచారణసంఘమును నియమించక పోయినను, విచారణకొరకై నియమింపబడిన హంటరుకమిటీలో భారతీయులను గూడ సభ్యులుగ నియమించకపోయినను, ఈహంటరు కమిటీ చిట్టచివరకు కాంగ్రెసు సహకారమును విచారణయందు సంపాదింపజాలకపోయినను, ఈ హంటరుకమిటీ నివేదిక మసిబూసి మారేడుకాయవలె తయారు చేయబడినను, పంజాబు దురంతములకు కారకులగువారి నాంగ్లేయప్రభుత్వము నిరపరాధు లుగ తలంచి యుండకపోయినను, ఒకవేళ తలంచియున్నను కాంగ్రెసుకోరి నటుల వైస్రాయియగు చెమ్సుఫర్డుప్రభువు నుద్యోగమునుండి దీసివేయుట, జనరలు డయ్యరును సైన్యమునుండి తొలగించివేయుట—సర్ మైకోలు ఒడయరు గారిని సైనికసంఘ సభ్యత్వమునుండి తొలగించుటయు—చేసియున్నను, ఈవిధ

ముగ శిక్షించియుండకపోయినను, నూతన సంస్కరణముల ప్రారంభమునందు ప్రకటించిన క్షమాపణములను, వేడికోలులను మొట్టమొదటగానే చేసియుండినచో, భారతదేశ రాజ్యాంగ చరిత్రయందసహాయోద్యమ ప్రకరణమునకు స్థానముండెడిదిగాదేమో! అకాలమునందు ప్రదర్శింపబడిన పశ్చాత్తాపమున కర్థము లేకుండ బోయినది. ఆనాటికే యసహాయోద్యమము సుస్థిరమైనది.

28 మాంటేగూ సంస్కరణములు — అసంతృప్తి.

మాంటేగూ సంస్కరణము లసంతృప్తికరములని భారతదేశమంతయును ఘోషించినది. ఈసంస్కరణముల ప్రారంభకాలమున, దేశమంతయు మహా దశాంతి పాలైయున్నది. ఒకవంక సంస్కరణములవలన గలిగిన యాశాభంగమును, వేరొకవంక పంజాబు దురంతములవలన జనించినరోషావేశమును, భారతదేశమంతయు నశాంతియందు ముంచివైచెను.

రౌలటు చట్టముతో ప్రారంభింపబడిన, దురాగత పరంపరలు భారతీయ విశ్వాసమునంతయు నాశన మొనరించెను. రౌలటు చట్టముతో ప్రారంభింపబడిన యాందోళనయు - ప్రజానాయకుల యరెస్టులును - జలియన్‌వాలాబాగ్ నందొనర్పబడిన హత్యలును-భారతీయుల నిస్సహాయతను ప్రస్ఫుట మొనరించినవి. ఆంగ్లేయ రాజనీతియందు సంపూర్ణ యవిశ్వాసము ప్రజ్వరిల్లినది. ఇందులకే కిలాఫతాందోళనముగూడ నాడు తోడై మహమ్మదీయుల నుద్రేకమున ముంచినది. భారతదేశము సంపూర్ణస్వరాజ్యమును స్వశక్తితో సంపాదించినగాని, భారతీయుల ప్రాథమిక హక్కులుగూడ సంరక్షింపబడనేరవని యత్యధిక సంఖ్యాకులగు భారతీయులు విశ్వసింప మొదలిడిరి. ఆంగ్లేయులచే ప్రసాదింపబడిన, మాంటేగూ సంస్కరణములు; నిరుపయోగములనియు, నాశాభంగకరములనియు, నసంతృప్తికరములనియు, భారతీయులందు జనించిన, నిశ్చలవిశ్వాసము కలకత్తాయందు 1920 వ సెప్టెంబరులో సమావేశమైన ప్రత్యేకాఖిల భారత కాంగ్రెసు మహాసభయందు మూర్తీభవించినది.

స్వరాజ్యాదర్శము.

కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ మహాజనసభ, యసహాయోద్యమ కార్యక్రమమును నిర్ణయించెను. సహాయ నిరాకరణోద్యమ సాధనమున, స్వరాజ్యమును సంపాదించుటయే భారతదేశకర్తవ్య మని తీర్మానించెను. నాగపురమునందు సమావేశ మయిన కాంగ్రెస్ మహాసభ, యాదర్శమునే మార్పు గావించెను. బ్రిటిష్ సామ్రాజ్యమునం దధినివేశ రాజ్యాంగమును బడయుటయే యంతవరకును కాంగ్రెస్‌సభయొక్క యాదర్శము. ఆయాదర్శము "సక్రమసాధనమున శాంతియుతముగ స్వరాజ్యమును సంపాదించుట" యని నాగపురపు కాంగ్రెసునందు మార్చబడినది. "స్వరాజ్య" శబ్దమునకు "వీలుననుసరించి బ్రిటిషుసామ్రాజ్యమునం దధినివేశరాజ్యాంగమును బడయుటయు, లేక, తప్పనిసరియైన బ్రిటిషుసామ్రాజ్యముతో సంబంధములేని సంపూర్ణ స్వాతంత్ర్యమును బొందుటయు - నని - కాంగ్రెసునాయకుడగు మహాత్మాగాంధి వ్యాఖ్యాన మొనరించెను. ఈ యాదర్శసిద్ధికై ఆసేతుహిమాచల పర్యంతము భారతావని సహాయ నిరాకరణోద్యమ ప్రచండవాయువులచే మారుమ్రోగసాగినది. అసహాయోద్యమ కార్యక్రమ మందలి మొదటిమెట్టగు శాసనసభల బహిష్కరణము దిగ్విజయముగ నెరవేరినది. జాతీయవాదులందరును శాసనసభలను బహిష్కరించిరి. ఓటరులుగూడ సగటున 100 కి 95 మంది ఎన్నికలను బహిష్కరించి యుండిరి. ప్రభుత్వమువారి నిర్బంధవిధానముగూడ మహాతీవ్రముగ విజృంభించినది. లార్డురీడింగుగారు సం॥ 1921 యేప్రియలు 3 వ తేదీని హిందూదేశపు వైస్రాయిపదవిని స్వీకరించుటతో హిందూదేశ సమస్యలు న్యాయదృక్పథమున పరిశీలింపబడునని యాశింపబడినది. "లార్డురీడింగు తన సుప్రసిద్ధ న్యాయనిర్ణయ జీవితముచే నాయన విశాలభావములచే బ్రిటిషుసామ్రాజ్యమునకు నీతికోవిదుడైన యీయనగావించిన మహోపకారములచే, చెలమ్సుఫర్డుగారు ప్రారంభించిన పనిని పూర్తిచేయుటకు తగినమనిషిగా గుర్తింపబడుచున్నాడు." అని ప్రభుత్వప్రకటన యందలిమాటలు భారతీయుల విశ్వాసమును కొంత వరకు రెచ్చగొట్టినవి.

29
మాప్లావిప్లవము.

లార్డురీడింగుగారి వైస్రాయిపదవి కాలమందే బ్రిటిషు సింహము తన ఘీంకారపుఘోరల నధికారదురహంకారముతో విస్పష్టముగ పదర్శించినది. రాజ్యాంగ శాసనము ననుస రించిన విపరీతాధికారములను - నిర్బంధశాసనముల ననుసరించి ఘోరాధికార మునుగూడ నేకీభవింపజేసి, ప్రజాందోళనము నరికట్టుటకుపూనబడినది. "మల బారుజిల్లాలో యశాంతి మూర్తీభవించి ప్రకోపించినది. ఇచ్చట జరుగుచున్న ఘోరములవైపునకు మనతలంపులుమరలుట సహజము. ఈ యశాంతివల్లనే యార్డినెన్సుమూలముగ మార్షలులాను ప్రకటించితిని. న్యాయవాదినై, జీవితమునంతయు గడిపిన నేను, సీమదేశమునందలి లిబరుపక్షమునం దారితేరిన నేను, దేశసంరక్షణమునకును - ప్రజాసంరక్షణమునకును - అవసరమని, విశ్వ సించియే మార్షలులాను ప్రకటించితినని మీకు నొక్కి చెప్పవలసిన యవసరము లేదని విశ్వసించుచున్నాను ... ... ఈ యశాంతి తిరుగబాటుగ పరిణమించి నది. ఇదియుద్రేకరణగాదు. ... ..." అని లార్డు రీడింగుగారు 1911 లో సంభవించిన మాప్లా తిరుగుబాటునుగురించి శాసనసభ్యులకు తమయుపన్యాసము నందు నుడివిరి. "మాప్లా తిరుగుబాటునకును, కోపోద్రేకములు ప్రజ్వలించుటకును వలయు వాతావరణ మేర్పరుపబడియున్నది. ఒకయింటిని బ్రద్దలుకొట్టిన దొంగ లరెస్టుచేయుటకై పోలీసువారుగావించిన ప్రయత్నమును విఫలమొనరించుటకై కత్తులతోను, కటారులతోను మాప్లాలు ఎదుర్కొనిరి. పోలీసువారరెస్టుచేయ జాలకపోయిరి. ఇందువల్ల పోలీసువారును, ప్రభుత్వమును పరాజితులైరని మాప్లాలు తలంచిరి. ఈ యరెస్టులను గావించుటకై యాదనముగా సైన్యమును మలబారునకు పంపవలసివచ్చినది. ... ... ప్రశాంతి నెలకొల్పుటకు కొంత కాలముపట్టవలసి వచ్చినది. ఈలోపుగ కొలదిమంది యాంగ్లేయులు చంపివేయ బడిరి. చాలమంది హిందువులుగూడ పరలోకమునకు పంపబడిరి. రాకపోకల వీళ్ళు పాడుచేయబడినవి. ప్రభుత్వకార్యాలయములు తగులబెట్టబడినవి. దోపిడి చేయబడినది. రికార్డులు మంటగలుపబడినవి. హిందూదేవాలయములు కూల ద్రోయబడినవి. ఆంగ్లేయులయొక్కయు, హిందువులయొక్కయు, గృహములు లగ్నిహోత్రునిపాలు చేయబడినవి. రిపోర్టులననుసరించి హిందువులు బలవంత ముగ మహమ్మదీయమతమునకు గలిపివేయబడిరి. దక్షిణ హిందూదేశమందలి

యొక ఫలవంతమగు ప్రదేశమున కాటకముజనించినది. సివిలు గవర్నమెంటు తాత్కాలికముగ నాగిపోయి, న్యాయస్థానములు పనిజేయుట విరమింపబడి, వర్తకవ్యాపారము నిరోధింపబడినది. హిందూయూరోపియ భయభ్రాంతు లందరును కాలికట్టునందు సంరక్షింపబడిరి. కాలికట్టునందుగూడ సంరక్షణము లభించకపోయి యున్నచో నీ తిరుగుబాటుఫలితములు మరింత దుర్భరముగ నుండెడివి. మహమ్మదీయేతరుల మానప్రాణములు సైనికులచేతను, పోలీసు వారిచేతను సంరక్షింపబడినవి. ఈ తిరుగుబాటునకు కారకులైనవారిని దండించుట ప్రభుత్వవిధి. "శాసనోల్లంఘనమొనరించి, యధికారవర్గమును ప్రతిఘటించవలెనను ప్రచారమున విద్యావంతులును, తిరుగుబాటులకలవాటయినటువంటి నిమ్న-ప్రజలు గురియయినప్పుడు దౌర్జన్యమును, నేరములును జరుగుననుటలో సంశయములేదు." అని రీడింగుగారు తమశాసన సభోపన్యాసమునందు మలబారు తిరుగుబాటునుగురించి యుపన్యసించియుండిరి. 1 వైస్రాయిగారి పై యుపన్యాసమునననుసరించి తిరుగుబాటున కసహాయోద్యమము కారణమని ధ్వనించుచున్నను - యీ తిరుగుబాటునం దపారమగు నత్యాచారములు జరిగియున్న వనుట రీడింగుగారి పరిపాలనాదక్షతకు వన్నెదెచ్చు విషయముకాదు. మహాత్ముడు కిలాఫతుయుద్యమముతో నేకీభవించి మతమూర్ఖతను రగుల్గొల్పుటవల్ల మలబారునందు హిందూకుటుంబములకు విశేష కష్టనిష్ఠూరములు సంభవించెనని విశ్వసించు దేశభక్తులు గూడకలరు. మహాత్ముడు కిలాఫతుద్యమముతో పాల్గొనకుండుటయే సక్రమ రాజకీయమార్గమై యుండెడిదనికూడ కొందరి విశ్వాసము. ఈ విషయమెట్లున్నను, యీ తిరుగుబాటునకును, స్వరాజ్యాందోళనకును సంబంధము గలదనుట నిశ్చయము. (ఈ మలబారు ఖయిదీలతో నీ గ్రంథకర్త రాజమహేంద్రవరము జెయిలులో కలిసియుండెను. అప్పుడు మాప్లాతిరుగుబాటుదారుల యాదర్శములనుగురించిన విషయములాఖయిదీలనుండి గ్రహింపగలిగెను. ఆ విషయసంగ్రహము ననుసరించి మలబారువిప్లవమునకును, స్వరాజ్యాందోళనకును సంబంధముగలదనియే చరిత్రకారుడు సత్యదృక్పథమునం దంగీకరింపక తప్పదు.)

"ఖిలాఫతు సంఘములు ప్రచారము చేయసాగినది మొదలు మల

1. See. India in 1921-22. P. 336.

బారులో క్రోధోద్రేక కారణమగు ప్రచారమును చేయుటవల్ల గలుగు ప్రమాదములను గవర్నమెంటు గ్రహించియేయుండెను. ఇందువల్లనే గాంధీగారి పటాలములోని మహమ్మదీయానుచరులను మలబారునకు పోకుండ జాగరూకత వహించవలసివచ్చినది. 1921 ప్రారంభమాసములలో ఒకమసీదునుండి మరియొక మసీదునకు—ఒకగ్రామమునుండి మరియొక గ్రామమునకు నుద్రేకము పరువులెత్తినది. ఆలీసోదరులయొక్క దౌర్జన్యపు హితోపన్యాసములు, సహాయ నిరాకరణ పత్రికలు, స్వరాజ్యమతి త్వరితముగ రాగలదని చేసినప్రచారము కిలాఫతుసభవారి జూలై మాసమునందలి తీర్మానములు నివియన్నియు గలిసి యగ్నిహోత్రజ్వాలలను రగుల్కొల్పినవి. జూలై, యగష్టుమాసములలో లెక్కలేనన్ని కిలాఫతుసభలు జరిగినవి. కరాచీ తీర్మానము లీసభలలో నామోదింపబడినవి. ప్రభుత్వము రాక్షసప్రభుత్వము గనుక ప్రభుత్వమును కూలద్రోసి స్వరాజ్యమును నిర్మింపవలెనను సిద్ధాంతము ప్రచార మొనరింపబడినది. అహింసాసూత్రము ప్రజల నాకర్షించియుండలేదు. కత్తులు, కఠారులు, బల్లెములు రహస్యముగ తయారుచేయించబడినవి. ఇస్లామురాజ్యస్థాపన ప్రకటన మొనరించుటకు వలయు నేర్పాటులు గావింపబడినవి. పోలీసువారు వారి విధులను నెరవేర్చకుండ నిరోధింపబడిరి. తిరుజంగాడిలో సాయుధులగు కొందరి నాయకుల నాగష్టు 20 వ తేదీన నరెస్టుచేయుటకై కాలికట్టు జిల్లా మేజిస్ట్రీటు ప్రయత్నించియుండెను. తీవ్రమయిన పరస్పర సంఘర్షణము జరిగినది. ఇదియే తిరుగుబాటునకు మూలము. తప్పించుకొనజాలని యాంగ్లేయులు వధింపబడిరి. .........ప్రభుత్వయంత్రము స్థంభింపబడిన వెంటనే స్వరాజ్యము ప్రకటింపబడినది.......ఆలీముసలియారను నాతడు రాజుగాను, ఏర్నాడు, వల్లువనాడు (Ernad and Walluvanad) లు రాజ్యములుగను ప్రకటింపబడినవి. ఈ తిరుగుబాటు ఫలితమగు దురంతముల నధిక జనసంఖ్యయగు హిందువులు భరించిరి. హిందువులు మహమ్మదీయుల తిరుగుబాటులో చేరలేదు. అందువల్ల దురంతముల ననుభవింపవలసి వచ్చినది. ఇవి యవి యననేల యనాగరికముగ నొనరింపబడు చిత్రవధలు, బలవంతముగ మతమునందు గలుపుట, స్త్రీ మానభంగములు, బందిపోట్లు, దొంగతనములు, దేవాలయములు పడగొట్టబడుట మొదలగు దుష్కృత్యములన్నియు గావింపబడినవి.'' అని హిందూదేశ ప్రభుత్వ

ప్రకటనమునందే మాప్లా తిరుగుబాటునకు గల కారణములు వేరొకచోట వ్రాయబడినవి.[2] స్వరాజ్య సిద్ధికై 1858 సంవత్సర తిరుగుబాటునకు పిమ్మట బహిరంగముగ నాయుధములతో గావింపబడిన దీతిరుగుబాటేనని యంగీకరింపక తప్పదు. ఇందులకు మహాత్ముడు ప్రేరేపించిన స్వరాజ్యతృష్ణ కారణమేయనుట నిశ్చయము. కాని, మహాత్ముని సాధనవిధానము మాత్రము కాదనుట సత్యము. పిమ్మట మహమ్మదీయ నాయకులగు నాలీసోదరులు అక్టోబరులో అరెస్టు చేయబడి కరాచీయందు విచారింపబడి రెండుసంవత్సరముల శిక్షకు గురి చేయబడిరి. ఆలీసోదరులు తమ యుపన్యాసములలో దౌర్జన్యచిహ్నము లున్నవని, తమ నిర్బంధములకు ముందుగ మహాత్ముని ప్రేరేపణచే పశ్చాత్తాపమును ప్రకటించియుండిరి. ఇందుకు మహాత్ముడే బాధ్యుడు. దీనిననుసరించి మహాత్ముని సాధనవిధానమున మలబారు తిరుగుబాటునకు బీజములు లభించలేదని తేలుచున్నది.

1921 సం॥ నవంబరు 17 వ తేదీన, యువరాజుగారు భారతదేశ పర్యటనమునకై, బొంబాయి రేవునం దోడ దిగిరి. కాంగ్రెస్ మహాసభ యువరాజుగారి రాకను, బహిష్కరింప తీర్మానించెను. కాంగ్రెస్ మహాసభ యాజ్ఞానుసారము యువరాజుగారి రాకను భారతీయులు, విజయవంతముగ బహిష్కరించిరనుట నిర్వివాదాంశము. నాటి గవర్నర్ జనరల్ గారగు రీడింగుగారు కలకత్తాయం దుపన్యసించుచూ (Puzzled and perplexed) తానేమియు తోచక, కొట్టుకొనుచున్నానని నుడివియుండిరి. ఈపరిస్థితులలో శాంతి వాతావరణమును నెలకొల్పు టత్యవసరమని మాలవ్యాపండితుడు విశ్వసించెను. ఆయన స్వంత బాధ్యతపై-ప్రభుత్వమునకును-కాంగ్రెసునకును మధ్య రాయబారిగ పనిచేయుటకు నిశ్చయించుకొనెను. డిశంబరు మాసమున, దేశబంధు చిత్తరంజనదాసుగారిని కారాగృహమునందు దర్శించి సంధిషరతులను గురించి చర్చించెను. మహాత్మునికి సంధిషరతులను తంతిమూలమున బంపించెను. తాను నాయకునిగనుండి రాయబారుల వర్గమును, లార్డురీడింగ్ గారి కడకు గొంపోయెను. భారత

1
మాలవ్యాపండితుని రాయబారము

2. See. P. 73 74. See. India in 1921.

రాజ్యాంగ సమస్యను చర్చించుటకై రౌండుటేబిల్ సమావేశమును జరుపవలెనని కోరెను. కాని మాలవ్యా పండితుని సత్సంకల్పము వికల్పమయ్యెను. సంధి షరతులలో మహాత్మునకును-లార్డురీడింగ్ గారికిన్ని సకాలమున ఏకీభావము కుదురకపోవుటయే సంధి ప్రయత్నములు వికల్పము లగుటకు కారణము. లార్డు రీడింగుగారు రాజ్యాంగసమస్యను తర్కించుటకై రౌండుటేబిల్ సమావేశము నాహ్వానించుటకై యంగీకరించి యుండెను. కాని గాంధి - రీడింగు లాండొరులు షరతులు యంగీకరించునంతలో కాలము మీరిపోయినది. సంధి కుదురలేదు. రీడింగుగారి కడపటిషరతుల నంగీకరించుచు, మహాత్ముడొసంగిన, తంతి మరికొన్ని గంటలకు ముందుగ రీడింగునకు కలకత్తా చేరియున్నచో, భారతరాజ్యాంగ పరివర్తన మేవిధముగ నాడు మారెడిదో, నేడూహించి చెప్పవచ్చును. 1935 వ సంవత్సరమునందలి రాష్ట్ర స్వాతంత్ర్యము నాడే లభించెడిదనుట నిశ్చయము. అహ్మదాబాదు కాంగ్రెస్ జరిగినది. వ్యక్తిసమిష్టి శాసనోల్లంఘనల నడుపుటకు మహాత్మునకు సంపూర్ణాధికార మొసంగబడినది. బొంబాయిలో జరిగిన సర్వపక్షసమావేశ తీర్మానములును ప్రభుత్వ మంగీకరించలేదు. నిర్బంధవిధానము మితిమీరి పోయినది. 1922 ఫిబ్రవరి 4 వ తేదీన మహాత్ముడు లార్డురీడింగుగారి కొక జాబు వ్రాసెను. "ప్రభుత్వము వారి నిర్బంధవిధాన పక్షపాతమునకు గురియైన, వాక్స్వాతంత్ర్యమును - పత్రికాస్వాతంత్ర్యమును, సంరక్షించుట దేశముయొక్క ప్రథమ కర్తవ్యము" అని మహాత్ముడు వ్రాసియుండెను. లార్డురీడింగుగారి కొక వారము దినములు గడువొసంగబడెను. ఈ గడువుకాలమున రీడింగు ప్రభుత్వము, మహాత్ముని సూచన లంగీకరించలేదు. ప్రభుత్వమువారిచే నంగీకరింపజేయుటకు, మహాత్ము డుపయోగింపదలచిన, సమిష్టి శాసనోల్లంఘనవిధానము 1922 వ ఫిబ్రవరిలో జరిగిన చౌరీచౌరా దౌర్జన్యమువలన నిలుపుచేయబడినది. చౌరీచౌరా యందు 21 మంది పోలీసు ఉద్యోగులు, హత్య గావింపబడిరి. ఇందులకు తానే పరోక్షముగ బాధ్యుడ నని మహాత్ము డంగీకరించియుండెను. గాంధి మహాత్ముడు 13 వ మార్చి, 1922 సంవత్సరమున, నరెస్టుచేయబడెను. మార్చి 17 వ

30
గాంధీగారి
కడపటి షరతులు –
అహ్మదాబాదు
కాంగ్రెసు.

తేదీని విచారింపబడెను. ఆరుసంవత్సరముల కారాగారవాసశిక్ష విధింపబడెను. (గాంధిగారు 5 వ ఫిబ్రవరి 1924 సంవత్సరమున తిరిగి విడుదల చేయబడెను. ఎర్రవాడజైలునుండి శాసూనాస్పత్రికి గొంపోవబడెను. అచ్చట శస్త్రచికిత్స చేయబడి విడుదలచేయబడెను.) ఈ సంవత్సరమునం దెందరో కారాగృహముల పాలైరి. ఎందరెందరో చరస్థిరాస్తులను గోల్పోయిరి. లక్షలకొలది భారతీయులు స్వరాజ్యసిద్ధికై యనుపమానమగు త్యాగమొనరించిరి. స్వరాజ్యమునందు భారతీయులకుగల దృఢతరసంకల్పము లోకమునకంతయు విస్పష్టమైనది. మహాత్ముని నాయకత్వమున స్వరాజ్యసాధనకై ప్రత్యక్షకార్యక్రమము నిర్వహించెడి ప్రథమాధ్యాయము ప్రారంభింపబడి మహాత్ముని నిర్బంధముతో విశ్రాంతి గైకొనినది.

31 శాస్త్రీయ నిరోధము.

మాంటేగూ సంస్కరణములు తాత్కాలికము లనియు, పది సంవత్సరముల యనంతరము పునర్విమర్శన చేయబడు ననియు, మాంటేగూ సంస్కరణ శాసనమందే గలదు. అందువలన 1929 సంవత్సరమునకు బూర్వమే సంస్కరణములనుగురించి పునరాలోచన గావింపబడవలెనని, 1921 సంవత్సరమునందే

1 భారతశాసన సభా నిర్ణయము-పీలుగారి జవాబు.

భారతశాసనసభవారే తీర్మానించియుండిరి. 1921 సంవత్సరమునందు భారతశాసనసభయందుగల సభ్యులు స్వరాజ్యవాదులుగారు. ఆయేడు కాంగ్రెస్ శాసనసభను బహిష్కరించినది. సునాయాసముగ, ప్రభుత్వసహాయమున, ప్రజాభీష్టమునకు విరుద్ధముగ ప్రభుత్వ మిత్రవర్గమువారే నాడు భారతశాసనసభకు వెడలియుండిరి. వీరుకూడ పదిసంవత్సరముల గడువుతో నిమిత్తములేకుండా, రాజ్యాంగసమస్యను, ముందుగనేపరిశీలించి, మార్పుచేయవలెనని నిర్ణయించి యుండిరి. ఆనాటికి హిందూదేశరాజ్యాంగ కార్యదర్శిగ "పీలు" గారు పనిచేయు చుండిరి. (అంతవరకును మాంటేగూగారు హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి - ఈయన రాజీనామానొసంగెను.) 2 వ నవంబరు 1922 సంవత్సరమున లార్డు పీలుగారు, భారతశాసనసభవారి తీర్మానమునకు సమాధానమును బంపిరి. మాంటేగూ సంస్కరణములనుగురించి పునరాలోచనచేయుటకు సమయము రాలే

దనియు, నియోజకవర్గమువారి శక్తిసామర్థ్యముల పరీక్షించుటకు తగిన సావకాశములేదనియు వ్రాసిరి. మాంట్ఫర్డు సంస్కరణముల ననుసరించియే ప్రజలకు నూతనాధికారము లభింపజేయుటకు సావకాశముగలదనియు వ్రాసిరి. నాటి వైస్రాయియగు రీడింగ్ ప్రభువు 5 వ సెప్టెంబరు 1922 సంవత్సరమున నిట్లుపన్యసించెను. "నేను హిందూదేశమునకువచ్చిన తొలి నిముసమునుండియు, సంస్కరణలు ప్రారంభించి కొన్నినెలలైన గాకపూర్వమే వెంటనే నూతన సంస్కరణములు గావలెనను నాందోళన ప్రారంభింపబడినది. (Almost from the first moment of my arrival, I observed that agitation was proceeding with a view to obtaining an immediately or almost immediate extension of the Powers given under the new constitution, which had then been but a few months in operation),

2
1923 లో భారత శాసన సభ మరల తీర్మానించుట.

ఈవిధముగ భారతశాసనసభ వారి తీర్మానము త్రోసివేయబడినది. భారత శాసన సభ 1923 వ సంవత్సరమున మరల రెండు పర్యాయములు, నూతన రాజ్యాంగసంస్కరణముల నొసగుట యత్యవసరమని తీర్మానించినది.

## స్వరాజ్యపక్ష నిర్మాణము

3
1924 భారతశాసన సభ తీర్మానము.

కాంగ్రెసు మహాసభచే నియమింపబడిన శాసనోల్లంఘన విచారణ సంఘమువారి నివేదిక ప్రకటింపబడిన పిమ్మట, దేశబంధు చిత్తరంజనదాసుగారును, పండిత మోతీలాల్ నెహ్రూగారును, శాసనసభాప్రవేశ కార్యక్రమమును నిర్ణయించిరి. స్వరాజ్యపక్షము నేర్పరిచిరి. శాసన సభలయందు స్వరాజ్యపక్షము ప్రవేశించినది. ఈ తరుణముననే సీమయందు కన్సర్వేటివ్ పక్షము, ఎన్నికలలో నోడిపోయినది. కార్మికపక్షము 1924 లో ప్రభుత్వాధికారము వహించినది. ఈసమయమున మరల రాజ్యాంగ

సమస్య ప్రాముఖ్యస్థానము వహించినది. ఫిబ్రవరి 1924 సం॥ న రంగాచార్యులుగారు మాంటేగూ సంస్కరణములను, సమాలోచన చేయవలెననియు రాష్ట్రస్వాతంత్ర్యముతోగూడిన యధినివేశ రాజ్యాంగ విధానము నొసంగవలెననియు, భారత శాసనసభలో నుపపాదించిరి. స్వయంనిర్ణయ సూత్రమును గుర్తించవలెననియు, హిందూదేశ రాజ్యాంగమును నిర్ణయించుటకు, సీమదేశపు పార్లమెంటున కధికారము స్వతస్సిద్ధము కాదనియు, భారతదేశ రాజ్యాంగ సమస్యను విమర్శించి నిర్ణయించుటకు, రౌండుటేబిల్ సమావేశము జరుపుటయే కర్తవ్యమనియు, మోతీలాల్ పండితుడు భారతశాసన సభయందు గర్జించెను. రౌండ్ టేబిల్ సమావేశమును జరుపవలెనను రంగాచార్యులుగారి తీర్మానమునకు, సవరణ నుపపాదించెను. ఈసవరణతోగూడిన తీర్మానమును, భారతశాసన సభ యంగీకరించినది. ఈతీర్మానమునకు ప్రభుత్వసభ్యుడగు సర్. మాల్కాం హెయిలీగారు సమాధాన మొసగుచు, మాంటేగూ సంస్కరణము లాచరించుటయందు, గనుగొనబడిన లోటులను గురించి విచారింపబడుననియు-విచారణయందు గనుగొనబడిన లోపములను సవరించుటకు సంస్కరణల శాసనము (1919 వ రాజ్యాంగ శాసనము) ననుసరించియే వీలున్నచో, హిందూదేశ ప్రభుత్వమట్టి సూచన లొనరించుటకు సంసిద్ధముగ నున్నదనియు మాంటేగూ సంస్కరణములను శాసనముగ నూతనాధికార మొసగుచు, సంస్కరింపవలెనని - ఆవిషయమై హిందూదేశ ప్రభుత్వమెట్టివాగ్దానము నొసగజాలదనియు నుడివిరి. ఈమొండి సమాధానము భారతశాసన సభవారి యాగ్రహమునకు గురియైనది.

ఆమేటి యార్థిక శాసనమును శాసనసభయందు ప్రవేశబెట్టుటకు భారత శాసనసభయనుజ్ఞ నొసంగక ప్రభుత్వనిర్ణయముపై తమయసమ్మతిని వెల్లడించిరి. బర్కెనుహెడ్డు ప్రభువు స్వరాజ్య ప్రణాళికను తయారుజేసికొన స్వరాజ్య పక్షమునకుసవాలొసగెను. ఈసవాలునకు సమాధాన మొసగ స్వరాజ్య పక్షము నిర్ణయించినది.

4 సర్వపక్ష సమావేశము —

1924 నవంబరు 21,22 వ తేదీలలో బొంబాయియందు సర్వపక్షసమావేశమును కాంగ్రెసు జరిగించినది. హిందూ మహమ్మదీయ సమస్యను పరిష్కరించుటకు సర్వపక్ష సమావేశమునందొక యుపసంఘము నియమింపబడినది. ఈసంఘము హిందూమహమ్మదీయ సమస్యను పరిష్కరింపజాలక స్వరాజ్య విధానమును నిరూపింపలేక పోయినది. 1925 మార్చి 25 వ తేదీ నుండియు నీసంఘ ప్రయత్నములు విరమింపబడినవి.

5 ప్రభుత్వ విచారణసంఘము మడ్డిమన్ సంఘము.

కాని, శాసనసభయందు 1924వ మార్చిలో జరిగిన చర్యకు ఫలితముగా, మాంటేగూసంస్కరణములలో కార్యాచరణయందు, గోచరించిన లోపములను గురించి విచారించి — సవ్యముగ, సంస్కరణములు పనిచేయుటకు వలయు, సవరణలను సూచించుట కొరక సంఘమును ప్రభుత్వము వారు నియమించిరి. ఆనాటి హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి యగు లార్డు పీలుగారిట్టి విచారణజరుపుట కొకింత ప్రోద్బల మొసగిరి. ఈ సంఘము వారి విచారణఫలితముగ సర్ అలెగ్జాండర్ ముడ్డిమన్‌గారి అధ్యక్షతక్రింద మరియొకసంఘము నియమింప బడినది. (This Committee was entrusted with the task of enquiring into the difficulties arising from, or the defects inherent in, the working of the Govt. of India Act, and of investigating the feasibility and desirability of securing remedies for such difficulties and defects consistent with the structure, policy and purpose of the act, either by action taken under the act as appear necessary to rectify any administrative in perfections)

1919 వ సంవత్సరపు హిందూదేశ రాజ్యాంగ శాసనము నందుగల స్వతస్సిద్ధమగు లోపములను — కార్యాచరణయందు కనుపించిన లోపములను విచారించుటకును — అట్టిలోపములను 1919 వ శాసనముయొక్క, యాదర్శము నిర్మాణముల ననుసరించి సవరింపదగిన - సవరింపవలసిన - విధానములను

సూచించుటకును — మడ్డిమన్ సంఘము నియమింపబడినది. శాసనమును శాసనమునను సరించిన నియమములను — బట్టియు — లేక యవసరమగునని తోచినయెడల, శాసనముచే నవరించియు కార్యాచరణయందు గోచరమగు లోపములను సంస్కరించుటకు గూడ సూచన లొసరించుటకును మడ్డిమన్ సంఘమువారి కధికారమివ్వబడినది.

మాంటేగూ సంస్కరణముల శాసనమున సహజమగు లోపములు గలవనియు — సంస్కరణముల కార్యనిర్వహణమునందుగూడ, తీరనిలోపములున్నవనియు, మడ్డిమన్ సంఘమువారుకూడ ఏకగ్రీవముగ నంగీకరించిరి.

"1925 వ సంవత్సరమంతయు స్వరాజ్యపక్షమువారిచే, ప్రభుత్వము శాసనసభలయందు నిరోధింపబడినది. మధ్యరాష్ట్రములయందునను, వంగదేశమునందునను ద్వంద్వప్రభుత్వము నిరోధింపబడినది. మంత్రివర్గము లేర్పరుపబడనీయలేదు. లార్డు రీడింగుగారు గావించిన 1924 వ 1 ఆర్డినెన్సు కాలము తీరినది. వంగశాసన సభయందు ప్రవేశపెట్టబడిన బిల్లును స్వరాజ్యవాదులు త్రోసివేసిరి. (జనవరి 1925) కాని, లార్డు లిట్టనుగారు పునరుద్ధరించిరి. సీమ ప్రభుత్వమువారి యామోదమునకై పంపబడినది. మరల 17 వ ఫిబ్రవరి 1925 న వంగశాసన సభయే మంత్రివర్గమువారి జీతములకు ఆర్థిక పత్రమునందు చేర్చవలయునని గవర్నరును కోరుచు తీర్మానించినది. కాని, నియమింపబడిన యిరువుర మంత్రుల జీతమును తిరిగి మార్చి 23 వ తేదీని వంగశాసనసభ తిరస్కరించినది. (69 వ్యతిరేకము. 63 అనుకూలురు) కాని మధ్యరాష్ట్రములలో మంత్రివర్గమునుగూడ నంగీకరించి, యా యధికారమును పురస్కరించుకొని, ప్రభుత్వకార్యనిర్వాహక వర్గమునందు ప్రతిష్టంభనము చేయవలెనను సిద్ధాంతము బయలుదేరినది. కాని, భారత శాసనసభయందుమాత్రము ప్రభుత్వమువారిని స్వరాజ్యపక్షము తీవ్రముగ సమయము చిక్కినప్పుడెల్ల 1924–25 సంవత్సరములలో నిరోధింపసాగినది. భారత శాసనసభయందు కొన్ని ప్రత్యేకోపసంఘములలో స్వరాజ్యవాదులు సభ్యత్వము నంగీకరించుట సహకారచిహ్నముగ కొందరు తలంచిరి. స్వరాజ్యవాదు లత్యధికసంఖ్యాకులుగ

లేనందువల్ల ప్రభుత్వమునోడించుట కవసరము వెంబడి, సమయానుకూలముగ నొకప్పుడొక పక్షముతోను, మరియొకప్పుడు మరియొక పక్షముతోను కలిసి వోటుచేసియుండిరి. తమతో కలిసిరాని పక్షము నోడించుట కొకసారి ప్రభుత్వ పక్షముతోగూడ కలిసి వోటుచేసి యోడించి, యా పక్షమునకు గుణపాఠమును నేర్పప్రయతించిరి. (జిన్నా పక్షమునకు) ఈ విధముగ పరస్పర విరోధములతో ప్రజాపక్షములు ప్రవర్తించుటవల్ల 25-2-1925 వ సంవత్సరమున ప్రభుత్వము వారి రైళ్ళ యాదాయ వ్యయశాసనమును, మోతీలాలుపండితుని స్వరాజ్య పక్షము నిరాకరింపజాలకపోయినది. అయితే, కార్య నిర్వాహకవర్గ సభ్యుల సంచార వ్యయమును నిరాకరించుటలో స్వరాజ్యపక్షము విజయముగాంచినది. అయినను, స్వరాజ్యపక్ష కార్యక్రమమునందలి నిరంతర ప్రతిఘటన, రాజనీతి, సడలింప బడినదని కొందరిమతము.

32
చిత్తరంజనుని
ఫరిద్‌పూరు
సూచనలు.

చిత్తరంజన దాసుగారు తమ ప్రతిఘటన విధానమువల్ల బ్రిటిషు ప్రభుత్వముతో సంధిచేసికొనవచ్చునని విశ్వసించి యుండిరి. 1921 వ సంవత్సరమున నహమ్మదాబాదు కాంగ్రెసునకు ముందు గాంధీ-రీడింగులమధ్య జరిగిన రాయబారములు, మహాత్ముని యసమర్థతవల్ల నిరుప యోగములైనవని దాసుగారి విశ్వాసము. మహాత్ముడు సవ్యముగను, సక్ర మముగను, వ్యవహరించి యుండలేదని దాసుగారు మదరాసు సముద్రతీరము నం దుపన్యసించుచు నుడివియుండిరి. (Desabandhu Das said at the beach meeting in Madras that Mahatma Gandhi "had bungled and mismanaged). ఆనాడు దాసుగారు ఆలిపుర సెంట్రలుజెయిలులో నుండిరి. ప్రభుత్వమువారు తమ సంధిషరతులను దాసుగారికి ఆలిపురం జెయిలు నకు పంపినట్లుగ గూడ దాసుగారు దెల్పియుండిరి. దాసుగారు ఫరిదపూరు నందు సమావేశమైన వంగదేశరాష్ట్ర మహాజనసభయందు గావించిన సహ కారపు షరతుల కీచిత్తవృత్తియే కారణము. ఆనాడుకూడ మహాత్ముడు బ్రిటిషు ప్రభుత్వమునందు హృదయ పరివర్తనము జనింపలేదనియే విశ్వసించి యుండెను. (Change of heart). దాసుగారు మాత్రము హృదయపరివర్త

నమే "యెల్ల తావుల గోచరించుచున్నటుల" నుడివిరి. (I see signs of real change of heart everywhere. said Mr. Das in the First Week of May 1925). దాసుగారు సంధి చేసికొనినచో గౌరవప్రదమగు సహకార మొసగబడునని బహిరంగముగ నాంగ్లేయ రాజకీయవేత్తలకు నుడివి యుండెను. (You can have peace to-day on terms honourable both to you and Das). మహాత్ముడు, తన పక్షమునగూడ దాసుగారు వ్యవహరించుచున్నటుల ప్రకటించియుండెను. కాంగ్రెసునందు సిద్ధాంత విభేదమువల్ల గోచరించుచున్న నిరుతెగలును కార్యాచరణయందొక్కటియే యని మహాత్ముడు నిరూపించియున్నాడు. దాసుగారు తమ షరతుల నీవిధముగ వివరించి యుండిరి.

"సరియగు ప్రభుత్వబాధ్యతను ప్రజల కొసంగుచో ప్రభుత్వముతో మనము సహకార మొనరించుటకెట్టియభ్యంతరమును నుండజాలదు. కాని, రెండు ముఖ్యవిషయములు గమనీయములు. హృదయపరివర్తన ముండవలయును. సంపూర్ణస్వరాజ్య మొసగబడునని వెంటనే హామీ నొసగవలయును. ఈ స్వరాజ్యము దానియంతట నదియే యనతికాలములో లభించున ట్లేర్పరుపవలయును....... శాంతియుతమగు నెట్టి యొడంబడికయైనను, నట్టియొడంబడిక యందలి షరతులకంటె నాయొడంబడిక వెనుక నుండెడి తత్వముమీాదనే యాధారపడియుండును.......

(1) రాజకీయ ఖైదీ లందరు విడుదల గావింపబడవలయును.

(2) సామ్రాజ్యమునందు మన మనతికాలములో స్థాపించుటకుగల సంపూర్ణ స్వరాజ్యపు హక్కును గుర్తింపవలయును. సంపూర్ణ స్వరాజ్యము లభించులోపుగ నిశ్చయమైన, దృఢమైన యట్టి స్వరాజ్యమునకు పునాదులు వెంటనే వేయవలయును.

(3) విప్లవోద్యమమున కేవిధమునను సహకార మొనరింపమని మనము గూడ హామీ నొసగవలయును." ఈవిధముగ దాసుగారు షరతులను ప్రకటించి

నపుడు రీడింగుగారు, నాటి వైస్రాయి, ఇంగ్లండునందు సెలవుమీద నున్నారు. నాటి రాజ్యాంగ కార్యదర్శి బర్కెనుహెడ్డు ప్రభువు సహకారమొసగవలయునని యుపన్యాసరూపముగ కాంగ్రెసువాదులను కోరియుండిరి. ఇందువల్ల, నాంగ్లేయ ప్రభుత్వమునకును, కాంగ్రెసునకును సంధిజరుగునని దాసుగారు విశ్వసించుటయే కాక, భారతదేశమంతయు విశ్వసించిన దనదగును. ఈవిశ్వాసమునకు కల్నలు వెడ్జివుడ్డుగారును, రామ్సేమెక్డనాల్డుగారును సంధికై చేయు ప్రయత్నములు దోహద మొసంగినవి. ఆనాడే రాష్ట్రస్వాతంత్ర్య మొసగుటకు సీమ ప్రభుత్వ మంగీకరించినటులను, దాసుగారు దానిని గ్రహించుట కొడంబడినట్లు దెల్పుట సత్యదూరము కాజాలదు. ఈ సంధి షరతులను నాటి పాట్నా హైకోర్టుజడ్జీగా పనిచేయుచుండిన దాసుగారి సోదరుడు ఏర్పాటు గావించునటుల గూడ నాటి విశ్వాసము. నేటివరకు "కాదనని" సత్యము. కాని, హిందూదేశపు టదృష్టరేఖ వేరువిధముగనున్నది. చిత్తరంజనుడు 16 వ జూను 1925 సంవత్సరమున నకస్మాత్తుగ కాలధర్మము నొందెను. ఇంతతో షరితపూరు సంధి షరతులెట్లు మరల తలయెత్తియుండలేదో యెరుకకు రాలేదు. దేశబంధు చిత్తరంజనదాసుగారి మరణానంతరము మోతీలాలు పండితుడు స్వరాజ్యపక్షమున కేకైకనాయకుడు. ఈయన యిండియను స్టాండస్టు కమిటీయందు సభ్యుడుగ నుండుట కంగీకరించియుండెను. ఇంతటితో స్వరాజ్యపక్షము నందలి ప్రతిష్టంభన విధానమునందు తీవ్రత తగ్గింపబడెననియు, సడలింపబడెననియుగూడ తలంపబడినది. కాని, నాటికిని-నేటికిని మధ్యగల కాలవ్యవధి యందలి రాజ్యాంగ చరిత్రాంశములను గమనించుచో నాడు స్వరాజ్యపక్షము, దేశపరిస్థితుల ననుసరించియే ప్రవర్తించినదని యంగీకరింపకతప్పదు. ప్రతిష్టంభన కార్యవిధానము వల్ల దృక్సిద్ధమగు ఫలితములు గోచరించనిమాట వాస్తవమే. అయినను, ఆనాటి దేశపరిస్థితులలో జాతీయపతాక మవిచ్ఛిన్నముగ స్వరాజ్యపక్షమే ఎగురవేయ గలిగినదని నేడంగీకరింపకతప్పదు. ఈప్రతిష్టంభన విధానఫలితముగ నాంగ్లేయరాజకీయవేత్త లాందోళనము చెంది రనుటయు సత్యదూరము గాదు.

స్వరాజ్యపక్షముయొక్క ప్రతిష్టంభన విధానమువల్ల నియమింపబడిన మడ్డిమను సంఘనివేదిక 1925 సెప్టెంబరు 7 వ తేదీని భారతశాసనసభయందు

విమర్శింపబడినది. మడ్డిమన్ సంఘమునందలి యధికసంఖ్యాకులు (ప్రభుత్వ సభ్యులతోఁగూడిన) కార్యాచరణయందుగల లోపముల నివారణాకై పలువిధములగు సూచన లొనరించిరి. అల్పసంఖ్యాకులు (సర్ తేజ్ బహదూర్ సప్రూ - సర్ శివస్వామి అయ్యర్ - జిన్నా - డాక్టరు పరంజిపేయి) కార్యాచరణయందు గోచరించుచున్న లోపములను సవరించునంతమాత్రమున, సంస్కరణములను కొనసాగింప వీలులేదనియు విశ్వసించిరి. రాష్ట్రములలో ద్వంద్వప్రభుత్వవిధాన మంతరించి-బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్పబడువఱకును - కేంద్రప్రభుత్వమున కొంత వరకు - బాధ్యత యొసంగనంతవరకు భారతరాజ్యాంగవిధానము సక్రమముగ నిర్వహింపబడజాలదని యల్పసంఖ్యాకులు నిశ్చయించిరి.

33
1925 సం
National Demand.
భారతజాతీయ నిశ్చయము.

సెప్టెంబర్ 1925 సంవత్సరమున, మడ్డిమన్‌గారు, తమ సంఘమువారి యధికసంఖ్యాకుల సూచనము నంగీకరింపవలెనని భారతశాసనసభయందు తీర్మాన ముపపాదించిరి. ఈతీర్మానమునకు, స్వరాజ్యపక్షనాయకుడైన, మోతీలాలు పండితుడు సవరణ నుపపాదించెను. ఈ సవరణరూపముగ "భారతజాతీయ నిశ్చయము" ను (National Demand) ప్రకటించెను. (The national demand was to the effect that "Certain political reforms practically amounting to the rank of immediate dominion status should be conceded by Parliament and that the Round Table Conference between representatives of the British Government and representatives of political India should meet to discuss the ways and means of implementing these reforms"). "పార్లమెంటువారు కొంచె మించుమించుగ, నధినివేశరాజ్యాంగవిధానముతో సరియగు రాజ్యాంగమును హిందూదేశమున కొసగవలయును. ఈ విధానము నములులోనికి దీసికొనివచ్చు సాధనసంపత్తిని గురించి యోచించి నిర్ణయించుటకుగా నాంగ్లేయప్రభుత్వ ప్రతినిధులమధ్యను — భారతదేశ రాజకీయ ప్రతినిధులమధ్యను రౌండ్ టేబిల్ సమావేశము జరుపవలెను. లేదా అందులకై మరియొక కార్యసాధన విధాన మరయవలయును." అని

మోతీలాల్ పండితుడు భారతవర్షప్రతినిధిగ బ్రిటిష్‌ప్రభుత్వమునకు నివేదించెను. భారతశాసనసభ యంగీకరించినది. అన్ని పక్షములవారి యంగీకారముబడసిన, యీ జాతీయ నిశ్చయమునుగూడ బ్రిటిష్‌ప్రభుత్వ మంగీకరించనట్లు వైస్రాయిగారు, భారతశాసనసభాప్రారంభోపన్యాసమునందు సూచించిరి.

1924 వ ఫిబ్రవరి మాసమునందు భారతశాసనసభయందు స్వరాజ్యపక్షమువారు రౌండు టేబిలు సమావేశమును మాత్రమే జరుపవలయునని తీర్మానించియుండిరి. 1925 వ సెప్టెంబరులో రౌండు టేబిలు సమావేశము, లేక, నట్టి మరి యేయితరవిధానముగాని జరిపింపవలయునను తీర్మానము భారతశాసనసభయందు స్వరాజ్యపక్షమువారి సమ్మతిపై గావింపబడినది. ఈ రెండు తీర్మానములయందునను తారతమ్యము గోచరించుచున్నను చివరకు ఫలితమొక్కటియే యైనది. "సుహృద్భావమును మేము వాంఛించుచున్నాము. కోరుచున్నాము. మాహృదయములకు ప్రేమాస్పదమైనదియు, సన్నిహితమైనదియునైన యీ స్నేహము లభించుచో బేరగాండ్రవలె ప్రవర్తించువారముగాము," అని బర్కెను హెడ్డుప్రభువు చెప్పినమాటలను రీడింగుగారు 1925 జూలై 7 వ తేదీని తిరిగి శాసనసభాసముఖమున వప్పగించిరి.

సబర్మతి ఒడంబడిక[1]

కాని, యఖిలభారత కాంగ్రెసుసంఘము మార్చి 6–7 తేదీలలో ఢిల్లీలో సమావేశమై స్వరాజ్యపక్షము శాసనసభలలో ప్రతిఘటన విధానమును నిరంతరాయమానముగ, స్వరాజ్యసమస్య కాంగ్రెసునకు సంతృప్తికరముగ కుదురువరకు కొనసాగింప తీర్మానించినది. ఇంతతో సంధిప్రయత్నము లేవియు లేవని తేలినది. సంధి ప్రయత్నములు విరమింపబడుటతో ప్రతిఘటన కార్య విధానముగూడ విరమింపబడి మంత్రివర్గ స్వీకారము గావింపవలెనను కార్యవిధానమవలంబించుటకై సబర్మతియందు నిశ్చయింప రహస్యప్రయత్నములు జరిగినవి. ఇందులకు మోతీలాలు పండితుడుగూడ నొడంబడెను.

(1) ప్రభుత్వమువారి యధికారము విరమింపబడి, మంత్రులు శాసనసభలకు సంపూర్ణబాధ్యతవహించునట్లుగ చేయవలయును,

(2) ప్రజాయత్తశాఖల యభివృద్ధికై తగినంత ధనము ప్రత్యేకింపవలయును.

(3) ప్రజాయత్తశాఖలక్రింద పనిచేయు సిబ్బందిపై మంత్రులకు సర్వాధికార మొసగవలయును." ఈ మూడుషరతులకు లోబడిన మంత్రివర్గ స్వీకార మొనరింపదగునని పండితుని నిశ్చయము. ఈ నిశ్చయము మొట్టమొదటగ సబర్మతిలో గావింపబడిన యొడంబడికకు వ్యతిరేకముగ నున్నదని జాతీయపక్ష స్థాపనకు కారకుడైన జయకరుగారు ప్రకటించిరి. మే 5 వ తేదీని సమావేశమైన యఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశమున విమర్శనకుగూడ ప్రవేశపెట్టబడియుండలేదు. ఇంతతో మంత్రివర్గ స్వీకారకార్యక్రమముగూడ విరమింపబడినది. ఈ మంత్రివర్గ స్వీకార కార్యక్రమమునకు బాధ్యత యంతయు, మోతీలాలుపండితునిమీద త్రోయబడినది. కాని, ఎస్. శ్రీనివాస అయ్యంగారుగూడ నిందులకు సుముఖులేయనుట సత్యదూరముకాదు.[1] అయినను దక్షిణ హిందూదేశము మంత్రివర్గ కార్యక్రమమునకు వ్యతిరేక మగుటవల్ల సబర్మతీ యొడంబడిక కార్యాచరణకు రాలేదనుట సత్యము. ఈ విధముగ బ్రిటిషు ప్రభుత్వముతో కాంగ్రెసుసంస్థకు నెట్టి యొడంబడికయు జరిగియుండలేదు. గౌహాతి కాంగ్రెసు మరల శాసనసభా ప్రతిష్టంభన కార్యక్రమమునే బలపరచి నిరూపించినది. అయినను 1927 వ సంవత్సరమునం దంతకు మూడు సంవత్సరములలోను నాశనముచేయబడిన ద్వంద్వప్రభుత్వవిధానము తిరిగి సజీవ మైనది. మంత్రుల జీతములను శాసనసభ లామోదించినవి. కాంగ్రెసుతో రాజీ పడవలసిన యవసరముగూడ ప్రభుత్వమునకు తొలగినది.

2
కామనువెల్తు ఆఫ్ ఇండియా బిల్లు.

ఇంతకుపూర్వమే డాక్టరు అనిబిసెంటుగారు, సర్. టి. బి. సప్రూగారునుకలిసి "జాతీయ సమావేశము నేర్పరచిరి. 1925 జనవరి, ఫిబ్రవరి మాసములలోజరిగిన నీ సమావేశమున భారతదేశరాజ్యాంగవిధానము నొకదానినివ్రాసిరి. ఈరాజ్యాంగవిధానము

1. "ఈ విషయమై "సత్యాగ్రహి పత్రికయందు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, ఎస్. శ్రీనివాసయ్యంగారు – వీ రిరువుర మధ్యను జరిగిన వాదప్రతివాదములను, సి. వి. యస్. నరసింహరాజుగారి ప్రకటనయు" గమనార్హములు. సత్యాగ్రహి పత్రికలు మే మొదలు డిశంబరు వరకు చూడవలయును. 1926."

బ్రిటిషుప్రభుత్వమువారిచే నంగీకరింపచేయుటకు బిసెంటు ప్రబలప్రయత్న మొన రించినది. కాని, విఫలమనోమధురాలాయెను. స్వరాజ్యపక్షమువారుగూడ భారతశాసనసభలో కోరిన జాతీయనిశ్చయమును బ్రిటిషుప్రభుత్వము త్రోసివేసి నందులకు తమ యసమ్మతిని జూపుచు శాసనసభలనుండి 1926 సం॥ మార్చి నెలలో బయటకు వచ్చివేసిరి. 1927-28 సంవత్సరమునం దార్థికశాసనముపై ప్రసంగించుచు మోతీలాలు పండితుడు మరల భారతజాతీయ నిశ్చయమును ప్రకటించెను. ఆర్థికశాసనమును భారతశాసనసభ త్రోసిరాజనుటకై యత్నిం చెను. ఇతరపక్షములవారు కలిసిరానందున నీ యత్నము విఫలమైనది. చిత్త రంజనుని శాంతిసందేశము త్రోసిరా జనబడినందులకు మోతీలాలు శాసనసభ యందు గర్జించినాడు.

**34**
**రీడింగుగారి పరిపాలనా ఫలితము.**

సీమదేశమునందు ప్రధానన్యాయమూర్తిగనుండి, హిందూ దేశమునకు వైస్రాయిగవచ్చిన లార్డు రీడింగుగారు హిందూదేశమునకు న్యాయ మొనగూర్చెదరని విశ్వసింప బడినది. కాని, యీయన పరిపాలనమునందు రవంతయు భారతదేశమునకు న్యాయము లభించియుండలేదు. న్యాయశాస్త్రవేత్తయని సీమయందీయన యార్జించిన గౌరవమును భారతదేశమునందు గోల్పోయెను. అసహాయోద్యమ కాలమందు నిర్బంధింపబడిన రాజకీయ ఖయిదీలపట్లగూడ సగౌరవముగ నీయన ప్రవర్తింపజాలకపోయెను. విప్లవఖయిదీల కీయనపరిపాలన యందు న్యాయమే లభించియుండలేదు. ఈయనకాలమున పత్రికాశాసన కాఠిన్య మొకింతసడలింపబడినది. ఈశాసనము సంస్కరింపబడిన మాటనిజమే. కాని, స్వదేశసంస్థానాధీశుల సంరక్షణశాసనము భారతశాసనసభాభిప్రాయము నకు వ్యతిరేకముగ గావింపబడినది. ప్రజల ప్రాథమికహక్కులపై రీడింగు గారు దాడివెడలిరి. పౌరస్వాతంత్ర్యమును నిరోధించిరి. ఈయన నిర్బంధశాస నము లాసేతు హిమాచల పర్యంతము విలయతాండవ మొనరించినవి. అసహా యోద్యమముపట్ల సక్రమముగవర్తించి భారతదేశసమస్యను పరిష్కరింపజాలక పోయెను. సభాస్వాతంత్ర్యము - వాక్స్వాతంత్ర్యము - పత్రికాస్వాతంత్ర్యములపై రీడింగుగారు దాడివెడలిరి. మాంటేగూసంస్కరణముల నీయన కొనసాగించుటకు

మారుగ విఫలమొనరించెను. ఉద్యమము విరమింపబడినపిమ్మట రీడింగుగారు మహాత్ముని నిర్బంధించుట క్షమార్హముగాని రాజకీయ అవినీతి. భారతశాసన సభవారుగావించిన తీర్మానములకు వ్యతిరేకముగ ప్రత్యేకాధికారమును రీడింగు గారు పలుమార్లు వినియోగించిరి. (Princes protection Bill). సంస్థానా ధీశుల సంరక్షణచట్టము, ఉప్పుపన్నులను మరినాలుగు వ్యయవిషయములను భారతశాసనసభ నిరాకరించియుండెను. కాని, రీడింగుగారు ప్రత్యేకాధికారముతో పునరుద్ధరించియుండిరి. స్వరాజ్యవాదులు శాసనసభలను విధ్వంస మొనరింప ప్రతిన బూనిరి. వంగరాష్ట్రమున, మధ్యపరగణాలయందున, మంత్రుల జీతములను నిరాకరించి, శాసనసభలలో ప్రతిష్టంభనమును స్వరాజ్యవాదులు దిగ్విజయముగ కొనసాగించిరి. మాప్లా విప్లవము - ఘూర్ఘాభాగు సత్యాగ్రహము - కోహాటు - పానిపట్టు - మొదలగు హిందూమహమ్మదీయకలహములు - రీడింగుగారి పరిపా లనా కాలమునందలి రాజ్యాంగచరిత్రలో వికార స్వరూపమునుదాల్చిన గమనీ యాంశములు. భారతరాజ్యాంగసమస్య రవంతయు రీడింగుగారికాలమున పరి ష్కారము కాలేదు.

35
ఇర్విను ప్రభువు.
1926_1931.
సైమను కమీషను
నియామకము.

8 వ నవంబరు 1927 వ సంవత్సరమున లార్డు ఇర్వినుగారు (వైస్రాయి) భారతరాజ్యాంగ విధానమునుగురించి విచా రించుటకుగాను సైమనుసంఘము నియమింపబడినటుల భారతశాసన సభాసముఖమున ప్రకటించెను. (ఇర్వినుగారు లార్డురీడింగుగారి స్థానే ఏప్రియలు 1926 సంవత్సరమున భారత దేశమునకు వైస్రాయిగా వచ్చిరి). ఈకమీషను సభ్యులందరు నాంగ్లేయులే. "పార్లమెంటువారికి నిష్పక్షపాతముగ నిజమునంతయు నివేదించగల కమీషను నియమించబడవలెనను విషయ మందరు నంగీకరించునదే. కాని, యట్టికమీషను వారు నివేదించు విషయముల ననుసరించి తీసికొనదగినచర్యను తీసికొనుటకు పార్లమెంటువా రంగీకరించునట్టి కమీషనుగ గూడ నుండవలసి యున్నది. (It would be generally agreed that what is required is a commission which would be unbiased and competent to present on accurate picture of facts to parliament but it

must also be born on whose recommendations parliament should be found willing to take what ever action a study of these facts may indicate to be appropriate). అందరు నాంగ్లేయులతో గూడిన కమీషన్ నియమించుటకు లార్డు ఇర్విన్‌గారు నిరూపించిన కారణములు.

ఈకారణములు, భారతదేశము నందుగల యేరాజకీయపక్షమునకుగాని నచ్చలేదు. అన్ని రాజకీయపక్షములు సైమన్ కమీషన్ యొక్క నియామకమును-సైమన్ కమీషన్‌యొక్క విచారణవిధానమును-నిరసించినవి. సైమన్ కమీషన్ నియామకముతో, భారతరాచకీయ సమస్య ప్రాముఖ్యస్థానము వహించినది. అన్ని రాచకీయపక్షము లేకోన్ముఖమైనవి. 1927 సంవత్సరం డిశంబరు మాసమునందు సమావేశమయిన, సర్వరాజకీయపక్షములును సైమను సంఘమును నిరసించినవి. మదరాసులో సమావేశమైన యఖిలభారత మహా జనసభ సైమన్ సంఘమును బహిష్కరించుటకు తీర్మానించినది. అన్ని సమయములందు నన్నిరీతుల బహిష్కరించవలెనని (at every state and every form) తీర్మానించినది. ముస్లింలీగ్ కలకత్తాయందు సమావేశమైనది. సైమన్ సంఘమును బహిష్కరించుటకు తీర్మానించినది. మితవాదులు బొంబాయియందు సమావేశమయిరి. (లిబరల్ ఫెడరేషన్). ఆ సమావేశమునకు సప్రూగా రధ్యక్షత వహించిరి. సప్రూగారి అధ్యక్షతక్రింద సైమన్‌సంఘము బహిష్కరింప బడవలెనని, మితవాదసభయు తీర్మానించినది.

1 సైమనుగారి జాబు.

ఫిబ్రవరి 1929 సంవత్సరమున సైమను సంఘము భారత వర్షమునకు వచ్చినది. వెంటనే సైమన్‌గారు వైస్రాయిగారి కొక జాబున్వ్రాసిరి. భారతశాసన సభవారిచే నెన్నుకొనబడిన మరి ఏడుగురి సభ్యులతోగూడ గలిసి, తా నధ్యక్షుడుగానుండి విచారణ సలుపదగునని సైమనుగారీజాబునందు సూచించిరి. (Joint Conference) సర్ శంకరనాయరుగారి జాబునకు సమాధానమువ్రాయుచు, రాష్ట్రసంఘములవారి నివేదికలగూడ, నాలోచించుటకు, వారి నివేదికలు తమ నివేదికతో, జేర్చి పార్లమెంటునకు, పంపుటకును, సైమన్‌గా రంగీకరించిరి.

కాని యీవిధానమంతయు మసిబూసి మారేడుకాయ యనుటకని భారత రాజకీయవేత్త లందరు గ్రహించిరి. అన్ని రాచకీయపక్షముల నాయకులును, ఢిల్లీలో సమావేశమైరి. సైమన్‌గారు సూచించినట్లు భారతశాసనసభవారిచే సంఘమును నియమింపజేయుటవల్లగాని, రాష్ట్రసంఘనివేదికలను, తమ నివేదికలతోగూడ జతపరుచుట కంగీకరించుటవల్లగాని, భారతీయుల యామోదమును సైమనుసంఘము బడయజాలదని, సైమన్ సంఘమందుగల వ్యతిరేకాభిప్రాయము తొలగిపోలేదనియు, వివిధపక్ష రాచకీయ నాయకులును కలసి యొక ప్రకటన గావించిరి. భారతశాసన సభవారు రెండుదినము లీవిషయమై తీవ్రముగ చర్చించిరి. లాలాలజపతిరాయిగారు, సైమన్‌సంఘమును నిరసించుచు తీర్మానముపపాదించిరి. లాలాజీ తీర్మానము భారతశాసనసభవారిచే నంగీకరింపబడియెను. (68 అనుకూలురు-62 ప్రతికూలురు.)

ఈవిధముగ కాంగ్రెసు మహాసభవారిచేతను, భారతశాసనసభవారిచేతను ఇతర రాజకీయపక్షములవారిచేతను సైమన్ సంఘము బహిష్కరింపబడవలెనని నిశ్చయింపబడెను. సైమన్‌సంఘసంచారమునందు, దేశమునందెల్ల, నల్లజెండాల ఊరేగింపుతో, భారతీయులు సైమన్ సంఘమున కాహ్వానమొసగిరి. "సైమన్ సంఘమా! మరలిపొమ్ము" అను ప్రతిధ్వని యాసేతుహిమాచలపర్యంతము, మారుమ్రోగినది. లాహూరులో సైమన్‌సంఘమునకు నల్లజెండాలతో నాహ్వానమొసగినపుడు ప్రభుత్వమువారిచే ప్రయోగింపబడిన లాఠీప్రయోగమునకు గురియై పంజాబుకేసరియగు, లాలాలజపతిరాయి, తన పవిత్ర జీవితమును, దేశమాతకు సమర్పించి, కీర్తిశేషుడాయెను. ప్రభుత్వమువారి దుర్భర నిర్బంధవిధానముగాని, లాఠీప్రయోగములుగాని, సైమన్‌సంఘ బహిష్కరణోద్యమము నుండి, భారతీయులను విముఖుల నొనరింపచేయజాలక పోయినవి.

36 నెహ్రూనివేదిక.

ఆనాడు లార్డు బర్కెన్‌హెడ్‌గారు, హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి (1924 మొదలు 1928 వరకు) సైమన్ సంఘమును నియమించుచు, భారతీయులపై సవాలొనరించిరి. భారతీయులందరునేకమై, స్వరాజ్యప్రణాళిక నొకదానిని

తయారుజేయగల్గినచో, నది యోచింపబడునెను. ఈసవాలునకు సమాధాన మొసగబడినది. ఢిల్లీయందు (12 ఫిబ్రవరి మొదలు 11వ మార్చిలోపుగ మధ్య మధ్య), వివిధపక్షరాచకీయనాయకులు సమావేశమయిరి. హిందూమహమ్మదీయ సమస్య పరిష్కరించుచూ, బాధ్యతాయుత ప్రభుత్వప్రణాలికను వ్రాయుటకై ప్రయత్నించిరి. ఈసభ తిరిగి మేనెలయందు బొంబాయిలో సమావేశమయినది. హిందూదేశరాజ్యాంగ విధానము నొకదానిని వ్రాసిన నివేదికను తయారు చేయుటకొక యుపసంఘము నియమింపబడినది.

1
నెహ్రూనివేదిక సారాంశము

ఈ యుపసంఘమువారు తమ నివేదిక నాగష్టునందు ప్రకటించిరి. (మోతీలాలు పండితుడు, సర్. ఆలీఇమామ్, సర్ తేజ్‌బహదూర్ సప్రూ, సాహెబ్ ఖురేషీ, సుభాష్ చంద్రబోస్, జి. ఆర్. ప్రధన్ వారీయుపసంఘసభ్యులు) వీరందరు నేకగ్రీవముగ నివేదికను సిద్ధపరచిరి. ఈయుపసంఘమునకు నెహ్రూ పండితు డధ్యక్షుడుగా నుండెను. అందుచేత దీనికి నెహ్రూనివేదికయనునామము సుప్రసిద్ధమయినది.

నెహ్రూనివేదిక సారాంశమేమి ?

(1) నెహ్రూనివేదిక, యధినివేశ స్వరాజ్యవిధానము నంగీకరించినది. నెహ్రూనివేదికయందు నిరూపింపబడిన, రాజ్యప్రణాళిక కధినివేశ రాజ్యాంగమే పునాది.

(2) సంయుక్త నియోజకవర్గములు నిర్ణయింపబడినవి. కొన్నితావు లందు స్థానములుమాత్రము 10 సంవత్సరములవరకు, ప్రత్యేకించుట కంగీక రించబడెను.

(3) భాషాప్రయుక్త రాష్ట్రవిభజనసిద్ధాంత మంగీకరించబడినది. సింధు, కర్నాటక రాష్ట్ర నిర్మాణము సూచింపబడెను. పశ్చిమోత్తరపరగణాలు, గవర్నరుగారాధిపత్యము వహింపవలసిన ప్రత్యేకరాష్ట్రముగ నిర్మించుటయు సూచింపబడెను.

(4) యుక్తవయస్సువచ్చిన, భారతీయ స్త్రీపురుషులందరకు మైనార్టితీరిన వారికెల్ల వోటుచేయు నధికార మొసంగబడెను.

(5) రాష్ట్రస్వాతంత్ర్య మొసగబడెను. కాని, గవర్నరు, లేక గవర్నరు జనరలు, లేక చక్రవర్తిగా రన్నివిధముల శాసనములను, నిలుపుజేయుటకు, లేక రద్దుజేయుటకు నధికారముగలదు.

(6) 19 పౌరసత్వపుహక్కులు నిరూపింపబడినవి.

(7) భారతదేశమునకు సంబంధించు సమస్త శాసనాధికారమును, భారత శాసనసభకు గలదనిరి. భారతీయ శాసనసభ యనగా; చక్రవర్తిగారితో కూడిన రెండు శాసనసభలు - అనగా సెనేటనబడునది. రాష్ట్రీయ శాసనసభలచే నెన్నుకొనబడవలెను. రెండవసభ వోటర్లచే ప్రత్యక్షముగా నెన్నుకొనబడును.

(8) స్వదేశ సంస్థానములపై హిందూదేశకేంద్ర ప్రభుత్వము నేటివరకెట్టి హక్కునుగల్గియున్నదో, యట్టిహక్కును, నధికారమును, నధినివేశ స్వరాజ్య ప్రభుత్వముగూడ వహించును.

(9) భారతదేశమున, సుప్రీంకోర్టు నెలకొల్పబడును. ప్రీవీకౌన్సిలుకు వెళ్ళునపీళ్ళు చాలావరకు తగ్గింపబడును.

(10) భారతప్రభుత్వప్రధానామాత్యుని, యధ్యక్షతక్రింద, సైనికశాఖను లేక సంరక్షణశాఖను పరిపాలించుట కొకసంఘము నేర్పరచుట.

(11) సివిలుశాఖోద్యోగులందరిపైన, సంపూర్ణాధికారము గల్గియుండుట.

**2 సర్వపక్ష సమావేశము**

ఈ నియమములతో గూడిన నెహ్రూ నివేదికనుగురించి యోచించుటకై సర్వపక్ష సమావేశ మాగష్టునందు లక్నోలో జరిగినది. ఈ సమావేశమునందు నెహ్రూ నివేదికలో నిరూపింపబడిన, యధినివేశ స్వరాజ్యమే భారతీయుల యాదర్శమని యెల్లరు నంగీకరించిరి. కాని బ్రిటిష్‌ప్రభుత్వముతో నెట్టి సంబంధములేని, సంపూర్ణస్వాతంత్ర్యమును గోరు, రాజకీయపక్షములవారి, కార్యక్రమవిధానమునకెట్టి, యాటంకముగాని, పై తీర్మానమువల్ల జనించదని కూడ వ్రాయబడెను. హిందూ మహమ్మదీయ సమస్యాపరిష్కారము మాత్రము కొంత విమర్శనకు లోనైనది. మహమ్మదీయు లధిక సంఖ్యాకులుగనున్న పంజాబు, బెంగాల్ రాష్ట్రములందు గూడ శాసనసభాస్థానములు ప్రత్యేకింపబడవలెనని కొందర మహమ్మదీయుల యభిమతము. కుల మత తత్వముల

ననుసరించి, నియోజకవర్గములను నిర్ణయించుటయే కాక, రాష్ట్రములను నిరూపించుట, జాతీయతత్వమునకు మూలనాశనమని, డాక్టరు మూంజీగారు వాదించిరి. సిక్కులుగూడ తమ యసమ్మతిని దెల్పిరి.

3 కలకత్తా సర్వపక్ష సమావేశము.

కలకత్తాయం (1928 డిశంబరు) దఖిలభారత మహాజన సభతోపాటు, సర్వపక్షసమావేశము జరిగినది. ఆ సమావేశమునందు నెహ్రూనివేదిక విపులముగ చర్చించబడినది. ముస్లింనాయకుడగు జిన్నాగారు, నెహ్రూనివేదికయందు సూచింపబడిన హిందూమహమ్మదీయ సమస్యాపరిష్కారము నంగీకరించలేదు. వివిధములగు సవరణల నుపపాదించిరి. భారతశాసనసభలయందు మూడవవంతు స్థానములు మహమ్మదీయులకు ప్రత్యేకింపబడవలెననిరి. యుక్తవయస్సు వచ్చినవా రందరకు, ఓటు హక్కులభించుచో, పంజాబు, బెంగాల్ రాష్ట్రములలో, మహమ్మదీయులకు స్థానములు ప్రత్యేకింపబడవలెననిరి. రాష్ట్రములకు, శాసనాధికారమునందు, సంపూర్ణాధికార ముండవలె ననిరి. (Residuary Powers). సింధురాష్ట్రమును ప్రత్యేకింపవలె ననిరి. సిక్కులు తమ హక్కులును నిరూపించిరి. సిక్కులు కోరిన హక్కులును, మహమ్మదీయులు కోరిన హక్కులును - పరస్పరవిరుద్ధములుగ నున్నవి. సిక్కులు తమ కోరిక నెరవేరలేదని సర్వపక్షసమ్మేళనమునుండి వెళ్ళిపోయిరి. హిందూమహాసభానాయకులు, నెహ్రూ నివేదికయం దెట్టిమార్పునుగాని చేయుట కంగీకరించలేదు. అయినను కలకత్తాయందు, సమావేశమయిన సర్వపక్షసమావేశము నెహ్రూనివేదిక నంగీకరించినది. నాడు జిన్నాగారు జాతీయదృక్పథమున, కుల మతతత్వముల నతిక్రమించిన దేశభక్తితో ప్రవర్తించియుండిన యెడల సర్వపక్ష సమావేశమునం దెట్టి భేదాభిప్రాయములుగాని జనించియుండెడివిగావు.

4 కలకత్తా కాంగ్రెస్ నెహ్రూనివేదిక.

సర్వపక్ష సమావేశమైన మరునాడే, యఖిలభారత కాంగ్రెసు మహాజనసభ సమావేశమైనది. అఖిలభారత కాంగ్రెస్ మహాజనసభ నెహ్రూనివేదిక నంగీకరించినది. ప్రభుత్వమువారి నెహ్రూనివేదిక నంగీకరింపవలసినదిగా కోరుచు నొకసంవత్సరము గడువొసగబడినది. అనగా 31 డిశంబరు 1929

సంవత్సరములోగా నెహ్రూనివేదిక నంగీకరించని పక్షమున సహాయ నిరాకరణోద్యమము మరల ప్రారంభింపబడుననని తీర్మానింపబడెను.

37
సైమన్ సంఘము—
శాసనసభల ఉప
సంఘములు.

దేశమం దొకవంక, ప్రజాప్రాతినిధ్యము వహించిన, నాయకులును, రాజకీయసంస్థలును, ప్రభుత్వమువారిని నెహ్రూనివేదిక సంగీకరింపవలసినదిగా కోరుచు, వారిచే నంగీకరింప జేయుటకై ప్రయత్నించుచుండిరి. వేరొకవంక, ప్రభుత్వము తమప్రభుత్వాధికారమును వినియోగించుచు, సైమను సంఘమునకు సహాకారము లభింపజేయుటకై ప్రయత్నింపసాగినది. భారతశాసనసభ బహిష్కరించుటకై తీర్మానించుటచే, ప్రభుత్వమువారు కొందరు సభ్యులను నియమించిరి. కేంద్రసంఘమునకు (Central Committee) స్టేటుకౌన్సిల్ సభ, ముగ్గురను నియమించినది. మిగిలినవారిని ప్రభుత్వము నియమించినది. మధ్యరాష్ట్రశాసనసభ, సహాకారసంఘమును నియమించుట కంగీకరించలేదు. మిగిలిన రాష్ట్రశాసనసభలు సహాకారసంఘములను నియోగించినవి. ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగ, నాత్మవంచనకరముగ, నియోగింపబడిన యీసహాకార సంఘములు చిట్టచివరకు నామమాత్రములే యైనవి. అక్టోబరు 1928 సంవత్సరమున, సైమన్‌సంఘముతిరిగి భారతభూమికి వచ్చునరికి యీసహాకార సంఘము లేర్పడియున్నవి.

1
స్వదేశ సంస్థానములు—
సైమన్ గారి లేఖ.

కాని తాత్కాలీయముగ, లభించిన నామమాత్రపు సహాకారముతో సైమనుసంఘము తమపని ప్రారంభించినది. 16 వ అక్టోబరు 1929 తేదీన సైమన్‌గా రాంగ్లేయరాజ్య ప్రధానామాత్యుని కొక జాబువ్రాసిరి. భారతదేశమునందుగల, స్వదేశ సంస్థానముల సమస్య సమగ్రముగ రాజ్యాంగవిధానసమస్యతోబాటు, విచారింపబడినగాని భారతరాజ్యాంగసమస్య సంపూర్ణముగ పరిష్కరింపబడ జాలదని సైమన్‌గారు తమనిశ్చయమును వెల్లడించిరి. సైమన్ సంఘమున కొసగబడిన యధికారమునం దీ సమస్య పరిష్కారముచేయుట కధికారములేదు. ఇందులకుగూడ తమ కధికార మొసగవలెనని మెగ్డోనాల్డు

గారిని సైమన్‌గారు కోరిరి. ఈలేఖయందే, తమసంఘువిచారణ ముగిసిన వెంటనే ప్రభుత్వప్రతినిధులు, ప్రజాప్రతినిధులు, సంస్థానప్రతినిధులుగలసి యొక రకపు సమావేశము (Some Sort of conference) జరుపుట యవసరమని గూడ సైమన్‌గారు కోరిరి. ఈరెండుసూచనలునుగూడ మేక్డనాల్డుగా రంగీకరించిరి.

38
లార్డు ఇర్విన్ గారి ప్రకటన, అధినివేశ రాజ్యాంగము.

ఈసమయమునందే లార్డు ఇర్విన్‌గారు, లండనుకు పిలువ బడిరి. మరలివచ్చిన వెంటనే 31 వ అక్టోబరు 1929 వ సంవత్సరమునందొక ముఖ్యమగు ప్రకటన గావించిరి. ఈ ప్రకటనగావించుట కాంగ్లేయప్రభుత్వము ఇర్విన్ గారికి సంపూర్ణాధికార మొసగినది. ఈ ప్రకటనయందు "హిందూదేశపు సహజమగు నాదర్శపరివర్తన మధినివేశరాజ్యాంగమే ననియు (The natural goal of India's advance was dominion status) సైమన్ సంఘునివేదిక ప్రకటింపబడినపిమ్మట, రౌండుటేబిల్ సమావేశము జరుప బడుననియు ప్రకటించిరి. ఈ సమావేశమునందు, పార్లమెంటువారికి సమ ర్పించుట కంద రంగీకరింపగలిగిన, గరిష్ఠప్రమాణ సూచన లొనరింపబడదగు ననియు చెప్పిరి.1

ఈ ప్రకటనమొకింతకాలము, కొందఱను మభ్యపరుప గలిగినదనుట నిశ్చయము. కాని 1929 వ డిశంబరులో, కాంగ్రెస్ నాయకులును - మితవాద నాయకులును - డిల్లీలో సమావేశమయిరి. మహాత్ముడు మితవాదులతో గలిసి వెళ్ళి వైస్రాయిగారితో ప్రసంగించెను. ఈ ప్రసంగఫలితమేమి? సైమన్ సంఘు నివేదిక ప్రకటింపబడిన పిమ్మట సమావేశ పరుపదలంచిన రౌండుటేబిల్ సమావేశ మధినివేశరాజ్యాంగ విధానమును వ్రాయుటకే ననియు, యధినివేశ రాజ్యాంగప్రతిపత్తి నొసగుటకే ననియు, ఇర్విన్‌గారు మహాత్మునకు రూఢిగ చెప్పజాలకపోయెను.

1. "His Majesty's government should meet representatives both of British India and of the states for the purpose of seeking the nearest of British India of the states for the purpose of sesking nearest possibly measure of agreement for the final proposals, which it would latter be the duty of his Majesty's Govt. to submit to parliament".

39
సంపూర్ణ
స్వాతంత్ర్యాదర్శము
లాహోరు కాంగ్రెస్

లార్డు ఇర్విన్‌గా రధినివేశరాజ్యాంగమైన, నొసగబడునని నిశ్చయముగ చెప్పజాలకపోవుటయే లాహోరులో సమావేశమైన కాంగ్రెస్ మహాజనసభ, సంపూర్ణస్వాతంత్ర్యమే భారతదేశాదర్శమని నిర్ణయించుటకుగల ముఖ్యకారణము. మదరాసులో సమావేశమైన, కాంగ్రెస్ మహాజనసభ కాంగ్రెసాదర్శము "జాతీయస్వాతంత్ర్యము" (National Independence) ను సంపాదించుటయే నని తీర్మానించినది. కాని జాతీయస్వాతంత్ర్య మనగా నధినివేశప్రతిపత్తియే యని కొందరు వ్యాఖ్యాన మొసంగిరి. అధినివేశ ప్రతిపత్తియందు, జాతీయస్వాతంత్ర్యముండుననుట సత్యమే. నాడు లాలా లజపతిరాయిగారు సమర్థించు "బహుళసంఖ్యాకు లధినివేశరాజ్యప్రతిపత్తి యనగా సంపూర్ణమైన జాతీయ స్వాతంత్ర్యమనియే విశ్వసించుటవలన, యీ తీర్మాన మామోదింపబడెననియు, ఇందువలన కాంగ్రెసు ప్రథమ సూత్రమందు మార్పేమియు గలుగలేదనియు నుడివిరి.[1]

ఆనాడు మహాత్మాగాంధీగారు కూడ, మదరాసు కాంగ్రెస్ తీర్మానమును, తీవ్రముగ ఖండించిరి. "దుందుడుకుతనముగ నాలోచింపబడి, యనాలోచితముగ, నామోదింపబడినదని" యంగు ఇండియా పత్రికయందు వ్రాసిరి.[2]

ఇట్లువ్రాసిన మహాత్ముడే, కాలపరివర్తనమునం దత్యంత స్వల్పకాలమందు, రెండుసంవత్సరముల కాలములోనే, పరిస్థితుల పరిభ్రమణమునకులోనై సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమును లాహోరుకాంగ్రెసులో నామోదింపజేసెను. ఇంతతో, నేటి, యీమహావిశాల ప్రపంచమున, పూర్ణస్వాతంత్ర్య మనుభవించుచున్న, మానవజాతులన్నింటితో, భారతజాతిగూడ సమానమగుహక్కుగలిగి

1. Lala Lajapati Roy observed, that was passed because "Many people believed that Dominion status also meant complete National Independence and that they were not making redical change in the creed of the Congress"

2. The resolution was hastily conceived and thoughtlessly passed" wrote Mahatme in Young India.

యున్నదని, భావప్రపంచముననైన భారతీయులు సంతృప్తినొందుట కారంభించిరి. నాటితో దాస్య చిత్తవృత్తి బహుళసంఖ్యాకులగు భారతీయులనుండి తొలగినదనుట నిశ్చయము. లండను నగరమందు సమావేశపరుపబడనున్న రౌండు టేబిలుసమావేశమును బహిష్కరించుటకును — శాసనోల్లంఘన కార్యక్రమమును ప్రారంభించుటకునుగూడ లాహోరుకాంగ్రెసు మహాజనసభ నిశ్చయించినది. శాసనసభలను బహిష్కరించుటకు తీర్మానించినది. స్వరాజ్యవాదులందరు శాసనసభలను బహిష్కరించిరి.

## 40. జాతీయోద్యమవిజృంభణము.

విప్లవోద్యమము— దేశమునందంతట నొకవిధమగు సంగ్రామ వాతావరణ మేర్పడినది. ప్రతి సంస్కరణవిధానమునకును ముందు జాతీయోద్యమము; అందులకుప్రతిగ నిర్బంధవిధానము హిందూదేశరాజ్యాంగచరిత్రయందు పరిపాటయినది. ఈస్థితి 1935 వ రాజ్యాంగ శాసనమునకు ముందుగూడ సంభవించినది. స్వరాజ్యపక్ష ప్రతిఘటనవిధానము శాసనసభలయందపజయముగాంచుటతో దేశమునందలి యువజనులలో కొంత నిస్పృహ జనించినది. నిస్పృహనుండి తీవ్రతరోద్యమములు బయలువెడలుట సహజము. విప్లవోద్యమ మన్నిరాష్ట్రములయందును సంతతవ్యాపినిగ ప్రారంభింపబడినదనుట నిశ్చయము. ఉత్తరహిందూస్థానమున తీవ్రస్వరూపముదాల్చినది. విప్లవోద్యమము విజృంభించుచున్నదనియు, నాంగ్లేయసింహము సుఖ సుషుప్తియందుండజాలదనియు, మేల్కొలుపుటకే భారతశాసన సభయందు బాంబు విసరబడినది.

అని భగతుసింగును, దత్తును కోర్టులో వివరించిరి. లార్డు ఇర్వినుగారు ప్రయాణముచేయుచున్న రైలుక్రింద, ఢిల్లీప్రాంతమునందొక, బాంబు పెట్టబడినది. ప్రభుత్వ నిర్బంధవిధానమును, విప్లవోద్యమమును, నవినాభావసంబంధముగలిగి, పరస్పరప్రతిఘటనలవల్ల నభివృద్ధిచెందుచుండుట భారతరాజ్యాంగచరిత్రయందలి ప్రధానాంశము. 1930 వ సంవత్సరమునకు పూర్వమే నిర్బంధవిధానము తలయెత్తి

విచ్చలవిడిగ విహరింపసాగినది. ఏనాడు సైమనుకమిషను బహిష్కరణ సందర్భమున పంజాబుకేసరి లాఠీతో ఛాతీమీద మోదబడెనో, ఆనాడే విప్లవోద్యమమునకు ప్రాణప్రతిష్ఠ చేయబడినదని చెప్పవచ్చును. లాలాజీ ప్రాణములను విడచినాడు. దీనిఫలితముగనే, లాలాజీని కొట్టెనని తలంపబడిన, సాండర్సు, విప్లవకారులచే 17 వ సెప్టెంబరు 1928 న కాల్చి చంపబడినాడు. ప్రభుత్వోమాందోళన పాలైనది. ఇండ్లసోదాలు ప్రారంభించినది. 1929 మార్చి 20 వ తేదీనాడు బొంబాయి, పంజాబు, సంయుక్తరాష్ట్రములతో పందలకొలదియిండ్లు సోదాచేయబడినవి. ఈసమయముననే 8 గురు అఖిల భారత కాంగ్రెసుసంఘ సభ్యులరెస్టు చేయబడిరి.

మీరటు కుట్రకేసులో వివిధప్రాంతములవారు ముద్దాయిలుగ చేర్చబడిరి. నిర్బంధవిధాన విజృంభణమును ప్రతిఘటించుట దేశముయొక్క విధ్యుక్త ధర్మమని యెల్లరు తలంచిరి. విప్లవోద్యమము నెపమున అహింసావాదులగు తీవ్రరాజకీయవేత్తలపైగూడ ప్రభుత్వము దాడి నెడలసాగినది. వంగదేశమునందు విచారణలేకుండగ రెగ్యులేటింగుశాసనము ననుసరించి వేలకొలదిగ యువకులు నిర్బంధింపబడిరి. పలువురు ప్రవాసమున కండమానుదీవుల కంపబడిరి. లాహోరుకుట్రకేసు ఖయిదీలులోకాకర్షణీయమగు నిరశనవ్రతమును బూనిరి. జితేంద్రనాథదాసు నిరశనవ్రతమునందే తన యమూల్య ప్రాణమును దేశమాత పాదపంకజములముందల విడిచి ధన్యుడైనాడు. భారతీయరాజకీయ ఖైదీలకుకూడ మానవమాత్రుల కొసగదగు సౌకర్యములు, కారాగృహములందొసగవలెననియే జితేంద్రుని దీక్షకు కారణము. ఆంగ్లేయ నేరస్తులతోపాటు గూడ భారతీయ రాజకీయ నిర్బంధితులకు సౌకర్యములు సమానముగ లేకపోవుటను జితేంద్రనాథుడు సహించి యూరకుండజాలక, తనప్రాణములనే యర్పింపగలిగినాడు. ఈతడు 64 రోజులుపవాసమునుజేసి, 64 వ నాడు దివంగతుడైనాడు. ఈతనిమరణ మాసేతు హిమాచలపర్యంతము భారతీయహృదయముల యందు కార్చిచ్చు రగుల్కొల్పినది. ఈతని త్యాగమే, స్వాతంత్ర్యజ్యోతియే యానాటనుండియు, భారతరాజకీయ వాతావరణమున ప్రదీపింపసాగినది. ఈవిధముగనే తన సన్యాసివస్త్రములను ధరింపనీయకపోవుటచే బర్మాయందలి కారా

గృహమున 164 దినములు నిరశనవ్రతదీక్షనుబూని "విజయ" యను బౌద్ధ భిక్షుకుడు ప్రాణత్యాగమును జేసియున్నాడు. ఈయనయు రాజకీయనిర్బంధితుడే. ఈయన రాజద్రోహనేరమునకు మొట్టమొదట 21 మాసములు కఠినఖయిదు ననుభవించిన పిమ్మట, 1929 ఫిబ్రవరి 28 వ తేదీని విడుదల చేయబడినాడు. మరల రాజద్రోహోపన్యాసనేర మారోపింపబడి యేప్రియలు 4 వ తేదీనే, విడుదలయయిన మైదువారములకు, పిమ్మట తిరిగి అరెష్టుచేయబడి యారు సంవత్సరముల ద్వీపాంతరవాసశిక్షకు గురియయినాడు. తిరిగి యీశిక్ష మూడు సంవత్సరములకు తగ్గింపబడినది. ఈతని కీ శిక్షాకాల పరిమితితో సంబంధమే లేదు. శిక్షింపబడిన నాటనుండియు, నిరశన దీక్షనుబూని 164 వ దీక్షా దినమున 1929 – 9 – 19 ని పరలోక గతుడైనాడు. మాతృదేశమునకు తన జీవితమునే యర్పించి మృతజీవుడైనాడు. ఈతనికి, జితేంద్రియు, డారు రోజులకు ముందుమాత్రమే, 1929 సెప్టెంబరు 13 వ తేదీని మరణించియున్నాడు. ఈ యిరువుర త్యాగజ్యోతియు భారతరాజ్యాంగ చరిత్రయందలి ప్రతియక్షరమున నాటనుండియు ప్రదీప్తించుచున్న దనుట నిశ్చయము.

లాహోరు కుట్రకేసుఖయిదీలు బహిరంగముగనే, కోర్టునందే లాకీదెబ్బలకు గురిచేయబడిరి. ఎసెంబ్లీలో బాంబువిసరిన భగతుసింగు, దత్తులు ద్వీపాంతరవాస శిక్షవిధింపబడిరి. ఈకాలమునందుననే కలకత్తాయందు సుభాసు చంద్రుడును, మరికొందరు కాంగ్రెసుప్రముఖులును గూడ నిర్బంధింపబడిరి. ఆంధ్రదేశమునగూడ నిర్బంధవు విధానముప్రారంభింపబడినది.

ఈవిధముగ దేశమునందు నలుమూలల నిర్బంధపువిధానము చెలరేగినది. ఇందులకు తోడుగ కార్మికులసమ్మెలు గూడ విజృంభించినవి. బొంబాయి యందలి బట్టలమిల్లుకూలీలు – కలకత్తాయందలి నారమిల్లులకూలీలు, జముషడ్పూరు సమీపమునగల గోలుమూరియందలి తగరపురేకుల మిల్లుకూలీలు సమ్మెలను గట్టిరి. ఇందు సుమారు రెండులక్షలమంది కూలీలు చేరిరి. (బట్టలమిల్లు కూలీలు సుమారు 150, 000 మందియు, నారమిల్లు కూలీలు సుమారు 25000 మందియు, తగరపురేకులకూలీలు సుమారు 3,000 మందియు గలరు.)

దక్షిణ హిందూదేశమున 1928 లో జరిగిన హైళ్ళసమ్మెలో 1929 ఏప్రియల్ లో 15 గురు 10 సంవత్సరముల కఠినశిక్షయిదుసకు గురియయినారు. ఈవిధముగ రాజకీయ వాతావరణమంతయు నల్లకల్లోలముగనున్నది. బ్రిటిషు వస్తు, వస్త్ర బహిష్కరణోద్యమములు గూడ తీవ్రస్వరూపమును దాల్చినవి. దేశమునందెల్లయెడలను బ్రిటిషువస్త్రములకు దహనసంస్కారము జరిగినది. ఇందులకు తోడుగ 1929 జూలై 15 వ తేదీని స్వరాజ్యవాదులు శాసనసభల నుండి రాజీనామాలనిచ్చి బయటకు రావలయునని కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు తీర్మానించియుండిరి. ఈతీర్మానమును 26 వ తేదీని అఖిలభారత కాంగ్రెసుసంఘమువా రామోదించియుండిరి. ప్రభుత్వనిర్బంధవిధాన మతి ఘోరముగను, ఘాతుకముగను, ననాగరికముగను నున్నదని యఖిలభారత కాంగ్రెసుసంఘము తీర్మానించినది. ఇర్విన్‌ప్రభు నక్టోబరు 31 వ తేదీని గావించిన ప్రకటనమును విచారించుటకై దేశీయనాయకులందరు ఢిల్లీయందు సమావేశమయిరి. భారతరాజ్యాంగ సమస్యాపరిష్కారమునకై మూడు ముఖ్య విషయములను నాయకులంద రేకగ్రీవముగ సూచించిరి. (1) దేశమునందంత టను శాంతి వాతావరణ మేర్పడుటకుగాను సుహృద్భావమును చూపింపవల యును. (2) రాజకీయ నిర్బంధితులు విడుదలచేయ బడవలయును. (3) ఆయా రాజకీయ సంస్థలపలుకుబడి ననుసరించి, యాయాసంస్థలకు రౌండుటేబిలు సమా వేశమున ప్రాతినిధ్య మొసగవలయుననియు, నన్ని రాజకీయ పక్షములలోను, కాంగ్రెసు మహాసంస్థ యత్యధిక ప్రాబల్యముగలది యగుటచే విశేషప్రాతినిధ్య మొసగబడవలయుననియు, తీర్మానింపబడినది. మరియు, ఇర్విన్‌ప్రభువుగారి ప్రకటనయందలి సందిగ్ధవచనముల యర్థము నిర్వచింపబడినది. రౌండుటేబిలు సమావేశ మధినివేశస్వరాజ్య మెప్పుడొసగబడవలయునని, చర్చించి నిర్ణయించు టకు గాదనియు, నధినివేశస్వరాజ్యరాజ్యాంగ విధానమును లిఖితపూర్వకముగ నిరూపించుటకే రౌండుటేబిలు సమావేశము జరుపబడవలయుననియు, నాయ కుల సమావేశము తీర్మానించి ప్రకటించినది.

హిందూదేశరాజ్యాంగ కార్యదర్శిగనున్న వెడ్జివుడ్జుబెన్నుగారు 1929 డిశంబరు 23 వ తేదీని పార్లమెంటు సభలోగావించిన ప్రకటనయు, మసిబూసిన

1
వెడ్జి వుడ్డు బెన్ను ప్రకటనము.

మూరేడుకాయుచలె నున్నది. హిందూదేశమున కధినివేశ రాజ్యాంగప్రతిపత్తి గత 10 సంవత్సరములనుండియుగూడ గలదనియు, లేక క్రొత్తగ నధినివేశరాజ్యాంగమును గురించి హామీ నొసగ నవసరములేదనియు, బెన్నుగారు నుడివిరి. ఐరోపాసంగ్రామానంతరము జరిగిన వెర్సలీసు ఒడంబడిక పత్రముపై హిందూదేశ ప్రతినిధిగూడసంతకముచేయుటయు,హిందూదేశమునకు హైకమీషనరును నియమించుటయు, నానారాజ్యసమితిలో భారతీయునకు ప్రాతినిధ్య మొసగబడుటయు, హిందూదేశరాయబారవర్గమునకు నాయకునిగ హిందూదేశస్థుడే నియమింపబడుటయు, నంతర్జాతీయ సముద్రయానసంఘమున భారతీయ ప్రతినిధికి ప్రత్యేకపు వోటుహక్కుండుటయు, నధినివేశరాజ్యశాసనసభలసభలో హిందూదేశము పాల్గొనగలుగుటయు, నంతర్జాతీయ కార్మిక కార్యనిర్వాహక సభయందు హిందూదేశము పాల్గొనగలుగుటయు, నివియన్నియు నధినివేశరాజ్య ప్రతిపత్తిచిహ్నములేయని యుదాహరణముగ జూపియుండిరి. కాని, రౌండుటేబిలు సమావేశమున నధినివేశ రాజ్యాంగప్రణాళికయే లిఖితపూర్వకముగ నిర్వచింప బడగలదను హామీని మహాత్మునికొసగలేదు.

"పూర్ణ స్వరాజ్య ప్రకటనోత్సవములు పూర్ణముగాకమునుపే జనవరి 25 వ తేదీనాడే భారతశాసనసభయందు వైస్రాయిగా రుపన్యసించియుండిరి. ఈ యుపన్యాసము భారతరాజకీయవేత్తల యాశాలతలను త్రుంచివేసినది. "సర్. జానుసైమను తనయుత్తరములోను — మేక్డనాల్డుగారొసగిన సమాధానమునందునను — ఇర్విను ప్రభువుగారి ప్రకటనమునందునను — వెడ్జివుడ్డుగారు పార్లమెంటునందొసంగిన యుపన్యాసమునందునను — లండను సభోద్దేశ్యము నిర్వచించుటలో నొకటేభాష యుపయోగింపబడినది. "భారతదేశమునందన్ని జాతులవారికి, నన్ని పక్షములవారికిని, మధ్యనగు గరిష్ఠప్రమాణాంగీకారముతో గూడిన సూచనలను తయారుచేయుపద్ధతుల నన్వేషింపవలయుననియు, నావిధముగ నిశ్చయింపబడుసూచనల నాంగ్లేయమంత్రివర్గమువారు పార్లమెంటులో ప్రవేశపెట్టుటవారివిధి." ఇదియే వారు ప్రయోగించిన వాగ్జాలములోనిభావము. వైస్రాయి భారతదేశాదర్శమును నిర్వచించుటకై గావించిన యుపన్యాసము

నందే తానొక సమానము నుపయోగించుటమూలమున భారతీయసమస్యా పరిష్కరింపబడినట్లుగ నభులను నమ్మించి మోసపుచ్చ దలచుకొనలేదని ప్రకటించి యుండెను. వైస్రాయి ప్రకటనము జరిగినతరువాత 24 గంటలలో నాయకు లొనరించిన ప్రకటనమునకు వైస్రాయిగారొసంగిన ప్రత్యుత్తరమునకును లాయడు జార్జి కామన్సుసభలో రాజ్యాంగకార్యదర్శి బెన్నుగారిని ప్రశ్నించినపు డాయన యొసగిన ప్రత్యుత్తరమునకును భారతీయులు కృతజ్ఞులై యుండకతీరదు. వారిద్దరును రౌండుటేబిలుసభ డొమినియను ప్రతిపత్తినిగూర్చి నిర్వచించుటకే కాని, భారత దేశము దానిని పొందుటకుగల మార్గములందలి కఠినసమస్యలను పరిష్కరించుటకు కాదు." అని స్పష్టీకరించిరి. "ఎంతస్పష్టమైనభాషలో నుదహరింపబడి నప్పటికి నొకయాదర్శము ప్రకటింపబడినంతమాత్రమున నది చేకూరినట్లుగా భావింపగూడదు" అని వైస్రాయిగారొక్కమాటలో నసలురహస్యమునంతను వెల్లడించిరి. "చేరవలసిన లక్ష్యమునుగూర్చి స్పష్టముగ వివరింపబడినంతమాత్రమున ప్రయాణము పూర్తియైనట్లుగ, బుద్ధిమంతుడగు ప్రయాణీకు డెవడును తలంచడు. లక్ష్యము మార్గమునుమాత్రమే సూచించగలదు." అనియు వైస్రాయి సుబోధక మొనరించినాడు. ఈవిధముగ నాయన నిర్వాచనమునకును, పరిష్కారమునకును గల విభేదమును — ప్రకటనమునకును — ప్రాప్యమునకును గల తారతమ్యమును — లక్ష్యమునకును — మార్గమునకునుగల భేదమును వివరించియుండెను."

"కొందరు రౌండుటేబిలు మహాసభనుపిలిచి దానియం దధికసంఖ్యాకుల యంగీకారముతో భారతరాజ్య ప్రణాళిక వ్రాయబడవలయుననియు - దానియం దెట్టిమార్పులుగాని గావింపకుండ, దానిని పార్లమెంటువా రంగీకరించవలయు ననియు కోరియుండిరి."

ఇప్పుడాంగ్లేయ ప్రభుత్వమువారు సమావేశపరచుచున్న రౌండుటేబిలుసభ యట్టిది కాదనుట నిజము —

"ఈ రౌండుటేబిలుసభ యభిప్రాయములను దెలిసికొనుటకు, నా యభిప్రాయభేదములను సమన్వయించుకొనుటకును మాత్రమే పిలువబడుచున్నది. ఈసభ పార్లమెంటువారి విచారణకొఱకు చిత్తుసూచనలను తయారుచేసి పార్ల

మెంటునకు బాధ్యత వహించవలసిన సీమప్రభుత్వమునకు సహాయకారిగ నుండ గలదు." ఈవిధముగ స్వయంనిర్ణయసూత్రము త్రోసివేయబడినదని వైస్రాయి గారే స్పష్టపరచిరి. సమిష్టి సంప్రదింపులను, సమిష్టినిర్ణయమును, ప్రభుత్వము తనవిధిని నిర్వహించుకొనుటలో తోడ్పడుటకుమాత్రమే. ఇందువలన భారత దేశము స్వయంనిర్ణయమునుగాని, సమిష్టినిర్ణయమునుగాని, తలపెట్టుటకు సావకాశము గలుగలేదనియు, నిది యితరనిర్ణయమనియు, తేటతెల్లమైనది." 1

మహాత్ముడాంగ్లేయ రాజకీయవేత్తల మృదుమధుర వాగ్దాల పరంపరలకు సమ్మోహితుడు కాలేదు. మృదుమధురమగు యిర్విన్‌ప్రభువుగారి భాషాప్రయోగము స్వాతంత్ర్యము కాజాలదని భారతజాతీయ మహాజనసభ లాహోరు కాంగ్రెసులో నిర్ణయించుకొనినది.

ప్రత్యక్షసత్యాగ్రహ కార్యక్రమమే గత్యంతరమను దృఢసంకల్పము భారతీయుల హృదయకుహరములనుండి యంతర్వాహినియై ప్రవహింపసాగినది. లాహోరు కాంగ్రెసునంతరము సత్యాగ్రహసమర కోలాహలమే యావద్భారత దేశమున ప్రతిధ్వనింపసాగినది. కలకత్తా కాంగ్రెసులో ప్రభుత్వమునకు సంధి జేసికొనుట కొకసంవత్సరకాలము గడువొసగబడినది. ఆగడువు 1929 డిశంబరు రాత్రి 12 గంటలకే ముగిసినది. ఆరాత్రి సరిగ నాగంటయందే సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానము లాహోరుకాంగ్రెసులో గావింపబడుట కాలచక్రపరిభ్రమణమునందలి యత్యాశ్చర్యకర విషయములలో, దైవసంఘటనముగ తలంపబడు విషయములలో నొకటి. కలకత్తాయం దేర్పరుపబడిన ప్రత్యేక సంపూర్ణ స్వాతంత్ర్య సంఘమువారి సత్సంకల్ప మానాటితో కొనసాగినది.

జనవరి 26 వ తేదీ సంపూర్ణస్వాతంత్ర్య దినముగా కాంగ్రెసుసంస్థ ప్రకటించినది. ఈ సంపూర్ణస్వాతంత్ర్య ప్రకటనపత్రము భారతదేశమందలి ఆంగ్లేయ రాజ్యాంగపరివర్తనమందు గమనార్హమైనది. "తమ కష్టార్జితఫలముల ననుభవించి తమ జీవితావసరములను పొందుటకు ప్రతిజాతికినిగల శాశ్వతస్వహక్కే, భారత జాతికిగూడ గలదని మా విశ్వాసము. అందువల్లనే భారతీయాభివృద్ధికి

1. See. Congress History p. 619 by Dr. B. P. Seetaramayyagaru.

సంపూర్ణావకాశములు లభింపగలవు. ఏ ప్రభుత్వమైననూ ప్రజలహక్కులను తృణీకరించి, వారి ననగద్రొక్కబూనుచో, ప్రజలకాప్రభుత్వమును మార్చుటకు గాని, లేక నిర్మూలించుటకుగాని, హక్కుగలదనియే మా విశ్వాసము. భారత దేశమందలి బ్రిటిషుప్రభుత్వము భారతప్రజల స్వాతంత్ర్యము నపహరించుటయే కాక, సామాన్యప్రజల ధనశోషణ విధానముమీద నాధారపడియున్నది. ఆ ప్రభుత్వమూలమున భారతదేశ మత, రాజకీయార్థిక విజ్ఞానములు నాశన మొనరింపబడినవి. ఇందువల్ల భారతభూమి యాంగ్లేయరాజ్యాంగ సంపర్కమును సంపూర్ణముగ తెగగొట్టికొని, పూర్ణస్వరాజ్యము, లేక, సంపూర్ణస్వాతంత్ర్యమును పొందితీరవలయునని మా విశ్వాసము. ఆర్థికముగా భారతదేశము నాశనము చేయబడినది. మా దేశప్రజలనుండి తీసికొనబడేపన్నులు మా ప్రజల యాదాయము ననుసరించి లేవు. మా సగటాదాయము రోజుకు ఏడుకానులు. అనగా రెండు పెన్నీలకు తక్కువ. మేము చెల్లించే పన్నులభారములో 100 కి 20 వంతున హెచ్చింపబడిన భూమిశిస్తులు, రైతులు చెల్లించుకొనవలసి యున్నది. 100 కి మూడువంతున హెచ్చింపబడిన యుప్పుపన్ను పేదలకు భరింపశక్యము గాకున్నది.

చేతితో నూలువడకుటవంటి గ్రామపరిశ్రమలు నిర్మూలింప బడినది. రైతులు కనీసము సంవత్సరములో నాలుగు నెలలు తదితర వృత్తులు లేక సోమరులుగా నుండవలసియున్నది. సున్నితములైన చేతిపనులు లేకపోవుట వలన వారి బుద్ధి మొద్దుబారినది. ఇతర దేశములలోవలె నిర్మూలింపబడిన చేతిపనులకు బదులుగా నీదేశమునందు నూతనవృత్తులు గల్పింపబడి యుండలేదు.

దిగుమతిపన్నుల మూలమునను, నాణెముల చెలామణి విధానమునందు ప్రయోగించిన తికమకల మూలమునను రైతులు నూతన భారమును భరింప వలసినవారైరి. ఆంగ్లేయుల వస్తువులే విరివిగ మాకు దిగుమతి చేయబడు చున్నవి. దిగుమతి సుంకములలో సీమసరకులకు పక్షపాతము చూపబడు చున్నది. ఈ సుంకములవల్ల లభించు ప్రభుత్వాదాయముగూడ ప్రజలపన్నుల భారమును తగ్గించుటకు వినియోగించుటకు మారుగ, ప్రభుత్వపు దుబారా ఖర్చులక్రింద వినియోగింప బడుచున్నది. మారకపు రేటు విషయమునం

దవలంబింపబడుచున్న తంత్రమన్నింటికంటె నిరంకుశముగ నున్నది. ఈ మారక విధానమున లక్షలకొలది ద్రవ్యము పరదేశములకు ప్రవహించుచున్నది.

బ్రిటిషువారి హయామునందువలె రాజకీయముగ నింతకుముందెన్నడును భారతదేశ మింతటి యధోగతికి వచ్చియుండలేదు. సంస్కరణములు ప్రజలకు నిజమగు రాజకీయాధికారము నొసగి యుండలేదు. మాలోని యుత్తమోత్తములు విదేశీయుల యధికారమునకు తలలొగ్గవలసియున్నది. వాక్స్వాతంత్ర్యమును, సభాసమావేశ స్వాతంత్ర్యమును మాకు నిరాకరింపబడినవి. మా దేశీయులు పలువురు విదేశములయం దజ్ఞాతవాసము చేయుస్థితి దాపరించినది. వారు తమ స్వదేశమునకు మరలిరా నిరోధింపబడుచున్నారు. మా పరిపాలనా సామర్థ్యము సంపూర్ణముగ నిర్మూలింపబడినది. సామాన్య ప్రజలు చిన్న చిన్న గ్రామ నౌకరీలతోను, గుమస్తాగిరీలతోనే సంతృప్తిపడవలసియున్నది.

నేటి విద్యాపద్ధతి మమ్ములను మా విజ్ఞానమార్గమునుండి పెడమార్గములను పట్టించినది. మా కీయబడు శిక్షణము, మమ్ములను బంధించు గొలుసులనే మేమంటిపెట్టుకొని యుండునట్లొనరించినది.

నిర్బంధముగ మేము నిరాయుధులుగ నొనరింప బడితిమి. అందువల్ల మా పౌరుషము నశించినది. మాయందలి ప్రతిఘటనశక్తి నణగద్రొక్కుటకై భయంకరాయుధములతో విదేశసైన్యము దేశమునం దుంచబడినది. మేము స్వయంసంరక్షణ చేసికొనగలిగిన స్థితియందు లేము. విదేశీయ దండయాత్రల నుండియు, లేక దొంగలు, బందిపోటుదారులు మొదలగు సంఘ కంటకులనుండి మా గృహములను, కుటుంబములను సంరక్షించుకొన నశక్తులమని తలంపవలసివచ్చినది.

ఈవిధముగ నాపత్తులను గలిగించిన పరిపాలనమునకు మా దేశమునింకను గురిచేయుట దేవునికిని—మానవునికినిగూడ ప్రతికూలముగ నపరాధమొనరించి నట్లు మేము భావించెదము. కాని, మాస్వాతంత్ర్య సంపాదనకు ప్రయోజనకరమైన మార్గము దౌర్జన్యవిధానముకాదని మేమెరుంగుదుము. మాకు

సాధ్యమగునంతవరకు ఆంగ్లేయపరిపాలనమునుండి పూర్తిగ సంపర్కమును విడనాడి, పన్నులనిరాకరణముతోఁ గూడిన శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు మేము సంసిద్ధముకాఁగలము. ప్రభుత్వమునకొసగుచున్న మాస్వంతసహకారము నుపసంహరించుకొని, ఎట్టి దురాగ్రహ ప్రకోప పరిస్థితులయందైనను దౌర్జన్య మొనరింపక పన్నులను చెల్లించుట విరమింపబడినచో నీ యమానుష ప్రభుత్వ మంతరించునని మావిశ్వాసము. అందులకై పూర్ణస్వరాజ్య సంపాదనార్థ మప్పుడప్పుడు కాంగ్రెసునుండి యొసఁగబడే యుత్తరువులను శిరసావహించుటకు మేమిందుమూలముగ ప్రమాణ మొనరించుకొనుచున్నాము.”

ఈ భారతజాతీయ స్వాతంత్ర్య ప్రకటనమే నాటినుండి తుదివఱకును భారతీయాదర్శముగ నున్నది. భారతీయు లిందుకొఱకే తమ ధన మాన ప్రాణముల నర్పింపఁబూనిరి.

2
స్వాతంత్ర్య సారము.

మహాత్ముఁడు సత్యాగ్రహమును ప్రారంభించుటకు నిశ్చయించుకొనెను. ఉప్పు సత్యాగ్రహ మొనరించుటకు మహాత్ముఁడు చరిత్రాత్మకముగ దండికి దాడివెడలెను. (12-3-1930) ఈదాడివెడలుటకు పూర్వ మిర్విన్‌ప్రభువునకు మహాత్ముఁడు తన తుదిసందేశము నంపెను.

(1) మద్యపానమును సంపూర్ణముగ నిషేధించుట.

(2) మారకపు రేటును 16 పెన్నీలకు తగ్గించుట.

(3) భూమిశిస్తు 100 కి 50 వంతులు తగ్గించుట. భూమిశిస్తు నిర్ణయాధికారమును శాసన మొనరించుట.

(4) ఉప్పుపన్ను రద్దుచేయుట.

(5) సైనికవ్యయమును కనీసము 100 కి 30 వంతులు మొట్టమొదటగ తగ్గించి సైనికవ్యయమును తగ్గించుట.

(6) తగ్గించిన భూమిశిస్తులో వ్యయముసరిపడునటుల పెద్దయుద్యోగస్తుల జీతములను సగమువరకు తగ్గించుట.

(7) విదేశములనుండి దిగుమతియగు వస్త్రములపై సంరక్షణసుంకము విధించుట.

(8) కోస్తావ్యాపారమును భారతీయులకే ప్రత్యేకించుచు శాసనము గావించుట.

(9) రాచకీయ ఖైదీలను విడుదలచేయుట (హత్యానేరమునకై శిక్షిం బడిన వారుగాక) విచారణలేక శిక్షింపబడువారిని న్యాయస్థానములందు విచా రించుట. విచారణయందున్న రాచకీయ నేరముల నుపసంహరించుకొనుట 124 A-సెక్షన్ రద్దుచేయుట— 1818-3 వ రెగ్యులేషన్ రద్దుచేయుట. భార దేశమునకు రాకుండ విదేశములయందున్నవారిని, తిరిగి భారతదేశమునకు నిచ్చుట.

(10) సి. ఐ. డి. డిపార్టుమెంటును రద్దుచేయుట-లేక-సి. ఐ. డి వారి య కారములను తగ్గించుట.

(11) స్వయం సంరక్షణకొరకాయుధములు కావలయునని కోరి వారి కాయుధములకు లైసెన్సులనిచ్చుట. (అవసరమగు నియమములకు లో బరచి) ఈషరతులనైన నంగీకరించుచో, ప్రభుత్వముతో సహకారమొనరించ టకు, సావకాశ మేర్పడగలదని మహాత్ముడు డిర్విన్‌ప్రభువునకు తెలియజేసెన ఈషరతులతోగూడిన జాబు 2 వ మార్చి, 1930 తేదీన వ్రాయబడినది. ఇ నాల్డు, రీనాల్డ్సను నాంగ్లేయ యువకు డీజాబు నిర్విన్ కందిచ్చెను. ఇట్టి ష తులనే 1930 సంవత్సర ప్రారంభమునందే, మహాత్ముడు, బొమ్మంజీగారికి ని దించెననియు, బొమ్మంజీగారు లండనుకుబోయి, మాక్డనాల్డు మంత్రితో రాయబారములు నలుపుటకు ప్రయత్నించెననియుగూడ తెలియుచున్నది.1

మహాత్ముని కట్టకడపటి రాయబారమునందు గమనింపదగిన మరియొ ముఖ్యవిషయము గలదు. లాహోరు కాంగ్రెసులో నిర్ణయింపబడిన సంపూర్ణ స్వాతంత్ర్యమును గురించి యీవిధముగ వ్యాఖ్యాన మొనరించియుండెను. "మీ రుపయోగించిన యధనివేశ ప్రతిపత్తియను శబ్దమును కందరంగీకరించుచున్న

1. See Page 620 History of the Congress.

నిర్వచనము ననుసరించియో, దానిని, మీరుపయోగించి యుండినయెడల, సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానమునకు కంగారుపడవలసిన యవసరములేదు. ఎందు చేత నన, నధినివేశ స్వాతంత్ర్య మనగా నాచరణయందు సంపూర్ణస్వాతంత్ర్యమే నని బాధ్యతగల బ్రిటిషు రాజకీయ వేత్తలందరు నంగీకరించిన విషయమేగదా? అయినప్పటికి నట్టి యధినివేశ స్వాతంత్ర్యమును హిందూదేశమున కనతికాల ములో నొసగవలె నను సంకల్పము మీకు లేదనియే నాభయము." ఈ వాక్య ములననుసరించి యాంగ్లేయసంపర్కమంతయు విడగొట్టబడే సంపూర్ణస్వాతంత్ర్య మునే మహాత్ముడుకోరక, యధినివేశ రాజ్యస్వాతంత్ర్య మొసగబడినను సంధి గావించుకొనుటకు సంసిద్ధముగ నున్నటుల వివరించి యుండెను.

# 41. 1930 సత్యాగ్రహ సమరము.

మహాత్ముని, పై సంధిపరతులు భారతమునందలి ధర్మరాజుగారు కనీస మయిదు గ్రామములు కోరినట్లున్నది ఇందులకు ఇర్విను ప్రభువొసగిన సమా ధానమేమి? "నేను రొట్టెపంపితిని. దానికిమారుగ రాయి పంపబడినది." అని ఇర్వినుగారి సమాధానముపై మహాత్ముడు వ్యాఖ్యాన మొనరించెను. మహాత్ముని చర్యకై వగచుటయే యిర్వినుగారి సమాధానము. ఈ సమాధానము దుర్యోధనుని సమాధానమువలె నున్నదనుటయు సమంజసము.

ఈ సమాధానానంతరము సత్యాగ్రహ సమరము ప్రారంభ మైనది. ఈ సత్యాగ్రహ సమరము దిగంతములు మారుమ్రోగినది. భారతజాతిప్రదర్శిం చిన యహింసాతత్వమునకు క్రైస్తవజాతులన్నియు దిగ్భ్రమచెంది చూచినవి. అయిననేమి? హిందూదేశప్రభుత్వము ప్రయోగించిన ఘోర నిర్బంధ విధానము నకు ప్రశాంతముగ కాంగ్రెసు భక్తులు తలయొగ్గిరేకాని, నిర్వీర్యులు కాలేదు. అహింసావాదులపై ప్రయోగింపబడిన పశుత్వమునకు మితవాదులు, ప్రభుభక్తి పరాయణులు కూడ సహింపజాలరైరి.

మహాత్ముడు పాదచారియై 12-3-1930 వ తేదీని 79 గురు శిష్య

లతో మాత్రమే బయలువెడలిన దండిదండయాత్ర, అనతికాలములో నాంగ్లేయ సామ్రాజ్యసింహాపుజూలు పట్టుకొని యుఱ్ఱూతలూగసాగినది. ఈ మహత్తర సామ్రాజ్యసింహాము తన మహాహింసాశక్తిసంతయు విజృంభింప జేసి జాతీయోద్యమమును ప్రతిఘటించినది. కాంగ్రెసు తీర్మానానుసారము శాసనసభలనుండి 1930 ఫిబ్రవరి నాటికే 172 మంది శాసనసభ్యులు రాజీనామా నిచ్చియుండిరి. ఇంతకు పూర్వమే కలకత్తాయందు పలువురుశిక్షింపబడిరి. యావద్భారతదేశమునందునను కేసులు - శిక్షలు విచ్చలవిడిగ నున్నవి. మీరటుకుట్రకేసు ముద్దాయిలు 31 మంది సెషన్సుకోర్టునకు విచారణకు పంపబడిరి. ఈవిధముగ రాజీయ యగ్నిగుండమునకు మహాత్ముని సత్యాగ్రహ మాహుతి యైనది. దేశమందంత పలువురుద్యోగులు రాజీనామాలనొసగ నారంభించిరి. అందుముఖ్యులు గ్రామోద్యోగులు. దండయాత్ర ప్రారంభావస్థయందే 300 మంది గ్రామోద్యోగులు రాజీనామాలను పంపిరి. గాంధి "మొదటిదెబ్బ ఫిరంగిగుండతోగాని బాంబులతోగాని కొట్టలేదు. కేవలము ఉప్పుతోడనే యీయన యుద్ధము. జీవితావసరములలో ప్రాథమికమైనదగు ఈవస్తువునకు కలిగిన ప్రాముఖ్య మాశ్చర్యకరము !!... గాంధీ దండయాత్రవలన భారతదేశ మాంగ్లేయరాజ్యముపై రక్తపాతముతో నిమిత్తములేని మహావిప్లవము ప్రారంభించినదని నాగరిక ప్రపంచమునకు దెలియవచ్చినది. సత్యమసత్యముపైనను, తేజస్సంధకారముపైనను జయమును పొందుటయే నిజమైనయెడల భారతదేశము తప్పక జయము పొందగలదు."[1] అను భావమే భారతదేశ మంతయు పరివ్యాప్తమైనది. ఏప్రియలు 23 వ తేదీని బెంగాలార్డినెన్సు ప్రకటింపబడినది. 27 వ తేదీని పత్రికా శాసన మార్డినెన్సు మూలముగ ప్రకటింపబడినది. ఈ పత్రికా శాసనము ననుసరించి పత్రికలు ధరావతులుకోరబడి, ప్రకటన విరమింపబడుట తప్పనిసరి చేయబడినది. కొన్ని ముద్రణాలయములే ప్రభుత్వమువారు వశపరచుకొనిరి. 1910 సం॥నాటి ముద్రణాశాసనము 1930 లో తిరిగి పునరుద్ధరింపబడినది. మహాత్ముడరెస్టుగావింపబడకపూర్వమే సత్యాగ్రహోద్యమమెట్లు విజృంభించినదియు మహాత్ముని వాక్యములవల్లనే తేటపడగలదు. "ఈదండయాత్రను మీరు (వైస్రాయిగారు) మూడువిధముల నాపుజేయవచ్చును. (1) ఉప్పుపన్నును తొలగించుటమూలమున.

---

1. Congress History.

(2) నన్నును — నాయనుచరులను నరెస్టుచేయుట మూలమున ; మేము నిర్బంధింపబడినయెడల మరికొందరు మాస్థానముల నాక్రమింపగలరని మావిశ్వాసము. అట్లు రాకున్నయెడల మీరీదండయాత్ర నాపివేయగలరు. (3) కేవలముగూండాతనమువల్ల ; పోలీసువారిచే తలలు పగులకొట్టబడినవారిస్థానే క్రొత్తవారు రానియడల ; వచ్చెదరనియే నావిశ్వాసము.

"నేను కొంతసందేహముతోనే యీపనికి పూనుకొంటిని. ప్రభుత్వము నాగరికసూత్రముల ననుసరించి యహింసాప్రతశాసన నిరోధకులతో వ్యవహరింతురని నే నాశించితిని. సత్యాగ్రహులతో వ్యవహరించునపుడు, సాధారణ శాసనపద్ధతులను ప్రభుత్వమువా రవలంబించి యున్నయెడల, నేను వారి నేమీ యనవలసిన పనియే యుండెడిదికాదు. సుప్రసిద్ధనాయకుల విషయములపట్ల కొన్ని న్యాయశాస్త్ర లాంచనములు జూపబడుచున్నవి. మిగిలినవారలు క్రూరముగను, మోటుగను గొట్టబడుచున్నారు. ఇవి యెచ్చటనో యొకచోటనే జరిగియుండిన గమనార్హము కాకపోవచ్చును. కాని, వంగ, బీహారు, ఢిల్లీ, ఉత్కళ, సంయుక్తరాష్ట్రములనుండి, బొంబాయినుండి, గుజరాతు రాష్ట్రములో జరుపబడినట్టిచర్యలు జరుపబడినట్లుగ నాకు తెలియవచ్చినది. గుజరాతు చర్యలను గురించి నాయొద్ద సంపూర్ణసాక్ష్యముగలదు. కరాచీ, మద్రాసు, పెషావరులలో జరిగినకాల్పులాగ్రహకారణములేకనే, యనవసరముగ జరిగినట్లు తోచుచున్నది. స్వచ్ఛంద సేవకులదృష్టి కమూల్యమై, ప్రభుత్వదృష్టికి మూల్యరహితమైన 'ఉప్పు' ను స్వచ్ఛందసేవకుల హస్తములనుండి లాగికొనుటకు వారి బొమికలు విరుగగొట్ట బడుచున్నవి. మథురలో 10 ఏండ్లబాలకుని దగ్గిరనుండి జాతీయ పతాకము నసిస్టెంటు మేజస్ట్రీటు బలవంతముగలాగినట్లు తెలియవచ్చినది. పతాకము నొసగవలెనన్న జనసమూహము నిర్దయగా కొట్టబడినది. పతాకము పిమ్మట జనుల కిచ్చివేయబడినది. ఇందువల్ల పోలీసువారు తప్పొనరించినటుల స్పష్టపడినది. వంగరాష్ట్రమునందు కొందరుమాత్రమే శిక్షింపబడినట్లుగను, మరికొందరు దెబ్బలుకొట్టబడినట్లుగను తెలియుచున్నది. కాని, స్వచ్ఛంద సేవకులచేతులనుండి జెండాలను లాగికొనుటలో నూహింపరాని ఘోరకృత్యము లొనరింపబడినట్లు వింటిని. వరిపైరులు తగులబెట్టినట్లును నాహారపదార్థములు

బలవంతముగా స్వాధీనపరచుకొనినట్లును, తెలియవచ్చినది. గుజరాతులో నధికారులకు కూరలు విక్రయించలేదని దుకాణము ముట్టడింపబడినది. ఈచర్య లన్నియు ప్రజాసమూహము కట్టైదుటజరిగినవి. కాని, ప్రజాసమూహము కాంగ్రెసు నాజ్ఞానుసారము ప్రతిక్రియచేయక లొంగిపోయిరి. సత్యసంధుల మాటలను విశ్వసింపవలయుననియు మీకు నాకోరిక. బార్డోలీవిషయమునం దిట్టివెన్నియో జరిగినవి. ఉన్నతోద్యోగు లిట్టివి జరుగలేదని ప్రకటించిరి. పిమ్మట వారి ప్రకటన లబద్ధములని రుజువైనవి. అధికారులు, సత్యాగ్రహ మారంభమైన, యీ యైదువారములలో నబద్ధములప్రకటించుట కెంతమాత్ర మును జంకుటలేదని చెప్పవలసివచ్చినందులకు నేను విచారపడుచున్నాను.......

"ఇప్పుడు మీరు దేశముపైన యింతకుముందెన్నడును కనివిని యెరుంగని నిరంకుశ ముద్రణాశాసనమును ప్రయోగించిరి. మామూలు న్యాయశాస్త్రముతో సంబంధము లేకుండగ, భగవత్సింగు ప్రభృతులవిచారణలో మీ రడ్డత్రోవ త్రొక్కిరి. ప్రభుత్వాధికారుల చర్యలనుగాని, కొన్ని సందర్భములయందలి వారి యుదాసీన భావములనుగాని, నేనవి ప్రచ్ఛన్న వేషములోనున్న సైనికశాసనము లని పిలిచినచో, తప్పులేదని నాయభిప్రాయము. ఇప్పటికింకను నుద్యమము ప్రారంభమై యైదువారములైనను కాలేదు. ఇప్పుడప్పుడే ప్రారంభమయిన భయంకర పరిపాలనము భారతదేశమును ముంచివేయకమునుపే నే నింతకంటెను ధైర్యముగ చర్యనుదీసికొన దలంచితిని..........

"ప్రభుత్వాధికారుల హింసాపద్ధతుల మూలమున ప్రభుత్వస్వరూపము ప్రజలకు సరిగా గోచరించినది. ప్రభుత్వము తమ పరిస్థితుల ననుసరించి సత్యాగ్రహకార్యక్రమ నిరోధమును శక్తివంచనలేకుండగ కొనసాగించుచుండిరి"......

ఇవి మహాత్ముడు ఇర్విన్ప్రభువునకు దర్శన యుప్పుకొఠారి ముట్టడికి సిద్ధమయిన కాలమున వ్రాసిన రెండవజాబునందలి విషయములు. మహాత్ముడు కారాగృహమునందు 5 వ తేదీని నిర్బంధింపబడుటకు పూర్వమయిదువారములలోనే ప్రభుత్వచర్య లట్టి తీవ్రస్వరూపము దాల్చియుండ మహాత్ముని నిర్బంధమునకు పిమ్మట నాసేతు హిమాచల పర్యంతము కార్చిచ్చువలె ప్రబలిన సత్యాగ్రహోద్యమమును, నందులకు ప్రతిగ నిర్విన్ప్రభుత్వ మొనరించిన దుండగములను

వర్ణించుట కలవికాదు. వివరించుటకిది స్థానముగాదు. సత్యాగ్రహోద్యమ మొక ప్రత్యేకచరిత్రయగుట పొగడ్త కాజాలదు. రాత్రి 1 గంట 10 నిమిషములకు మహాత్ముడు ప్రభుత్వముచే తీసికొనిపోబడి 'ఎఱవాడ' చెఱసాలయందు నిర్బంధింపబడెను. హరతాళములు, విదేశీవస్త్రబహిష్కరణము, కల్లుసారాయిల పికిటింగు, శాసనోల్లంఘనము మొదలగు సత్యాగ్రహ కార్యక్రమము — లాఠీదెబ్బలు— కాల్పులు— నిర్బంధములు - జరిమానా — ఆస్తులను లాగికొనుట— పత్రికలను నిరోధించుట మొదలగు ప్రభుత్వనిరంకుశ ఘోరనిర్బంధవిధానము భారతదేశమునంతటి నల్లకల్లోలమున — నరాజకమున, త్యాగసముద్రమున — స్వాతంత్ర్యకాంక్షలోన ముంచివేసినవి. (ఇందునుగురించిన వివరములు విశేషములు కాంగ్రెసుచరిత్రనుండి విపులముగ గ్రహింపవచ్చును.)1 ఈమహాసత్యాగ్రహోద్యమమును గురించి విదేశపత్రికాధిపతుల యభిప్రాయము లొకింత స్మరింపదగును.

"18 సంవత్సరములనుండియు, పత్రికావిలేఖకునిగా 22 దేశములలో నేను సంచారముచేసియుంటిని. లెక్కలేని యాంతరంగిక కల్లోలములను, దొమ్మీలను, వీధి పోరాటములను, విప్లవములను, కండ్లార నేను జూచితిని. కాని, దర్శనలో జూచిన భయంకరదృశ్యములను నేనెచ్చటను జూచి యుండలేదు. కొన్ని సమయములలో నేనీఘోరమును జూడలేక తాత్కాలికముగ తిరిగి వెళ్లిపోయిన సందర్భములుగూడ గలవు. స్వచ్ఛంద సేవకుల క్రమశిక్షణము నాకాశ్చర్యమును కలిగించినది. గాంధీ యహింసా సిద్ధాంతము వారి రక్తమున జీర్ణించినట్లు నాకుతోచినది." అని వెబీమిల్లరుగారు 'న్యూఫ్రీమను' పత్రికకు వ్రాసియుండిరి.

"నేను వాడాలాలోని కొన్ని యుప్పుదండయాత్రలను స్వయముగ జూచితిని. మిత్రులవలె మెలగుపట్టుదలగల దేశభక్తులైన స్వచ్ఛంద సేవకులమధ్యను, వారియందు సానుభూతిగల ప్రజలమధ్యను నిలబడి ప్రభుత్వప్రతినిధులు కావించుచున్న యసహ్యాకరమైన, దురదృష్టకార్యమును జూచుటాంగ్లేయున కవమాన

1. See also "Gandhi—The Man and His Mission" published by Natesan Company.

కరముగా దోచెను." అని జార్జిస్లోకొంబుగారు లండను డెయిలీహెరాల్డు ప్రతికా ప్రతినిధిగా నాపత్రికకు వ్రాసియుండిరి. ఈదృశ్యము లాయన హృదయమును దహించుటవల్లనే యాయన సంధిగావింప నెడతెగని ప్రయత్నముల నాచరించి యుండెను. సత్యాగ్రహోద్యమ విషయములను, స్వయముగచూచి, వ్రాయుటకై సీమనుండి యిండియాకు, వచ్చిన జార్జిస్లోకాంబీగారు భారతీయుల యహింసా మహాత్మ్యమును జూచి యచ్చెరు వొందిరి. రాయబారములను సలుపుటకై స్లోకాంబీగారు మహాత్ముని యెరవాడ జైలునందు 20 మే, 1930 సంవత్సరమున దర్శించిరి. స్లోకాంబీగారికి మహాత్ముడు తన షరతులను నిర్వచించెను.

(1) హిందూదేశమునకు స్వాతంత్ర్యసారము నొసగగల, రాజ్యాంగ విధానమును వ్రాయుటకై, రౌండుటేబిల్ సమావేశము కోరబడవలెను.

(2) ఉప్పుపన్నును రద్దుచేయుటను గురించియు - మద్యపాన నిషేధమును గురించియు- విదేశ వస్త్రదిగుమతి నిషేధించుటనుగురించి - మహాత్మునికి సంతృప్తి గలుగునటుల గావించుట.

(3) సత్యాగ్రహోద్యమమును విరమించుటతోపాటు రాజకీయఖైదీలను విడుదల చేయుట.

(4) మహాత్ముడు వైస్రాయిగారికి వ్రాసిన మిగిలిన 11 విషయములు భవిష్యత్తునందు చర్చించుటకు వదలుట.1

ఈ యల్పమగు షరతులనుగూడ బ్రిటీషుప్రభుత్వ మామోదించి యుండలేదు. స్లోకాంబీగారి రాయభారము జయప్రదము కాలేదు. ఆరోజు కారోజు, సత్యాగ్రహోద్యమము, మహాతేజోవంత మగుచున్నది. సర్వతో

---

1. The terms of reference of the R. T. C. to include the framing of a constitution giving India the substance of Independence. 2. Satisfaction to be granted to Mr. Gandhi's demand for the repeal of salt tax, prohibition of the liquor and the ban on foreign cloth. 3. An amnesty for prisoners convicted of poitical offences to coincide with the end of the civil disobedience compaign. 4. The remaining seven points raised in Mr. Gandhi's letter to the Viceroy to be left for future discussion.

ముఖముగ వ్యాపించినది. నిర్బంధవిధానము వివిధస్వరూపముల ప్రకోపించినది. 1930–31 సత్యాగ్రహోద్యమమున జరిగిన నిర్బంధవిధాన మింతయని, యిదియని, నిరూపించి హద్దు నేర్పరచుటకు సావకాశము లేదు. విదేశప్రభుత్వము తన జీవితముకొఱకెంతవఱకు విజృంభించి విరోధవర్గమును నశింపచేయుటకు సావకాశము గలిగియున్నదో యెంతవరకట్లొనరించుటకు శక్తిసంతమయియున్నదో యంతవరకును తన సర్వశక్తులను వినియోగించినదనుట నిశ్చయము.1 అహింసావాదులపైన తుపాకిమందములు ప్రయోగింప బడుటయేకాదు. మంటలుగూడ ప్రజ్వలింప చేయబడినవి. యావద్భారత దేశమునందునను ప్రజాసమూహములు, పలుతావుల తుపాకులతో కాల్చబడిరి. 2

ప్రభుత్వమువారు సత్యాగ్రహులమీదను, వారిపై సానుభూతిని జూపుటకు వచ్చిన ప్రజాసమూహములపైనను మాత్రమే, తమ బలప్రయోగ మొనరించుటయేకాక, సత్యాగ్రహుల బంధుమిత్రులుగూడ వివిధరీతుల హింసింపబడిరి. ఏనాగరిక ప్రభుత్వముగాని చేయరానిపనులను చేసిన దనవచ్చును. "వల్లభాయి తల్లి 80 ఏండ్ల వృద్ధురాలు. ఆమె వంటచేసికొనుచుండగా, పోలీసువారన్నపు కుండను పడగొట్టి యన్నములోరాళ్లు, యిసుక, కిరసనాయిలు కలిపిపోయిరి. ఇవిగాక, గ్రామస్థులపై నెన్నో యత్యాచారములు గావింపబడినవి. 3 ఈ యుద్యమ ప్రారంభదశలో చిట్టగాంగు సైనిక శిబిరముపైన ఒక దండయాత్ర జరిగినది. అందులో కొంతమంది భారతీయయువకులు సైనికదుస్తులతోపోయి, చిట్టగాంగు సైనికులను కొంతమందిని కాల్చిచంపిరి. ఇందుల కతిభయంకరముగ చిటగాంగు పరిసరప్రాంతము లన్నింటియందునను ప్రతిక్రియలు గావింపబడినవి. 1921-22 సంవత్సరములమధ్య నైర్లండు దేశమునందు జరుపబడిన బ్లాకు అండ్ టాన్సు (Black and Tons) కృత్యముల నవి జ్ఞాపక మొనరించినవి.4 పన్నుల

---

1. See. Brailsford letter dated 1931 January 12th to the Manchester guardian.
2. See. The questions and the replies in the Legislative Assembly Delhi regarding the firing on crowds 1930-6-15 especially regarding Peshaver firing.
3. See. Congress History P. 605.
4. See. Congress History P. 605.

నిరాకరణము — భూములను ప్రభుత్వము వశపరచుకొనుట, రైతులు వారివారి గ్రామాదులనే వీడి స్వదేశసంస్థానములలోనికి వలసపోవుట మొదలగు చిరస్మరణీయమగు కృత్యములను నాడు భారతీయులొనరించిరి. పంజాబు సెనేటు హాలులో గవర్నరుపైన తుపాకి కాల్చబడినది. దానికి ప్రతిఫలముగ పలువురపై ప్రభుత్వము చర్య దీసికొనినది. ఈ సత్యాగ్రహోద్యమమున భారతీయ నారీమణులు ప్రదర్శించిన కష్టసహిష్ణుత యనుపమానము. దేశభక్తి నిరుపమానము.

ధైర్యస్థైర్యత్యాగములు సువర్ణాక్షరములతో చరిత్రయందు వ్రాయదగినవి. బోర్సాదునందు స్త్రీలు 1931 జనవరి 1వ తేదీన నొకయుత్సవము జరుపదలచిరి. పోలీసువా రాయుత్సవమును ప్రతిఘటింపదలచిరి. ఆస్త్రీలు దాహమయినప్పుడు త్రాగుట కక్కడక్కడ మంచినీళ్ళకుండ లుంచుకొనిరి. పోలీసువారు మందాకుండలను పగులగొట్టిరి. స్త్రీలను బలవంతముగ చెదరగొట్టిరి. స్త్రీలు క్రిందపడిపోయిరి. పోలీసువారు స్త్రీల రొమ్ములపైన బూట్లతో నెక్కి త్రొక్కిరని స్పష్టముగా నిందారోపణ చేయబడినది. ఇది పోలీసుల బలవంత క్రూరకృత్యము.[1]

ఆబాలగోపాలము, స్త్రీపురుషాదులు, లక్షలు కొలదిగ స్వాతిక నిరోధదీక్షలో తన్మయులైరి. సత్యాగ్రహోద్యమోద్భవ సాత్విక తపోజ్వాలలకు ధర్మపరాయణమైన మానసలోకమంతయు తహతహ లాడసాగినది.

సైమను సంఘమును గురించియు, సైమను సంఘోపసంఘములను గురించియు, ప్రసంగించువారే లేరు. 1929 సంవత్సరాంతమునందే కేంద్రసలహాసంఘముతోపాటు రాష్ట్రసలహాసంఘముల నివేదికలుగూడ ప్రకటింపబడినవి.

42 సైమనుసంఘ కేంద్రసలహాసంఘ నివేదిక.

23వ డిశంబరు 1929 సంవత్సరమున సైమనుసంఘ కేంద్రసలహాసంఘ నివేదిక ప్రకటింపబడినది. ఈనివేదికను సైమన్‌సంఘనివేదిక జతపరచుటకీ సంఘమున కిష్టము లేక, ప్రత్యక్షముగా పార్లమెంటుసభకు పంపవలసినదిగ, హిందూదేశప్రభుత్వము కోరబడినది.

1. See. Congress History P. 614.

(1) ఈనివేదికయందు గమనించవలసిన యొక ముఖ్యసూచనగలదు. బ్రిటిష్‌పార్లమెంటువారు, విస్పష్టముగ, భారతరాజ్యాంగ సంస్కరణముల యాదర్శము, నధినివేశ స్వాతంత్ర్యమును బడయుటయేనని ప్రకటింపవలసినదిగ నివేదికయందుగలదు.

(2) రాష్ట్రప్రభుత్వములకు స్వాతంత్ర్య మొసగవలెనని వ్రాయబడినది.

(3) కేంద్రప్రభుత్వమును, శాసనసభకు, బాధ్యతాయుతప్రభుత్వముగ నొనరింపవలెనని సూచింపబడినది.

(4) వంగదేశము నందుమాత్రము, లా, ఆర్డరులు మంత్రిపర మొనరింప రాదని యీ నివేదికయందు గలదు.

(5) సంయుక్తరాష్ట్రములలో రెండవశాసనసభ యవసరమనబడెను.

(6) రాష్ట్రములలో గవర్నరుగారు, శాసనసమ్మతమగు నధికారిగ మాత్రముండవలెను. (Constitutional Head) మంత్రివర్గముతో, మతము, కేంద్రప్రభుత్వ వ్యవహారములు, ఇతరరాష్ట్ర వ్యవహారముల విషయమున భేదాభిప్రాయము సంభవించుచో గవర్నర్ జనరల్‌గారి నిర్ణయమునకు పంపవలెనేకాని గవర్నరుగారు స్వేచ్ఛతో వ్యవహరించుటకు వీలులేదు.

(7) 1951 వ సంవత్సరములోపుగ, మెజారిటీదీరిన జనసంఖ్య కంతకు, వోటుచేయునర్హత లభింపజేయవలెనని నివేదికయందు వ్రాయబడెను.

(8) ప్రభుత్వమువారే, శాసనసభలయందు, సభ్యులను నిర్ణయించు పద్ధతి విరమింపబడవలెననెను.

(9) ఆంగ్లో ఇండియనులకు, నాంగ్లేయులకు మదరాస్ రాష్ట్రమున, నస్పృశ్యులకు, బర్మాయందు, కరెనులకు, భారతీయులకు మాత్రము ప్రత్యేక నియోజకవర్గము లుండవలెను. ఇతరులెవరికి ప్రత్యేక నియోజకవర్గ ముండరాదు. ఇతర యల్ప సంఖ్యాకులకు, శాసనసభా స్థానములు ప్రత్యేకింపబడవలెను. ఈ సలహాసంఘమునందలి యల్పసంఖ్యాకులు, ప్రత్యేక నియోజకవర్గములెవరికిని నుండరాదని వ్రాసిరి. రాజా నవాబాలీ గారు, వంగరాష్ట్రమునను గూడ లా ఆర్డరులను ప్రత్యేకించరాదని వ్రాసిరి.

(10) కేంద్రప్రభుత్వమున, సైనిక సంరక్షణ, విదేశవ్యవహారములు,

స్వదేశసంస్థానము విషయములు మినహా, యితర విషయములన్నియు మంత్రి వర్గమువారి యధికారమునకు లోనొనరింపవలెనని వ్రాయబడెను.

(11) హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శియొక్క సలహాసంఘము రద్దుచేయబడవలెను. రద్దుచేయబడకపోయినచో సగమువంతు సభ్యులు భారత శాసన సభా సభ్యులుగ నుండవలెను.

(12) భారతదేశమున కధినివేశ రాజ్యాంగ ప్రతిపత్తి లభించువరకు, కొందరు భారతీయులు, బ్రిటిషు పార్లమెంటు సభ్యులుగానుండవలెను.

(13) మరియు, నీ సంఘమువారు, సుప్రీంకోర్టును సైనికశిక్షణ కళా శాలయు స్థాపింపబడవలెననిరి.

(14) ప్రాథమికహక్కులను నిరూపించుచు, వాటిని రాజ్యాంగశాసనము నందు చేర్చవలెననికూడ, నీ సంఘమువారు వ్రాసిరి.

(15) అన్నింటికంటె ముఖ్యమగు మరియొక సూచనగలదు. వారి విచారణతో నిమిత్తములేకుండగ, భారతదేశరాజ్యాంగవిధానమును, భారతీయులే యభివృద్ధిగావించుకొనుటకు, వీలగు నిట్టి, నియమములను, రాజ్యాంగ శాసనమునందు స్పష్టీకరింపవలెనని, యీ సంఘమువారు వ్రాసిరి.

ఈ సలహాసంఘ నివేదికయందలి సూచనలును భారతదేశ మెంతమాత్రము గమనించలేదు.

43
సైమన్‌సంఘ నివేదిక సూచనలు

1930 సం॥ జూన్ మాసమునందు, సైమన్‌సంఘ నివేదిక (రెండు సంపుటములు) ప్రకటింపబడినది. ఇందలి ముఖ్య సూచనలేమి?

(1) రాజ్యాంగ శాసనమునందే, సాధ్యమగునంతవరకు రాజ్యాంగ ప్రతిపత్తి, తనంతట తానభివృద్ధిజెందు సావకాశ మేర్పరుపవలయును. (Should as far as possible, contain within itself provision for its own development)[1]

1. Simon Report Vol. II page 5.

(2) బ్రిటిష్ హిందూదేశమేకాక, స్వదేశసంస్థానములతోఁగూడిన, హిందూదేశమునంతయు నొక్కటే రాజ్యభాగముగ, బ్రిటిష్ సామ్రాజ్యమునందితర రాజ్యములతోపా టుంచుటకు వీలగునట్టి రాజ్యాంగ విధానమును నేము నిరూపింపవలసియున్నది. 1

(3) స్వదేశ సంస్థానములును—బ్రిటిష్ హిందూదేశమును, రెండుకలిసి, మునిగిన మునుగవలెను. తేలిన తేలవలెను. (Must stand or fall together).

(4) ఈకారణములవల్ల హిందూదేశమునందు సంయుక్తరాష్ట్రరాజ్యాంగ ముండవలయును.

(5) ప్రస్తుత రాష్ట్రప్రభుత్వముల క్రిందనున్న రాష్ట్రములను సక్రమముగ విభజించి, నూతనరాష్ట్రములను నిర్మించవలసియున్నది.

(6) హిందూదేశమున నాంగ్లేయసైన్యము చాలకాల ముండకతప్పదు.

(7) అల్పసంఖ్యాకుల సంరక్షణ యత్యావసరము. అందువల్ల నిష్పక్షపాతముగ నుండగలిగిన గవర్నర్‌జనరలునకు, గవర్నర్లకు నల్పసంఖ్యాకుల సంరక్షణాధికార మొసగవలయును.

(8) రాష్ట్రములలో నన్ని వ్యవహారములు మంత్రులపర మొనరింపవలయును. కాని కొన్నిసంరక్షణాధికారములు గవర్నర్‌గారి కొసంగకతప్పదు.

(9) రాష్ట్రములలో రెండవ శాసనసభను స్థాపించు విషయమై నిర్ణీతాభిప్రాయ మొసగబడలేదు.

(10) కేంద్రప్రభుత్వమున ద్వంద్వపరిపాలన సూచింపబడెను. గవర్నర్ జనరల్‌గారికి, స్వేచ్ఛతో వ్యవహరింపగల కొంత సంపూర్ణాధికార మొసగవలసియున్నది.

(11) పార్లమెంటునకు హిందూదేశముపైగల సర్వాధికారము నేము సడలించుటకు వీలులేదు.

(12) సర్వసైన్యాధిపతి, భారతశాసన సభాసభ్యుడుగా నుండరాదు గవర్నర్ జనరల్‌గారి కార్యనిర్వాహకవర్గ సభ్యుడుగా నుండరాదు. ఈ సర్వసైన్యాధిపతి, తన మహత్తరవిధులను, వీటిలో సభ్యుడుగా లేనియెడలనే సక్రమ

1. See. page 9 Simon Report Vol III.

ముగా నిర్వహించగలడు. (His immensely important and generous duties are better discharged outside it.)

(13) హైకోర్టులపై సర్వాధికారము కేంద్రప్రభుత్వమున కొసగవలెను. రాష్ట్రప్రభుత్వములకు సంబంధ ముండరాదు. వీటికగు కర్చుగూడ కేంద్ర ప్రభుత్వమే భరింపవలసి యున్నది.

(14) హిందూదేశరాజ్యాంగకార్యదర్శికి గవర్నర్ జనరల్ గారిపై యధికార మొసగబడినది. రాష్ట్రప్రభుత్వములపై ప్రత్యక్షముగ నధికార మొసగబడ లేదుగాని గవర్నరుగారి ప్రత్యేకాధికారములకు సంబంధించినంతవరకు, హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శికిగూడ గవర్నర్ గారిపై యధికారము కలదు. రాజ్యాంగకార్యదర్శియొక్క "మంత్రాంగసభ" లో సభ్యులసంఖ్య తగ్గింపబడ వలెను. ఈ మంత్రాంగ సభకు సలహానొసగు నధికారముమాత్రమే గలదు. కాని సివిల్ సర్వీస్ ఉద్యోగస్థులపైనను, భారతశాసన సభవారి యనుమతితో నిమిత్తములేని, హిందూదేశ ప్రభుత్వ వ్యయమునకును సంబంధించిన విషయములలో మంత్రాంగ సభవారికి పెత్తనముండును.

ఈనివేదికను నిరసించువారేగాని, యామోదించువారు లేకపోయిరి. దూషించువారేగాని భూషించువారొకరునులేరు. మితవాదులుగూడ సైమన్ సంఘనివేదిక రౌండుటేబిల్ సమావేశమునందు యోచింపవలసిన ప్రధానాంశము కాగూడదనిరి. ఈషరతును ప్రభుత్వమువారంగీకరించుట తప్పనిసరియైనది. కనీసము సైమన్‌గారిని రౌండుటేబిల్ సభ్యులలో నొకరుగ నియమించుటకు గూడ సాహసింపజాలక పోయినది. ఇందులకు భారతీయుల దృఢతరాభిప్రాయమే కారణము. భారతదేశమందు విజృంభించిన శాసనోల్లంఘనమే మూలము. (సైమన్‌సంఘముతోబాటు, విద్యాభివృద్ధిని విచారించిన, హిరటాగు కమిటీ నివేదికయు (1 వ అక్టోబరు 1929) స్వదేశసంస్థానములనుగూర్చి విచారించిన బట్లరు కమిటీనివేదికయుగూడ ప్రకటింపబడినవి.)

44 కేంద్రప్రభుత్వ సూచన.

సైమనుసంఘనివేదికపై, హిందూదేశప్రభుత్వము, 20 వ సెప్టెంబరు 1930 వ సంవత్సరమున తమయభిప్రాయమును బ్రిటిష్‌ప్రభుత్వమువారికి పంపినది.

(1) హిందూదేశమునందు సీమవారెందుల కుండవలయునో, వీలయి

నంతవరకు విస్పష్టముగా చెప్పవలసియున్నది. సీమవారి సంరక్షణతో, నిమిత్తములేని విషయములలో హిందూదేశము తనవ్యవహారముల తాను చక్క-బెట్టుకొను స్వాతంత్ర్యము గలిగియుండుననని వెల్లడించవలసియున్నది. బ్రిటిష్ ప్రభుత్వము కొన్ని ముఖ్యవిషయములలో నిర్ధారణ గావించుకొనవలసి యున్నది. ఎట్లన.

(అ) విదేశదండయాత్రలనుండి హిందూదేశము సంరక్షింప బడవలెనన్న విస్తారముగ నేటివలెనింకను చాలకాలమువరకు హిందూదేశ మాంగ్లేయ సైన్యముపై నాధారపడవలసియున్నదని నిశ్చయింపవలసియున్నది.

(ఆ) యుద్ధములలో జోక్యము కలిగించుటకు సావకాశముగల, విదేశ వ్యవహారములు, బ్రిటిష్ప్రభుత్వమువారి యధికారమునకు లోబడి నిర్వహింపబడ వలసియున్నది.

(ఇ) హిందూదేశమునందు, శాంతిని కాపాడుటకు బాధ్యతవహించ వలసియున్నది.

(ఈ) ఇతరుల కొసగవలసిన తీర్మానములకై తగు నేర్పాటులొనరించు టయు, వలసిన హిందూదేశార్థికస్థిరత్వమును — పరపతియును — భద్రపరుప వలసియున్నది.

(ఉ) అల్పసంఖ్యాకులకు తగురీతి, సౌకర్యము లొసగూర్పవలయును.

(ఊ) ఏసంఘముపట్లగాని, యక్రమమగు విచక్షణ చూపించకుండ నుండు నట్లేర్పరుచుట.

ఈ విషయములలో, ప్రస్తుతపరిస్థితుల యందు బ్రిటిష్‌పార్లమెంటు వారికే నిర్ణయాధికారము లుండవలెనని హిందూదేశ ప్రభుత్వమువారు తమ నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చిరి.

(2) రాష్ట్రప్రభుత్వములకు స్వాతంత్ర్య మొసగవలసియున్నది. (లా ఆర్డరులతో సహా)

(3) మదరాసు, బొంబాయి పంజాబు సంయుక్తరాష్ట్రములు అస్సాము రాష్ట్రములలో, రెండవ శాసనసభ యుండరాదని, ఆయా రాష్ట్రప్రభుత్వసూచన లతో హిందూదేశ ప్రభుత్వ మంగీకరించినది. ఇట్లే, బీహారు, ఒరిస్సా, బెంగాలు సంయుక్తరాష్ట్రములలో రెండవ శాసనసభ యుండవలెననియు న్యాయా

రాష్ట్రప్రభుత్వములు గావించిన సూచనలతో గూడ హిందూదేశప్రభుత్వ మంగీకరించినది.

(4) బర్మాను, హిందూదేశమునుండి, విభజింపవలెను. కాని యిట్లు విభజించుటకుముందు, హిందూదేశ ప్రజాభిప్రాయమును గమనించవలసి యున్నది.

(5) కేంద్రప్రభుత్వమునందుగల, యధికారమును, కొంత భారతశాసన సభ కొసగి, కొంత పార్లమెంటువారి వశమందుంచుకొనవలసి యున్నది. దంద్వముగ నుండుట తప్పనిసరి, కేంద్రీకరణ ప్రభుత్వముగనుంచి, కొంతవరకు, శాసన సభకు, బాధ్యత నొసగుటలో నీసమస్యా పరిష్కారము నెఱయగలము.

(6) ఏ రాజ్యాంగ విధానమునైనను, కాలక్రమమున సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వ మగుటకుగల సావకాశము గలిగియుండుటనుబట్టియే భారతీయులు దానిని విమర్శించెదరు. కేంద్రీకరణ ప్రభుత్వ విధానమునందే, యిట్టి నైసర్గికాభివృద్ధికి స్థానముగలదు.

హిందూదేశ ప్రభుత్వము ప్రకటించిన యీయభిప్రాయములు గోడమీద పిల్లివాటముగ నున్నవి. "ఈ హిందూదేశ ప్రభుత్వాభిప్రాయ నివేదికవలన తెలియుచున్న దేమి? లార్డుఇర్విన్‌గారు గాని బ్రిటిష్‌ప్రభుత్వము గాని, రౌండ్ టేబిల్ సమావేశమునకెట్టి సూచనలుగాని యొసగుట కిష్టపడుటలేదని తెలియుచున్నది. ఈనివేదిక, బహుజాగరూకతతో వ్రాయబడినది. దీనికెట్టి రంగు గానిలేదు. ఏవిషయముపైనను ఏవిధమగు నిర్ధారణయు నిందు చేయబడలేదు. బహుశా సైమను నివేదికను బుట్టదాఖలు చేయుటయే యీ నివేదికయొక్క యంతరార్థమువలె దోచుచున్నది." అనియొక యింగ్లీషు పత్రిక వ్రాసిన వ్రాత నిశ్చయము.1 హిందూదేశ ప్రభుత్వమువా రొసగిన యీ యభిప్రాయములతో భారతీయులు సంతృప్తి పొందలేదు.

ఒకవంక, మొదటి రౌండుటేబిల్ సమావేశము సమీపించుచున్నది. వేరొకవంక, దేశమునందు సత్యాగ్రహోద్యమము విచ్చలవిడిగ విజృంభించు

1. London Nov. 22. 1930 Editorial.

చున్నది. మరియొకవంక ప్రభుత్వనిర్బంధ విధానము చెలరేగినది. గత్యంతర మేమి?

45
సప్రూ జయకరు రాయబారములు

కాంగ్రెసు ప్రాతినిధ్యము వహించని రౌండుటేబిలు సమావేశము నిరుపయోగమని భారతదేశ మందలి రాజకీయ పక్షము లన్నియు నెరుంగును. హిందూదేశ ప్రభుత్వ మీవిషయమై పూర్తిగ గుర్తించకపోలేదు. ఈ పరిస్థితులయందుననే సప్రూ జయకరులు రాయబారులుగ వ్యవహరించి యుండిరి. 1930 జూలై ఆగస్టునెలలో రాయబారములు జరిగినవి. నిష్ఫలము లైనవి. 1930 జూను 20 వ తేదీని మోతీలాలు పండితుడు కారాగృహ మందు స్లోకోంబుగారితో కొన్నిషరతులను మాట్లాడియుండెను. ఈ షరతులను మోతీలాలు పండితుడును, జయకరుగారును గూడ చర్చించి యుండిరి. స్లోకోంబుగారి యుత్తరము ననుసరించిన మోతీలాలు షరతుల నాధారముగ జేసికొని, సప్రూ జయకరులు రాయబారమును సాగించిరి. వైస్రాయిగారిని కలిసికొనిరి. నెహరూ పండితుడే యీ షరతుల ననుసరించి కాంగ్రెసధ్యక్షుడగు జవహరులాలు దగ్గరకును, మహాత్ముని కడకును, రాయబారిగా పోవుట కంగీకరించియున్నారు. "ఆంగ్లేయ ప్రభుత్వమును — ఇండియా ప్రభుత్వమును భారతదేశమునకు సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వమును ప్రోత్సహించెదమని రహస్యముగ వాగ్దానము చేయవలయుననియు, రౌండుటేబిలు కాన్ఫరెన్సువారు చేసే సిఫార్సులకుగాని, తదుపరి, పార్లమెంటు, వారిసిఫార్సులయెడ నవలంబించు విధానమునకుగాని ప్రస్తుతము సంబంధము లేదు. ఇండియా ప్రభుత్వమువారును, ఆంగ్లేయ ప్రభుత్వమువారును రహస్యముగ చేయు వాగ్దానము రౌండుటేబిలు సభవారి షరతులకును, కొన్నిమార్పులకును లోబడియుండవచ్చును." ఇవి మోతీలాలుని షరతులు. ఈషరతులు మహాత్ముడు స్లోకోంబీ కొసగిన షరతుల కంటె తక్కువగనున్నమాట వాస్తవము. అందువల్లనే మధ్యవర్తులీషరతుల నాధారముగగొని యప్పటికి జెయిలునందు ప్రవేశించిన మోతీలాలు, జవహరులాలు, గాంధీలను దర్శించుటకై రాజప్రతినిధి యనుజ్ఞను పొంద 13 వ జూలై 1930 తేదీని జాబు వ్రాసియుండిరి. ఇందులకై వైస్రాయిగా రొసగిన సమా

ధానము — అధికార దురహంకారమును లోకమునకు వెల్లడించినది. "భారతీయులు వారి స్వంతవ్యవహారములను చాలవరకు పరిపాలించుకొనునప్పుడు భారత ప్రజలకు సహాయమొనరించుటకు" రాజప్రతినిధి వాగ్దానమొసగినాడు. ఇందు స్వపరిపాలనమును గురించి, అంతవరకు గావించిన ప్రసంగములు కూడ నిష్ఫ్కారినవి. దిగజారినవి. మోతీలాలుని రాజీ షరతులు కాంగ్రెసుయొక్క యశక్తతకు చిహ్నములుగ నిర్విన్ప్రభు భావించుటయే యీ సమాధానము నకుగల కారణము. అయినను, యీ జాబుల నంటిని గైకొని గాంధీని జూలై 23, 24 వ తేదీలలో ఎఱవాడ జైలునందునను, 27, 28 వ తేదీలలో జవహరు లాలు, మోతీలాలులను రానీ జైలునందునను రాయబారులు దర్శించిరి. తిరిగి, జయకరు జూలై 31, ఆగష్టు 1, 2 లలో గాంధీని సందర్శించినాడు.

"ఇష్టమయినప్పుడు సామ్రాజ్యమునుండి విడిపోవుటకు భారతదేశమునకు హక్కు లేకపోయినయెడలను, తానిదివరకుజెప్పిన 11 విషయములలోను భారత దేశము సంతృప్తికరముగా పరిష్కరించుకొనుట కధికారము లేకపోయినను, తనకారాజ్యాంగ నిర్మాణవిధాన మక్కరలేదని గాంధీ కడపటిమాటలు జెప్పెను. ఆంగ్లేయుల హక్కులను నాంగ్లేయుల కీదివఱకొసగబడిన యధికారములను విచారించుటకొక స్వతంత్రసంఘము ముండవలెనని గూడ గాంధీ కోరియున్నాడు. ఈయుత్తరప్రత్యుత్తరముల ఫలితముగ ఆగష్టు 14 వ తేదీని యెఱవాడ జెయిలులో గాంధీ, నెహ్రూ, వల్లభాయిపటేలు, డాక్టరుసయ్యదుమహమ్మదు, జయరామదాసు దౌలత్ రాము, సరోజినీనాయుడు, ఒకపక్షమునను, రాయబారులు మరియొక పక్షముననుగలిసి సంధిషరతులను చర్చించిరి. యెఱవాడ జైలునకు యితరరాష్ట్రములందున్న పైనాయకులందరను బదిలీచేసిరి. ఈచర్చకు ఫలితముగ గాంధీగారు సూచించిన పైషరతులన్నీ మరల నిరూపింపబడినవి. ఇందులకు రాజప్రతినిధి 28 వ తేదీని సమాధానమొసగియుండెను. ఇర్విన్ప్రభువు వారొసంగిన ప్రత్యుత్తరము ననుసరించి రాయబారమును సల్పుటకే హిందూదేశ ప్రభుత్వమునకయిష్టముగనున్నదని నెహ్రూలు విశ్వసించిరి. ఈవిధముగ సప్రూ జయకరు రాయభారములు విఫలములైనవి. వైస్రాయిగారు తమ మొదటి సమాధానమున స్వరాజ్యసమస్యను దిగజారిచి వ్రాయసాహసించినాడు. ఇందులకు

సమాధానముగ మహాత్ముఁడు సంపూర్ణ స్వాతంత్ర్యాధికారము కావలయునని నిరూపించినాఁడు. వైస్రాయిమతమునకును — గాంధీగారి వాంఛితమునకును, సహస్రయోజనముల దూరమైనది. ఇక సంధికుదురుటెట్లు? అయినను, హోరేసు. జి. అలెగ్జాండరుగారుకూడ గాంధీ వైస్రాయిల మధ్య సంధి కుదుర్చవలెనని ప్రయత్నించినాఁడు. ఈసరికి ఇర్విన్‌ప్రభువు 12 ప్రత్యేకశాసనములను ప్రకటించినాఁడు. (Ordinances). అయినను, రాజ్యాంగసంస్కరణములు — నిర్బంధ విధానమునవలంబించు ఆంగ్లేయరాజనీతినే ఇర్విన్‌ప్రభువాచరింప సంకల్పించినాఁడు. "మనము శాసనోల్లంఘనమును నెంతనిరసించినప్పటికి భారతీయ భావ వికాసమునకున్న భారతజాతీయతాశక్తి యల్పమనిమాత్రము తలంపరాదు." అని కలకత్తాసంఘ సమక్షమునం దుపన్యసించినాఁడు. భారతీయశక్తిని గుర్తించుట విధియగుటయే యిందులకు కారణము. ఒకవంక ప్రథమ రౌండుటేబిలు సమావేశమునకై రాజ్యాంగకార్యదర్శి సర్వప్రయత్నములను సీమలో గావించుచున్నాఁడు. వేరొకవంక భారతావనియందు రాజప్రతినిధి తన సునిశితఖడ్గధారను తీవ్రతమముగ వినియోగించుచున్నాఁడు.

46
ప్రథమ
రౌండుటేబిలు
సమావేశము.

ఇట్లు రాజ్యప్రయత్నములు విఫలమయినను, మితవాదులును, కొందరుప్రభుభక్తి పరాయణులును, బ్రిటిషు ప్రభుత్వపు టాహ్వానమునంగీకరించి మొదటి రౌండుటేబిలు సమావేశమునకు నెడలిరి. 12 వ నవంబరు 1930 వ తేదీ నుండి 10 వ జనవరి 1931 వఱకు లండనునగరమందు రౌండుటేబిలుసభ సమావేశమయినది. ఈసమావేశమందు 16 గు రాంగ్లేయ ప్రతినిధులుగలరు. ఇందు 8 గురు కార్మికపక్షమువారు గలరు.

స్వదేశసంస్థానముల వారు 9 సంస్థానాధిపతులు 7 గురు సంస్థానోద్యోగులును — ప్రాతినిధ్యము వహించిరి. 57 మంది బ్రిటిష్ హిందూదేశమునకు ప్రాతినిధ్యము వహించిరి. ఈప్రతినిధులలో కాంగ్రెస్ ప్రతినిధులొక్కరును లేరు. ఏ రాజకీయసంస్థతో, నొడంబడిక గావించుకొనుచో, నాయొడంబడికను ప్రజలామోదించెదరో, యారాజకీయసంస్థచే బహిష్కరింపబడిన సమావేశమున కేమియు విలువలేదని బ్రిటిష్‌రాజకీయవేత్త లెరుంగుదురు. భారతీయ మిత

వాదులకును తెలియనిదిగాదు. మఱియు శాసనోల్లంఘనోద్యమము పట్టణముల యొక్క వర్తకమును విధ్వంస మొనర్చుచున్నది. ఆర్థికస్థితికి మితిలేని భారమైనది. పోలీసుశాఖ కమితకష్టముగలిగించినది. కారాగృహములన్నియు, ఖాళీలున్నంతవరకు నిండిపోయినవి. దుర్భరవ్యయకారణముగనున్న సివిల్‌పరిపాలనకే వ్యయము దుస్సహముగ జతపడినది.[1] ఈజ్ఞానమే మేక్డనాల్డుమంత్రి రౌండ్ టేబిల్ సమావేశానంతరము 19 వ జనవరి 1931 వ తేదీన గావించినప్రకటనకు కారణము.

"నేను చెప్పగలిగిన కడపటిమాట యిదియే. మనమందరముకలిసి చేసిన కృషిఫలితముగ బ్రిటిష్‌సామ్రాజ్యమునందధినివేశరాజ్యాంగ ప్రతిపత్తి యనుభవించుచున్న దేశములతోపాటు నేడు హిందూదేశము దేనిననుభవించుటలేదో, దానిని హిందూదేశముగూడ పొందగలదని యాశించుచున్నాను. విశ్వసించుచున్నాను. ప్రార్థించుచున్నాను. దీనికి సంబంధించి, కష్టనిష్ఠూరములు బాధ్యతలను మాత్రమేకాక, బాధ్యతాయుత ప్రభుత్వముయొక్క గౌరవమును, సంతోషమునుగూడ పొందగలరు"[2] ఈ ప్రకటనయందుగల విస్పష్టార్థమున భారతదేశ, సంక్షుభితచిత్త మొకింత శాంతిబొందిన దనవచ్చును.

1
1 వ రౌండుటేబిలు సమావేశము— ఫలితములు

రౌండుటేబిల్ సమావేశమునందు చర్చింపబడిన విషయములుగాని, చేయబడిన నిర్ణయములుగాని, భారతదేశమందు విశ్వాసమునుద్భవింప జేయజాలక పోయినవి. (ఫెడరల్) సంయుక్తరాష్ట్ర ప్రభుత్వరాజ్యాంగ విధానముపట్ల భారతదేశము సుముఖముగ లేదు. హఠాత్తుగ, మొదటిరౌండుటేబిల్ సమావేశమునందీవిషయము మొలకెత్తినది. సప్రూ

1. See. Page 304. Constitutional History of India by A. B. Keith.

2. Finally I hope and I trust and I pray that by our labours together India will come to possess the only thing which she now lacks to give her the status of a dominion amongst the British Commonwealth of Nations - What she now lacks for that the responsibilities and the cares, the burdens and difficulties but the pride and honour of the Responsible Government."

గారిందులకు కారకులు. బికనీరు మహారాజుగారు, సప్రూగారి యాహ్వానమున కంగీకరించిరి. సంయుక్త రాష్ట్ర ప్రభుత్వవిధానమంతయు సంతృప్తికరముగనున్నచో, నధిక సంఖ్యాకములుగు, స్వదేశసంస్థానములందు భాగస్వాములుగ నుండునని బికనీరు మహారాజుగారు ప్రకటించిరి. జిన్నాగారును, శాస్త్రిగారును, తమ యనుభవజ్ఞానముతో, సంయుక్తరాష్ట్ర ప్రభుత్వవిధానము నంగీకరించలేదు. స్వదేశసంస్థానములతో గూడిన, సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమున, ప్రజాపరిపాలన సావకాశ మొసగుటకు లార్డుఇర్వింగు గారు కూడ నంగీకరించిరి. 9 ఉపసంఘములు నియమింపబడినవి.1

ఈయుపసంఘముల నిర్ణయములు, నిందుసూచింపబడిన, ప్రత్యేకాధికారములు, సంరక్షణములు, బాధ్యతాయుత పరిపాలనను బంధించివేయునట్లుగ నున్నది. అల్పసంఖ్యాకుల సమస్యాపరిష్కారము కాలేదు. ఈసమస్య పరిష్కారమైనగాని, కేంద్ర ప్రభుత్వమున, 'బాధ్యత' నొసగుటకు, మహమ్మదీయు లంగీకరింపలేదు. ఈపరిస్థితులలో, మొదటి రౌండ్ టేబిల్ సమావేశము, నిర్జీవమై, నిలుపుజేయబడినను మెక్డనాల్డు మంత్రిగావించిన కడపటిప్రకటనయే రౌండ్ టేబిలు సమావేశవిధానమునకు కొంతజీవము సంపాదింపగలిగెను.2

1. The Chairmen of the various sub Committees :- Federal structure sub Committee, Lard Lakey; Provincial and north-west Frontier sub committees- Mr. A. Henderson; Franchise and service sub-committees Sir William Jouria; Burma Sub Committee Earl Russel; Defence sub committee Mr, J. H. Thomas; Minorities sub committee. Prime Minister.

2. "Macdonald announced that his Majesty's Government had agreed that with certain safeguards during a period of transition "Responsibility for the Government of India should be placed upon legislatures central and provincial and that it will be a primary concern of his Majesty's Government to see that reserved powers are so framed and exercised as not to prejudice the advance of India through the new Constitution to full responsibility for her own Government.

"తాత్కాలికముగ నుండు కొన్ని సంరక్షణములతో హిందూదేశ ప్రభుత్వ నిర్వహణబాధ్యత, కేంద్ర రాష్ట్రీయ శాసనసభల కొసగబడును. మరియు ప్రత్యేకింపబడెడి యధికారములు, నూతన రాజ్యాంగ విధానమున హిందూదేశము స్వపరిపాలన గావించుకొనుటకు వలయు, సంపూర్ణ బాధ్యతను ప్రతిఘటించనిరీతిగ, నేర్పరుపబడి, యాచరింపబడును."

ఈవాగ్దానముతో గూడిన మెక్డొనాల్డు మంత్రి ప్రకటనము నాధారముగ గొని హిందూదేశమునుండి వెడలిన రౌండుటేబిల్ ప్రతినిధులు, కాంగ్రెస్ సంస్థకును - బ్రిటిష్ ప్రభుత్వమునకును రాజీ నేర్పరచుట కవస్థితి లభించినదని విశ్వసించిరి.

47 గాంధీ - ఇర్విన్ ఒడంబడిక. ఈ విశ్వాసమే, మొదటి రౌండ్ టేబిల్ సమావేశము నుండి హిందూ దేశమునకు - మరలినవెంటనే, సప్రూ జయకరులను రాజీకి బ్రయత్నింప, బ్రోత్సహించినది. ఈసారి వీరిప్రయత్నములు సఫలమైనవి. మహాత్ముడును వారి యనుచరులందరును విడుదల చేయబడిరి. కాంగ్రెస్ మహాసభతో బ్రిటిష్ ప్రభుత్వ మొడంబడిక గావించుకొనినది.1,

రౌండుటేబిల్ సమావేశమందు చర్చింపబడిన - రాజ్యాంగ విధానమును - ఇంకను చర్చించుటకై - బ్రిటిష్ ప్రభుత్వమువా రంగీకరించిరి. ఈ రాజ్యాంగ

1. As regards Constitutional questions the scope of future discussions is stated with the assent of his Majesty's Govt. to be with the object of considering further, the scheme for Constitutional Govt. of India discussed at the round table cenference. Of the scheme there outlined Federation is an essential part. So also are Indian responsibillty and reservations or safeguards in the interests of India for such matters as, for instance, defence, external affairs, the position of minorities, the financial condition of India and discharge of obligations. Steps will be taken for the participation of the representatives of Congress in the further discussions,

విధానమునందు సంయుక్తరాష్ట్ర, ప్రభుత్వవిధానము - ముఖ్యము. అదేవిధముగ బాధ్యతాయుత ప్రభుత్వమును - సంరక్షణలులేక ప్రత్యేకబాధ్యతలు. - హిందూ దేశ ప్రయోజనముకొరకు అనగా సంరక్షణ - విదేశవ్యవహారములు- నల్పసంఖ్యాకుల సమస్య భారతదేశపు ఆర్థికస్థితి (Financial condition of India). బాధ్యతలు నిర్వహణము మొదలుగాగల విషయములును ముఖ్యములు. కాంగ్రెసు ప్రతినిధులందరితోనుండి రాజ్యాంగవిధానసమస్యను పరిష్కరించుటలో సాధ్యానుకూల కేర్పాటు లొనరింపబడును. విదేశ వస్త్రబహిష్కరణ సిద్ధాంత మంగీకరింపబడి, పికెటింగుచేయుటకు సమ్మతింపబడెను. ఇవియే గాంధీ, ఇర్విను నొడంబడికయందలి షరతులు. ఈ సంధిషరతుల కిర్వి, గాంధీలిరువురును రాగలుగుటకు వీరిరువురును సుహృద్భావముతో నొండొరులు సంప్రదించుకొనిరి. మొట్టమొదట ఫిబ్రవరి 17 వ తేదీని మహాత్ము డిర్విను ప్రభువుతో ఢిల్లీలో ప్రసంగించెను. వరుసగ మూడుదినములిట్లు సంభాషించిరి. పిమ్మట కొన్ని రోజులు సీమవారియాజ్ఞకై సంభాషణము విరమింపబడినది. తిరిగి 27 వ తేదీని గాంధీ, వైస్రాయిలిరువురు కలిసిమాట్లాడిరి. ఈకాలములో సంధి కుదురదని దేశమంతయు తలంచుచుండిరి. కాంగ్రెసుకార్య నిర్వాహకవర్గసభ్యులు గూడ సంధి షరతులను కొందరు హృదయ పూర్వకముగా నామోదించియుండలేదు.1 1వ తేదీనాడు రాత్రి యిర్వినుగారితోను, 3వ తేది సూష్టరుగారితోను గాంధిజీ సంధి షరతులను సంభాషించియుండెను. 3వ తేదిరాత్రిగూడ గాంధీజీవైస్రాయిగారితో సంప్రదించి తుదిషరతుల కంగీకరించి మరలివచ్చినారు. గాంధీయిర్వినొడంబడికను కాంగ్రెసుకార్య నిర్వాహకవర్గమువారు మహాత్ముని సంకల్పబలమున నామోదించిరి. "గవర్నమెంటునకును, కాంగ్రెసువారికిని బహునేను దినములు మహావాదోపవాదములు జరిగినతరువాత నిర్ణయింపబడిన యొడంబడిక యిది. ఇది గాంధీఇర్వినుల యుదారసంకల్పముల ఫలము.2 ఈ రాయబారములలో

1. See Congress History.

2. See Congress History for the details of the Gandhi-Irwin pact p. 634-637-Govt. of India statement of 5-3-1931 on Gandhi-Irwin pact.

గమనింపవలసిన మరియొక ముఖ్యవిషయము గలదు. 1928 సెప్టెంబరు 13 వ తేదీని సాండర్సును హత్యచేసె ననబడుట లాహోరు కుట్ర కేసు ఖయిదీలు భగవత్సింగు, సుఖదేవు, రాజగురులకు విధింపబడిన మరణశిక్ష యంగీకరింపబడి వీరు ముగ్గురును నురితీయబడుదురని ప్రకటింపబడినది. వీరి నురిశిక్షనుండి తొలగించుటకై మహాత్ముడు ప్రయత్నించి విఫలుడైనాడు. ఇర్విను ప్రభు వురిశిక్షను తప్పింపగలవాడయ్యు "దెబ్బకు దెబ్బ" యను సిద్ధాంతములకు గురియయినాడు. గాంధీ యిర్వినొడంబడిక 1931 మార్చి 5 వ తేదీని సంతకములు చేయబడినవి. అనగా, 1931 వ మార్చి 4 వ తేదీని గాంధీగారి సందేశము వైస్రాయిగారికి రెజినాల్డు రేనాల్డ్సుగారిద్వారాచేరిన సంవత్సరమునకు సరిగ నీసంధి జరిగినది. ఈ సంవత్సరమును భారతదేశము అహింసాపూరిత రాజకీయవిప్లవమున మునిగి తేలినది. కరాచీ కాంగ్రెసు భగత్సింగు వాని యనుచరుల యురిని గురించిన ప్రభుత్వచర్య కసిదీర్చుకొనుట కొనరించబడెనని తీర్మానించుచు ప్రాణత్యాగమొనరించిన యీ యువకుల దేశభక్తిని, త్యాగమును, కొనియాడినది. గాంధీ - ఇర్వినొడంబడిక కరాచీకాంగ్రెస్‌లో నామోదింపబడుటయేకాక, ప్రాథమిక హక్కులును, విధులు - నందు నిర్వచింపబడినవి. ఈ నిర్వచనము భారతదేశస్వాతంత్ర్యప్రకటనమున కనుబంధముగ గ్రహింపబడియున్నది.

ఈసంధిషరతులపై కొందరి కాంగ్రెస్‌వాదులయందొకింత యసంతృప్తి జనించినది. నాటిపరిస్థితులలో మహాత్ముడు తనకర్తవ్యమును సక్రమముగనే నిర్వహించెనని పలువురు కాంగ్రెస్‌వాదులు విశ్వసించిరి. ఎట్లయిననేమి? మహాత్ముని నాయకత్వమందుగల విశ్వాసముచే, 31 మార్చి, 1931 సం॥న గాంధి యిర్వినొడంబడికను కరాచీ కాంగ్రెసు మహాసభ యామోదించినది.

"ఈయొడంబడిక గవర్నరుజనరల్‌గారికి, నిశ్చయముగు విజయమని యంగీకరింపక తప్పదు. కాని యొకప్రభుత్వముతో, దానిరాజకీయజీవితమును గురించి, యొడంబడిక గావించుకొనుటయు, నొకభారత జాతీయనాయకునిశక్తికి, పేర్కొనదగినగౌరవమనిగూడ చెప్పవలసియున్నది." అని యీయొడంబడికను గురించి కీత్ గారు వ్రాసిరి.[1] కాలచక్ర పరిభ్రమణమున లభించిన విషయ జ్ఞానమువలన

1. See Page 304. A. Constitutional History of India by Keith.

నేను, గాంధియిర్వినొడంబడిక బ్రిటిష్‌రాజనీతికి వన్నె తెచ్చినదని యేచరిత్ర కారుడు వ్రాయకతీరడు. కాని, మహాత్ముని సత్యాగ్రహోద్యమ ప్రబలశక్తి వల్లనే, ఇర్వినుప్రభు వొడంబడిక చేసికొనుట కొడంబడక తప్పలేదనుటయు — నుత్కృష్ట కాని సత్యము.

ఈ యొడంబడిక ననుసరించి, రెండవరౌండ్ టేబిల్ సమావేశమునందు పాల్గొనుటకు కాంగ్రెస్ మహాసభ యంగీకరించినది. మహాత్మాగాంధిగారొక్కడే, కాంగ్రెస్ మహాసభపక్షమున, ఏకైక ప్రతినిధిగ రౌండ్‌టేబిల్‌సభకు పంపబడెను. మహాత్ముడు తన విధిని సక్రమముగ నిర్వహించెననియే పలువుర విశ్వాసము. కాని మహాత్ము నొక్కనిమాత్రమే పంపుట యనాలోచితమని తలంచినవారు గూడగలరు. "గాంధిగారి నొక్కరినే కాంగ్రెస్‌ప్రతినిధిగ సీమకు పంపుటయొక గొప్పపొరపాటు. గాంధీజీ కాంగ్రెసుయొక్క, పరిపూర్ణస్వరూపమునంతకు ప్రాతినిధ్యము వహింపక, నొక్కవిషయమున మాత్రమే ప్రాతినిధ్యము వహింప గలిగెను. ఆర్థిక, సాంఘిక, రాజకీయసమస్యలలో గాంధిజీతో, నాయన, ముఖ్యానుచరవర్గమే తీవ్రభేదాభిప్రాయము గలిగియున్నది". అని సుభాష్‌చంద్ర బోస్‌గారు వ్రాసిరి. 1

ఈ యొడంబడికయందలి జయాపజయములనుగురించియు, లాభాలాభము లను గురించియు, సక్రమముగ నర్థమొనరించుకొనుటకు మహాత్ముడు, 1931 మార్చి 5 వ తేదీని గావించిన ప్రకటనమే, యుత్తమ సాధనము.

"ఇట్టి స్వభావముగల యొడంబడికలలో నేపక్షమువారు విజయులో నిర్ణయించుట శక్యముగాదు. ఉచితమునుగూడ గాదు. విజయ మనునది యున్నచో, నది యుభయులకును జెల్లును. కాంగ్రెసు విజయము నెన్నడును గోరియుండలేదు. కాంగ్రెసు స్వభావము నిశ్చిత లక్ష్యయుక్తము. ఆ లక్ష్య మును జేరువరకు కాంగ్రెసునకు విజయమనునది లేదు.......ఈ యొడంబడిక కు మహోత్సాహమునొందు స్త్రీ పురుషులున్నను, దీనివలన నాశాభంగము

1. See the Indian struggle P. P 247-61 by Subash Bose. quoted by

నొందినవారుగూడ నున్నారని నేనెఱుంగుదును......పూర్ణస్వరాజ్యమే కాంగ్రెసు యొక్క లక్ష్యము. అది సంపూర్ణస్వాతంత్ర్యమని యాంగ్లభాషాసాంప్రదాయము ననుసరించి నిర్వచింపబడుచున్నది. అది భారతజాతి జన్మహక్కు. ఒక్క భారతజాతికే కాదు. జాతిపదవాచ్యమైన యే జాతి కైనను, నది జన్మహక్కే. మనోమోహనమైన, యీ శబ్ద మీ యొడంబడికలో నెచ్చటను గానరాదు. దానిని గుప్తముగా దాచియుంచిన సూత్రము ద్వంద్వార్థమున కవకాశ మీయగలుగుచున్నది......కాంగ్రెసువారు తమ వాదమును రౌండు టేబిలు సభచే నంగీకరింపజేయ గల్గినచో, దానికి పూర్ణ స్వరాజ్యమే ఫలిత మగునని నేను చెప్పుచున్నాను......'' ఈ విధముగ మహాత్ము డాంగ్లేయ రాజనీతియందు పునరుద్భవించిన విశ్వాసపూరితుడై యొడంబడిక నంగీకరించి యున్నాడు. ఈవిశ్వాసోద్భవమున కిర్వినుగారి మహా సామర్థ్యమే కారణ మనుట నిశ్చయము.

"ఇంతకును భారతదేశపు గోచిపాతరాయడు వైస్రాయిభవనపు మెట్లపై చిరికాళ్ళతో నడుగులిడుటయే కాక సెంటుజేమ్సు భవనమునందు సమాన ప్రతిపత్తితో, సంధిచేయ రాయబారియై యాంగ్లేయ ప్రతిష్టను భంగ మొనరింప వలసిన విధియుండుటచే నీ గాంధీ యిర్విను నొడంబడిక యిట్లు సంభవమైనది."[1]

ఈ యొడంబడిక మహాత్ముడు కాంగ్రెసు ప్రతినిధిగ లండను నగరమునకు ప్రయాణ మగుటకు పూర్వమే భగ్న మొనరింపబడునని దేశమంతయు భయభ్రాంతమైనది. ఎట్లో, విచ్ఛిన్నముగాక నిలిచినది. మహాత్ము డేకైక ప్రతినిధిగా కాంగ్రెసు పక్షమున రెండవ రౌండుటేబిలు సమావేశమునకు లండను నగరమునకు బోయియుండెను.[2]

1. డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్ర. పే. 676.

2. ఒడంబడిక భగ్న మొనరింపబడుటకు జేయబడిన ప్రయత్న వివరములకు కాంగ్రెసు చరిత్ర పే. 677 మొదలు 730 వఱకు చూడుడు.

48 రెండవ రౌండ్ టేబిల్ సమావేశము

రెండవ రౌండ్ టేబిల్ సమావేశమునకు ప్రతినిధులసంఖ్య హెచ్చినది. మహాత్ముడు - సరోజినీదేవి- మాలవ్యా- అలీఇమాంను, రంగస్వామి అయ్యంగార్, షౌకతాలీ - మహ్మద్, ఇక్బాల్ ఠాకూర్ దాస్ - బిర్లా - బెంథాలు - ఎస్. కే. దత్తా వీరుగూడ సభ్యులుగా నియమింపబడిరి.

7 వ సెప్టెంబరు 1931 సంవత్సరమున రెండవ రౌండ్ టేబిల్ సమావేశము ప్రారంభింపబడినది. రెండవరౌండ్ టేబిల్ సమావేశము జరుగునాటి కాంగ్లేయ ప్రభుత్వము తారుమారైనది. కార్మిక ప్రభుత్వము కూలిపోయినది. కన్సర్వేటివ్ ప్రభుత్వము రాజ్యాధికారము వహించినది. కార్మికప్రభుత్వ నాయకుడగు మెక్డానాల్డుమంత్రి ప్రధానామాత్యుడుగ నున్నను - నూతనప్రభుత్వము "జాతీయ ప్రభుత్వమని పేర్కొనబడినను, నది కన్సర్వేటివ్ ప్రభుత్వమే యని నాడును, నేడును, ఋజువొనరించినది. ఈవిధముగ గలిగిన యాంగ్లేయప్రభుత్వపు మార్పు వలన భారతరాజ్యాంగ సమస్యపై - సంతవరకును, బ్రిటిష్ ప్రభుత్వమునకుగల దృక్పథము కొంతవరకు మారినదని కొందరు భారతీయులు విశ్వసించుచున్నారు. ఆంగ్లేయరాజకీయవేత్తలు నట్లే చెప్పుచున్నారు—1

---

1. Mr. Wedgewood Benn who was the Cecretary of State for India at the time of Labour government in Britain says in the course of an article in the political quarterly July - September 1935) that the whole scene was in fact changed when Mr Gandhi reached England " A National Government was in power under unfettered Conservative influence. Though no change had been made in phraseology of the legislative intent the temper of the Indian administration was completely altered. "Rigid repression took the place of conciliation. Press laws were passed which made the new expression of opinion difficult or impossible and thus contact was lost with whatever public opinion Indian nationalists represented... on the negotiations for the new constitution, the spirit of co-operation was also gradually abandoned. India dropped otu of the picture.

1
హిందూమహమ్మదీయ సమస్య — అల్ప సంఖ్యాకుల సమస్య.

ఈ పద్ధతులలో రెండవరౌండ్ టేబిల్‌సభ సమావేశపరుప బడినది. స్వదేశసంస్థానాధీశులు, కొందరు సంస్థానముల యందలి ప్రజలకు — ప్రత్యక్షముగ భారతశాసనసభల యందు ప్రాతినిధ్యముండరాదని వాదించిరి. మరికొందరు స్వదేశసంస్థానముల విషయమై ప్రత్యేక సంరక్షణ లుండ వలెననిరి. హిందూసంఘమును రెండుభాగములుగ విభజించి, యస్పృశ్యులకు - ప్రత్యేకప్రాతినిధ్యము — ప్రత్యేక నియోజకవర్గము లేర్పరుపవలెనని యంబేక్కర్ మొదలగువారు కోరిరి. హిందూమహమ్మదీయ సమస్యపై యొడంబడికయే కుదురలేదు. అల్పసంఖ్యాకుల సమస్యయు హిందూమహమ్మదీయసమస్యయు తేలినగాని — రాజ్యాంగసమస్యపై నేకీభావము రావీలులేదని, కుల మత తత్వ వాదులు పట్టుపట్టిరి. జాతీయవాదమునకు, స్వార్థపరులగు కొందరిప్రతినిధుల ప్రతిఘటనమువలన రెండవరౌండ్ టేబిల్ సమావేశమునందు స్థానములేక పోయినది. మహాత్మునికృషి యడవిగాచిన వెన్నెలవలె నిష్ప్రయోజనమైనది. ఇంతకంటె వేరుఫలిత ముండుటకు సావకాశములేదు. రౌండ్ టేబిల్‌సభ ఒక కలగూరగంపవలె నేర్పడినది, కప్పలతక్కెడను పట్టుటకు సునిశితబుద్ధిమంతుడగు మహాత్మునికే దుర్ఘటమైనది. తుట్టతుదకు బ్రిటిష్ ప్రధానామాత్యుడగు రామ్సే మెక్డొనాల్డుమంత్రిగారు సాంఘికసమస్యపై యొసంగిన తీర్పుగూడ భారతజాతీయైకమత్యమునకు ప్రబలనిరోధకముగనున్నది. శవపరీక్షకై వైద్యుడు శవమును క్షుత్రమొనరించునటుల, కసాయివాడు మేకను చిత్రవధగావించునటుల, భారతజాతిని మాక్డొనాల్డుగారితీర్పు భిన్నభిన్నము లొనరించినది. శాసనసభల యెన్నికలకు మతముననుసరించి ప్రత్యేకనియోజకవర్గము లుండవలెననిరి.

హిందూ, మహమ్మదీయులుకలిసి, హిందూ,మహమ్మదీయమతస్థులందరిచే నెన్నుకొనబడుటకు వీలుకలిగింపలేదు. ఏమతమువారా మతస్థులనే యెన్నుకొనుట కనువుగ నియోజకవర్గములను ప్రత్యేకించిరి. ఇంతతో మెక్డొనాల్డుమంత్రి తృప్తి

పొందలేదు. స్త్రీపురుషులమధ్యగూడ ప్రత్యేకత్వమును నెలకొల్పుటకు బూనెను. స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గములను నిర్ణయించెను. హిందూసంఘము నుండి పంచములను విడదీసి ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచెను. (కాని మహాత్ముడు సుప్రసిద్ధమగు నుపవాసముగావించి పంచములకును, నితర హిందూ మతస్థులకును, సంయుక్త నియోజకవర్గముల సాధింపగలిగెను.)

ప్రత్యేక నియోజకవర్గములున్నచో భారతజాతి విభేదములను మరచిపోయి జాతీయసిద్ధిని బడయజాలదు. మత తత్త్వ దాస్యమున రాజకీయార్థిక దాస్యమునుండి తప్పించుకొనజాలదు. మత కుల తత్త్వముల ప్రేరణమున నెన్నుకొనబడు ప్రజా ప్రతినిధు లాయా మతకుల లాభములకై యత్నించుచుందురు. ఎవరికివారు ప్రత్యేక లాభములకై యత్నించుటలో పరస్పర సంఘర్షణమున విశాలజాతీయ దృక్పథ మలవడదు. జాతీయార్థికాభివృద్ధికై యేకోన్ముఖముగ జాతి ప్రయత్నింపజాలదు. రాజకీయసంస్థలయందుగూడ మతమునకు ప్రాముఖ్య మే దేశమందునను లేదు. ఏ నాడును, ఏకాలమందునను నేస్వాతంత్ర్య ప్రియుడును మెక్డనాల్డుమంత్రి చేసిన సాంఘిక పరిష్కారమువంటి పరిష్కారమును కలయందైనను గాంచియుండడు. రౌండ్‌టేబిల్‌సభకు బ్రిటిష్ ప్రభుత్వమువారిచే గొంపోబడినసభ్యులు సాంఘిక సమస్యను తమలో తాము పరిష్కరించుకొనజాలకపోయిరను నెపమున మెక్డనాల్డు మంత్రి పిల్లుల తగవుపుతీర్చిన కోతివలె కడుసాహసమున పరిష్కరించెను. ఈ తీర్పును భారతనారీలోకమంతయు నిరసించుచున్నది. జాతీయవాదులుగనున్న యధికసంఖ్యాకులగు హిందూ మహమ్మదీయ క్రైస్తవమతస్థులందరు ప్రతిఘటించు చున్నారు. అయిననేమి? స్వార్థపరులగు కొందరు మహమ్మదీయులను వెంట బెట్టుకొని స్వార్థప్రేరితులగు నాంగ్లేయరాజకీయవేత్త లీ ప్రతిఘటనల నాలింప లేదు. మెక్డనాల్డుమంత్రి తీర్పాంగ్లేయులకు, భారతీయులకుగూడ నవమానకర మే. భారతజాతీమైకమత్యమునకు దోడ్పడుటకుమారుగ భారతజాతిని చీల్చి చింపిరిగుడ్డ వలె చేయగలిగినట్లు, యాంగ్లేయ జాతీయనాయకుడు సాంఘికసమస్యపై తీర్పు జెప్పెనని లోకము నిందింపకమానదు. స్వపరిపాలనకై మహత్తరత్యాగము సలుపుచున్న నేటి భారతజాతి యీతీర్పునే పరిగ్రహించి యూరకుండినచోగూడ లోకము పరిహసింపకమానదు."

అయితే మేక్డనాల్డుగారి యీ తీర్పునకు కారణమేమి? మేక్డనాల్డుగారిని, సాంఘికసమస్యాపరిష్కార మొనరింపవలెనని చాలమంది ప్రతినిధులు కోరిరి. మేక్డానాల్డుమంత్రి తనకున్యాయమనియు, సక్రమమనియు దోచినరీతిని (As wisely and justly as possible) తీర్పు చెప్పుట కంగీకరించెను. ఇందులకు తోడుగ సంరక్షణలను గురించిన బ్రిటిషు ప్రభుత్వసూచనలును, మహాత్ము డంగీకరించలేదు. ఈవిషమావస్థలో రెండవ రౌండ్‌ట్రేబిల్‌సభ ముగిసినది. ఈ సమావేశమునందు—

(1) నియోజక వర్గములను గురించియు, వోటుహక్కును గురించియు విచారించుటకొక సంఘమును,

(2) సంయుక్తరాష్ట్రార్థిక సమస్యలను విచారించుట కొక సంఘమున,

(3) స్వదేశ సంస్థానములలో కొన్నింటి యార్థికస్థితులవలన గలిగిన ప్రత్యేక సమస్యలను గురించి విచారించుట కొక సంఘమును –

మూడు సంఘములు నియమింపబడినవి. లోథియన్ నివేదిక — పీర్సీ నివేదిక — డేవిడ్సన్ నివేదికలని, యీ సంఘములయొక్క అధ్యక్షుల పేర్లనుబట్టి యీ సంఘముల నివేదికలు పేర్కొనబడుచున్నవి.

ఈ రెండవ రౌండ్ టేబిల్ సమావేశమునందే, యాలోచన సంఘమును కూడ నియమించిరి. ఈసంఘమున, రెండవ రౌండ్ టేబిల్ సమావేశమునకు బోయిన ప్రతినిధుల కొందఱను సభ్యులుగా నియమించిరి. 1 — 12 — 1931 సంవత్సరమున రెండవ రౌండ్ టేబిల్ సమావేశము ముగిసినది.

రెండవరౌండుటేబిలు సమావేశము విఫలమగుట

ఈసమావేశము ముగియునాటికే భారతరాజకీయసముద్రమునందు తిరిగి తుపాను పట్టెడిసూచనలు ప్రబలముగ గోచరించినవి. సమావేశానంతరము మహాత్ముడొసగిన యుపన్యాసమునందీ సూచనలు గోచరించినవి. "మనము విడిపోవుచున్నాము. మనత్రోవలు వేరయినవి. ఇక రాబోవుతుపానులకు సహించుటయే మానవజీవనగౌరవము, నాభవితవ్య మెట్టిత్రోవలబట్టునో నాకే

తెలియదు. అదియెట్లయినను నేను పరిగణించువాడనగాను. నేను పరిపూర్ణమగు విరుద్ధమార్గమున బోవలసియున్నను మీకుమాత్రము నాహృదయపూర్వకాభివందనములు." విశుద్ధాత్ముని యీవాక్యములాపత్సూచికములే యయినవి. మహాత్ముడు బొంబాయిలో 28-12-1931 వ తేదీయుదయ మోడదిగి యుండెను.

49
వైస్రాయి 1931-1936
విల్లింగుడను ప్రభువు.
రెండవ
సత్యాగ్రహప్రారంభము:
మహాత్ముని నిర్బంధము

మహాత్ముడు రౌండు టేబిలు సమావేశమునకు బోయిన నాటనుండియు - తిరిగి భారతవర్షమునకు వచ్చునంతలో గాంధి యిర్విను నొడంబడికయందలి శాంతిపరతులన్నియు భగ్నమైనవి. ప్రభుత్వోద్యోగులు దీనికి ముఖ్యాకారణమనుటనిశ్చయము. ఎట్లయిన నొడంబడికను భగ్నమొనరింపవలెనని, యొడంబడిక గావించిన తొలినాటినుండియు ప్రభుత్వము సంకల్పించియేయున్నదని కాంగ్రెసునాయకులు కొందరందురు. ఇందుసత్యము లేకపోలేదు గాని, ప్రభుత్వసంకల్ప మీడేరుటకు సంయుక్తరాష్ట్రమందలి కాంగ్రెసువాదులు ప్రభుత్వమునకు సావకాశ మొసగిరనిగూడ చెప్పదగును. మహాత్ముడు భారతదేశమున కాలిడుటకు పూర్వమే యశాంతిజ్వాలలు ప్రజ్వరిల్లినవి. కాంగ్రెసు నాయకులు నిర్బంధింపబడిరి. అనుచరుల ననుసరించుటయే మహాత్మునికి గత్యంతరమైనది. 29-1-1931 తేదీని గాంధీ వైస్రాయిగారి కొసగిన తంతిగమనింపదగియున్నది.

"నేను నిన్న బొంబాయి రేవులో నోడనుడి కాలు పెట్టునరి కార్డినెన్సులు-వాయువ్యపరగణాలలో తుపాకుల కాల్పులు - నా కమిత్రప్రియులగు వారల నిర్బంధములు - వీటి యన్నిటికంటె విపరీతముగ బెంగా లార్డినెన్సును నన్ను ఎదుర్కొనునని నే నూహించియుండలేదు. వీనినిబట్టి మనమధ్యగల మిత్రత్వము తుదముట్టినదని యూహింపవలెనేమో నాకు తెలియకున్నది. లేక నేను మీ దగ్గిరకువచ్చి కాంగ్రెసునకు భావికర్తవ్యమును గురించి సలహా చెప్పుటకు వీలుగ మీతో సంప్రదించుట కేమైనసావకాశమున్న దేమో తెలిసికొనగోరెదను. ఇందువిషయమై మాట్లాడుటకు నన్ను రమ్మనెదరా? మీప్రత్యుత్తరమునకు

నిరీక్షించుచున్నాను. ఇంతలకు 31-12-1931 వ తేదీనాడు విల్లింగుడను ప్రభువుగారి యాంతరంగిక కార్యదర్శి మహాత్మునకు సమాధానమొసగినాడు. సంయుక్తరాష్ట్రములు - పశ్చిమోత్తరపరగణాలు - వంగదేశము మొదలగుచోట్ల ప్రభుత్వమాచరించిన సంధిభంగవిధానమునకంతకును కాంగ్రెసువారలే యుత్తరవాదులని వైస్రాయిగారు తెలిపిరి. "ఈప్రయత్నములు చేయుచున్న మనుష్యులతోగాని, సంఘములతోగాని, దేశశాంతికి జవాబుదారీవహించిన వైస్రాయిగారెట్టిసంబంధమును పెట్టుకొనజాలమని వారు మీతో నొక్కిచక్కాణించమనినారు...... ఆచర్యలకుమీరు జవాబుదారులని వైస్రాయిగారు నమ్మిరి. ఈ నమ్మకమే నిజమైనచో వైస్రాయిగారు మిమ్ములనుజూచి మీతో తమ యభిప్రాయములను వెల్లడించుట కంగీకరింతురు." ...మరియు "ఒక విషయము మీరు విధిగ గుర్తించవలసియున్నది. బెంగాలుసంయుక్తరాష్ట్రములు. వాయువ్యపరగణాలలో నిండియాప్రభుత్వము సీమప్రభుత్వమువారి యనుమతితో విధిగా నవలబించవలసి వచ్చిన చర్యలనుగురించి మాత్రము వైస్రాయిగారు మీతో నెంతమాత్రము ముచ్చటించజాలరని మీరెరుంగవలయును. ఏపనికొఱకీ చర్యలమలుసందుంచబడినవో యాపని నెఱవేరువఱకు నేమయినను నశే యవి యమలులో నుండితీరవలసినదే." ఈసమాధానమునకు తిరిగి 1-1-32 వ తేదీన మహాత్ముడు రాజప్రతినిధికి మరియొకతంతి నచ్చియుండెను.

"నేను మిత్రభావముతో నొసంగిన సూచన యీ రీతిగ నిరాకరింపఁబడి నందులకు చాల విచారకరముగ నున్నది. వారి మహోన్నతపదవి కిది తగని రీతి యని ఖేద మగుచున్నది.......గౌరవనీయులగు నా సహచరులు తప్పిద మొనరించిరని ముందుగనే నే ననవలెనని రాజప్రతినిధి నిర్ణయించు చున్నాడు. ఒకవేళ నేనిట్టి యపాత్రచర్యకు పాల్పడి నా మిత్రుల నిందించి రాజప్రతినిధి సన్నిధికి బోవుటకు సిద్ధపడిననుగూడ, జాతి కంతకు చావు బ్రతుకులతో సమానమగు నార్డినెన్సుల విషయము చర్చించుటకుగూడ నాకవకాశములేదట"...... ప్రజలప్రేమను చూరగొన్న నాయకుల నరెస్టుచేయుట — న్యాయశాస్త్రముల నతిక్రమించి యార్డినెన్సులను చేయుట మానవుల యర్థప్రాణములకు నిలుకడ లేకుండ పోవుట — నాయకుల నిర్బంధముల కసమ్మతిని దెలుపుటకు ప్రజ లుత్స

వాదులను చేయ సాహసింతురా యను సహంకారముతో, నిరాయుధులును, శాంతిపరులును నగు, ప్రజాసమూహములపై తుపాకులు కాల్చుట — యీ చర్యల కన్నింటికి నెంతమాత్రము కారణము గన్పట్టను.”......అయినను “ఇప్పటికైనను మించిఁదిలేనియెడల, రాజప్రతినిధి తన నిశ్చయమును పునర్విమర్శించుకొని యెట్టి షరతులను విధించకుండ మిత్రునివలె నా కాయనతో మాట్లాడ నవకాశమును గోరెదను.” అని మహాత్ముడు సుహృద్భావముతో గౌరవనీయమగు విధానమున తిరిగి సంధిజేసికొన ప్రయత్నించినాడు. తిరిగి 2-1-1932 న రాజప్రతినిధి “మా షరతులకు ఒప్పుకున్న సరేసరి. లేక పోతే శాసనోల్లంఘనము చేస్తామని ఎట్టి రాజకీయసంస్థగాని బెదరించే బెదరింపులకు జవాబుదారీగల యే ప్రభుత్వమును బెదరజాలదు.” అని గాంధీగారి కోరికను రాజప్రతినిధి తిరస్కరించినాడు. ఈ తిరస్కారపు సమాధానమునకు గాంధీజీ 3-3-1932 వ తేదీ నొసగిన తుదిసమాధానమున సత్యాసత్య నిర్ణయము చరిత్రకారునకు వీడబడినది. “గవర్నమెంటు జేసిన మేలైన చర్యలకుగాని, శాసనములకుగాని, ప్రజల అసమ్మతిని జూపినపుడు వారల యసమ్మతిని, నపోహములను, పోద్రోలుటకై ప్రజాప్రతినిధులకు విషయములన్నియు తేటతెల్లముగా విప్పి జెప్పి ప్రజాందోళనమును శాంతిపరచుటకు గవర్నమెంటు తగు నవకాశమును ప్రజాప్రతినిధుల కొసగుచుండుట సర్వకాలములయందు ప్రభుత్వధర్మము. నాశాంతి యందలి యర్థమిదియే. ఎవరిపక్షమున న్యాయముగలదో కాలమే నిరూపింపగలదు.” ఈ కాలగర్భమునందలి సత్యము నేటికి బహిర్వ్యాపినియైనది. ఏరు దాటి, ‘ఓడమల్లయ్యను బోడిమల్లయ్య’ యని యాంగ్లేయ రాజకీయ వేత్తలు నిరూపించ దలంచిరి. సమానహోదాతో, నంతకుముందు ఇర్విను ప్రభువుతో సంధిజేసికొనుట కర్హుడైన మహాత్ముడు తాను కోరినను మాట్లాడుటకు సావకాశ మొసగుటకైన విల్లింగుడను ప్రభువున కర్హుడుగ తోచియుండలేదు. ఎట్లయినను కాంగ్రెసుసంస్థను పరాజయ మొనరించవలెనని చేయబడిన ప్రభుత్వపు కుట్రయే, మహాత్ముని తిరస్కరించుటకు గలహేతువనుట నిశ్చయము. భారతీయ యేకైక నాయకునిగ వ్యవహరింపగలిగిన మహాత్మునిపట్ల విల్లింగుడను ప్రభువు జూపిన యగౌరవంపుచిచ్చు నాటినుండియు నేటివఱకు దేశభక్తుల హృదయాంతరాళ

ముల దహించుచున్నదనుట సత్యము. సంధికాలముననే ప్రభుత్వము యుద్ధ సన్నాహముల నొనరించుకొన సాగినది. సంధివిచ్ఛిన్నమని బహిరంగమయిన 1932 జనవరి 4 వ తేదీనుండియు కాంగ్రెసుసంస్థపై ప్రభుత్వము నిర్బంధ విధానము నతిభయంకరముగ ప్రయోగింపసాగినది. అంతకుపూర్వమే మూడు ప్రత్యేక శాసనములను ప్రకటించినది. కాంగ్రెసు సంఘములన్నియు నక్రమ సంఘములుగా ప్రకటింపబడినవి. దేశమునందంతట నొక్కనాడే 5, 6 తేదీలలో ప్రతి జిల్లా యందునను నాయకులగు గాంధీ యనుచరుల నందరిని-వారు శాసనోల్లంఘున మొన రించిన-నొనరించక పోయిననుగూడ, దగా కేసులను పెట్టి యెక్కువమ్మడిగ నిర్బంధించి వేసిరి. 1932 జనవరి 4 వ తేదీనే మహాత్ముని, వల్లభాయిని, ప్రభుత్వము నిర్బం ధించి దాచివేసినది. అంతకుముందే జవహరిలాలు, ఖానుసాహెబు మొదలగు నాయకులు చెరయం దుంచబడిరి. 1921 వ సంవత్సర సత్యాగ్రహోద్యమమున 30, 000 మంది భారతీయులు, చెరసాల కంపబడిరి. "1930 - 31 సంవత్సరముల సత్యాగ్రహ విప్లవమున, 10 మాసములలోన, 90 వేలమంది స్త్రీ పురుషులు, బాలురు కారాగృహములయందు త్రోయబడిరి. ఇంక దెబ్బలుతిన్న వారిసంఖ్య లెక్కించుట కసాధ్యము. ఇంతకంటె మూడు నాలుగు రెట్లుకంటె తక్కువ యుండదు. దేశమంతయు నార్డినెన్సుల యధికారమునకు తలలొగ్గవలసివచ్చినది. ఈ యార్డినెన్సుల ననుసరించి యేమనిషికైనను నాహారము, నీరు, గాలి, నిద్ర, విహారము, విశ్రాంతి మొదలగు జీవితావసరములన్నియు లభింపకుండ నిరోధిం చుటకు ప్రభుత్వమున కధికారము లభింప జేసికొనబడినది. మారుపేరున దేశ మంతయు సైనికశాసనముక్రింద పరిపాలింప బడినదనుట సత్యదూరముగాదు. ఈ (ఆర్డినెన్సులు) ప్రత్యేకశాసనములు చాలతీవ్రముగ నున్నటుల రాజ్యాంగ కార్యదర్శి శామ్యూయెలు హోరుగారే పార్లమెంటు సభలో నొప్పుకొనవలసివచ్చి నది. క్రిమినలు లాఅమెండుమెంటు శాసన మతిఘోరముగ పిశాచ విహారము సల్పినది. 1932—33 సంవత్సరముల మధ్యజరిగిన స్వరాజ్య విప్లవమునందలి కాంగ్రెసు కార్యక్రమమును - ప్రభుత్వ నిర్బంధ విధానమును, 1930—31 లో వలెనే యున్నవి. అయితే, నిర్బంధ విధానముమాత్ర మతిఘోరమైనది. అసహ్యాకరముగ నున్నది. నాయకులు తొలుదొల్తనే నిర్బంధింపబడిరి. కాంగ్రెసు సంస్థ స్వరూపము గోచరింపకుండ నిషేధింపబడినది. కాంగ్రెసు కార్యాలయ

ములు, నందుకు సంబంధించిన యితర కార్యాలయములు, నన్నియు ప్రభుత్వము వశపరచుకొనినది. డబ్బు లాగికొనినది. తలదాచుకొనుటకుగూడ నెలవులేకుండ చేయబడినది. రాజకీయ ఖైదీలను జైళ్లలో విశేషముగ బాధించిరి. చాలమందికి 'సి' క్లాసు యివ్వబడినది. ఎ. బి. తరగతులలో నత్యల్ప సంఖ్యాకులే యుంచబడిరి. వార్తాపత్రికలు ధరావతులు కోరబడి ప్రకటన నిరోధింపబడినది. ముద్రణాలయములు లాగివేసికొనబడినవి. (మదరాసు రాజధానియందాంధ్ర దేశమున ఏలూరులో సత్యాగ్రహి ముద్రాక్షరశాలను ప్రభుత్వమువారు లాగివేసికొని సుమారు రు 10000 లు కిమ్మతుగల దానిని రు 100 లకు విక్రయించివేసిరి.) అత్యల్ప ఖరీదునకు అమ్మివేయబడినవి. జరిమానాలు లక్షలుకొలదిగ వసూలు చేసిరి. "ఈ భీభత్స భయానక దృశ్యమునందొక్క దివ్యాంశము మాత్రము మనోహరముగ గాన్పించుచున్నది. అది మొత్తముమీద ప్రజలు శాంతిని వీడకుండుటయే. మహాత్ముని యహింసాపద్ధతి, ప్రజలకు గాఢముగా నచ్చినది."[1] ఈ దుర్భర పరిస్థితులలో, ప్రపంచార్థిక దుర్భిక్షము ప్రబలినది. అది హిందూదేశమునకు గూడ పరివ్యాప్తమగునటుల ప్రభుత్వమువారు తమ నాణెముల చెలామణివిధానమును తారుమారుజేసిరి. ఈ పరిస్థితులలో 1932 వ సంవత్సర సత్యాగ్రహోద్యమము విఫలమగుటలో నాశ్చర్యములేదు. కాని యశాంతి ప్రబలిపోయినది. రాజ్యాంగ సమస్య యత్యధిక సంఖ్యాకులగు భారతీయుల దృక్పథమునుండి తొలగిపోయినది. రౌండుటేబిల్ సమావేశ పద్ధతియే మానివేయుటకు కూడ బ్రిటిష్ ప్రభుత్వము యత్నించినది. సంయుక్త రాష్ట్రప్రభుత్వ మమలునందుంచు ప్రయత్నములు కొంతకాలము నిలుపుజేసి రాష్ట్ర స్వాతంత్ర్యముతో, నూతన సంస్కరణలు మొదలుపెట్టవలెనని తలపబడినది. మితవాదులు గగ్గోలు పెట్టుటచే, నా ప్రయత్నము విరమింపబడి, మూడవ రౌండుటేబిల్ సమావేశ మాహ్వానింపబడినది

50 మూడవ రౌండుటేబిలు సమావేశము.

మూడవ రౌండుటేబిల్ సమావేశము 17 వ నవంబరు 1932 లో ప్రారంభింపబడి 24 డిశంబరు 1932 న ముగింపబడినది. ప్రతినిధులుగూడ స్వల్ప సంఖ్యాకులే. కాంగ్రెస్ పక్షప్రతినిధు లెవరునులేరు. బ్రిటిష్ కార్మికపక్షముగూడ

---

1. Congress History.

సభాకార్యక్రమములో పాల్గొనలేదు. హిందూదేశ క్రైస్తవులకుగాని – కార్మికులకుగాని – ప్రాతినిధ్య మివ్వబడలేదు. సర్. జాన్. సైమన్‌గారిని, బ్రిటిష్ ప్రతినిధిగ, ఎట్టకేలకు చేర్చిరి. మొట్టమొదట్లనుగా రోసగిన, సాంఘికపరిష్కారమునకు తమ యసమ్మతిని దెలుపుచు, సిక్కులందరు మూడవ రౌండుటేబిల్ సమావేశమును బహిష్కరించిరి. సిక్కుప్రతినిధి యెవ్వరు లభింపనందున, పాటియాలా స్వదేశసంస్థానమునుండి యొక సిక్కుజడ్జీగారు గొంపోబడిరి. స్వదేశసంస్థానాధీశులుకూడ నెవరునుపోలేదు. (శరీలా తప్ప)

1 సప్రూ జయకర్ నివేదనము.

ఈ మూడవసభయందు, ప్రత్యేక విచారణ సంఘములగు డేవిడ్సన్ – పియర్సీ – లోథియన్ – నివేదికలు చర్చింపబడినవి. ముఖ్యవిషయము లన్నియు చర్చింపబడలేదు. తమతమ ప్రత్యేకమగు హక్కులనుదెలుపు రకరకపు నివేదిక లీసభకు సమర్పింపబడినవి. అందు సప్రూ – జయకరు – నివేదనము ముఖ్యమైనది. ఈ నివేదనమునందు, భారతీయులుకోరు కనిష్టప్రమాణ స్వాతంత్ర్యము వాంఛింపబడినది.

2 ప్రభుత్వ నిర్ణయపత్రము. (White Paper). వివరములు.

మూడవ రౌండుటేబిల్ సమావేశము ముగిసినవెంటనే ఆంగ్లేయప్రభుత్వము, భారతదేశ రాజ్యాంగవిధానమును గురించిన తమ నిర్ణయపత్రమును మార్చి 1933 లో ప్రకటించిరి. పార్లమెంటుసభయు – లార్డ్సులసభయు గలిసి నియోగించు సంఘము – జాయింటు పార్లమెంటరీకమిటీవారిచేనా నిర్ణయపత్రము విమర్శింపబడవలసియున్నది.

3 రాష్ట్రములు.

ఈనిర్ణయ పత్రమునందలి ముఖ్యసూచనలిట్లు పేర్కొనదగును. (1) బ్రిటిష్ హిందూదేశమందుగల, రాష్ట్ర ప్రభుత్వములు, స్వతంత్ర రాష్ట్రప్రభుత్వముల క్రింద మార్చుట. (Antonomous units).

(2) ఈరాష్ట్రప్రభుత్వములు శాసనసభలను గలిగియుండుట. ఈ శాసనసభలు మాంటేగూ సంస్కరణములోకంటె - నత్యధిక సంఖ్యాకులగు నియోజక

వర్గములతో నెన్నుకొనబడుట - శాసనసభలకు బాధ్యులగు మంత్రివర్గముండుట - గవర్నరుండుట.

(3) గవర్నరుగారు — చక్రవర్తి పక్షమున, కార్యనిర్వాహణాధికారిగ నుండుట.

(4) మంత్రివర్గము శాసనసభలకును — నియోజకవర్గమునకును బాధ్యత వహించుట యను సిద్ధాంతము—ప్రత్యేకాధికారములు, సంరక్షణలు—అను నియమములకు లోనొనరించుట - ఈప్రత్యేకసామాన్యాధికారము సంరక్షణయను నియమముల ననుసరించి, గవర్నర్‌గారు మంత్రులపరిపాలనలో జోక్యము కలిగించుకొనుట కధికారము గలిగియుండుట.

4
సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము.
ఫెడరేషన్.

(1) బ్రిటిష్ పరిపాలనయందుగల - రాష్ట్రప్రభుత్వములును స్వదేశసంస్థానములును గలిపి, సంయుక్త రాష్ట్రప్రభుత్వముగ నేర్పరచుట.

(2) ఈ సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము రెండు శాసన సభలను గలిగియుండుట. ఈ రెండు శాసనసభలయందును, రాష్ట్రముల ప్రతినిధులును — స్వదేశసంస్థానముల ప్రతినిధులును గూడ గలసియుండుట. ఈ శాసన సభలు రెండును సంయుక్త రాష్ట్రమునకు సంబంధించిన రాజనీతికి బాధ్యత వహించుట. శాసనసభలనుండియే కార్యనిర్వాహకవర్గ మేర్పరచుట.

(3) స్వదేశసంస్థానాధీశులు వర్తమానకాలము వరకు ననుభవించుచున్న సర్వాధికారములలో, కొన్ని, నిర్ణీతమైన యధికారములను సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమున కొసగుట. చక్రవర్తిగారి హక్కులకు లోబడని యితర విషయములలో తమ సంస్థానమునందు, తాము సర్వాధికారము గలిగియుండుట.

(4) సైనిక సంరక్షణ, విదేశవ్యవహారములు, క్రైస్తవ మతవిషయముల పైన, గవర్నర్ జనరల్‌గారే యధికారముగల్గియుండుట. గవర్నర్‌జనరల్‌గారే, సంయుక్తరాష్ట్రప్రభుత్వమునకు కార్యనిర్వాహణాధికారిగనుండుట. వైస్రాయిగారు, చక్రవర్తిగారి యధికారములను గల్గియుండుట. సంస్థానములపట్లను

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ రాజ్యాంగ విధానమున కతీతముగానున్న పట్లను, వైస్రాయిగారే చక్రవర్తిగారి యధికారము గల్గియుండుట.

5. గవర్నరుజనరల్‌గారికి, వివిధ పత్రికాధికారములు, ససామాన్యాధికారములు గల్గియుండి, పరిపాలనయం దగ్గుతగులుటకు హక్కు గల్గియుండుట. ఇవిగాక కేటాయించిన హక్కులు - సంరక్షణములును గూడ గలవు. గవర్నర్ జనరల్ - గవర్నర్లను గూడ, స్వపరిపాలనయందు, తను యిష్టమునచ్చినప్పు డడ్డుతగులుట కధికారము గల్గియుండుట. ఇట్లడ్డుతగులుట యవసరమని వారి బుద్ధికి తోచినచాలును. మరియు గవర్నర్ జనరల్‌గారు హిందూదేశార్థిక పరపతిని పోషించుటకును ఆర్థిక స్థిరత్వమును జూచుచుండుటకును ప్రత్యేక బాధ్యతను వహించవలసియుండుట.

5
సంయుక్తరాష్ట్ర ప్రభుత్వకోర్టు లేక కేంద్రన్యాయస్థానము.

ప్రభుత్వ నిర్ణయపత్రములో, సంయుక్తరాష్ట్రప్రభుత్వపు కోర్టును స్థాపించుటను గూడ సూచించిరి. ఈ కోర్టునకు సంయుక్త రాష్ట్రప్రభుత్వమునకును - రాష్ట్రప్రభుత్వములకును స్వదేశ సంస్థానములకును - మధ్యవచ్చు రాజ్యాంగ సమస్యలపై తీర్పుచెప్పుటకు సంపూర్ణాధికారము గలదు. మరియు సుప్రీంకోర్టు గూడ స్థాపింపబడును. ఈ కోర్టునకు బ్రిటిష్ హిందూదేశమందలి యన్నివిధములగు వ్యాజ్యములపైన తుదినిర్ణయాధికారముగలదు.

6
పార్లమెంటువారి యధికారము -

హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శియొక్క కార్యాలోచన సభ రద్దుచేయబడి - సలహాసంఘము సూచింపబడెను. ఇందుగల సభ్యుల సంఖ్య తగ్గింపబడినది.

7
రిజర్వుబ్యాంకు రైల్వేబోర్డు - ఉద్యోగుల - ప్రాథమిక హక్కులు

భారతదేశ రాజకీయ పరిస్థితులతో నెట్టిసంబంధముగాని లేకుండా నుండెడి రిజర్వుబ్యాంకును స్థాపించుట - శాసనరూపముగ - రైల్వేబోర్డును - నెలకొల్పుట - ప్రభుత్వనిర్ణయపత్రము సూచించెను. పెద్ద యుద్యోగస్థులను హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి నియమించుట కధికారముగలదు. పెద్దయుద్యోగస్థుల జీతబత్తెములు సంరక్షింపబడుట కెన్నియో నియమము

తేర్పరుపబడినవి. ప్రాథమికహక్కులు నిరూపింపబడలేదు. సంస్కరణ శాసన మాచరణ ప్రారంభకాలమున, చక్రవర్తిగారి ప్రకటనలో - ప్రాథమికహక్కులర్థస్థానమాక్రమింప గలవని సూత్రము సూచింపబడెను.

8
జాయంటు
పార్లమెంటరీ కమిటీ
విచారణ.

ఈప్రభుత్వనిర్ణయపత్రమును గమనించి, విమర్శించి, పార్లమెంటుకు నివేదించుటకుగాను - పార్లమెంటును - లార్డ్సుల సభయు గలసి యొకసంఘము నేప్రియల్ 1933 లో నియమించిరి. ఈసంఘమే జాయంటుపార్లమెంటరీకమిటీ యని పిలువబడుచున్నది. ఇందు 32 మంది సభ్యులు గలరు. ఆంగ్లేయరాచకీయ పక్షములుమూడును నీసంఘమునందు ప్రాతినిధ్యము వహించినవి. ఈసంఘమునకు లిన్‌లిత్‌గోగారధ్యక్షుడు. ఈసంఘము భారతీయ ప్రతినిధులతో గలసి భారతరాజ్యాంగవిధానమును నిరూపించుట కధికార మొసంగబడెను. స్వదేశసంస్థానములనుండి 7 గురును బ్రిటిష్‌హిందూదేశము నుండి 21 మంది, బర్మాదేశమునుండి 12 గురును ప్రతినిధులు జాయంటుపార్లమెంటరీకమిటీకి వచ్చిరి. వీరికి (అసెసెర్లు) సలహాదారులని పేరిడబడెను. వీరు వాదప్రతివాదములందు పాల్గొనవచ్చును. సాక్షులను విచారించుటలో - ప్రశ్నలు వేయవచ్చును. కాని ఏవిషయముపైనగాని ఓటుచేయుట కధికారములేదు. పార్లమెంటున కెట్టి నివేదికను సమర్పింపవీలులేదు.

ఈకమిటీవారు విచారణప్రారంభించిరి. బ్రిటిష్‌హిందూదేశ ప్రతినిధులందరుగలిసి, యుమ్మడిగ నొకనివేదికను, కమిటీవారి విచారణకు సమర్పించిరి. ప్రతినిధులలో కొందరు ప్రత్యేకవిషయములనుగురించి గూడ నివేదికల నమర్పించిరి. స్వదేశసంస్థానాధీశులొక నివేదికను సమర్పించిరి. హిందూదేశమందు పనిజేయుచున్న - పనిచేసి యుపకారవేతనము బడయుచున్న పెద్ద యుద్యోగుల సంఘము (సివిల్‌సర్వీసుద్యోగివర్గ) మొక నివేదిక నంపినది. హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి - రాష్ట్రస్వాతంత్ర్యమునందుగల యార్థికపరిస్థితులు - సంయుక్తరాష్ట్రప్రభుత్వ స్థితిగతులు - హైకోర్టులు - హిందూదేశమునందుగల రైల్వే - ప్రభుత్వకార్యనిర్వహణానలహాలు (Instrument of Instructions)

బర్మారిజర్వుబ్యాంకు - మొదలగు ముఖ్యసమస్యలపై - ప్రత్యేకనివేదికలను జాయంటుపార్లమెంటరీ కమిటీకి సమర్పించెను.

ఈ సంఘము 120 మంది సాక్షులను విచారించినది. 159 పర్యాయములు సమావేశమయినది. ఈ సంఘము నాలుగుపసంఘములను నియమించినది. ఈయుపసంఘములు - కొన్ని నివేదికలను - సాక్ష్యములను పరిశీలించినవి.

(హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి యొసంగిన 19 రోజుల సాక్ష్యములోను మొత్తము 6000 ప్రశ్నలకు సమాధాన మొసంగబడెనని మదింపు వేయబడినది.) ఈ సంఘసమక్షమున నుపకారవేతన మందుచున్న సీమలో యున్న యాంగ్లేయోద్యోగులును - గవర్నరులు గూడ - సాక్ష్యమొసంగిరి. ఆంగ్లేయ వర్తక శిఖామణులును - భారతీయ కుల తత్వ వాదులునుగూడ సాక్ష్యమొసగిరి.

9 హిందూదేశ ప్రతినిధుల విన్నపము.

బ్రిటిష్ హిందూదేశ ప్రతినిధులు కనీసము మితవాదుల కోరికనైన మన్నించుచు, మితవాదులు కోరినట్లే తగు మార్పులను గావించవలెనని" కోరిరి. మొదటి రెండు టేబిల్ సమావేశమునందు బ్రిటిష్ ప్రధానామాత్యుడగు మెక్డొనాల్డుగారు గావించిన ప్రకటనను - పిమ్మట జాతీయప్రభుత్వము దాని నామోదించుటను పార్లమెంటుగూడ - నావిధానము నంగీకరించుటను - మరువవలదని కోరిరి. వీరి సూచనల ననుసరించి "ప్రత్యేకాధికారములు - భారత దేశమునందు - బాధ్యతాయుత ప్రభుత్వము - సంపూర్ణముగా సిద్ధించుట కడ్డుతగులనటులను - తాత్కాలికముగ నేర్పరుపబడిన, నిబంధనములు, చిర కాలానుగతము కాకుండగను" రాజ్యాంగ విధానముండుననియు దీనికైన నంగీకరింపవలెననియు, కోరిరి. (The modifications they suggested were intended to insure that the reserved powers were so framed and exercised as not "to prejudice the advance of India to full responsibility and to secure that the period of transition was not indefinitely extended") నూతనరాజ్యాంగ విధానమునందు,

భారతదేశమున బాధ్యతాయుత ప్రభుత్వమనతికాలములో సిద్ధింపగల, విత్తనము లైనను లేనియెడల, శాసనసభల నెలుపలగల రాచకీయాందోళనము విరమింప బడదనియు వీరి రాచకీయాందోళన నుండే, రాచకీయ విజ్ఞానముగల ప్రముఖు లగు భారతీయులందరు పాల్గొనుచుందురనియు గూడ భారతదేశ ప్రతినిధులు విస్పష్టముగ దెల్పిరి.

10 సప్రూ విన్నపము. సప్రూగారు, ప్రత్యేకముగ మరియొక విన్నపము బంపిరి. ఈవిన్నపముతో, జయకరు, జోషీ, రంగస్వామి అయ్యం గారు లేకీభవించిరి.

(1) ప్రత్యేకాధికారములు - సంరక్షణములు - శాసనమందుండు కాలము నిర్ణయము చేయవలయును.

(2) విదేశవ్యవహారములు, సైన్యము, క్రైస్తవమతవిషయక వ్యవహార ములుగూడ, నచిరకాలము గవర్నర్ జనరల్‌గారి యధికారమునకు లోనై యుండరాదు. కాలనిర్ణయ మొనరించవలసియున్నది.

(3) గవర్నర్ జనరల్‌గారి యధికారమునకై ప్రత్యేకింపబడిన పైవిషయ ముల పాలనయందు - దేశాభ్యుదయమున కనువగు, నిర్ణీతరాజనీతి నవలం భించుచు, ననతికాలములో భారతశాసనసభవారి యధికారమునకు లోనగున ట్లొనరింపవలయును.

(4) రాజ్యాంగశాసనమునందే, బ్రిటిష్‌సామ్రాజ్యమునందు భారతదేశము నందుగల, "రాజ్యాంగప్రతిపత్తి యెట్టిదో, విస్పష్టముగ నిర్ణయించవలసియున్నది. ఇవియే సప్రూవిన్నపమునందు సారాంశములు.

11 జాయంటు పార్లమెంటరీ కమిటీ సూచనలు, సవరణలు. జాయంటు పార్లమెంటరీకమిటీ 11వ ఏప్రియల్ 1933 సంవ త్సరమునం దేర్పరుపబడి 22వ నవంబరు, 1934 లో తమనివేదికను, పార్లమెంటునకు సమర్పించినది. ఈ నివేదికకు, ప్రభుత్వ నిర్ణయపత్రమే, మూలాధారమైనను యీ సంఘము, ముఖ్యవిషయములయందు గూడ మూల సూత్రములనే సవరణలొనరించుచు సూచించినది.

12
రాష్ట్ర ప్రభుత్వ శాసన సభలు.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమునకుండు రెండుశాసన సభల యెన్నికలునుగూడ, రాష్ట్రశాసనసభల కెన్నుకొనబడిన సభ్యులచే నెన్నుకొనబడవలెనని, సూచించిరి. ప్రత్యక్షముగ ప్రజలచే (వోటర్లచే) నెన్నుకొనబడు పద్ధతినివలదనిరి. స్టేటుకౌన్సిలునకు, రెండుశాసనసభలులేని రాష్ట్రములలో నియోజకవర్గ సంఘముల నేర్పరిచి వాటివలన నెన్నికలు జరుపవలెననిరి. రెండు శాసనసభలున్న రాష్ట్రములలో మొదటిశాసనసభ లేక కౌన్సిలుసభ్యులచే, నెన్నుకొనబడవలెననిరి. స్వదేశసంస్థానముల ప్రతినిధులను, సంస్థానాధిపతులే, స్టేటుకౌన్సిలునకు నియోగించెదరు.

13
రాష్ట్రీ శాసన సభలు

ఇట్లే సంయుక్త ప్రభుత్వ రెండవ శాసనసభకు లేక ఫెడరలెసెంబ్లీకి, రాష్ట్రీములయందుగల రెండవ శాసన సభలు - లేక రాష్ట్రీ యెసెంబ్లీల సభ్యులచే నెన్నుకొనబడుదురు. రాష్ట్రీములయందుగల ప్రథమ శాసనసభలు లేక కౌన్సిళ్ళును - సంయుక్త ప్రభుత్వపు స్టేటు కౌన్సిలునుగూడ - నెప్పటికిని రద్దుచేయబడవు. మూడు సంవత్సరముల కొకపర్యాయము మూడవవంతు సభ్యులస్థానము లెన్నికలకు పెట్టబడుచుండును.

మదరాసు, బొంబాయి, బెంగాలు, బీహారు, సంయుక్త రాష్ట్రీములలో రెండు శాసనసభ లుండవలెననిగూడ సూచింపబడెను. ఈ రెండవ శాసనసభను రద్దుచేయుటకు, భారత శాసనసభ కధికారము లేదనియు - పార్లమెంటునకే యుండవలెననియు సూచించిరి.

14
నూతన ప్రత్యేకాధికారములు

ప్రభుత్వ నిర్ణయ పత్రమునందు సూచించిన నూతనాధికారములనుగూడ, జాయంటు పార్లమెంటరీ కమిటీవారు లిఖించిరి. పోలీసు దళమును మార్పుచేయుటకు గాని పోలీసు శాసనములను సవరించుటకు గాని - పోలీసు నియమములను మార్పుచేయుటకుగాని, మంత్రివర్గమున కధికారములేదు. గవర్నర్

గారు "స్వేచ్ఛతో" గూడిన యంగీకార మొసగినప్పుడే యట్టిమార్పు లొనరించుటకు సావకాశమున్నది.

విప్లవోద్యమమునందు పాల్గొనుచు ప్రభుత్వమును కూలద్రోయవలెనని, ప్రయత్నించువారిపై తగు చర్యను స్వతంత్రముగ తీసికొనుటకు, గవర్నర్ గారికి మరికొన్ని నూతనాధికారములు పరిపాలనా విధాన సూచనల మూలముగ లభింపజేయబడెను. ఈ పరిపాలనావిధాన సూచనలు, మొట్టమొదట పార్లమెంటువారిచే నామోదింపబడవలెను. అవి మార్చదలచినప్పుడెల్ల, తిరిగి పార్లమెంటువా రామోదించుచుండవలెను. రాష్ట్రశాసనసభలయందు కార్యక్రమ నిర్వహణముకై గవర్నరుగారిచే నిర్ణయింపబడు నియమములలో మంత్రులు గాని, వారి కార్యదర్శులుగాని, యెప్పుడును ప్రత్యేక బాధ్యతను గురించిన సమాచారము, గవర్నరుగారడిగినను తెలుపవలెనను నియమము గూడ నుండవలెను.

15
వర్తక విచక్షణము
Commerlcai Discrimination.

జాయింటు పార్లమెంటరీ కమిటీవారు సూచించిన నూతనాధికారము లన్నింటియందును, వర్తక విచక్షణకు సంబంధించిన సూత్రము గమనీయము. సీమదేశమునుండి దిగుమతియగు, సరకుపై, ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని, పక్షపాతముగ నిరకునామాను విధించరాదనియు నట్టి నిరకునామాను విధించుచున్నటుల గవర్నరు జనరల్ గారికి, తోచినయెడల వారట్టిశాసనములగాని నియమములుగాని, రద్దుచేయవచ్చుననియు, ప్రత్యేక బాధ్యతను గవర్నర్ జనరల్ గారికి, తోచినయెడల వారట్టిశాసనముల గాని, నియమములగాని, మరెట్టి కార్యమునగాని, రద్దుచేయవచ్చుననియు, ప్రత్యేక బాధ్యతను, గవర్నర్ జనరల్ గారి కొసగబడెను. కాని యీ ప్రత్యేకబాధ్యతవలన హిందూదేశ పారిశ్రామికవృద్ధికి వలయు కార్యక్రమముగాని నిరకునామానీతిగాని ప్రతిఘటింపబడదు. విదేశీయులతో, వర్తకపు టొడంబడికలను గావించుకొనుటకుగూడ హిందూదేశ ప్రభుత్వమున కధికారముగలదు.

**16**
**ఆర్థిక కేటాయింపులు**
**Financial Reservations.**

1934 సంవత్సరమునందు, శాసన మొనరింపబడిన రిజర్వు బ్యాంకును గురించియు, రైళ్ళ బోర్డునుగురించియు, గవర్నర్ జనరల్‌గారికి స్వేచ్ఛతోఁగూడిన, నూతనాధికారము లొసగబడెను.

**17**
**సుప్రీం కోర్టు**

హైకోర్టు తీర్పులపై నపీలుచేయుట కొఱకు సుప్రీంకోర్టును స్థాపించవలెనను సూచనకు, పార్లమెంటరీ కమిటీవారు వ్యతిరేకాభిప్రాయమును దెల్పిరి. ఫెడరల్ కోర్టువారి యధికారమును వృద్ధిచేయ శాసన మొనరించుటకు, భారత శాసనసభ కధికారమివ్వబడెను. కాని క్రిమినల్ కేసులలో నపీలుచేయు నధికారమును ప్రతిఘటించిరి.

**18**
**Orders in Councils.**
**ఆజ్ఞలు**

సంస్కరణశాసనమున వ్రాయుటకు వీలులేని కొన్ని విషయములు, పిమ్మట, బ్రిటిష్‌మంత్రివర్గమువా రాజ్ఞాప్రణాళికను పంపుచుండవచ్చునని ప్రభుత్వనిర్ణయపత్రమునందు గలదు. ఇట్టి యాజ్ఞాప్రణాళికను పార్లమెంటుసభల యనుమతిని పొంది గాని జారీచేయుటకు వీలులేదని పార్లమెంటరీ కమిటీవారు నిర్ణయించిరి.

**19**
**పార్లమెంటరీ కమిటీవారి విచారణ ఫలితము**

ఈ విధముగ ప్రభుత్వనిర్ణయ పత్రికయందలి ముఖ్య విషయములను, జాయంటు పార్లమెంటరీ కమిటీవారు మార్పు జేసిరి. ఈ మార్పుల ఫలితమేమి? ప్రధానామాత్యుఁడగు మెక్డొనాల్డుగారు గావించిన ప్రకటనయందు సూచింపబడిన యధినివేశ స్వాతంత్ర్యము, ప్రభుత్వ నిర్ణయపత్రికయందు లేదు. ప్రభుత్వ నిర్ణయ పత్రికయందు సూచింపబడిన, స్వాతంత్ర్యచ్ఛాయలుగూడ, పార్లమెంటరీ కమిటీవారి నివేదికయందులేవు. జాయంటు పార్లమెంటరీ కమిటీవారి సూచనలవలన-గవర్నర్ జనరలునకు, గవర్నరులకు నిరంకుశాధికారము హెచ్చినది. సీమప్రభుత్వమునకు, భారతదేశ రాజ్యాంగ విధానముపైగల సంపూర్ణాధికారము సడలింప బడలేదు.

20 జాయంటు పార్లమెంటరీ కమిటీరిపోర్టు. పార్లమెంటు ఆమోదము.

జాయంటు పార్లమెంటరీ కమిటీనివేదిక, రెండుపార్లమెంటు సభలకును, సమర్పింపబడినది. ఈ నివేదికయందలి సూత్రములను, పార్లమెంటు సభ లంగీకరించినవి. ఇందలి సూత్రముల ననుసరించి, నూతన భారతరాజ్యాంగమును వ్రాయుటకు తీర్మానించినది. ఈ తీర్మానము లార్డుల సభలో చర్చకువచ్చినప్పుడు, జాయంటు పార్లమెంటరీ కమిటీ సూచనలే, చాల హెచ్చుగ నున్నవనిగూడ, కొందరుసభ్యులు సవరణ లుపపాదించిరి. ఈ సవరణలు వీగిపోయినవి. 1

జాయంటు పార్లమెంటరీ కమిటీవారి సూచనల ననుసరించి, సంయుక్త రాష్ట్ర రాజ్యాంగ విధానము వ్రాయబడినది. 5 వ ఫిబ్రవరి 1935 సంవత్సరమున పార్లమెంటుసభలో ప్రవేశపెట్టబడినది. మొదటిసారి చదువబడినది. కార్మిక సభ్యుడగు సి. ఆర్. అట్లీగారు సవరణ నుపపాదించిరి.

అధినివేశ రాజ్యాంగవిధానమును బడయుటకుగల భారతీయులహక్కును విస్పష్టముగ గుర్తింపగలిగి - అధినివేశ రాజ్యాంగ విధానమును బడయుటకు, సావకాశముగలిగియుండి, భారతీయుల సహకారసానుభూతులను, పొందగలిగి, వోటుహక్కుకును, ప్రాతినిధ్యముకును సంబంధించిన, నియమముల ననుసరించి, కార్మిక కర్షకులకు, సాంఘికాభివృద్ధిని, శాసనబద్ధముగ సంపాదింపగలుగుటకు, వీలుకలిగియుండని, భారతీయప్రభుత్వ విధానమునకు సంబంధించిన, యేశాసనముగాని, యీసభవారికి సంతృప్తికరముగ నుండదు.

(In the opinion of this house, no legislation for the better Government of India, will be satisfactory which does not secure the good will and co-operation of the Indian people by recognising explicitly India's right to dominion status and by providing within it the means of its attainment and which does not by its provisions as to franchise representation secure to the workers and peasants of India, the possibility of achieving by Constitutional means their social and economic emancipation)

---

1. See Debates House of Lords, 12 December 1934,

ఈ సవరణ యధిక సంఖ్యాకులచే త్రోసివేయబడినది. గాని యీా సవరణపై నట్లీగారొసగిన యుపన్యాసముమాత్రము గమనింపదగియున్నది.1

సత్యము మాట్లాడవలసివచ్చిన యెడల యీనూతన రాజ్యాంగవిధానమునందు భారతీయుల ప్రమేయమే వదలివేయబడినది. ఈచట్టమునందుగల ప్రతి క్లాజునందును, భారతీయులయెడ నవిశ్వాసమునే చూచుచున్నాము. స్వలాభపరులైన జమీాందారులు, భూకామందులు, వర్తకులు, మొదలగు వారితోడనే శాసనసభలు నింపబడుచున్న రెండవరకపు శాసనసభలుకూడ నేర్పరుపబడుచున్నవి. ఈ చట్టమును పరిశీలించినవాడు, హిందూదేశమును, భాగ్యవంతులును- సదృష్టవంతులును - మాత్రమే పరిపాలించునట్లున్నదను దృఢనిశ్చయమునకు రాకతప్పదు. అయినను వీరుగూడ విశ్వసింపబడక పోవుటయే యిందలిచిత్రము. రెండవరకపు శాసనసభలు, జమీాందారులతోటీ, భూకామందులతోటీ, ధనాఢ్యులతోటీ నింపబడుచున్నవి. అయినను వీరుగూడ నార్థికవిషయమున విశ్వసింపబడలేదు. అవిశ్వాసముతోను నసమానత్వముతోను-యీచట్టమంతయు-నింపివేయబడినది. హిందూదేశమందు నేదో విధమగు "ఈభాగస్వామ్యముండునను మాట వింటిమి — ఈ భాగస్వామ్యము శుద్ధపాక్షికముగ మాత్ర మున్నది.

భారతదేశాభ్యుదయమును గోరువా రీచట్టమునుగురించి యిట్లు చెప్పి

1. "In fact the one thing which seems to be left out of the bill is the Indian people. In every clause throughout the bill we find a mistrust of the Indian people. The legislature is to be overloaded with conservative interests Land Lords, commerce and the the like. Second Chambes are to be set up. The conclusion to which one comes on looking at the bill is that the definite decision has been that India is to be ruled by the wealthy and the privileged. The curious thing is that even those people are not trusted. The second chambers are to represent conservative interests, Land Lords, wealthy people and the like but even they cannot be trusted with finance. Right through the bill then is mistrust and in equality. We have heard of the idea that there is to be some kind of partnership in India...It is a one sided partnership"

యుండ, కన్సర్వేటివ్ పక్షమునందలి, కొందరు (చర్చిల్ ప్రభృతులు) రాష్ట్ర స్వాతంత్ర్యమునుమాత్ర మొసగవలెనని వాదించిరి.1 ఈ చట్టము రెండుమాసములు చర్చింపబడినది. ఈచర్చకు ఫలితముగ మరికొన్ని మార్పులు గలిగినవి.2

జూన్ 4 తేదీని మూడవపర్యాయము, చట్టముచదువబడి పార్లమెంటు సభవారిచే నంగీకరింపబడినది. ఇట్లంగీకరింపబడుటకుముందు కార్మికసభ్యుడగు, మార్గన్‌జోన్సుగారొక సవరణ నుపపాదించిరి. ఇది గమనీయము.3

"హిందూదేశమున, నూతనరాజ్యాంగ విధానమును నిర్ణయింప బోవుచున్న యీబిల్లులో నధినివేశరాజ్యాంగవిధానమును బడయుటకు వలయు సాధనము లేకపోవుటచేతను, స్వపరిపాలన మనుభవించుటలో నక్రమమగు, ప్రతిబంధకము లేర్పరుపబడి యుండుటచేతను, స్త్రీ పురుష కార్మికుల కధికసంఖ్యాకులకు, వోటు నుపపాదించి, ప్రాతినిధ్యము లభింపకపోవుటచేతను, శాసనసభలను ధనాఢ్యుల పలుకుబడిచేతను, నదృష్ట మనుకొనెడి దానితోను స్వాతంత్ర్య ప్రతిఘటనలతోను, నింపివేయబడుటచేతను, యీచట్టము నీసభవా రామోదించుటలేదు." ఈ సవరణ వీగిపోయినది.

---

1. See debates of House of commons 18th Feb. 1935.

2. Sex disqualification was removed to hold certain offices by mean clauses. The salaries etc of the secretarial staff of the Governor General and Governors, appointed by the respective executive heads of the Provinces or federation shall be non-notable.

3. "This house declines to assert to the third reading of a bill which, in its establishment of a new constitution for India, does not contain the means for the realisation of dominion status, imposes under restrictions on the exercise of self Govt. fails to make adequate provision for the enfranchisement and representation of the workers, both men and women and in trenches in the legislatures the form of wealth, privilege and reaction"

21
లార్డ్సులసభ-ఆమోదము.

6 వ జూన్, 1935 వ సంవత్సరమున, నూతనరాజ్యాంగ విధానచట్టము, లార్డ్సులసభలో, జట్లండు ప్రభువుగారిచే ప్రతిపాదింపబడినది. ఈసభయందుకూడ కొన్ని క్రొత్త సవరణ లుపపాదింపబడి యామోదింపబడినవి.

(1) భారతశాసనసభలలో నొకటియగు, స్టేటుకౌన్సిలుసభలో 6 స్థానములు స్త్రీలకు ప్రత్యేకింపబడినవి.

(2) స్టేటుకౌన్సిలుసభకు, పరోక్షపు ఎన్నికలకు మారుగ, ప్రత్యక్షపు ఎన్నికలు జరుపుటకు నిర్ణయింపబడెను. (వోటరులే సభ్యుల నెన్నుకొనుట)

(3) ఈరాజ్యాంగవిధానము ప్రతిఘటింపబడి, నిర్వహణ సాధ్యముకాని యెడల, గవర్నర్ జనరల్‌గారు 6 నెలలకుమారుగ 12 మాసములవరకు నాజ్ఞాపత్రముల (Proclamations) పార్లమెంటువారి యనుమతితో నిమిత్తము లేకుండగనే, ప్రకటింపవచ్చును. ఇట్టి యాజ్ఞాపత్రములు, 18 నెలలకుమారుగ, మూడుసంవత్సరముల కాలము, సజీవముగ నుండవచ్చును.

(4) ఆంగ్లో యిండియనులకు, సైన్యశాఖయందు ప్రత్యేకసౌకర్యము లొనగూర్పవలెను. ఇట్టి కొన్నిముఖ్యమైన మార్పులొనరింపబడి యీచట్టము తిరిగి పార్లమెంటు సభకు జూలై 24 తేదీన పంపబడినది.

22
సవరణచట్ట
మామోదింపబడినది.

జూలై 30 వ తేదీన పార్లమెంటు వారిచట్టము నామోదించిరి. ఉభయసభలును వారివారి సవరణ లామోదించినవి. భారత నూతనరాజ్యాంగవిధానము శాసనమైనది. 2 వ ఆగష్టు 1935 సంవత్సరమున చక్రవర్తిగారీశాసనమున కనుమతి నొసగిరి.

ఈ హిందూదేశ రాజ్యాంగవిధానశాసనమే, పార్లమెంటులో నింతవరకు చర్చింపబడిన శాసనములలో, కడుంగడు పెద్దదని చెప్పబడుచున్నది. ఈశాసనమును చర్చించుటకు 61 దినములు వినియోగింపబడినవి. ఇందు 321 సెక్షను

లును 10 పెద్యూల్సును, గలవు. ఈశాసనము తిరిగి వలయు భాషాసవరణలతో 1935 సంవత్సరపు హిందూదేశపు ప్రభుత్వవిధానశాసనముగ 20 వ డిశెంబరు 1935 సంవత్సరమున, పార్లమెంటువారిచే, యంగీకరింపబడినది.

51
ఫెడరల్ రాజ్యాంగ విధానము—భారతీయుల అసంతృప్తి.

ప్రభుత్వనిర్ణయపత్రము ప్రకటింప బడిననాటినుండియు, నూతన రాజ్యాంగవిధానముపై, భారతీయులు తమ యసంతృప్తిని ప్రకటించుచునే యున్నారు. ప్రభుత్వనిర్ణయపత్రమునందుగల సూచనలు భారతీయులచే నంగీకరింపబడలేదు. మితవాదులు — నతివాదులు — జాతీయవాదులు - ప్రభుభక్తిపరాయణులు - మహమ్మదీయులు - మొదలగువారందరు తమయసమ్మతిని ప్రకటించుచునే వచ్చిరి. కాంగ్రెస్ మహాసభ లిబరల్ ఫెడరేషన్, ముస్లింలీగ్ — హిందూమహాసభ — సిక్కులీగ్, మొదలగు రాచకీయ సంస్థలన్నియు, వ్యతిరేకాభిప్రాయమును స్పష్టీకరించినవి.

## 52. కాంగ్రెసుసభాపునరుజ్జీవనము

ఇక కాంగ్రెసుసంస్థ పరివర్తనము యోచింపదగియున్నది. బహిర్వ్యాహినిగా జాతీయోద్యమ మగమ్యగోచరమైనది. అంతర్వాహినిగ మాత్రమే నిలిచినది. మహాత్ముడు హరిజనసమస్యకై కారాగృహమునందు రెండు చరిత్ర ప్రసిద్ధములగు నుపవాసములను గావించియుండెను. మహాత్ముడు తన రెండవ యాత్మపారిశుద్ధోపవాసము 1933 మే 8 వ తేదీని చేయ నారంభింపసాగెను. 21 రోజులవరకు చేయుటకు నిర్ణయించెను. ఈ యుపవాసమును పురస్కరించుకొని బొంబాయి ప్రభుత్వము మహాత్ముని విడుదల చేసినది. మహాత్ముడు విడుదలమైన వెంటనే సంధిషరతులను సూచించు నొక ప్రకటనమును గావించిరి. ఈ ప్రకటనమునందు తా "నింగ్లండునుండి వచ్చిన పిమ్మట యెక్కడయితే కథ తెగిపోయినదో యక్కడనుండి మరల నెత్తుకొందును." అని మహాత్ముడు ప్రకటించినాడు. శాసనోల్లంఘనము విరమింపబడుటయు, రాజకీయ ఖైదీలను విడుదలచేయుటయును, మాత్రమే సంధిషరతు లయినాయి. అప్పటి తాత్కాలిక

కాంగ్రెసధ్యక్షుడు 'ఆనీ' గారు ఆరువారములు శాసనోల్లంఘనమును నిలుపుదల జేసినట్లుగా ప్రకటించినాడు. తాత్కాలికముగ శాసనోల్లంఘనము నాపినంత మాత్రమున రాజకీయ నిర్బంధితుల విడుదల చేయబడదని హిందూదేశ ప్రభుత్వము మారుప్రకటించినది. ఈ విషయమై కాంగ్రెసుతో రాజీకి ప్రయత్నింప సంకల్పముగూడ లేనట్లుగ, మే 9 వ తేదీని ప్రకటింపబడినది. ఏప్రియలు 10 వ తేదీని భారత శాసనసభయందు ప్రభుత్వ హోంమెంబరుగారు గూడ నిట్లేజెప్పిరి.

గాంధీజీ మే 29 వ తేదీని జయప్రదముగ నుపవాసమును ముగించి ప్రాశనచేసిరి. మరియొక, ఆరు వారము లుద్యమమును నిలుపుదల చేయుచు ఆనీగారు ప్రకటించియుండిరి. ఈ పరిస్థితులలో పూనాలో 1933 జూలై 12 వ తేదీని కాంగ్రెసునాయకు లందరును సమావేశమైరి. ఈ సభయందు శాసనోల్లంఘన మెట్టిషరతులు లేకుండగ విరమింప బడవలెనను తీర్మాన మామోదింప బడలేదు. సమిష్టిశాసనోల్లంఘనమునకు మారుగ వ్యక్తిశాసనోల్లంఘన మొనరింపవలె నను తీర్మానముగూడ వీగిపోయినది. గాంధీజీ సంధినిజేయుటకై రాజప్రతినిధిని దర్శింప వచ్చునను తీర్మాన మామోదింపబడినది. కాని, రాజప్రతినిధి గాంధీగారి కోరికను తిరిగి తిరస్కరించినాడు. శాసనోల్లంఘనము ముందుగా నుపసంహరింప బడినగాని గాంధీజీని జూచుట కనుజ్ఞనొసగనని, రాజప్రతినిధి మహాత్మునకు సమాధాన మొసగినాడు. అయినను మరల గాంధీగారు రాజప్రతినిధి సందర్శన మపేక్షించినాడు. మూడవమారుగూడ నిల్లింగుడను ప్రభువు తిరస్కరించినాడు. ఇక, జాతీయగౌరవమునకై వ్యక్తిశాసనోల్లంఘన విధాన మమలునం దుంచుటకు తీర్మానింపబడినది. ఈ తీర్మానానుసారము మహాత్మా గాంధీయే తిరిగి కారాగృహమునకు వెడలినాడు. 1933 ఆగష్టు 1 వ తేదీని మహాత్ముడు రాసు గ్రామమునకు సశిష్యుడై యాత్రవెడల సంకల్పించినాడు. కాని, యంతకుముందు రాత్రియే గాంధీగారును 34 మంది శిష్యులును నిర్బంధింపబడిరి. 4 వ తేదీ యుదయమున గాంధీజీ విడుదలచేయబడి - యెఱవాడనువీడి పూనాలో నివసింపనియోగించుచు ప్రభుత్వమాజ్ఞాపించినది. ఈ యుత్తరమును గాంధీజీ యుల్లంఘించినాడు. విడుదల అయిన యరగంటకే తిరిగి సంవత్సరము శిక్ష విధింపబడి

కారాగృహమునకు మరల నెడలినాడు. ఈయన నిర్బంధముతోపాటు తిరిగి వ్యక్తి శాసనోల్లంఘనము సాగినది. 1934 మార్చి వఱకు వ్యక్తి శాసనోల్లంఘన మున పాల్గొనిన వారిసంఖ్య నిరూపించుటకష్టమే, కాని, ప్రభుత్వము వత్తిడిచేయ కలిగినంతమంది మరల శాసనోల్లంఘన మొనరించియుండలేదనుట నిశ్చయము. అప్పటికి దేశము జవసడలినది. అన్ని రాష్ట్రములయందును కొంచెమించుమించుగ నన్నికుటుంబములకు, నేదోవిధముగ నీ సాత్విక నిరోధవిప్లవమున త్యాగ మొనరించుట విధియయినది. ప్రభుత్వ నిర్బంధ విధానమునకు గురికావలసి వచ్చినది.

మహాత్ముడు మాత్రము మరల వెంటనే విడుదల చేయబడినాడు. హరి జన పత్రికను నడుపుట కాయనకు వెనుకటివలె సావకాశ మొసగియుండలేదు. అందువల్ల తిరిగి యుపవాసవ్రతమును ప్రారంభించుట, మహాత్ముడు తనధర్మముగ విశ్వసించినాడు. ఆగష్టు 20 వ తేదీని బంధితునిగానే పూనా ఆసుపత్రి కాయన పంపివేయబడినాడు. ఇందుల కుపవాసమువల్ల మహాత్ముడు ప్రమాదకరస్థితి యందుండుటయే కారణము. 23 వ తేదీ నాటికి మహాత్మునిస్థితి యపాయకరముగ నున్నది. ప్రభుత్వమంతటితో నాయనను తిరిగి విడుదల జేసినది. అయినను, తన సంవత్సర శిక్షాకాలము పూర్తియగువరకు రాజకీయోద్యమమున పాల్గొననని, యాయనయే తన్ను తాను బంధించుకొనెను. నిర్బంధపడుట, యుపవాసముండుట, ప్రభుత్వము విడుదలచేయుట, యీ మూడుపనులును నసహ్యాకరమగు చెలగా టమువలె నున్నవని మహాత్ముడు తలంచుటయే యిందులకు కారణము. ఈ విధ ముగ 1934 ఆగష్టు 3 వ తేదీవరకు నాత్మశిక్షణ, హరిజనోద్యమములో మహా త్ముడు తన్మయుడై యుండినాడు.

ఈ పరిస్థితులలో దేశమునందలి రాజకీయ వాతావరణమును పునరుద్ధరిం చుటకై శాసన సభాకార్యక్రమ మవసరమని తలంచువారిసంఖ్య నానాటికి, పూనా సభనాటినుండియు, నభివృద్ధి కాజొచ్చినది. 1934 మార్చి 31 వ తేదీని కాంగ్రెసునాయకులు ఢిల్లీలో సమావేశమైన శాసనభలను వశపరచుకొను టవ సరమని తలంచిరి, (1) నిర్బంధ శాసనముల రద్దుపరచుట. (2) ప్రభుత్వనిర్ణయ

పత్రములోని రాజ్యాంగ విధానమును త్రోసివేసి, దేశీయ వాంఛితము నమలు లోనికి దెచ్చుటకై ప్రయత్నించుటకుగాను శాసనసభా కార్యక్రమము నంగీకరించిరి. ఈ విధముగ కాంగ్రెసు ప్రభుత్వనిర్ణయపత్రమును నిరాకరించుటకు బూనినది. ఏప్రియలు 7 వ తేదీని మహాత్ముడీకార్యక్రమము నాశీర్వదించుచు నన్సారీగారికి జాబును వ్రాసియుండెను. మఱియు, వ్యక్తి శాసనోల్లంఘనము గూడ తానొక్కడే యాచరింపదగునను తన సంకల్పమునుగూడ యేప్రియలు 7 వ తేదీని ప్రకటించి యుండెను.

స్వరాజ్య పక్షమును నిర్మించి, ధృవపరచుటకై 1934 మే 2, 3, తేదీల యందు, రాంచీపట్టణమున సభజరిగినది. ఈ సభాతీర్మానములును పాట్నాలో 1934 మే 18, 19 వ తేదీలలో జరిగిన యఖిలభారత కాంగ్రెసు సంఘమునం దామోదింపబడినవి. కాంగ్రెసు సంఘములన్నియు నిషేధింపబడినను, నఖిల భారత కాంగ్రెసుసంఘము మాత్రము నిషేధింపబడి యుండలేదు. ఈ సభ యందు శాసనోల్లంఘనము నిలుపుదల చేయబడినది. కాంగ్రెసు పక్షమున, శాసన సభల కెన్నికలలో పోటీచేయుటకు గూడ నిశ్చయింపబడినది. ఈ విధముగ శాసనోల్లంఘనోద్యమము క్రమానుగతముగ తగ్గింపబడి గాంధీగారికి మాత్రమే యందులకు హక్కొసగబడి 20-5-34 నుండియు నుద్యమము విరమింప బడినది. 1932 వ సంవత్సరారంభమున కాంగ్రెసుసంస్థ లశాస్త్రీయములని ప్రభుత్వమువారిచే ప్రకటింపబడిన ప్రకటనము 12-6-1934 నుండియు విరమించు కొనిరి. రాజకీయ నిర్బంధితులుకూడ విడుదల చేయబడుదురని ప్రభుత్వము ప్రకటించినది. అంతతో కాంగ్రెసు మరల పునర్జీవమును బొందసాగినది. రాజ్యాంగ సమస్యపై దృక్పథమును కేంద్రీకరింప మొదలుపెట్టినది.

53
శ్వేతపత్రము
కాంగ్రెస్ సభా
నిర్ణయము.

జాతీయ మహాసంస్థయగు కాంగ్రెస్ మహాసంస్థ గావించిన తీర్మానము గమనీయము. కాంగ్రెస్ కార్య నిర్వాహక వర్గసభ బొంబాయిలో 17-18 వ జూన్ 1932 సంవత్సరమున సమావేశమైనది.1

1. (The white paper in no way expresses the will of the

ప్రభుత్వనిర్ణయ పత్రమునందుగల సూచన యేవిధముగను, భారతీయాభిమతము ననుసరించియే, కొంచెమించుమించుగ నన్ని రాజకీయ పక్షములచేత నిరసింపబడెను. కాంగ్రెసాదర్శమునకంటె చాలలోజ్జు. అంతియేకాదు. కాంగ్రెసు తనయాదర్శమును జేరుటకిది మార్గావరోధముగకూడ నున్నది. ప్రభుత్వనిర్ణయ పత్రమునకు మారుగ మైనారిటీదిరిన ప్రజాసామాన్య మందరివల్లను, లేక దీనికి తుల్యముగ విస్తారముగ ప్రజాసామాన్యముచేత నెన్నుకొనబడిన ప్రజాప్రతినిధిసభ (Constituent Assembly) మాత్రమే రాజ్యాంగవిధానమునునిర్ణయించవలెను. అవసరమగుచో నల్పసంఖ్యాకుల ప్రతినిధులు, తమతమ యల్పసంఖ్యాకవర్గముచే, నెన్నుకొనబడుట కధికారముండవలయును." కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గమువారు గావించిన యీతీర్మానము ననుసరించి రౌండ్ టేబిలు సమావేశములు ప్రజాప్రాతినిధ్యము వహించలేదని స్పష్టమగుచున్నది. ప్రజాసామాన్యమునకు ప్రాతినిధ్యము వహింపగల, "ప్రజాప్రతినిధిసభ" యే భారతరాజ్యాంగ విధానమును నిర్ణయించుట కర్హతగలగియుండునని కాంగ్రెస్ సభవారి నిర్ణయము. జాయంటుపార్లమెంటరీ కమిటీ నివేదికపైగూడ కాంగ్రెస్ మహాసభ, యీనిర్ణయముననే మరలగావించినది.[1]

---

people of India, has been more or less condemned by almost all the Indian politcal parties and falls far short of the congress goal, if it does not stand the progress towards it. The only satisfactory alternative to the white paper is a constitution drawn up by a constituent assembly, elected on the basis of adult suffrage or as near it as possible with the power necessary to the important minorities to have their representatives elected exclusively by the electors belonging to such minorites).

1. "Whereas the congress has after full and earnest consideration resolved that the scheme of future Government of India adumbrated in the white paper be rejected and that the only satisfactory alternative is a constitution drawn up by a constituent Assembly.

"And the said rejection and demand for a constituent Assembly has been endorsed in a clear and unambiguous

"కాంగ్రెస్ మహాసభ, ప్రశాంతముగ సమాలోచనగావించి, ప్రభుత్వ నిర్ణయపత్రమునందు వివరింపబడిన, హిందూదేశ భావిరాజ్యాంగవిధాన మనంగీకార మని, నిరాకరించుటకు నిశ్చయించి, ప్రజాప్రతినిధిసభ వారిచేతనే భావిరాజ్యాంగ విధానము వ్రాయబడవలెనని తీర్మానించుచున్నది.

ఈనిరాకరణమును, ప్రజాప్రతినిధిసభచే నిర్ణయింపబడవలెనను, నిశ్చయ మును ; యీమధ్యజరిగిన, భారతశాసనసభ యెన్నికలలో, ప్రజలచే విస్పష్టము గను — నిస్సంశయముగను నామోదింపబడినది.

మరియు, జాయింటు పార్లమెంటరీ కమిటీనివేదికయందలి నిర్ణయము లనేకరీతుల, ప్రభుత్వనిర్ణయ పత్రమునందలి, సూచనలకంటెనుగూడ, లోప

---

manner by the country at the recent general election to the legislative Assembly;

"And whereas the proposals made in the Parliamentary Committee Report are in several respects even worse than those cantained in the white paper and have been condemned by almost every shade of opinion in India as reactionary and unacceptable.

"And whereas the joint Parliamentary Committee Scheme, designed as it is to facilitate and perpetuate the domination and exploitation of this country by alien people under a costly mask. is fraught with greater mischief and danger than even the present constitution.

"This committee is of opinion that the said scheme should be rejected, well knowing that the rejection must involve the necessity of struggling under the present constitution, humiliating and intolerable as it is, until it is replaced by one framed by a constituent assembly in accordance with the congress resolution on the subject. This committee requests the members of the Assembly to reject the scheme of Government sought to be thrust upon India in the name of reform and appeals to the nation to support the congress in every step that it may decide upon to secure the national objective of Purna Swaraj".

భాయిష్టముగినందున, భారతదేశమునందుగల, సర్వరాజకీయపక్షములవారిచేతను, ప్రజాభిప్రాయవిరుద్ధముగ నున్నవనియు, ననంగీకారములనియు, నిరసింపబడినవి.

మరియు, మాంటేగూ సంస్కరణముల విధానముకంటెను, జాయంటు పార్లమెంటరీ కమిటీవారి రాజ్యాంగవిధాన మధికవ్యయకారణమగుచు, విదేశీయులచే నీదేశము, చిరకాలము పరిపాలింపబడుటకును - శోషింపబడుటకును, వీలగురీతిని, వ్రాయబడియుండుటచే, నమితమగు నపకారమును నపాయమును సంభవింప చేయగలిగియున్నది.

అందువలన నీరాజ్యాంగవిధానము నిరాకరింప బడవలసియున్నది. ఇట్లు నిరాకరించుటవలన కాంగ్రెస నిర్ణయించినటుల ప్రజాప్రతినిధిసభచే రాజ్యాంగ విధానము వ్రాయబడుటవరకు, గౌరవహీనముగను, నసహ్యముగను నున్న (మాంట్ఫర్డు సంస్కరణములు) నేడమలునందున్న రాజ్యాంగ విధానమునందే యుండవలసి యుండునని దెలిసియే యీతీర్మానము చేయబడుచున్నది.

సంస్కరణముల పేరుమీదుగ, భారతదేశములో, బలవంతముగ ప్రవేశపెట్టబడనున్న యీ రాజ్యాంగ విధానమును నిరాకరించవలయునని, యీసభవారు భారతశాసనసభ్యులను కోరుచున్నారు. మరియు కాంగ్రెస్ మహాసభ యొక్క యాదర్శమగు పూర్ణస్వరాజ్యమును సంపాదించుటకై, కాంగ్రెసు మహాజనసభ నిర్వహించు, ప్రతికార్యక్రమమునందును, కాంగ్రెస్‌నకు సహాయమొనరించవలెనని, ప్రజలను కాంగ్రెస్ మహాజనసభ మేల్కొలుపుచున్నది." అని పాట్నాలో డిశంబరు 5, 6, 7 తేదీలలో సమావేశమయిన కాంగ్రెస్ కార్య నిర్వాహకవర్గసభ జా. పా. క. నివేదికపై తీర్మానించినది.

54
జాయింటు పార్లమెంటరీ కమిటీ నివేదిక — భారతశాసనసభవారి అభిశంసనము.

జాయంటు పార్లమెంటరీకమిటీ నివేదికపై భారతదేశమందలి, వివిధరాష్ట్రీయ శాసనసభలు, తీవ్రఅసమ్మతిని దెలిపినవి. రాష్ట్రశాసనసభలయందీ నివేదిక చర్చింపబడినపుడు, ప్రభుత్వసభ్యు లేపక్షమునగాని, వోటుచేయలేదు. కాంగ్రెసు శాసనసభాకార్యక్రమమునందు విజయము

గాంచినది. ఢిల్లీ శాసనసభయందు కాంగ్రెసుపక్ష మనేక సంఖ్యాకుల పక్షముగ నేర్పడినది. జనవరి 21 వ తేదీన శాసనసభ ప్రథమ సమావేశమైనది. భారత శాసనసభయందీ జా. పా. క. స వేదిక విషయము చర్చవచ్చినపుడు, ప్రభుత్వ సభ్యులందరు పాల్గొనిరి. ప్రజాపక్ష తీర్మానమునకు వ్యతిరేకముగా వోటుచేసిరి. ప్రభుత్వము కలుగజేసికొనక, ప్రజాభిప్రాయమును తెలిసికొన నిశ్చయించి యున్నచో కాంగ్రెస్ పక్షమువారి తీర్మానమే నెగ్గియుండెడిది. "జాయింటు పార్లమెంటరీ కమిటీ వేదికలో వివరింపబడిన, రాజ్యాంగ విధానమునసరించి, శాసనము గావింపరాదు." అని కాంగ్రెస పక్షమువా రుపపాదించిరి. (Not to proceed with any legislation based on the said scheme) ఈతీర్మానమునకు జిన్నాగారొక సవరణ నుపపాదించిరి.[1]

(1) రెండవశాసనసభల నేర్పాటుచేయుటవల్లను, గవర్నరుల కొసగబడిన,

---

1. (" As regards the scheme of provinicial Governments, this house is of opinion that it is most unsatisfactory, and disappointing in as much as it includes various objectionable features, Particulary the establishment of second chambers, the extraordinary and special powers of the Governors, provisions relating to Police rules, secret service and intelligence Departments, which render the real control and responsibility of the Executive and legislature inaffective, and therefore, unless these objectionble features are removed, it will not satisfy any section of Indian opinion.

With respect to the Scheme of the central Government, called the "All India Federation" this house is clearly of opinion that it is fundamentally bad and totally unacceptable to the people of British India to advise his Majesty's Government not to proceed with any legislation based on this scheme and urges that immediate efforts should be made to consider how best to establish in British India alone a real and complete responsible Government, and with that view, take steps to review the whole position in consultation with Indian opinion without delay ".)

యత్యధిక, ప్రత్యేకాధికారములవల్లను, పోలీసు శాఖకు సంబంధించిన నియమములవల్లను, రహస్యపు టుద్యోగములు, సి. ఐ. డి శాఖలకు సంబంధించిన నియమములవల్లను, మంత్రివర్గము వారియొక్కయు, శాసనసభ వారియొక్కయు బాధ్యత నిరుపయోగమగుటవలన, రాష్ట్రప్రభుత్వములకు సంబంధించిన ప్రభుత్వ విధాన మసంతృప్తికరముగను, నాశాభంగకరముగను నున్నది. అందువలన, అనంగీకారములగు లక్షణములు తొలగింపబడినగాని, రాష్ట్రప్రభుత్వ రాజ్యాంగ విధానము, భారత దేశమందలి యేపక్షము వారినిగాని సంతృప్తిపరుపజాలదు.

(2) కేంద్ర ప్రభుత్వమునకు సంబంధించిన "సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ" విధానముల సూత్రములే చెడ్డవనియు, నావిధానము బ్రిటిష్ హిందూదేశప్రజల కెంతమాత్ర మంగీకారము కాదనియు, నందువలన సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ విధానము ననుసరించి హిందూదేశరాజ్యాంగ శాసనముగావింపవలదని బ్రిటిష్ ప్రభుత్వము వారికి, హిందూదేశ ప్రభుత్వము వారు, తెలుపవలెననికోరబడు చున్నారు. మరియు బ్రిటిష్ హిందూదేశమునందు మాత్రమే, సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించుటకు వెంటనే కృషిసలుపవలయును. ఈ దృక్పథముతో భారతీయాభిప్రాయానుసారముగ పరిస్థితుల నన్నింటిని వెను వెంటనే పునర్విమర్శించుటకు యత్నింప వలయును."

జాయంటు పార్లమెంటరీ కమిటీనివేదికయందు వివరింపబడిన రాజ్యాంగ విధానమును గురించి, యీరీతిగ, భారతశాసనసభ కూడ తీర్మానించెను. సీమ ప్రభుత్వము, భారతీయాభిప్రాయమును పెడచెవినిపెట్టినది. సం॥ 1935 రపు రాజ్యాంగ శాసనము, సుస్థిరమొనరింపబడినది. రాష్ట్రములకు సంబంధించిన రాజ్యాంగముమాత్రము 1937 సం॥ నుండియు నమలునం దుంచబడినది. శాసనోల్లంఘనము విరమింపబడినను ప్రభుత్వ నిర్బంధవిధానము మాత్రము వెంటనే విరమింపబడ లేదు. రాజకీయ ఖయిదీలు విడుదలయు చేయబడలేదు. రాష్ట్రములయందు కాంగ్రెసు ప్రభుత్వములు నెలకొల్పబడిన పిమ్మటనే రాజకీయ ఖయిదీలు విడుదలచేయబడిరి. వంగ, పంజాబు దేశములలో, విడుదల లితర రాష్ట్రములలోవలె గావింపబడ లేదు.

55
ఆంగ్లేయధర్మకర్తృత్వము : కపట నాటకము.

ఈవిధముగ భారతదేశము 1858 వ సంవత్సరము నాటనుండియు బ్రిటిషుప్రభుత్వముతో నేదో యొక విధముగ పోరాడుచునే యున్నది. ఒకప్పు డీపోరాటము సాయుధ విప్లవమైనది. మరొకప్పుడు సాత్త్విక నిరోధమైనది. వేరొకప్పుడు శాసనసభాబహిష్కరణ రూపముదాల్చినది. ఇంకొకప్పుడు శాసనసభాప్రవేశ రూపమునందినది. పార్లమెంటు, భారతదేశముపై రాజ్యాధికారమును వహించిననాటనుండియు నేటివరకునుగూడ నేదోవిధముగ భారతభూమి తన యవిశ్వాసమును జూపుచునేయున్నది. ఒకప్పుడు తీర్మాన రూపములుగ జూపుచువచ్చినది. మరొకప్పుడు త్యాగరూపమున ప్రదర్శించుచువచ్చినది. పార్లమెంటుసభయు భారతీయ అవిశ్వాసమునకు శక్తి కొలదియు మారుచేయుచునే వచ్చినది. భారతీయుల విశ్వాసము నాధారముగ గొని పరిపాలించుటలేదు. ఒకప్పుడు నిర్బంధవిధానమును ప్రకోపింపజేయుచున్నది. మరొకప్పుడు సంస్కరణల రూపముగ నెమ్మదట్టుచున్నది. ఎంత కాలము తన పశుబలశక్తితో భారతదేశము నస్వాతంత్ర్యమునం దుంచుటకు వీలుండునో అంతకాలము భారతదేశమును పిడికిటబట్టియుంచుటయే ఆంగ్లేయ రాజనీతి యనుట నిస్సంశయము. ఎంతత్వరితముగ సీమవారి హస్తములనుండి బయటపడుటకు సావకాశముండునో అంత త్వరితముగ స్వాతంత్ర్యమును బొంద భారతావని విశ్వప్రయత్నములు గావించిన దనుటయు విశుద్ధ సత్యము. ఇక సీమవారి ధర్మకర్తృత్వమున కర్థమేమి? ఇది సీమవా రాదినుండి యంత్యము వరకు నక్రమముగ నిర్వహింపగలుగుచు ధర్మకర్తృత్వము-నిర్వహింపజాలని ధర్మకర్తృత్వము. తమకు లాభమాపాదించుకొనిన ధర్మకర్తృత్వము. భారతీయులెన్నడు నంగీకరింపని ధర్మకర్తృత్వము. నిరంతర మపార త్యాగము చేయుచు నిరోధింపబడుచున్న ధర్మకర్తృత్వము. ఆంగ్లేయు లాపాదించుకొనుచున్న-పార్లమెంటు వహించుచున్న-నిర్వహించుచున్న-యీ విపరీత ధర్మకర్తృత్వమే దేశ రాజ్యాంగచరిత్రయందుగాని గోచరింపదు. ఈస్థితిని, ఆంగ్లేయుల సామ్రాజ్యతృష్ణ అందులకు బ్రతిగ భారతీయుల స్వాతంత్ర్యకాంక్ష లేక పాలకుల యొక్కయు-పాలితులయొక్కయు పరస్పరలాభముల సంఘర్షణము అనుట ధర్మపథము. యుక్తము. చరిత్రప్రసిద్ధ సత్యము.

ఈ వికట ధర్మకర్తృత్వమునకు 1935 వ సంవత్సర రాజ్యాంగశాసనానంతరమైన మార్పు సంభవించినదా? 1947 వ సంవత్సరమున, పార్లమెంటు గావించిన, భారతదేశ స్వాతంత్ర్య శాసనమునందైన, యీ ధర్మకర్తృత్వము సక్రమముగ నిర్వహింపబడినదా? సత్యమేమి?

---

# 3 వ పర్వము.

# భారత రాజ్యాంగ యంత్రము.

1 రాజ్యాంగ లక్షణములు.

ప్రథమపర్వమున, భారతజాతీయాస్వాతంత్ర్యపరిణామము వివరింపబడినది. ద్వితీయపర్వమున పాలకుల భగ్నవాగ్దాన పరంపరలును — పాలితుల స్వాతంత్ర్యకాంక్షయు — పాలకపాలితులమధ్య నిరంతరాయమానముగ జరుగుచున్న సంఘర్షణయొక్క తత్వమును — పాలితులొసగుచువచ్చిన రాజ్యాంగ సంస్కరణములలో నుపయోగింపబడుచుండిన రాజనీతియు విశదీకరింపబడినవి. ఇక ఈరాజ్యాంగ సంస్కరణముల లక్షణపరిణామ మరయవలసియున్నది.

"పార్లమెంటునకును, ప్రజాభిప్రాయమునకును, చక్రవర్తిగారికిని, బాధ్యత వహించుమంత్రివర్గమువారిచే పరిపాలనావిధానమంతయు నిర్వహింపబడుటయే మనరాజ్యాంగవిధాన మూలసూత్రము. హిందూదేశ పరిపాలనమండలి ముఖ్య కార్యనిర్వహణము. పార్లమెంటునకుగాని, చక్రవర్తిగారిచే నియమింపబడినవారికి గాని బాధ్యతవహింపక హిందూదేశమునందు వర్తకవుదినుసులు మాత్రమే గలిగియుండి హిందూదేశముతో మరెట్టిసంపర్కముగాని లేని యొకసంఘము వారి యధీనమునందు భారతీయపరిపాలన ముంచబడినది. ఇది చాల నక్రమమైనది." అని 1858 వ సంవత్సర రాజ్యాంగశాసనమును కామన్సుసభలో నుపపాదించుచు విస్కవుంటు పామెర్స్టనుగారు నుడివిరి. 1

కంపెనీవారి యధీనమునుండి హిందూదేశప్రభుత్వమును సీమదేశ ప్రభుత్వము స్వాధీనముచేసికొనుచు నుడివిన పై వాక్యములు హిందూదేశమున నాట నుండియు బాధ్యతాయుత పరిపాలనమును నెలకొల్పవలెనను యాప్సితమును సీమప్రభుత్వమువారు గలిగియున్నటుల ధ్వనించుచున్నవి. నాటనుండియు సీమ

1. See. Viscount Palmerston's speech. House of Commons. 12th Feb, 1858.

ప్రభుత్వ మొసగుచున్నది: రాజ్యాంగ సంస్కరణములయందు బాధ్యతాయుత
ప్రభుత్వలక్షణములు గలవా? ఎంతవరకు? హిందూదేశ ప్రభుత్వమెట్టిది?

## 2. 1858 సం॥ర శాసనలక్షణములు :—

1858 వ సంవత్సర శాసనమువల్ల హిందూదేశ ప్రభుత్వమునకొక
రాజ్యాంగవిధాన మేర్పరుపబడినది. ఈరాజ్యాంగవిధానము 1920 వ సంవత్సరము
వరకునుగూడ ముఖ్యలక్షణములయందు నిసుమంతయు మార్పు చెందియుండలేదు.
కంపెనీవారి డైరక్టరులసంఘమునకును, ప్రొప్రయిటరులసంఘమునకును గల యధి
కారములు మాత్రమే తీసివేయబడినవి. హిందూదేశప్రభుత్వము — అనగా
కౌన్సిలుయుతుడైన గవర్నరుజనరలు — హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి
యాయనసమాలోచనసభ (కౌన్సిలు) — వీటిపైన పార్లమెంటు సభలతోగూడిన
చక్రవర్తి — యీమూడుసంస్థలకు నొకదానిపై నొకదానికి పెత్తనమొసగుచు
హిందూదేశ రాజ్యాంగము వ్రాయబడినది. పార్లమెంటునకును — చక్రవర్తికినిగల
యధికారములను సీమమంత్రివర్గము వారే నిర్వహించుచుందురు. ఈమంత్రివర్గము
వారి యధికారములు హిందూదేశరాజ్యాంగకార్యదర్శిచే నిర్వహింపబడునట్లు
రాజ్యాంగమునం దేర్పరుపబడినది. కంపెనీవారి డైరక్టరులకును, ప్రొప్రయిటరు
లకును, యిండియాబోర్డునకునుమారుగ 1858 వ శాసనము ననుసరించి హిందూ
దేశరాజ్యాంగ కార్యాలయ మేర్పరుపబడినది. ఇందలి రాజ్యాంగకార్యదర్శికి,
కంపెనీకిని — యిండియాబోర్డునకుగల సర్వాధికారము లొసగబడినవి.
ఈ రాజ్యాంగకార్యదర్శి హిందూదేశవ్యవహారములపట్ల, " మంత్రివర్గమునకు
బాధ్యతవహించువాడుగ, విదేశీయవ్యవహారముల కార్యదర్శివలె, అధినివేశ
రాజ్యములకార్యదర్శివలె పనిచేయవలసినవా డగుటచే యీతనినిర్ణయము
లన్నివిషయములలోను తుదినిర్ణయముగ నుండునట్లొనరింపబడినది. ఈయన
సమాలోచనసంఘమునకు సలహానొసగు నధికారమేగలదు. ఈసంఘమున 15
గురు సభ్యులుందురు. ఇందు 8 గురు సీమప్రభుత్వమువారిచేతను, మిగిలిన 7
గురును డైరక్టరులవల్లను నియమింపబడుదురు. వీరు తమ పదవులనుండి పార్ల
మెంటుసభల కోరికమీదనే తొలగింపబడగలరు. ఈసభ్యులలో చాలమంది

కనీసము 10 సంవత్సరములు హిందూదేశ పరిపాలనానుభవము గలిగినవారుగ నుండవలయును. లేదా, హిందూదేశమున కనీసము 10 సంవత్సరములు కాపురముండిన వారుగనైన నుండవలయును. వీరు హిందూదేశమునువిడి 10 సంవత్సరములు దాటియుండరాదు. ఈయర్హతలను కనీసము 9 గురు సభ్యులైన సంతరించియు గలిగియుండవలయును. హైకోర్టుల యెన్నికల మూలముగ నెన్నుకొనబడిన సభ్యులలో రాజీనామాలవల్లగాని, మరణములవల్లగాని, సంభవించుఖాళీలను సీమప్రభుత్వమునకే, భర్తీ చేసికొనుట కధికారముగలదు. ఈసమాలోచన సంఘము తనంతట తానేమియు చేయనశక్తురాలు. దీనికి కార్యదర్శియే యధ్యక్షతవహించుచుండును. ఈయనకు తుదినిర్ణయాధికారపు వోటుగలదు. కార్యదర్శి హాజరుకాకుండ సమాలోచనసంఘమొనరించు నిర్ణయములను తిరిగి కార్యదర్శి వ్రాతమూలకముగ సంగీకరించినగాని, ఇవి చెల్లనేరవు. ఈయన, యాలోచన సంఘమువారి సలహాలను త్రోసిరాజనుట కధికారమును గలిగియున్నాడు. కాని,యాదాయమును, నాస్తిని, వ్యయపరచుటను, (Appropriation) నాస్తిసన్యాక్రాంతముచేయుట, లేక తాకట్టుపెట్టుట, లేక అమ్ముట, కంట్రాక్టులు, నుద్యోగుల జీతములనుమార్చుట — శెలవునియమములు, మొదలగు విషయములలో రాజ్యాంగకార్యదర్శి, సలహాసంఘమువారి తీర్మానమును గమనించకతీరదు. వారమున కొకపర్యాయమీ సలహాసంఘము సమావేశము కావలసియున్నది. అయిదుగురుసభ్యులు కనిష్టసభాసంఖ్య. (Quorum).

హిందూదేశమునుండి పంపబడు నుత్తర ప్రత్యుత్తరములన్నియు నీసంఘమునకే పంపవలయును. అత్యవసర విషయములైనను— యుద్ధములొనరించుట, సంధి గావించుకొనుట మొదలగు ముఖ్యవిషయములైనపుడు గాని, అవి "రహస్యపు" టుత్తరములైనపుడుగాని కౌన్సిలుతో నిమిత్తము లేకుండగ రాజ్యాంగ కార్యదర్శియే వాటినివిప్పి వ్యవహరింపగలడు. గవర్నరు జనరలును-మదరాసు, బొంబాయి గవర్నరులునుగూడ రహస్యపు టుత్తరువులను వ్రాయవచ్చును. అవియు రాజ్యాంగ కార్యదర్శియే విప్పి చదువుకొనుట కధికారము గలిగింపబడినది. రాజ్యాంగ కార్యదర్శి యనుమతితోను, లేక కోరికమీదను మాత్రమే యట్టి రహస్యపు టుత్తరములను సలహాసంఘము చదువుటకు సావకాశమున్నది.

కంపెనీవారి యిండియా ఆఫీసు యుద్యోగు లందరును—రాజ్యాంగకార్యదర్శి కార్యాలయమునం దుద్యోగులుగ గ్రహింపబడిరి. రాజ్యాంగ కార్యదర్శి యొక్కయు, నాయన కార్యాలయముయొక్కయు వ్యయమంతయు హిందూదేశ ప్రభుత్వాదాయమునుండియే వెచ్చించుటకు నిర్ణయింపబడినది. హిందూదేశాదాయమునుండియే కంపెనీవారి ఋణమును-డివిడెండును చెల్లింపనిర్ణయము. ఈ ఖర్చుపోను, మిగిలిన యాదాయము హిందూదేశమునందే వ్యయపరుపవలసియున్నది. ఈ విధముగ వ్యయపరుచుటలో రాజ్యాంగకార్యదర్శి సలహాసంఘమువారి సమ్మతినిగూడ పైనవివరించిన విధముగ పొందవలసియున్నాడు. కంపెనీవారి యాస్తియంతయు చక్రవర్తికి సంక్రమింప జేయబడినది.

కంపెనీ మరణానంతరము రాజ్యాంగకార్యదర్శి సన్నిహితజ్ఞాతి యగుటచే కంపెనీవారిపైగల లావాదేవీలన్నింటికిని రాజ్యాంగ కార్యదర్శి బాధ్యుడుగ నొనరింపబడినాడు. దావాలు వేయుటకును, యితరులు వేసినదావాలకును హిందూదేశ ప్రభుత్వపక్షమున రాజ్యాంగకార్యదర్శియే బాధ్యుడు.

గవర్నరు జనరలుగారిని, నాయన కౌన్సిలు లామెంబరుగారిని, గవర్నరులను, (ఎడ్వకేటు జనరలు) ప్రధానన్యాయవాదులను, సీమ ప్రభుత్వమే నియమించుట కధికారము పొందినది. సలహాసంఘమునందలి యధిక సంఖ్యాకుల యంగీకారముతో రాజ్యాంగకార్యదర్శియే, గవర్నరు జనరలు - గవర్నరుల కౌన్సిలు సభ్యులను నియమింపగలడు. సీమ ప్రభుత్వమువారి యంగీకారముతో గవర్నరు జనరలుగారే లెఫ్టినెంటు గవర్నరులను నియమించుట కధికారము గలిగింప బడినాడు. (కౌన్సిలు సభ్యులను నియమించుటలో మార్లేగారు కలుగజేసికొనుటను మింటోగారు సహింపజాలక పోయిరి.) హిందూదేశమునం దొసంగబడు నుద్యోగములన్నియు, యధాప్రకారము హిందూదేశమునందే యొసగుటకు నిర్ణయింపబడినది. సీమదేశమునుండి నియమింపబడు నుద్యోగులకు రాజ్యాంగ కార్యదర్శి సివిలుసర్వీసు కమీషనరుల సలహా సంప్రదింపులతో పోటీపరీక్షలకు వలయునియమముల నేర్పరుపవలసి యున్నది. సైనికోద్యోగములు కొన్నింటిని రాజ్యాంగకార్యదర్శియు — మరికొన్నింటిని రాజ్యాంగకార్యదర్శియు నాతని కౌన్సిలును గలిసి యొసంగుట కధికారము గలిగింపబడినది.

కంపెనీ వారి సైనిక నావికాదళములన్నియు సీమప్రభుత్వమువారి యధీన మొనరించుకొనబడినవి. హిందూదేశమునందు యుద్ధములగావించుటకై యొసగ బడు నుత్తరువులను మూడుమాసములు దాటకుండ పార్లమెంటునకు విన్నవించు కొనుచుండుట విధి.

పార్లమెంటువారి యనుమతిలేనిదే హిందూదేశ సైనికనివహములచేత హిందూదేశపుసరిహద్దులబయటి యుద్ధములలో పాల్గొనుటకుగాను హిందూదేశా దాయము వ్యయబుచ్చరాదని శాసింపబడినది అయినను, సత్యవసరసమయ ములలోను, లేక యితరదండయాత్రలనాపు జేయుటకును, నెదుర్కొనుటకును, నవసరమగుచో హిందూదేశాదాయము పార్లమెంటువారి యనుమతి ముందు పొంద నవసరములేకుండగనే వ్యయపరుప బడగలదు. 1 ఈ రాజ్యాంగమును నాడు గ్లాడుస్టనుగారు కూడ సంగీకరించియే యున్నారు. హిందూదేశప్రభుత్వ కార్యనిర్వహణముపై తుదినిర్ణయాధికార మీవిధముగ సీమప్రభుత్వ మంత్రి వర్గమువారి చేతులయందునను, పార్లమెంటువారి యధీనమునందునను పొందు పరచుకొనబడినది. హిందూదేశప్రజలకెట్టి యధికారమును తమ దేశప్రభుత్వ మునం దొసగి యుండలేదు.

చక్రవర్తి బిరుదము.

హిందూదేశ ప్రభుత్వమునందుగల సర్వహక్కులును సీమ ప్రభుత్వమునకు దఖలు పరుపబడి నప్పటికిని, సీమదేశపు రాజునకు హిందూదేశాధికారమును సూచించగల బిరు దము నొసగియుండలేదు. కాని, 1876 లో ప్రభువుల బిరుదముల శాసనము ననుసరించి2 హిందూదేశప్రభుత్వ సర్వాధికార సూచకముగ విక్టోరియా మహా రాణికి చక్రవర్తిని బిరుద మొసగబడినది. 1877 జనవరి 1 వ తేదీని చక్రవర్తిని బిరుదము ప్రకటింపబడినది. 1903–1911 సంవత్సరములలోగూడ సప్తమ ఎడ్వర్డుప్రభువును, పంచమజార్జిప్రభువును రాజ్యాధికారము వహించినపుడుగూడ చక్రవర్తిబిరుదములు ప్రకటింపబడినవి. ఈ చక్రవర్తిబిరుదమును ప్రకటించు

1. Section 55.
2. Royal titles Act 1876.

కొనుట మూలముగ హిందూ దేశముపై సమస్తహక్కులును సీమ దేశపురాజునకు సంక్రమించుట నిశ్చయమని మరొక రూపముగ రూఢిచేయబడినది.

నిస్సంశయముగ నుండుటకై హిందూ దేశప్రజలకు వెల్లడింపబడినది. ఈ విధముగ ప్రకటించుట తుందుఁకుకు తనమేమోనని నాటి సీమరాజకీయ వేత్తలు కొందరు తలంచియే యుండిరి. కాని, యప్రతిహతముగ, హిందూ దేశముపై గల యధికారమును ప్రకటించుటయు సమంజసమని నిరంకుశసామ్రాజ్య వాద ప్రభువులు నిశ్చయించి యట్లొనరించిరి.

# 3. సీమలోని హిందూ దేశ ప్రభుత్వము; రాజ్యాంగ కార్యదర్శి

చక్రవర్తి రాజ్యాంగము.

ఈవిధముగ హిందూ దేశ రాజ్యాధికార సర్వస్వమును సీమ ప్రభువునకు సంక్రమింపజేయుటచేత హిందూ దేశ ప్రభుత్వప్రధాన కార్యాలయము సీమ దేశమునందే యేర్పరుపబడినది. స్వాతంత్ర్యముగల యే దేశములప్రభుత్వ ప్రధాన కార్యస్థానములును వి దేశములయందు లేవు. సీమప్రభుత్వ కార్యాలయము సీమయందేయున్నది. ఫ్రాంసు, జపాను, అమెరికా, జర్మనీ మొదలగు దేశముల ప్రభుత్వ కార్యాలయము లాయా దేశములయందేగలవు. రాజ్యాంగ యంత్రముమాత్రమే హిందూ దేశమునం దున్నది.

సహజముగ పాలకులకధికారము ప్రజలచే సంక్రమింప జేయబడును. ప్రజలొసగిన యధికారమును నిర్వహించుటయే యాధునిక ప్రభుత్వముల లక్షణము. హిందూ దేశ ప్రభుత్వమిందులకు తలక్రిందులుగనున్నది. ప్రజలనుండి ప్రభుత్వాధికార స్వాతంత్ర్య మపహరించి వేయబడి సీమప్రభువునందు కేంద్రీకరింపజేయబడినది. ఈ విధముగ ప్రభుత్వాధికారము నిర్వహించుచున్న రాజ్యాంగ కార్యదర్శియే సీమయందలి హిందూ దేశప్రభుత్వస్వరూపము. (Home Govt.).

ఒకప్పుడు సీమప్రభుత్వము నిరంకుశ ప్రభువులచే పరిపాలింపబడినది. కాని, రానురాను సీమప్రభువు "నామమాత్రపు ప్రభువు"గ నొనరింపబడినాడు. శాస్త్రరీత్యామాత్రమే ప్రభువు. (Constitutional Monarch). ఈ నామమాత్ర ప్రభువాంగ్లేయ సామ్రాజ్యమునకంతకును కొలికిపూసగ నున్నాడు. సామ్రాజ్యమంతయు నీయన పేరున పరిపాలింపబడుచున్నది. అనగా, సామ్రాజ్యమునందలి పరిపాలనమంతయు దేవాలయమునందలి నైవేద్యము వలె యీయనకు నైవేద్యముగావింపబడుచున్నది. ఈస్థితియే సామ్రాజ్యమునందుగల యస్వాతంత్ర్య హిందూదేశమునకుగూడ వర్తించుచున్నది. ఈ సిద్ధాంతము ననుసరించియే హిందూదేశ ప్రభుత్వమంతయు పైనవివరింపబడిన రాజ్యాంగకార్యదర్శి మూలముగ నిర్వహింపబడుచున్నది.

**4 రాజ్యాంగ కార్యదర్శి**

ఈరాజ్యాంగకార్యదర్శి పార్లమెంటునకు బాధ్యత వహించవలసిన వాడగుటచే, పార్లమెంటుయొక్క యభిమతము ననుసరించియే చరించవలసినవాడు. ప్రతిముఖ్యవిషయమును సీమమంత్రివర్గమున కాలోచనకు బంపి వారియభిమతానుసారమే ప్రవర్తించుటవిధి. ఈయన పార్లమెంటునకు బాధ్యుడగుటచేతనే హిందూదేశ ప్రభుత్వమీయనకు తాబేదారుగ నుండవలసి వచ్చినది. ఇందువల్ల హిందూదేశమును ఢిల్లీ ప్రభుత్వము పరిపాలించుటలేదు. సీమదేశమునుండియే హిందూదేశము పరిపాలింపబడుచున్నది. "భారత శాసనసభయందు, లేక రాష్ట్రీయ శాసనసభలయందు గావింపదలచిన శాసనవిషయములన్నియు, ముందుగ రాజ్యాంగ కార్యదర్శికి నందలి సిద్ధాంతము నంగీకరించుటకై, పంపబడును. హిందూదేశ ప్రభుత్వాదాయమునకు సంబంధించిన ప్రతివిషయము నాయనకు నివేదింపబడును. ముఖ్యముగ నిరకునామావిషయములు; నాణెముల చెలామణి విషయములు; ప్రభుత్వ ఋణములు మొదలయినవియు, నితరవ్యయములకు సంబంధించిన విషయములన్నియును పంపబడును. రాజ్యాంగ కార్యదర్శికిగల యధికారముల నన్నిటిని వివరించవలెనన్న నది విశేషశ్రమ. కట్టడములు, రైల్లు, క్రొత్త పెద్దయుద్యోగముల నేర్పరచుట, జీతముల హెచ్చించుట లేక మార్చుట, స్థానిక ప్రభుత్వముల కప్పులనొసగుట, బిరుదము లొసగుట, సంస్థానముల కప్పులొసగుట, వేడు

కలకు విరివిగ ఖర్చుపెట్టుట, రాజకీయ గౌరవ భృతులనొసగుట, మతములకు లేక దానధర్మములకు విశేష ధనవ్యయముచేయుట, గనులను కవుళ్ళకిచ్చుట మొదలగు వర్తకవిషయములు—సైనికవ్యయమును పెంచుట మొదలగు పనులన్నియు రాజ్యాంగకార్యదర్శి యధికారమునకు లోబడి, యాతని యంగీకారమును పొంది, గావింపవలయును. ఇన్నియేల? హిందూదేశ ప్రభుత్వమునకు ముక్కునకు త్రాళ్లుపోయబడి, యాత్రాళ్లు రాజ్యాంగకార్యదర్శి చేతులయందుంచబడినవి."[1] "పార్లమెంటు హిందూదేశ ప్రయోజనమును అప్పుడప్పుడు నిద్దురబోవుచు సంరక్షించుచున్నను, పార్లమెంటెప్పుడు ప్రశ్నించునోయను భావముననే రాజ్యాంగ కార్యదర్శి తనకు గల నిర్దేశాధికారములను, పరీక్షాధికారమునుగూడ హిందూదేశ ప్రభుత్వముపై చెలాయించుచునే యుండును." అని మాంటేగూచెలమ్సుఫర్డు నివేదికయందు వ్రాయబడినది.[2]

1 సలహాసంఘ నిర్మాణము సం॥ 1869 ర శాసనము

1869 లో గావింపబడిన హిందూదేశ ప్రభుత్వ శాసనము ననుసరించి యాయన సలహాసంఘమునం దేర్పడు ఖాళీలను భర్తీచేసికొనుట కాయనకే యధికార మొసగబడినది. సభ్యుల ఉద్యోగ కాలపరిమితిగూడ మార్చబడినది. ప్రతిసభ్యుని ఉద్యోగ కాలపరిమితియు సం॥ 10 లుగ నిర్ణయింపబడినది. తిరిగి వీరే యుద్యోగానంతరము నియమింపబడరాదు. అట్లు నియమింపబడుచో నందులకు గల ప్రత్యేక కారణములు పార్లమెంటుసభలకు నివేదించవలసి యున్నది. 1874 లోనే కంపెనీ యెత్తివేయబడినది.

2 స॥ 1876 ర శాసనము

పిమ్మట సం॥ 1876 ర శాసనముననుసరించి తిరిగి సభ్యులుగా నుండదగినవారి యనర్హతలు మార్చివేయబడినవి. ఎవ్వరైనను రాజ్యాంగ కార్యదర్శిచే నియమింపబడవచ్చునని మార్చబడెను. సభ్యులసంఖ్య 15 నుండి 10 కి తగ్గింపబడినది.

1. Quoted by V. G. Kale. Indian Administration. P. 65.
2. See. Montagu Chelmsford Report. Para 35.

3 సం॥ 1889 ర శాసనము

సం॥ 1889 రములో గావింపబడిన శాసనము ననుసరించి సభ్యులసంఖ్య తగ్గింపబడినది. (Council of India Reduction Act.)

4 సం॥ 1907 ర శాసనము

సం॥ 1907 రపు రాజ్యాంగ శాసనముననుసరించి రాజ్యాంగ కార్యదర్శి సలహాసంఘసభ్యులసంఖ్య 14ర కంటె హెచ్చుగనుండరాదని నిశ్చయింపబడెను. గరిష్ట సంఖ్యకు మించని సంఖ్యను రాజ్యాంగ కార్యదర్శియే నిర్ణయించుకొనుట కధికారమొసగ బడినది. సభ్యుల ఉద్యోగకాలపరిమితి సం॥ 7 లు. తదనంతరము మరల సం॥ 5 లు వరకు ఒకేసభ్యుడు నియమింపబడవచ్చును. ఈ సభ్యులకు మరల నర్హతలు నిరూపింప బడినవి. అధికసంఖ్యాకులగు సభ్యులు హిందూదేశమున 10 సంవత్సరములు నివసించినవారైన యుండవలయును. యుద్యోగ మొనరించినవారైన యుండవలెను. మరియు, వీరు హిందూదేశమునువీడి సం॥ 5 ల కంటె హెచ్చుకాలమును మించ రాదు. అనగా, సామాన్యముగ హిందూదేశమునం దుద్యోగము జేసినవారికే సభ్యత్వము లొసగబడినవి. ఇందువల్ల హిందూదేశ వ్యవహారములను రాజ్యాంగ కార్యదర్శి తెలిసికొనుటకు సావకాశముండునని చెప్పబడినది.

మార్లేకాలమునందే యీసలహాసంఘమునం దిరువురు భారతీయులు నియమింపబడిరి. ఇట్లు భారతీయులు నియమింపబడవలెనను శాసననిరూపణము లేదు. ఆచారముమాత్రమే యేర్పడినది. ప్రభుత్వాభిప్రాయముతో నెల్లప్పుడు నేకీభవించు ప్రభుభక్తిపరాయణులు, మితవాదులు మొదలగువారు మాత్రమే యిట్లు సభ్యులుగ నియమింపబడుచున్నారు.

5 రాజ్యాంగ కార్యదర్శి కార్యాలయము; కార్యనిర్వాహణము. working of the Council.

సం॥ 1858 రపు శాసనము ననుసరించి రాజ్యాంగ కార్యదర్శి కార్యనిర్వాహణమునకై యుపసంఘమును వేయుట కధికారమును గలిగియుండెను. ఆయుపసంఘముల కార్యనిర్వాహణముపై పరీక్షాధికారము, తుదినిర్ణయాధికారము గూడ రాజ్యాంగ కార్యదర్శివే. ఈరాజ్యాంగ కార్యదర్శి కిరువురు సహాయకార్యదర్శులున్నారు. ఒక యసిస్టెంటు

సహాయకార్యదర్శియు గలడు. ఒక యాంతరంగిక కార్యదర్శియు నున్నాడు. మరి యిరువు రసిస్టెంటాంతరంగిక కార్యదర్శు లున్నారు. వీరిక్రింద పలువురు కార్యాలయోద్యోగులు, గుమస్తాలును నున్నారు. ఒక్కొక్కశాఖకొక శాశ్వత కార్యదర్శియు, నలుగురు లేక నయిదుగురు సభ్యులతో గూడిన యొక యుపసంఘ మును నుండును. ఆర్థికము, రాజకీయము, రహస్యము, న్యాయశాఖ, ప్రజాహిత శాఖ, మొదలగుశాఖలుగ విభజింపబడి కార్యక్రమము నిర్వహింపబడుచున్నది. ఒక్కొక్కసభ్యుడు, రెండేసి యుపసంఘములలో సభ్యుడుగానుండుట కర్హుడు.

6
రాజ్యాంగ కార్యదర్శి
కార్యాలయ
సంస్కరణము
1914.

ఈ రాజ్యాంగ కార్యదర్శి కార్యాలయము సంస్కరింప బడుటకై 1914 మే 25 వ తేదీని లార్డుక్రూగారొక బిల్లును ప్రభువులసభలో ప్రవేశపెట్టియుండెను. దీని లక్షణము లెవరికిని నయించలేదు. ఈబిల్లు త్రోసివేయబడినది. ఈ బిల్లామోదింపబడియున్నచో నుపసంఘముల పద్ధతి రద్దయి యుండెడిది. హిందూదేశప్రభుత్వమునందుగల శాఖలననుసరించి శాఖ లేర్పరుపబడి యుండెడివి. సలహాసంఘసభ్యులసంఖ్య 8 గురికి తగ్గించివేయబడెడిది. జీతము సాలుసరి పౌ 1200 లుగ నిర్ణయింపబడెడిది.

ఈహిందూదేశ రాజ్యాంగకార్యదర్శి కార్యాలయ మస లనవసరమని భారతీయుల విశ్వాసము. ఇది యనవసర వ్యయహేతువనియు, హిందూదేశ స్వాతంత్ర్య పరివర్తనమునకిది ప్రతిఘటనమనియు, కాంగ్రెసువాదుల నిశ్చయము-

7
మాంటేగూ *
సంస్కరణములు,
రాజ్యాంగ కార్యదర్శి

కాంగ్రెసు-లీగు-సంస్కరణముల విధానమునందీ రాజ్యాంగ కార్యదర్శిని, యాయనకార్యాలయమును నెత్తివేయుమని కోరబడినది. ఈరాజ్యాంగ కార్యాలయ ముద్యోగము నుండి విరమించినవారికిని, నలసిపోయినవారికిని, విశ్రాంతి స్థానమైనది. అయినను, మాంటేగూ చెలమ్సుఫర్డు నివేదికయందు హిందూదేశప్రభుత్వాపై రాజ్యాంగకార్యదర్శి నిరంకుశాధికారము తొలగింపరాదని సూచింపబడినది. కాని, కౌన్సిలుయుతుడైన గవర్నరుజనరలు

గారికి కొంతస్వేచ్ఛ యొసగవలయునని మాత్రము సూచించిరి. కొన్నివిషయములు గవర్నరుజనరలుగారిచే నిర్వహింపబడి రాజ్యాంగకార్యదర్శికి నివేదించుటయే తగునని సూచింపబడినది. రాజ్యాంగకార్యదర్శి జీతము సీమ ప్రభుత్వకోశమునుండి యితర సీమమంత్రుల జీతమువలె చెల్లింపదగునని మాంటేగూ నివేదిక సూచించినది. హిందూదేశవ్యవహారములను విమర్శించుటకై యొకసంఘము నియమింపదగునని సూచింపబడెను. ఈసూచన ననుసరించి లార్డు క్రూ కమిటీ నియమింపబడినది. రాజ్యాంగకార్యదర్శి కార్యాలయ పునర్నిర్మాణమును గురించియు, రాజ్యాంగకార్యదర్శి యధికారమును గురించియు, సలహాసంఘమును గురించియు క్రూకమిటీ విధులు. ఈక్రూకమిటీ గూడ మాంటేగూ నివేదికయందలి సూచనలనే చాలవరకు సూచించియుండెను.

1919 రాజ్యాంగ సంస్కరణముల ననుసరించి—

ఈసూచనల ననుసరించి రాజ్యాంగ కార్యదర్శి కార్యాలయవ్యయమంతయు సీమప్రభుత్వకోశమే భరించవలయునను సూచనను జాయింటు పార్లమెంటరీ కమిటీగూడ యంగీకరించినది. సలహాసంఘమును మాత్రము రద్దు చేయుట కంగీకరించియుండలేదు. పార్లమెంటువారీసూచన నంగీకరించిరి. 1919 రాజ్యాంగశాసనమునందలి 30—32 సెక్షనుల ననుసరించి రాజ్యాంగకార్యాలయ వ్యవహారములు నిర్ణయింపబడినవి. రాజ్యాంగకార్యదర్శియొక్కయు, ఆయన కార్యాలయముయొక్కయు, వ్యయము సీమకోశమే భరించునట్లుగ నిర్ణయింపబడినది. సలహాసంఘము మాత్రము రద్దుగావింపబడలేదు. దీని సభ్యులసంఖ్య తగ్గింపబడినది. గరిష్టసంఖ్య 14 నుండి 12 వరకును, కనిష్ఠసంఖ్య 10 నుండి 8 గురికిని తగ్గింపబడినది. ఇందులో సగముమంది హిందూదేశమున సం॥ 10 ల కాలము నివాస మొనరించి, లేక, యుద్యోగము జేసినవారుగ నుండవలయును. ఉద్యోగ కాలమునకు వీరు హిందూదేశమును వీడి 5 సం॥ల కంటె హెచ్చుకాగూడదు. సం॥ 7 లకు మారుగ నుద్యోగకాలపరిమితి సం॥ 5 లుగ నిర్ణయింపబడినది. సభ్యుల జీతము సాలుసరి పౌ. 1200 లు. హిందూదేశపౌరుడయి యుండిన సభ్యునకు మరి పౌ 600 లు ప్రత్యేకభృతిగలదు. "ఈ జీతబత్తెములు, హిందూదేశకోశము నుండి, లేక సీమకోశమునుండి చెల్లింపవలయును." రాజ్యాంగకార్యదర్శియే

సభలకు వలయు కనిష్ఠసంఖ్యను నిర్ణయించుకొనగలడు. వెనుకటివలె వారమునకు మారుగ నెలకొకసభ తప్పనిసరిగ సమావేశ పరుపవలయును. వెనుకటివలెనే యుపసంఘములనువేసికొను నధికారము రాజ్యాంగకార్యదర్శి కొసగబడినది. హిందూదేశప్రభుత్వముపై రాజ్యాంగకార్యదర్శి తనపెత్తనమును నిర్ణీతమొన రించుకొనవలయుననియు, నియమితముగావించు కొనవలయుననియు ౩౩వ సెక్షన్ ననుసరించి నిరూపింపబడినది. "హిందూదేశప్రభుత్వమును, భారతశాసన సభయు నేకీభవించినవిషయములలో రాజ్యాంగకార్యదర్శి ప్రత్యేకవిషయములలో మాత్రమే జోక్యముగలిగించుకొనుచుండవలయునని జాయంటు పార్లమెంటరీని వేదిక పేర్కొనినది. "ఇట్టి ముఖ్యవిషయము నిరకునామాస్వాతంత్ర్యము. భారతశాసన సభయు, హిందూదేశప్రభుత్వమును కలిసి హిందూదేశప్రయోజనము ననుసరించి నిర్ణయించుకొను నిరకునామానీతితో రాజ్యాంగకార్యదర్శి జోక్యము కలిగించుకొన రాదని నిర్వచింపబడెను. కాని, సామ్రాజ్యముయొక్క యంతర్జాతీయ వ్యవహారములకును, సామ్రాజ్యాంతర్భాగ దేశములతోగల యొడంబడికలకును భంగమువచ్చు నిరకునామానీతిని ప్రతిఘటింపవచ్చునని జాయంటుపార్లమెంటరీ కమిటీయే వ్రాసినది.

**9 రాష్ట్రప్రభుత్వములు —** రాష్ట్రప్రభుత్వములకుకూడ స్వాతంత్ర్యమవసరము. "రాష్ట్రములకు సంబంధించిన విషయములలో రాష్ట్రప్రభుత్వములును, రాష్ట్రశాసనసభలును, నేకీభవించిన విషయములలో తరుచుగ వారియభిప్రాయము మన్నింపబడుచుండ వలయును. కాని, ప్రత్యేక శాఖలలో హిందూదేశప్రభుత్వమునకు సంబంధముగల విషయములుగలవు. ఈ విషయమును మరువరాదు" అని రాష్ట్రప్రభుత్వములను గురించి జాయంటు పార్లమెంటు కమిటీ వ్రాసినది. ప్రజాయత్తశాఖలపై కేంద్ర ప్రభుత్వాధికారమును రాజ్యాంగకార్యదర్శి యధికారమును చాలవరకు తగ్గించుకొన దగుననియు నిరూపింపబడినది. (సెక్షను 1. సబుసెక్షను 3.)

సంస్కరణశాసనము ననుసరించి హిందూదేశముపట్ల సీమలోనొక హైకమీషనరును నియమింపబడుటకుకొన్నింబ యుతుడగు చక్రవర్తిగారికధికార

మొసగబడినది. ఈయనకు రాజ్యాంగకార్యదర్శి నిర్వహించుచున్న కొన్నియధికారములను సంక్రమింపజేయుటకుగూడ చక్రవర్తిగారి కధికారమొసగబడినది. “రాజ్యాంగకార్యాలయమునందు యేజెన్సీకనికిని, రాజ్యాంగ వ్యవహారములకును సంబంధమును విడదీయుట సమంజసమని క్రూ కమిటీగూడ వ్రాసినది. ఈవిధముగ హైకమీషనరు నియమింపబడి హిందూదేశప్రభుత్వ పక్షమున సైన్యసామానులను కొనుట మొదలగు కృత్యములనొనరించుచున్నాడు. ఈపనులుగూడ రాజ్యాంగకార్యదర్శియే యిదివరలో నెరవేర్చుచుండెడివాడు.

10 హైకమీషనరు— సె. 35.

11 ముద్రిమను సంఘము—

ముద్రిమను సంఘ నివేదికయందు గూడ రాజ్యాంగ కార్యదర్శి యధికారము తగ్గింపబడుటకు సావకాశము లేదని వ్రాయబడినది. సం॥ 1919 ర రాజ్యాంగ శాసనము ననుసరించి 33వ సెక్షను ప్రకారము రాజ్యాంగకార్యదర్శి యధికారము నియమితమొనరించుకొనబడినది. 49 వ నియమప్రకారము (49 Rule of Devolution of Rules) కొన్ని నియమితము లేర్పరుపబడినవి.

(1) కేంద్ర ప్రభుత్వ విషయములను సంరక్షించుటకును —

(2) రెండు రాష్ట్రములమధ్య సంభవించు వివిధవిషయములలో ఒడంబడిక కుదురని సందర్భమున —

(3) సామ్రాజ్య శ్రేయస్సంరక్షణమునకు —

(4) హిందూదేశ ప్రభుత్వమునకును నితర యధినివేశ రాజ్యములకును మధ్య సంభవించు సమస్యలలో హిందూదేశ స్థానమును నిర్ణయించుపట్లను —

(5) రాజ్యాంగ కార్యదర్శి సంరక్షింపవలయునని విధింపబడి యుండిన విధులు, హక్కులు (అనగా సెక్షను 29 ఎ, సెక్షను 30 (I A) 7 వభాగము.) రాజ్యాంగ కార్యదర్శి కౌన్సిలునకు సంబంధించిన హక్కులు - విధులు కాపాడవలసివచ్చినప్పుడును —

రాజ్యాంగకార్యదర్శి తనకుగల పరీక్షాధికారమును, సాక్ష్యాధికారమును

ప్రజాయత్తశాఖలపట్ల వినియోగించదగును. కాని, యితర విషయములలో జోక్యము గలిగించుకొనరాదు.

హిందూదేశప్రయోజనమునకు సంబంధించిన విషయములపై నయినను, రాజ్యాంగ కార్యదర్శి పెత్తనము రద్దుచేయబడు టవసరమని మద్దిమను సంఘము కూడ నివేదించినది. ఈ విధముగ రాజ్యాంగ కార్యదర్శికిగల సర్వాధికారములు ముఖ్యవిషయములలో 1919 వ సంవత్సరపు రాజ్యాంగము ననుసరించికూడ రవంతయు సడలింపబడలేదు. హిందూదేశ ప్రభుత్వ రాజ్యాంగపు ముక్కుత్రాళ్లు రాజ్యాంగ కార్యదర్శి కాలిబొటనవ్రేలికి కట్టబడినవి.

"ఇది యాంగ్లేయ జాతియొక్క పూర్వాచారపరాయణత్వమునకు చిహ్నముగ 1906 వరకును పనిచేసినది." 1 అని కీతుగారి మతము. ఈ సలహాసంఘ మనవసరమనియు, నిరుపయోగమనియు, యెత్తివేయవలయు ననియు భారత రాజకీయ వేత్తల యభిమతము.

12 రాజ్యాంగ కార్యదర్శి; సలహాసంఘము—హిందూదేశప్రభుత్వము—పరస్పర భేదాభిప్రాయము—

రాజ్యాంగకార్యదర్శి తన నిరంకుశాధికారమును, పలు రీతుల పలుమార్లు చెలాయించెననుట నిశ్చయము. సమాలోచనసంఘమును రాజ్యాంగ కార్యదర్శియు పరస్పర భేదాభిప్రాయములకులోనగుటయు తటస్థించినది. హిందూదేశ ప్రభుత్వాభిప్రాయమును నిరంకుశముగ త్రోసిరాజనుటయు సంభవించినది. 1859 మొదలు 1866 వరకును రాజ్యాంగ కార్యదర్శిగనున్న సర్ ఛార్లెసు వుడ్డుగారికి సలహాసంఘముండుట యుపయోగకరముగనే దోచినది. కాని, 1866 లో క్రానుబొరనుగారికి మాత్రము నయించలేదు. వ్యయమొనరించుటలో సలహాసంఘము తనకుగల యధికారమును పురస్కరించుకొని రాజ్యాంగకార్యదర్శిని ప్రతిఘటించు చున్నటుల క్రానుబొరనుగారు తలంచిరి. సలహా సంఘమునకు గల యధికారమును సంకుచితమొనరింప తలంచిరి. అయినను, డ్యూకు ఆఫ్ ఆర్గలుగా రిట్టిప్రయత్న మనవసరమనిరి. రాజ్యాంగ కార్య

1. See. Keith P. 170.

దర్శి రాజనీతియంతయు, మంత్రివర్గమువారే నిర్ణయించునపుడు సలహాసంఘ మున కధికారమేమియు నుండదని యార్గలుగారినిర్ణయము. లార్డుశాలిస్‌బరీగారు గూడ తన సలహాసంఘముతో సంతృప్తులు కాజాలకపోయిరి. ఈయన సూచి చిన వర్తక విషయములను సలహాసంఘ మంగీకరించియుండలేదు. ఇదియే శాలీస్ బరీగారి కోపకారణము. 1869 లో గావింపబడిన శాసనమునననుసరించి, రాజ్యాంగ కార్యదర్శికి గల యధికారములను హెచ్చించుటకును, దృఢపరచుటకును శాలీస్ బరీగారు తోడ్పడిరి. శాలిసబరీగారు తిరిగి యధికారమునకు వచ్చినపుడు వెన కటిపలెగాక, సలహాసంఘ ప్రతిఘటనను జవదాటగలిగి యాయన రాజనీతి నాయన కొనసాగించుకొన గలిగియుండెను. క్వెట్టాయాక్రమణయు, పంజాబునుండి సింధుదేశమును విడదీయుటయు, (—Indus region) ఈ రాజనీతి ఫలితములే. ఈ రాజనీతియందు విదేశాంగ మంత్రియగు శాలిస్‌బరీ గారికిని, రాజ్యాంగ కార్యదర్శియగు నార్తుబ్రూకుగారికిని, సంఘర్షణము గలిగినది. శాలిస్‌బరీగారు గవర్నరు జనరలుతో నుత్తర ప్రత్యుత్తరములను రహస్యముగ జరిపి విదేశ రాజనీతిని నిశ్చయించుకొన దలంచిరి. నార్తుబ్రూకుగారు తన సలహాసంఘము నకును, తనకునుగల యధికారములను పురస్కరించుకొనిరి. జార్జి హామిల్టను ప్రభువును, రండురూ-చర్చిలుప్రభువును సలహాసంఘ మత్యావసరమనిరి. కాని, రిప్పను ప్రభువు సలహాసంఘము ప్రతిబంధకమని దలంచెను. సైనికశాఖ వ్యవహారములలో సలహాసంఘాభిప్రాయమునకు విముఖుడైనాడు. ఈ సలహాసంఘము పేర్కొనదగిన యుపయోగమేమియు జూపించజాలకపోయినను రాజ్యాంగ కార్యదర్శి తుందుడుకు తనముతో చేయుపనులను కొంతవరకు వారింపగలిగియున్నదని సర్ ఆల్ ఫర్డులాలుగారి నిశ్చితాభిప్రాయము. హిందూదేశమునందు సివిలు సర్వీసులో పనిజేసియుండి గౌరవభృతి తీసుకొనుచుండువారే తిరిగి సలహా సంఘమునందు సభ్యులుగానుండి హిందూదేశ ప్రభుత్వ రాజనీతిని నిర్ణయించుచుండుట శోచనీయము. 1869-1889 సంవత్సరములలో పార్లమెంటువారిచే గావింపబడిన నల్లమందు వర్తకమునకు సంబంధించిన తీర్మానములను హిందూదేశ ప్రభుత్వమాచరణయందుంచలేదు. ఇదేవిధముగ 1894 లో హిందూదేశము నందునను, సీమయందునుగూడ, సివిలు సర్వీసు పోటీపరీక్షలను జరుపవలెనని పార్లమెంటుచే గావింపబడిన తీర్మానమును నాటి లిబరలు పక్షపు మంత్రివర్గము హిందూదేశ

ప్రభుత్వాభిప్రాయము ననుసరించి త్రోసిపుచ్చినది. హిందూదేశ ప్రభుత్వమును రాజ్యాంగకార్యదర్శి సలహాసంఘమును ముఖ్యవిషయములలో మంత్రివర్గము వారి నిర్ణయములకే తలలొగ్గుచు వచ్చిరి. ఇందులకు 1879లో హిందూదేశము నకు దిగుమతియగు నూలుసరకుపై 100 కి 5 వంతుల దిగుమతి సుంకమును విధించ కుండ నుండుటయే తార్కాణము. ఇట్లే 1894 లో హిందూదేశమున 100 కి 5 వంతుల యుత్పత్తి శుల్కమును విధించుటయు గమనింపదగిన విషయము. హిందూదేశ ప్రభుత్వమును, రాజ్యాంగకార్యదర్శియుగూడ పరస్పర ప్రతిఘటన లలో బడుచుండుటయు గలదు. లార్డుకర్జను గారితో రాజ్యాంగ కార్యదర్శికి గలిగిన వివాదములలో సలహాసంఘము రాజ్యాంగకార్యదర్శినే మద్దతుజేసినది. దీనివలననే లార్డుకర్జనుగారు నియమితకాలముకంటె హెచ్చుకాలము గవర్నరు జనరలుగ పనిచేసియుండిరి. "ఈ సలహాసంఘ ముండుటవల్ల వ్యవహారములలో క్లిష్టస్థితి గలుగుచున్న మాటనిజమే. దీనివల్ల వ్యవహారములలో మాంద్యము గలుగుచున్నది. దీనికి యధార్థస్థితి లేదు.

## 5. హిందూదేశపు కేంద్ర ప్రభుత్వము.

(Central Govt)

1 కేంద్రప్రభుత్వము. హిందూదేశ ప్రభుత్వమనగా హిందూదేశ కేంద్రప్రభుత్వము - రాష్ట్రప్రభుత్వములు - స్థానికపరిపాలనము - ఈమూడును గలిసియున్న స్వరూపముగ గ్రహింపబడు చున్నది. ఒక్కొక్కప్పుడు ఢిల్లీయందుగల కేంద్రప్రభుత్వమునకే హిందూదేశ ప్రభుత్వముగ వాడబడుచున్నది. ఇండియాప్రభుత్వమనియే దీనినామకరణము. (Govt of India.) గత యధ్యాయమునందు వివరింపబడిన రాజ్యాంగ కార్య దర్శికి లోబడి హిందూదేశప్రభుత్వ వ్యవహారములను నిర్వహించుచున్న కేంద్ర సంస్థయే హిందూదేశ ప్రభుత్వమనబడుచున్నది.

హిందూదేశప్రభుత్వము కేంద్రీకరణప్రభుత్వము. 1858 సంవత్సరపు శాస నము ననుసరించి, కేంద్రీకరణప్రభుత్వలక్షణములు, హిందూదేశ ప్రభుత్వమునకు

2 హిందూదేశ ప్రభుత్వము : కేంద్రీకరణ ప్రభుత్వము. Unitary Govt.

సంపూర్ణముగ నావహించినవి. రాజ్యాంగ కార్యదర్శి పెత్తనమునకు లోబడి హిందూదేశ ప్రభుత్వమునకే హిందూదేశమునందలి ప్రభుత్వపరిపాలనమున కంతకును బాధ్యత గలిగింపబడినది. అన్ని రాష్ట్రప్రభుత్వములును హిందూదేశ ప్రభుత్వాధికారమునకు లోబడియే పరిపాలనము కొనసాగింపవలసియున్నది. స్వదేశసంస్థానములమీద గూడ హిందూదేశ ప్రభుత్వమే యధికారము గలిగియున్నది. ఈవిధముగ పెత్తనము, నాజ్ఞాధికారమును మాత్రమేకాక కొన్నిముఖ్యమగు పరిపాలనాశాఖలుగూడ హిందూదేశప్రభుత్వ పరిపాలనమునకు ప్రత్యేకింపబడినవి. విదేశరాజనీతి వ్యవహారములు, సంరక్షణము, పన్నులు విధించుట, ఎగుమతి, దిగుమతిసుంకములు, నాణెములచెలామణి, రైళ్లు - తంతితపాలాలు - మొదలగుశాఖలు కేంద్రప్రభుత్వ పరిపాలనమునం దుంచబడినవి. భూమిశిస్తునువిధించుట - వసూలుచేయుట - విద్య, త్రాగుడు, అడవులు, పోలీసు, వైద్యము - న్యాయశాఖ - కట్టడములు - మొదలగుశాఖలు రాష్ట్ర ప్రభుత్వములచే హిందూదేశప్రభుత్వపు పెత్తనమునకును, నాజ్ఞలకును లోబడి నిర్వహింప జేయబడుచున్నవి.

హిందూదేశమునందు సనాతనరాజ్యాంగమునను, మహమ్మదీయరాజ్యాంగమునను గూడ స్వతంత్రరాష్ట్ర ప్రభుత్వములుండెడివి. కంపెనీవారి పరిపాలనమునందుగూడ రాష్ట్రములు స్వాతంత్ర్యము ననుభవించుచుండెడివి. క్రమక్రమముగ పార్లమెంటు తమ శాసనముల మూలమున రాష్ట్రస్వాతంత్ర్యమును తగ్గించుచు బలవత్తరమగు కేంద్రప్రభుత్వమును నిర్మింపసాగినది. స్వరాజ్యాందోళన మభివృద్ధియైనకొలదియు కేంద్రప్రభుత్వపు పెత్తనము రాష్ట్రములమీద తగ్గించవలయునని కోరబడుచు వచ్చినది. రాష్ట్రప్రభుత్వములు హిందూదేశప్రభుత్వమునకేజంట్లుగా మాత్రమే ప్రవర్తింపవలసివచ్చుటచే కేంద్రీకరణము సడలింపబడవలయుననుకోరికయు నభివృద్ధికాసాగినది. రాష్ట్రప్రభుత్వములకు స్వతంత్రాభిప్రాయముండుటకు వీలులేనంతటి నిరంకుశత్వము హిందూదేశ ప్రభుత్వము చెలాయింపసాగినది. చెలాయింపగలదు.

3
వైస్రాయి
గవర్నరు జనరలు.

హిందూదేశ ప్రభుత్వమునకంతకును గవర్నరుజనరలుగారు సర్వాధికారి. ఈయనకే రాజప్రతినిధి యధికారముగూడ గలదు. న్యాయశాస్త్రప్రకారము రాజప్రతినిధిహోదా గోచరించుటలేదు. 1858 లో సీమప్రభుత్వము హిందూదేశ ప్రభుత్వమును స్వాధీనము జేసికొనినపుడు కానింగుగారిని గవర్నరు జనరలుగ నియమించుచు గావింపబడిన యుత్తరువునందుమాత్రము కానింగుగారు రాజప్రతినిధిగగూడ నియమింపబడినట్లుగ వ్రాయబడినది. ఆకాలమునుండియు గవర్నరు జనరలు లేక వైస్రాయి (రాజప్రతినిధి) యనుపేరున హిందూదేశ ప్రభుత్వాధికారి పేర్కొన బడుచున్నాడు. రాజప్రతినిధి హోదావల్ల స్వదేశసంస్థానములపట్ల రాజుగారికిగల యధికారములును, బాధ్యతలును, గుర్తింపబడుచున్నవి. రాజునకు నేరస్తులను క్షమించుటకుగల యధికారమును, బిరుదులు నొసగుటకుగల యధికారమును, సన్మానములును లభించుచున్నవి. ఈయన యుద్యోగకాల పరిమితి 5 సంవత్సరములు. ఈకాలపరిమితిని హెచ్చించుటకెట్టి యభ్యంతరము లును రాజ్యాంగశాసనమునందు పేర్కొనబడియుండలేదు. ఈ 5 సంవత్సరముల కాలపరిమితి కంపెనీనాటనుండియు నాచారమయినది. ఈయన చక్రవర్తిగారిచే నియమింపబడును. (Royal Sign Manual). సీమప్రభుత్వ ప్రధానామాత్యుని సలహా ననుసరించియే చక్రవర్తిగారు రాజప్రతినిధిని నియమించెదరు. సామాన్యముగ నాంగ్లేయ రాజకీయవేత్తలగు నొకరీపదవికి నియమింపబడు చున్నారు.

గవర్నరు జనరలుగారు తన కార్యనిర్వాహకవర్గ సభలలో నధ్యక్షత వహించవలసిన వాడుగమాత్రమే పైకి గోచరించునుగాని, గవర్నరు జనరలుగారు కూడ రాజ్యాంగకార్యదర్శివంటి మరియొక నిరంకుశాధికారి. సభ్యులకార్య నిర్వహణమునం దీయనకు తుదినిర్ణయాధికారపు వోటుగూడ కలదు. (Casting Vote).

ప్రజాశాంతి సంరక్షణములకును నాంగ్లేయ ప్రయోజనములకును (The interests of the British Possessions in India) భంగముకలుగుచున్నదని గాని, కలుగబోవునని గాని గవర్నరుజనరలుగా రభిప్రాయపడినపుడెల్ల కార్య

నిర్వాహకవర్గ నిర్ణయములను త్రోసివేయగలడు.1 హిందూదేశ శాసనసభలచే నామోదింపబడినబిల్లులనంగీకరించుటకును, నిరాకరించుటకునుగూడ నధికారమును గలిగియున్నాడు. స్టేటుకౌన్సిలు సభలోను, భారతశాసనసభలోను గవర్నరు జనరలుగారొకభాగము. భారతశాసనసభలు శాసనములు గావింపకుండ నిరోధింపగలడు. సభలను రద్దుచేయగలడు. రెండుసభలనుకలిపి సమావేశ పరుపగలడు. రాష్ట్రీయశాసనములపైగూడ గవర్నరు జనరలు వ్యక్తిగతముగ పెత్తనము చెలాయింపగలడు.

4
గవర్నరు జనరలు;
కార్యనిర్వాహకవర్గము.
Council.

గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహక సభయొక్క అంగనిర్మాణము 1853 వ సంవత్సరశాసనమం దున్నట్టి రీతిగనే 1858 వ సంవత్సరపు రాజ్యాంగ శాసనమునందు గూడ నుంచబడినది. సం॥ 1861 కౌన్సిళ్ళ శాసనముననుసరించి అంతవరకునుగల నలుగురి కార్యనిర్వాహక వర్గసభ్యులకును తోడుగ మరియొకరు నియమింపబడిరి. సం॥ 1853 రపు శాసనముననుసరించి బారిష్టరులు మాత్రమే నాల్గవకార్యనిర్వాహక వర్గసభ్యుడుగా 1859 వరకును నియమింపబడిరి. అంతటినుండియు నార్థికశాస్త్రమునం దారితేరినవారిని నియమింపసాగిరి. ఇందులకు ప్రభుత్వార్థికస్థితి కారణముగ పేర్కొనబడుచున్నది. ఆనాటి నుండియు కొంతకాలము న్యాయశాస్త్రము నెరింగినసభ్యుడు లేకపోయెను.

సం॥ 1861 పు శాసనముననుసరించి కార్యనిర్వాహకవర్గమునం దయిదుగురు సభ్యులుండిరి. ఇందు ముగ్గురు హిందూదేశమున పది సంవత్సరములు ప్రభుత్వోద్యోగము చేసినవారుగ నుండవలయును. ఒకరు బారిష్టరు లేక ఎడ్వకేటయి, యయిదుసంవత్సరములు వృత్తియందు పనిచేసినవారుగ నుండవలయును. సర్వసైన్యాధిపతి ప్రత్యేక సభ్యుడుగనుండుటకు నిర్ణయము. ఈయనకు గవర్నరు జనరలు తరువాత హోదా యొసగబడినది. ఇతరసభ్యులు నలుగురికిని సమానహోదా గలదు.3

1. Sec 41. Govt. India Act.
2. Sec 63. Govt. of India.
3. Indian Council's Act 1861,

1919 సంవత్సర శాసనము ననుసరించి కార్యనిర్వాహకవర్గ సభ్యుల సంఖ్యకు కనిష్ఠ గరిష్ఠ ప్రమాణములు తీసివేయబడినవి. (Section 28—1). సీమచక్రవర్తి ప్రభుత్వ మవసరమని దలంచినంతమంది సభ్యులను నియమించుట కధికారమును పొందినది. (సెక్షను 36–2). 1

9 పరిపాలనా శాఖలు— ఈ సభ్యులందరకును తలకొక పరిపాలనా శాఖయు ప్రత్యేకింపబడినది. గవర్నరు జనరలుగారు స్వయముగ విదేశ వ్యవహారశాఖను పరిపాలించుచున్నాడు.

(1) ఆర్థికము. (2) ఆంతరంగికము. (3) శాసనాధికారము. (4) ఆదాయము-వ్యవసాయము. (5) వర్తక - పారిశ్రామికములు. (6) విద్య. ఈఆరుశాఖల నారుగురు కార్యనిర్వాహక వర్గసభ్యులు పరిపాలించుచున్నారు. సైనికశాఖను సర్వసైన్యాధిపతి పరిపాలించుచున్నాడు. రైళ్ళశాఖ, రైళ్ళబోర్డు నిర్మింపబడిన నాటనుండియు బోర్డువారుచే పరిపాలింపబడుచున్నది. ఈశాఖ వర్తక పారిశ్రామికశాఖవారి యాధ్వర్యముననున్నది. ఆక్వర్తు కమిటీ నిర్ణయప్రకారము రైళ్ల శాఖ, రైళ్ళబోర్డు ప్రసిడెంటు స్థానమున కమీషనరు నియమింపబడి, యాయన యధికారమునకు లోబరుపబడినది. ఈ గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహక సభకు ప్రప్రథమమున లార్డుమార్లేగారు రాజ్యాంగకార్యదర్శిగ నున్నప్పుడే ఒక్క భారతీయ సభ్యుడు నియమింపబడినాడు. అంతవరకు నందరుసభ్యులు నాంగ్లేయులే. కాని నాటినుండి ముగ్గురు భారతీయులు కార్యనిర్వాహకవర్గ సభ్యులుగ నియమింపబడు నాచార మేర్పరుపబడినది. ఈ కార్యనిర్వాహకవర్గ సభ్యులవిధులు, శాఖలు, మార్చినప్పుడెల్ల మార్చబడుచువచ్చినవి. ఎప్పుడేశాఖ, యే సభ్యుని విధులు మారినను గవర్నరుజనరలుగారికి విదేశ వ్యవహారశాఖయు, లామెంబరునకు శాసనాధికారశాఖయు మారియుండలేదు. 1902 లో నున్నటువంటి నలుగురు సామాన్యసభ్యులును (1) శాసనాధికారశాఖ, (2) సైనిక శాఖ, (3) కట్టడముల శాఖ, (4) ఆర్థికవర్తకములశాఖ, (5) ఆంతరంగికశాఖ, రివిన్యూశాఖ, వ్యవసాయశాఖ. యీ విధముగ శాఖలను విభజించుకొని పరిపాలించుచుండిరి. సర్వసైన్యాధిపతికి నాడు ప్రత్యేక పరిపాలనాశాఖ యుండెడిది

1. Govt. of India Act. 1919.

కాదు. 1905 లో చాల మార్పులు గలిగించబడినవి. ఆరవ సామాన్యసభ్యుడు గూడ నియమింపబడినాడు. ఈయన వర్తక పారిశ్రామిక శాఖ కధిపతి. ఇది క్రొత్తగ నాడు సృష్టింపబడిన శాఖ. ఈశాఖకే కట్టడముల శాఖ పనిగూడ చాల వరకు మార్చబడినది. సర్వసైన్యాధిపతికిగూడ నీయడే సైనిక శాఖ పరిపాలన మొనగబడినది.

1909 లో సైనిక శాఖ, సరఫరా శాఖ తీసివేయబడినవి. సర్వవిధములగు సైనిక పరిపాలనకును గూడ సర్వసైన్యాధిపతియే బాధ్యుడుగా నొనరింపబడి నాడు. తిరిగి 1910 నవంబరున నారవ కార్యనిర్వాహక వర్గ సభ్యుడు నియమింపబడి నాడు. ఈయనకు విద్యాశాఖ యొప్పగించబడినది. ఈ మార్పులవల్ల గలిగిన శాఖ లిట్లేర్పడినవి. (1) విదేశవ్యవహార శాఖ - గవర్నరుజనరలుగారి యధీనము. (2) సైనిక శాఖ - సర్వసైన్యాధిపతి యధీనము. (3) ఆర్థికము. (4) ఆంతరంగికము. (5) వర్తక పారిశ్రామికములు. (6) విద్య. (7) శాసనాధికార శాఖలు. ఇరువురి సభ్యులకీవిధముగ 8 శాఖలుండెడివి. కట్టడముల శాఖ-రాబడి వ్యవసాయశాఖల యధీనమునందుండెడిది. రైళ్ళశాఖ-రైళ్ళబోర్డు యధీనము. వర్తక, పారిశ్రామిక శాఖాసభ్యుడే యీ రైళ్ళసభ్యుడుగా వ్యవహరించెడివాడు, ఈ కార్యనిర్వాహక వర్గసభ్యు లందరును, గవర్నరుజనరలుగారి వలెనే రాయలునయిను మాన్యాలు ననుసరించి చక్రవర్తిగారిచే నియమింపబడుచున్నారు. వీరి యుద్యోగ కాలపరి మితియు 5 సంవత్సరములే. ఈ కార్యనిర్వాహక వర్గసభ్యులలో కనీసము ముప్వురు హిందూదేశ ప్రభుత్వమున కనీసము 10 సంవత్సరములైన నుద్యోగస్థులుగ నుండి యుండవలెను. మరియొకరు సీమదేశపు, లేక యైర్లండు దేశపు బారిష్టరు గను, లేక, స్కాట్లండు నందలి వడ్వకేటుగను నుండవలయును. లేదా, హిందూ దేశమునందు 10 సంవత్సరములు వృత్తియందనుభవముగల హైకోర్టు న్యాయ వాదిగనైన నుండవలయును. హిందూదేశపు న్యాయవాదులకు సం॥ 1919 రపు రాజ్యాంగశాసనము ననుసరించియే యీ యర్హత గలిగినది. అంతకు పూర్వము లేదు. కార్యనిర్వాహక వర్గ సభయందు భారతీయసభ్యులను వేసితీరవలయు నను శాసన నిబంధనమేమియునులేదు. ఇదియొక యాచారముమాత్రమే. ఆంగ్లేయ సభ్యులందరును నించుమించుగ సివిలుసర్వీసు శాఖనుండి తీసికొనబడినవారే.

వర్తక, యార్థిక, పారిశ్రామిక శాఖలకు సీమనుండి దిగుమతిచేయబడుచున్నారు. భారతీయులు రాజ్యాంగవేత్తల కూటమినుండి, లేక, వృత్తులలో నారితేరిన వారినుండియు తీసికొనబడుచున్నారు. భారతీయుల ముగ్గురిలోను నొకరు మహమ్మదీయ సభ్యుడుగానుండుటగూడ నాచారముగ నేర్పరుపబడినది.

గవర్నరుజనరలుగారి సలహాపై రాజ్యాంగ కార్యదర్శి యామోదముతో సీమప్రభుత్వ మీా సభ్యులను నియమించును.

10 కార్యనిర్వహణము

కార్యనిర్వాహకవర్గ సభ్యులందరకును, ప్రతి శాఖయందు నను శాశ్వతకార్యదర్శి యున్నాడు. ( Permanent Secretary). ఇతనిక్రింద సహాయకార్యదర్శి. అతనికి మరి యొక ఉపకార్యదర్శి - యీాయనక్రింద పెద్దసిబ్బందీ యున్నది. ప్రతిశాఖయందు నను పరిపాలనా విషయములలో శాశ్వతకార్యదర్శి విషయమును పరిశీలించి, కార్యనిర్వహణమునకై యాయాశాఖల సభ్యులకు లిఖితపూర్వకముగ దెలుపు చుండును. సామాన్యముగ కార్యనిర్వాహకవర్గసభ్యుడే యన్నివిషయములలో కడపటిచర్య గైకొనుచుండును.

ఏవిషయమైనను భేదాభిప్రాయమునకు కారణమైనగాని, పరిపాలనానీతికి సంబంధించిగాని యున్నయడల, నావిషయము కార్యనిర్వాహకవర్గ సభయందు ప్రవేశపెట్టబడి, చర్చింపబడి, నిర్ణయింపబడుచుండును. ఈనిర్ణయమును శాశ్వత కార్యదర్శి యమలుజరుపుచుండును.

11 కార్యనిర్వాహక సభాసమావేశము.

గవర్నరుజనరలుగారే తన కార్యనిర్వాహకవర్గసభ కధ్యక్షుడు. ఉపాధ్యక్షు నొకరిని గవర్నరుజనరలుగారు నిరూపించుచుండవలయును. కార్యనిర్వాహకవర్గ సభలు హిందూదేశమునందు, కార్యనిర్వాహకవర్గ సభా సమేతుడగు గవర్నరుజనరలుగారు నిర్ణయించిన ప్రదేశములలో జరుగుచుండును. కార్యనిర్వాహకవర్గ సభానిర్ణయములన్నియు, సమాలోచన సభాసమేతుడైన గవర్నరుజనరలుగారి నిర్ణయములని పేర్కొనబడుట సశాస్త్రీయము. ఈ నిర్ణయ

ముల ననుసరించిన యుత్తరువులపై ప్రభుత్వకార్యదర్శి సంతకము చేయుచుండ వలయును. లేదా, గవర్నరుజనరలుగారిచే నిరూపింపబడు నెవరైనను సంతకము చేయుచుండవచ్చును. ఏవిషయమైనను, సభకు హాజరయిన సభ్యులలో నధిక సంఖ్యాకుల తీర్మానానుసారము నిర్ణయింపబడవలసి యున్నది. అదియే తుది నిర్ణయము. ఏవిషయమునందైనను వోట్లుసమానమైనప్పుడు మాత్రమే గవర్నరు జనరలుగారు లేక, ఆయనస్థానమున సభకధ్యక్షత వహించినవారు తుదినిర్ణయాధి కారపువోటును వినియోగించుచుండవచ్చును. కాని, గవర్నరుజనరలుగారికి ప్రత్యేకాధికారములు గలవు. శాంతి - సంరక్షణములు, హిందూదేశప్రయోజన ములు భంగపడుచున్నవని యాయనకు తోచినపుడెల్ల కార్యనిర్వాహకవర్గ తీర్మానముల నుల్లంఘించుట కీయన కధికారము గలదు. కాని, యిట్టి ప్రత్యేక చర్యను దీసికొనినప్పు డధికసంఖ్యాకులలోనివా రెవరైనను యిరువురు సభ్యు లట్టి చర్యకు గవర్నరుజనరలుగారిని వ్రాతపూర్వకముగ కారణములను కోరవచ్చును. ఏసభ్యుడైనను, తనభేదాభిప్రాయమును వ్రాసి దానిని రాజ్యాంగకార్యదర్శికి పంప మని కోరవచ్చును. అది రాజ్యాంగ కార్యదర్శికి పంపితీరవలయును.

**12 శాఖల పరిపాలనాపద్ధతి.** హిందూదేశప్రభుత్వమునం దీకార్యనిర్వాహకసభ్యులును, వారి కార్యదర్శివర్గమునుగాక, డైరక్టరుజనరలు - యిన్స్పెక్టరు జనరలు - కమీషనర్లు, విద్యాశాఖకు, వ్యవసాయ శాఖకును గలరు. వీరు వివిధరాష్ట్రములయందాయా శాఖలవిషయములనుగురించిన పనులమీద సలహానొసగుచుందురు. కేంద్ర, రాష్ట్రప్రభుత్వములయందలి వారివారి శాఖలపనులను సమన్వయ పరచుచుందురు. ఈకార్యనిర్వాహకవర్గసభయొక్క యధికారములును, నాచారములును వివిధ సంఘర్షణములకు లోనైనవి. లార్డుకానింగుగారి కాలమునుండియు, ననగా సం॥ 1858 నుండియే శాఖలు విడదీయబడినవి. ప్రాముఖ్యవిషయములుమాత్రమే సమాలోచన సభలో ప్రవేశపెట్టబడుచున్నవి. ఆనాటినుండియు నానాడు యీసభాసమావేశవిధము, అధికారములకు సంబంధించిన ఆచారములు, కార్య నిర్వహణవిధానము, మొదలగునవన్నియు నేటిపరిణామమును జెందినవి. ప్రతి శాఖయొక్క శాశ్వతకార్యదర్శియు, వారమునకొకసారి గవర్నరుజనరలుగారిని

సందర్శించి ఆయన శాఖనుగురించిన వ్యాపారమును నివేదించుచుండును. ఈవిధముగ గవర్నరుజనరలుగారు అన్నిశాఖల విషయములను తరచు తెలిసికొనుచుండగలరు.

ఈశాశ్వతకార్యదర్శులుగూడ శాసనసభలలో తరచు ప్రభుత్వపక్ష సభ్యులుగ నియమింపబడుచున్నారు. ఆయాశాఖల కార్యనిర్వాహకవర్గ సభ్యునితో నిమిత్తములేకుండగ, శాశ్వతకార్యదర్శి తనశాఖ విషయములను తిన్నగ వైస్రాయిగారికి నివేదింపగలుగుట గమనింపదగిన విషయము. ఇందువల్ల భారతీయ సభ్యులు కార్యనిర్వాహకవర్గమునం దున్నందువలన యెట్టిప్రతిబంధకము నాంగ్లేయ రాజనీతికి సంభవింపదు. ఈయంగనిర్మాణమును శాశ్వతకార్యదర్శుల యధికారవిధులును నాంగ్లేయప్రభుత్వ విధానమునను సరించియే యున్నవని కొందరితృప్తి. అచ్చట స్వరాజ్యప్రభుత్వము. ఇచ్చట నిరంకుశప్రభుత్వము. అచ్చట సక్రమముగ పనిజేసిన సిద్ధాంత మిచ్చట పనిజేయజాలదు. ఈశాశ్వత కార్యదర్శులచర్య రహస్యపుపోలీసుదళముతో మాత్రమే పోల్చదగును. గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహకసభయందు నియమింపబడుచున్న భారతీయసభ్యులు తరచు తమయాత్మగౌరవమును చంపుకొని శాశ్వతకార్యదర్శి ననుసరించియే చరించవలసినస్థితి దీనివలనసంభవించుట నిశ్చయము. ఈ కేంద్రప్రభుత్వమునకు ప్రజాప్రభుత్వ లక్షణములు లేనందున, “ హిందూదేశప్రభుత్వ కార్యనిర్వాహక సభ ఒకప్రభుత్వమును వెళ్ళగొట్టలేదు. మరియొక ప్రభుత్వమును నిర్మించజాలదు. ఇండియను సివిలుసర్వీసుమాత్రమే హిందూదేశప్రభుత్వము. ”1

ఈ పరిస్థితి సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వము కేంద్రమున నెలకొల్పిన నాటివరకు పోలేదు. 1914 వ జనవరి 1 వ తేదీని కొన్నిస్వల్పమగు మార్పులు గావింపబడినవి. 1923 ఏప్రియలులో లార్డురీడింగు ప్రభుత్వము శాఖలలో కొన్ని మార్పులను గావించినది. ఆరుగురుసామాన్యసభ్యులు నారుశాఖలను పాలించుచున్నారు. (1) ఆంతరంగికశాఖ. (2) శాసననిర్మాణశాఖ. (3) ఆర్థికశాఖ. (4) రైల్వు — వర్తకము. (5) పరిశ్రమలు — కార్మికులు (6) విద్య — ఆరో

1. The Empire and the future. P. 54. Fisher.

గ్యము — భూములు. ఈవిధముగ శాఖలు నిర్ణయింపబడి నాడు పని జరుగు చుండెను.

13
వైస్రాయి;
కార్యనిర్వాహకవర్గముల పరస్పర సహకారము.

గవర్నరుజనరలుగారికిని, నాయనసమాలోచన సభకును మధ్య పరస్పర భేదాభిప్రాయములు తరచు సంభవించుట లేదని కీతుగారి నిశ్చయము.1 కొన్నికొన్ని సంఘర్షణలు సంభవించినవి. లారెన్సుగారు తనపై తన సమాలోచనసభకుగల యధికారము నేవగించుకొనసాగెను. నార్తుబ్రూకు, రిప్పను, కర్జనులు సలహాసంఘ ముపయోగకర మనియే తలంచియుండిరి. కాని, రిప్పనుగారు తమసలహా సంఘాభిప్రాయమును కాంధహారు సందర్భమున త్రోసిరాజనెను.2 మింటోగారుగూడ 1907 లో రష్యానుగురించి తనసలహాసంఘముతో యోచించుటయే సమంజసమని తలంచెను. కాని, శాసననిర్మాణాధికారమును చెలాయించినపుడు గవర్నరు జనరలులకును వారిసలహాసంఘములకును మధ్య విపరీతమగు సంఘర్షణములు తటస్థించినవి. గవర్నరుజనరలుగారును, మిలటరీశాఖసభ్యుడును, సర్వసైన్యాధిపతియు నేకీభవించినచో వారిసంకల్ప మప్రతిహతము. సైనికశాఖమెంబరునకు గల యధికారములనుగురించి యీరాల్, కిచనరు, కర్జనుప్రభువు భేదాభిప్రాయములను ప్రకటించియుండిరి.3 ఈతగవుల ఫలితముగనే 1909 లో మిలటరీశాఖ సభ్యుని పదవి తీసివేయవలసివచ్చినది. 1910 లో తిరిగి విద్యాశాఖసభ్యునిపదవి సృష్టింపబడినది. ఈవిధముగ నిరంకుశప్రభుత్వము మధ్యమధ్య తనకుతానే వికారపుచేష్టలను ప్రదర్శించుకొనుచున్నను, నప్రతిహతముగ ప్రజాభిప్రాయముతో నిమిత్తములేకుండగ పరిపాలనమును కొనసాగించుచున్నది. గవర్నరులును, గవర్నరుజనరలును — నుద్యోగకాలమునందు హిందూదేశమునువీడి సీమకుబోవుట కధికారమును గలిగియుండలేదు. 1924 లో గవర్నరులపైగల యీనిషేధము తొలగింపబడినది.

1. See, Keith. 171 P.
2. See, Wolf Life ii. 164.
3. See, Robert's History of India PP. 552. Ronaldshay, Lord Curzon ii. 373 – 414).

# 6. రాష్ట్రప్రభుత్వములు.

1 రాష్ట్రములు

హిందూదేశమునందలి రాష్ట్రప్రభుత్వముల పరిణామ మొక విచిత్రస్థితి. పరిపాలనా సౌకర్యముకొఱకు ప్రభుత్వాధికారములు విభజింపబడినవి. ఈయధికారములను చెలాయించుటకు సృష్టింపబడిన రాష్ట్రప్రభుత్వముల జనన మేరాజ్యాంగలక్షణములకును సరిపోల్చుటకు వీలులేదు. ఈస్టిండియా కంపెనీవారిచే స్వాధీనపరచుకొనబడి, పరిపాలింపబడినప్పుడు, రాష్ట్రప్రభుత్వములు చాలకాలము స్వతంత్రప్రభుత్వములుగనే వ్యవహరించుచు వచ్చినవి. సీమయందలి కంపెనీ ప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వములన్నియు లొంగి పనిచేయుట యొక్కటియే రాష్ట్రప్రభుత్వములకుగల యంగాంగీసంబంధము. రిగ్యులేటింగు శాసనము గావింపబడిన నాటనుండియు హిందూదేశ ప్రభుత్వమునకు కేంద్రీకరణ ప్రభుత్వలక్షణము లావహింపసాగినవి. కలకత్తా ప్రభుత్వమునకు యితర రెండురాష్ట్రముల ప్రభుత్వములపై కొంతయధికార మొసగబడినది. ఈ యధికారము క్రమక్రమముగ వృద్ధిచెందింపబడి, కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వము లేజంట్లుగా చేయబడినవి.

2 రాష్ట్రప్రభుత్వముల నిర్మాణము

కేంద్రప్రభుత్వమున కేజంట్లుగా సృష్టింపబడిన యీరాష్ట్రముల పరిణామములను, నెల్లలను, నైసర్గిక లక్షణములను పరీక్షించినచో యీ రాష్ట్రనిర్మాణముల యందలి విచిత్రస్థితి గోచరింపగలదు. ఈరాష్ట్రములు నిర్మించుటలో విదేశరాజుల పరిపాలనాసౌకర్యము మాత్రమే గమనింపబడినదిగాని, భాష, ఆచార, చారిత్రిక, నైసర్గికలక్షణము లేవియు గమనింపబడలేను. ప్రజాభిమతమున కీరాష్ట్రనిర్మాణములయందు రవంతయు స్థానములేదు.

3 మదరాసు

మదరాసురాష్ట్రము 1799 లో టిప్పుసుల్తాను నాశనము చేయబడిననాటనుండియు, నేటివిస్తీర్ణమును గలిగియున్నది. 1700మైళ్ళపొడవుగలసముద్రతీరమునుగలిగియున్నది. ఇందు 7%మహమ్మదీయులును 3.80% క్రైస్తవులునుగలరు. మిగిలిన జనసంఖ్యయంతయు హిందూమతమునకు చెందినవారే. కాని, భాషలనుబట్టి పరిశీలించినచో యిందలి

విచిత్రస్థితిగోచరింపగలదు. ఈరాష్ట్రమునందలి జనసంఖ్యలో 18.56 మిలియనుల ప్రజ లరవలు. 17.74 మిలయనుల ప్రజ లాంధ్రులు. 3.72 మిలియనులప్రజలు మళయాళీలు; కన్నడ దేశస్థులుకూడగలరు. ఆంధ్రులు, అరవలు, 100 కి 80 మంది గలరు. కావేరీనది కుత్తరదిశగ, తూర్పుసముద్ర తీరమువెంబడి నాంధ్ర జిల్లాలున్నవి. దక్షిణమునం దరవజిల్లా లున్నవి. మళయాళీలు (South-west) నైఋతి దిశగనున్నారు. ఉత్తరమున కన్నడజిల్లాలున్నవి. ఈవిధముగ నాలుగుభాషలతో కూడిన ప్రజలనుజేర్చి యొక మహావిస్తీర్ణమైన రాష్ట్రముగ నేర్పరుపబడినది. కన్నడరాష్ట్రము కొంత మదరాసురాజధానియందునను, మరికొంత బొంబాయి రాజధానియందునను నుంచబడినది. ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రమును చిరకాలము నుండియు గోరుచున్నారు.

4 బొంబాయి రాష్ట్రము. ఇక్లే నేటి బొంబాయిరాష్ట్రము సుమారు 1818 సంవత్సర ప్రాంతమునకు, పీష్వాపరిపాలనము పూర్తియయినపిమ్మట నేర్పరుపబడినది. 1843 లో సింధురాష్ట్రము దీనికి జతపరుపబడినది. బొంబాయినుండి సముద్రతీరముమీదుగ సింధురాష్ట్రమును చేరుట సునాయాస మగుటయే యిందులకు కారణము. 1935 సంవత్సర రాజ్యాంగ శాసనము ననుసరించియే సింధుదేశమునకు ప్రత్యేకరాష్ట్రప్రభుత్వము లభించినది. సింధుదేశముకాక, బొంబాయిరాష్ట్రమున ముఖ్యమగు మూడుభాషలను మాట్లాడుప్రజలు గలరు. ఈమూడు భాషలప్రజలును మూడు డివిజనులక్రింద విభజింపబడిరి. ఉత్తరడివిజను లేక గుజరాతు, మధ్యడివిజను లేక మహారాష్ట్రము, దక్షిణడివిజను లేక కర్నాటకము. రాష్ట్రప్రధాన నగరమగు బొంబాయి నగరమునం దెన్నియోజాతుల ప్రజలుగలరు. దీనిసమస్యలన్నియు రాష్ట్రమునందలి యితర ప్రజలసమస్యలతో నంతగా సంబంధముగలవికావు. ఇది యొక ద్వీపము. ఇతరరాష్ట్ర భాగములతో రెండు రైలుమార్గముల వల్లను, నొక రహదారీబాటవల్లను కలుపబడియున్నది. ఈ రాష్ట్రమున 17½ మిలియనుల ప్రజలుగలరు. ఇందు 93.36 లక్షలు మహారాష్ట్రులు. 34.26 లక్షలు గుజరాతీయులు. 25.98 లక్షలు కన్నడ దేశీయులు. 19.99 లక్షలు పశ్చిమ హిందూదేశీయులు. వీరు కాండెషు జిల్లాలతోగలరు. వీరికి బొంబాయిరాష్ట్ర ప్రజలతోకంటె మధ్యరాష్ట్రప్రజలతో నెక్కుడు సంసర్గము

కలదు. పడమటికనుమల క్రిందిభాగమునందుగల కొంకణతీరముగూడ నీ రాష్ట్రమునందున్నది. ఇందువల్ల నీరాష్ట్రము 5 ప్రత్యేక రాష్ట్రములుగ విభజింప వచ్చును. అనగా, మధ్యరాష్ట్రములతో కలయికగలభాగమును, వదలివేసియు, కన్నడభాగములను వదలివేసియు, చూచిన గుజరాతు, మహారాష్ట్రములును, బొంబాయి, కొంకణతీరములునుకలిపి రెండుక రాష్ట్రముగను అనగా మూడు రాష్ట్రములుగ విభజించుటకు వీలుగలిగియున్నది.

వంగ. ఆంగ్లేయపరిపాలనా చరిత్రలో మొట్టమొదటిది వంగ రాష్ట్రము. అందువల్లనే అనేకమార్పులకు లోనైనది. 1773 లో రిగ్యులేటింగు యాక్టును బట్టి నిర్మింపబడిన నీరాష్ట్రమునకు 1805 లో నాగ్రా కలుపబడినది. 1825 లో నస్సాము చేర్చబడినది. 1856 లోన నయోధ్యజత చేయబడినది. 1853లో నేటి మధ్యపరగణాలుకూడ వంగ రాష్ట్రమునకుకలిపి యుంచబడినవి. 1824 – 1853 సంవత్సరములమధ్య బర్మా రాజ్యమందలిభాగములుకూడ వంగమునకు చేర్చబడినవి. బీహారొరిస్సాలుకూడ మొదట వంగ దేశమునందే యున్నవి. ఇవి 1911 నుండియే విడదీయబడినవి.

సం॥ 1853 రమునందుమాత్రమే వంగదేశము ప్రత్యేకరాష్ట్రముగ నొన రింపబడినది. 1905 లో లార్డుకర్జనుగారు తూర్పుజిల్లాలను విడదీసి యస్సామునకు చేర్చియుండెను. కాని, యీవంగదేశవిభజనము పిమ్మట రద్దుచేయబడినది.

అస్సామురాష్ట్రమొక ప్రత్యేక రాష్ట్రముగ ఛీఫ్‌కమీషనరు పరిపాల నము క్రింద నుంచబడినది.

1911లో బీహారు, ఒరిస్సా లొక ప్రత్యేకరాష్ట్రముగ వంగమునుండి విడ దీయబడినవి. ఆగ్రా 1834లో విడదీయబడి గంగానదీ మైదానమనగా, కాశీకి పైభాగము, పశ్చిమోత్తరపరగణాలక్రింద నేర్పరుపబడినది. 1853 లో మధ్యరాష్ట్రము వంగదేశమునకు చేర్చబడి, 1861లో ప్రత్యేకరాష్ట్రముగ నేర్ప రుపబడినది. 1824 వ సంవత్సరమునుండియు లాగికొనబడిన బర్మా ప్రదేశ ములనన్నింటిని కలిపి 1889 లో బర్మారాష్ట్రమేర్పరుపబడినది. ఈ విధముగ తీసివేయబడిన రాజ్యభాగములుగాక, మిగిలిన వంగభాషను మాట్లాడు ప్రదేశమే

నేడు వంగరాష్ట్రముగనున్నది. హిందూదేశమునందలి రాష్ట్రములన్నింటియందు నను నన్నివిధముల సక్రమముగ 1947 వరకున్నటువంటి రాష్ట్ర మిదయొక్కటియే. ఈ రాష్ట్రమునందుగల 50 మిలియనుల ప్రజలలోను 46. 4 మిలియనుల ప్రజలు వంగభాషనే మాట్లాడెదరు. అనగా, 100 కి 92. 5 మంది ఏకభాషను మాట్లాడు వారుగలరు. అయితే, మతమునందుమాత్రము ప్రజలలో విభేదముగలదు. ఇందు 21. 57 మిలియనులు అనగా 43. 04% వంతులు హిందువులును, 27. 5 మిలియనులు లేక 54. 87% వంతులు మహమ్మదీయులును గలరు. అయితే, యీ మహమ్మదీయులందరును హిందూసంతతివారే. మహమ్మదీయ రాజ్యకాలమునందు మహమ్మదీయమతమును స్వీకరించియుండిరి. వంగమునకు ప్రధానసగరమగు కలకత్తా, బొంబాయివలెగాక, రాష్ట్రమునందంతటితోను సర్వవిధముల సంసర్గము కలిగియున్నది.[1]

**5 సంయుక్త రాష్ట్రములు.** 1803-5 సంవత్సరములమధ్య జరిగినయుద్ధములో నాగ్రాయును, యితర మహమ్మదీయ జిల్లాలును జయింపబడిన పిమ్మట ముప్పది సంవత్సరములవరకును వంగరాష్ట్రమునందొక భాగముగనే యున్నవి. 1834 లోనే యీ భాగములనుజేర్చి పశ్చిమోత్తర రాష్ట్రమనుపేర ప్రత్యేకరాష్ట్రము నిర్మింపబడినది. మరి 43 సంవత్సరములాగ్రా ప్రత్యేకరాష్ట్రముగ నున్నది. 1877 నుంచియు నాగ్రా, యయోధ్య రాష్ట్రములు కలిపివేయబడి ప్రత్యేకరాష్ట్రముగ వ్యవహరింపబడసాగెను. ఈ ప్రత్యేకరాష్ట్రము 1901 నుండియు నాగ్రా-యయోధ్య సంయుక్తరాష్ట్ర మను పేర వ్యవహరింప బడుచున్నది. 1901 నుండియు పంజాబునందలి యాఫ్గనుస్థానపు సరిహద్దుజిల్లాలు ప్రత్యేకింపబడి, పశ్చిమోత్తర పరగణా లనుపేరున ప్రత్యేకరాష్ట్రముగ నొనరింపబడుటచే, నంతకుపూర్వము పశ్చిమోత్తర పరగణాలను పేరున వ్యవహరింపబడుచువచ్చిన యాగ్రా యయోధ్యరాష్ట్రములను కలిపి సంయుక్తరాష్ట్రము లను నూతననామకరణము గావింపవలసివచ్చినది. ఈ రాష్ట్రమునందు 84. 50% హిందువులు, 14. 84% మహమ్మదీయులు 100 కి 99 గురు హిందీభాషను మాట్లాడుదురు. ఇది చాల విశాలమగురాష్ట్రము. ఈరాష్ట్రమును

---

1. దురదృష్టవశమున, యీవంగము, స్వాతంత్ర్యశాసనము ననుసరించి, రెండు రాష్ట్రములుగ సం॥ 1947 రమున మరల విభజింపబడినది.

రెండు రాష్ట్రములుగ విభజించి పరిపాలింపతగును. మధ్యపరగణాల రాష్ట్రమును తీసివేసి, యిందలి మహారాష్ట్రభాగమును మహారాష్ట్రమునకును, యితర ప్రదేశమును బీరారునకును, మిగిలిన భాగము సంయుక్తరాష్ట్రములకునుచేర్చివేసి సంయుక్త రాష్ట్రములను రెండు రాష్ట్రములుగ చేయవచ్చును.

6 పంజాబు రాష్ట్రము

పంజాబురాష్ట్రమున 23½ మిలియనుల జనాభా గలదు. ఇందు 18.68 మిలియనులమంది పంజాబీభాషను మాట్లాడెదరు. 3.43 మిలియనులమంది హిందీమాట్లాడెదరు. ఇందు 13.33 మిలియనులు లేక 56.55% మంది మహమ్మదీయులుగలరు. 6.33 మిలియనులు లేక 26.84% మంది హిందువులు గలరు. 3.04 మిలియనులు లేక 12.98% మంది సిక్కులున్నారు. ఈరాష్ట్రమునందలి మహమ్మదీయు లందరు హిందూమతమునుండి మహమ్మదీయమతమును స్వీకరించినవారు కారు.1

7 బీహారు ఒరిస్సాలు

బీహారు, ఒరిస్సా రాష్ట్రములు 1911 సంవత్సరమునందే ప్రత్యేక రాష్ట్రముగ నిర్మింపబడినవి. బీహారురాష్ట్రమున 82.31% హిందువులుగలరు. 11.32% మంది మహమ్మదీయులుగలరు. ప్రత్యేకముగ బీహారురాష్ట్రమున 3% మంది మాత్రమే మహమ్మదీయులుగలరు. బీహారులో 96% మంది హిందూస్థానీ మాట్లాడెదరు. ఒరిస్సాయందు 100 కి 80 మంది ఒరియాభాషనే మాట్లాడెదరు.

8 మధ్యరాష్ట్రములు

సం॥ 1861 లో మధ్యరాష్ట్రము లేర్పరుపబడినవి. నాగపురము రాజుయొక్క రాజ్యభాగమిది. 1903 లో నైజాము గారి బీరారుగూడ దీనికి కలుపబడినది. నైజాముగారిచే శాశ్వత కౌలునకు పుచ్చుకొనబడినది. 1920 నుండియు గవర్నరు రాష్ట్రముగ నేర్పరుపబడినది. 1935 వ రాజ్యాంగశాసనము ననుసరించి బీరారు నైజాము ప్రభుపురాజ్యముగ గుర్తింపబడినది. కాని, పరిపాలనము మధ్యరాష్ట్రమునందే యుంచబడినది. (సెక్షను 46. 1935 రాజ్యాంగశాసనము). ఈరాష్ట్రమొక విచిత్ర రాష్ట్రము. మదరాసు, బొంబాయి, బంగాళము, ఒరియా, సంయుక్తరాష్ట్ర

1. దురదృష్టవశమున 1947 వ సంవత్సరపు స్వాతంత్ర్యశాసనము ననుసరించి, యీ పంజాబు రాష్ట్రము రెండు రాష్ట్రములుగ విభజింపబడినది.

ముల ప్రజ లిందుగలరు. అనగా, యీరాష్ట్రమున మహారాష్ట్రులు, హిందూస్థానీ వారు, రాజస్థానమువారు, ఒరియావారు, కూర్గువారు, తెలుగువారును గలరు. అయితే, 100 కి 90 మంది మహారాష్ట్రులును, హిందూస్థానీవారును గలరు. ఈరాష్ట్రమును సంపూర్ణముగ తీసివేసి మహారాష్ట్రభాగమును ప్రత్యేక మహారాష్ట్రమునకును, హిందీభాగమును సంయుక్తరాష్ట్రములకును గలిపివేయవచ్చును.

9 అస్సాము రాష్ట్రము. అస్సామురాష్ట్రము 1874 లో బంగాళమునుండి వేరుచేయబడినది. 1920 లో గవర్నరురాష్ట్రముగ మార్చబడినది. ఈరాష్ట్రమునకు విశ్వవిద్యాలయముగాని, హైకోర్టుగాని లేదు. బ్రహ్మపుత్ర, సుర్మాలోయలలో నీరాష్ట్రజనసంఖ్య గలదు. ఇందు సగము మంది వంగదేశీయులు. 100 కి 20 మంది మాత్ర మస్సాము దేశీయులు గలరు. 57.20% హిందువులు ; 31.96% మహమ్మదీయులు ; 8.25% కొండజాతులవారును గలరు.1

10 పశ్చిమోత్తర పరగణాలు. పశ్చిమోత్తర పరగణాలు 1901 లో లార్డుకర్జనుగారిచే సృష్టింపబడినవి. 1932 వరకును యీ రాష్ట్రము ఛీఫ్ కమీషనరు రాష్ట్రము. పిమ్మట మాంటేగూ సంస్కరణము లీ రాష్ట్రమునకుగూడ వర్తింప జేయబడినవి. 1935 లో నీ రాష్ట్రము గవర్నరురాష్ట్రముక్రింద యంగీకరింపబడినది. ఇందు మహమ్మదీయ జనసంఖ్యయే యతిప్రాబల్యము.2

11 చిన్న రాష్ట్రములు. బ్రిటిషు బెలూచిస్థానము, 1889 లో సృష్టింపబడినది. 1876 లో కీలటుఖానునుండి కొనబడిన క్వెట్టాయును, దాని పరిసరప్రాంతములును, ఆఫ్గనుస్థానముతో గావించుకొనిన యొడంబడికననుసరించి లభించినప్రదేశమునుగలిసి బ్రిటిషుబెలూచిస్థానముగ వ్యవహరింపబడుచున్నది. ఇది ఛీఫ్ కమీషనరుచే పరిపాలింపబడుచున్నది.

1. సం॥ 1947వ స్వాతంత్ర్యశాసనము ననుసరించి యీ రాష్ట్రపు టెల్లలుగూడ మార్పు చెందినవి.

2. 1947 స్వాతంత్ర్యశాసనము ననుసరించి పాకిస్థాన రాజ్యభాగమైనది.

1834 లో కలుపుకొనబడిన కూర్గు, మైసూరు రెసిడెంటుచే పరిపాలింపబడు చున్నది. ఈయనయే దీనికి ఛీఫ్ కమీషనరు. 1818 లో లభించిన అజ్మీరు, మారువారా, రాజపుటానా, సంస్థానములయందలి గవర్నరు జనరలుగారి యేజంటుచే పరిపాలింపబడుచున్నవి. ఈయనయే దీనికి ఛీఫ్ కమీషనరు. ఈ రాష్ట్రమున 5 లక్షలుమాత్రమే జనసంఖ్య. అండమాను, నికోబారు, ద్వీపములు, పోర్టుబ్లెయిరునందలి ఛీఫ్ కమీషనరుచే పరిపాలింపబడుచున్నవి.

12 ఢిల్లీ రాష్ట్రము. ఢిల్లీ రాష్ట్రము 1912 అక్టోబరు 1 వ తేదీని సృష్టింపబడినది. ఇంతకుపూర్వమిది పంజాబునందలి యొకజిల్లాగా నుండెడిది. ఇదియు నొకఛీఫ్ కమీషనరుచే పరిపాలింపబడుచున్నది. దీనివైశాల్యము 557 చతురపుమైళ్ళు. దీని జనసంఖ్య 4 లక్షలు.

13 రాష్ట్రముల స్థితి. తాహతు. ఈ రాష్ట్రములను 1919 వ సంవత్సరపు రాజ్యాంగమునకు పూర్వము 5 తరగతులుగ విభజింపవచ్చును. (1) గవర్నరులయొక్క మూడురాజధానులు. మదరాసు, బొంబాయి, కలకత్తాలు. (2) లెఫ్టినెంటు గవర్నరుల రాష్ట్రములు. సంయుక్తరాష్ట్రములు. పంజాబు, బీహారు-ఒరిస్సాలు, బర్మా. (3) రెండు ఛీఫ్‌కమీషనరుల రాష్ట్రములు. మధ్యరాష్ట్రములు, అస్సాము. (4) బెలూచిస్థానము. పశ్చిమోత్తర పరగణాలు. సరిహద్దు రాష్ట్రములు. (5) కూర్గు, అజ్మీరు, అండమానుదీవులు. ఢిల్లీ ఇవి నైదవతరగతి. ఈరాష్ట్రము లన్నియు నేసిద్ధాంతము ననుసరించియు నిర్మింపబడియుండలేదు. "ఈవిధముగ భారతదేశ రాజకీయ చిత్రపటము, సైనిక, రాజకీయ, పరిపాలనా సౌకర్యములును, తాత్కాలికావసరములును, మాత్రమేగమనించి వ్రాయబడినది. సహజ సౌకర్యములుగాని, ప్రజాభిమతముగాని, పాటింపబడి యుండలేదు.[1] అని మాంటేగూ నివేదికయే యంగీకరించినది. కాని, ప్రజాభిప్రాయము ననుసరించి భాషాప్రయుక్త రాష్ట్రవిభజనమింకను జరిగియుండలేదు. యావద్భారత దేశమును భాషాప్రయుక్తరాష్ట్రములక్రింద విభజింపబడు టత్యావసరము.

---

1. See Montagu-Chelmsford Report. Paragraph 39.

భారతీయరాజ్యాంగ మానాడు సుకరముగనుండుననుట నిశ్చయము. ఎల్లరంగీకరించిన విషయమే.

ఈ రాష్ట్రములన్నియు హిందూదేశ ప్రభుత్వమువారి పెత్తనముక్రిందనే వ్యవహరించుచున్నవి. ఆయారాష్ట్రప్రభుత్వముల తాహతుననుసరించి హిందూదేశప్రభుత్వము వాటిపై నధికారము చెలాయించుచున్నది. రాష్ట్రములయందు 9 పెద్దరాష్ట్రములు. మిగిలినవి చిన్నరాష్ట్రములు. పశ్చిమోత్తర పరగణాలును, బెలూచిస్థానము, కూర్గు, అజ్మీరు, అండమానుదీవులు, ఢిల్లీరాష్ట్రములు చిన్నరాష్ట్రములుగను, మదరాసు, బొంబాయి, బెంగాలు, బీహారు, ఒరిస్సాలు, సంయుక్తరాష్ట్రములు, పంజాబు, బర్మా, అస్సాము, మధ్యరాష్ట్రములు పెద్దరాష్ట్రములుగను వ్యవహరింపబడుచున్నవి. అన్నియు మొత్తము 15 రాష్ట్రములుగనున్నవి.

ఈ రాష్ట్రములలో బొంబాయి, మదరాసు రాజధానులు, రెండును ప్రత్యేకతాహతును మొదటినుండియు ననుభవించుచున్నవి. వంగరాష్ట్రమన్ని రాష్ట్రములమీదను మొదట నధికారము గలిగియుండియు 1912 సంవత్సరము వరకును లెఫ్టినెంటు గవర్నరు రాష్ట్రముగనే వ్యవహరింపవలసి వచ్చినది. పిమ్మట, యితర రెండురాజధానులతోపాటు తాహతులభింపజేయబడి, గవర్నరు రాష్ట్రముగ గావింపబడినది. ఈ రాష్ట్రములన్నియు కౌన్సిలు యుతుడైన గవర్నరు జనరలుగారి యాజ్ఞలను శిరసావహించుచుండవలయును. రాష్ట్రపరిపాలనకు సంబంధించిన వ్యవహారముల నన్నింటిని గవర్నరుజనరలునకు విధితప్పకుండ నిరంతరాయమానముగ రాష్ట్రప్రభుత్వములు నివేదించుచుండవలయును. రాష్ట్రప్రభుత్వముల పరిపాలనము గవర్నరుజనరలుగారి పరిశీలనకును, నధికారమునకును లోబడియున్నది. ఈ యధికారము కొన్నిప్రత్యేక విషయములలో మాత్రము సడలింపబడినది.1 కాని, మూడురాజధానులుమాత్రము కొన్నిప్రత్యేక వారసత్వముగ లభించిన హక్కులను గలిగియున్నవి. "ఈ రాజధాని ప్రభుత్వములార్థిక సమస్యలకు సంబంధించిన విషయములలో రాజ్యాంగకార్యదర్శితో ప్రత్యక్షముగ నుత్తరప్రత్యుత్తరములను జరుపవచ్చును. ఇండియా ప్రభుత్వమువారి

1. See Govt. of India Act. Sec. 45 (i) of 1919.

యుత్తరువులపై రాజ్యాంగకార్యదర్శికి అప్పీలుచేసుకొనుటకు రాజధానుల కధికారముగలదు. ఈరాజధాని ప్రభుత్వములక్రింద పనిచేయవలసిన యుద్యోగులను నియమించుటలో స్వతంత్రము గలిగియున్నవి. ఇతరరాష్ట్రములకంటె హిందూదేశ ప్రభుత్వము రాజధాని ప్రభుత్వములపై తక్కువ పరిశీలనాధికారము నుపయోగించుచున్నది." 1 ఈ రాజధానిప్రభుత్వములు 1919 సంస్కరణములకు పూర్వము కౌన్సిలు యుతుడైన గవర్నరుచే పరిపాలింపబడుచుండెడివి. గవర్నరు యింగ్లండునుండి నియమింపబడి పంపబడుచుండెడివాడు. ఇరువురు, సివిలుసర్వీసు కార్యనిర్వాహకవర్గ సభ్యులును, నొక భారతీయ కార్యనిర్వాహకవర్గ సభ్యుడును, మొత్తము ముగ్గురు కార్యనిర్వాహకవర్గ సభ్యులతో గవర్నరు పరిపాలనము కొనసాగించుచుండెడివాడు. ఈ కార్యనిర్వాహకవర్గసభ్యులు రాజ్యాంగకార్యదర్శి సూచన ననుసరించి చక్రవర్తిగారిచే నియమింపబడుచుండెడివారు. ఆంగ్లేయ రాజకీయవేత్తలు మాత్రమేకాక, యాంగ్లేయ సివిలుసర్వీసు ఉద్యోగస్థులుగూడ గవర్నరులుగ నియమింపబడుచుండిరి. సిన్హాప్రభు వొక్కడుమాత్రమే భారతీయుడు. గవర్నరుపదవికి నియమింపబడినవాడు. గవర్నరుపదవులకు పిమ్మట లెఫ్టినెంటు గవర్నరు పదవులున్నవి. ఈ లెఫ్టినెంటు గవర్నరుపదవు లన్నియు హిందూదేశమునందలి, సివిలుసర్వీసునందలి ఆంగ్లేయోద్యోగులకు మాత్రమే యొసగబడినవి. గవర్నరులు, లెఫ్టినెంటు గవర్నరుల రాష్ట్రములుగాని యితర రాష్ట్రములన్నియు ఇండియా ప్రభుత్వమువారి ప్రత్యక్షాధికారమునకు లోబరుపబడినవి. చీఫ్‌కమీషనరు రాష్ట్రములకు రాష్ట్రప్రభుత్వములను నామకరణము లేదు. అవి పరిపాలనాభాగములుమాత్రమే. ప్రభుత్వములుకావు. (Not Govts. only Administrations) మిగిలినతరగతుల రాష్ట్రముల తాహతు మరియు స్వల్పము. వీటిపై, ఇండియాప్రభుత్వ మధికారము విశేషముగ చెలాయించుచుండెడిది.

7 రాష్ట్రీయ రాజ్యాంగములు. కౌన్సిలుయుతుడైన గవర్నరుల యధికారములును, విధులును, పార్లమెంటువారి శాసనముల ననుసరించి నిర్ణయింపబడుచు వచ్చినవి. మొదట సైనికాధికారముగూడ గలిగియుండెడిది. 1893 లో మదరాసు, బొంబాయి సేనలు రద్దుపరుపబడి కౌన్సిలు

1. See Montagu Chelmsford Report. Paragraph 40.

యుతుడగు గవర్నరుజనరలుగారి యధికారమునకు లోబరుపబడినవి. గవర్నరు జనరలుగారికి వలెనే, గవర్నరులకుగూడ కొన్ని ప్రత్యేక విషయములలో వారి మంత్రాంగ సభయొక్క యాలోచనను త్రోసివేయుట కధికారముగలదు. (Council). 1909 సంవత్సరమువరకును, గవర్నరు యాలోచనా సభకు గరిష్ఠ సంఖ్య ముగ్గురు సభ్యులుమాత్రమే. హిందూదేశమున వరుసగ సం॥ 12 ల యుద్యోగానుభవము గలవారుమాత్రమే గవర్నరు కౌన్సిలు సభ్యులుగ నియమింపబడుటకర్హులు. కాని, యాచరణయందు యిరువురుమాత్రమే గవర్నరులకు కార్యనిర్వాహకవర్గ సభ్యులుండెడివారు. మదరాసు, బొంబాయి రాజధానుల ప్రత్యేకసేనలు రద్దుపరుపబడు వరకును సైన్యాధిపతులు ప్రత్యేక సభ్యులుగా నుండెడివారు. 1909 వ సంవత్సరపు యిండియా కౌన్సిళ్ళ శాసనము ననుసరించి మదరాసు, బొంబాయిరాష్ట్ర ప్రభుత్వములకు రాజ్యాంగకార్యదర్శి యప్పుడప్పుడు నిర్ణయించినటుల గరిష్ఠసంఖ్య నలుగురికి మించకుండ కౌన్సిలు సభ్యులు నిర్ణయింపబడిరి. ఇందు కనీసము యిరువురునియమింపబడు కాలమునకు హిందూదేశమున వరుసగ సం॥ 12 లు యుద్యోగమునం దున్నవారుగ నుండవలయును. 1784 వ పిట్టుశాసనము ప్రకారము ముగ్గురు కౌన్సిలరులు నియమింపబడిరి. ఇందు సైన్యాధిపతియొకడు. 1833 లో యీసంఖ్య యిరువురుగ నిర్ణయింపబడినది. 1909 వ సంవత్సర శాసనము ననుసరించి మరుసటి సంవత్సరము మదరాసు, బొంబాయి ప్రభుత్వముల మంత్రాంగసభల సంఖ్య హెచ్చింపబడినది. భారతీయసభ్యుడు నియమింపబడినాడు. కార్యనిర్వాహకవర్గ సభయొక్క కార్యాచరణ విధానమంతయు హిందూదేశప్రభుత్వ కార్యనిర్వహణ విధానము వలెనే నిర్ణయింపబడినది. 1854 సంవత్సర శాసనము ననుసరించి గవర్నరుజనరలు గారు సీమయందలి కంపెనీవారి యామోదముతో నేప్రదేశమునైనను తనస్వంత పరిపాలనమునక్రిందకు తీసికొనుట కధికారము గల్పింపబడినది. ఈ యధికారము ననుసరించియే అస్సాము-బర్మా-మధ్యరాష్ట్రములకు చీఫ్‌కమీషనరులు నియమింపబడిరి.

1861 శాసనమునను సరించి కౌన్సిలుయుతుడైన గవర్నరుజనరలుగారు, రాజ్యాంగకార్యదర్శి యామోదముతో శాసనాధికారముగల నూతనరాష్ట్రమును

నిర్మించుటకును, నట్టిరాష్ట్రమునకు లెఫ్టినెంటు గవర్నరును నియమించుటకును నధికారమును గలిగియుండిరి. సం॥ 1910 – 1912 లలో జరిగిన మార్పులకు ముందుగల రాష్ట్రములను వాటియధికారముల ననుసరించి మూడుతరగతులుగ విభజింపవచ్చును.

(1) మదరాసు, బొంబాయి రాజధాని ప్రభుత్వములు కౌన్సిలుయుతులగు గవర్నరులచేత పరిపాలింపబడెడివి. ఈ కౌన్సిలుయుతులగు గవర్నర్లప్రభుత్వమునకు కార్యనిర్వాహణాధికారమును, శాసనాధికారమునుగూడ నుండెడివి.

(2) లెఫ్టినెంటుగవర్నరుల పరిపాలనక్రిందగల వంగ, సంయుక్తరాష్ట్ర, పంజాబు, బర్మా ప్రభుత్వములకు శాసనసభలుమాత్రమే గలవు. కార్యనిర్వాహకవర్గములులేవు.

(3) చీఫ్‌కమీషనరుల రాష్ట్రమునకు శాసనాధికారముగాని, కార్యనిర్వాహణాధికారముగాని రెండునులేవు. (Legislative and executive). అనగా, శాసనసభలులేవు. కార్యనిర్వాహకవర్గములునులేవు.

కాని, 1910 వ సంవత్సరమునందు మాత్రము వంగదేశమున నూతనరాష్ట్రప్రభుత్వము నిర్మింపబడినది. లెఫ్టినెంటుగవర్నరునకు సహాయకారిగ నుండుటకై కౌన్సిలు లేక కార్యనిర్వాహకవర్గసభ సృష్టింపబడినది. 1909 సంవత్సరపు కౌన్సిళ్ళశాసనము ననుసరించి నలుగురికిమించని సభ్యులతో రాజ్యాంగకార్యదర్శి యామోదముతో కార్యనిర్వాహకవర్గసభను నిర్మించుటకు కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారి కధికారము సంక్రమింపజేయబడినది. ఇదేవిధముగ యితరలెఫ్టినెంటు గవర్నరుల రాష్ట్రములలోగూడ మంత్రాంగసభలను నిర్మించుటకు గవర్నరుజనరలున కధికారమొసగబడినది. కాని, యట్లునిర్మించుటకుముందు పార్లమెంటుసభల సముఖమున నట్టిసూచనను మూడుమాసాలుంచవలయును. ఆసూచనకు వ్యతిరేకముగ పార్లమెంటుసభ తీర్మానించనియెడల గవర్నరుజనరలుగారు తనసూచన నమలునందుంచుట కభ్యంతరములేదు. వంగదేశ కార్యనిర్వాహకవర్గసభయొక్క - నిర్మాణము — నధికారములును, బొంబాయి, మదరాసు ప్రభుత్వముల కార్యనిర్వాహకవర్గములతో సరిసమానముగ నున్నవి. 1912 లో నీవిధముగ వంగరాష్ట్రము, యితర రెండురాష్ట్రములతోను సమాన

ప్రతిపత్తిని పొందినది. 1912 సంవత్సర రాజ్యాంగశాసనము నూతనముగ నిర్మింపబడిన బీహారు — ఒరిస్సారాష్ట్రమునకు వర్తింపజేయబడినది.

సం॥ 1909 రాజ్యాంగశాసనము ననుసరించి బీహారు — ఒరిస్సారాష్ట్రమున ముగ్గురుసభ్యులతోగూడిన కార్యనిర్వాహకవర్గము నియమింపబడినది. సం॥ 1912 రాజ్యాంగశాసనము గూడ ఛీఫ్‌కమీషనరుల రాష్ట్రములలో, శాసనసభలను నిర్మించుటకు కౌన్సిలుయుతుడగు గవర్నరుజనరలుగారి కధికార మొసగబడినది. ఈయధికారము ననుసరించి యస్సామురాష్ట్రమునకు 1912 సవంబరున శాసనసభ నిర్మింపబడినది. (Legislative Council). ఈ విధముగ 1919 సంవత్సర రాజ్యాంగశాసన మమలులోనికి వచ్చునాటికి భారతదేశమునందలి రాష్ట్రప్రభుత్వముల నిర్మాణ మీవిధముగనున్నది.

| రాష్ట్రములు — | అంగనిర్మాణము. |
|---|---|
| (1) మదరాసు, వంగము, బొంబాయి — | (1) మంత్రాంగసభాసమేతుడగు గవర్నరు, కార్యనిర్వాహకవర్గము, శాసనసభకూడ నున్నవి. |
| (2) బీహారు — ఒరిస్సాలు — | (2) లెఫ్టినెంటుగవర్నరు, శాసనసభ, కార్యనిర్వాహకవర్గము. |
| (3) సంయుక్తరాష్ట్రములు, పంజాబు, బర్మా — | (3) లెఫ్టినెంటుగవర్నరు, శాసనసభ మాత్రమే. |
| (4) అస్సాము — మధ్యరాష్ట్రములు | (4) ఛీఫ్ కమీషనరు. శాసనసభ మాత్రమే. |
| (5) బెలూచిస్థానము, పశ్చిమోత్తరపరగణాలు; ఢిల్లీ, యితరములు | (5) ఛీఫ్‌కమీషనరు మాత్రమే. శాసనసభ లేదు. కార్యనిర్వాహకవర్గమును లేదు. |

లెఫ్టినెంటు గవర్నరులను సీమప్రభుత్వమువారి యామోదముతో హైకోర్టుజడ్జిగారే నియమించుచువచ్చిరి. హిందూదేశమునందలి, సివిలుసర్వీసు

సందలి యాంగ్లేయులే నియమింపబడుచుండిరి. వీరికి హిందూదేశమున 10 సంవత్సరముల యుద్యోగానుభవము మాత్రముండవలయును. వీరికి కార్యనిర్వాహక వర్గములులేకపోయినను, రివిన్యూబోర్డులును, నార్థికకమీషనులును పరిపాలన యందు తోడ్పడుచుండెడివి. ఈచీఫ్‌కమీషనరుల పరిపాలనకు ప్రత్యక్షముగ గవర్నరుజనరలుగారు బాధ్యులు. గవర్నరుజనరలుగారొసగిన యధికారములు మాత్రమే వీనికి సంక్రమింపగలవు. అయినను, నాచరణయందు కొందరి చీఫ్ కమీషనరుల యధికారములు, లెఫ్టినెంటు గవర్నరుల యధికారములకంటె తక్కువగ నుండియుండలేదు. చీఫ్‌కమీషనరుగూడ లెఫ్టినెంటు గవర్నరు. లేక గవర్నరు - ప్రభుత్వమువలెనే పనిచేయుచుండుట యాచరణయం దున్నది. "స్థానిక ప్రభుత్వము" (Local Govt.). అను నామము 1897 సంవత్సర 10 వ శాసనముననుసరించి చీఫ్‌కమీషనరు పరిపాలనా భాగమునకుగూడ వర్తించును.[1]

పెద్దరాష్ట్రములలో పరిపాలనావిధానము శాఖలుగ విభజింపబడినది. భూమిశిస్తురాబడి, న్యాయశాఖ, పోలీసు, స్థానికపరిపాలనము, నార్థికము, కట్టడములు, విద్య, ఈశాఖలు కార్యనిర్వాహకవర్గ సభ్యులచే పరిపాలింపబడుచుండెడివి. కార్యనిర్వాహకవర్గ సభ్యులక్రింద ప్రధానకార్యదర్శులు, సహాయకార్యదర్శులు, మొదలగు సిబ్బందీ కలదు. కార్యదర్శులుగను, సహాయ కార్యదర్శులుగను, సివిలుసర్వీసునందలి యాంగ్లేయులే నియమింపబడుచుండిరి. ప్రతిరాష్ట్రమున ముగ్గురు సివిలుసర్వీసు కార్యదర్శు లున్నారు. పంజాబునం దిరువురు మాత్రమే కలరు. ఇందులో నుద్యోగానుభవకాలపరిమితి హెచ్చు గలవారు ప్రధానకార్యదర్శిగ నియమింపబడుచుండెను. కార్యదర్శులు మొదలుగా గల క్రింది సిబ్బందీయు, సంగనిర్మాణమును హిందూదేశ ప్రభుత్వమునందు వలెనే యున్నది. 1853 వ సంవత్సరమున హిందూదేశ శాసనసభ సృష్టింపబడి 1861 సంవత్సరమున గావింపబడిన కౌన్సిళ్ళశాసనము ననుసరించియు, రిగ్యులేషను రాష్ట్రములనియు, రిగ్యులేషనులేని రాష్ట్రములనియు, రాష్ట్రములమధ్యగల విభేదములు సమసిపోయినవి.

---

1. See. Indian General clauses Act. × of 1897.

భారతదేశ ప్రభుత్వమున కంతకును కౌన్సిలుయుతుడైన గవర్నరుజనరలుగారు రాజ్యాంగ కార్యదర్శికి బాధ్యుడు. ఇందువల్ల రాష్ట్రప్రభుత్వములపై గవర్నరుజనరలుగారు విశేషము పరిశీలనాధికారమును వినియోగించు చుండవలసివచ్చినది. ఇదే విధముగ రాష్ట్రప్రభుత్వములు హిందూదేశ ప్రభుత్వపు టుత్తరువులను మన్నించి తీరవలయునను నియమముగూడ శాసన రూపముగ గలదు. కేంద్రప్రభుత్వ వ్యవహారములలో కేంద్రప్రభుత్వమునకు కొంతవరకు తుదినిర్ణయాధికారము గలదు. రాష్ట్రప్రభుత్వములకు మాత్రము రాష్ట్ర వ్యవహారములందు గూడ స్వాతంత్ర్యముగాని, తుదినిర్ణయాధికారముగాని లేదు. హిందూదేశప్రభుత్వము రాష్ట్రవ్యవహారములలో గూడ పెత్తనము చెలాయించుచునేవచ్చినది. హిందూ దేశ ప్రభుత్వాదాయమంతయు హిందూదేశప్రభుత్వ పక్షముననే వసూలుచేయ బడుటయు, వ్యయబరచుటయు గూడ జరుగుచున్నది. రాష్ట్ర ప్రభుత్వము లకు కొంతసొమ్ము హిందూదేశ ప్రభుత్వమే ఖర్చులక్రింద నొసగుచుండెడిది. ఈ కేంద్రీకరణ యార్థికవిధానమెట్లు క్రమక్రమముగ నడలింపబడినదియు, వేరొక యధ్యాయమునందు వివరింపబడినది. రాష్ట్రప్రభుత్వముల నడవడికకు హిందూ దేశ ప్రభుత్వ మార్థికవిషయములలో గావించిన నియమములు ప్రబల ప్రతిబంధ కము లయినవని చెప్పుట యుచ్చుటచాలును.

8 అధికార విభజనము

ఆర్థిక విషయములయందు మాత్రమే కాక, శాసనాధికారవిషయముల యందుగూడ రాష్ట్రప్రభుత్వముల కధికారము కుంచింపబడినది. కొన్నివిషయము లలో రాష్ట్ర ప్రభుత్వములకు శాసనాధికారమే లేదు. ఇతరవిషయములలో గవర్నరుజనరలుగారి యామోదమును ముందుగ పొందనిదే శాసనములను గావించుట కధికార మొసగబడియుండలేదు. రాష్ట్రప్రభుత్వముల శాసనాధికార మత్యల్పముగ నుండెడిది. కేంద్రప్రభుత్వ శాసనాధికారమునం ఇమిడిపోయినది.

ఆర్థిక విషయములలోను, శాసనాధికారము నందునను మాత్రమేకాక, పరిపాలనా విధానమునందుకూడ కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములపై పెత్త నము చెలాయించుచుండెడిది. వివిధరాష్ట్రములయందలి వ్యవహారములను సమీ కరణ మొనరించుకొనుటకును, సంసర్గము కల్పించుకొనుటకును హిందూదేశ

ప్రభుత్వముగావించిన నియమములును, నిర్వచించినవిధులును, ప్రభుత్వరాజనీతిని నిర్ణయించుచుండెడివి. హిందూదేశ ప్రభుత్వము వారిచే నియమింపబడిన కమీషనులన్నింటికిని కేంద్రప్రభుత్వబాధ్యతను దృక్పథమునందుంచుకొను రాజనీతియే మూలము. హిందూదేశ ప్రభుత్వ మప్పుడప్పుడు గావించుచు వచ్చిన తీర్మానములను పరీక్షించుచోగూడ కేంద్రప్రభుత్వ నిరంకుశబాధ్యతనే నిరూపించుచు వచ్చినవని తేలగలవు.[1]

హిందూదేశప్రభుత్వము, తనపరిపాలనయందలి శాఖలకార్యనిర్వహణమునకు వలయు పైయధికారుల నియమించుటయేకాక రాష్ట్రప్రభుత్వముల పరిపాలనమును పరిశీలించుటకుగూడ శానిటరీకమీషనరు, ఇండియను మెడికల్ సర్వీసుడైరక్టరు జనరలు, వ్యవసాయసలహాదారుడు (Agricultural adviser) విద్యావిషయ కమీషనరు, నడవుల యిన్స్పెక్టరుజనరలు, కట్టడములడైరెక్టరు జనరలు, మొదలగు పరిశీలనాధికారులను నియమించుచున్నది. మరియు, రాష్ట్రప్రభుత్వముల నిర్ణయములపై వ్యక్తులుగాని, యుద్యోగులుగాని, హిందూదేశప్రభుత్వమునకు అప్పీలుచేసికొనుచుండుటకుగూడ విశేషావకాశముండెడిది. పరిశీలనా నివేదికల ననుసరించియు, రాజనీతి ననుసరించియు మాత్రమే కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములపై యధికారమును చెలాయించుచు సంతృప్తినొందెడిదికాదు. రాష్ట్రప్రభుత్వముల సాలుసరి యాదాయవ్యయములను జాగరూకతతో పరీక్షించుచు, అవసరమని తలంచినపుడెల్ల మార్పునుగూడ జేయుచుండెడిది. నూతనముగ నేర్పరుపబడు ప్రతిముఖ్యోద్దేశమును, చిన్నయుద్యోగము లధిక మొనరింపబడినప్పుడునుగూడ కేంద్రప్రభుత్వమువారి యామోదమునుపొందుట రాష్ట్రప్రభుత్వముల విధి.[2]

ఈ పరిస్థితులలో రాష్ట్రప్రభుత్వములకు, స్వీయాభిప్రాయములకు గాని, స్వయం నిర్ణయాధికారముగాని లేదనుట నిర్వివాదాంశము. ప్రతివిషయమునను, కేంద్రప్రభుత్వమువారి యామోదమును పొందవలసియున్నది. 3

1. See. Montagu Chelmsford Report. Paragraph 102-104 and 112-119.
2. See Report of the Royal Commission on De-centralization 1908.
3. See The despatch accompanying the Govt. of Indan Act 1833 dated 10th Dec. 1834. issued by the court of directors and the despatch of 28 th March 1838 also.

1 రాష్ట్ర స్వాతంత్ర్యము 1908 రాయలుకమీషను.

కేంద్రరాష్ట్రప్రభుత్వముల యధికార విభజనమును గురించి విచారించుటకై నియమింపబడిన రాయలుకమీషను సం॥ 1908 రపునివేదిక యీసందర్భమున గమనింపదగును:

"హిందూదేశమునందలి రాష్ట్రప్రభుత్వములు, సంయుక్త రాష్ట్రప్రభుత్వమునందలి వివిధప్రభుత్వములవలె బుద్ధిపూర్వకముగ నధికారవిభజనమును గావించుకొని, యావిషయములను శాసనరూపముగ నిర్వచించుకొనిన ప్రభుత్వములవంటి ప్రభుత్వములుకావని ముఖ్యముగ గమనించవలసియున్నది. హిందూదేశమునం దన్నివిషయములలోను కేంద్రప్రభుత్వము వారి పరిశీలనాధికారములకు రాష్ట్రప్రభుత్వములు లొంగియున్నవి. లొంగియేయుండవలయుననియు, వాటి యధికారములును, విధులును, కేంద్రప్రభుత్వములేక, రాజ్యాంగకార్యదర్శి మాత్రమే మార్పునుచెందించుట కధికారమును గలిగియుండెను." ఈయధికారమును క్రమక్రమముగ సడలించి రాష్ట్రప్రభుత్వములకు కార్యనిర్వహణాధికారమునందు బాధ్యతను పెంపొందింపవలయుననియు, స్వాతంత్ర్యమొసగవలయుననియు, నీకమీషను సూచించినది. కేంద్రప్రభుత్వ తుదినిర్ణయాధికారమువల్ల ప్రతివిషయము ననవసరాలస్యమునకు గురియగుచుండెననియు, పరిపాలనస్థానము పాడగుచున్నదనియు, రాష్ట్రప్రభుత్వములు చిరకాలము తమ యసమ్మతిని దెలుపుచుండెడివి.1

9 1919 సంస్కరణములు రాష్ట్రములు.

హిందూదేశప్రభుత్వము, రాజ్యాంగకార్యదర్శియు, పార్లమెంటును అధికారము గలిగియున్నంతవరకును హిందూదేశప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములపైగల యధికారమును సడలించుకొన జాలకపోయినది. మింటో - మార్లే సంస్కరణములయం దీవిధముగనే రాష్ట్రప్రభుత్వముల కెట్టిస్వాతంత్ర్యమును లభించలేదు. మాంటేగూ సంస్కరణములయందుగూడ గమనార్హమగు రాష్ట్రస్వాతంత్ర్యము లభించియుండలేదు. పార్లమెంటుయొక్కయు, రాజ్యాంగకార్యదర్శియొక్కయు, కేంద్రప్రభుత్వము యొక్కయు, నధికారము సడలింపబడకుండగనే రాష్ట్రముల

1. See. the note Govt. of Bombay submitted to the Royal Commission on De-centralization.

యందు బాధ్యతాయుత ప్రభుత్వసిద్ధాంతమును నెలకొల్పవలెనని సంస్కరణ శాసనమునందు ప్రయత్నింపబడినది. ఇదియే ద్వందప్రభుత్వము. అనగా, కార్యనిర్వాహకవర్గము రెండుభాగములు గావింపబడినది. ఈవిధానముగూడ చిన్నరాష్ట్రములకు వర్తింపచేయబడలేదు. లెఫ్టినెంటుగవర్నరుల రాష్ట్రములును, గవర్నరుల రాష్ట్రములకుమాత్రమే సంస్కరణములు వర్తింపచేయబడినవి. చిన్న రాష్ట్రములు హిందూదేశ కేంద్ర ప్రభుత్వమువారి ప్రత్యక్షాధికారముక్రిందనే, వెనుకటివలెనే పరిపాలింపబడుచుండెడివి. చిన్నరాష్ట్రముల యాదాయవ్యయములు గూడ కేంద్రప్రభుత్వమువారి యేజెంట్లుగమాత్రమే నవి వ్యయపరచవలసియున్నవి. ఈచిన్నరాష్ట్రముల యాదాయము కేంద్రప్రభుత్వాదాయములోని భాగముగనే పరిగణింపబడుచు వచ్చినది.

10 ద్వంద్వప్రభుత్వము.

పెద్దరాష్ట్రములలో ప్రవేశపెట్టబడిన ద్వంద్వప్రభుత్వ విధానమువల్ల రాష్ట్రప్రభుత్వములలో గలిగినమార్పులను గమనించుట యవసరము. రాష్ట్రములయందలి కార్యనిర్వాహక వర్గము రెండుభాగములుగ నొనరింపబడినది. అందొకభాగము పార్లమెంటునకును, మరియొకభాగము శాసనసభకును బాధ్యతవహించునట్లుగ నిర్ణయింపబడినది. ఈరెండుభాగములునుగలిసి యేకప్రభుత్వముగ నొకేగవర్నరు నధికారమునకు లోబడి పనిచేయుటయే ద్వంద్వప్రభుత్వ విధానము.

11 అధికార విభజనము. రాష్ట్రప్రభుత్వములు. విభజన నియమములు.

కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వమునకును మధ్య నధికారవిభజన మొనరించుటకుగాను నొకసంఘము నియమింపబడినది. (Functions Committee) సౌతుబీరో సంఘము కొన్నిసూచనలను గావించినది. గవర్నరు జనరలుగారు 1919 న రాజ్యాంగ శాసనాధికారమునందలి యధికారమునననుసరించి (Sections 45 and 129) నియమములనునిర్ణయించిరి. ఈనియమములు రాజ్యాంగకార్యదర్శి యామోదమునుపొందినవి. ఈ నియమము లయిదుభాగములు. (1) కేంద్రప్రభుత్వాధికార విషయములు. రాష్ట్రప్రభుత్వాధికార విషయములు. రాష్ట్రములలో ప్రజాయత్తశాఖలు. ప్రభుత్వ

శాఖలు. (2) కేంద్రప్రభుత్వార్థికము. రాష్ట్రప్రభుత్వార్థికము. కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రములొసగవలసినవిరాళములు (3) రాష్ట్రప్రభుత్వములయందలి యార్థికశాఖల విధులు. నధికారములు. (4) కేంద్రప్రభుత్వము వారిచే రాష్ట్రప్రభుత్వములచేత కేంద్రప్రభుత్వ వ్యవహారనిర్వహణము గావింపజేయుటకు వలయు నియమములు. (5) ప్రజాయత్తశాఖలపై హిందూదేశ ప్రభుత్వాధికారమును సంకుచితపరచుటకు నియమములు.

ఈ నియమములననుసరించి కేంద్రప్రభుత్వాధికార విషయములును, రాష్ట్రప్రభుత్వాధికారవిషయములును రాష్ట్రమునందు ప్రజాయత్తశాఖలవివరమును నిరూపింపబడినది.

12 కేంద్రప్రభుత్వాధికార విషయములు.

సంరక్షణము, విదేశీవ్యవహారములు, సంస్థానవ్యవహారములు, రైళ్ళు, వాయువిమానములు, నోడలు, సముద్రయానము, మొదలగురాకపోకల విషయములు, తంతితపాలాలు, టెలిఫోనులు, నాణెములు, నాణెముల చెలామణి, వర్తకము, నల్లమందు, ముద్రణాధికారము, క్రిమినలుశాసనములు, సఖలభారత ప్రభుత్వపుసిబ్బంది (All India Services).

13 రాష్ట్రాధికార విషయములు. ప్రజాయత్తశాఖలు.

ఇతరరాష్ట్ర విషయములు. అనగా రాష్ట్రములకు సంబంధించినవి.

విద్య, యారోగ్యము, స్థానికప్రభుత్వము, మద్యపానము, నడవులు, వ్యవసాయము, సహకారము, పరిశ్రమలు, మొదలగునవి. ఇవియే మంత్రుల వశమొనరింపబడినవి.

14 కేంద్ర ప్రభుత్వాధికారము

కేంద్రప్రభుత్వమునకు రాష్ట్ర ప్రభుత్వముపైగల యధికారముగూడ నిర్వచింపబడినది.1 అన్నిరాష్ట్రములలోను సమానరీతిని వ్యవహారములు నిర్వహింపబడునట్లుగ నొనరించుటకును (Uniformity) కేంద్రప్రభుత్వాధికార విషయముల సంరక్షణమునకును, ఒకరాష్ట్రమున కేకాక, రెండుమూడు రాష్ట్రములకు పర్తించెడి విషయములను సంరక్షించుటకును హిందూదేశరాజ్యాంగశాస

1. See. Devolution Rule 49.

నమునసరించి కేంద్రప్రభుత్వమునకు సంక్రమింపజేయబడిన యధికారసంరక్షణమునకును, వలయునధికారము రాష్ట్రప్రభుత్వములపై కేంద్రప్రభుత్వముల కొసగబడినది. ఈ యధికారనిరూపణముగూడ ప్రజాయత్తశాఖలకు సంబంధించినంతవరకుమాత్రమే. ప్రభుత్వశాఖలపై పరిశీలనాధికారము, నాజ్ఞాధికారము, పెత్తనము, (Superintendence, direction and control) యథాప్రకారముగనే గలవు. ప్రజాయత్తశాఖలకు సంబంధించనివిషయములలో రాష్ట్రప్రభుత్వములు రాజ్యాంగకార్యదర్శి యధికారమునకు వెనుకటివలెనే తాబేదారులుగ వ్యవహరించకతప్పలేదు. కౌన్సిలు యుతుడైన గవర్నరు జనరలుగా రాజ్ఞాపించినరీతిగ, యాజ్ఞాపింపబడిన విషయమంతయు రాష్ట్రప్రభుత్వములు నివేదించుకొనితీరవలయునను నియమముగలదు. (Rule 5). కేంద్రప్రభుత్వ విషయముల పరిపాలనకై రాష్ట్రప్రభుత్వముల సిబ్బందిని ప్రత్యేకముగ నుపయోగించుకొనినపుడు అవ్యయమును కేంద్రప్రభుత్వమేభరించినది. కేంద్రరాష్ట్రప్రభుత్వవిషయములుకలిసి పరిపాలింపబడినపు డందులకగువ్యయము రెండు ప్రభుత్వములును విభజించుకొనినవి. ఈవిభజనమున రెండుప్రభుత్వము లేకాభిప్రాయమునుగలిగి యుండనియెడల రాజ్యాంగకార్యదర్శి మధ్యవర్తిగ వ్యవహరించుటకధికారమును గలిగియుండెను.

ఈ రాజ్యాంగశాసనము ననుసరించి యధికారవిభజనమును గురించియు, ప్రజాయత్తశాఖలను గురించియు నియమములను వ్రాయవచ్చును. రాష్ట్రప్రభుత్వము లొసంగవలసిన విరాళములను గురించియు, నట్టివిరాళములు రాష్ట్రాదాయముపై మొదటివిధిగా నొసగించుటకును, యేరాష్ట్రమునందైనను నార్థికశాఖను నిర్మించి యాశాఖ ప్రవర్తనమునకును ప్రభుత్వపు సిబ్బందిపై రాష్ట్రప్రభుత్వములకుగల యధికారమును నిర్ణయించుటకును, నేవిషయమైనను ప్రభుత్వాధికారమునకు సంబంధించినదా లేక, ప్రజాయత్తశాఖల యధికారమునకు సంబంధించినదా యను నిర్ణయమును తగవువచ్చినప్పుడు గావించుటకును, నుభయ ప్రభుత్వశాఖలనుగురించిన విషయములకునుగూడ నియమములు వ్రాయబడుటకు రాజ్యాంగశాసనమునం దధికారము గల్పించుకొనబడినది.1 ఈ నియమముల

1. Sec. 1 of the Act.

ననుసరించి రాజ్యాంగకార్యదర్శి యనుమతిలేనిదే యే విషయముగాని, ప్రజాయత్త శాఖనుండి తీసివేయుటకు వీలులేదు. ప్రజాయత్తశాఖలకు సంబంధించిన విషయములలో నియమముల ననుసరించి గవర్నరుజనరలు గలుగజేసికొనుట కాయనయే సర్వాధికారి. ఆయన కలుగచేసికొనదలచిన విషయము నియమముల ననుసరించుచున్నదా-లేదా యనువిషయనిర్ణయమునం దాయనయే న్యాయమూర్తి.

15
మంత్రివర్గము

బర్మా మినహా యితరములగు పెద్దరాష్ట్రములు, గవర్నరుల రాష్ట్రములుగ నొనరింపబడినవి. బర్మా 1922 లో, గవర్నరు రాష్ట్రముగ కౌన్సిలుయుతుడైన గవర్నరుజనరలు గారు సీమప్రభుత్వమువారి యామోదముతో రాజ్యాంగ శాసనమునందుగల యధికారము ననుసరించి నిర్మించిరి. 1 గవర్నరుల రాష్ట్రములలో ప్రభుత్వ శాఖలను కౌన్సిలు యుతుడైన గవర్నరుగారును ప్రజాయత్తశాఖలను మంత్రి సమేతుడైన గవర్నరుగారును పరిపాలింపవలయునని శాసననిర్ణయము. అన్ని రాష్ట్రముల గవర్నరులయొక్కయు హోదా సమానముగాదు. వారి బత్తెములును సమానముగావు. గవర్నరులందరును రాయలుసైను మాన్యాలు ననుసరించి చక్రవర్తిగారిచే నియమింపబడవలయునని శాసనము. కాని, రాజధానుల గవర్నరులుమాత్రమే చక్రవర్తిగారిచే నియమింపబడుచుండిరి. ఇతరరాష్ట్రముల గవర్నరులు గవర్నరుజనరలుగారి సలహాననుసరించి నియమింప బడుచుండిరి. అనగా, రాజధానులు మూడునుగాక, యితర 5 రాష్ట్రముల గవర్నరులును హిందూదేశ సివిలుసర్వీసుద్యోగస్థుల నుండియే నియమింపబడుచున్నారు. రాజధానుల గవర్నరులు రాజ్యాంగకార్యదర్శితో ప్రత్యక్షముగ నుత్తరప్రత్యుత్తరములను గావించుకొనుటకుగల సాంప్రదాయము తీసివేయబడలేదు. ఇతరరాష్ట్రముల గవర్నరుల కీయధికారములేదు.

రాష్ట్రప్రభుత్వమునందు నియమింపబడు మంత్రులు ప్రజాయత్తశాఖలను పరిపాలించిరి. ఈశాఖల పరిపాలనమునందీ మంత్రులు శాసనసభలకు బాధ్యులు. ఉద్యోగస్థులును, కార్యనిర్వాహకవర్గ సభ్యులునుగాని వారిని, గవర్నరునకు,

1. See. Section 52. A. of 1919 Govt. of India Act.

మంత్రులుగా నియమించుట కధికారముగలదు. గవర్నరుగారి యనుమతిగలిగినంత కాలమే వీరీ మంత్రిస్థానము లందుండగలరు. (During his pleasure). వీరికి కార్యనిర్వాహకవర్గ సభ్యులతోపాటు సమానజీతము లొసగబడినవి. కాని, యీ జీతమును తగ్గించుటకు రాష్ట్రశాసన సభల కధికారముగలదు.

గవర్నరుగారు ప్రజాప్రతినిధులుగ నెన్నుకొనబడిన శాసన సభ్యులగు వారినే మంత్రులుగ నియమించుచుండగలరు. ఈ నియామకాధికారమును వారి యిష్టమువచ్చినప్పుడు తీసివేయుటకుగల యధికారమును నామమాత్రములే. సహజముగ రాజ్యాంగశాసనముల యందిట్టి యధికారములు లిఖితపూర్వకముగ నుండుట పరిపాటి. కాని, ప్రజాప్రతినిధియగు శాసనసభ్యుడుకాని, వాడుగూడ నారుమాసములవరకు నియామింపబడవచ్చును. ఈ లోపుగ, నీయన, శాసనసభ కెన్నుకొనబడి యుండవలయును. ఈమంత్రివర్గము ప్రభుత్వ కార్యనిర్వహణము నందొకభాగమేకాని, కార్యనిర్వాహక వర్గమునందలి (Council) భాగము మాత్రముగాదు. రాజధానులయందు నలుగురు కార్యనిర్వాహకవర్గ సభ్యులు నియమింపబడిరి. ఇందిరువురు భారతీయులు; ముప్వురుమంత్రులు నియమింపబడుచువచ్చిరి. వీరిగరిష్ఠసంఖ్య శాసనరూపముగ నిర్ణయింప బడియుండలేదు. సంస్కరణశాసన మమలులోనికి వచ్చినపిమ్మట—వెంటనే మంత్రుల జీతములు తగ్గింపవలయునని ప్రతిశాసనసభయందునను తీర్మానములు చర్చింపబడినవిగాని, రెండురాష్ట్రములలో మాత్రమే తగ్గింపబడినవి.

16 కార్యనిర్వాహకవర్గము.

కార్యనిర్వాహకవర్గ సభ్యులనగా, ప్రభుత్వశాఖలను పరిపాలించువారు. శాసనసభల కేవిధముగను బాధ్యులుగారు. చిన్నశాసనసభలకుమారుగ సంఖ్య పెరిగిన శాసనసభలలో ప్రశ్నోత్తరముల నిచ్చుటలో మాత్రమే వీరికి శాసనసభలతో సంబంధము గలదు. నియమములు లేనియెడల యీకార్యనిర్వాహకవర్గ సభ్యుల యర్హతలను నిర్ణయించుటకు శాసనమునందు నిరూపింపబడినవి. గవర్నరుల రాష్ట్రప్రభుత్వము లొనరించు నుత్తరువులన్నియు, ప్రభుత్వోత్తరువుల క్రిందనే పరిగణింపబడు చున్నను, ప్రజాయత్తశాఖల యుత్తరువులకును – ప్రభుత్వశాఖల యుత్తరువులకును మధ్య భేదమును జూపుచునే యుండవలయును.

18 ద్వంద్వప్రభుత్వాపజయ కారణములు- సంస్కరణముల విచారణ సంఘము ద్వంద్వప్రభుత్వ మపజయము గాంచుటకుగల కారణములను సక్రమముగ క్రోఢీకరించినది. (1) రాష్ట్రప్రభుత్వముల ద్వంద్వ ప్రభుత్వమునందలి రెండుభాగముల యందును పరస్పర సహకారములేకపోవుట.

(2) మంత్రులమధ్య సమిష్టి బాధ్యత లేకపోవుట.

(3) ప్రభుత్వశాఖలును, ప్రజాయత్తశాఖలును నొండొండు పరిపాలనము నాక్రమించుకొన జూచుట లేక ప్రతిఘటింపజూచుట.

(4) ఆర్థికశాఖ ప్రభుత్వశాఖగ నుండుటవలన మంత్రులశాఖలపై నపరోక్షముగ ప్రభుత్వము సంపూర్ణాధికారమును గలిగియుండుట.

(5) రాజ్యాంగశాసనము ననుసరించి మంత్రులకు సరియగు నధికారమొసగబడకపోవుటయు; గవర్నరునకును – హిందూదేశ ప్రభుత్వమునకును రాజ్యాంగ కార్యదర్శికిని రాష్ట్రములమీదను, మంత్రివర్గముమీదను పెత్తనముండుటయు.

(6) శాశ్వతోద్యోగులు మంత్రులతో సహకారము చేయకపోవుట.

19 మడ్డిమను కమిటీనివేదిక. మడ్డిమను కమిటీ సంస్కరణములను గురించి విచారించినది. ఈసంఘమునం దధికసంఖ్యాకుల నివేదికమాత్రము సంస్కరణము లాచరణయందు నిరుపయోగము లైనవని యంగీకరించి యుండలేదు. అల్పసంఖ్యాకుల నివేదికమాత్రము నిరుపయోగములైనవని విస్పష్టముగ వ్రాసినది. గవర్నరులు తమ నిరంకుశాధికారమును[1] మంత్రులపై తరుచు ప్రయోగించియుండలేదని యధిక సంఖ్యాకులు వ్రాసిరి. "మంత్రుల నిర్ణయమును తిరస్కరించుటకు గవర్నరునకుగల యధికారము కొన్నిరాష్ట్రములలో గవర్నరులకును మంత్రులకును సంఘర్షణకు కారణ మయినది, మంత్రులను నిస్సహాయులుగ నొనరించినది." అని యల్పసంఖ్యాకులు వ్రాసిరి. అల్పసంఖ్యాకుల నివేదిక నిర్ణయమే సత్యము-

1. Subsection 3 of 52 of Govt. of India Act.

20 మంత్రివర్గములు రాజ్యాంగ శాస్త్రము.

ద్వంద్వప్రభుత్వ ప్రారంభమునందు కాంగ్రెసువాదులు యీ రాజ్యాంగ విధానమును బహిష్కరించుచు నిరూపించినలోపములన్నియు, నాచరణయందు గోచరించినవి. ద్వంద్వప్రభుత్వ శాసనసభల యెన్నికలయందు వోటరు సంస్కరణ విధానమునకు వోట్లుచేయక (100 కి 95 మంది) బహిష్కరించుటచే యందలి రాజనీతి యాచరణయోగ్యమైనదని కాదని పిమ్మట విచారింప వలసినపని వోటరులకు గలుగలేదు. (1920 అక్టోబరునందు జరిగిన యీ యెన్నికలను రెండువందలమంది వోటరులుమాత్రమే బహిష్కరించిరని కీతుగారియభిప్రాయము.[1] "శాస్త్రములలో మంత్రివర్గముల నేర్పరచుట సునాయాసమైనది. కాని యీ మంత్రివర్గములు, సాంఘికతత్వముల ననుసరించిన శాసనసభ్యుల నుండియు వివిధరాజకీయపక్షములకు జెందినవారినుండియు మాత్రమే యేర్పరుపబడినది. ఇందువల్ల మంత్రివర్గములయం దేకబాధ్యత, లేక సమూహబాధ్యత (Collective responsibility) యేర్పడుటకు నవకాశములేకుండ పోయినది. ఒకే రాజకీయ నీతిగలవారినిమాత్రమే మంత్రివర్గముగ నేర్పరచుటకు వీలులేక పోయినది. అట్లేర్పరుపబడి యుండలేదు. కులమత తత్వముల ననుసరించిన కొందఱు వ్యక్తులు నాయకులగుటకే యీ మంత్రిపదవు లవకాశము లభింపజేసినవి.[2] ఇట్టిమంత్రివర్గములు ప్రజల కుపయోగపడకుండుట యందు వింతలేదు.

## 7. స్థానికపరిపాలనము.

21 స్థానికప్రభుత్వ లక్షణములు.

కేంద్రప్రభుత్వమునకును స్థానిక ప్రభుత్వమునకును గల తారతమ్యమేమి? కేంద్రప్రభుత్వమునకువలె దేశమంతకును వర్తింపక, స్థానికప్రభుత్వ మేదో యొకనిర్ణీతప్రదేశమునందు వసించు జనసంఖ్యకొఱకు మాత్రమే యీ స్థానిక విషయములకు సంబంధించియుండగలదు. ఆంగ్లేయ పౌరునికి తనయింటి ప్రక్కన

1. See page 277 Constitutional History of India A. B. Keith.
2. SeeKeith p. 277.

నున్న పౌరునియెడ గల విధి నిర్వర్తింపచేయుసదియే స్థానికప్రభుత్వము. అనాథలకును బీదలకును తగు సహాయ మొసంగించుటయే పౌరుని విధి. అపరిశుభ్రత గలిగింపక పోవుట పౌరునివిధి. ఆరోగ్యమునకు భంగకరమగు నట్టి పనులను తాను చేయక పోవుటయు, యితరులను తన యిరుగుపొరుగుల కపరిశుభ్రత కలిగించు పనులను చేయనీయకుండుటయు నాతనివిధి. ఎవరియాస్తిని వారనుభవించు చుండగ నందుల కెట్టి ప్రతిరోధములనుగాని కలుగకుండ జేయుటయు నాతనివిధి.

పరిశుభ్రమగు ప్రాణవాయువు, బలవత్తరమగు నాహారము నపరిశుభ్రముగాని మంచినీరు ప్రజారోగ్యమునకు ముఖ్యములు. మంచినీటిని కల్తీలేని యాహారమును నంటువ్యాధులతో గూడని ప్రాణవాయువును, దీపములుగల రహదారులను, సక్రమముగ సంరక్షణకరములుగను విరివిగను నుండు కంకరబాటలను లభింప జేయుటయే స్థానిక ప్రభుత్వవ్యవహారము." అని యొకఆంగ్లేయ రాజనీతి శాస్త్రజ్ఞుడుగావించిన నిర్వచనము సక్రమము.1 స్థానిక ప్రభుత్వములకును రాష్ట్ర కేంద్ర ప్రభుత్వములకును మధ్య మూడు ముఖ్య తారతమ్యములు గలవు. (1) స్థానిక ప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వములనుండి యధికారము సంక్రమింపగలదు. రాష్ట్ర ప్రభుత్వములకే స్థానికప్రభుత్వము లోబడియుండును. (2) స్థానికప్రభుత్వముల వ్యవహారప్రదేశము, స్థానికముగ నిర్ణీతమయి యుండగలదు. (3) స్థానిక ప్రభుత్వమునకు స్థానిక సౌకర్యములపైన మాత్రమే యధికార ముండును. ఇది నిర్ణీతమగు కొంతజనసంఖ్యకుమాత్రమే వర్తింపగలదు.

22
పురపాలక సంఘములు

ఈ స్థానికపరిపాలనము మూడుభాగములుగ నున్నది. (1) పట్టణములయందు పురపాలక సంఘములు గలవు. (2) గ్రామముల సముదాయమున కుపకరించురీతిగ జిల్లాబోర్డులు లేక తాలూకాబోర్డులు, లేక, డివిజనులబోర్డు లనువివిధ నామములతో బోర్డులున్నవి. (3) గ్రామములకు పంచాయితీబోర్డులున్నవి. పురపాలక సంఘములు మొట్టమొదటగ, రాష్ట్రప్రభుత్వ ప్రధాననగరములయందు ప్రవేశపెట్టబడినవి. 1842 సం॥ రమునకు పూర్వము పురపాలకసంఘములు వాటిలక్షణములతో లేవనదగును. 1850 సంవత్సరమున భారతదేశమునకంతకును వర్తించెడి స్థానిక

1. Local Govt. By W. B. Rogers.

పరిపాలనా శాసనము గావింపబడినది. ఇటుపిమ్మట రాష్ట్ర ప్రభుత్వములుగూడ పురపాలక సంఘశాసనములను గావించినవి. ఈ శాసనములకు పిమ్మటనే హిందూదేశమునందంతటను, పురపాలకసంఘములు పలుపట్టణములలో ప్రారంభింపబడినవి. 1840–1861 సంవత్సరములమధ్య గావింపబడిన స్థానిక పరిపాలనా శాసనముననుసరించి పురపాలక సంఘము లేర్పాటు బడినవి. బ్రిటీలయందుండె పౌరులకే పురపాలకసంఘముల నేర్పరుచుకొను స్వాతంత్ర్యము మొదట నొసంగబడినది. ఈ స్వాతంత్ర్యమును పౌరులుపినియోగించుకొనియుండలేదు. రాష్ట్రప్రభుత్వములే యందువల్ల పిమ్మట బాధ్యత వహించినవి.

1 మెయోప్రభువు తీర్మానము— అయినను 1870 లో మెయోప్రభువుగావించిన రాష్ట్రార్థిక నిర్ణయతీర్మానమునకు ముందు స్థానికపరిపాలన మభివృద్ధి గాంచియుండలేదు. "విద్య—పరిశుభ్రత, వైద్యసహాయము, ధర్మము స్థానికమగు కట్టడము లభివృద్ధిబొందుటకు స్థానీయముగ ప్రజలలో నధినివేశమును వారిపరిశీలనయు నవసరము. ఈ తీర్మానము సంపూర్ణముగా నాచరణయందుంచబడుచో స్థానికపరిపాలన మభివృద్ధి యగుటకు సావకాశములేర్పడగలవు. ఆంగ్లేయులకు భారతీయులకును పరస్పర సంపర్కము పరిపాలనయందు హెచ్చుగ నభివృద్ధిచేయుటకును పురపాలక సంఘములను బలవత్తర మొనరించుటకును సదుపాయములు గలుగును. ఇది మెయోప్రభువు సంకల్పము. ఈ తీర్మానమునందే స్థానిక పరిపాలన మభివృద్ధిజెందుటకై యెన్నిక పద్ధతిగూడ సూచింపబడినది. ఈ తీర్మానముననుసరించి రాష్ట్రప్రభుత్వములచే పురపాలక సంఘశాసనములు గావింపబడినవి. ఈ శాసనముననుసరించి యెన్నికల పద్ధతిగూడ నాచరణయందుంచబడినది. పట్టణములయందు పురపాలకసంఘము లేర్పరుపబడసాగినవి. కాని గ్రామముల కెట్టిసదుపాయములుగాని గావించుటకు వలయు స్థానిక ప్రభుత్వ విధాన ముద్భవింపలేదు.

కాని రిప్పన్‌ప్రభువు పరిపాలనమునందు 1882లో గావింపబడిన స్థానిక పరిపాలనా తీర్మానము ననుసరించి స్థానికపరిపాలన మభివృద్ధి గాంచసాగినది. స్థానికపరిపాలనా సిద్ధాంతము విస్తరింపజేయవలెనని యాయన నిశ్చయించి

2 రిప్పను ప్రభువు పరిపాలనము—నభివృద్ధి 1882

నాడు. స్థానికపరిపాలనయే రాజకీయ విద్యానిలయ మని రిప్పనుప్రభువు విశ్వాసము. గ్రామసముదాయముల కన్నింటికిని యుపయోగించునటుల స్థానిక పరిపాలన మొక వలవలె నల్లవలెనని రిప్పనుప్రభువుగారి తీర్మానము నిరూపించినది. స్థానిక సంస్థలలో నుద్యోగస్థుల సంఖ్య మూడవ వంతున కంటె మించియుండరాదని నిర్ణయించినది. స్థానిక సంస్థలలో ప్రభుత్వపువలుకుబడి హెచ్చుగానుంచి వాటిపై పెత్తనము వహించుటకంటె, పైనుండియే పెత్తనము వహింపవలెనని తలంపబడినది. చాలవఱకు నార్థికస్వాతంత్ర్య మొసంగుటకుగూడ నిశ్చయింపబడినది. వీలయిన తావులయందెల్ల నెన్నికలమూలమున స్థానికసంస్థల నేర్పఱచవలయునని నిరూపింపబడినది. ఈ తీర్మానము ననుసరించి 1883—1885 సంవత్సరములమధ్య రాష్ట్రప్రభుత్వములు స్థానికపరిపాలనా శాసనముల ననుసరించినవి. ఈ శాసనముల ననుసరించియే జిల్లాబోర్డులు నిర్మింపబడినవి. పురపాలక సంఘములకు చైర్మనుల నెన్నుకొనుటకుగూడ, నధికారమొసంగబడవలెనని సూచింపబడినది. రిప్పనుప్రభువుగారి తీర్మానముననుసరించి గ్రామములకుగూడ స్థానికపరిపాలనా సిద్ధాంతము వర్తింపజేయబడినది. కాని యభివృద్ధి త్వరితగతిని జెందలేదు.

3 ఎలిగినుప్రభువు.

1896 లో తిరిగి ఎలిగినుప్రభువు పరిపాలనమునందు స్థానిక పరిపాలనవిధానము రెండుతీర్మానములతో విమర్శింపబడినది. పురపాలకసంఘముల పరిపాలనము సంతృప్తికరముగ నున్నటుల యీతీర్మానములయం దంగీకరింపబడినది.

4 హార్డింజిప్రభువు. 1915

సం॥ 1915 లో హార్డింజిప్రభువు పరిపాలనమునందు, మరల స్థానిక పరిపాలనము తీర్మానరూపముగ విమర్శింపబడినది. పౌరవిద్యాభివృద్ధికి పురపాలకసంఘములు గలచోట పౌరసత్వపు విధులను గమనింపజేయుటకును, స్థానికపరిపాలనము వినియోగపడినట్లును తీర్మానింపబడినది. మొత్తముమీద నన్నిరాష్ట్రములలోను విజయవంతముగ పనిజేసినట్లుగ యంగీకరింపబడి యుండెను.

5 చెలమ్సుఫర్డుప్రభువు. 1916

పిమ్మట చెలమ్సుఫర్డుప్రభువు పరిపాలనమునందు తిరిగి స్థానికపరిపాలన మభివృద్ధిమార్గము లన్వేషింపబడినవి. ఉద్యోగస్థుల పెత్తనమునుండి తప్పించుటకును, యెన్నిక సిద్ధాంతమును పెంపొందించుటకును, నెక్కువమందికి వోటుల నొసంగుటకును, నార్థికాధికారమును నితరాధికారమును వృద్ధిజేయుటకును చెలమ్సుఫర్డుప్రభువు ప్రభుత్వము కొన్నిసూచనలను గావించి యుండెను. కాని యీసూచన లసంతృప్తికరములని మాంటేగూ నివేదికయే వ్రాసినది.

6 అసంతృప్తికరాభివృద్ధి

రిప్పను ప్రభువు సూచనల ననుసరించి స్థాపింపబడిన స్థానిక పరిపాలనము 1920 సంవత్సరము వఱకునుగూడ, నసంతృప్తికరముగనే యభివృద్ధి జెందినదని, సైమను సంఘము వారు వ్రాసిరి. దాని ననుసరించి 1935 సంవత్సరపు రాజ్యాంగ శాసన మమలులోనికి వచ్చువఱకును స్థానికపరిపాలన మసంతృప్తికరముగనేయున్నదని తలంపక తప్పదు.1

23 మాంటేగు సంస్కరణములు స్థానికపరిపాలనము.

మాంటేగు నివేదిక స్థానిక పరిపాలనమును గురించి విపులముగ విమర్శించినది. సక్రమమగు పౌరసత్వపు సిద్ధాంతముల ననుసరించియే బాధ్యతాయుత ప్రభుత్వ మభివృద్ధి పొందగలదనియు నిందులకు తెలివిగల వోటరులు స్థానికపరిపాలనయం దనుభవముసంపాదించినవా రుండుట ముఖ్యమనియు మాంటేగు నివేదిక విశ్వసించినది. ఇందువల్ల భారతీయ రాజ్యాంగాభివృద్ధికి మూలసూత్రముగ స్థానిక పరిపాలన మభివృద్ధిజెందుటయే కర్తవ్యమనియు నిరూపించిరి. స్థానిక పరిపాలనకు వోటరుల నధికసంఖ్యాకముగ నొనరింపవలయుననియు, ప్రజాప్రతినిధులకే సంపూర్ణమగు పెత్తన మొసంగబడవలయుననియు, పైవారిపెత్తనమునుండి, తొలగింపబడ వలయుననియు మాంటేగూ నివేదిక నివేదించినది. ఈనివేదిక ననుసరించి 1918 లో హిందూదేశప్రభుత్వము, స్థానికపరిపాలనమును గుఱించి తీర్మానించినది. ఈ తీర్మా

1. Simon Commission Report vol. 1 P. 301.

నము ననుసరించినదే, ప్రజాప్రతినిధులకు స్థానికసంస్థలలో, సంపూర్ణస్వాతంత్ర్య మొసంగబడవలెనని నిరూపింపబడినది. ఎన్నిక సభ్యులే యన్ని బోర్డులలోను నధిక సంఖ్యాకులుగ నుండవలయుననియు మునిసిపలు సంఘములకు చైర్మను నెన్నుకొనుట కధికార మొసంగ బడవలయుననియు, జిల్లాబోర్డులకు వోటుఅర్హత తగ్గించి వోటరులను హెచ్చింప వలయుననియు, నల్పసంఖ్యాకుల ప్రతినిధులను నియమించు చుండవలయుననియు నీ తీర్మానము సూచించినది. సలహానొసంగు టకు ప్రత్యేకానుభవము గలిగినవారల, వోటుహక్కు లేకుండగ నియమింపబడ వలయుననిగూడ సూచింపబడినది.

మాంటేగ్యూ సంస్కరణముల ననుసరించి, స్థానికపరిపాలనము ప్రజాయత్త దేశములలో నొకటి. అందువల్ల మంత్రుల పరిపాలనమునందున్నది. శాసన సభలు ప్రతి రాష్ట్రమునందునను స్థానికపరిపాలనా శాసనములను గావించినవి. ఈ శాసనముల ననుసరించి వోటరులసంఖ్య హెచ్చినది. ప్రజాప్రతినిధులసంఖ్య పెరిగినది. స్థానికపరిపాలనపై సంపూర్ణముగ, స్థానికపరిపాలన సంఘముల కే యధికారము నొసంగబడినది. అయితే యీ స్థానికపరిపాలన సంఘము లన్ని రాష్ట్రములలోను నొకేవిధముగ లేవు. అయినను నన్నింటి మూలసూత్రమును ప్రజాపరిపాలనమే.

24 ప్రస్తుత స్థానిక పరిపాలనా నిర్మాణము.

పట్టణములలో పురపాలకసంఘములే స్థానికప్రభుత్వములు. గ్రామములకు యూనియనుబోర్డు స్వపరిపాలనాసంఘమని జెప్పవచ్చును. కలకత్తా, మదరాసు, బొంబాయి కార్పొరేషనులు ప్రత్యేకశాసనముల ననుసరించి స్థాపింపబడి పరిపాలింపబడుచున్నవి. కార్పొరేషను సభ్యులసంఖ్య యీమూడునగరములలోను సరిసమానముగ లేదు. బొంబాయియందు 106 మంది సభ్యులుగలరు. మదరాసునందు 61 మంది మాత్రమే యున్నారు. ఈ కార్పొరేషనులు ప్రజాప్రతినిధిసంస్థలే యనదగినంతటి వోటరులసంఖ్యను గలిగి యున్నవి. కలకత్తా కార్పొరేషనుకు మేయరును ఎన్నుకొను నధికారము గలదు. ప్రధానకార్య నిర్వాహకోద్యోగినిగూడ నెన్నుకొనుటకు కలకత్తా కార్పొరేషనున

కధికారము గలదు. (Chief Executive Officer). మదరాసునందు మేయ రెన్నుకొనబడునుగాని, కమీషనరు ప్రభుత్వమువారిచే నియమింపబడుచున్నాడు. యీకమీషనరుకే పరిపాలనయందు కార్యనిర్వహణాధికారము సంపూర్ణముగ గలదు. ఈ స్థానికప్రభుత్వ సంస్థలకు, స్వపరిపాలనాధికారము గలదనవచ్చును. కాని యుద్యోగస్థుల నియమించుటయందును కంట్రాక్టుల నొసగుటయందును ఋణములను గానించుటయందును సంపూర్ణ స్వాతంత్ర్యము లేదు. రాష్ట్రప్రభుత్వమువారి పెత్తన మీవిషయములలో పూర్తిగాగలదు. ఇందువల్ల రాష్ట్ర ప్రభుత్వపు పెత్తనమునకు లోబడియే నామమాత్రాధికారముతోనే యున్న వనదగును.

25 ఇతర పురపాలక సంఘములు.

ఈ మూడు కార్పొరేషనులునుగాక హిందూదేశమునందు 778 పురపాలక సంఘములుగలవు. ఇందు 180 లక్షల మందిప్రజలు నివసించుచున్నారు. మాంటేగు సంస్కరణల నాటినుండియు వోటరులసంఖ్య పెరిగినది. సుమారు 100 కి 15 మంది బస్తీలలో వోటరులైయున్నారు. సగమువంతుసకంటె హెచ్చు మంది పురపాలకసంఘ సభ్యులుమాత్రమే చాల పురపాలకసంఘములలో గలరు. ప్రజాప్రతినిధిసంఖ్య హెచ్చుటకై ప్రయత్నింపబడుచున్నది. ఈ పురపాలక సంఘములు విద్య, ప్రజారోగ్యము, పరిశుభ్రత, వైద్యసహాయము, కట్టడములు, రోడ్లు, వంతెనలు మొదలగుపనులను నిర్వహించుచున్నవి. ఈ సంఘములు స్వపరిపాలన సంఘములని పేర్కొనబడుచున్నవి గాని, నిశ్చయముగ స్వపరిపాలన మీసంఘముల కెంతమాత్రములేదు. రాష్ట్రప్రభుత్వము లీసంఘములను రద్దుపఱచుటకును తాత్కాలికముగ కొంతకాలము రద్దుపఱచుటకును నధికారము గలిగియున్నవి.

26 పురపాలక సంఘముల ఆర్థిక విధానము.

ఈ పురపాలక సంఘములకు పన్నులను విధించుట కధికారముగలదు. సరకుల నమ్ముటపైనను — సంతర్వ్యాపారముమీదను, నాదాయముపైనను, నాస్థి, వృత్తి, బండ్లు, వేడుకలు, వినోదములు మొదలగువాటిపైనను, పురపాలకసంఘపు సరిహద్దులలోనుండువారిపై పన్నుల విధించుట కధికారమును

గలిగియున్నవి. ఇందుపైన రాష్ట్రప్రభుత్వము లధికారములు చలాయింపగలవు. ఈవిధమగు పన్నులవల్ల సుమారన్ని పురపాలకసంఘములకును గలిసి 14.03 కోట్లాదాయము వచ్చుచున్నది. ఇందుచాలభాగము పరిశుభ్రతకును, కట్టడములకును వినియోగింపబడుచున్నది.

27 జిల్లా బోర్డులు. పట్టణములలో పురపాలకసంఘము లొనరించు పనులనే గ్రామములవెంట జిల్లా, తాలూకా, యూనియనుబోర్డు లొనరించుచున్నవి. సీమయందలి కౌంటీకౌన్సిల్సువలె మన జిల్లాబోర్డులేర్పరుపబడినవి. ఒక్కొక్కజిల్లాకొక్కొక్కజిల్లాబోర్డుచొప్పున సగటున గలదు. మాంటేగు సంస్కరణలకు పిమ్మట జిల్లాబోర్డుల వోటరులసంఖ్య పెరిగినది. హిందూదేశమున 207 జిల్లాబోర్డులున్నవి. 584 డివిజనులు లేక తాలూకాబోర్డులున్నవి. ఇవిగాక మదరాసు రాజధానియందు 485 పంచాయితీ యూనియనులుగలవు. ఈ జిల్లాబోర్డులలో 100 కి 96 మంది భారతీయులున్నారు. ప్రజాప్రతినిధులసంఖ్య హెచ్చించుటయే నేటి సిద్ధాంతము. నియమితసభ్యులసంఖ్య తగ్గింపబడుచున్నది. బొంబాయిరాష్ట్రమునను, సంయుక్తరాష్ట్రమునను మహమ్మదీయులకు ప్రత్యేకనియోజక వర్గములున్నవి. ఇతరరాష్ట్రములలో నల్పసంఖ్యాకులకు ప్రాతినిధ్యము లభించురీతిని, రాష్ట్రప్రభుత్వములే యల్పసంఖ్యాకుల సంఘములవారిని నియమించుచున్నారు. పురపాలకసంఘములపై నెట్టిపెత్తనమును రాష్ట్రప్రభుత్వములు వహించుచున్నవో యట్టిపెత్తనమునే జిల్లాబోర్డులపై గూడ రాష్ట్రప్రభుత్వములు వహించుచున్నవి. సెస్సులు జిల్లాబోర్డులకు ముఖ్యాదాయము. ప్రాథమికవిద్యకై యాదాయము విశేషముగ వ్యయపరుపబడుచున్నది. జిల్లాబోర్డులక్రింద పనిజేయుడివిజనులు లేక తాలూకాబోర్డుల పేర్లును నధికారములును నంగనిర్మాణమునుగూడ యన్నిరాష్ట్రములయందున నొకరీతిగలేవు. అయినను నన్నిరాష్ట్రములయందు ప్రజాప్రతినిధులసంఖ్యయే హెచ్చుగనున్నది. ఇవికూడ జిల్లాబోర్డులవంటి యధికారములనే గలిగియున్నవి. కొన్నిరాష్ట్రముల యందు డివిజనులు లేక తాలూకాబోర్డులనుండియే జిల్లాబోర్డునకు సభ్యులనెన్నుకొనుచున్నారు.

28 మదరాసు రాజధాని స్థానిక పరిపాలనము

మదరాసు రాజధానియందు 1920 వ సంవత్సరమున గావింపబడిన స్థానికపరిపాలనా శాసనముతోపాటు యేడే ద్వంద్వ పరిపాలనావిధానముగూడ, రాష్ట్రప్రభుత్వమునం దమలులోనికి వచ్చినది. ఈ నూతనరాజ్యాంగ విధానమున, ప్రజాప్రతినిధులగు శాసనసభ్యులు కొందరు మంత్రివర్గమువారి పక్షముగను, నితరులు మంత్రివర్గ వ్యతిరేకపక్షముగను నిట్లు వారి వారి రాజకీయ కార్యక్రమముల ననుసరించి రెండు పక్షములుగ నేర్పడుచున్నారు. ఇందువల్ల శాసనసభయందుగల రాజకీయపక్షములకును స్థానికసంస్థలయందుగల సభ్యులకును విశేషసంబంధము సంభవించినది. జిల్లాబోర్డు ప్రశిడెంటునకు జిల్లాయందు చాలా పలుకుబడి యుండుట సహజము. ఈ పలుకుబడిని వినియోగించుకొని యాజిల్లానుండి శాసనసభకు ప్రతినిధిగ వెడలుట సులభసాధ్యము.1 జిల్లాబోర్డుల సభ్యులు చాలామంది రాష్ట్రశాసన సభ్యులైరి. ఈ సభ్యులపైన చాలవఱకు, మంత్రులు కాగోరువా రాధారపడియుండిరి. అయినపిమ్మట వారి మంత్రిపదవులు నిలిచియుండుటయు వీరిపైననే యాధారపడియున్నది. ఈకారణమున మంత్రులు కాగోరువారును నయినవారును వారివారి పక్షములలో చాలమంది జిల్లాబోర్డుసభ్యుల నుంచుకొనుటకై ప్రయత్నింపసాగిరి. ఇందులకై స్థానికపరిపాలనాశాసనమునందు రాష్ట్రప్రభుత్వములకు కొంతమంది యల్పసంఖ్యాకుల సంఘుసభ్యులను నియమించుటకుగల యధికారమును జిల్లాబోర్డధ్యక్షులను నియమించుటకుగల యధికారమును మంత్రులు వినియోగించుకొన సిద్ధపడిరి. దీనివలన మంత్రులకును జిల్లాబోర్డు ప్రశిడెంటులకును మధ్య నొకవిధమగు, పరస్పరమైన బేరసారము లేర్పడినవి. శాసనసభ్యుడైన బోర్డుప్రశిడెంటు మంత్రులకు తోడ్పాటుగానుండుట లాభకరమని తలంపసాగినాడు. ఏలనగ, మరియొకమాఱు తననే జిల్లాబోర్డుప్రశిడెంటుగా మంత్రులు నియమించునట్లేర్పఱచుకొనుచున్నాడు. లేదా తనపక్షమువారినే సభ్యులుగ ప్రభుత్వము నియమించునట్లొనరించుకొనసాగినాడు. ఇందువల్ల, మంత్రులపక్షమందు భక్తితో మెలంగెడివారు బహూకరింపబడసాగిరి. 1920 సంవత్సరమునుండియు మంత్రులుగానున్నవారును వారిపక్షము

---

1. Minutes of dissent to L. B. Amending Bill 1929 advocating exclusion of D. B. Presidents from Legislative Councils.

వారును జిల్లాబోర్డులకు కొందరసభ్యులను నియమించుటకును, ప్రెశిడెంట్లను నియమించుటకును రాష్ట్రప్రభుత్వమునకుగల యధికారమును వదిల పఱచుకొనవలెనని సంకల్పించుకొనుటకును నిట్లునియమించుటకు ప్రభుత్వమునకుగల యధికారమును తొలగించి వేసినగాని లంచగొండితనమును, నధికార దుర్వినియోగమును తొలగిపోవని ప్రభుత్వవ్యతిరేక పక్షము వారు పట్టు పట్టుటకును నిదియేకారణము. 1 మంత్రులు తమకు పై వారిని నియమించుటకుగల యధికారమును, పలుమార్లు దుర్వినియోగ పఱచిరని నిందింపబడియుండిరి. 1920 సంవత్సరమునకు పిమ్మట ఈవిషయము బాగుగా దృఢమైనది. 1920 సంవత్సరపు స్థానిక పరిపాలనా శాసనమునందలి నియమించుటకుగల యధికార సిద్ధాంత తత్వమునకు వ్యతిరేకముగ నాచరింపబడినదని తలంపబడినది.........నియమించుటకుగల యధికారము, తాలూకాబోర్డులపట్ల సమిశముగ దుర్వినియోగ పరుపబడిన దనుట విస్పష్టము. జిల్లా బోర్డుప్రెశిడెంట్లు ప్రతితాలూకాబోర్డునకును కొంతమంది సభ్యులను నియమింపగలరు. ప్రతి తాలూకాబోర్డుప్రెశిడెంటును నుద్యోగరీత్యా, జిల్లాబోర్డు సభ్యుడు. ఇందువల్ల యీ తాలూకాబోర్డు ప్రెశిడెంట్ల సహాయము జిల్లాబోర్డు ప్రెశిడెంటుగారికి తన పరిపాలనకై యవసరము. వీరి సహకారమును బడయుటకై జిల్లాబోర్డు ప్రెశిడెంటు, తాలూకాబోర్డు ప్రెశిడెంటు పక్షమువారినే, తాలూకా బోర్డునకు నియమించుచుండెడివాడు. ఈ విధముగ కుట్రయు ప్రతికుట్రయు విజృంభింపసాగినవి. రాజకీయములన్నియు మేఘావృతమైపోయినవి. ప్రభుత్వ మందును గుఱించి, నియమావళిని వ్రాయుటకై తనకుగల యధికారము ననుసరించి యొక యుత్తరువును జారీచేయవలసివచ్చినది. ( G. O. No. 325 L and M dated 9th Sept. 1925 on nomination to Local Boards)

1
1930 సం॥
స్థానికపరిపాలనా
శాసనము.

ఈ పరిస్థితులయందు ప్రభుత్వమునకు నియమించుటకు గల యధికారము తొలగించి వేయబడవలెనను, ప్రజాభిప్రాయము బలవత్తరమైనది. అల్పసంఖ్యాకులకు, కొన్ని నియోజకవర్గములలో, నెన్నికలవల్ల నవసరమగుసంఖ్యా నిర్ణీత మొనరింపబడినది. అందువల్ల 1930 లో నియ

1. See Interpellations No. 169. 217 in M. L. C. P. 18th Feb. 1921 :- Interpellation No. 1137, 13th Dec. 1921.

మించుటకుగల యధికారము నెవరును ప్రతిఘటింపలేదు. సం. 1930 రమునకు పూర్వమే, మంత్రివర్గము కొన్ని జిల్లాబోర్డులకు ప్రెసిడెంట్లు నెన్నుకొను నధికార మొసంగ ప్రోత్సహింపబడెను. 1922-23 లో మదరాసురాష్ట్రమున రెండుజిల్లా బోర్డులకే యధ్యక్షుల నెన్నుకొను నధికారముగలదు. 1928-29 నాటికి 21 జిల్లాబోర్డులకీ యధికార మొసంగబడినది. మొత్తమీ రాష్ట్రమందలి జిల్లాబోర్డులు **25.** మొత్తపు 129 తాలూకా బోర్డులలోను, 123 బోర్డులకు 1928-29 సంవత్సరమునకు ప్రశిడెంటుల నెన్నుకొనునధికార మొసంగబడినది.(A.A.R. 1928-29) 1930 సంవత్సర శాసనము ననుసరించి స్థానికపరిపాలనా సంఘము లన్నింటికి సంపూర్ణముగ నెన్నికాధికారము లభించినది. అధ్యక్షులనుగూడ నెన్నుకొనుట కధికార మొసంగబడినది. ప్రశిడెంట్ల యందునను, వైసుప్రశిడెంట్లయందునను నవిశ్వాసమును ప్రకటించుటకు సావకాశ మేర్పరుపబడినది. 21 సంవత్సరము లకుపైగా వయస్సుగలిగి ఏవిధమగు పన్ను గట్టినను వోటునకందరును నర్హులుగా నొనరింపబడిరి. స్త్రీలకుగూడ నిషేధములేదు. భూస్వాములకు మాత్రమేకాక కవులుదార్లకుగూడ వోటుహక్కు సంక్రమింపజేయబడినది. జిల్లాబోర్డులకు తాలుకాబోర్డులతో నిమిత్తము లేకుండగ నెన్నికలేర్పాటు జేయబడినవి. ఈవిధముగ నాలుగేండ్లు నడిచినది.

2
1934 సం॥
శాసనము.

హఠాత్తుగ 1934 సంవత్సరమున తాలుకాబోర్డులు రద్దుగావింపబడుచు, స్థానికపరిపాలనాశాసనము సంస్కరింపబడినది. అవసరమునుబట్టి యొకేజిల్లాయందొకటికంటె మించిన జిల్లాబోర్డుల నేర్పరుచుటకును, నిట్టిక్రొత్తజిల్లా బోర్డులకు కొంతమందిసభ్యులను నియమించుటకును శాసనము సంస్కరింపబడినది. ఈ యధికారమును ప్రజాప్రతినిధు లధికసంఖ్యాకముగనున్న జిల్లాబోర్డులన్నియు తారుమారయి యల్పసంఖ్యాకములగునట్లుగ వినియోగించిరి. విభజనమైన పిమ్మట నియమింపబడిన సభ్యులతో మంత్రివర్గపక్షములు బలముచేయబడి యమిత క్లిష్టపరిస్థితులు గల్పింపబడినవి.

ఈ విధముగ గావింపబడిన, యధికార దుర్వినియోగమువల్ల సంభవించిన పరిస్థితులను చక్కబరచుటకే కాంగ్రెసుమంత్రివర్గము మరల స్థానికపరిపాలనా

శాసనమును సంస్కరింపవలసి వచ్చినది. ఈ సంస్కరణ శాసనమువల్ల నెవరిని గాని నియమించుటకు రాష్ట్రప్రభుత్వమున కెట్టి యధికారమునుగాని లేకుండ జేయబడినది. నియమితసభ్యులు రద్దుజేయబడిరి. వీరిస్థానమున కొందఱు సహకార మొనరించు సభ్యులను చేర్చుకొనుటకు బోర్డులకే యధికార మొసంగబడినది.'' ఇవి మామిడిపూడి వెంకట రంగయ్యగారి వాక్యములు. రాజకీయ వేత్తగాక యేరాజకీయ పక్షమునకుజెందని వీరి విషయ నిరూపణమంతయు నిర్వివాదాంశము.1 ఈ సంస్కరణ శాసనము ననుసరించియే విభజన బోర్డులను రద్దుజేయుటకును, జిల్లాయొక్కంటికి నొక్కొక్కజిల్లాబోర్డును స్థాపించుటకును ప్రభుత్వమువా రధికారమును సంక్రమింపజేసికొనిరి. క్రమక్రమముగ, విభజనబోర్డులు రద్దుచేయబడుచున్నవి. నూతన జిల్లాబోర్డు యెన్నికలలో వోటరుల సంఖ్య గూడ కాంగ్రెసు ప్రభుత్వము హెచ్చించినది. శాసనసభకుగల వోటరులందరు స్థానికసంస్థల వోటరులుగా నొనరింపబడిరి.

**3 పంచాయితీబోర్డులు**

గ్రామ పంచాయితీబోర్డు లేక యూనియనుబోర్డు. ఇదిగ్రామ జీవనమును పునరుద్ధరించవలెనను సంకల్పముతో స్థానిక పరిపాలనమునకు ప్రాతిపతికముగ నెలకొల్పబడిన సంస్థ. హిందూదేశ జనసంఖ్య విస్తారము గ్రామములలో నివసించుచున్నారు. పౌర జీవనవిధానము జనబాహుళ్యమున కంతకును నలవరచవలెనన్న గ్రామపంచాయితీలు సజీవ మొనరింపదగును. అధికార పూరితములుగ నొనరింపదగును. ఈ సంస్థలు స్వాతంత్ర్య సంస్థలుగనుండుటకు కొన్ని శాసనములు గావింపబడినవిగాని, యివి యన్నియు విఫలములైనవి. యూనియనుబోర్డొక పెద్దగ్రామము మీద లేక కొన్నిచిన్నగ్రామముల సముదాయము మీదను నధికారమును కలిగి యున్నది. నీటిసదుపాయము పరిశుభ్రత గ్రామమున గమనించుటయే యూనియనుబోర్డుయొక్క ముఖ్యకర్తవ్యము. రోడ్లమీదను, పాఠశాలలమీదను గూడ వీటికధికార మొసంగబడినది. గ్రామ పంచాయితీలకు చిన్నచిన్న విషయములలో సివిలుక్రిమిన లధికారములు గూడ నొసంగబడినవి. ఈ పంచాయితీల

---

1. See. The Development of Local Boards in Madras Presidency P. 62 - 69.

సభ్యులెన్నుకొన బడుచున్నారు. మైనారిటీలైన వారందఱకును గ్రామము లలో వోటుచేయునధికార మొసంగబడినది. అయినను యీ సంస్థలు గ్రామాభి వృద్ధికిని నైకమత్యమునకును వినియోగించుటకు మారుగ గ్రామములలో కక్షలను శేకత్తించి, గ్రామ జీవనమును దుర్భర మొనరించుటకే తోడ్పడుచున్నవని వ్రాయవలసి వచ్చుట విచారకరము. ఇందులకు తోడుగ, కులతత్వము గ్రామ పంచాయితీల యెన్నికలు మొదలు శాసనసభల యెన్నికలవఱకుగూడ ప్రకోపింప జేయబడుచున్నది. స్థానికపరిపాలన మవినీతికి, నసమర్థతకు, కులతత్వములకు పుట్టినిల్లగుచున్నది. ఇందులకు జాతీయవాదులు 1920 సంవత్సరమున శాసన సభలను బహిష్కరించుటయే కారణమనుట నిశ్చయము. నాటనుండియు మహా వృక్షముగ పెఱిగి శాఖోపశాఖలై, ప్రతికులమునందునను చొచ్చిన యీకుల తత్వమును జాతీయసంస్థయగు కాంగ్రెసు మహాజనసభ ప్రతిఘటింపజాలక పోవు చున్నది. ప్రతిఘటించుటకు మారుగ మదరాసురాష్ట్రమున జీర్ణమొనరించు కొనుటకై యత్నించుచున్నది. ఈ యత్నమున, కాంగ్రెసు సంస్థయందుగూడ కులతత్వపురంగులు విస్పష్టముగ గోచరించుట యందాశ్చర్యములేదు. ఈ క్లిష్టపరిస్థితులలో కులతత్వమును కాంగ్రెసు జీర్ణముజేసికొనగలదో? లేక కుల తత్వమే కాంగ్రెసును జీర్ణముచేసికొన గలదో?

1920 సంవత్సరమునుండియు జాతీయవాదులే నేటివలె స్థానికసంస్థలను వశపఱచుకొని పరిపాలింపసాగియున్నచో, నేటిపరిస్థితు లెట్లుండెడివో! కాని యిందులకు మదరాసుప్రభుత్వముకూడ ప్రతిఘటించినది. నాడు కాంగ్రెసు వాదులు రాజభక్తిప్రమాణమును దీసికొనుట యంతరాత్మకు వ్యతిరేకమని విశ్వసింపసాగిరి. రాజకీయములయందు చొప్పింపబడిన యీ మతవిశ్వాసము నండగగొని, మదరాసుప్రభుత్వము స్థానికసంస్థలలోగూడ సభ్యులు రాజభక్తి ప్రమాణమును దీసికొనవలెనను శాసనముగావించినది. "కొంతకాలము కొన్ని ప్రదేశములలో నతివాదరాజకీయములను ప్రవేశపెట్టవలయుననెడి సూచనలు గోచరించినవి. ఈ సూచనలను మంత్రివర్గము విజయవంతముగ ప్రతిఘటించినది. ఇందువల్ల నేడాపరిస్థితులు లేవు.......(P.35)"స్థానికసంస్థలలో నతివాదరాజకీయ వేత్తలగు నసహాయవాదులను చేరకుండ నిరోధించుటకుగాను వీరు రాజభక్తి

రాజమహేంద్రవరము, సరస్వతీ పవర్ ప్రెస్ నందు శ్రీ అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయుడు గారిచే ముద్రింపబడి ఆంధ్రా యూనివర్సిటీ రిజిస్ట్రారు శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి నాయుడు గారిచే వాల్తేరునందు ప్రకటింపబడినది. [1948]

